శ్రీ

# రాణాప్రతాపసింహచరిత్ర.

(ఐతిహాసిక ప్రబంధము.)





ప్రొద్దుటూరు
శ్రీ జానకీ ముద్రాక్షరశాలయందు ముద్రితము.
1934 ప్రథమ ముద్రణము 500 ప్రతులు.
1935 ద్వితీయ ముద్రణము 1000 ప్రతులు.



శ్రీ

# విజ్ఞప్తి.

—❀—

లెఫ్టనెంటు కర్నల్ జేమ్సు టాడ్డుదొర (Lieutenant-Colonel-James-Tod) రాజస్థానదేశచరిత్రము (Annals and Antiquities of Rajasthan) చదివి నప్పటినుండియు నాగ్రంథమునెడ నా కతిశయ గౌరవము గలిగెను. ఆ యితిహాసరంగమున నర్తించిన పాత్రములలో "మహారాణా-ప్రతాపసింహుఁడు" పూర్వాభిగణ్యుఁడు. స్వాతంత్ర్య శబ్దమునకు మున్నెన్నఁడునులేని రసార్థసంపత్తిఁ గూర్చిన 'విశ్వవీరచూడామణి.' భగీరథ ప్రతీకాశ కార్యదీక్షా ధురంధరుఁడు. చిన్నరాజ్యమున కధీశ్వరుఁడయినను మాతృదేశభక్తి పరత్వముపెంపున నీ రాజర్షి పుంగవుఁడు 55లక్షలు పాదాతిబలము, 15 లక్ష లాశ్వికదళము, 10 వేలు వారణములు, 10 వేలు పిరంగులు గలిగి ప్రపంచోన్నత ప్రబలసార్వభౌముఁడయిన యక్బరుపాదుషాతో నిరువదియైదు వత్సరములు మహాసంగ్రామము నడిపి స్వాతంత్ర్యము నిలుపుకొని ధర్మవీర శిరోమణియని కీర్తి మోసెను.

నిజమార్తికసితాతపత్రచ్ఛాయల సమగ్రదక్షిణాపథ రాజ్యము లన్నింటికిఁ జలువఁ గూర్చి దశదిశల ధవళకీర్తిచంద్రికలు నెఱపి శ్రీకృష్ణదేవరాయలు యశఃకాయుఁడైన పిదప నతని యనంతరమువారి పరిపాలనమున రాజ్యము చెదరి, పాయలై, చెడి, దేశమాతయు ననంత నిరంతర సంగరములలో మునింగిన కాలమగుట "రాణాప్రతాపసింహుని" వీరవిక్రమ విహారకథనములు దక్షిణభారతమున వ్యాపింప నవకాశము తక్కువ యయ్యెను. ఆకారణమున నితనిపేరు దక్షిణాపథమున నేపదిమందియైన నెఱింగియుందురో లేదోయని సందేహముండెడిది. ఉత్తరభారతదేశమునమాత్ర మా మహావీరుని దివ్యనామముఁ గీర్తించి పులకితశరీరులుగానివారు లేరు.

పూజ్యులగు పూర్వమహాకవులు పలుమాఱు వ్రాసిన పురాణాంశములఁ గుఱించి కాని, కల్పితకథలను గొనికాని ప్రబంధములు రచించుట తొలుతటినుండియు నాకు రుచించినదిగాదు. అతిశయోక్తులకుఁబోక జరిగినది జరిగినట్టులు వ్రాసిపెట్టిన సత్యమగు దేశచరిత్రములు ప్రజాప్రబోధకప్రబలసాధనములని నావిశ్వాసము. కావున నింతకుముందు ఘూర్జర దేశచరిత్రమందలి "వీరమతీదేవి చరిత్రము" మేవాడ్ దేశ చరిత్రమునందలి "చండనృపాల చరిత్రము" పద్యగ్రంథములుగ విరచించితిని. ఎన్నివిధములనయినను యత్నించి లోకోత్తర వీరవ్రతుండగు "ప్రతాపసింహుని" దివ్యచరిత్రముఁగూడఁ గావ్యముగ రచించి యాంధ్రభాషాయోషామణి మృదుపదార విందములచెంత సమర్పించుకొని కృతకృత్యుఁడఁ గావలె

నని నాకుఁ గొండంత కోరిక గలిగినది. ఆ విశ్వవీరుని నామధేయము కనఁబడిన గ్రం నెల్లఁ దెప్పించుకొని పఠించితిని. భాగ్యవశమున ననేకామూల్యాంశములు గడింపఁగ వత్సరములకొలఁది నామహాభాగుని గుణగణము లూహించి, భావించి, ధ్యానించి, యుఁడ నగుచుంటిని.

ఇతివృత్తము సంపూర్ణముగఁ జరిత్రాత్మకము. రంగము పవిత్రమయిన ర వర్తక్షేత్రరాజము. ప్రధాననాయకుఁ డుత్తమోత్తమ భారతీయ శిరోమణి. అయిన హిందూస్థానమండలి (అహమ్మదాబాదు – అసహుల్ వారా – ఝసల్ మియర్ ఘుర్) మున్నగు పురముల నామములును, (డోంగరీశుఁడు – సోనెగుఱ్ఱమహీంద్ర మహమ్మజ్జలాలుద్దీనక్బరు – ఖాన్ ఖానన్ – హాకీంహుమాం – మీర్జా అబ్దూరహి లోనగు పురుషుల నామధేయములును, (మండలగృహము - అంతల్లా - కుంభల్ మి చేవందా - చానార్ దుర్గము - తారాఘుర్ - రణస్తంభపురదుర్గము) మొదలగు పేళ్లును శ్రుతికటువులై దీర్ఘములై ఛందోగణములలో సులభముగ నిముడనివై య వాటియు నిది 25 సంవత్సరము లవిచ్ఛిన్నముగ సాఁగిన మహాసంగ్రామము. సాధ శర-చాపములుగావు. తుపాకులు-శతఘ్నులు. మాతృకలోఁ బదునాలుగుపుటలున్న పసింహరాజచంద్రుని చరిత్ర మొక్క-కళ తక్కు-వగ వెలుఁగుచున్నది. రాజస్థానదే మనేకరాజ్యములను వీరయోధులను గుఱించి వ్రాయఁబడినది. కావునఁ బ్రతాపుఁ మును బ్రత్యేకముగను సమగ్రముగను బోషింప నవకాశము లేకపోయియుండుట స ఆ కొఱవడిన 'ఆధ్యాత్మికకళ'ను జేర్చి యీ రాజగురుమహాసార్వభౌముని పాత్ర వన్నె చేకూర్చి నిర్వచనకావ్యముగ వెలయింప నారంభించితిని.

1932 మార్చి నెలకు మూఁడాశ్వాసములు వ్రాయఁగలిగితిని. ఆరోగ్యము కడపఁ దాఁటి కదలఁజాలని దుర్బలస్థితి నుండి గ్రంథ మంతటితోఁ గడమువడిపోవ యని పలుమాఱు వగ నొందితిని. పదునెనిమిది మాసము లంతరాయమున కోర్చి నారంభించి యొకమాసమున గ్రంథముఁ బూర్తిచేసితిని. నా పరమమనోరథఫల స మగు ప్రతాపదేవుని దివ్యచరిత్రము నాద్యంతము రచించి నిర్వహింప ననుగ్రహించ మనఃపరితృప్తి గలుగఁజేసిన యీశ్వరుని కరుణామయత్వమును గొనియాడితిని.

ఈ గ్రంథమున కావిష్కరణమహోత్సవముఁ దీర్చిన మిత్రులు ప్రశంసాప ఆవిష్కరణసభ "కావ్యకళానిధి" బిరుదము నొసంగి నన్ను గారవించినందులకై టూరు హైస్కూలులో "కళానిధి"—బహుమానము శాశ్వతముగా నెలకొలిపి వు బహదూరు వి. వసంతరావుగారి యౌదార్యమును గణింతును.

1934 జనవరి మాసమున గ్రంథముప్రతులు నాయొద్దఁ జేరెను. నామెచ్చిన కవు లకును, బండితులకును, మిత్రులకును, బంపుకొంటిని. వారందఱు సంతోషించి నాయోగ్య తకు మించి నన్నుఁ గొనియాడిరి. వారికృతమును మఱవను. ఒక్కొకచోఁ బది-పదు నాఱు పుటలవఱకును వ్రాసిన యమూల్యాభిప్రాయములను సంగ్రహపఱచి ముద్రింపించి నందులకై వారు క్షమింతురని నమ్ముదును. నా గ్రంథమునెడ నపారాదరము నెఱపిన బ్రౌ॥ చిలుకూరు నారాయణరావుపంతులు ( M. A. P. H. D. ) గారి యుదార-మృదు-హృద యమును నేను ప్రత్యేకవిశ్వాసముతోఁ గొనియాడు చున్నాను. ప్రతాపమహారాణా గారి త్రివర్ణచిత్రపటము ప్రతు లొకసహస్రము నాకుఁ బంపి యుపకరించిన 'భారతీపత్రికా' సంపాదకులు శ్రీ. గన్నవరము సుబ్బరామయ్యగారి సాయము స్మరింతును. మైసూరు-మద్రాసు విశ్వవిద్యాలయములవారు గ్రంథమును వరుసగా "నింటర్‌మీడియెట్-బి. ఏ." పరీక్షలకుఁ బాఠ్యముగ నిర్ణయించి నన్నుఁ బ్రోత్సహించిరి.

చతుర్థాశ్వాసమున నొక్కయెడను బంచమాశ్వాసమున నొక్కతావునను గొన్ని పద్యములను జేర్చుటతప్ప నీముద్రణమున నాచేసిన మార్పొక్కండును లేదు. ఈ కావ్య మున లేశమేని గుణము గనఁబడునేని యిది యాంధ్రమహాజనులమన్ననకుఁ బాత్రమై శాశ్వతస్థాయి నలరారుఁ గాతమని పరమేశ్వరుని బ్రార్థించుచు నుపరమించు చున్నాను.

ఇట్లు,

ప్రొద్దుటూరు. }
1—9—35. }

'అవధాని పంచానన - కవిసింహ - కావ్యకళానిధి,'
డి. రాజశేఖరశతావధాని.

ఓం

# అభిప్రాయములు.

The book has duly been presented to His Highness, the "Maharana" Sahib Bahadur and I am desired to Convey to you His Highness's thanks for the same.

Yours faithfully,
TEJ-SIMHA,
Private Secretary.

Udaipur.
20—8—1934.

---

The poet has far excelled his original Todd. The central character, the hero of heroes is Rana Pratap. He is depicted as the truest Rajayogin. With no kingdom, no forts, no army, no shelter, no food, except edible grass, he raises the banner of freedom aloft, holds it high for twenty five years against Akber, the greatest emperor of the day, declining to whisper into the ears of Raja Man Singh one word of submission to the Mogul Padushah. His stern simplicity, his intrepid valour, his resolve to defy fate and worship at the shrine of liberty, his unyielding pride in his Solar descent, his patriotic attachment to the barren wilds of the Aravalli Hills, his chivalrous courtesy even unto the enemy are all so painted in words that the written word appears to transcend the best colouring effect on the convass. No sense of despair mars the effect of his marvellous courage. The series of his [Pratap's] valourous deeds constitute a reading that is rivalled in Telugu literature only by the deeds of Bhishma and Abhimanyu in Thikkana's Bharata.

The portraiture of the opposite camp is no less elevating. One can easily find modern parallels for Akbar and Man Singh. There does not however appear to be a parallel to "Abdur Rahiman" the chif minister of Akber. He is the noblest of the noble, the flower of Islam, the truest devotee of true Virtue...............The nationalistic outlook of the work is really a pleasure to ponder over..................

The poet's style is classic. It is what moderns in Telugu call "Grandhic." However the flow is so natural, the language is so idiomatic, the illustrations are so familiar, the expression is so homely and pithy that the most modern pedant would have very little quarrel with the poet for the style employed. In two cantos does the poet show his partiality for Sanskritic metre. The rest of the work abounds in the quick mellifluous cadence of the native metre.

Madras.
19—6—34.

"THE HINDU."

---

The production of this beautiful book marks an epoch in the modern Telugu literature. The author takes us back to those glorious days of India when Freedom's battles were fought in the great theatre of the Indo-Gangetic plain. It is highly Miltonic in conception and the reader's attention is sustained throughout by the rich mental imagery contained in verse after verse. There is a superb touch

of epic grandeur about the work and the intense heroism and love of country displayed by "Rana Pratap" are very well depicted; in short the reader is roused to a sense of hero-worship. The tense situation between the Hindu hero on one side and the Great Mogul on the other, is rendered highly melodramatic and the reader cannot go through this portion of the work without a thrill of enthusiasm. The whole work is classical in tone and the historical back-ground is so true and accurate that the author deserves immense congratulations for his great deligence and fidelity to details.

I have very great pleasure to commend this book for introduction in High Schools and Colleges.

Anantapur.
22—4—1934

Yours sincerely
GULAM DASTAGIR,
D. E. O. Cuddapah-Anantapur Dists.

---

I have read a portion of your work. As a matter of fact no opinion is needed for your beautiful poetry. As for as I read it is very interesting with beautiful thoughts and charming style.

Rajahmundry.
19—5—34

CHILAKAMARTI LAKSHMI NARASIMHAM.

---

The work is certainly on a par with our epic poems. You have kept up your word that your composition will be in "ద్రాక్షాపాకము."

Cokanada.
18—11—34

M. VEKATA RAMAIYA
Subordinate Judge.

---

A book of this kind is oppurtune at present. "Rana Pratap Singh," is sure to inspire the leaders and the rank and file to act like a phalanx in union, and sacrifice their lives, if necessary, for the cause of the country.

25—9—34

P. PARTHASARATHI IYENGAR,
Sub-Judge.

---

గీ॥ పక్వమగు తీయమామిడి ♦ పండుమాడ్కిఁ బదపదంబున రసముట్టి ♦ పడుచునుండ
బదియు నెనిమిది వందలు ♦ పద్యములను గావ్యముగ వ్రాసి కంటివ ♦ ఖండకీర్తి !

గీ॥ సరళముగను జల్లఁగను ర ♦ సంబుఁగురిసి తన్మయత్వముఁగూర్చి గ్రం ♦ థంబునఁ
బ్రజ్ఞనీసామ్మటంటి; నా ♦ పట్టులందుఁ దిక్కనకవీంద్రుఁ దలపించు ♦ దీప్తిఁగంటి !

గీ॥ ఉత్తమోత్తమ వీరుల ♦ కుండవలయు నుత్తమోత్తమ గుణముల ♦ కొజ్జబంతి
నిల్వుటద్దంబునై యొప్పు ♦ నీప్రతాపువీరచరితంబు "రెండవ ♦ భారతంబు" !

గీ॥ అన్న! నేటి మహాసభా ♦ ధ్యక్షుఁడనయి బారుతీరిన విబుధుల ♦ ప్రార్థనమ్మ
వఱలఁ "గావ్యకళానిధి" ♦ బిరుద మొసఁగు భాగ్యమునుగాంచి పరవశ ♦ త్వంబుఁగఁ

ప్రొద్దుటూరు. }
17—12—1933 }

జనమంచి శేషాద్రిశర్మ.
(ఆవిష్కరణ మహాసభాధ్యక్షులు.)

---

ఎచ్చట నేరసము చిలుకవలయునో అచ్చట నారసము గలదిమ్మై, నిర్దుష్ట
"రెండవభారత" మన్నంత యందచందములతో మీకవిత యున్నదని నాకుఁ దోఁచి
ఇది సూత్రప్రాయమైన నా ముఖ్యాభిప్రాయము.

కడియం. }

చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి
(తిరుపతి వెంకటేశ్వరులు)

---

నమస్కారములు. తాము సాదరముగ పంపిన "రాణాప్రతాపసింహ" చరిత్రము
కృతజ్ఞతతో స్వీకరించినాను. దాని నామూలాగ్రముగఁ జదివితి. చరిత్ర గ్రంథము
కావ్యముగ వ్రాసి రసవంతముగ నిర్వహించడము కష్టమైనపని. మీకథాకథనవిధాన మి
టి కద్వితీయమైనదని చెప్పిన అతిశయోక్తి అని తలంపరని నమ్ముచున్నాను. ఇంతటి
కావ్యాల నింతచక్కగ వ్రాయఁగల వా రింక నుండడము శుభావహము. మీకవితాధార
తనిసినాను. మీకు ధన్యవాదములు.

అనంతపురం. }
29-4-34 }

చిలుకూరు నారాయణరావు,
(ఎం. ఏ. పి. హెచ్. డి

---

క॥ చదివిన భారతమేకద చదువంగా వలెనటన్న ♦ సామెత వృథయై
పోదలఁ బ్రతాపచరిత్రము చదివినవారలకు నెందు ♦ సత్కవితిలకా!

చ॥ పలుకులఁ దేనె లుట్టిపడు! ♦ భావములందు స్వతంత్రదీప్తి శో
భిలు! వినువారి వీనులకు ♦ విందు లొసంగు కథావిధాన! మి
య్యిలఁ దులలేదు నీకవిత ♦ యెంతయుఁ దిక్కనభారతంబె! యోఁ
దలలఁ గదల్పఁజేయు విబు ♦ ధప్రకరంబున కంచుఁ జెల్పెదన్.

కావ్యపురాణతీర్థ, విద్వాన్,
జనమంచి వెంకటసుబ్రహ్మణ్యశర్మ,
ఆంధ్రోపాధ్యాయుఁడు.

కడప.
23—12—1933.

---

పరశ్శతప్రణామములు:

తమ రచన చాల గొప్పది. ఒకానొక కాలమున నేనును ప్రతాపరాణాచరిత్రమును పద్యకావ్యముగ వ్రాయ నుత్సాహపడి యుపక్రమించి యుండినవాఁడను. సుమారు 300 పద్యములు వ్రాసి నడుమంత్రమున వదలితిని. వ్రాఁత గ్రంథముగూడ నావద్ద లేక నశించినది. తమ గ్రంథముఁ జదువ మొదలిడఁగానే నా ప్రయత్నము నిరవశేషముగా నశించుట యెంతో మేలే యాయె ననిపించినది. ఇంత గొప్పగ్రంథమును ఒకటే ధారతో అందదుకులు తొడుకులు లేక రచించి ముగింపఁగల్గిన తమశక్తి సామర్థ్యముల కాశ్చర్యపడి యభినందించుచున్నాను. తమది ప్రబంధముల పక్వతతోఁగూడిన పురాణశయ్య. ఈ శైలిలో నిజముగాఁ దామొక పురాణమునే వ్రాసియుండిన నెట్లుండెడిదోయని యాశపడుచున్నాను. ఈస్థితిలో నీకావ్యము నింతరసవంతముగాఁ బఠనీయముగాఁ జేయశక్తులు చాలమంది లేరనుట నిస్సందేహమైన విషయము. ఎక్కువ విన్నవింపలేను. యథావకాశముగా గ్రంథమును బూర్తిగాఁ బఠింతును.

మైసూరు.
30-8-34

రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ.

---

శా॥ భావాభ్యున్నతి, దానికిన్ దగిన రూ ♦ పన్యాస మద్దానికిన్
లావణ్యంబిడు సుప్రసాదగుణలీ ♦ లల్ దానికిన్ సత్కళా
జీవంబౌ రసమాధురీమహిమముల్ ♦ సిద్ధించి నీకావ్య వి
ద్యావైశద్యము పండెనోయి! కవిసిం ♦ హా! నీకు బ్రహ్మాయువౌ.

శా॥ సమ్యగ్వాఙ్మయ పద్ధతిన్ నడచు భా ♦ షాయోషకున్ నీచపుం
గ్రామ్యంపుంబడి దాపరించె; విమల ♦ ప్రాచీకళాసూచక

స్వామ్యంబుల్ నశియించె! నిట్టియెడ దు ♦ స్సాహిత్యధూమ్యాకుల
భ్రామ్యజ్జాతికి నీప్రతాపకృతి దీ ♦ వ్యజ్జ్యోతియై ద్యోతిలున్!

చ॥ తఱచిన భారతంబొకఁడు ♦ తక్క నిజానకు వీరకావ్య మీ
వఱ కుదయింపలేదు మన ♦ వాఙ్మయమందొకఁడైన; జాతికిన్
బరువము మాతృదేశమున ♦ భక్తి మదిన్ బురికొల్పి నేఁటి కా
తఱుఁగు భవత్ప్రతాపచరి ♦ తంబునఁ దీఱినదోయి! మిత్రమా !

మ॥ పరమాభ్యున్నత భావపర్వత పత ♦ ద్వాగ్గుంభగంభీర ని
ర్ఝరవీచీ రసధారఁ గావ్యసరసిన్ ♦ సంధించి ఛందఃపరం
పరలన్ కాల్వలు జాలువార్చి తెలుగు ♦ న్మాగాణి జాతీయకా
వ్యరసారామము పెంచితోయి! కవిసిం ♦ హా! కావ్యపంచాననా!

సీ॥ అలచిత్రకారు రం ♦ గులమాటి రాణాప్రతాపసింహక్ష్మాపు ♦ రూపపటము
ననరాదుకాని; నీ ♦ యమృతాక్షరన్యాసమూర్తిముం దది వెల ♦ బొమ్మమాత్ర!
బ్రహ్మకల్పముదాఁక ♦ వన్నెమాయనియట్టు లాత్మయన్ కొలిమి వీ ♦ రాగ్ని బలిమిఁ
కవనంపుమూసలోఁ ♦ గఱఁగి మేల్సీసాన జాతీయతాముద్ర ♦ పోతపోసి

గీ॥ వీరరాణాప్రతాపరా ♦ డ్విగ్రహమును దెనుఁగుఁగోవెలఁ బ్రాణప్ర ♦ తిష్ఠ చేసి
నిలిపితివి! చేరి మనసారఁ ♦ గొలుచు నాంధ్రవీరసంతతివాంఛ లీ ♦ డేరుఁగాక.

కాళహస్తి.
4—9—34 కవితాకళానిధి: బలిజేపల్లి లక్ష్మీకాంతకవి.

---

ఆధునికులగు తెలుఁగు కవులకు దేశభక్తి—దేశాభిమానములు శూన్యములు. వారి గ్రంథములలో దేశప్రబోధకములగు రచనములు తక్కువ. చరిత్రాత్మకములు కడుంగడుఁ దక్కువ. చరిత్రాత్మకములై దేశభక్తి నుద్దీపింపఁజేయు పద్యకావ్యములు లేనే లేవు. వేలసంఖ్యను మించిన తెలుఁగుకవులలో దేశమును దలఁచుకొనువా రరుదు. భావకవుల కీ గొడవ పట్టనేలేదు.

ఈ సుకవి కవిత్వము రసవంతమైనది. శైలి మధురమైనది. ధార గంగాప్రవాహ వేగముగలది. పదముల పొందికయు భావగౌరవమును మిక్కిలి మెచ్చఁదగినవి. జాతీయములును లోకోక్తులును తమంత వచ్చి మూఁగి పడినట్లున్నవి. ప్రతిఘట్టమునను బ్రతి పద్యమునను గనిపించుగల దేశభక్తియు, శూరశిఖామణి యగు ప్రతాపసింహమహారాజసింహుని

యం దీ కవిసింహునకుఁగల భక్తి-గౌరవములు తొలుకాడు చున్నవి. ఎచ్చటఁ జదివినను జదువరుల హృదయములు కరఁగి నీరుగాక మానవు. ఎంతటి దేశద్రోహులైనను దేశభక్తులుగ మాఱక మానరు. ఇట్టి విశేషములు వివరముగఁ దెలుపఁబూనిన నిది యొక గ్రంథమంత యగును.

నిడుదవోలు.

మంగిపూడి వెంకటశర్మ.

---

గీ॥ మొగముముందఱ యిచ్చక ♦ మ్ములకు దిగక మనసులో మాట వల్కు—శే♦మంచిదేని
నామతంబున వీరరా ♦ ణాప్రతాపచరిత గమగమల్ పైఁ జిమ్ము ♦ జాజిపువ్వు!
కప్పురపుఁ బల్కు పొదిగిఁటఁ ♦ గవిసికొన్న వింతయేడాకులరఁటి బా ♦ లెంతరాలు!
కుదుపు టారపిళ్ళ సుడియక ♦ కుదురునడల నిండుకొని పాఱు నెలఁదోఁగ♦నీటికాల్వ!
చిదుమఁగారాని రసమొందుఁ ♦ జిందువాఱ గింజ లలమని కమ్మనా ♦ రింజపండు;
తీర్పు మార్పుల నంది పం ♦ దిరులఁబోక యనువుమై నల్లు నవకపు ♦ టడవిమల్లె!
చిఱునగవుఁదేలు చిటిపాప♦చిన్నిమోము! సిగ్గుఁదెఱనాడు ముగుద కు♦చ్చితపుఁజూపు!
నలఁతవోని కుచేలు ని ♦ ల్లాలిహృదయ! మొడలెఱుంగని వీరు క ♦ ట్టడి కటారు!
విరులు నవ్వు వసంత వా ♦ సరములందు: జలకమాడి చల్వలు గట్టి ♦ కలప మలఁది
ప్రొద్దుట 'షికారు' వెడలు మా♦రుతమువోలె నందుఁగాత మీకృతి జన♦స్వాగతమ్ము!

విద్వాన్ కవిసింహ అవధానిపంచానన,
గడియారము. వెంకట శేష శాస్త్రి,
తెలుఁగు పండితుఁడు. మునిసిపల్ హైస్కూల్,

ప్రొద్దుటూరు.
17—12—1933

---

గీ॥ కాలకుహరమ్మునన్ బిట్ట ♦ కతల ముచ్చమునిఁగి తనుఁగు ప్రతాపసిం ♦ హుని చరిత్ర
నీకలము యోగదండమై ♦ నీవచస్సు జీవనద మంత్రమై చిరం ♦ జీవిఁజేసె.
అమృతబీజాక్షరమ్ముల ♦ నామహాత్ముకతకుఁ బ్రాణమ్ము వోసిన ♦ కవివి! రాజ
శేఖరా! నీసమాఖ్య సు ♦ స్థిరతఁగాంచె! ధన్యతమమయ్యె నీకవి ♦ తా ప్రవణత!
తళుకు నగిషీలు లేక ము ♦ స్తాబు లేక, చికిలి చిత్తారి జిలుగు బ ♦ చ్చెనలు లేక,
మెఱుఁగు మఱుఁగులు, గులుకుల♦మురువు లేక, కసరతుల పల్లటీల్ లేక,♦గతి మలఁపక,
తాత-ముత్తాతనాఁటి ఛాం♦దసము లేక ప్రాత-క్రొత్తల నడిమిత్రో♦వల ఘటించి
వస్తువునకౌ పదార్థ సం ♦ పత్తిఁగూర్చి వ్రాయఁబడినది ప్రకృతిప్ర ♦ బంధ మిద్ది!
సానఁదీరిన మెఱుఁగు వ ♦ జ్రాలమాలఁబోలు: సారళ్యమున సీప ♦ దాలచాలు;

సహజధారకుఁ బొసఁగెఁ బ్ర ♦ సాదగుణము: భవ్యనవ్యానురూప దాం ♦ పత్యసరణి
నుఱుఁగుఁదరగలఁ బొర్లెత్తి ♦ తొరఁగు గాంగనిర్ఝరముగెల్వ సఱచు బం♦దెమ్మ! నీదు
భావవీచీసమాలోల ♦ వాక్స్రవంతి! ప్రస్తుతి కతిక్రమించె ధా ♦ రాప్రసక్తి!
వీరరస మేకధారగా ♦ వెడలఁగ్రాయు "హాల్దిఘాట్" మున్నుగా భీక ♦ రాహవ ప్రి
కరణములు విన్నఁ జదివిన ♦ నరుసిగుండె: నడికడలి నుప్పొంగు సుడి ♦ వడెడు పడవ
వడువు నొడి-దుడుకులఁబడి ♦ యడలవలయు.
ఆలు పిల్లలతోఁ బ్రితా ♦ పావనీశుఁ డడవులం బడ్డ యిడుమలఁ ♦ దడవు నపుడు
కంటఁ దడివెట్టవలె నెట్టి ♦ కటికమైన: ముదముఁ దెల్పితి నిటు మనః ♦ పూర్వకముగ

ఏలూరు. ముస్నంగి-లక్ష్మీనరసింహశర్మ.

---

సీ॥ ఈకాలమునఁ గవు ♦ లింతయుద్గ్రంథమ్ము పూని రచించుటం ♦ తైన గొప్ప!
ఇంత గ్రంథములోన ♦ నెచటనైన రసంబు చిప్పిలుచుండుట ♦ గొప్పగొప్ప!
కన్నీరు పులకలు ♦ గ్రమ్మనై కరుణమ్ము వీరరసము వెల్లి ♦ విరిసె నౌర!
జీవకళల్ గల్గి ♦ యీవీరచరితమ్ము సరిగ భారతమును ♦ జ్ఞప్తిఁ దెచ్చు!
గీ॥ నవ్యభారతసృష్టి రా ♦ ణాప్రతాప! భావపుష్టి పదౌచితి ♦ పద్యగతియు
దివ్యముగఁ దోఁపఁ గృతి దిద్ది ♦ తీర్చినాఁడు రాజశేఖరకవి! కవి ♦ రాజమౌళి
సీ॥ పంచపాండవులొక్క ♦ పరిభువయి రాణాప్రతాపసింహుండు ప్ర ♦ త్యక్షమయ్యె!
ఢిల్లీశ్వరుని గూడి ♦ యల్లరాధేయు వైఖరి మానసింహుండు ♦ గానఁబడియెఁ!
దక్కు యోధులు రెండు ♦ దిక్కుల గుణకర్మ యోజనల్ భారత ♦ యోధులట్లు!
యుద్ధముల్ భారత ♦ యుద్ధంబులట్లు: "రెండవ భారతంబ" రా ♦ ణాప్రతాప!
గీ॥ ధర్మమర్మములను వీర ♦ కర్మములను జక్కఁగ్రుతిఁగూర్చి తిక్కనకు ♦ సాటిచెప్ప
నొప్పుననఁగ నాంధ్రావళి ♦ కుపకరించె రాజశేఖరకవి! కవి ♦ రాజమౌళి!

ప్రొద్దుటూరు.
17—12—33 కవిరత్న. కసిరెడ్డి వెంకటసుబ్బారెడ్డి.

---

రాణాప్రతాపసింహచరిత్ర ప్రత్యేకవైలక్షణ్యముగల యొక యద్వితీయకావ్యము. భారతము—భాగవతము విడిచినఁ బలుమాఱు చదువఁదగ్గ గ్రంథములు లేక యాంధ్ర విద్యార్థుల మాగలార్చు చుంటిమి. మీ రా కొఱఁతఁ దీర్చితిరి.

గ్రంథము మొదటినుండి తుదవఱకు 1800 పద్యములొక్కఁడే లిరికుగా (Lyric) వ్రాసిన మీ యపూర్వము నలౌకికము నగు నావేశము నెట్లు ప్రశంసింపవలెనో యేర్పడకున్నది. మన పూర్వకవులే యైన మానసింహు నెంత యధమునిగా మార్చియుందురో! అతని యుదాత్తత, యాద్ధ్యత్యము, శౌర్యము కన్నులఁ గట్టినట్లు చిత్రించిన మీరు "Poet is the noblest specimen of his Age" అనిన కార్లైలుగారి పలుకు సత్యము గావించితిరి. ఏండ్ల పర్యంతము లోపలనే కుములుచుండి హఠాత్తుగ నగ్నిపర్వతమునుండి పొంగి నిరాఘాటధాటితోఁ బ్రవహించు "లావా"వలెనున్న మీకావ్య మాంధ్రదేశమునఁ బ్రసరించి హృదయముల నుడికింపఁ గలదు.

తెనుఁగున గణింపఁదగిన గ్రంథములఁగూడ "రహీ-మహీ" జాబితానుండి యన్ని పదము లవిచ్ఛిన్నముగా స్వీకరింపఁ బడినవి. అట్టి లోప మొక్కఁడును లేక విమర్శకుల యెదురఁ దలయెత్తి చరింప మీ రవకాశము గలిగించితిరి. మూలేతిహాసమునఁ బదునాలుగు పేజీలున్న యితివృత్తము గ్రహించి మూలాతిక్రమణము చేయక వీరకరుణముల రెంటినే గైకొని జీవరస మొలికించి పాఠకునకుఁ బరమాణువంత వినుగుకూడఁ దోఁపకుండునట్లు రచించిన మీయద్భుతశక్తి కొనియాడఁ దగియున్నది.

ప్రొద్దుటూరు.
17-12-35. వి. ఉమామహేశ్వరుఁడు, బి. ఏ.

---

సీ॥ "తెలిసె! తెలిసె! నిప్పుడు తేట ♦ తెల్లమయ్యె! నేలరాడొఁ మా యన్నయ్య ♦ యిల్లు గదలి
యేలపాల్గొనఁడో ప్రజా ♦ హితములైన పనులయం"దని నామనం ♦ బునఁ దపింతు!
నా తపసు పండె! హేతు వీ ♦ నాఁడు తెలిసె! నే ననుకొను రీతిగ గుడి ♦ లోన దేవుఁ
డున్నటుల మిన్న కింటఁ గూ ♦ ర్చుండ లేదు! మేలు మేలు! చిత్తోడ్గడు ♦ నేలుచుండెఁ
దివిరి స్వాతంత్ర్యరక్షణ ♦ దీక్షతోడ దుర్నిరీక్ష తేజమున శ ♦ త్రువు నెదిర్చి
ప్రబల శత్రు వక్బరు ఢిల్లి ♦ పాదుషాయె యెత్తివచ్చిన తొణకక ♦ కత్తి గట్టి
ధైర్యలక్ష్మితోడ కొలంది ♦ దండుతోడ లావు మెఱసి యసంఖ్య బ ♦ లంబుగలుగు
శత్రువీరుల గుండియల్ ♦ జలదరింపఁ జైతకాశ్వముఁ వైరి వ ♦ క్షములపైన
గొరిజ మోవఁగ దుముకించి ♦ యురవడించి యొర దిగిచి కత్తి కుత్తుకల్ ♦ నరికి నరికి
నెత్తురు వసంతమాడి లో ♦ కోత్తరముగ హల్దిఘాటాదిగా సమ ♦ రాంగణముల
నిలిచి వీర విహారము ♦ సలిపి మేనఁ దొరగు రక్తముల్ జడివాన ♦ గుఱిసి రాజ
పుత్ర కాయము లొగి గాయ ♦ ములుగ మాఱఁ జెట్టునీడ సౌధము ♦ గడ్డి-రొట్టెతిండి

పట్టుపాన్పై శిలాతతి! ♦ యట్టె పండి పట్టపుందేవి బిడ్డలు ♦ చుట్టుఁగొలువ
నబ్బురంబుగఁ దాను సిం ♦ హాంబువలెనె యడ్డులేని యరణ్యరా ♦ జ్యము వరిం
యక్బ రీఁజూచు నీవుల ♦ కాస పడక యేక్షణమ్మును స్వాతంత్ర్య ♦ దీక్ష విడక
చాలునని పాడుపాయె వే ♦ సారువటుకు "అన్న యక్బరు తోడఁ బో ♦ రాడుచుఁ
ఎల రాఁడో మా అన్నయ్య ♦ యిల్లు గదలి! ఇందు కేసుమి రాఁడని♦యిపుడు తెలి
తప్పని సరిగ రాణాప్రి ♦ తాపసింహుఁ డిచటఁ గవిసింహమై పుట్టె! ♦ నిది నిజ
సిద్ధముగ దొడ్డ యీ రాజ ♦ శేఖరుండు! ఇపుడు డీ. రాజశేఖర ♦ మే సుమండి
కత్తి కలమయ్యె! విశ్రాంతి ♦ గాంచి శ్రమముఁ బాసి స్వీయచరిత్రము♦వ్రాసెనన
భావపుష్టి, పదాచితి, ♦ పద్యగతుల నితరు లేగుణముల మెత్తు ♦ రేని నేను
మని శతవధాని పూర్వజ ♦ న్మంబులోని చర్య మఱువని జ్ఞాపక ♦ శక్తి మెత్తు!

ప్రొద్దుటూరు.
17—12—33

ఇట్లు, మెచ్చుకొను
ఏ. కె. ముని.

---

చ॥ తెనుఁగున భారతంబు మఱి ♦ దిక్కన దాఁటినమీఁద నీప్రతా
పుని చరితంబుఁ బోల్ రచన ♦ ముక్ నినుఁబోలిన సత్కవీంద్రునిన్
గని విన దాంధ్రభూమిసుమి! ♦ గ్రంథము రెండవభారతంబె! నీ
వు నపరతిక్క యజ్వవని ♦ పూజ్యులు పల్కుట తథ్యమే యగున్.

ఉ॥ ఈయఖిల ప్రపంచమున ♦ నెందును లేనివి భారతంబు రా
మాయణమట్టి కావ్యములు! ♦ నందలి వీరులకన్న మిన్నయై
పాయని ధైర్యశౌర్యగుణ ♦ వైభవధూర్వహు నొక్కనిన్ మహా
నాయకసార్వభౌము జత ♦ నంబున నిచ్చితి వెట్టి ప్రోడవో!

గీ॥ పరమగీతా రహస్యంబు ♦ భాతి దీని ముప్పదైదుకోటులు హైంద ♦ వులు దినంబు
భక్తిఁ బారాయణముచేయ ♦ భరతఖండ మఖిల విశ్వోన్నతైశ్వర్య ♦ మందు టర

సి. సుబ్రహ్మణ్యశర్మ.

---

ఎచ్చటఁ జూచినను శైలి కరము మనోహరమై యనర్గళధారా విలసితంబై
శాంధ్ర పదయుతంబై యలరారు చున్నది. చరిత్రవిషయముల నింత లలితముగా వ్రా
ట కడిఁది. అయినను గ్రంథకర్తగారు దీనిని మిక్కిలి నైపుణ్యముతో వీరరస ప్రధాన
రచించి యునికి శ్లాఘనీయము. "కావ్యకళానిధి" బిరుదమునకుఁ గవిగా రెంతయు నర్హ

ఈ గొప్పకావ్య మన్నివిధములఁ బ్రశంసనీయము. ఆంధ్రభాషాయోష కొక యనుత్తమ భూషణంబై విలసిల్లుచున్నది. గ్రంథమంతయు నొకేస్థాయిగా రసవంతముగా వ్రాయుట చాలఁగష్టము. కవిగారతిచమత్కారముగా నిర్వహించి యున్నారు.

"విమర్శకాగ్రేసర"
నాగపూడి-కుప్పుస్వామయ్య బి. ఏ.

గీతాపారాయణమునకువలె నడుగడుగునకు ద్విగుణీభూతోత్సాహంబున ధారాళ ద్రాక్షాపాకంబునఁ వెలసిన భవదపారస్వాతంత్ర్య వీరప్రబంధముఁ బఠించి నాయనుభవించిన యానందమునకు మేరయే లేదు. అనర్గళధారాశుద్ధి గలిగి యుపమాసందర్భములఁ గాళిదాసుని దలపించుచు, నుభయభాషాప్రవేశగాంభీర్యముఁ దెల్పుటకో యన సాంస్కృతికంబుల నటనటఁ బచరింపుచుఁ దెలుఁగునుడికారంపుఁ దీయందనంబులఁ దిక్కయజ్వ కుద్ది యనిపించుచు లోకజ్ఞతం దెల్పు నుడుల ననల్పంబుగఁ గురియించుచు మీకావ్యరచన మపారప్రతిభావైశద్యమును వెల్లడించినది. ఉత్తమములగు జాతీయములు జానుదెనుఁగు నుడికారములు చక్కనినానుడులు మనోహరాలంకారములు గుంపులు గుంపులై తమంత వచ్చి దూఁకినట్లు గ్రంథమంతయు రససమాకీర్ణమై శ్లాఘనీయమై యున్నది. ఈగ్రంథము భారతమునకుఁ బైచేయి. ఈగ్రంథము వ్రాసి మీరు ధన్యులై యాంధ్రలోకము ధన్యతఁ బడయఁ జేసితిరి. ఈగ్రంథముఁగూర్చి యెంతదూరము ప్రశంసించినను కొఱఁతయే యగును.

యస్. విశ్వనాథశర్మ,
లెక్చరర్, నైజాంకాలేజి,

ఉ॥ కాంచితి నీదుపొత్తమున ♦ ఖండపు టోపికతోడఁ! బూర్తిగా
మంచిది శుద్ధి! కూర్పు కడు ♦ మంచిది! మంచిది శయ్య! పాకమున్
మంచిది! రీతియున్ మిగుల ♦ మంచిది నీకృతియందుఁ! గాన ని
న్మించు కవీశ్వరుల్ ధర జ ♦ నింతురు నూటికిఁగోటి కొక్కరే!

5–8–1935.

కాశీ-కృష్ణాచార్యులు,
శతావధాని.

మీకావ్య మిప్పటి కబ్బపుంబలుకులమ్మకుఁ గులుకుందొడవు. చూచి పరమానందము ననుభవించితిని. జాతికి వార్తకుఁ గని. సహృదయహృదయముల రంజింపఁజేయుచున్నది. మొగల్ చక్రవర్తులఁ దబ్బిబ్బుపఱచిన ప్రతాపసింహుని చరిత్రమును వర్ణించుటకు మిమువంటి కవిసింహులే సమర్థులు. మీ రచన నవకవుల కాదర్శకమై ముద్దులొలుకుచున్నది.

ఉభయభాషాప్రవీణ జి. జాషువా.

ఆనంద మందితి. ప్రతాపుని పాత్రముఁ జక్కఁగఁ బోషించితిరి. ఆనాయకుని వి
మును బ్రౌఢచర్యలు నమోఘముగ వర్ణించితిరి. కాలస్థితి ననుసరించి వలయు సోదర
యుఁ బెద్దలయెడ గౌరవము నద్భుతముగ వివరించితిరి. కులగురువులగువారికెల్ల నీతిఁగఁ
గలిగిన "భామాసాహి" శిష్యవాత్సల్యము త్యాగము వివరించునెడ నానందబాష్పః
కెంతయు నడ్డులేకపోయె. జోషీబాయి-పృథ్వీరాజు-అబ్దూరహిమానుల ధీరోదాత్తత
గుణసంపత్తియు సార్వభౌమునిముంగల జరపు సంభాషణమును క్షత్రియకులమర్యా
కు వన్నెపెట్టుచున్నవి. అది యిది యననేల! గ్రంథమంతయు రసమున నుట్టూఁతలూఁగ
న్నది. పిప్పి వెదకినను గానరాదు. కడుదీనదశఁగూడ బిడికెడు మన్నత్తి మేవాడవీ
మాతృభూమిని శిరసావహించి ప్రకటించిన దేశమాతృభక్తితత్పరత నిరుపమానముగఁ జి
పఁగలిగితిరి.

గా. రామేశ్వరరావు.

కావ్యములలో ప్రత్యేకలక్షణములతో శోభిల్లునవి అరుదు. ఏకావ్యమును జూ
ను ఒక్కఅచ్చులోనుండి తీసినకమ్మి. ఒక ఫోటోకు నకలు. కావ్యశిల్పమున ప్రత్యేక
క్షణ్యమును గలిగినవి శ్రీతిరుపతి వెంకటకవుల గ్రంథములు. తరువాత అట్టి ప్రత్యేక
కాశముతో వచ్చినది ఈ 'రాణాప్రతాపసింహచరిత్ర' యని చెప్పిన సాహసముకాదు.

ఎంత ఛందోయాత్ర చేసినను భాషావాహిని భావవాహినితో సమగతిని ప్రవర్తి
నదిగాని కుంటువడలేదు. అఁయలేదు. వెనుబడలేదు.

ప్రతాపునివలెనే యీకవియు వీరవ్రతుఁడేమో యనిపించునట్లు ఎంతకాలమును
యో అంతర్నిహితమైయున్న ప్రతాపవహ్ని ఒక్కమారుగాఁ బైకుబికి వచ్చినదా యన్న
నడిచినది కావ్యము: ప్రతాపుని అతని ప్రతిస్పర్ధులనుగూడ సమదృష్టితోఁ గాపాడఁగ
నది కవి మనీష. పిడికెడు మట్టిని జేకొని మేవాడవీరులు మాతృభూమిని శిరసావహించున
చిత్రించిన యీకవి చాతుర్యము వర్ణనాతీతము.

18-8-34. "కృష్ణాపత్రిక."

బహుకాలమున కొక గొప్ప పురాణమును జూడఁ గలిగితిమి. ఈ పురాణము
మైన ఐతిహాసికము. ఈ గ్రంథము భారత-భాగవతాదుల సంతతిది. ఇఁక ముందుఁ
పల్లెయందును భారత-భాగవతములవలె దీనిని గూడఁ బౌరాణికులు జనులకుఁ జెప్పి
పింపవలెను. తిక్కన-పోతనల నామము లెంతకాలము ఆంధ్రులందు స్మృతిపథమునందుఁ
నో యంతకాలము మన కవిశేఖరుని నామమును స్మరింపఁ బడుచుండుఁగాక. ఈ గ్రం

ము భారతమున కెందును దీసిపోవనిది ఆధునికులలో నింతకన్నఁ బెద్ద గ్రంథములు (పురాణములు) వ్రాసినవారు లేకపోలేదు. కాని వానికన్న నీగ్రంథమే పూజనీయమైనది. మాతృదేశభక్తి, స్వాతంత్ర్యరక్తి, సాహసౌదార్య ధైర్యకార్యోద్వృత్తి వీనిని బుటబుటయందును బద్యపద్యమందును బ్రకటించి యా యా రసములఁ జక్కఁగాఁ బోషించి యాంధ్రులను సంతతాఖండ మృదుమధుర మధుధారాకవిత్వ రసానుమోదకులగాఁ జేసిన మనకావ్యకళానిధిగారి జన్మము ధన్యమైనది.............వీరరస మొక్కఁడే యిందు గ్రహింపఁబడినది. అదియే మన కిప్పు డవసరమైనది. అది చచ్చుటచే మనమును జచ్చినట్లే యున్నాము. ఇఁక ముం దాలంకారికులు "ఏకోరసో వీరఏవ" యని నియమింతురుగాక.

గ్రంథమంతయు నిర్వచనమేయైనను కవిత యొక్కచోటనైనను కుంటువడక శ్రుతికటువు జబ్బుయల్లిక పులిమిపుచ్చుటకై తెచ్చుకొనిన పాదపూరణములు. ఎందును గానరావు. బెండడి బిలుకులు లేక తీర్చి మలిచిన రాళ్ళతోఁ గట్టిన కవితాపుణ్యాలయ మిది. మంచి సామెత లిముడ్పఁబడియున్నవి. ప్రతాపుని గుణము లనంతములుగా వర్ణింపఁబడినవి. ఇట్టి యుత్కృష్టగ్రంథము సర్వాంధ్రలోకమందు శాశ్వతముగ నాదరణీయమై వెలయుఁగాతమని కోరుచున్నాము.

0–1–44 ఫసలీ. "గోలకొండ పత్రిక."

ఈకవిగారు 1900 పద్యములుగల బ్రహ్మాండమైన చరిత్రమును రచించిరి. దేశచరిత్రములలోనుండి యిదివర కెన్నడు నెవ్వరు నింత గ్రంథమును బద్యములుగ రచియించియుండలేదు. రసానుగుణవర్ణనములతోఁ బద్యములు నిర్దుష్టముగఁ జక్కని నడకతో నొప్పుచున్నవి. పలువురు తలంచునట్లు వీరిని యతిప్రాసలేమియుఁ గష్టపెట్టలేదు. శంకరకవి చెప్పిన ట్లిందుఁ దాము తామే యుచితస్థితి వచ్చి నిలిచి కష్టపెట్టునని భయపడువారిని నవ్వుచున్నవి. కవిగారి కవిత్వశైలి కిప్పటి ప్రసిద్ధకవులు హర్షజలరాశిఁ దేలెదరు. సంస్కృతమునుండి యాంధ్రీకరించుటకును ఇతర భాషలలోనుండి తీసి యాంధ్రగ్రంథ మార్గమునకుఁ దెచ్చుటకును జాల భేద మున్నది. రెండవది మిగులఁ గష్టము. కవిగారి నింతవఱకుఁ బ్రస్తుతింతుము.

భావనామ సం॥ర
శ్రావణ-భాద్రపదములు. "ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక."

ఇతర వర్ణనములతో నెంతయుఁ బ్రొద్దుపుచ్చక వీరకరుణములతోనే విశేషించి గ్రంథము నింపిన యీ కవిగారిశక్తి విద్వత్కవుల మనస్సును హరింపఁ జాలియున్నది. గ్రంథమంతయు మృదుమధురపదభూయిష్ఠము. ధార ధారాళము. ద్రాక్షాపాకము. కృతి నిర్దుష్టము.

పండిత పామరజనరంజకము. పూర్వకవులు భారతభాగవతాది పురాణేతిహాసములలోని చరిత్రములు లిఖించియున్నారు. ఈ కవి యట్లుగాక యధునాతన చరిత్రమును వ్రాసి యున్నాఁడు. అందును కథానాయకుఁడు హిందువైనను బ్రతివీరుఁడు యవన చక్రవర్తి యయిన యక్బరు. ఈపేరులేకపోటితని పక్షమునఁ జేరినవారందఱపేళ్లును నిట్టి తురుష్క భాషరుఁ జేరినవే. వీరియుద్ధము భారతాది యుద్ధములవలె నస్త్రశస్త్ర ధనుస్సాధముగాక ప్రాకృతసాధన భూయిష్ఠము. ఇట్టిదానిఁ బ్రాచీనకవితాధారలో నడిపించి గ్రంథమునకు వన్నె తెచ్చిన యిక్కవిప్రౌఢిమ కడుంగడు శ్లాఘ్యము. రంగరాయచరిత్రాదుల వంటివి కొన్నియున్నను నవి యతిప్రౌఢములై కేవల పండితైకవేద్యములేకాని యాంధ్ర భాషావిదుల కందఱకును సులభములుగావు. కనుక దేనజూచినను నీ గ్రంథము మిక్కిలి కొనియాడఁ దగియున్నది. ఇట్టి చరిత్ర రచించి తన యసాధారణ ప్రతిభనేకాక దేశభక్తిని సనాతన ధర్మతత్పరత గ్రాంథిక భాషాభిమానము వెల్లడించిన యీ రాజశేఖరముగారు కడు ధన్యులు.

భావ. మార్గశిరము "అభినవ సరస్వతి"

ఈ మహాకవి విద్యాశేఖరుఁడైన సంపన్నగృహస్థుఁడు. అనేక గ్రంథములు రచించిన కవిలోక శిఖామణి. గ్రంథము సర్వోత్తమమైనది. నవరత్నములను ప్రసిద్ధికలదు. కాని యిందన్ని పద్యములు రత్నములే యనవలయు. ప్రతాపసింహుఁడు ధనబలముమాత్రము లేకున్నను దేశాభిమానబల మపారముగఁ గలవాఁడగుటచేఁ బోరాడుచు సైనికుల కుత్సాహము గలిగించుచున్న తావులఁగల పద్యములఁ జదివినచో దుఃఖాశ్రుబిందు సందోహము ప్రవాహరూపము దాల్పకపోదని మా విశ్వాసము. ఉదాహరింతమని యేభాగమును జది విన నందొక్క పద్యమైన వదలఁ దరముగాదు. ఏభాగము చూచిన యతిప్రాసములకై కక్కుఱితిపడిన జాడ గానరాదు. శైలి గంగాప్రవాహమువలె నున్నది.

ఆషాడ బ ౧౧ లు "త్రిలింగ"

టాడ్డుదొర గ్రంథము పూర్ణ చరిత్రాత్మకము. ఆ బంగారమున కీకవి సువాసన యబ్బించినాఁడు. కవీశ్వరుఁడు ప్రతాపుని ప్రతాపము నుగ్గడించుటలో వైరివీరుల విశేష మును మఱవలేదు. అక్బరు ముఖ్యమంత్రి "యబ్దూరహిమాను" శీల మప్రతిమానము. అతఁడు మహాత్ముఁడేసరి. యజమానినే ధిక్కరించి ప్రతాపుని సర్వస్వతంత్రునిఁజేసిన నిరు పమానశాంతచిత్తుఁ డీయబ్దూరహిమాను. భామాసాహి శీలము ప్రతాపసింహుని శీలమున కీనయనఁ దగును. కవిత్వము కేవలము భావ ప్రధానమైనదేకాక ఘట్ట-ఘట్టమును గర్ణ

రసాయనంబై యనర్గళధారా ప్రవాహ పరిపూర్ణంబై మృదుమధుర పద భూయిష్ఠమై శైలి శ్లేష-ప్రసాద మహిమలఁ జెన్నొందుచు యుద్ధపుఁబట్టుల దిక్కన-సోమయాజిశైలిని దలపించుచుఁ గొన్ని యెడలఁ బోతన-కంకంటి పాపరాజప్రధానుల స్మరణకుఁ దెచ్చుచున్నది. ప్రస్తుతాంధ్రకవికుంజరులలో నీ కవి యసమాన విఖ్యాతి వహించి యున్నాఁడు.

శ్రావణ శు గి లు. "కౌమోదకి"

వీరి కృతులు దిగంత విశ్రాంత కీర్తివహించి జయపతాకము నెలకొలిపినవి. కవికుల కోటిలో వీరి కగ్రతాంబూల మీయక తప్పదని "ఢంకా" వాయించినది వీరి "రాణా ప్రతాపసింహ" చరిత్ర. ఈగ్రంథ ప్రాశస్త్యము వివరించి చెప్పఁదలఁచిన నీగ్రంథమంత గ్రంథము వ్రాసినఁగాని తేటపడదు. ఏ యే సమయమం దే యే పదము ప్రయోగించిన రస ముట్టిపడునో యా యా సమయమున నా యా పదమునువాడి జిలిబిలి ముద్దుపలుకుల తో, ధారాళమైన ధారతో, లలితములైన పదములతో, సరళమైన శైలితో, గ్రంథమంతయు నొకే తీఱున నడిపించిన వీరి యద్భుతశక్తి సంశ్లాఘ్యము. ఆంధ్రులపాలిటి కల్పవృక్ష మిది. కవిత్రయము వారు భాషా గురువులై యాంధ్రకవిత్వమునకు మార్గదర్శకులైనట్లు నవీన ప్రబంధములకు వీరు మార్గదర్శకు లగుచున్నారు...... వేయేల! యీ గ్రంథము వ్రాయునపుడు వీరే రాణాప్రతాపసింహులైరో, రాణాప్రతాపసింహుఁడే కవిసింహులగు వీరి రూపముఁ దాల్చెనో యనిపించినది. అరుగరాచిన కొలంది పరిమళ మతిశయించు శ్రీగంధపుఁ జెక్కవలె నీగ్రంథము చదివినకొలంది నమృతరస మొలుకుచున్నది. ఈగ్రంథము మహాభారతమువలె నైతిహాసికు లితిహాసమనియుఁ గవి వృషభులు మహాకావ్యమనియు శ్లాఘింపవలెను. అన్ని గ్రంథము లొకయెత్తు. రాణాప్రతాపసింహ చరిత్ర మొక్కయెత్తు. ఆంధ్రభాషా రామామణి కిది శిరోభూషణము. ఆంధ్రవాఙ్మయక్షేత్రమున ఫలించిన పారిజాతము. ఆంధ్రలోకమున నవతరించిన మహారత్నము. రాజశేఖరు నింట వెలసిన వాగ్దేవి. కవి గావించిన యాంధ్రసారస్వతకృషినుండి యుద్భవించిన యమృతకలశము......... ఓమహాకవీ!

గీ॥ నీదు కావ్యంబునం దెంత ♦ నిగ్గు గలదొ। వ్రాయుచో భారతం బంత ♦ గ్రంథ మగును!
సారమును గాంచఁ గొన్ని వ ♦ ర్షములు పట్టు నన్న। దీని గుణంబెన్న ♦ నలవియగునె!

నూజివీడు. "వైజయంతి"

......ఈ వీరచూడామణి (ప్రతాపసింహుఁడు) భారతీయులకు నిత్యోపాస్యుఁడు. ఇతని యుదాత్తచరిత్రము నిరంతరపారాయణయోగ్యము. వస్తుగౌరవమునను గ్రంథవిస్తృతిని నీకాలమున వెలువడుచున్న కావ్యములలో దీనికి మహత్త్వము సమధికమై యొప్పినది.

ఈ కవి వీరసత్త్వ సంపన్నుఁడు. ఈయన కృతులు వీరరస ప్రతికృతులు. వీరవరుల గాథ లీవీరసత్త్వ ని హృదయమునకు సాక్షాత్కారము నొసఁగి వీరరస ప్రవాహినులగు పృథుల కావ్యములై వెలసినవి. ఇట్లు అగ్గలించిన అలవాటునను పెంపుగనిన నేరుపునను, చేయి వడిదిరిగిన యీయన నేఁడు రచించిన యీ రాణాప్రతాపసింహచరిత్రమీయన రచనములకు మేల్బంతి. దీనిని వెలయించి యిపు డీయన కావ్యకళానిధియైనాఁడు. ఈయఖండ కావ్యమున కవితాసామగ్రి గ్రంథకర్తృ సామర్థ్యమున కుద్దిగ నున్నది. ఈ గ్రంథమున కవితా సామగ్రికిఁ గొఱంతయే లేదు. ఉపమాలంకారము లిం దసంఖ్యములుగఁ గలవు. వానిలోఁ బెక్కింటి కపూర్వతయు నబ్బినది. గ్రంథమున నవిరళముగనున్న నవ్య కల్పనములు గ్రంథకర్త కల్పనా కౌశలమునకుఁ జక్కని తెలివిడి. కవితాధార ఉత్తాలముగఁ బొంగిన వర్షాకాలమునందలి మహానదీ ప్రవాహమువలె నిరాఘాటముగ పరువులు వారుచుండును. అందందు దానఁ బూర్వకవుల ధోరణియు పొడకట్టు చుండును.

* * *

కవి తనస్వతంత్రశక్తి నన్నింటను గనబఱచినాఁడు. అది యిందలి విశేషము. ఇట్టి గ్రంథములు కేవల చరిత్రాత్మకములు వీరరస ప్రధానములు నయినవి ఆంధ్రవాఙ్మయమునకుఁ గ్రొత్తలు. వెనుకటివారి కట్టివానిపయి రుచి పుట్టినది కాదు యే యిద్దఱు-ముగ్గురకో తప్ప. నేటివారిలోఁ గొందఱు కట్టి రచనములు గిట్టినను అఖండత అవునుగాని దయిపోయినది. అఖండముగ నట్టి గ్రంథములఁ బెక్కింటిని రచియించి యాంధ్రమున కర్పించిన యాతఁ డిప్పటి శ్రీరాజశేఖరకవియే కనుపించునది. ఈయన రచనములవలన నాంధ్రసాహిత్యము బలుపుఁ గనినది. దీనికై యీకావ్యకళానిధి నెంత కొనియాడినను దీఱదు.

డిసెంబరు 1934.

“భారతి”



కావ్యకళానిధి, కవిసింహ & అవధానిపంచానన,

దుర్భాక రాజశేఖరశతావధాని.

# విషయసూచిక.



## ప్రథమాశ్వాసము.



## ద్వితీయాశ్వాసము.

## తృతీయాశ్వాసము.

## పంచమాశ్వాసము.



---

# గ్రంథమునందలి పాత్రములు.

ప్రతాపసింహుఁడు = మేవాడ్దేశప్రభువు. కథానాయకుఁడు.

ఉదయసింహుఁడు = ప్రతాపసింహుని తండ్రి.

సూక్తుఁడు-సాగరుఁడు-జగమల్లు = ప్రతాపసింహుని యనుజులు.

కృష్ణసింహుఁడు = సలుంబ్రాధీశ్వరుఁడు—ప్రధానమంత్రి—సర్వసైన్యాధీశ్వరుఁడు.

హరభట్టారకుఁడు = ప్రతాపసింహుని పురోహితుఁడు—కులగురువు.

చంద్రభట్టారకుఁడు = ప్రతాపసింహు నాస్థానకవి—వీరుఁడు.

రామచంద్రదేవుఁడు. (కుమారుఁడు ఖండేరావు) గ్వాలియరురాజు = ప్రతాపసింహు నాశ్రితుఁడు.

ఖేల్వాపతి = చోండావద్వంశజుఁడు. సామంతనృపుఁడు.

భానుసింహుఁడు = సోనెగుర్జమహీపతి. ప్రతాపసింహునకు మామవరుసవాఁడు.

తేజసింహుఁడు-మనస్సింహుఁడు-శ్యామసింహుఁడు-దూడాసింగు-
బేడ్లా-కొఠేరియానృపులు-షాపురాబు నేరాధీశ్వరులు-దుర్జయుఁడు-
హరిదాసు-ముకుందదాసు- ... ... ... } సామంతనృపులు.

అమరసింహుఁడు = ప్రతాపసింహుని ప్రథమపుత్రుఁడు.

పాటేశ్వరీదేవి = ప్రతాపసింహు నర్ధాంగలక్ష్మి - పట్టమహిషి.

భీమచాఁదు = శబరలోకసార్వభౌముఁడు. ప్రతాపసింహుని మిత్రుఁడు. స్వతంత్రుఁడు.

భిల్లుఁడు = సేవకుఁడు.

అక్బరు = మొగలుచక్రవర్తి. ఢిల్లీశ్వరుఁడు.

సలీము = అక్బరు కుమారుఁడు—యువరాజు.

మిర్జా అబ్దూరహిమాను (ఖాన్ ఖానన్) = అక్బరు ప్రధానామాత్యుఁడు.

హరివిజయసూరి = జైనుఁడు - అక్బరు గురువు.

పథ్వీరాజు = అక్బరు నాస్థానకవి—సేనాధిపతి.

ధనసేనుఁడు = గాయకసార్వభౌముఁడు.

భగవాన్‌దాసు—కున్వార్ మానసింహుఁడు - తోడరమల్లు—వీరబలుఁడు -
రాయసింహుఁడు - రాయశీలుఁడు—అబ్దుల్లా—షాబాజుఖాన్ - ఆసఫ్ఖాన్ -
ఖాసింఖాన్ - మహబత్ ఖాన్—ఫరీదుఖాన్ - ఫయాజి- } మొగలు సేనాధిపతులు

అబుల్ ఫజల్ - ఫెరిస్తా-బదోనీ-సూరిదాసు అబ్దు-స్సమాద్ = కవులు, చరిత్రకారులు, చిత్రకారులు.

శ్రీ

కామేశ్వర్యై నమః.

# రాణాప్రతాపసింహచరిత్ర.

## పూర్వపీఠిక.



నాథాబ్జభవాదు లెవ్వని మ్రొక్కు ♦ శ్రీపాదపంకేరుహ
ధ్యానానందరసాబ్ధిఁదేలి కృతకృ ♦ త్యత్వంబుఁ బ్రాపించుచుం;
దా నీహార నగాత్మజాప్రియుఁడు ని ♦ త్యానందుఁ డారోగ్యవి
జ్ఞానశ్రీ లిడి చంద్రశేఖరుఁడు వి ♦ శ్వంబెల్ల రక్షించుతన్. 1

సీ|| అబ్జాతనయనుని ♦ యత్తవారిల్లైన కలశపాథోరాశి ♦ గర్భమందు
వజ్రమౌక్తికపంక్తి ♦ పరువని పరుపులై తేజరిల్లెడు మణి ♦ ద్వీపమందు
రవిరశ్మి నింత చొ ♦ రంగనీని కదంబ తరురాజవనము మ ♦ ధ్యంబునందుఁ
బ్రాభాతసూర్యప్ర ♦ భాభాసమానమౌ చింతామణీ భద్ర ♦ సింహపీఠిఁ
గీ|| త్రిదిశకోటీ కిరీటసం ♦ దీప్త రత్నరాజి నీరాజిత పదాబ్జ ♦ యై జగంబుఁ
బాలన మొనర్చు మాయమ్మఁ ♦ బ్రస్తుతింతు రమ్యగుణధన్య శైలాధి ♦ రాజకన్య. 2

సీ|| పుంజీభవించి యు ♦ ప్పొంగి శైలములు శృంగములెత్తి దివిని బ్రా ♦ కంగఁజనిన,
రంగదుత్తుంగ త ♦ రంగసంఘములతో నీరధి కలఁగి ఘూ ♦ ర్ణిల్లుచున్న,
హోమకుండముల న ♦ హోరాత్రములు నూర్ధ్వశిఖల నగ్ని తపంబు ♦ సేయుచున్నఁ,
గులశైలములు పెల్ల ♦ గిలఁ బ్రభంజనుఁడు జృంభించి భీకరధాటి ♦ వీచుచున్న,
గీ|| శబ్దగుణరూఢి నవ్యయ ♦ సరణి నభము విష్ణుపదమై తనర్చిన, ♦ వీసమైన
నేజనని శక్తిమాహాత్మ్య ♦ మెఱుఁగ; వట్టి భవుని కొమ్మను మాయమ్మఁ ♦ బ్రస్తుతింతు.

సీ|| ఏమహామహుఁడు సం ♦ స్కృతపాండితిని గొప్పపర్వతంబని నుతుల్ ♦ వడయఁగలిగె!
నేఘనుం డాంధ్రమం ♦ దెల్లపండితులచే దిగ్దంతియనుచుఁ గీ ♦ ర్తింపఁబడియె!
నేసద్గుణార్ణవుం ♦ డెల్లెడఁ దర్కసింహుఁడటంచుఁ బెనుకీర్తి ♦ నొందఁగలిగె!
నేకళావిదుఁడు వై ♦ యాకరణుల నిట్టి ఘనుఁడు లేఁడనుచు వి ♦ ఖ్యాతిఁగాంచె!

గీ॥ సట్టికండాల్లవంశ సు ♦ ధాంబురాశి చంద్రుఁడైన దాసాచార్య ♦ సత్తముండు
గురుఁడు దైవంబు; తత్పాద ♦ సరసిజములు స్వాంతమున నెంచువాఁడ న ♦ పారభక్తి. 4

మ॥ తననాథుం డొనరించు సత్కృతుల కు ♦ త్సాహమ్మునన్ దోడుసే
యను గాంక్షించి సహస్రహస్తముల శి ♦ ష్యశ్రేణిఁ బోషింపనే
ర్చిన మత్సద్గురు మానినీతిలక మా ♦ "శ్రీరంగమాంబా మహా
జననీరత్నముఁ" గొల్తు నెల్లపుడు సా ♦ త్వీ దిందిరాదేవిగన్. 5

మ॥ తనసౌజన్యము సజ్జనుల్ పొగడ ని ♦ త్యంబున్ సదాచార వ
ర్తన మొప్పార, గురుండు దైవమగుచున్ ♦ బ్రహ్మోపదేశాది పా
వనకృత్యంబులు నాకొనర్చిన ఘనున్ ♦ బ్రఖ్యాతచారిత్రు మ
జ్జనకున్ వెంకటరామయార్యు మదిలో ♦ సద్భక్తి భావించెదన్. 6

గీ॥ "మాతృదేవోభవ" యటన్న ♦ మహితసూక్తి మఱువరానిది; నిరతము ♦ మజ్జననిని
దొడ్డముత్తైదువను మన ♦ స్తోయజమునఁ గొలిచెదను సుబ్బమాంబ స ♦ ద్గుణకదంబ. 7

మ॥ నను గారామునఁ జేర్చి యాంధ్రమున 'నో ♦ నామాలు' మెట్రిక్యులే
షనుపై నాంగ్లము నేరిపించి తనదా ♦ సర్వస్వ మర్పించి పెం
చిన కారుణ్యరసార్ద్రమానసుఁడు మా ♦ చిన్నయ్య 'సంజీవరా
యని' దుర్భాకకులాబ్ధిసోముని మదిన్ ♦ ధ్యానింతు నెల్లప్పుడున్. 8

గీ॥ భారతీనాథు నపరావ ♦ తారములనఁ గావ్యజగము సృష్టించి లో ♦ కములు మనుపు
నన్నయాది కవీంద్ర మం ♦ దారతరుల నాంధ్రభాషాగురుల నిత్య ♦ మభినుతింతు. 9

గీ॥ ప్రకృతితత్త్వరహస్య స ♦ ర్వస్వ మెఱిఁగి నవనవోన్మేషమైన ప్ర ♦ జ్ఞ జయుఁ దనర్పఁ
గృతులు విరచించి లోకోప ♦ కృతులు పెంచు నార్యకవికోటి నిత్యవి ♦ ద్యార్థిగణము.

గీ॥ నూతనోజ్జీవమిచ్చు ప్రా ♦ భాత దక్షిణానిలము సోకఁగా మేడ ♦ పైన "టాడ్డు"
దొర రచించు రాజస్థాన ♦ చరిత మెత్తి యొక్కనాఁడేను జదువుచు ♦ నున్నయప్పుడు."

సీ॥ సంస్కృతాఖండ భా ♦ షాకావ్య సాహిత్య సామ్రాజ్య సర్వస్వ ♦ చక్రవర్తి,
యఖిలాంధ్రభాషా మ ♦ హాకావ్యవిరచన వ్యంగ్యవైభవ పట్ట ♦ భద్రకీర్తి,
బహుళవిద్వద్బృంద ♦ పరిషదర్చిత పుష్ప మాలా మనోహర ♦ మహితమూర్తి,
తేజంబు నెఱపు జ్యో ♦ తిశ్శాస్త్రవిద్యాంగనా నవ్య రుచిర భా ♦ వానువర్తి,
గీ॥ శత శతవధాన హర్షితా ♦ స్థాన దత్త కనక జయఘంటికా సింహ ♦ కంకణా రవ
ముఖరితాశాంతసద్యశః ♦ స్ఫూర్తి సుకవి సింహబిరుదుండు వెంకట ♦ శేషశాస్త్రి; 12

క॥ చనుదెంచి నన్నుఁగని వందనమని వచియించి నిలువఁ ♦ దమ్ముఁడ రార
మ్మని కౌఁగిటఁజేరిచి చెంతను నేఁగూర్చుండుమన న ♦ తఁడు కూర్చుండెన్. 13

గీ॥ స్వాంతమునఁ బొంగి పొరలెడు ♦ హర్షభరము వికసిత ♦ ముఖాబ్జములపైన ♦ వెల్లివిరియ
మాటలాడితి మలపును ♦ మలపులేని కుశల సంప్రశ్నములఁగూర్చి ♦ కొంతతడవు. 14

చ॥ చిఱునగ వాస్యసీమ విక ♦ సింపఁగ వెంకటశేషశాస్త్రి "సో
దర! మును నన్నయాది కవి ♦ తల్లజు లెల్లపురాణసంతతుల్
సరస పదార్థ భావ గుణ ♦ సంభృతమై తగు మంచి శైలిలో
విరచన చేసియుండి రవి ♦ విశ్వజగన్నుతమై తనర్చెడున్. 15

క॥ పిదపఁ బురాణాంతర్గత విదిత వివిధకథలు గొనుచుఁ ♦ బెద్దన్నాదుల్
పదునెనిమిది వర్ణనములు గదియించి రచించి రఖిల ♦ కావ్యశ్రేణుల్. 16

ఉ॥ కాలను కొంత యిప్పగిదిఁ ♦ గావ్యయుగంబుగ సాఁగె; దానిలోఁ
బూలవనంబు లయ్యమృత ♦ పూర్ణసెలయేఱులు నిగ్గుటాణి ము
త్యాలబెడంగు మేల్గొడుగు ♦ లచ్చపు వెన్నెల సోగలో యనన్
జాలిన మేటికావ్యము ల ♦ సంఖ్యముగా జనియించె వ్రేల్మిడిన్. 17

ఉ॥ ఆవలఁ గొన్నినాళ్లరుగ ♦ నంతట సంతట సారవంతమా
త్రోవలు తప్పి కాంతి చెడి ♦ దుర్గమ దుర్గములట్లు భీకరా
శీవిషమున్న పేటికల ♦ చెల్వునఁ గాననరాజి మాడ్కిఁ గా
వ్యావళులున్ వికాసగుణ ♦ మంతయుఁ గోల్పడె బీడువోవుచున్. 18

క॥ పెక్కామడ కొక్కఁడుగా నక్కడలిని గల్గు దీవు ♦ లట్టులు కైతల్
చక్కఁగ లిఖించు వార్గల రిక్కాలంబునను నొక్క ♦ రిరువురు పెద్దల్. 19

మ॥ ప్రతిభాపూజ్యులు వారువ్రాసిన మహా ♦ గ్రంథంబు లత్యంత పు
ణ్యతమంబుల్ గద! వానినట్లునిచి య ♦ న్యగ్రంథముల్ చూచినన్
మితియో మేరయొ యేమనన్ వలయు! స్వా ♦ మీ! వద్దు చాల్ చాల్ సర
స్వతికిన్ వాఁతలు పెట్టినట్లలరుఁ 'బా ♦ పం శాంత' మిప్పట్టునన్. 20

చ॥ యతులు వనాళిఁ, బ్రాసములు ♦ నాయుధశాలల, లక్షణంబు ల
క్ష్యతతి, రసంబు వైద్యుకడఁ; ♦ బాకము వంటలలోన, నయ్యలం
కృతులు పడంతులందు, మఱి ♦ రీతులు రోఁతల, శయ్య మేడ, ని
ట్లితికిన కావ్యముల్ గనిన ♦ నయ్య! యొడల్ దహియించినట్లగున్. 21

శా॥ ఈవిన్నాణము లెన్నియేని గల వా ♦ యీ యంశముల్ గొంత మే
లై వర్తించు ముసళ్లపండువది ముం ♦ దై యున్నదన్ మాడ్కిఁ జె
ల్వై విశ్వం బగలించుచున్నయది యా ♦ హా! గ్రాంథికగ్రామ్య భా
షావాదంబు క్షణక్షణంబునకు హె ♦ చ్చున్ జొచ్చె నీవేళలో. 22

గీ॥ దేశమంతటఁ బాఱు న ♦ దీమతల్లి వంటిదగు వ్యావహారిక ♦ భాష; దాని
నచ్చటచ్చట దేశంబు ♦ నలముకొనిన మంచియును జెడ్డయును నాశ్ర ♦ యించియుండు.

ఉ॥ ఊరకభాష కేమిటికి ♦ నుత్తమ సంస్థితి గల్గు! దాన సం
స్కారబలంబు గల్గి యధి ♦ కారము దాల్చిన ప్రాజ్ఞకోటి భా
షారచనంబుఁ బూని కృషి ♦ సల్పినఁ గల్గెడి; రిక్తులూనినన్
బారము ముట్టునే! గజము ♦ పైఁజవుడోలు ఖరంబు మోయునే! 23

క॥ అంతస్సారము లేక యవాంతరభాషలను గల్గు ♦ పదజాలములన్
దొంతరగఁ గలుప బాసయుఁ గంతులు గలవాని మేను ♦ కైవడిఁ బోలుచున్. 24

క॥ క్రమమునకు బాస లోనయి యిముడమి, బుధకోటులెల్ల ♦ 'నెవరికి వారే
యమునాతీరే' యనుగతి భ్రమగొని దెసలకును విఱిగి ♦ పారుదు రోకటన్ 25

ఆ॥ సరసశబ్ద మిట్టి ♦ సబ్బండు బాసలోఁ దక్కఁబోవ దింకఁ ♦ దమవి కొన్ని
తాళ్లపాకవారి ♦ తప్పులు మఱికొన్ని యనఁగఁ దప్పుఁగుప్ప ♦ లై రహించు. 26

ఉ॥ భావకవిత్వ మొక్కఁడట; ♦ భావములేని కవిత్వమింక నాం
ధ్రావనిఁగా దికేయవని ♦ నైనను గల్గునె! కల్గెనేని యా
ప్రోవు కవిత్వమంచు బుధ ♦ పుంగవు లెంతురె! యేటిమాటలో
భావ మభావమా కవిత ♦ ప్రాణములేని శవంబు గాదొకో! 27

ఉ॥ పేరెది యైననేమి మఱి ♦ పేరున యోగ్యత వచ్చునే! రసం
బూరెడునట్టి కైత మది ♦ యుత్తమ; మన్య మయోగ్య; మెల్లెడన్
సౌరభపూరముల్ దెసలఁ ♦ జల్లెడు తామరపూవుఁ జూచి యే
పేరునఁ బిల్చినన్ గుణము ♦ వీసము హెచ్చునో! లేక తగ్గునో! 28

గీ॥ అలరుఁదేనెల మఱపించు ♦ పలుకుఁబొందు, పలుకుఁబొందుకుఁ దగినట్టి ♦ భావపుష్టి,
భావపుష్టికిఁ దగు రస ♦ వైభవంబు, కూర్చు ధన్యుండె పో కవి ♦ కుంజరుండు 29

చ॥ పరువడిఁ బద్యకావ్యములు ♦ వ్రాయుట మోటదనంబటంట, నా
గరకత కెంతొ లోపమఁట, ♦ గద్యము గేయము సద్రసోత్తర

స్ఫురణను మించునంట, మఱి ♦ పొత్తము పెద్దదిగాఁగ నుండినన్
బరువఁట, చిన్నిపొత్తములు ♦ నాడెముఁ గూర్చునటంట, వింటివే. 29

సీ॥ భాషామహాదేవి ♦ వాహ్యాళి యొనరించు మానితనందనో ♦ ద్యానచయము!
సాహిత్యలక్ష్మి వి ♦ శ్రాంతికేర్పఱచిన హాటక వివిధ సౌ ♦ ధాగ్రతతులు!
బహుళవిద్యాధన ♦ ప్రకరంబు నింప దీపించు భాండాగార ♦ సంచయములు!
బాగోగు బోధించి ♦ ప్రజ నుద్ధరించెడు విజ్ఞానసర్వస్వ ♦ వేశ్మవితతి!
గీ॥ పద్యకావ్యసమూహ సౌ ♦ భాగ్యగరిమ మిట్టిదని వివరింపఁగా ♦ నెవ్వఁ డోపు!
లోకకల్యాణ విజయ సు ♦ శ్లోకదివ్య పారిజాత ప్రసూనైక ♦ హారసమితి. 30

గీ॥ ప్రకృతసారస్వతస్థితి ♦ వఱలు నిట్లు; మాటవరుస కంటిని గాక ♦ మనకు నేల
దానిఁ జర్చింప" ననుచు మం ♦ దస్మితంబుఁ గొలుపు నాతని వదన మేఁ ♦ గలయఁ జూచి,

గీ॥ "పూర్వకాలపుఁ బాండిత్య ♦ పుంబ్రశస్తి కావ్యముల యున్నతాదర్శ ♦ గౌరవంబు
కొఱతవడ నిష్టపడనట్టి ♦ గొప్పసుకవి వగుట నింతగఁ బరితాప ♦ మందె దీవు. 32

చ॥ తల కొకబుద్ధి, బుద్ధికిని ♦ దగ్గ తలంపు, తలంపులోపలన్
వెలువడు భిన్నభిన్నగతిఁ ♦ బెక్కులు యోజన, లింక నేగతిన్
బలువుర కైకమత్య మది ♦ పట్టు! స్వతంత్రత ముఖ్యదైవమై
నిలిచిన నేఁటికాలమున ♦ నీహితబోధ మెవండు చేకొనున్! 33

చ॥ తెలివిగలట్టి బాలుఁ డొక ♦ తీఱు పఠించుచు మాతృభాషలో
పలఁ దగుజ్ఞాన మొందెడు ప్ర ♦ బంధము లియ్యెడ నాలుగేనియున్
వెలువడ వెట్టిపాప మొకొ! ♦ నేర్పెడు విద్యయుఁ జూడ, నూటికిన్
నలువదికన్నఁ దక్కువ గు ♦ ణంబులు వచ్చిన వాఁడు నెగ్గెడిన్. 34

గీ॥ వాలి వాల్మీకి కేమికా ♦ వలయు ననుచుఁ! గైక కైకసి చెల్లెలు ♦ గాదె యనుచుఁ!
గర్ణుఁ డాకుంభకర్ణుని ♦ కడపటి కొడుకగుఁ గదా! యని యడుగు వి ♦ ద్యార్థులుంద్రు. 35

ఉ॥ క్రూరమృగంబు, వాడియగు ♦ కోఱలు, పెద్దది తోక, యాఫ్రికా
తీరవనంబులన్ దిరుగు, ♦ దీనిని మర్త్యులు పట్టలేరటం
చాఱవ "ఫారమున్" జదువు ♦ నర్భకుఁ డొక్కరుఁ డావిభీషణున్
గూరిచి వ్రాసె; నెట్టులు ♦ కనుంగొననేర్చెద విట్టిరోఁతలన్! 36

క॥ ఇది మొదటఁ జెప్పిన దున్నది; ప్రకృతము ననుసరింత; ♦ మస్మన్మనమం
దుదయించినట్టి కోరిక నిదె తెలిపెద నాలకింపు ♦ మీ! శ్రద్ధమెయిన్. 37

గీ॥ సప్తసంతానములఁ బ్రశ ♦ స్తమయి ఖిలముగాని ద్రాకకృతి యన్న స ♦ త్కవులమా
కలికి పదియాఱువన్నె బం ♦ గారుమూట రమ్యతరమైన రతనాల ♦ రాచబాట.

సీ॥ జ్ఞానంబునకు మూల ♦ సారమా నాత్మ కావ్యకవిత్వమని "వర్డ్సు ♦ వర్తు" నుడివె;
సత్యంబునకు సౌఖ్య ♦ సంగంబు చేకూర్పఁ జాలిన కళ యంచు ♦ "జాన్స" ననియె;
నతుల సంగీతర ♦ సాత్మకంబయిన భావాలాపమనుచుఁ "గా ♦ ర్లైలు" తెలిపెఁ;
బ్రతిభావిలాసంబు ♦ వాక్యదేహంబుఁ దాల్చిన రూపమనుచు 'షె ♦ ల్లీ' వచించె;

గీ॥ 'హడ్స' నాదిగ నెందఱో ♦ యాంగ్లకవులు పద్యకవితకుఁ గల గౌర ♦ వప్రశస్తి
యట్టిదిట్టి దనంగ రా ♦ దని సహస్ర ముఖముల నుతింప వినమొకో ♦ పూర్వమంతు.

గీ॥ దేశభక్తియుతంబు నీ ♦ తిప్రబోధకము ఘనాదర్శమగు పద్య ♦ కావ్యమొకఁడు
సరసజనములుమెచ్చ ర ♦ సంబు హెచ్చ సృష్టిసేయంగ నిపుడు యో ♦ జించుచుంటి

⊕ క॥ విరచించు నెడలఁ గల్పన పెరయకయును నతిశయోక్తి ♦ పెంపొందకయున్
జరిగినది జరిగినట్టులు మెఱయుటచే దేశచరిత ♦ మెప్పు వహించున్.

§ క॥ అదిగో కార్యావర్తము త్రిదశులకును బావనమగు ♦ దేశము; దానన్
బొదలెడు నృపులు మహేంద్రుని మదిమెచ్చరు పుణ్యవిభవ ♦ మాన్యతలందున్.

---

⊕ Is it to be imagined that a nation so highly civilized as the Hindu amongst whom, the exact sciences, flourished in perfection, by whom, the fi[ne] arts, architecture, scripture, poetry, music, were, not only cultivated but taug[ht] and defined, by the nicest and most elaborate rules, were totally unacquainte[d] with the simple art of recording the events of their history, the charactors of the[ir] princes and the acts of their reigns. Where such traces of mind exist, we ca[n] hardly believe that there was a want of competent recorders of events, whic[h] synchronical authorities tell us were worthy of commemoration. The cities [of] Hastinapoor and Indraprastha, of Anhulwara and Somanath, the triumph[al] columns of Delhi and Chittoor, the shrines of Aboo and Girnar, the cave templ[es] of Elephanta and Ellora. are so many attestations of the same fact. Nor can w[e] imagine that the age in which these works were erected, was, without a historian. In the heroic history of Prithwi Raj, the last of the Hindu sovereign[s] of Delhi, written by his bard Chund, we find notices, which authorise th[e] inference that works similar to his own, were then extant, relating to the peric[d] between Mahammad and Shahbuddin (A. D. 1000-1193) but these have disappeare[d].

"Annals & Antiquities of Rajasthan."

§ The splendour of the Rajput states however at an early period of th[e] history of that country, making every allowance for the exaggeration of the bar[d] must have been great. Northern India, was rich from the earliest times, tha

§ సీ॥ మేవాడరాజ్య ల ♦ క్ష్మీ పదాంభోజాత ములను గొల్చిన ద త్త ♦ పుత్రకుండు!
బాలగోవింద వి ♦ ప్రస్వామి శిష్యుఁడై తవిలి మ్రొక్కిన మేటి ♦ ధర్మమూర్తి!
స్వర్ణరక్షాబంధ ♦ బద్ధుఁడై బూందీమహారాజ్ఞి సేవించు ♦ ననుఁగుదమ్ముఁ!
డఖిలప్రజాగణం ♦ బభినుతుల్ గావించు రామసింహుని రాజ ♦ రక్షకుండు!
గీ॥ తీవ్రరుజ పెచ్చుపెరిగి బా♦ధించుచున్నఁ ద్రుటియు మేవాడ విడఁబోని♦దొడ్డమగఁడు!
భరతఖండాభిమాని స ♦ త్ప్రభువతంస మాత్తమణి టాడ్డుదొర నిత్య ♦ మభినుతింతు.

మ॥ సరసాగ్రేసర చక్రవర్తియును నా ♦ 'స్కాట్లండు' సంవాసియుఁ
వరకారుణ్య రసార్ద్ర మానసుఁడు క ♦ ర్నల్ జేమ్సు టాడ్పండితుం
డిరవై రెండగు నేండ్లు హైందవమునం ♦ దింపార నుద్యోగియై
చరియించెఁ గిరులుఁ బురంబులును రా ♦ జస్థానదేశమ్మునన్. 43

---

portion of it situated on either side the Indus, formed the richest satraphy of Darius. It has abounded in the more striking events which constitute the materials for history. There is not a petty state in Rajasthan that has not had its Thermopylae or scarcely a city that has not produced its Leonidos. But the mantle of ages, has shrouded from view what the magic pen of the historian might have consecrated to endless admiration; Somanath might have rivalled Delphos; the spoils of Hind might have vied with the wealth of the Lybian King; and compared with the array of the Pandus, the army of Xerxes would have dwindled into insignificance. But the Hindus either never had or have unfortunately lost their Herodotus and Xenophon. If the moral effect of History depends on the sympathy it excites, the annals of these states possess commanding interest. The struggle of a brave people for independence, during a series of ages, sacrificing whatever was dear to them for the maintainance of the religion of their forefathers and sturdily defending to death, and in spite of every temptation, their rights and natural liberty, form a picture which it is difficult to contemplate without emotion. Could I impart to the reader but a small portion of the enthusiastic delight with which I have listened to the tales of times that are past amid scenes where these events occured, I should not dispair of triumphing over the apathy which dooms to neglect almost every effort to enlighten my native country on the subject of India. "Colonel James Tod."

§ There is something magical in absence, it throws a deceitful medium between us and the objects we have quitted, which exaggerates their amiable qualities and curtails the proportions of their vices. I look upon Mewar as the land of my adoption and linked with it, the associations of my early hopes and their actual realisation, I feel inclined to explain with reference to her and her unmanageable children. "Mewar! with all they faults, I love thee still."

§ ఉ॥ వీరరసార్ద్రిమా కథలు ♦ వీనులు సోఁక నమస్కరించి పూ
జారతి వీరులన్ గొలుచు ♦ సజ్జనుఁడౌటను రాజపుత్ర ధా
త్రీరమణాళి సత్కథలు ♦ కేయుఁబవల్ గడియించి యాంగ్లభా
షా రమణీయకావ్యముగ ♦ శ్రద్ధమెయిన్ రచియించె నాతఁడున్. 42

❁ సీ॥ సర్వసన్నుతము రా ♦ జస్థానదేశంబు మాతృదేశము మించి ♦ మహితభక్తిఁ
గొలిచి తద్దేశ వా ♦ సుల బాధువులపోల్కిఁ బ్రేమించుటను జేసి ♦ పృథ్వీజనులు

---

I dipped the middle finger of my right hand and made the tilac on his head. I then girt him with the sword and congratulated him in the name of my government, declaring aloud that the British government would never cease to feel a deep interest in all that concerned the welfare of Boondi and the young prince's family.

The mother of the young prince sent me by the hands of the family priest the bracelet of adoption as her brother, which made my young ward, henceforth my bhanji or nephew.

§ His annals of Rajasthan show the result of his administration as restorer of Rajputana. The people were deeply attached to him as Heber continues to observe "His name appears to be held in a degree of affection and respect by all the upper and middling classes of society, highly honourable to him." Speaking of Bhilwara which Tod had almost recreated, he says "It ought to be called Todgunge but there is no need, for, we shall never forget him." The fact is, that the place was called Todgunge but the name was withdrawn at the instance of Tod himself. In the year 1822 after two and twenty years of service, eighteen of them spent among the Rajaputs of Western India and five as Political agent, Colonel Tod's shattered health called upon him imperatively to suspend his toils and quit the climate of India. But the ruling passion forbade him to proceed direct to the port of embarkation. In 1819, he had completed the circuit of Marwar, visiting, its capital, Jodhpur [via] Kumbhalmere thence returning by Mairtra and Ajmir to Udaipur Next year, he visited Kotah and Boondi the latter of which he revisited in 1821 having received the intelligence of the death of his friend the 'Rao Raja Ram Singh,' who had left Colonel Tod guardian of his infant son, the prince of Haras. He returned to Udaipur in March 1822 and took final leave of the valley in June of that year. He procceded across the Aravali to Mount Aboo and inspected the wonders of that sacred place——and embarked for England at Bombay in the early part of 1823.

❁ The religious feelings of the Rajput will not permit him to see the axe applied to the noble peepul or unbrageous burr (ficus indica) without execrating the destroyer. Unhappy the constitution of mind which knowingly wounds religious prejudices of such ancient date. Yet, is it thus with our countrymen in the East, who treat all foreign prejudices with contempt, shoot the bird sacred to

పాశ్చాత్యుఁడైన నె ♦ ప్పటికి టాడ్డొర రాజ పుత్రుఁడే యనుచు స ♦ మ్మోదమందెఁ;
రతఁడును రాజపు ♦ త్రావనికొఱకుఁ బ్రాణములైన నిచ్చు చం ♦ దమున మెలఁగె;
గీ॥ నమ్మహాత్ముఁడు వ్రాయు గ్రం ♦ థమ్మునందు వీరరసతరంగములతో ♦ క్షీరజలధి
కరణి మాధుర్యములు పెంచు ♦ చరితలెన్నొ కలవు కలవారియిండ్ల బం ♦ గారమట్లు. 43
శా॥ ఆ కర్ణద్వయపావనంబగు చరి ♦ త్రాంశంబు లందెల్లఁ గ
న్గానై దివ్యరసాలవాలమయి స ♦ త్యన్యాయ సంపూరితం
బై కన్పట్టెడి నాపవిత్రపు చరితం! ♦ బద్దాని నే గోస్తనీ
పాకంబొప్పఁగ నొక్క దొడ్డకృతిగా ♦ వ్రాయన్ బ్రయత్నించెదన్." 44
మ॥ అన "నీమాటలు వేదవాక్యము; లవ ♦ శ్యంబిప్డు రాణాపవిత్రా
పుని గీర్తింపు; మతండు వీరజనతా ♦ పూర్వాభిగణ్యుండు; క
మ్మని నీకైతకు నమ్మహాప్రభుని థ ♦ ర్మ శ్రీరతుల్ హాటకం
బునకున్ సౌరభపూరముల్ గలుపు సొం ♦ పున్ గాంచి వాసిన్ గనున్." 45

---

the Indian Mars, slay the calves of the Bal and fell the noble peepul before the eyes of the native without remorse. He is unphilosophic, and unwise who treats such prejudices with contumely, prejudices beyond the reach of reason. He is uncharitable who does not respect them; unpolitic who does not use every means to prevant such offence by ignorance or levity. It is an abuse of our strength and our ungenerous advantage, over their weakness. Let us recollect who are the guardians of these fanes of Bal, his Peepul and sacred bird (peacock) the children of Surya and Chandra and the descendants of the sages of yore; they, who fill the ranks of our army and are attentive though silent observers of all our actions, the most attached, the most faithful and the most obedient of mankind. Let us maintain them in duty obedience and attachment by respecting their prejudices and conciliating their pride. On the fulfilment of this, depends the maintenance of our sovereignty in India. But the last fifteen years have assuredly not increased theair devotion. Let the question be put to the unprejudiced whether their welfare has advanced in proportion to the dominion they have conquered for us, or, if it has not been in the inverse ratio of this prosperity. Have not their allowances and comforts decreased?.......................

For the good of the ruler and servant, let these be rectified. With the utmost solemnity I aver, I have but the welfare of all at heart in these observations. I loved the service. I loved the native soldier. I have proved what he will do, where devoted, when, in 1817, twenty two fire locks of my guard, attacked defeated and dispersed a camp of fifteen hundred men slaying thrice their numbers. Having quitted the scene for ever, I submit my opinion dispassionately for the welfare of the one and with it, the stability or reverse of the other. "Tod."

క॥ అని ప్రోత్సహించుమతి నని మెను వెంకటశేషశాస్త్రి; ♦ యేసంతఁ బ్రతా
పుని చరిత కావ్యరూపముగను వెలయింపంగ వ్రాయఁ ♦ గా మొదలిడితిన్.

క॥ ఉత్తమ మితివృత్తము! సముదాత్తము చిత్తూరుపురి! ప్ర ♦ తాపుఁడు ధీరో
దాత్తుఁడు! కైతము మెత్తని! దిత్తఱి నెత్తురని తలఁతు ♦ నెల్లబుధేంద్రుల్.

శా॥ నా ధారాళ కవిత్వమందుఁ గల వి ♦ న్నాణంబు లట్లుండ, నీ
గాథల్ కర్ణయుగంబుఁ బట్టుకొని యూ ♦ కర్షించు లోకంబు; వి
ద్యాధుర్యుల్ విని చిత్తు బుస్సనక యా ♦ హ్లాదింత్రు; విశ్వైక కీ
ర్త్యాధారంబులు రాజపుత్రనృప శౌ ♦ ర్యావార్య హేలాకళల్.

శా॥ ఈపాత్తంబునఁ గొంచెమేనియు గుణం ♦ బెందేనిఁ బొపొంద శ్లా
ఘాపీఠంబది 'జేమ్సుటాడ్డు' దని లో ♦ కంబెంచి హర్షించుఁగా!
కేపట్టైన వికాసమూడి రసమొం ♦ తేఁ దక్కువైయున్న నా
లోపంబంతయు నాదిగాఁ దలఁపఁ గై ♦ లుగ్ మోడ్చి ప్రార్థించెదన్.

మ॥ వినమే మున్ను ప్రతాపునంతటి మహా ♦ వీరుండు లోకంబునన్
గనుపింపఁడని పూజ్యులెల్లఁ బలుకం ♦ గా; నట్టి రాణాప్రతా
పుని గీర్తించెడుపట్ల నెట్లు కవనం ♦ బున్ సాఁగఁగాఁ జేతువో
నిను సేవింతు విరించిరాణి! సుమహా ♦ ణీ! వాణి! నన్నోమవే.

సీ॥ రచియించియుంటి వీ ♦ రమతీచరిత్రంబుఁ దిరుపతివెంకటే ♦ శ్వరులు మెచ్చఁ!
గృతియొనర్చితిఁ జండ ♦ నృపమాళికథ దేశచరితముల్ శోధించి ♦ సరసు లలరఁ!
దగఁగూర్చియుంటిఁ బ ♦ ద్మావతీవిజయంబు వీరంబు హాస్యంబు ♦ వెల్లి విరియ!
వ్రాసియుంటి సమగ్ర ♦ రామాయణము నాటకములుగా విబుధలో ♦ కములు పొగడ!

గీ॥ నిన్ని యొకయెత్తు! మఱి ప్రతా♦పేంద్రుచరిత మొక్కయెత్తు! సుధారసం♦బొలుకు చుం
నొక్కచూపెక్కుడుగఁ జూచి ♦ యుద్ధరింపు శైలరాజేంద్రకన్య! సా ♦ జన్యధన్య! 5

మ॥ జననం బందిన దాది యేఁడునెల ల ♦ స్మద్గేహసీమన్ వినూ
తన కల్యాణ దరస్మితప్రభలు ని ♦ త్యంబున్ బ్రసాదించి దే
వుని సాన్నిధ్యముఁ జేరఁగాఁ జనిన మ ♦ త్పుత్రుండు కామేశ్వర
య్యను మత్ప్రాణసమాను నేఁదలఁతు లో ♦ కాహ్లాది సద్విగ్రహున్.

చ॥ కుదురగు ప్రేమ నొక్కలత ♦ కూనను గాచితిఁ జైత్రవేళ; న
య్యది తొడిగెన్ హొయల్ గులుకు ♦ నక్కలి మొగ్గను; దానిఁ గాంచి నా

యెద మొలిచెఁ మనోరథము ♦ లెన్నియొ; గాలికి నూడి దేవి శ్రీ
పదముల రాలె మొగ్గ! యది ♦ వంద్యమె, తజ్జని ధన్యమౌటచే. 53

ఆ॥ పూర్ణచంద్ర మూర్తి ♦ పుత్రుఁ డుద్భవమొంద నమరులైన వలవ ♦ దనరు సరియె!
యిచ్చినట్టి దేవుఁ ♦ డెత్తి కొంపోయినఁ బోగుల నేల! వగపు ♦ మిగుల నేల! 54

గీ॥ అవగుణంబులు మిగుల మా ♦ యందుఁ జేసి సుగుణములను వేయంత లె ♦ చ్చుగనుజేసి
ప్రణయరతులైన నరుల దే ♦ వతలఁజేతు వో వియోగమ! నీవృత్త ♦ ముత్తమంబు. 55

మ॥ జననీ! నీవు దయాసముద్రమవు! యు ♦ ష్మద్భక్తు నేవేళలం
దున నేరీతిని గష్టసౌఖ్యముల యం ♦ దుఁ దేల్పఁగానుండు వా
పనులన్ నీవయి తీర్పఁగా ననుభవిం ♦ పన్ వంతగున్ గాక! వ
ల్లన నే నెంతటివాఁడ! నాకెపుడు నీ ♦ యాజ్ఞల్ శిరోధార్యముల్. 56

సీ॥ స్థిరమగు వానిలో ♦ స్థిరతమంబగు చోటఁ! జిరపుణ్యరతులు వ ♦ సించు చోట!
నాశమెప్పుడును గ ♦ నంగఁ బోవని చోట! నానందనిలయమై ♦ యలరు చోట!
వ్యాధులించుకయును ♦ బాధ సేయని చోట! సత్యంబు స్థాయిగా ♦ జరుగు చోటఁ!
కైవల్యలక్ష్మికిఁ ♦ గాపురంబగు చోటఁ! జిత్తంబునకు శాంతి ♦ చెడని చోటఁ!
గీ॥ ప్రేమ యమృతరూపమున వ ♦ ర్షించు చోట! నామణిద్వీప రత్న సిం ♦ హాసనమున!
శ్రీభవానీపదంబుఁ జే ♦ రితివి! గాన నేల నీకయి వగవఁ! గా ♦ మేశ్వరయ్య! 57

గీ॥ జర నమలుచున్న యస్థిపం ♦ జరము నాది! యింక సుఖమొందఁ గల యాస ♦ లెందు లేవు;
మధుర దరహాస వదన ప ♦ ద్మంబు నీది మఱచిపోవుద మన్నను ♦ మఱపు రాదు.

సీ॥ కలశపాథోరాశి ♦ గర్భమందు జనించు నలల బంగారు టు ♦ య్యాల లందు!
నలచతుర్దశలోక ♦ ములను బావనమాచుఁ దనరు మణిద్వీప ♦ తటము లందు!
గొడుగులు వంచిన ♦ ట్లడరు కదంబ వృక్ష వితాన శీతల ♦ చ్ఛాయ లందుఁ!
శ్రీలఁ జెన్నారెడి ♦ చింతామణీ భద్ర సింహాసనము పార్శ్వ ♦ సీమ లందుఁ!
ఆ॥ బాలకదలి చలువఁ ♦ దేలు తెమ్మెరలందు! నీడు లేని పసిఁడి ♦ మేడ లందు!
గౌరి లోకజనని ♦ కామేశ్వరస్వామిఁ ద్రిప్పి కూర్మి నాద ♦ రించుఁ గాక! 59

క॥ ఈమహనీయ గ్రంథముఁ గైమోడ్చుచు నంకితమ్ము ♦ గా నిచ్చెద నే
ప్రేమఁ బెనుప నోచని నా కామేశ్వరు నెత్తి పెంచు ♦ కామేశ్వరికిన్. 60

డి. రాజశేఖరం.

శ్రీ

కామేశ్వర్యై నమః.

# రాణాప్రతాపసింహచరిత్ర.

## ప్రథమాశ్వాసము.



మత్కందుకమట్లు గుండ్రమయి వా ♦ రిన్ రెండుపా ళ్లోకపాల్
భూమిన్ నిండియు నూఱునర్వదియుఁ గో ♦ ట్లున్ మర్త్యులొప్పారఁగా,
వ్యోమంబంటు నగాధిరాజ నివహం ♦ బుల్ మీఱఁ, విశ్వంబు శో
భామూల్యస్థితి నొప్పు నీశ్వరు సనం ♦ తైశ్వర్యముల్ చాటుచున్.

సీ॥ కాంచన శృంగ భా ♦ గము కిరీటముగాఁగఁ! గాశ్మీర మాస్య పం ♦ కజము గాఁగ!
సింధుగంగానదుల్ ♦ చేఁదోయి గాఁగ! నార్యావర్తదేశం బు ♦ రంబు గాఁగ!
వింధ్యాచలేంద్రంబు ♦ బెడఁగు మధ్యము గాఁగ! గౌతమి కనక మే ♦ ఖలయుఁ గాఁగ!
మలయసహ్యాద్రు ల ♦ ఙ్ఘ్రులు గాఁగ! సింహళద్వీప మంభోరుహ ♦ పీఠి గాఁగ!
గీ॥ లవణ రత్నాకరము సరః ♦ ప్రవరమగుచుఁ జెలఁగు భారతదేశ ల ♦ క్ష్మి సమగ్ర
భాగ్య సౌభాగ్య విగ్రహ ♦ ప్రాభవమ్ము లిట్టివని వివరింపఁగా ♦ నెవరి తరము! 2

శా॥ జానొందన్ బహుళాంబు పూరము వనా ♦ శాశంబళల్ నింప, స
స్యానీకంబు సమృద్ధమై యెదిగి భా ♦ గ్యస్ఫూర్తి హెచ్చింప, ల
క్ష్మి నిత్యోత్సవ మందిరంబయి తన ♦ ర్చిన్ విశ్వ సర్వోన్నత
స్థానం బంది సమస్త వైఖరుల రా ♦ జస్థాన మవ్వేళలో. 3

సీ॥ ఇట్టి రాజస్థాన ♦ మెపుడు స్వతంత్రులౌ జనపాలమణుల పా ♦ లనము నొందు
దేశంబు లిరువది ♦ దీపింప వెలుగొందు; వానిలో నెల్ల మే ♦ వాడ దేశ
మగ్రగణ్యము; దాని ♦ యధిపతి యగువాని 'రాణా' యని జనులు ♦ ప్రస్తుతింతు;
రతఁడు మతాధిప ♦ త్యమున నెల్లరకు జగద్గురుండగుచు వి ♦ ఖ్యాతిఁ గాంచు;
గీ॥ నగరములలోనఁ గాశికా ♦ నగర మట్లు చిరయశము గాంచుఁ జిత్తూరు ♦ పురవరంబు;
నచటి రాణాయు నందఱ ♦ నగ్రపూజ్యుఁ! డెల్ల సురలందుఁ గాశి వి ♦ శ్వేశు మాడ్కి. 4

§ సీ॥ హారావళీ పర్వ ♦ తావళి విరివిగా నింద్ర నీల శిలల ♦ నీను చుండ!
సాంబారు లూనీ వి ♦ శాల ప్రదేశముల్ సహజమౌ లవణం బొ ♦ సంగు చుండ!
గను లెల్లెడల మర ♦ కతములు రత్నముల్ సౌవీరమును మంచి ♦ స్ఫటికములును
జంద్రకాంతశిలలు ♦ స్వర్ణ రౌప్యంబులు నెడతెగకయు యెప్పు ♦ డిచ్చు చుండ!
గీ॥ భాగ్యము లొసంగి యేలిన♦వారి యిండ్లు బంగరుఁ గొండలట్లు సే♦యుఁగఁ గలిగి.
'రత్నగర్భ' యటన్న సా ♦ ర్థకపదంబుఁ బడసి మేవాడదేశంబు ♦ పరిఢవిల్లు. 5
శా॥ ఆవిశ్వోన్నత పుణ్య వైభవ యశో ♦ హారాళి హారావళీ
గ్రామోత్తంసము తూర్పునఁ సరసిజా ♦ రామంబునఁ బొల్చు ల
క్ష్మీవాసంబలె రాజధానియగుచుఁ ♦ జిత్తూర్పురం బొప్పఁగా
మేవాడ్ దేశము వీరఖండమగుచుఁ ♦ మించుఁ ధరాస్వర్గమై. 6
❀ సీ॥ సచరాచర ప్రపం ♦ చప్రాణమగు సూర్యభగవానుఁ డాదిమ ♦ వంశకర్త!
త్రిజగతీ ధానుష్క ♦ దీపకుండయిన రాముని సుతుండు లవుండు ♦ మూలపురుషుఁ!

---

§ The tin mines of Mewar were once very productive and yielded, it is asserted, no inconsiderable portion of silver, but the caste of miners is extinct, and political reasons, during the Mogul domination led to the concealment of such sources of wealth. Copper of a very fine description is like wise abundant and supplies the currency. Soorma or oxide of antimony is found on the western frontier. The garnet amethystine quartz, rock crystal, the chrysolite and inferior kinds of emerald family are all to be found within Mewar, and though I have seen no specimens decidedly valuable, the Rana has often told me that according to tradition his native hills contained every species of mineral wealth.

Such the pride of these small Kingdoms in days of yore and such their resources, till reduced by constant oppression. But their public works speak what they could do and what they have done; witness the stupenduous work of marble and its adjacent causeway, which dams the lake of Raysumund at Kankarowli and which cost upwards of a million. When the spectator views this expanse of water this (Royal sea) on the borders of the plain; the pillar of Victory towering over the plains of Malva, erected on the summit of Chittor by Rana Mokul, their palaces and temples in this ancient abode, the regal residence erected by these Princes when ejected, must fill the observer with astonishment at the resources of the state. They are such as to explain the metaphor of my ancient friend Zalim Singh, who knew better than we, the value of the country; 'every pinch of the soil of Mewar contains gold.' "Annals of Mewar."

❀ These are styled 'Ranas' and are the elder branch of Sooryavansi or 'Children of the Sun.' The Hindu tribes yield unanimous suffrage to the prince of Mewar as the legitimate heir to the throne of Rama and style him 'Hindua

డల యగస్త్యాశ్రమ ♦ ఖ్యాత మాంబూగిరి నేకలింగేశ్వరుం ♦ డిష్టదైవ!
మతిపావనము లయో ♦ ధ్యావల్లభీ సీమ లాదికాలము నాఁటి ♦ యాటపట్లు!

గీ॥ లాశిలాదిత్య కనకసే ♦ నాది రాజ రాజ పరమేశ రణ విహా ♦ ర ప్రతిష్ఠ
ఖండఖండాంత నగర వి ♦ ఖ్యాతిహేతు వట్టి మేవాణ్ణృపుల నెన్న ♦ నలవి యగునె! 7

మ॥ సమమై యొప్పు విశాల శైల శిఖర ♦ స్థానంబునన్ రాజపు
త్రమహీకాంతకు వజ్రభూషణమటుల్ ♦ రాణించుఁ జిత్తూరు సం
ద్రముమధ్యంబునఁ గోటలేదు కౌమరాం ♦ దన్ బైకిఁ గన్పట్టు దు
ర్గమ లంకాపుర పూర్వవైభవము జో ♦ కల్ జప్తికిన్ దెచ్చుచున్. 8

గీ॥ ప్రక్కప్రక్కనఁ బదిబంద్లు ♦ వరుస గాఁగ నరుగ ననువైన వైశాల్య ♦ మతిశయిల్ల
నహిత దుర్భేదమగు గోడ ♦ లలరు కోట లేడుచుట్లు చిత్తూర్పురి ♦ కెసఁగి యుండు. 9

* సీ॥ విపణిమార్గములతో! ♦ వీధుల తుద నొప్పు శివకేశవాలయ ♦ శ్రేణి తోడ!
నారామములతోడ! ♦ నపరంజి దాఁపిన సముదార భవనాంగ ♦ ణముల తోడఁ!
జతురంగములతోడ! ♦ నతివిశాలంబైన వివిధాయుధాగార ♦ వితతి తోడ!
మణివిచిత్రకలతో! ♦ మధుర నానాజాతి ఫలమహీరుహ కదం ♦ బకము తోడ!

గీ॥ సౌధముల తోడ! బహుసర ♦ స్సమితి తోడ! రచ్చగమి తోడ! వారి యం ♦ త్రముల తోడ!
భరత ఖండైక లక్ష్మిని ♦ వాసభూమి నగరమాత్రంబె చిత్తూరు ♦ నగర వరము!

---

Soorag' or Sun of the Hindus. He is universally allowed to be the first of the 'thirty six royal tribes,' nor has a doubt been raised respecting his purity of descent.

(Succeed) "Annals of Mewar."

It is well known that the Rajas of Udaipur are exalted over all the princes of Hind. Other Hindu princes before they can succeed to the throne of their fathers must receive the Khuska or tilac of regality and investiture from them. This type of sovereignty is received with humility and veneration.

"Lakshmi Narayana Shufeek Arangabad."

* Chittor is within the grasp of no foe, nor can the vassals of its chief know the sentiments of fear. Its towers of defence are planted on the rock nor can their inmates even in sleep know alarm. Its kotars are well filled and its reservoirs, fountains, and wells are overflowing. There are eighty four bazars many schools for children and colleges for every kind of learning, many scribes of the Beedur tribe and the eighteen varieties of artisans. Of all, the Ghelote, is the sovereign, served by numerous troops both horse and foot and by all the thirty six tribes of Rajputs of which he is the ornament. Of all the royal abodes of India none could

మ॥ వనితాశీలము నిల్ప శత్రువులఁ ద్రుం ♦ పఁగ నేఁడు చిత్తూరు ద
ప్పిన నీలోకము శూన్యమంచుఁ గరముల్ ♦ వేయెత్తి ఘోషించెనో
యన సూర్యధ్వజకోటు లెల్లెడ సహా ♦ స్రాంశుల్ పిసాళించి న
ర్తనమాడున్ మృదులానిలంబు తమమిఁ ♦ దగ్గ్నోక హేలాగతిన్. 11

సీ॥ నవ్వనేర్వకమున్నె ♦ క్రొవ్విన రిపుకోటిఁ బాఱఁగఁ దోలి న ♦ వ్వంగ నేర్తు!
కూర్చుండుటకుమున్నె ♦ క్రోధోగ్ర శత్రు వక్షో దేశమెక్కి కూ ♦ ర్చుండ నేర్తు!
నడువకమున్నె చం ♦ డ విపక్ష మకుట సంతతులఁ బాదము లుంచి ♦ నడువనేర్తు!
పరువులెత్తకమున్నె ♦ పరిపంథితతి నొంచి తఱుముచు వెనువెంటఁ ♦ బఱువనేర్తు!
గీ॥ రాడుటకుమున్నె ఘోర ర ♦ ణాంగణముల నరిశిరంబులతో బంతు ♦ లాడ నేర్తు!
కార! చిత్తూర్పురి జనించి ♦ నట్టివారు శైశవము దాఁటుటకు మున్నె ♦ శౌర్యమహిమ!

శా॥ ఇంద్రప్రస్థము గాదు! ద్వారకయుఁ గా! ♦ దే కాశియున్ గాదు! ని
స్తంద్రి ప్రాభవ కీర్తి శోభిత మయో ♦ ధ్యా పట్టణంబేని గా!
దింద్రోపేంద్రసమానులౌ నృపులు తా ♦ మేలంగఁ జిత్తూర్ మహా
సాంద్ర శ్రీలను గుత్తకున్ గొనిన యా ♦ చందంబు దీపించెడున్. 13

సీ॥ హారీత హాసీంద్రు పా ♦ దాబ్జాతయుగళికి శిష్యుఁడై శుశ్రూష ♦ చేయఁగలిగె!
ప్రాఘ్యశైలంబు తా♦పసు కూర్మిఁగని ద్విధారా ఖడ్గమును బొంది ♦ రాణ మెఱసెఁ!
బ్రబురుల గెల్చి 'భా ♦ రత సూర్యుఁ'డనియు 'విశ్వపతి' యనియుఁ గీర్తి ♦ పడయఁగలిగె!
'ఖాండహారిస్పహాన్' ♦ 'కాఫరి' స్థానాది మ్లేచ్ఛ సీమల గెల్చి ♦ మెప్పుగాంచె!
గీ॥ వందలకుఁబైనఁ బుత్రులఁ ♦ బడసి సూర్యవంశమును నిల్పి సౌపర్వ ♦ పర్వతమునఁ
దపము గావించి ముక్తికాం ♦ తను వరించె! 'బప్పరావు' మేవాడ్భూప ♦ వంశకర్త. 14

సీ॥ తమ యుపనదుల సం ♦ తతులెల్ల వెండిరేకులు వోలె నెల్లెడ ♦ నలము కొనఁగ,
జహ్నుకన్యా సింధు ♦ సలిల పూరమ్ములు సారతఁ గూర్చ, బం ♦ గారు పండు
రసఖండమై, పచ్చ ♦ రా బయలుల మాడ్కి లలిత సస్య శ్యామ ♦ లంబు నగుచుఁ,
బిడికెడు చోటైన ♦ వెలిఁబోవ నట్టి యార్యావర్త బహుళ భా ♦ గ్యాంక కథలఁ,

compete with Chittor before she became a widow. ... ... ... Near the temples are two reservoirs built of large blocks each one hundred and twenty five feet by fifty feet wide and fifty deep, said to have been excavated on the marriage of the "Ruby of Mewar" to Achil Keechie of Gogrown and filled with oil and ghee which were served out to the numerous attendants on that occasion.

"Tods' Rajasthan Vol. II"

గీ॥ చెవులు చిల్లులుపోఁ బార ♦ సీక యవన ఖాండహా రిస్పహాను బా ♦ గ్దాదు మొగలు
గజ్నిపతులు మిడుతదండు ♦ క్రమ్మినట్లు దాడివెడలిరి తండోప ♦ తండములుగ. 15

గీ॥ ఎనిమిదవ శతాబ్దారంభ ♦ మునఁ గలీఫు 'వాలిదు' తొలుత ఖాసిముఁ ♦ బంపె; నతఁడు
సింధుదేశమ్ము దాఁటి కా ♦ శీపురంబువఱకుఁగల సీమలన్నియుఁ ♦ బాడు చేసె. 16

మ॥ ఒకబాగ్దాదు నరేంద్రచంద్రుఁడు "కలీప్ ♦ ఓమార్ "అబుల్‌హాసు సే
నకధీశున్ బొనరించి హైందవముపై ♦ నన్ బంపఁగా దూరమొం
చకయే యావడ యడ్డుగా నడిచి రా ♦ జస్థానమున్ జేరి భూ
పకులారణ్యములన్ దహించె నతఁడున్ ♦ వైశ్వానరప్రక్రియన్. 17

గీ॥ అతని నజమీరు'తారాగ్ర ♦ హా'ధిపతియుఁ దొడరిమడిసె దూలారావు! ♦ కొడుకుసప్త
వర్షముల లాటుఁ డరిఁగూల్చి ♦ వానివెంట నరిగె నభిమన్యుపై చేయి ♦ యన జగంబు.

సీ॥ లాటసింహుఁడు మహా ♦ గ్రాటోపనిధియంచు నజరామరంబైన ♦ యశముఁగాంచెఁ;
జోహాణు లా బాల ♦ శూరుని విగ్రహంబులు రచింపించి దే ♦ వుని విధానఁ
బ్రతివత్సరము భక్తి ♦ వఱల జ్యేష్ఠద్వాదశీదినమందుఁ బూ ♦ జించు చుందు;
రాలాటుఁ డనిచేయు ♦ నపు డున్న కాలిగజ్జెల నెల్లజనులు ద ♦ క్కించిపోదు;
ఆ॥ రాదినంబునుండి ♦ యీదినంబునకుఁ జోహాణకులంబువార ♦ లాత్మజులకుఁ
గాలిగజ్జియలను ♦ గట్టరు; లాటునియెడల వారిభక్తి ♦ యెట్టి దొక్కొ! 19

సీ॥ భాగ్యసౌభాగ్య సం ♦ భావ్యముల్ సింధుఘూర్జరదేశములను వ ♦ ర్తకముపెంప
'టైగ్రిస్'నదీ కృపీ ♦ టపవిత్రమైన 'యరాబియా'పాలించు ♦ రాజలోక
మణి కలీప్ ఉస్మాను, ♦ మఱి కలీప్ ఆలి, యేజీదు ఖొరాసాను ♦ క్షితిపవరాళి,
యబ్దుల్‌మలీకు సై ♦ న్యసముద్రములను బొంగించి హైందవమును ♦ ముంచి తేల్చె;
గీ॥ రటుపయిని "హారూన్ ఆల్‌రాష్చి ♦ దను కలీప్ అరాబియా మొదల్ కాశిప ♦ ర్యంత మేలె;
నవ్వల "సెబాక్టజిను" వచ్చె! ♦ నతఁడు ప్రళయభైరవుని మహమ్మదుఁ దెచ్చె ♦ వానికొడుకు.

మ॥ తడవింతేనియులేక వీరభటసం ♦ తానంబు తన్గొల్చి వెం
బడిరా సింధునదిన్ దరించుచు మహ ♦ మ్మద్‌గజ్ని గజ్నీవిభుం
డడువుల్ గాల్చుచు భస్మమున్ సలుపు దా ♦ వాగ్ని క్రియన్ బొంగుచున్
దుడిచెన్ భారతదేశ పట్టణము లం ♦ దున్ గల్గు సర్వస్వమున్. 21

మ॥ కడుసౌభాగ్యము గల్గు రాష్ట్రముల వం ♦ కన్ సుంత కన్నెత్తి చూ
డఁడు; బంగారము పండు నేలలను జూ ♦ డం డట్టె పేర్వాసిగాం

చెడు దేవాలయలింగముల్ పెటికి గ ♦ జ్జీనిసౌధసందోహ మె
క్కెడు సోపానచయంబుఁ చేసె విహితుల్ ♦ కీర్తింప వేభంగులన్. 22

మ॥ అనయోత్సాహముతో మహమ్మదు చలం ♦ బారంగ సౌరాష్ట్రమం
దున విచ్ఛేయుచు సోమనాథపురమం ♦ దున్ సోమనాథేశ్వరా
దినిలింప ప్రకర ప్రపూజ్యమగు జ్యో ♦ తిర్లింగ సంఘాతమున్
దునియల్ చేయుచు ద్రవ్యరాసులను దొం ♦ తుల్ దొంతులున్ జేకొనెన్. 23

సీ॥ భువనవీరసమూహ ♦ మున మేటి యితఁడంచు యశమొందఁగనిన మ ♦ హాభుజుండు!
కొండపల్లెను మార్చి ♦ గొప్పసామ్రాజ్యసంస్థగఁ జేయు రాజతం ♦ త్రజ్ఞమౌళి!
కన్నకొడుకునైనఁ ♦ గడికండలుగఁ జీల్చి ధర్మంబు నిలుపు ను ♦ దారబుద్ధి!
విశ్వకళాశాల ♦ వెలయించి దేశదేశముల విద్యనునించు ♦ జ్ఞానమూర్తి!

గీ॥ కవుల పాలిఁటి ముంగిటి ♦ కల్పకంబు! విగ్రహారాధనముపైన ♦ వెగటువలన
గజినిమహమూదు దండెత్తెఁ! ♦ గాకయున్న నంతవాఁడెట్లు జనహింస ♦ కనుమతించు!

గీ॥ ఇటుల పండ్రెండుమార్లు దం ♦ డెత్తి వచ్చి ధనకనకవస్తుతతిఁ గొని ♦ చనుటె కాని
భరతఖండంబు శాశ్వత ♦ వాసముగను జేయఁదలఁపక నిజసీమఁ ♦ జేరుకొనియె. 25

ఉ॥ ఆ కడగండ్లు తీఱి భర ♦ తావని కొంతకుఁ గొంత కోల్కొనన్
బోకయమున్నె వేఱొక రి ♦ పుండు మహమ్మదు పేరివాఁడు ఘో
రీకులుఁ డాత్మవాహినులు ♦ క్రిక్కిరియంగను గోరుచుట్టుపై
రోఁకటిపోటునాఁ బ్రళయ ♦ రుద్రునికైవడి వచ్చె నుద్ధతిన్. 26

శా॥ ఆకాలమ్మున సార్వభౌముఁడయి యా ♦ ర్యావర్తమున్ బృథ్వీరా
జేకచ్ఛత్రముగాఁగ నేలె; నతఁ డ ♦ య్యింద్రాత్మజున్ బోలె సు
శ్రీకల్యాణపరాక్రమోన్నతుఁడు; ఘో ♦ రీవంశజున్ దాఁకి చీ
కాకై పాఱఁగఁజేసెఁ దత్ప్రబల సే ♦ నానీకమున్ బల్మరున్. 27

గీ॥ చేరి హమ్మీర-గంభీర ♦ సింహనృపులు 'కాకసస్' పర్వతమునుండి ♦ కాశిదాఁక
నూటయెనమండ్రు క్షితిపుల♦మాటమాత్రఁ బిలిచికొనివచ్చి పృథ్వీశుఁ♦గొలుతు రెపుడు

❀ మ॥ అతితేజోబలధాముఁ డా సమరసిం ♦ హక్ష్మాతలేంద్రుండు వం
దిత నానాజనపాలలోకుఁడగు పృ ♦ థ్వీభర్తకున్ సోదరీ

---

❀ Samarasimha proceeded to Delhi. His arrival at Delhi is hailed with songs of joy as a day of deliverance. Prithwi Raj and his court advanced seven miles to meet him and the description of the king of Delhi and his sister and the chiefs on either.

పతి, వజ్రాయుధకోటి గ్రుంగఁగల మే ♦ వాడ్దేశ రాహుత్తులుఁ
కృతహస్తుల్ దనుఁగొల్వ వచ్చె నని కే ♦ కీభూత చేతస్కుఁడై. 29

గీ॥ భరతఖండంబు నాక్రమిం ♦ పంగఁ దలఁచి యేడుమాఱులు ఘోరి దం ♦ డెత్తి వచ్చె;
మఱఁదియును బావయును దారు ♦ మారు చేసి యతని వెనుకకు నంపించి ♦ రాఱుమార్లు.

సీ॥ 'త్వార్వంశ సంజాత ♦ ధరణీతలేశ్వరుల్ పూర్వ మింద్రప్రస్థ ♦ పురిని సార్వ
భౌములై యేలి; ర ♦ వ్వారిలోన ననంగపాలుండు కడపటి ♦ వాఁ; డతండు
పుత్రసంతతి లేక ♦ పుత్రికలను నిర్వురను గాంచె; మొదటి దా ♦ నిని గనూజి
బీజపాలునకును ♦ బిదపటి దాని సోమేశున కజమీరు ♦ దేశ పతికి

గీ॥ నిచ్చె; వారికి జయచంద్ర ♦ పృథ్వివిభులు గలిగి; రయ్యనంగుఁడు కొంత ♦ కాలమునకు
వ్యాధి పీడితుఁడగుచు ని ♦ జాత్మజలను మనుమలను బిల్చుకొని చెంత ♦ నునిచికొనియె.

గీ॥ ఒక్కనాఁడు పట్టాభిషే ♦ కోత్సవంబు జరుప సామంత నృపుల నం ♦ దఱను జేర్చి
యయ్యనంగుఁడు "ఢిల్లి సిం ♦ హాసనంబు నెక్కుమ"న నెక్కి కూర్చుండెఁ ♦ బృథ్వియపుడు.

సీ॥ 'ఇరువుర మేము దౌ ♦ హిత్రులమైయుందు! మప్పసెల్లెండ్రకు ♦ నాత్మజులము!
పదియు నెన్మిది యేండ్ల ♦ ప్రాయమందున్న నన్ వదలి యెనిమిదేండ్ల ♦ బాలుఁ బృథ్వి

---

side who recognize ancient friendship is most animated. Samarsi reads his brother-in-law an indignant lecture on his unprincely inactivity and throughout the book divides attention with him.

In the planning of the campaign and march towards the Caggar, to meet the foe, Samarsi is consulted and his opinions are recorded. The bard represents him as the Ulyses of the host; brave cool and skilful in the fight, prudent wise and eloquent in council, pious and decorous on all occasions; beloved by his own chiefs and reverenced by the vassals of the chohan. In the line of march no augur or bard could better explain the omens, none in the field could better dress the squadrons for battle, none guide his steed or use his lance with more address. His tent is the principal resort of the leaders after the march or in the intervals of battle, who were delighted by his eloquence or instructed by his knowledge. On the last of three days desperate fighting Samarsi was slain together with his son Calyan and thirteen thousands of his household troops and most renowned chieftains. His beloved Pritha. on hearing the fatal issue, her husband slain, her brother captive, the heroes of Delhi and Chittor 'asleep on the banks of Caggar' in the wave of the steel, joined her lord through the flame.

"Annals of Mewar."

సింహాసనాసీనుఁ ♦ జేయు టధర్మ! మీతని యధికార, మే ♦ ననుమతింప!
నాక్షేపణ మొనర్తు" ♦ నని ధిక్కరించి యాజయచంద్రుఁ డేగె నా ♦ సభను వీడి;
గీ॥ యతనితోడ నాబూపర్వ ♦ తాధికారి వ్యాఘ్రరాజేంద్రుఁడును బట్ట ♦ ణాధినాథుఁ
డసమబలుఁడు భోళాభీముఁ ♦ డాక్షణంబ కదలిపోయి రాస్థాన రం ♦ గంబు వదలి. 33

సీ॥ తుహినాద్రి నుండి సే ♦ తువుదాఁకఁ దనరు నఖండ భారతఖండ ♦ మండలంబు
సకల మేకచ్ఛత్రి ♦ సామ్రాజ్యముగ ధరిత్రీ రాజ్యమేలెఁ బృ ♦ థ్వీనృపాలుఁ!
డామహావీరుని ♦ యసమ సంగ్రామ జయంబు సామంత ధ ♦ రాధిపతుల
పౌరుష విక్రమ ♦ ప్రాభవంబులు ధర్మసంస్థాపనాచార్య ♦ చతురతలును
గీ॥ జంద్ర భట్టారక సుకవి ♦ చక్రవర్తి వ్రాయు శతసహస్రాధిక ♦ గ్రంథమందు
రససమృద్ధిని బర్వ ప ♦ ర్వంబునకును జీవకళ లుట్టిపడఁగ రం ♦ జిల్లుచుండు! 34

చ॥ అమిత విశాలమై సిరు ల ♦ నంతముగాఁ దగి కాన్యకుబ్జరా
జ్యము మును దక్షిణాపథము ♦ నంతను వ్యాపన మొందె; రాజసూ
యము సలధర్మనందనుని ♦ యవ్వల నీజయచంద్రుఁ డొక్కఁ డు
క్కుమిగిలి చేయనేర్చె నృప ♦ కోటి యొనర్ప సమస్త కార్యముల్. 35

గీ॥ అధ్వరము చేసి యతఁడు ని ♦ జాత్మజాత పరిణయ మొనర్పఁగా స్వయం ♦ వరము చాటి
సకల దిగ్దేశవర్తి రా ♦ జన్యులకును బంపె వైవాహి కాహ్వాన ♦ పత్రములను. 36

సీ॥ తనకెకా దింక భూ ♦ స్థలి రాజులకు నెల్లఁ బెద్దయౌ రారాజు ♦ పృథ్వీరాజ
మౌళి కాహ్వాన మం ♦ పమి యట్టులుండ, నావిభు విగ్రహము రచిం ♦ పించి, సేవ
కుని దుస్తులిడి, తీసి ♦ కొనిపోయి యాస్థానమున మహాద్వారంబు ♦ ముంగల నిడె!
నాస్వయంవరమున ♦ కరుగుదెంచిన సర్వభూమీశ్వరులు ద్వార ♦ సీమ నిలువఁ
గీ॥ బడిన యాతనిఁ జూచి సం ♦ భ్రమముభయమునొంది గుసగుసల్ వోవుచు ♦ నొదిగియొదిగి
కూరుచుండిరి; మందార ♦ హారముఁ గరమందుఁ గొనివచ్చె సంయుక్త ♦ యచటి కపుడు.

మ॥ విమతుం డాజయచంద్రుఁడుర్వి నృపుల వే ♦ ర్వేఱన్ నిరూపించి వా
రి మహావైభవ ముగ్గడింప విని నీ ♦ రేజాస్య కన్నెత్తి చూ
డమి నుద్యోగులఁ జూపెఁ; గాంతయును దాఁ ♦ టన్ జొచ్చె; నాస్థానరం
గమునం దండఱఁ జూపెఁ దండ్రి; సతియున్ ♦ గాంక్షింపలే దెవ్వరిన్. 38

మ॥ వెనుకోపమ్మున నుండి యాతఁడు సుతన్ ♦ బృథ్వీశు బింబంబు త్రో
వను గేల్వట్టియు నీడ్చుకొంచరిగి "నా ♦ బంటీతనిన్ జూడు; మి

మ్మనఁ జన్ గూడు" మటంచుఁ ద్రోయఁ జెలియున్ ♦ మందారహారంబు వే
సి నమస్కారము చేసి నిల్చె నెదురన్; ♦ సిగ్గంతలోఁ బైకొనెన్. 39

మ॥ సుమహారంబు గళంబునన్ బడిన య ♦ చ్చో విగ్రహం బట్టె మ
ధ్యమునన్ ప్రీలుచుఁ బృథ్వీరాజతిలకం ♦ బావిర్భవం బంది య
క్కొమఁ జేతన్ గొని యశ్వ మెక్కి "యిదిగో ♦ కొంపోవుచున్నాఁడ! ధై
ర్యము మీకుండిన నన్నుఁ దాఁకుఁ"డని చే ♦ రన్ బోయె ఢిల్లీపురిన్. 40

మ॥ 'సమరోద్వృతల ఫల్గునుం డితఁ'డనన్ ♦ సత్కీర్తి దిగ్దేశ భా
గములం దల్లిన యామహాప్రభుని దాఁ ♦ కన్ ధైర్యముల్ లేక యె
ల్ల మహీంద్రుల్ తల లట్టె వంచుకొని యిం ♦ డ్లన్ జేరి; రా తోఁక ద్రొ
క్కు మహాహిన్ బలె నక్కనూజిపతియున్ ♦ గ్రుద్ధాత్ముఁ డయ్యెన్ గడున్. 41

గీ॥ ఎందఱినో యాశ్రయించి యె♦న్నెన్నొ గతులఁ గుట్రలు కుతంత్రములు పన్ని♦కోటియత్న
ములను జయచంద్రుఁ డొనరించి♦ఫలముగానఁ;దరులు బెగడొందఁ బృథ్వీంద్రుఁ♦డవని నేలె

సీ॥ ఇంకొక్కమాఱు దం ♦ డెత్తిరా జయచంద్రుఁ డర్థించె ఘోరీమ ♦ హమ్మదు విభు!
నావార్త విని యసం ♦ ఖ్యచమూతతుల్ కొల్వ నరుదెంచె సమరసిం ♦ హప్రభుండు!
మూఁడు క్రోసుల దూర♦మున కేగి పృథ్వీంద్రుఁ డనుగులకును మ్రొక్కి♦యతనిఁ దెచ్చెఁ!
'గగ్గార్'నదీ తట♦త్సీమ యవనసైన్యము లుండె! ఢిల్లిసై♦న్యములు చేరె! [పోయి

గీ॥ నాప్తులును దాను జయచంద్రుఁ♦డాయవనులఁ గదిసె; నుదయ మయ్యెదిచూచి ♦ కదలి
తండ్రి మృదుపాదములకు వం♦దన మొనర్చి యొప్పుమెయి మహారాజ్ఞి సం♦యుక్త యపుడు

సీ॥ "భారత స్వాతంత్ర్య ♦ భరము మాపఁగ వైరు లరుదెంచి! రదినిల్వ ♦ నరుగుదెంచె
నాప్రాణవిభుఁ డఖం ♦ డ ప్రాభవుండు! నేనుండ వేర్వేఱ మీ ♦ కుండఁ దగదు!
ధర్మపక్షము మాది! ♦ దయచేయవయ్య! పృథ్వీవిభు నర్థాంగిఁ ♦ బిలుచుచుంటిఁ!
జెడుగులే దీవు వ ♦ చ్చిన! సత్కరించు నాభర్త! నిన్ వైరము ♦ వదలదేని

గీ॥ యేగుము కనూజి; కటులు పో♦వేని భారతావనిని దాస్యమునఁ ద్రోయు♦నపయశంబు
లనుభవింతు వాచంద్ర తా♦రార్క"మనుచు మ్రొక్కి సాగిలపడఁ గడుఁ♦గ్రుద్ధుఁ డగుచు

సీ॥ కమనీయ భారత ♦ ఖండ సామ్రాజ్య సౌభాగ్యలక్ష్మి విధానఁ ♦ బరగు మంగ
ళోదారమూర్తి సం ♦ యుక్త సాగిలపడియుండ భూదేవ మం ♦ త్రోక్తిపూత
కంధిజలాభిషే ♦ క పవిత్ర మామెమూర్థము నట్టె వామపా ♦ దమునఁ దన్ని
"కదలిపో! నాసము ♦ ఖమున నుండకు"మంచుఁ ద్రోసిన లేచి యా ♦ దొడ్డతల్లి

గీ॥ "తెలిసినది విన్నవించితి! ♦ దీన నీదు హృదయము కలఁగకున్న నే ♦ నేమి సేతు"
నని కదలివచ్చె! నుభయ సై ♦ న్యములకును రణంబు ఘోరంబుగా మూఁడు ♦ నాళ్లు జరిగె
గీ॥ సమరసింహుండు పడియె; సై ♦ న్యములు చెడియె; రాజపరమేశ్వరుండు వీ ♦ రప్రభుండు
పృథ్వీరాజేంద్రుఁడును ఢిల్లి ♦ రిపుల బారిఁ బడిరి; భారతదేశ దౌ ♦ ర్భాగ్యకలన!
మ॥ తొలుతన్ సాయము చేసి నట్టి జయచం ♦ ద్రున్ దాఁకె ఘోరీయు; దు
ర్బలుఁడై రాజ్యము వాఁడు వీడిచనెఁ; దా ♦ ర్తార్ వీరులున్ వెంబడిన్
గలయన్ దాఁకిరి; దిక్కులేక తఁడు గం ♦ గావాహినిన్ దూఁకి య
వ్వలి కేగెన్; దలఁ ద్రుంచి చంపిరి రిపుల్ ♦ వైవస్వతప్రాయులై. 47
సీ॥ "తత రమాఖండ భా ♦ రతఖండ గగనాగ్రరంగ మధ్యాహ్న మా ♦ ర్తాండమూర్తి!
బప్పరాయాన్వయా ♦ భరణ షట్త్రింశ న్నృపాలక కుల భూరి ♦ వజ్రమకుట!
యరిగితి నను బాసి; ♦ చెఱవడె నా పృథ్వి; మఱఁద లెందరిగెనో ♦ యెఱుఁగరాదు;
పదమూఁడు వేల్ దొరల్ ♦ కదలఁ గల్యాణుండు పుష్పాస్త్రసముఁడు నా ♦ ముద్దుకొడుకు
గీ॥ తన స్వయంవరమునకట్లు ♦ చనియె దివికి; నిచటఁ బనియేమి మీరింద ♦ తేగుపిదప!"
నని పృథాదేవి వగచి ని ♦ న్ననుగమింప సమసితే శత్రుగజసింహ! ♦ సమరసింహ! 48
సీ॥ "ప్రార్థింతు వలవ దీ ♦ పని" యంచు సంయుక్త కొనకాళ్లఁ బడి వేఁడు ♦ కొనిన వినక
ఘోరీని బిలిపించి ♦ కొంప కగ్గి ఘటించి నృపచంద్రు సమరసిం ♦ హేంద్రుఁ ద్రుంచి
పృథ్వీశు నట్టేట ♦ నిడి కుంకుమార్చి సంయుక్త వైధవ్య సం ♦ యుక్తఁ జేసి
యుర్వి యున్నంతకు ♦ నుగ్రాపకీర్తిమై రాజ్యంబుఁ బారతం ♦ త్ర్యమున నిడితె!
గీ॥ కటకటా! కోటియుగములు ♦ గడచుఁగాక పృథ్వివిభువంటి రాజరా ♦ జెటులఁ గలుగు!
నతనికన్నులు దీయించె ♦ యవననృపతి! చెనఁటి జయచంద్ర! నిబిడదు ♦ ష్కీర్తిరుంద్ర!
గీ॥ "చెట్టుపైఁ బక్షిశిరమును ♦ జెండు"మనినఁ బృథ్వీరాజు మూఁడుశరంబు ♦ లెత్తి పక్షి
కంఠమును, వెంటనే, ఘోరి ♦ గళముఁ ద్రుంచి, యాత్మహృదయంబు భేదించి ♦ యరిగె దివికి.
గీ॥ పృథ్వినృపమౌళి కులము, ఘో ♦ రీ కులంబు, సమరసింహు కులము, జయ ♦ చంద్రు కులము
నాల్గుకులములు మొదలంట ♦ నాశమయ్యె దుష్టుఁడగు నొక్కదేశవి ♦ ద్రోహికతన.
క॥ "కుతుబుద్దీన్" సేవకసంతతివాఁడు! సమర్థుఁడౌటఁ ♦ దగునని ఘోరీ
పతి భారతసామ్రాజ్యం బతని వశము చేసియుండె ♦ నంతకు మునుపే!
ఉ॥ జంభవిరోధి వైభవ వి ♦ శాలత భూప్రజ నేలి శాశ్వతో
జ్జృంభితకీర్తిచంద్రికలఁ ♦ జిమ్ముచు వాఁడు 'కుటుబ్మినార్' శిలా

స్తంభము నొక్కదాని జయ ♦ సంభృతమై పొలుపొంద నిల్పె; వి
శ్వంభరఁ బొల్పు నయ్యెడియు ♦ సప్తవిచిత్రములందు నొక్కఁడై.

మ॥ పరిపాలించిరి వానివెన్క ధరణీ ♦ భాగంబుఁ బెక్కుర్ నృపా
లురు; ఖల్జీకులుఁ డొక్కఁ డాదట జలా ♦ లుద్దీను దుస్తంత్రము
ష్కరుఁ డఘ్ఘుండెడు ఢిల్లిరాజు శిరమున్ ♦ ఖండించి యేతత్పురీ
వరమున్ జేకొని రాజ్యమేలఁ దొడఁగెన్ ♦ బట్టాభిషిక్తుండునై. 53

క॥ అవల నలాయుద్దీనను యవనుండు పరాక్రమక్రి ♦ మాటోపుఁడు పా
ర్థివుఁడయ్యె! మొగలులు దండువిడియసాగిరి కడుంగ ♦ దుర్ యత్నమునన్. 54

మ॥ ఉరుశౌర్యంబునఁ బెక్కుమాఱులు నలా ♦ యుద్దీను మొగల్ రిపూ
త్కరమున్ బాఱఁగఁ దోలి హైందవము నే ♦ కచ్ఛత్రమై యుండఁగా
జరపన్ గోరుచు రాజ్యతృష్ణమెయి రా ♦ జస్థాన దేశంబుపైఁ
బరతెంచెన్ యమదూతలట్టి సుభట ♦ వ్రాతంబు తన్గొల్వఁగన్. 55

సీ॥ కడుఁ జిన్నవాఁడు ల ♦ క్ష్మణసింగు రాజౌట భీమసిం గాతని ♦ పిన్నతండ్రి
పాలించుచుండె మే ♦ వాడ్దేశ; మతఁడు సేనలతోడ యుద్ధ స ♦ న్నద్ధుఁడయ్యె;
యవనసేనలు కోట ♦ కవ్వల రాజపుత్ర చమూచయంబు దు ♦ ర్గమున నుండె;
సంవత్సరంబు మా ♦ సము లాఱు ముట్టడి సాఁగె; నయ్యుభయ ప ♦ క్షంబు లందు

గీ॥ వందలున్ వేలు నై వీర ♦ భటులు ద్రుగ్గి; రంతకంతకు విజయేచ్ఛ ♦ యతిశయించెఁ;
బ్రాణములపైని యాస ల♦వ్వలకుఁ ద్రోసి రణము గావించి రాత్మ గౌ ♦ రవముఁగోరి.

సీ॥ "వెలఁదిఁ బద్మినిఁజూప ♦ విడుతు ముట్టడి"నని యవనేంద్రుఁ! "దద్దంబు ♦ నందుఁ జూడఁ
దగు"నని రాజపు ♦ త్రకులు దెల్పిరి; వాఁడు విచ్చేసి సతిఁ జూచి ♦ వెన్కకరుగు
నప్పుడు భీమసిం ♦ గరిగె వీడ్కొల్పుమఁ; గోట దాఁటఁగఁ దురు ♦ ష్కులు నతనిని
బట్టి "పద్మిని నియ్య ♦ వదలెద"మని; రేడు వంద లాందోళిక ♦ లందు భటులు

§ గీ॥ గొలువఁ బద్మిని చనెఁ; దురు♦ష్కులను దాఁకి రాజపుత్రులు పోరి ర♦బ్రంబుగాఁగఁ!
బద్మినీ-భీమసింహు ల ♦ వ్వలికి వచ్చి చేరిరి సురక్షితులయి చి ♦ త్తూరు కోట.

---

§ Bheemsi had espoused the daughter of Hamir Sank [chohan] of Ceylon, the cause of woes unnumbered to the Sesodias. Her name was Pudmini a title bestowed only on the superlatively fair, and transmitted with renown to posterity by tradition and the song of the bard. Her beauty, accomplishments, exaltation and destruction, with other incidental circumstances, constitute the subject of one of the most popular traditions of Rajwara. The Hindu bard recognizes the fair,

మ॥ స్థిరమా సత్ప్రభుభక్తియుక్తి నిజరా ♦ జ్ఞీమానసంత్రాణ ధ
ర్మరసావేశము పొంగి పైఁబొరల గో ♦ రాసింగు బాదూలుసిం
గు రణాగ్రంబున వైరివీరుల తలల్ ♦ కోటానఁగోట్లున్ వసుం
ధర రాలన్ విహరించి రయ్యెడఁ గృతాం ♦ తప్రాయులై యిర్వురున్. 58

మ॥ అమితోత్సాహముతోడఁ బోరెసఁగఁగా ♦ నానాఁడు మేవాడ రా
జ్య మహాసౌధమునందు స్తంభముల యో ♦ జన్ బొల్చు లోకైక వి
క్రమధౌరేయు లొకండయేని మిగులం ♦ గాఁబోక సంగ్రామ రం
గమునన్ వీరవిహారముల్ నెరపి స్వ ♦ ర్గంబేగి రొక్కుమ్మడిన్. 59

⊛ కం॥ బాదూలుసింగు బాలుఁడు ద్వాదశవర్షములవాఁడు ♦ తనపూర్వుల మ
ర్యాదను జెడనీయక ధీరోదాత్తత రణ మొనర్చి ♦ యొందె యశంబున్. 60

చ॥ కదతులు వేలు తన్గొలువఁ ♦ బద్మిని వహ్నిని జొచ్చె; వైరులున్
గడలును రాజసౌధములు ♦ గోపురముల్ బురుజుల్ గృహంబులున్
బడమిఁ బడంగఁజేయఁ బుర ♦ మున్ సిరి దప్పె గజంబులున్ జొరం
బడి కలఁపన్ గలంతపడు ♦ పద్మసరః ప్రవరంబు చాడ్పునన్. 61

మ॥ అనహుల్‌వారయు బూంది దేవగిరి ధా ♦ రావంతులున్ మారువా
డను మండూపుర మాజసల్మియరు గో ♦ గ్రోన్ దేశమున్ బెక్కు లో
ప్యన నొక్కొక్కఁడు గాఁ దురుష్క నరపా ♦ లాధీశ్వరున్ గొల్చి యా
తని రారాజుగ సమ్మతించెఁ బరతం ♦ త్రత్వంబుమైఁ గుంగుచున్. 62

---

in preference to fame and love of conquest as the motive for the attack of Allaudin who limited his demand to the possession of Pudmini, though this was after a long and fruitless siege. At length he restricted his desire to a mere sight of the extraordinary beauty and accepted to the proposal of beholding her through the medium of mirrors. Relying on the faith of the Rajputs he entered Chittor slightly guarded and having gratified his wish, returned. The Rajputs, unwilling to be outdone in confidence, accompanied the King to the foot of the fortress amidst many complimentary excuses from his guest at the trouble he thus occasioned. It was for this that Alla risked his own safety; relying on the superior faith of the Hindu. Here he had an ambush. Bhimsi was made a prisoner, hurried away to the camp, and his liberty made dependent on the surrender of Pudmini.

⊛ Badul was but a strippling of twelve but the Rajput expects wonders from this early age. He escaped though wounded, and a dialogue ensues between him and his uncle's wife, who desires him to relate how her lord conducted him-

❀ సీ॥ ప్రక్కనఁగల భిల్ల ♦ పతులతో సంతత సంగ్రామములు సేయఁగా ♦ [illegible]నము
నుర్విని నజయసిం ♦ హుండు కొన్నింట్లలి గెలుపొందలఁగాబూని ♦ [illegible]
తనయులఁ గని "భిల్ల ♦ జనపతి మూంజుని పలని భయమున నాకుఁ ♦ [illegible];
నిదురలో నతఁడె క ♦ న్పించు; నాచింతచే సగమైతి; [illegible] ♦ [illegible]
గీ॥ వాని బరిమార్చి నాభీతిఁ ♦ బాపుదో లుఁ" డనిసఁ 'బొన్ల' [illegible] ♦ [illegible]
కరుగుఁ[illegible] నెట్లు నోరాడ" ♦ ననిరి వారలాతఁ; [illegible] 'హా' ♦ [illegible],

మ॥ "ఒకయశ్వం బొకఖడ్గ మొప్పఁ[illegible] నే ♦ [illegible] మూంజు మ
స్తకముఁ దెచ్చెద" నన్న "సింహలుడు హా ♦ [illegible] నో [illegible]! [illegible]
వకుమం" చాడెదు పిన్నతండ్రిఁ గని "ద ♦ వా! మూంజు మస్తకంబు
నిఁకఁ దెత్తుంజుమి; లేనిచో నిటకు రా ♦ నేరా" నటం చామహా[illegible]. 64

self before she joins him. The strippling replies "He was the reaper of the harvest of battle; I followed his steps as the humble gleaner of his sword. On the gory bed of honor he spread a carpet of the slain, a barbarous prince his pillow, he laid him down and sleeps surrounded by the foe." Again she said "Tell me Badul! how did my love behave!" "O mother! how further describe his deeds, when he left no foe to dread or admire him." She smiled farewell to the boy and adding "my lord will chide my delay," sprung into the flames.

"Annals of Mewar."

❀ Mewar was now occupied by the garrisons of Delhi and Ajeysi had besides, to contend with the mountain chiefs amongst whom Moonja Balaicha was the most formidable, woh had on a recent occasion, invaded the Shero-Nalla and personally encountered the Rana whom be wounded on the head with the lance. The Rana's sons Sujansi and Ajimsi though forteen and fifteen, an age at which a Rajput ought to indicate his future character, proved of little aid in the emergency. Hamir was summoned and accepted the fued against Moonja, promising to return successful or not at all. In a few days he was seen entering the pass of Kailwara with Moonja's head at his saddle bow. Modestly placing the trophy at his uncle's feet, he exclaimed "Recognize the head of your foe" Ajeysi kissed his beard and observing that fate had stampt empire on his forehead, impressed it with a teeka of blood from the head of Balaicha. This decided the fate of the sons of Ajeysi, one of whom died at Kailwara and the other Sujansi was sent from the country. He departed for the Dekhan, where his issue was destined to avenge some of the wrongs the parent country had sustained and eventually overturned the monarchy of Hindustan, for, Sujansi was the ancestor of Sivaji, the founder of the Satara throne.

"Annals of Mewar."

క॥ అందఱును జూడ నొకఖడ్గ ♦ మశ్వముఁగొని గాలికన్న హమీరాము శీ ♦ ఘ్రముగఁబోయెఁ;
జని దినములు వారములు మా♦సములు గడచెఁ;నతఁడుచను ఱేరికిని జ్ఞప్తి♦యందె లేదు.

సీ॥ కొన్నాళ్ల కవ్వలఁ ♦ గొండలోయను గద వంటి యాయుధమును ♦ బట్టి యొక్క-
యాశ్వికుం డరుదేర ♦ నజయసింహుఁడు వాని కొలువుపాతును జూచి ♦ గొలిపి; రంత
సాహవీరుఁడు బల్లె ♦ మవనిపై నిడి తండ్రి శ్రీపాదముల నమ ♦ స్కృతి యొనర్చి
'గుఱుతింపు నీయూరంజు ♦ శిరమన్న' ఁడు పుత్రకుని ముద్దాడి యె ♦ త్తుకొని సింహా

గీ॥ పీఠమెక్కించి తిలకంబు ♦ పెట్టి రాజు సలిపి నిజపుత్రయుగము దే ♦ శమును వీడి
యరుగుమనిపంపెఁ; నంతఁ గా ♦ లాంబువాహ భూరి గంభీర రుతిని హ ♦ మీరవిభుఁడు,

సీ॥ "తఱుచుగా వేఁటల ♦ కరుదెంచునని స్వాద్రి సీమాటవుల నేను ♦ జేరియుంటేఁ;
బందిఁ దఱుముకొంచుఁ ♦ బరివారములు లేక మొంజుఁడొక్కఁడె వనం♦బునఁ గనఁబడె;
నడిగె "నీవెవ్వఁడ" ♦ వని నన్ను; "నీవెవ్వఁ"డని యంటి; "ముంజుఁడ" ♦ ననెడు నంతఁ
దల నాదు ఖడ్గధా ♦ రల నూడి యిలరాలెఁ; గుంతంబుకొనఁ దలఁ ♦ గ్రుచ్చి యెత్తి

గీ॥ శీఘ్రముగ నీపదంబులు ♦ చేరవచ్చి నాఁడ"నన నెల్లరపుడు సం ♦ తసము నొంది;
రిట్టు లఱువదియును నాలు ♦ గేండ్లు దాఁకఁ బాలన మొనర్చె నతఁడు మే ♦ వాడ సీమ.

చ॥ అతని కుమారుఁడుర్వి, మనుమఁ ♦ డౌ లఘుఁ, డవ్వల రాజులౌచు శా
శ్వత బహుళాభివృద్ధి కొన ♦ సాగఁగ నేలిరి దేశముర్వి; లఘు
క్షితిపతి 'జావురా' ఖనుల ♦ సీసము వెండియుఁ దామ్రమాది ధా
తుతతులు త్రవ్వఁజేసి తటి ♦ తో ధనరాసులఁ జేర్చె మెండుగన్. 68

మ॥ జనకుం డాడిన యొక్కమాటకయి త ♦ త్సామ్రాజ్యమున్ దాని ప
జ్జను లావణ్య నిధానమై వెలయు హం ♦ సాదేవిన్ వీని త
మ్ముని రారాజు నొనర్చి భీష్మచరిత ♦ మ్మున్ దాఁ బ్రదర్శించెఁ జం
⊕ డప్పుం డీలఘురాజు పుత్రుఁడు ప్రచం ♦ డ ప్రాభవోద్దండుఁడున్. 70

క॥ ముకుళుఁడు లఘురాజు కుమారకుఁ; డాతని వెన్క నేలె ♦ రాజ్యము; తత్పు
త్రకుఁడగు విదళిత రిపుహ ♦ స్తికుంభుఁడౌ కుంభనరప ♦ తి శ్రేష్ఠుండున్. 70

---

⊕ *Discussing with Chonda his (Laghu's) warlike pilgrimage to Gya, from which he might not return, he sounded him by asking what estates should be settled on Mokal. "The throne of Chittor" was the honest reply; and to set suspicion at rest, he desired that the ceremony of installation, should be performed previous to Lakha's departure. Chonda was the first to pay homage and swear*

మ॥ జనముల్ మెచ్చఁగ నేఁబదేండ్లుగను రా ♦ జ్యంబేలె; మేవాడ్ ధరి
త్రిని నయ్యెన్బది నాల్గు కోటలను ద్వా ♦ త్రింశ న్మహాసంఖ్య యీ
తనిచే నిర్మిత మయ్యె; నన్నిటఁ గడున్ ♦ దార్ఢ్యంబు వైశాల్యమున్
గొని యుర్వీరవతంసు పేర నిలుచున్ ♦ గుంభల్మియర్ దుర్గమున్. 71

సీ॥ మాళవపతి మహ ♦ మ్మద్ఖిల్జి వార్ధి తరంగముల్ వలెఁ జతు ♦ రంగ బలము
గొలువ ఘూర్జరరాజుఁ ♦ గూడి దండెత్తిరా నొకలక్ష యుత్తమా ♦ శ్వికదళంబు
పదునాల్గువేలు కా ♦ ల్బలముతో నరుదెంచి యెదిరించి వారి జ ♦ యించి మాళ్వ
ధరణీశుఁ దనరథ ♦ స్తంభంబునకుఁ గట్టుకొనుచుఁ జిత్తూర్పురం ♦ బునకుఁ దెచ్చి

గీ॥ కాపుగా సైన్యముల నిచ్చి ♦ కానుక లిచ్చి తగిన గౌరవ మిచ్చి స్వా ♦ తంత్ర్య మిచ్చి
యెడఁదఁ గరుణకుఁ జోటిచ్చి ♦ విడిచి పుచ్చెఁ గుంభరాణా సమాను లీ ♦ క్షోణిఁ గలరె!

❀ మ॥ తన సంపూర్ణ జయంబుఁ దెల్పఁగ జయ ♦ స్తంభంబులన్ భక్తి పెం
పును సూచింపఁగఁ గోవెలల్ నిలిపె నా ♦ బూ శృంగ శృంగాటకం

---

obedience and fidelity to his future sovereign reserving as the recompense of his renunciation, the first place in the councils and stipulating that in all grants to the vassals of the crown, his symbal (the lance) should be superadded to the autograph of the prince. In all grants the lance of Saloombra still preceeds the monogram of the Rana.

"Annals of Me.war"

❀ The only thing in India to compare with this is the Kutub Minar at Delhi, but though much higher, it is of a very inferior charactor. This column is one hundred and twenty two feet in height, the breadth of each face at the base is thirty five feet and at the summit, immediately under the cupola, seventeen feet and a half. It stands on an ample terrace, forty two feet square. It has nine distinct stories, with openings at every face of each storey.........While the Sun continues to warm the earth so long may the fame of Khoombo endure. Seven years had elapsed beyond fifteen hundred when Rana Khoombo placed this ringlet on the forehead of chittor. Sparkling like the rays of the rising Sun is the torun, rising like the bridegroom of the land............................What does it resemble which makes chittor look down on Meru with derision. Again what does Chutterkot resemble from whose summit the fountains are overflowing; the circular diadem on whose crest is beauteous to the eye; abounding in temples to the Almighty planted with odoriferous trees to which myriads of bees resort and where soft zephyrs love to play. This impregnable fortress was formed by Maha Indra's own hands.

"Annals of Rajasthan."

బున; వ్యాఖ్యానమొకండు వ్రాసి యనయం ♦ బున్ గీత గోవిందమున్<br>
జను లాబాలము నేర్వఁజేసెఁ గవితా ♦ సంధైక సంధాతయై. 73

గీ॥ కలముచేఁ గత్తిచే రెండు ♦ గతులఁ గీర్తికాంతఁ గొలిచిన మేటి భూ ♦ కాంతు లందు<br>
నింత దొడ్డవాఁ డున్నవాఁ ♦ డే యటంచు క్షోణిజనులెన్న మనియె నా ♦ కుంభనృపతి.

సీ॥ సాధ్వి మీరాబాయి ♦ సౌజన్యధన్య కుంభవసుంధరాధీశు ♦ పట్టమహిషి;<br>
జగదేక పావిత్ర్య ♦ సంపద కీలేమ పర్యాయపదము; గో ♦ పాలకృష్ణు<br>
నడుగులు తలఁచి భ ♦ క్త్యావేశమునఁ బాంగి యమృతగీతములు పె ♦ క్కాలపించెఁ;<br>
దన్మాధురికి సాక్షి ♦ తలలూచి యాతల్లి స్మరియింపనట్టి య ♦ న్నరులు లేరు;<br>
గీ॥ ద్వారకాపురి మొదలుగా ♦ వారణాసి వఱకు దేవాలయముల గో ♦ పాలదేవుఁ<br>
గూర్చి కీర్తించి యాయమ్మ ♦ కూరుచున్న చోటులను నేఁటికిని గూడఁ ♦ జూపుచుంద్రు.

మ॥ చరితార్థుండగు కుంభు పౌత్రుఁ డవలన్ ♦ సంగ్రామసింహుండు భూ<br>
వరుఁడయ్యెన్; రణమన్నఁ బండుగువలెన్ ♦ భావించు శౌర్యాఢ్యుఁడీ<br>
పురుషశ్రేష్ఠుని కాలమం దరిచయం ♦ బుల్ వచ్చె జాక్సార్టిటీస్<br>
సరసన్ వెల్గెడు క్రూర ముష్కర తురు ♦ ష్కస్థాన మందుండియున్. 76

శా॥ చెంగిస్ఖాను కుమార్తె సంతతి జని ♦ చెన్ ముందు తైమూరు; స<br>
ర్వాంగీణ స్ఫుటశక్తితో సమరఖం ♦ డాధీశుఁడై, దానఁ దృ<br>
ప్తింగాంచంగనుబోక భారతమహా ♦ దేశంబునున్ గెల్చె; స<br>
త్సంగుం డీతని రాజ్య మింతని వచిం ♦ చన్ జాల రెవ్వారలున్. 77

శా॥ "తైమూర్లేము" ప్రపౌత్రుపౌత్రుఁ డతిశి ♦ ష్టస్తుత్య సౌజన్య లీ<br>
లామందారము ద్వాదశాబ్దముల కా ♦ లంబందె "బేబర్" నృపుం<br>
డై మోగల్ క్షితి నేలఁబూని రిపుగో ♦ త్రాధీశులన్ దాఁకి యు<br>
ద్దామపౌఢిని వారిఁ బోఁదఱిమి సం ♦ స్థాపించెఁ దద్రాజ్యమున్. 78

సీ॥ "జాక్సార్టిటీసు శ్రే ♦ ష్ఠతమంబె కాని జాహ్నవియొ! లోకైక పూ ♦ జ్యతకు తావు!<br>
టర్కీ ప్రశస్తమం ♦ డల మౌను గాని యార్యావర్త మమృత ర ♦ సాత్మకంబు!<br>
సమరఖండ మతియో ♦ గ్యము కాని ఢిల్లీపురము స్వర్గమునకు స్వ ♦ ర్గమగు తావు!<br>
తురకలు స్వజనులౌ ♦ దురు కాని భారతప్రజలు లోకోత్తర ♦ ప్రాభవాంకు!<br>
గీ॥ లింటనుండిన విశ్రాంతి ♦ యొసఁగుఁ గాని రామమాంధాత యేలిన ♦ భూమి గెలువ<br>
ఘనతరైశ్వర్యములు గల్గి ♦ "గణన గల్గు" ననుచు బేబరు దండెత్తి ♦ యరుగుదెంచె. 79

శా॥ ఆకాలమ్మున ఢిల్లిపట్టణనృపుం ♦ డౌ యిబ్రహీంలోడి తా
నాకర్ణించుచు వీనిరాక దశల ♦ క్షానీకినుల్ తత్స్థలం
బాకంపింపఁగఁ జేరవచ్చి యని సే ♦ యన్ జొచ్చె; బేబర్ విభుం
డాకాలాంతకునట్లు శాత్రవులఁ జెం ♦ డాడెన్ మహోదగ్రుఁడై. 80

మ॥ గడియల్ మూఁడగు నంతలో రణము త ♦ గ్గన్ సాగె; నా యిబ్రహీం
పడియెన్; సేనలు భిన్నభాండగతులన్ ♦ బ్రాపించె; బేబర్ మహీం
ద్రుఁడు ఢిల్లీపురి నాక్రమించుకొనె; హిందూదేశ సర్వస్వ మ
ప్పుడు దాసోహమటంచుఁ దత్పదయుగం ♦ బున్ గొల్చె నిర్వీర్యమై. 81

మ॥ అరులన్ గెల్చుచు సార్వభౌముఁడయి రా ♦ జ్యంబేలి సంగ్రామభూ
వరు సంగ్రామతలంబునన్ గెలిచి మే ♦ వాడ్దేశమున్ జెందఁగా
నరు మత్తద్విపరాజ వీర్యులగు నా ♦ యోధుల్ తనున్ గొల్వఁగా
నరిగెన్ బేబరు; సూర్యవంశమణి యు ♦ ద్ధాయత్తుఁడయ్యెన్ వడిన్. 82

సీ॥ డోంగరీశుఁడు బలో ♦ త్తుంగుం డుదయసింగు, రత్నసింహుఁడు సలుం ♦ బ్రావిభుండు
రణమల్లనృపుడు మా ♦ ర్వారు నాయకమాళి, మేత్రావిభుండగు ♦ క్షేత్రసింగు
ఝూలానృపాలుఁ డు ♦ జ్జయసింగు సోనెగుర్జ్రమహీంద్రుఁడైన యా ♦ రామదాసుఁ
డల ప్రమరుండు గో ♦ కులదాసు చంద్రభానుండు మాణిక్యచం ♦ ద్రుఁడు శిలాదుఁ
గీ॥ డును హుసే నిబ్రహీంసాహి ♦ తనయుఁ డొకఁడు స్వామి సంగ్రామసింహు వెం ♦ బడినిబోరి
"చచ్చుటో గెల్చుటో వేఱు ♦ జాడ లే"దటంచు సేనలతో వచ్చి ♦ రని మొనర్ప. 83

సీ॥ రెండువాహినులు కా ♦ ర్తికశుద్ధపంచమి నాబయానాప్రాంత ♦ మునఁ గలిసె;
రాజపుత్రులు మృగ ♦ రాజులట్టులు దాఁక యవనసేనలు వెన్క ♦ కరుగఁజొచ్చె;
బేబ రాగ్నేయాస్త్ర ♦ వితతిఁ బ్రయోగించె; హైందవాశ్వికకోటి ♦ యడ్డె దానిఁ;
బులులమాడ్కిని రాజ ♦ పుత్రవీరులు ముందు దూఁకి డీల్పఱచిరి ♦ తురకదండు;
గీ॥ తనబలముఁ దూఁచుఁ; గెలుపుకై ♦ కనులు వాచు; నాత్తతతి సేచు; దిగ్గన ♦ నట్టె లేచు;
విసివి తలరాచుఁ; జేతులు ♦ వెలికిఁ జాఁచు; నకట! బేబ రెవ్వఁడు గాచు ♦ ననుచుఁ జూచు!
గీ॥ స్వామి పదసీమఁ దెగి నిజ ♦ ప్రాణమైన ధారపోయు పవిత్ర హైం ♦ దవులయందు
నకటకట! శిలాదుఁడు గాక ♦ యన్నము దిను నాతఁడెవఁడు స్వామిద్రోహ ♦ మాచరించు!
గీ॥ కడపటి దినంబు నిరుమొనల్ ♦ గలిసి నపుడు బలముతో శిలాదుండు జే ♦ బరును గలిసె;
నని తుములమయ్యెఁ; బెక్కు గా ♦ యములు తగిలి యవల సంగ్రాముఁ డరిగె; సై ♦ న్యములు విఱిగె.

§ మ॥ కడుఁదీక్ష్ణంపుఁ బిరంగిగుండొకఁడు మో ♦ కాలన్ బ్రవేశించె; మం
డెడు నుగ్రింపుఁ దుపాకి సోఁకి కను లూ ♦ టిన్ జెందె; నెమ్మేనిపైఁ
బొడమెన్ గాయములెన్బ; దిట్లు రుధిర ♦ మ్మున్ జిమ్మ పుష్పించి యుం
డెడు బంధూక మహీజమున్ దెగడె క్షో ♦ ణీనేత సంగ్రామమునన్. 87

మ॥ చనఁ జిత్తూరికి గెల్పులేకయని బు ♦ స్సాంప్రాంత మందుండె; న
ప్పెనుగాయంబులఁజేసి శక్తిచెడి ని ♦ ర్వీర్యంబునై దేహ మ
ర్దనాథేశ్వరుఁ డొక్కవత్సరమునన్ ♦ స్వర్గస్థుఁడయ్యెన్ విక
ర్తనుఁ డస్తంగతుఁడైన కైవడిఁ బ్రజల్ ♦ దైన్యంబునన్ గ్రుంగఁగన్. 88

క॥ అరిరాజాంతకుఁడై బేబరు సంగర జయము నొంది ♦ భారత ధరణీ
శ్వరులకును రాజరాజయి పరిపాలింపందొడంగె ♦ వసుధాతలమున్. 89

చ॥ ఒకసమయంబునందు హుమ ♦ మూనును వ్యాధియు సోఁకి యంతకం
తకుఁ జెలరేఁగ; బేబరును ♦ "గన్గొని నాసుతుఁ గావు దేవ" యం
చకుటిలబుద్ధి వేఁడుకొనె; ♦ నట్టులె వ్యాధియు వాని సోఁకి పు
త్రకుఁడును వ్యాధిఁబాసె; నొక ♦ రాతిరి ప్రాణము వాసె బేబరున్. 90

క॥ ఘనశౌర్యుఁడు సంగ్రాముని వెనుక నతని సుతులు రత్న ♦ విక్రమసింహుల్
మనుజేంద్రులై మహీతలమును బరిపాలించి రధిక ♦ మోదముతోడన్. 91

---

§ On the 16th March the attack commenced by a furious onset on the centre and right wing of the Tartars and for several hours the conflict was tremendous. Devotion was never more manifest on the side of the Rajput, attested by the long list of noble names amongst the slain as well as the bulletin of their foe, whose artillery made dreadful havoc in the close ranks of the Rajput cavalry, which could not force the entrenchments, nor reach the infantry which defended them. While the battle was still doubtful, the Tuar traitor, who led the van went over to Baber and Sanga was obliged to retreat from the field which in the onset promised a glorious victory; himself severely wounded and the choicest of his chieftains slain. Sanga Rana was of the middle stature but of great muscular strength. He was celebrated for energetic enterprise, of which his capture of Muzuffar, King of Malwa, in his own capital is a celebrated instance; and his succesful storm of the almost impregnable Rinthum-bhor, though ably defended by the imperial general Ali, gained him great renown. Had he been succeded by a prince of his foresight and judgment, Baber's descendants might not have maintained the sovereignty of India. A cenotaph long marked the spot where the fire consumed the remains of this celebrated prince.

"Annals of Mewar."

గీ॥ వైరి దుర్భేద్యమైన చి ♦ త్తూరుకోట దక్షిణపు గోడ పగిలి రం ♦ ధ్రంబు పడియె;
§ నూర్జిత జగన్నుత పరాక్ర ♦ మార్జునుం డరాతులను దాఁకి యర్జున ♦ రావు మడిసె.

గీ॥ తమ వందలు హారవంశ్య ♦ లతని తోడఁ బడిరి; మధ్యాహ్నమార్తాండు ♦ పగిది మండి
యరులఁ దాఁకి దుర్గారాయఁ ♦ డస్తమించె సఖుల చోండావదశ్వయు ♦ లనుసరింప. 99

గీ॥ అవల దేవరభటులు ఝూ ♦ లాన్వయులును జీవము లొసంగి; రంత భా ♦ గ్జియు వచ్చి
ప్రళయకాలాంతకునిఁబోలు ♦ భటులఁ గూడి కదన మొనరించి పండె నా ♦ గండిదండ.

సీ॥ తరువాత రాజమా ♦ తయు జవాహిరిభాయి రాథోడుసుత తను ♦ త్రాణ ఖడ్గ
ములనూని యాస్థలం ♦ బునఁ బోరి మడిసె; నవ్వేలఁది కీర్తివి జరి ♦ త్రల సువర్ణ
కటమాక్షరముల వ్రా ♦ సిరి పూజ్యు లాదినం; బంతలో దర్గమా ♦ వంత యవల
విఱిగె; లోపలి వీర ♦ వరుల సంఖ్యయుఁ దగ్గె; నుదయసింహకుమారుఁ ♦ డొకఁడు తప్ప

గీ॥ రాజవంశ మంతయు రణా ♦ గ్రమున మ్రగ్గె; నతని సురథానిరాయల ♦ కప్పగించి
వెలికి దాఁటించి మిగిలిన ♦ వీరు లొక్క స్థలము చేరిరి కార్య ని ♦ శ్చయము కొఱకు

సీ॥ గంధపుఁ మంచి చె ♦ క్కల నొక్క ప్రోవుగాఁ గూర్చి తైలము పోసి ♦ కుప్పలుగను
కర్పూరరజము పైఁ ♦ గప్పి యగ్ని రగిల్చి వెలఁదులు పదమూఁడు ♦ వేలమంది
జలకంబు లాడి దు ♦ వ్వలువలు సొమ్ములు దాలిచి పూచిన ♦ తంగెడు లటు
వెడలి పెండ్లికిఁ బోవు ♦ విధమున గుంపులై చిఱునవ్వు మోముల ♦ సిరుల నింప

గీ॥ బంగరు సలాక లట్లు పా ♦ వకునిఁ జొచ్చి; రీవెలఁదులఁ గర్ణావతీ ♦ దేవి నడిపె;
నామె యుదయసింహకుమారు ♦ ననుఁగుఁ దల్లి మర్జయార్జునరాయని ♦ తోడఁబుట్టు.

మ॥ తమ కాంతామణులెల్ల వహ్నిఁ బడి మ్రం ♦ దన్ దేవరస్వామి దు
ర్గమునందుండిన యోధులన్ గొనుచు సూ ♦ ర్యద్వారమున్ దీసి సిం
హముమాడ్కిన్ వెలిదాఁకి శాత్రవులు చీ ♦ కాకొంద వర్తించి సై
న్యములన్ దానును నిర్విశేషముగ నం ♦ తంబొందె నవ్వేళలో. 10[illegible]

⊛ Rao Arjun was this prince, who was blown up at the Chitore boorj. The Boondi bard makes a striking picture of this catastrophe in which the courage of this prince is finely imagined "Seated on a fragment of the rock disparted by the explosion of the mine, Arjun drew his sword and the world beheld his departure with amazement.

"Annals of Rajasthan"

⊕ చ॥ దురము భయంకరంబగుచు ♦ దుర్గము నిల్వదటంచుఁ దోచు ముం
దర, నవరత్న సంతతులు ♦ దాఁపిన తోరము, రాజ్ఞి, ఢిల్లి భూ
వరు కడ కంపెఁ; గష్టములు ♦ వచ్చిన యప్పుడు రాజపత్ను లీ
కరణి నొనర్చి సాయమును ♦ గాంచుట వాడుకయై తనర్చెడున్. 104

శా॥ వీరుల్ ముప్పదిరెండు వేలు సమరో ♦ ర్విన్ వ్రాలి ప్రాపించి ర
వ్వీరస్వర్గము; దుర్గమున్ యవనభూ ♦ భృన్మౌళియున్ జొచ్చి శౌ
ర్యాఢ్యున్ నివసించె; నంతటను "సై ♦ న్యంబున్ మరల్పించి చి
త్తూరు వీడు"మటంచు వచ్చెను హుమా ♦ యూన్ పాదుషా యాజ్ఞయున్. 105

సీ॥ పరిసరగ్రామ సం ♦ వాసినులగు వెలందులు వేయిమంది యా ♦ తోరము నొక
కనకపుం బళ్లెరం ♦ బున నుంచి పూవు లక్షతలును బెట్టి పూ ♦ జల నొనర్చి
నడచుచు వెళ్లి యం ♦ దఱు ఢిల్లిఁ జేరిరి; హుమయూను వంగదే ♦ శమున నుండె;
నటకేగి దర్శించి; ♦ రతఁడు హర్షించి హ స్తమున రక్షాబంధ ♦ నము నొనర్చి
గీ॥ "సారస దళాక్షులార! యీ ♦ తోర మంది నపుడె కర్ణావతీదేవి ♦ కన్న నైతి;
నామె నాచెల్లె; లుదయసిం ♦ గల్లుఁడయ్యె; వారి సేమమె నా సేమ ♦ మై రహించు. 106

గీ॥ భువన వంద్యుండు సంగ్రామ ♦ భూపమణికి ముందు మాతాద్రి కూర్చిన ♦ కుంకు దీఱ
నతని దేవేరిని కుమారు ♦ నాదరించి నా మొగల్ వంశమును బాప ♦ నం బొనర్తు. 107

---

⊕ The Rajpoot dame bestows with the Rakshi the title of adopted brother and while its acceptance secures to her all the protection of a Cavaliar Servante, scandal itself never suggests another tie to his devotion. He may hazard his life in her cause, and yet never receive a smile in reward. for he cannot even see the fair object, who, as brother of her adoption, has coustituted him her defender... ... ... The acceptance of the pledge and its return is by the katchli or corset of simple silk or satin or gold brocade and pearls. In shape or application there is nothing similar in Europe and as defending the most delicate part of the structure of the fair it is peculiarly appropriate as an emblem of devotion. A whole province has often accompanied the katchli and the monarch of India was so pleased with this courteous delivery in the customs of Rajasthan on receiving the bracelet of Karnavati which invested him with the title of her brother and uncle and protector to her infant Udai Singh, that he pledged himself to her service "even if the demand were the castle of Rinthumbhor." Humayun proved himself a true knight and even abandoned his conquests in Bengal.

"Annals of Mewar."

గీ॥ అఖిల నృపులకుఁ బాదుషా ♦ యనుటకన్న రాజపుత్రి మహాదేశ ♦ రాజమాత
కన్న యనుటయొకడు గౌర ♦ వాస్పదంబు; పయనమై వత్తు; బహదూరు ♦ పంపి పుత్తు.

మ॥ స్ఫురదిందీవరనేత్రలార! యిఁక నా ♦ పుణ్యాంబు వర్ణింపఁగాఁ
దరమే! నేఁటి విపత్తు దీర్చుటకు నిం ♦ ద్రప్రస్థమేయైన భా
గ్యరమాక్రాంతము నాదు రాజ్యమయినన్ ♦ గాదేని నాప్రాణ మ
ప్పరమోత్కృష్టగుణాఢ్య పాదముకడన్ ♦ భక్తిన్ సమర్పించెదన్." 109

మ॥ అని శీఘ్రమ్ముగ వచ్చి చూచి "యిటుఁ గా ♦ ర్యం బంతయున్ మించిపో
యెను; దుర్గం బరిచేతఁ జిక్కెను; బలం ♦ బెల్లన్ నశించెన్; గృపా
ఖని నన్నోరిన దొడ్డతల్లియగు నా ♦ కర్ణావతీదేవి యే
మని చింతించెనొ; మందభాగ్యుసకు నే ♦ లా దక్కెఁ దత్సేవనల్. 110

మ॥ అకటా! సూర్యుఁడు వంశకర్తయఁట; క్షీ ♦ రాబ్ధిన్ వలెన్ బూజ్యమై
యకలంకంబగు గొప్పవంశమఁట; ధ ♦ న్యాత్ముండు సంగ్రామసిం
హుని కుటుంబంబఁట; సుంత సాయపడఁగా ♦ నొక్కింత తావున్నఁ బా
యక మత్కీర్తి వెలింగియుండుఁగద బ్ర ♦ హ్మాండైక సుస్థాయిగన్. 111

సీ॥ "ఆతల్లిమాఱు త ♦ దాత్మజుఁ గొలిచి దేహము ధన్య మొనరింతు" ♦ నని తలంచి
'చిత్తూరుపురి విస ♦ ర్జించి ఘూర్జర మేగు' మని బహదూరుషా ♦ కాన తిచ్చె;
నామహార్థుఁడు తదాజ్ఞ ♦ నౌదలఁదాల్పక సమర సన్నాహముల్ ♦ జరుపఁ దొడఁగెఁ;
బాదుషా తుదిలేని ♦ బలములతో దుర్గమును నాల్గువైపుల ♦ ముట్టడించె;

గీ॥ నామహాసేనఁ జూచి భ ♦ యంబు లేచి నీరు సోఁకు నుప్పటులఁ గ ♦ న్పింప కేగ
బలముతో బహదూరు; మాళ్వమును ఘూర్జరము హుమాయూన్ జయించె, సై ♦ న్య
[ములనుంచె.

గీ॥ వెదకి విక్రమసింహుని ♦ విభుని జేసి యాహుమాయూను ఢిల్లీకి ♦ నరిగె; విక్ర
మావనీశుని పిదపఁ బ్ర ♦ జాళు లెల్లఁ బృథ్వివిభుని జేసిరి వన ♦ వీరసింహు. 113

సీ॥ జననంబు క్రూర ము ♦ ష్కర తురుష్కకులంబు! భావమో రాజ్య సం ♦ పాదనంబు!
ప్రాయమో సకలప్రి ♦ పంచంబు తనదని పోరాడ వలసిన ♦ పూర్ణ వయసు!
నరిది రాజ్యస్థాన ♦ మాకర్షకము! కాని రాణి యర్థింప సౌ ♦ భ్రాత్ర మూని
వంగభూమిని దన ♦ పనిమాని యొకవేయి మైళ్లేగుదెంచి ధ ♦ ర్మము వరించి

గీ॥ స్వకులు బహదూరు శిక్షించి ♦ పంచి దేశమందు భయమును డించి సౌ ♦ ఖ్యంబు నించి
పట్టిచేతుల వెనుకకు ♦ వచ్చె! నెట్టి సరళ హృదయుండొ! హుమయూను ♦ చక్రవర్తి!

సీ॥ వనవీరనృపుఁడు పా ♦ లన మశాస్త్రవముసేయ నుదయసింహుఁ గూ ♦ ల్పను దలంచెఁ;
బన్నా యనెడి దాది ♦ ముందెట్లొ సడివట్టి యొకపూలబుట్టలో ♦ నుదయసింహు
నుంచి భటులచేత ♦ నూరివెల్పల కంపెఁ; దనపుత్రు నుంచెఁ ద ♦ త్స్థానమునను;
వనవీరుఁ "డుదయసిం♦హుని జూపు"మని వచ్చెఁ; సతి నిజాత్మజుఁ జూపెఁ; ♦ వతఁడు పొడిచెఁ;

గీ॥ బుత్త్రశోకము దిగమ్రింగి ♦ పన్న వెడలి స్వామి నొకనిఁ గొంచి దేశదే ♦ శములు తిరిగి
వర్తకుం 'డసాసా' కడ ♦ వానిఁ జేర్చి సకలలోకైక విఖ్యాతి ♦ సంతరించె. 115

క॥ తను నెంత కాచి కుడిపినఁ దనసుతుఁ బరసుతుని కొఱకు ♦ దారుణ ఖడ్గం
బునఁ జీల్పఁ గనిన వెలఁదులఁ వినియుంటిమె! పన్నఁ దప్ప ♦ వేఱొకదానిన్. 116

మ॥ వనవీరుండు ప్రజావిరుద్ధముగ భూ ♦ భాగంబుఁ బాలింపఁ దీ
రని కష్టాంబుధిలో మునుంగుచు జన ♦ వ్రాతంబు సంగ్రామసిం
హునిపుత్త్రుం డతిదూరగుం డుదయసిం ♦ హుఁ దెచ్చి చిత్తూరుపురం
బున రాణా నొనరించెఁ బూర్వవిభవం ♦ బుఁ నిల్పఁ గాంక్షించుచున్. 117

§ మ॥ సమరోత్సాహము లేదు; విక్రమకళా ♦ సంపత్తియున్ లేదు; దు
ర్గమధైర్యోన్నతి లేదు; చిత్తురుమహా ♦ రాజ్యంబుఁ బాలింపఁ బూ

---

§ Rana Udai Singh ascended the throne in A. D. 1541-1542.

... ... ... ...

"Woe to the land where a minor rules or a woman bears sway" explains the last of the great bards of Rajasthan; but where both were united as in Mewar, the measure of her griefs was full. Udai Singh had not one quality of a sovereign; and wanting martial virtue, he was destitute of all. Yet he might have slumbered life away in inglorious repose during the reign of Humayun or the contentions of the Pathan usurpation; but unhappily for Rajathan, a prince was then rearing, who forged fetters for the Hindu race, which enthralled them for ages; and though the corroding hand of time left but their fragments, yet even now though emancipated, they bear the indelible marks of the manacle; not like the galley slaves, physical and exterior; but deep mental scars, never to be effaced. Can a nation which has run its long career of glory be regenerated? Can the soul of the Greek or the Rajpoot be reanimated with the spark divine, which defended the Kangras of Chitore or the pass of Thermopylae? Let history answer the question.

"Annals of Mewar"

జ్యమయెా సద్గుణమొక్కఁడేనియు రహిం ♦ చన్ బోదు; వైయాఘ్రగ
ర్భమునన్ మేకవిధంబునన్ బొడమె సం ♦ గ్రామేంద్రు గర్భమ్మునన్. 118

⊛ సీ॥ ఉదయాస్తాచల మధ్యగంబగు జగం ♦ బుఱ్ఱూఁతలూఁగించె బె
ట్టిమఁడా పుత్రుఁడు; ఘోర సంగర కిరీ ♦ టిప్రాయుఁడై కీర్తిసం
పద నార్జించెను దండ్రి; యెట్లితఁడు మే ♦ వాడ్రాజ్య మందారశా
ఖఁ దినంబొచ్చిన పుప్పియట్లు వొడమెన్ ♦ గీర్తిన్ గళంకించుచున్. 119

చ॥ వరుసగ ముప్పదేం డ్లితఁడు ♦ పాలనమున్ బొనరించె; నందులో
నిరువదియైదు శాంతముగ ♦ నెట్టులొ సాఁగె; ననంతరమ్మునన్
దరితరముల్ తపింపఁదగు ♦ దారుణ ఘోర విపత్తు దేశమున్
బొరిగొని గౌరవంబు నుడి ♦ పోవఁగఁజేసె నరుంతుదమ్ముగన్. 120

మ॥ అనఘున్ విక్రమసింహు భూరమణుఁ జే ♦ యన్ గల్గి ఢిల్లీపురం
బున కేగెన్ హుమయూను; వంగమున రా ♦ ణ్మఖ్యుండు సామంతుఁడై
చను షేర్ఖాను స్వతంత్రరాజ్యమును సం ♦ స్థాపింప యత్నించినాఁ
డను వార్తల్ విని పాదుషా వెడలె సై ♦ న్యాయత్తుఁడై వానిపై. 121

ఉ॥ అంతములేని సైన్యముల ♦ నంబుధి చాడ్పున నిల్పియున్న సా
మంతుని దాఁకి పోరుట ప్ర ♦ మాదకరంబని సంధి గోరి వృ

---

⊛ But the magnitude of the peril confirmed the fortitude of Pratap, who vowed in the words of the bard to make his mother's milk resplendent: and he amply redeemed his pledge. Single handed, for a quarter of a century did he withstand the combined efforts of the empire; at one time carrying destruction into the plains, at another flying from rock to rock feeding his family from the fruits of his native hills, and rearing the nursling hero Umra amidst savage beasts and scarcely less savage men, a fit heir to the prowess and revenge. The bare idea that the son of Bappa Rawal should bow the head to the mortal man was insupportable; and he spurned every overture which had submission for its basis or the degradation of uniting his family by marriage with the Tartar, though lord of countless multitudes...The brilliant acts he achieved during that period live in every valley, they are enshrined in the heart of every true Rajput, and many are recorded in the annals of the conquerors. To recount them all, or relate the hardships he sustained, would be to pen what they would pronounce a romance, who had not traversed the country where tradition is yet eloquent with his exploits, or conversed with the descendents of his chiefs who cherish a recollection of the deeds of their forefathers and melt as they recite them, into many tears.

"Annals of Mewar".

త్రాంతము నంపె; 'షే'ర్ఖాలుఁడు ♦ తానును సమ్మతి చూపెఁ; గ్రుంకెఁ బ్రొ
ద్దంతట; రెండుసైన్యములు ♦ నచ్చట నిల్చెను నిద్ర నొందఁగన్. 122

చ॥ కొసరి కసాయి మేకలను ♦ గొంతులు గోయు విధాన, మారియున్
మసఁగిన యట్లు, మృత్యువది ♦ నాలుక సాఁచిన భంగి, ఢిల్లిసై
న్యసమితిపైన వ్రాలి తును ♦ మాడఁగఁ జొచ్చిరి నిద్రవోవుచుం
డు సమయమందె వంగసుభ ♦ టుల్ తమనాథుని యాజ్ఞ పెంపునన్. 123

మ॥ హుమయూ నంతటఁ బాఱె ఢిల్లిదెస; క ♦ త్యుగ్రుండు షేర్ఖాన్ ససై
న్యముగా వెంటను దాఁకె; నేమియును జే ♦ యన్ లేక యందును మా
ర్గమునన్ జిక్కిన వారిఁ జేర్చుకొని పా ♦ ఱన్ జొచ్చెఁ; బాంచాలదే
శము డాయంగనె రెండుసైన్యములకున్ ♦ సంగ్రామ మయ్యెన్ వడిన్. 124

సీ॥ రణమంచు వినిన మ ♦ రణమంచు బెదరి దిఙ్మార్గంబులకుఁ గొంత ♦ మంది నడువ!
సమద శాత్రవ పరా ♦ గము దృష్టిగతమైన మది కలంగియుఁ గొంత ♦ మంది పాఱ!
విమతసైన్యము దర్శ ♦ సము దండధరదర్శనంబని యడలి కొం ♦ దఱు తొలంగ!
మొదటి పిరంగి చ ♦ ప్పుడయినంతనె గుండె లవిసి నీరయి కొంద ♦ ఱవలి కుఱుక!

గీ॥ నాహుమాయూను త్రోవలో ♦ నష్టమైన జనులఁ జేరిచి చేసిన ♦ సైన్యమెల్లఁ
జేయి జారిన కడవయై ♦ ఛిన్నమయ్యె! షేరుఖాన్ ఢిల్లిఁ బట్టాభి ♦ షిక్తుడయ్యె! 125

మ॥ చమువుల్ లేక మహామహీవలయ రా ♦ జ్యం బూడిపోవంగ నా
హుమయూనున్ వెనువెంటనే తగిలి లా ♦ హోర్ దాకఁ బోనీక సై
న్యములన్ జేకొని షేరుఖాను తఱిమెన్; ♦ వాడంతటన్ దేశదే
శములన్ గ్రుమ్మరి నెచ్చెలేనిఁ దలదా ♦ చన్ వచ్చు నంచాసతో. 126

మ॥ స్తిమితత్వంబు వహింప కేగి యొకచో ♦ 'షేకల్లి'యన్ బారసీ
క మహాయోగిని గాంచి యాతఁ డడుగం ♦ గాఁ దెల్పె నాత్మీయవృ
త్తముఁ; దత్సన్నిధినున్న వానిసుత "యు ♦ ద్వాహమ్ము గావించుకొం
దు మహాభాగుని వీని నే"నన, నతం ♦ డున్ వాని కిచ్చెన్ సుతన్. 127

సీ॥ ఏలుటకు మహామ ♦ హీతలంబది లేదు! కొలువు సేయఁగ భట ♦ కోటి లేదు!
కాంచనాదిక ధన ♦ గ్రామంబులును లేవు! సముదార దివ్య భో ♦ గములు లేవు!
వసియింపఁగా మేటి ♦ భవనంబులును లేవు! తాల్ప ననర్ఘ వ ♦ స్త్రములు లేవు!
వాహ్యాళి యొనరింప ♦ వాహనంబులు లేవు! శ్రమదీఱ గంట వి ♦ శ్రాంతి లేదు!

గీ॥ కేవలము హుమాయూను వదు ♦ క్లేశమెంచి మనసు గరగించు సౌజన్య ♦ మహిమఁ గాంచి
కోరి యర్ధాంగమును బంచు ♦ కొనియె! నెట్టి పావనాత్మిక యో 'హమీ ♦ దా' వధూటి.

మ॥ వనితన్ యోధులఁ గొంచు యోధపుర భూ ♦ పాలున్ సమీపింప, వ
ద్దనె నాతండు; జసల్మియర్ ప్రభుఁడు పో ♦ మ్మంచాడెఁ; మర్వార్ నృపుం
డును బంధింపఁగఁ జూచెఁ; గొన్ని నెల లి ♦ ట్లున్ జెల్ల రారాజు చే
రెను దూరమ్మున సింధుదేశపు టెడా ♦ రిన్ దైవమున్ దూఱుచున్. 129

సీ॥ వైశ్వానర జ్వాల ♦ జ్వాలాసమూహంబు చిమ్మ సూర్యుఁడు ప్రకా ♦ శించుచుండ!
నుర్వీతలంబెల్ల ♦ నుష్ణాతలూఁగ జృంభించి వాయువు వెల్లు ♦ వీచుచుండఁ!
సుడికట్టి మండుటి ♦ సుక లేచి మిన్నంది వ్రాలి పాంథుల ముంచి ♦ వైచుచుండఁ!
బెక్కు యోజనములు ♦ వెడలిన నాల్కపైఁ జేర్పఁ జుక్కయు నీరు ♦ చిక్కకుండ!
గీ॥ నరులు దఱుమంగ! ననుచరు ♦ లంత మొంద! స్వర్ణసౌధంబుల వసించి ♦ పరమ సుఖము
మీఱఁదగు నిందుమాలా లె ♦ డారి యందు నాహమీడాలతాంగి యె ♦ ట్లరుగ నేర్చె!

గీ॥ రాచఱికమది బరువయ్యె ♦ రాజమౌళి; కనుచరత్వంబు బరువయ్యె ♦ ననుచరులకు;
నున్నవారెల్ల బరువైరి ♦ యొంటెయలకు; నొక హమీడ మాత్రము చలిం ♦ పకయె నిలిచె.

మ॥ హుమాయూ నెక్కిన యొంటెయున్ మడిసె న ♦ త్యుగ్రాతపవ్యాప్తిఁ; గూ
రిమి భృత్యుండని యొంటె నిమ్మనుచు టా ♦ ర్డీబేగు నర్థించెఁ; గ్రూ
రమతిన్ వాఁడు తిరస్కరించినె; నిం ♦ ద్రప్రస్థరాజ్యంబుఁ బూ
ర్ణముగా నేలినమేటి నీరమున క ♦ న్నన్ బల్చనయ్యెన్ గటా! 132

గీ॥ తురకతేనికిఁ గష్టముల్ ♦ పెటిఁగెఁ గాని పెక్కు విశ్వయత్నములు స ♦ ల్పినను గాని
కానరాదయ్యె వట్టివె ♦ కసము తక్క! నిండుదప్పి నార్పఁగ నొక్క ♦ నీటిచుక్క. 133

గీ॥ చూలుపండిన యాహమీ ♦ డాలతాంగిఁ జిచ్చుటెండ నెడారిలోఁ ♦ దెచ్చుటెల్లఁ
బూఁపపిందెల క్రొమ్మావి ♦ మొక్క నకట! తీవ్ర దావాగ్నిలో నిడ్చ ♦ తెచ్చుటయ్యె.

సీ॥ తడిలేక యెండి కొ ♦ ఱడు గట్టి నాల్క నాభిని జేర దిగఁగుంజు ♦ కొనుచుఁబోవ!
నెంతేని జలియించి ♦ హృదయకోశంబట్టి కుత్తుక కెకతొట్టు ♦ కొనుచురాఁగ!
మెదడు నీరసమయి ♦ ప్రిదిలి పైత్యోద్రేకమునను బ్రలాపసం ♦ ధిని వెలార్ప!
క్షితితలంబెల్ల భ్రమిం ♦ గినఁగాని తీరఁబో దనిపించు మరణవే ♦ దన కలంప!
గీ॥ నున్న కష్టంబు లట్టులే ♦ యుండ యవనభటులు దాహంబునకు నీరు ♦ వడయ లేక
పిచ్చియెత్తియుఁ గేకలు ♦ వేసికొనుచుఁ బాఱి రెల్లెడ నిసుకయె ♦ డారి నడుమ. 135

⊛ చ॥ కనిరొకబావి వేఁకువను ♦ కన్నులపండువు గాఁగ; దాన మో
టనిడి జలంబు దోలెడు న ♦ దగు వడి నెద్దులఁ దోలుకొంచుఁబో
వుసతని కొక్కచోఁ 'బయికి ♦ బొక్కెన వచ్చె'నటంచు మాటలున్
వినఁబడఁబోమిఁ బెద్ద రణ ♦ భేరిని గొట్టు టవశ్యమై తగెన్. 136

సీ॥ అతిదాహమున నోరు ♦ లట్టెతెఱచియున్న జనులు బొక్కెన నూయి ♦ కొనను నిలిచి
నిలువకమున్నె డా ♦ సిపయిన్ బడి జలంబుఁ ద్రావఁబోవఁగ దాని ♦ త్రాడు తెగుచు
బావిలో బొక్కెన ♦ పడె; దానివెంటఁ గొందఱు నూతఁ బడిరి; కొం ♦ దఱు మహోగ్ర
తాపమోర్వక సైక ♦ తస్థలిఁబడి ప్రుగ్గి; రిఁకఁగొంద ఱానూయి ♦ నెక్కి దూఁకి;
గీ॥ రంతఁ గొందఱు చేదితో ♦ యంబుఁద్రావి గుండె బరువెక్కి కూలిరి; ♦ కొంద ఱిట్లొ
'యమరకోట'కు నాఁటి సా ♦ యంతనంబు నడచి కన్గొని రచటి రా ♦ ణాప్రహరు 137

మ॥ మనుజాధీశుఁడు వారినందఱను స ♦ న్మానించె సౌఖ్యాంబెల
ర్పను; నైదున్ బదివందలున్ నలువ దా ♦ పై నింక రెండైన యే
టను నాకార్తిక జీవవారము 'హమీ ♦ డాభానుబీగంబు' పు
త్రుని నీల్గాడె నుదాత్తలక్షణయుతున్ ♦ దుర్వార తేజోనిధిన్. 138

§ శా॥ పెద్దల్ గోత్రజు లక్కుమారకునకున్ ♦ బ్రీతిన్ "మహమ్మజ్జలా
లుద్దీ నక్బరు" నామ ముంచిరి; హుమా ♦ యూన్ పాదుషా చూచి యా

---

⊛ On the fourth day of their retreat they fell in with another well, which was so deep that the only bucket they had, took a great deal of time in being wound up and therefore a drum was beat to give notice to the cassilas when the bucket appeared that they might repair by turns to drink. The people were so impatient for the water that as soon as the first bucket appeared, ten or twelve of them threw themselves upon it before it quite reached the brim of the well by which means the rope broke and the bucket was lost and several feel head long after it. When this fatal accident happened the screams and lamentations of all became loud and dreadful. Some lolling out their tongues rolled themselves in agony on the hot sand while others precipitating into the well met with immediate death.

'Annals of Mewar'.

§ On this Humayun ordered the musk bag to be brought and having broken it on a China plate he called his nobles and divided it among them as the royal present in honor of his son's birth. This event, adds Jowher, diffused its fragrance over the whole habitable world.

"Colonel G. B. Malleson C. S. I."

ముద్దుంగుఱ్ఱని కీర్తివల్లి దెసలన్ ♦ బుష్పింపఁ గాంక్షించుచున్
ముద్దుల్ముద్దులు పంచె నాప్తులకు స ♦ మ్మోదమ్ముమైఁ గస్తురిన్. 139
చ॥ తనుఁ గడుఁ జేరఁదీసి తల ♦ దాఁచుకొనన్ నెలవిచ్చి పేర్మి నె
క్కొనఁగ మెలంగు నయ్యమర ♦ కోటనృపాలునియొద్ద నాత్మమో
హనసతియా హమీదను ని ♦ జాత్మజు నక్బరు నుంచి వెంట న
య్యనుచరులేగుదేరఁగఁ బ్ర ♦ యాణమొనర్చె నతండు వెడియుః. 140
మ॥ త్వరమై నాతఁడు పారసీకమును గాం ♦ ధారంబు కాబూల్వసుం
ధరలన్ జేకొనెఁ గాని రాజ్యము స్థిర ♦ త్వం బూనకే సాఁగె; నీ
కరణిన్ దాఁ బదునాలుగేడులు మహా ♦ కష్టంబులన్ బొంది వం
దురె; నీలోపలఁ గొన్నిమార్పు లచటన్ ♦ దోతెంచె ఢిల్లీపురిన్. 141
మ॥ అల షేర్ఖాన్ బలశౌర్యశోభితుఁడు రా ♦ జ్యంబెల్లఁ గౌశల్యముల్
వెలయన్ బాలనచేసె; వానిపిదపన్ ♦ బృథ్వీశ్వరుల్ చాలను
ర్బలులున్ గ్రూరులు నౌట రాజ్యమది స్థై ♦ ర్యంబూడెఁ; గొన్నేండ్ల క
వ్వల రాజయ్యె 'సికంద'; రీతఁడు సురా ♦ పానక్రియాలోలుఁడౌ. 142
మ॥ స్థితి యిట్లుండుటెఱింగి దండుగొని డా ♦ సెన్ దా హుమాయూను; శూ
రతముం డుగ్రపరాక్రమక్రముఁడు బై ♦ రాంఖాను వచ్చెన్ జమూ
పతి; పంద్రెండవయేటనున్న సుతుఁ డ ♦ క్బర్ గూడ నేతెంచె; ను
ద్ధతిమై యుద్ధము సాఁగె ఢిల్లిని సికం ♦ దర్షా చమూపాళితో. 143
మ॥ కడు లేఁబ్రాయపుఁ జిన్నికుఱ్ఱఁడగు న ♦ క్బర్ ముందు నిల్చుండి యె
క్కుడు శౌర్యం బుసికొల్పి పూన్ప సుభటుల్ ♦ ఘోరంబుగాఁ దాఁకి ర
య్యెడ ఢిల్లీపతి యోడి పాఱె; విజయం ♦ బింపారఁ బట్టాభిషి
క్తుఁడునయ్యెన్ హుమయూన్ నిజాప్తులును సం ♦ తోషించి యుప్పొంగఁగన్. 144
సీ॥ 'షేర్మండలం'బను ♦ స్నిగ్ధసౌధంబున హుమయూను గూర్చుండి ♦ యొక్కనాఁడు
షాత్రముల్ చదువున ♦ ప్పుడు ప్రార్థనముచేయు కాలంబుఁ దెలుపుచు ♦ గంట మ్రోగె;
వడివడి దిగిరాఁగ ♦ దొడఁగె నాతఁడు; నునుపైయున్న మెట్లపై ♦ నడుగు జాఱెఁ;
బైనుండి క్రిందికిఁ ♦ బడుట గాజువిధానఁ దలయెల్ల వేయి వ్ర ♦ క్కలుగఁ బగిలె;
గీ॥ నవలఁ బంజాబునందున్న ♦ యక్బరటకు వచ్చె; బదునైదువందలేఁ ♦ బదియు నాలు
నగు శరత్తున నతనిఁ గ ♦ ల్యాణపురిని ఢిల్లిపతిఁజేసి రుద్యోగు ♦ లెల్లఁ గలిసి. 145

మ॥ ప్రవిశేషోగ్ర సమగ్రవిక్రముఁడు "బై ♦ రాంఖాను" క్షాత్రైకధ
ర్మవిదుం! డాహుమయూనుకోడలు సలీ ♦ మాదేవిఁ బెండ్లాడి బాం
ధవుఁడై యక్బరు బాల్యమూడి తరుణ ♦ త్వం బొందునందాఁక రా
జ్యవిధానంబును నిర్వహింపఁదొడఁగెన్ ♦ సంరక్షకుండై తగన్.

సీ॥ కాశ్మీరమందు సి ♦ కందరుశాహి సైన్యము ప్రోవుచేసి ర ♦ ణంబుఁ గోర,
నచటఁ గాబూలులో ♦ నక్బరు ప్రతినిధి తరుణంబు వీక్షించి ♦ తిరుగఁబడఁగ,
మాళ్వదేశాధీశ ♦ మణి ఢిల్లిపైఁబడు టెప్పు డెప్పుడటంచు ♦ నెగురుచుండఁ,
బులివంటిప్రోడ హే ♦ ముఁడు క్షణక్షణమును దండెత్తిరాఁ గాలు ♦ ద్రవ్వుచుండ,

గీ॥ నల్ల కాబూలుకొఱకేగ ♦ ఢిల్లి పోవు; ఢిల్లికై చూడఁ గాబూలు ♦ చెల్లిపోవు;
వెనుక నూయి ముందర గోయి ♦ యనుటయయ్యె శౌర్యధనుఁడు బైరాంఖాను ♦ సైన్యపతికి

క॥ తొలుత సికందరుశాహిని గలియుచు బైరాముఖాను ♦ కల్యాణూరన్
స్థలమున నోడింపఁగ నతఁ డలఘుగతి శివాలకద్రు ♦ లందున డాగెన్. 148

సీ॥ లక్ష పదాతి ద ♦ ళంబు కరుల్ వేయి తనవెంట నేతేర ♦ దండు వెడలి
హేముఁ డాగ్రాపురి ♦ కేగి చేకొనె దాని; నవల ఢిల్లీపురం ♦ బాక్రమించె;
బైరాముఖానుఁ డ ♦ క్బరు ససైన్యముగ సిద్ధంబైరి పానిప ♦ ట్టంబు నొద్ద;
నుభయసైన్యములకు ♦ యుద్ధం బెసఁగెఁ; దురుష్కులు శత్రుసేన ద్ర ♦ వ్యాలుగఁజేసి

గీ॥ హేము బంధించుకొనుచు బై ♦ రాముఁ జేర్చి; రతఁడు కారుణ్యమును మాని ♦ యక్బరుఁ గని
"శత్రుశేష ముపద్రవ ♦ సమితిఁ దెచ్చు! శీఘ్రముగ వీనిమ స్తంబుఁ ♦ జెండు"మనియె.

శా॥ "నామే ల్గూర్చి వచించు నీనుడిఁ దలన్ ♦ దాల్పంగనౌఁ గాని, యీ
హేముం డోడినవాఁడు; పట్టువడినాఁ; ♦ డీనాఁ డవధ్యుండు; నా
కై మన్నింపు"మటంచు నక్బ రనె; ఖ ♦ డ్గంబెత్తి ఖండించె బై
రాముం డత్తఱి హేముమ స్తమిలపై ♦ రాలన్ భటుల్ భీతిలన్. 150

సీ॥ క్షాత్రప్రధాన ని ♦ శాతవర్తనుఁడౌట నావేశ మది కొంత ♦ యలరుఁ గాని!
బైరాముఖానుఁ డ ♦ క్బరుఁ బెక్కుగురువుల వేర్వేఱ నియమించి ♦ వివిధవిద్య
లభ్యసింపఁగఁజేసె; ♦ నాతని వేయికన్నులఁజూచి వేయిచే ♦ తులను గాచి
ధరణిరాజ్యం బూర్జి ♦ తము చేసెఁ; గాబూలు చేకొనె; గాంధార ♦ సీమ గెలిచె; [చె;

గీ॥ జానపురం బజమీర్ ప్రదే ♦ శములు గొనియె; గ్వాలియరు పట్టుకొనియె; మా ♦ ర్వారునొం
క్షణము విశ్రాంతిఁగొనక రా ♦ జ్యములు గెలిచె నక్బరున్నతి పరమ ల ♦ క్ష్యముగనుంచి.

మ॥ అరుదెంచెన్ బదునెన్మిదేఁడులగు ప్రా ♦ యం; బప్పు డక్బర్ వసుం
ధరఁ దానేలఁ దలంచె; సేవకతతిన్ ♦ ద్రవ్యంబు నర్పించి సం
బరమొప్పారఁగ నాత్మరక్షకుని నా ♦ మక్కాకుఁ బంపించెఁ ద
గ్గఱ "నబ్దూరహిమాను" దత్సుతుని వే ♦ డ్కన్ జేర్చి పోషించుచున్. 152

సీ॥ ఆజానుదీర్ఘ బా ♦ హార్గళయుగళుఁ! డుద్యత్పద్మపత్ర నే ♦ త్రములవాఁడు!
ఘనసార్వభౌమ ల ♦ క్షణలక్షితుండు! ప్రసన్న మనోహరా ♦ స్యంబువాఁడు!
బలశోభితారోగ్య ♦ వచ్ఛరీరుండు! నీరదతుల్య గంభీర ♦ రవమువాఁడు!
శాంతిప్రధాన వ ♦ ర్చశ్శోభితుండు! దయాపూర్ణ మృదుహృద ♦ యంబువాఁడు!
గీ॥ కష్టము సహింపఁగలధైర్య ♦ గరిమవాఁడు! వితరణ వికాసములవాఁడు ♦ వేయునేల!
భరతఖండ మేలిన సార్వ ♦ భౌములందు నింతవాఁ డింక లేఁడను ♦ నంతవాఁడు. 152

సీ॥ అంచెల మార్చుచు ♦ నశ్వంబులను, స్వారి యిరువదైదామడల్ ♦ పఱచియుండె!
ఘూర్జరమ్మునఁ ద్రోవ ♦ గొప్పబెబ్బులి రాఁగ నద్దానిఁ జేతఁ జొ ♦ ప్పడఁచియుండె!
విడక "ఖండీరా" వ ♦ నెడి మత్తకరి నెక్కి యైదామడల దూర ♦ మరిగియుండె!
నాఁడుసింగము పిల్ల ♦ లైదు మందు కెడారియందుఁ బైఁబడఁ బీచ ♦ మణఁచియుండె!
గీ॥ నిరువురను దన సందిట ♦ నిఱికికొనుచుఁ గోటగోడలపై నెక్కి ♦ దాఁటియుండె!
నప్రతీపప్రతాప ధై ♦ ర్యములు దేహబల మితని సొమ్మనుచు మెచ్చ ♦ మెలఁగియుండె!

మ॥ భగవాన్దాసునిపుత్రి యొక్కరిత న ♦ క్బర్ కోరి పెండ్లాడె; నా
భగవాన్దాసుని సోదరాత్మజుఁడు "కు ♦ న్వార్" మానసింహుండు వీ
రగరిష్ఠుండయి ఢిల్లిఁజేరి పరరా ♦ ష్ట్రశ్రేణులన్ గెల్చి కీ
ర్తిగురుత్వంబు వహించి యక్బరుకడన్ ♦ దీపించె సేనానియై. 155

సీ॥ ముప్పాలుప్రజ హైంద ♦ వులుగాన వారిసేమము తనకెప్డు సే ♦ మమని తలఁచె;
సని జయించియుఁ బట్టు ♦ కొనినవారిని బానిసలఁ జేయుచట్టంబు ♦ నిలిపివైచె;
యాత్రలకేగు భ ♦ క్తావళితోఁ బన్నుఁ గొనరాదనుచు దానిఁ ♦ గొట్టివైచెఁ;
జిరకాలముగను వే ♦ సెడు జుట్టపన్ను న్యాయవిరుద్ధమని దాని ♦ నవలఁద్రోసె;
గీ॥ హైందవంబున యవనరా ♦ జ్యంబు నిలుప నెన్నియత్నముల్ వలయుఁ దా ♦ నన్ని చేసె;
మంచుమలనుండి కన్యాకు ♦ మారి దాఁక వసుధనెల్లఁ బాలింప న ♦ క్బరు దలంచె.

క॥ కొనె మేవాడ్దుర్గము; చేకొనె గోగొండ్కోట; యింక ♦ గోవిందవనం
బను దేశము గెలిచెను; గోటను నాగారపురమునన్ దృ ♦ ఢమ్ముగఁ గట్టెన్. 157

క॥ శరణని మాళవపతి దరి కరుదేరఁగఁ గూర్మిఁగని స ♦ హస్రహయాధీ
శ్వరసేనాధీశుఁగ నాదరమున నాస్థానమున న ♦ తనిఁ జేర్చుకొనెన్. 158

క॥ తపతీనదిపైఁగల బ్రహ్మపురంబును విజయగృహము ♦ నతిరయమారన్
నృపకులదీపకుఁ డక్బరు కృపకును లోనగుదుమనుచుఁ ♦ గ్రేళ్లురికె వడిన్. 159

క॥ రావలపిండి సమీపములో విలయాంతకునకైన ♦ లోఁగని గక్కా-
రాపీరుల కావర ముడివోవఁగఁ బంజాబుదేశ ♦ మును గెల్చుకొనెన్. 160

క॥ తూరుపుసీమల దృష్టిని సారింప నడేల్కులుండు ♦ చానార్ దుర్గ
ద్వారములు దీసి యక్బరు భూరమణుని పాదకమల ♦ ములు పూజించెన్. 161

క॥ నరసింగపూరు చౌరాఘురు మఱి హోసంగబాదు ♦ క్రమ మొప్పఁగ న
క్బరు బాదుశాహి చరణాంబురుహంబులు శరణమనుచుఁ ♦ బొగడుచు నిలిచెన్. 162

క॥ 'రండో పురుషోత్తమ!' యని ఖాండీషునృపుండు కాళ్లు ♦ గడిగి తనూజన్
మండలరాజ్యంబు నృపా ఖండలునకు నప్పగించెఁ ♦ గడుభక్తి మెయిన్. 163

గీ॥ చతురనంతబలంబులు ♦ సందడింప సింధు గంగా నదుల మధ్య ♦ సీమలందుఁ
జైత్రయాత్రాపరంపరల్ ♦ సలిపి దిగ్విజయము సాగించె నక్బరు ♦ చక్రవర్తి. 164

గీ॥ "భరతఖండైకభాగ్యమై ♦ పరగు రాజ పుత్రరాజ్యమేలని వాని ♦ పొడవు వృథయె"
యని నడిపె సేన;తద్భార ♦ మాఁగలేక యురగనాయకు ఫణము లు ♦ ఱ్ఱూఁతలూఁగె.

గీ॥ మహిత ధైర్యంబు తోడర ♦ మల్లు మేరు శిఖరమట్టి ఖాసింఖాను ♦ సింహమట్టి
బిరుదు'ఖాన్ ఖానను'పిడుగుల్ ♦ గ్రేళ్ల నలుపు భయదశౌర్యాలు నిలిచి ర♦క్బరును గొలిచి.

మ॥ అలఘుప్రాభవకీర్తివిక్రమయుతుం ♦ డౌ మానసింహుండు కొం
డలఁ బిండిన్ బడఁగొట్టు మేటి భగవాన్ ♦ దా సిందుసందున్న యో
ధులకున్ వృద్ధపితామహుం; డిరువురున్ ♦ దోతెంచి రీతండ్రికొ
డ్కులు దర్పించిన నడ్డుపాటు గలదే ♦ క్షోణీతలంబందునన్! 167

క॥ ఈమెయి నక్బరు నడుపు చమూమానం బింతయనఁగ ♦ బుద్ధిచోరదు; బు
స్సా మొదలుగఁ బాండోలీ సీమవఱకుఁ బదియుమైళ్లు ♦ సేనలు నిండెన్. 168

సీ॥ జలధులంతటి సర ♦ స్సులు పెక్కులుండెఁ; గ్రిందట వనాశానది ♦ నడచుచుండెఁ;
దరఁగని బహువిధ ♦ ధనధాన్యతతులుండెఁ; బైరు క్రొత్తఁగ నెక్కి ♦ వచ్చుచుండెఁ;
గోటలేదును జుట్టు ♦ కొని దృఢమ్ముగనుండె; సప్తమహాద్వార ♦ సమితియుండె;
గురుతరాయుధపరం ♦ పర చెంతనుండె; యోధతతి చిత్తములందు ♦ ధైర్యముండె;

గీ॥ నక్బరునకెకా దవ్వాని ♦ యబ్బురైనఁ దగ్గక రణంబు సాగింపఁ ♦ దగ్గ యున్న
సాధనము లుండె; లేమి యొ♦చ్చటనుగలుగ దుదయసింహరాణా లేమి♦యొకఁడుతక్క

ఉ॥ అంగడినున్న వన్ని శని ♦ యల్లునినోర నటన్న మాట వా
సిం గనఁజేసి యాయుదయ ♦ సింహుఁడు యుద్ధమటన్న భీతిచేఁ
గ్రుంగుచు రాజపిప్పలిని ♦ గోహిలు వంశ్యులయొద్ద డాఁగె; నై
నం గనరాదు లోపము ర ♦ ణం బొనరించెడు యోధకోటికిన్. 170

❀ సీ॥ అల సలుంబ్రాధీశుఁ ♦ డగు సాహిదాసు, శౌర్యాన్వితుండగు దేవ ♦ రాధిపతియు,
ఝేలాప్రభుఁడు శుద్ధ ♦ కీర్తి 'పుత్త' నృపుండు, బేద్లా కొఠారియా ♦ పృథ్వివరులు,
నింక మదేరియా ♦ నృపతి దూదాసింగు, పావనాత్ముండు ఝూ ♦ లావిభుండు,
ఝూలూరినేత యీ ♦ శ్వరదాసు, సోనెగుర్రేంద్రుఁడైన కరుణా ♦ సాంద్రరాజు,

గీ॥ గ్వాలియరుదేశపతి లోను ♦ గా మహీపులు పగిలెడు పిరంగిగుండులకు ♦ వక్షమిచ్చు
ధైర్యహేమాద్రులు విశేష♦దళము లలరఁ బోయినిల్చిరి గెలుపొ చా♦వొ యటంచు

క॥ అల్ల యమభటులఁగేరెడు బల్లిదులగు భటులు గొలువ ♦ వైరుల మనముల్
తల్లడిలఁగ వచ్చెను జయమల్లుఁడు రణరంగపార్థ ♦ మహితయశుఁడై. 172

---

❀ It (Chitor) lacked not however brave defenders. Sahidass at the head of a numerous band of the descendants of Chonda was at his post (the gate of the Sun) there he fell resisting the entrance of the foe, and there his alter stands on the brow of the rock which was moistened with his blood. Rawut Dooda of Madaria led the sons of Sanga. The feudatory chiefs of Baidla and Kotario, descended from the Prithwi Raj of Delhi, the Pramar of Bijoli the Jhala of Sadri inspired their contingents with their brave example; these were all home chieftains. Another son of Deola again combatted for Chitore with the Sonegurra Row of Jhalore. Eswaradass Rahatore, Karamchand Katchwaha with Dooda Sadani and the Tuar prince of Gualior were distinguished among the foreign axiliaries on this occasion........ But the names which shine brightest in this gloomy page of the annals of Mewar which are still held sacred by the bard and the true Rajaput and immortalized by Akbar's own pen, are Jaimall of Bednore and Putta of Kailwa, both of the sixteen superior vassals of Mewar. The first was a Rahtore of the Mairtea house, the bravest of the brave clans of Marwar, the other was head of Jugawats another grand shoot from Chonda. The names of Jaimall and Putta are as household words inseperable in Mewar and will be honored while the Rajput retains a shred of his inheritance or a spark of his ancient recollections.

"Annals of Mewar"

సీ॥ ఇతఁడు మార్వార్మహీ ♦ పతి మాళదేవుని సుతుఁడు; బాల్యమునందె ♦ శూరలోక
చూడామణియన వి ♦ శుద్ధకీర్తి గడించెఁ; దండ్రి కీతనికి భే ♦ దంబు వచ్చి
చిననాఁడు తనదేశ ♦ మును వీడి వెడలె; నీతని భుజాటోప దు ♦ ర్దాంతత విని
చిత్తూరిరాణాయుఁ ♦ జేయిచ్చి మన్నించి బదనూరు సంస్థాన ♦ పతి నొనర్చె;
గీ॥ మహితధైర్యంబు వజ్రప ♦ ర్యంబుగాఁగఁ దనదు రాఠోణ్మహావీర ♦ తతులఁ బూన్చి
తగిలి బ్రహ్మాండమైనఁ బిం ♦ డిగ నొనర్చు రౌద్రితరధాటిఁ గాలాగ్ని ♦ రుద్రుఁడితఁడు.
క॥ కృప నాదరించు చిత్తూర్ నృపచంద్రుని పనులు మేని ♦ నెత్తురు కండల్
విపులముగ ధారపోసి జరుపు స్వామిస్నేహబంధు ♦ రుల్ వీరెల్లన్. 174
సీ॥ సమర మనేకమా ♦ సము లయ్యె; నక్బరు పెక్కురుపనివాండ్రఁ ♦ బిలువనంపె;
దుర్గంబుక్రింద గో ♦ తులను ద్రవ్వించి చొప్పించి యగ్నిరజంబు ♦ ప్రేలిపించెఁ;
జిత్తూరిసేన కా ♦ చిననూనియలు శిలల్ గుప్పుచు వైరులఁ ♦ గూల్చుచుండెఁ;
యవనులు తలలపై ♦ శవకోటిఁగప్పి దుర్గము క్రిందఁ ద్రోయంగఁ ♦ గడగుచుండి;
గీ॥ రెప్పుడునుగాని యాగోడ ♦ లెచటఁగాని పగులుటయుఁగాని సేన లోఁ ♦ బడుటగాని
కానరాదయ్యె! నక్బరు♦గడియగడియ కెటులెటులటంచు విసుగు నొం♦దుటయుకాని.
సీ॥ ఉన్నమందంతయు ♦ నొకమాఱె పెక్కుతావులఁ బోసి కూరి ని ♦ ప్పును ఘటింప
నొకగని ప్రేలె; ముం ♦ దుండిన మొగలుల్ గూలిరి; గోడయుఁ ♦ గొంత యురలె;
దానితోఁ గొంద అం ♦ తెమునొంది; రీవ లావలివారు ముందుకుఁ ♦ గలయదూఁకి;
రంత బ్రహ్మాండంబు ♦ నగలించు నొకపెద్ద ధ్వనితోడ నొండొక్క ♦ గనియుఁ బ్రేలె;
గీ॥ దాన యవనహైందవులగా ♦ త్రములు గాలిఁగలిసె శతశ స్సహస్రశః ♦ ఖండములయి,
విఱిగె నొకగోడ;యచటఁ బె♦క్కురుయవనులు హైందవులు చేరి;రయ్యె ఘో♦రాహవంబు.
క॥ రణరంగమ్మున గేంద్రులు చోహాణవీరులతో. గోశేరి ♦ యా-బేడ్లారా
ణ్మణు లాసమ్మర్దరణాంగణమునఁ దెగి స్వర్గసీమఁ ♦ గట్టిరి గృహముల్. 177
క॥ హరవంశ్యుల నడుపుచు నీశ్వరదాసును దేవరాధి ♦ పతియును ఝూశే
శ్వరుఁడును బెండ్లికి నడిచిన కరణిని నని కేగి మడిసి ♦ కనిరి యశంబుల్. 178
క॥ దురమున దూదాసింగును గరుణాసాంద్రుండు వైరి ♦ గణము స్త్రముల్
దఱుగుచు రాసులు పోసిరి పరలోక ద్వారసీమ ♦ వఱ కవ్వేళన్.
క॥ భండన శతఘ్ను లనఁదగు చోండావద్భటులతో వి ♦ శుద్ధ యశస్సాం
ద్రుండైన సాహిదాసుఁడు ఖండితుఁడై యొరగె భటులు ♦ కళవళ మందన్. 179

⊕ క॥ చండ నృపాఖండలు కులమండనుఁ డరిదండధరుఁ డ ♦ మాత్యుఁ డితండుఁ
బడినయెడ నీనాఁటి కఖండ స్తంభం బొకండు ♦ గనస్నై యుండుఁ. 180

సీ॥ సాహిదా సేగ నా ♦ స్థానంబు మఱలఁ జొండావత్కు లుండె చెం ♦ దవలెఁ; గాన
భారమ్ము పుత్రుపై ♦ వ్రాలెఁ; బ్రాయము పదునా ఱేండ్లు; తండ్రి లేఁ; ♦ డమ్మ పెంచెఁ;
నిందుకు మూన్నాళ్ల ♦ ముందె పెండిలియయ్యెఁ; బసపుగుడ్డలతోడ ♦ వచ్చి సేన
కధిపతియౌచు సూ ♦ ర్యద్వారమున విజృంభించుచు నారాత్రి ♦ పెండ్లికొడుకు

గీ॥ గొఱ్ఱెయలమందఁ జొచ్చి గ ♦ గ్గోలుపఱచు బెబ్బులివిధానఁ దురకల ♦ పిండు నఱికె;
నామహాబాహు బాహుశౌ♦ర్యంబుఁ గాంచి యుభయసైన్యంబులును దల♦లూఁచినిలిచె

⊕ గీ॥ నవ్వు చవ్వీరు జనని చోం ♦ డావదన్వయము యశము పెంచు క్షాత్రవీ♦రావతార
కోడలిని వెంబడిని బిల్చి ♦ కొనుచు వచ్చి వైరిశిరములు రాసులు♦వడఁగ నఱికె.

సీ॥ ముద్దుమోమున నాణె ♦ ముత్తెంపుబాసికం! బద్దంపుఁజెక్కుల్ల ♦ యందు మెఱుఁగుఁ
గాటుకచుక్కయుఁ! ♦ గాళ్లఁ బారాణియుఁ! బసపువన్నియ పెండ్లి ♦ వస్త్రములును!
సకల కల్యాణ భూ ♦ షణరాజితోఁ! దనుత్రాణంబుఁ దొడిగి హ ♦ స్తమున ఖడ్గ
మరలఁ బ్రాణేశ్వరు ♦ నండ నిల్చుచు సత్య నరకుసేనల నట్లు ♦ నఱికె రిపుల;

---

⊕ The Rajput premier is the military minister, with the political Government of the fiefs; the civil minister is never of this caste. At Udaipur he is called Bhanjgurh. His influence, necessarily gives him unbounded authority over the military classes with unlimited power over the inferior officers of the state......... When "Rana" of Udaipur leaves the capital, the Salumbra. -Chief is invested with the government of the city and charge of the palace during his absence. By his hands the sovereign is girt with the sword and from him he receives the mark of inauguration on his accession to the throne. He leads by right the van in battle, and in case of the siege of the capital his post is the Suryapol (the gate of the Sun) and the fortress which crowns it in which this family had a handsome palace which is now going fast to decay.

"Annals of Mewar"

⊕ When Salumbra fell at the gate of the Sun, the command devolved on Putta of Kailwa. He was only sixteen, his father had fallen in the last shock and his mother had survived but to rear this the sole heir of their house. Like the Spartan mother of old, she commanded him to put on the 'Saffron robe' and to die for Chitore. but surpassing the Grecian dame, she illustrated her precept by example; and lest any soft compunctious visitings for one dearer than herself may dim the lustre of Kailwa she armed the young bride with a lance, with her descended the rock and the defenders of Chitore saw her fall fighting by the side of her Amazonian mother.

"Tod's Rajasthan."

గీ॥ "వెన్నముద్ద పిరంగిరై ♦ వెడలివచ్చె! హరిణశాబము బెబ్బులి ♦ యగుచు దూఁకె!
నబ్జినీలత బ్రహ్మాస్త్ర ♦ మగుచుఁ దాఁకె"నన రణమొనర్చె నాపుత్త♦యనుఁగుఁ బడఁతి.

గీ॥ పుత్తయు-నవోఢ-తల్లియు ♦ దృప్తిఁ బోరి దస్యుగళరక్తముల వసం ♦ తమ్ము లాడి
తల్లి చిత్తూరులక్ష్మిపా♦దముల నొఱిగి సమసి రుభయసైన్యములు బా♦ష్పములు విడువ.

సీ॥ ధన ధాన్య వసన వా ♦ హనము లియ్యఁగవచ్చుఁ; గోరిన తిండి చే ♦ కూర్పవచ్చు;
గంధంబు మెయినిండ ♦ గా రాయఁగావచ్చుఁ; బెక్కు-భూషణములు ♦ పెట్టవచ్చుఁ;
దాదలేని విద్యలు ♦ చదివింపఁగా వచ్చు; విభవంబు లెన్నేనిఁ ♦ బెంపవచ్చుఁ;
గ్రింద మన్నని శిర ♦ మందుఁ జేర్పఁగవచ్చు; నమరాద్రి తెచ్చి యి♦య్యంగవచ్చుఁ;

గీ॥ గాని రణదుర్గ కల్పింపఁ ♦ గన్నకొడుకుఁ గోడలిని బంపి దీవించి ♦ తోడు వచ్చి
శత్రుశవకోటిపై వీర ♦ శయన మందెఁ; బుత్త! నీతల్లి యెంతటి ♦ పుణ్యవతియొ! 186

సీ॥ క్షాత్రధర్మైకని ♦ ష్ఠులుఁడు రాథోడ్వంశజులకెల్ల ఘనయశో ♦ జ్యోతియైన
జయమల్లుఁ డవ్వలి ♦ క్షణమె సూర్యద్వారసీమకు నడచుచుఁ ♦ జిచ్చువోలెఁ
బరసేనఁ దాఁకి కొ ♦ బ్బెరకాయలవిధానఁ దలలు కుప్పలుగాఁగ ♦ నిలను రాల్చి
దక్షాధ్వరధ్వంస ♦ దారుణాకృతిఁ బెంచు వీరభద్రుఁడువోలె ♦ వెలుఁగఁజొచ్చె;

గీ॥ "నకట! నాభాగ్యమున సూర్యుఁ♦డస్తమించి యాగె రణ; మీతనికి గంట♦వ్యవధియున్న
సేన సర్వసంహారంబు ♦ చేసియుండు" ననుచు నక్బరు వెఱగొందె ♦ నతని కృతికి.

మ॥ ప్రళయారంభమునాఁడు లోకముల గూ ♦ ల్పన్ వచ్చు నారుద్రునిన్
దలఁపన్ జేయుచు దుర్నివారబలవ ♦ ద్ధాటీసమారంభమై
యలఘూద్యజ్జయమల్ల మందర మమి ♦ తానీకినీవారిధిన్
గలఁపన్ జొచ్చెను! బ్రొద్దు గ్రుంకె రణ మం ♦ తం బందె నానాఁటికిన్. 188

§ చ॥ పలుచని పాలవెన్నెలలు ♦ పైనొలయన్ జయమల్లుఁ డాత్మయో
ధులఁగొనుచున్ బరాహ్ణమున ♦ దుర్గముగూలినచోట రాలు సం
దులనిడి బాగుసేయుటను ♦ దూరమునన్ గని యక్బరంతలోఁ
గొలిపెను గుండు 'సంగ్ర'మను ♦ నొప్పతుపాకిని బట్టి పేల్చుచున్. 189

---

§ By the light of the torches Akber recognised the Rajput general and believing him to be within distance, he fired and killed him on the spot. The Rajputs rallied indeed subsequently but it was too late and though they exerted to the utmost they could not regain the lost advantage. When the day dawned Chitore was in the possession of Akber. "G. B. Malleson"

మ॥ విదితాగ్నిప్రభలొప్పు మండుచుఁ గడున్ ♦ వేగంబ హృత్కోశమం
దది దూరన్ జయమల్లసూర్యుఁ డకటా! ♦ యస్తంగతుండై భయా
స్పదదుఃఖాంధతమంబునన్ విడిచె మే ♦ వాహ్యప్రపంచంబు; నె
ల్లదళంబుల్ స్పృహతప్పి బెండువడి నే ♦ లల్ వట్టె దైన్యంబునన్. 190

మ॥ అకటా! సింధుకు బ్రహ్మపుత్రకును మ ♦ ధ్యన్ గల్గు నీసర్వధా
త్రికి రారాజవు! యుద్ధ మాఁపుతజి! రా ♦ త్రిన్! గార్యనిర్మగ్నుఁ! జౌ
ర్యకృతిన్ జంపితి వెచ్చరింపకయె నీ ♦ రవ్రాతశార్దూలు; నే
టికి నీగొప్పతనంబు ధర్మమును బా ♦ టింపంగ లేకున్నచో. 191

చ॥ విలయకృతాంతమూర్తు లిటు ♦ పెక్కురు నాథులు గూల ధైర్యముల్
నిలువక యోధు లందఱును ♦ నిల్చిరి జీవము లేని బొందులన్
వలెఁ; దరుణీజనుల్ పడిరి ♦ వహ్నిని; నెన్మిది వేలు రాజపు
త్రు లపుడు తమ్ములమ్ముఁ గొని ♦ తోడ వసంతములాడి ముందటన్, 192

క॥ సూర్యద్వారము ధైర్యాహార్యములై యపుడు తెఱచి ♦ యవనుల విజయా
వార్యుల నఱకుచుఁ దామును శౌర్యము రాజిలఁగఁ బోరి ♦ సమసిరి వరుసన్. 193

ఉ॥ కూలిరి వేల కింగనలు! ♦ కూలిరి నూర్లకు రాజబంధువుల్!
కూలిరి వీరపుంగవులు ♦ గొబ్బున ముప్పది వేలమంది! య
వ్వేళను బెక్కువంశముల ♦ పెద్దలు గూలిరి! త్వారువంశుఁడౌ
గ్వాలియరీశుఁ డొక్కరుఁడె ♦ ప్రాణముతో మనియుండె! నేమనన్! 194

సీ॥ సంవత్సరంబు క ♦ ష్టము చేసి గెలిచిన చిత్తూరిలోఁ బ్రవే ♦ శించి యచటి
సౌధరాజములు ప్రా ♦ సాదంబులును గుళ్లు గొప్పకట్టడములు ♦ కూలఁద్రోసి
పెదపెద్దవగు రణ ♦ భేరులు డంకాలు గొని భవానిదేవి ♦ కోవెలఁ గల
స్వర్ణదీపస్తంభ ♦ సమితియుఁ జిత్తూరునగరమ్ము ద్వారబం ♦ ధములు గొనుచుఁ
గీ॥ కుంభవిశ్వంభరాధీశ ♦ జంభవైరి దగు జయస్తంభ మాదిగా ♦ నచట నున్న
పూర్వరాజ విక్రమచిహ్న ♦ ముల నఖిలము వీడ కక్బరు బగ్గము ♦ పాడు చేసె. 195

§ గీ॥ తనకు లొంగక తవిలి మా ♦ ర్కొనిన రిపుల కన్నివిధముల సాయమై ♦ రనుచు దుర్గ
వాసులందఱి నఱికి ము ♦ ప్పదియువేలు పంతువంటి సంసారముల్ ♦ పాడుచేసె.

§ Akber entered Chitore, when thrity thousand of its inhabitants became victims to the ambitious thirst of conquest of this "Guardian of mankind." All the

మ॥ తనచుట్టుంగల రాతిగోడ హిమవం ♦ తంబట్లు దుర్భేదమా
నని శత్రుల్ భయమొందిపాఱ నొకవే ♦ యబ్దంబులుం గీర్తిమో
సిన విశ్వోన్నత పట్టణప్రవర మా ♦ చిత్తూర్ కటా! కాంతుల
ల్లను గోల్పోవుచుఁ గాడుగా నిలిచెఁ! గా ♦ లం బింక నెబ్బాంగిదో! 197

సీ॥ చిగురైనఁ జిదుము నొ ♦ చ్చెడుచోట ముప్పదివేలపౌరులఁ గూల్చెఁ ♦ జాలి తెట్టు!
కలవె భేరులు! నీకుఁ! ♦ గడుపు నిండెనె! ప్రాతతోల్మక్కలే! కాని ♦ దొరకఁగలదె!
దివ్వెకంబముఁ గొంటె! ♦ తీఱెనే నీదరిద్రత! కటా భూరి సా ♦ మ్రాజ్యపతివె!
కోట గెల్చితిగాక! ♦ కుంభు జయ స్తంభ మేల కూల్చితి! లాభ ♦ మేమి నీకు!

గీ॥ గుడుల దివ్వెలార్చెదు వచ్చి ♦ కూళలైనఁ జేకొనరె! యెట్లు చేయాడెఁ ♦ జిత్తురుపురి
ద్వారబంధముల్ గొనఁ! జల్ల ♦ పడెనె కనులు! సరస గుణధామ! యక్బరు ♦ సార్వభౌమ!

సీ॥ చిత్తూరునగర ల ♦ క్ష్మీభాగ్య సౌభాగ్య మానాఁటితోడనె ♦ యంతమొందె;
నవల మేవాడ రా ♦ జ్యమున కయ్యది రాజధానిగనై విభవ మం ♦ దంగ లేదు;
కోటల నెవరు బా ♦ గుపడఁ జేయఁగ లేదు; భేరీధ్వనులు విని ♦ పింపలేదు;
పుడమితో ఢ్లిప్పుడం ♦ దడఁగివదియు లే; దొకయింట దీపంబు ♦ నుండ లేదు;

గీ॥ యవనపతి చేసిచనిన మ ♦ హాపకార మనుదినము చాటు చిప్పటి ♦ కల్లె భయద
మృగములకుఁ గంటకావృత ♦ వృక్షములకు వాసమైయున్న! దెంతటి ♦ పాతకంబొ!

గీ॥ మహిత చిత్తూరునగర సా ♦ మ్రాజ్యభవ్య నాటకాభ్యంతరమున నీ ♦ నాఁటి కకట!
కట్టకడ తెర వ్రాల మం ♦ గళముపాడె ననఁగ ధ్వని లేపుచుండు వి ♦ హంగతతులు!

---

heads of clans both house and foreign, fell; and seventeen hundred of the immediate kin of the Prince sealed their duty to their country with their lives. The Tuar chief of Gualior appears to have been the only one of note who was reserved for another day of glory. Nine Queens and five Princesses with two infant sons and the families of all the chieftains not at their estates, perished in the flames or in the assualt of this ever memorable day. Their divinity had indeed deserted them, for it was on Auditwar (the day of Sun) he shed for the last time a ray of glory on Chitore. The rock of their strength was despoiled; the temples, the palaces dilapidated; and to complete her humiliation and his triumph, Akber bereft her of all the symbols of regality; the nakaras whose reverberations proclaimed for miles around, the entrance and exit of their Princes, the candelebras from the shrine of the Great Mother and in mockery of her misery, her portals, to adorn his projected capital Akberabad. The abode of regality which for a thousand years reared her head above all the cities of Hindusthan is become the refuge of wild beasts which seek cover in her temples. "Annals of Mewar."

క॥ 'పదునై దువందలును నర్వదియెనిమిది' యనిన సకల ♦ పరిభవముల కా
స్పదమని మేవాడ్ ప్రజ లాపదమును నేఁటికిని వినఁగఁ ♦ బొల్పడ రకటా! 201

సీ॥ ఆరణంబున నక్బ ♦ రజరామరఖ్యాతిఁ గను శౌర్యధను లిద్ద ♦ అనుచు మెచ్చి,
జయమల్లు పుత్తల ♦ సత్కీర్తికై వారి విగ్రహంబులు రచిం ♦ పించి, ఢిల్లి
లో మహాద్వారంబు ♦ సీమ నిర్వంకల వాని రెండేన్గుల ♦ పైన నుంచి
హితులును బంధులు ♦ నేతేరఁ జూపి వారల శౌర్యకథనముల్ ♦ దెలుపుచుండుఁ!

⊛ గీ॥ గొండలట్లుండు నమ్మేటి ♦ కుంజరములు వానిపై నున్న యవ్వీర ♦ వరులు నేఁటి
కటకరిగి చూచువారల ♦ స్వాంతసమితి నెంత వెఱపుఁగూర్తురో! దేవుఁ ♦ డే యెఱుంగు.

—*) ఉదయసింహుఁ డుదయపురముఁగట్టి కాపురముండుట. (*—

చ॥ కదనము నిల్చిపోయెననఁ ♦ గ్రమ్మరి వచ్చి తటాకమున్ ముదా
స్పదముగఁ గట్టి పే 'రుదయ ♦ సాగర'మం చిడి చెంతనే వసిం
చెదనని కట్టె నిల్లుదయ ♦ సింహుఁడు; పెక్కురు కట్టిచేరి రం;
దుదయపురాభిధానమున ♦ నొప్పెఁ బురంబది వాని పేరునన్. 203

క॥ చిత్తూరి రాజ్యమంతయు ముత్తునియలుగాఁగ నుదయ ♦ పురరాజమె స
ర్వోత్తమము చాలునంచని యిత్తఱి నయ్యుదయసింహుఁ ♦ డేలఁదొడంగెన్; 204

---

⊛ I find nothing remarkable at the entry but two great elephants of stone which are in the two sides of one of the gates. Upon one of them is the statue of Jaimall, that famous raja of Chitore and upon the other Putta his brother. These are two gallant men that together with their mother who was yet braver than they, cut out so much work for Akber; and who in the seiges of towns which they maintained against him gave such extraordinary proofs of their generosity, that at length they would rather be killed in the outfalls with their mother than submit and for this gallantry it is, that even their enemies thought them worthy to have these statues erected to them. These two great elephants together with the two resolute men sitting on them, do at the first entry into this fortress make an impression of, I know not what greatness and awful terror.

Letter written at Delhi 1663.

Such the impression made on a Persian, a century after the event, but far more powerful the charm to the author of these annals, as he pondered on the spot where Jaimal received the fatal shot from Singram, or placed flowers on the cenetaph that marks the fall of the son of Chonda and the mansion of Putta whence issued the Sesodia matron and her daughter. Every foot of ground is hollowed by ancient recollections.

"Annals of Mewar".

క॥ సుతు లిరువదియైదుగురై సతతము బహుపుత్రకులకు ♦ జనకుండని సం
స్తుతికెక్కెఁ; గాని రాజ్యోన్నతి కేమియుఁ జేయఁ డితఁడ ♦ నామకుఁడగుచున్. 205

సీ॥ ఉదయసింహుఁడు పూర్వ ♦ మొకనాఁడు కొలువుండ నొకకత్తి లోహకా ♦ రకుఁడు దెచ్చె;
నది పదనైనదో ♦ యనిచూడ నొకపుల్లఁ గొంచెము చివ్వ యం ♦ దుంచెఁ గత్తి;
యచటనుండిన సూక్తుఁ ♦ డైదేండ్ల బాలుండు 'కత్తు లొరుల నఱు ♦ కఁగనె కాని
పుడకలుచివ్వ నే ♦ ర్పడ' వంచుఁ దనదు హస్తము చీల్చె; దాన గొ ♦ ట్టమునఁ జిమ్మి
గీ॥ నట్లు వేడినెత్తురు గాఱి ♦ యచటి రత్న కంబళంబంత రక్తసి ♦ క్తముగ నయ్యె;
నందఱాశ్చర్యమగ్నులై; ♦ రక్కుమారుఁ డచలుఁడై చూపు తండ్రి యా ♦ స్యముననిలిపె.

మ॥ తను నెప్డైనను జంపు నీతఁడని భీ ♦ తస్వాంతుఁడై ఱేఁడు "వీ
నిని గొంపోయి వధింపుఁ"డంచు భటులన్ ♦ నేమించె; వారున్ మహా
వనమున్ జేర్చిరి; త్రోవవచ్చెడు సలుం ♦ బ్రాకృష్ణుఁ డీక్షించి యా
తనిఁ దోడ్తెచ్చుచు నింటఁ జేర్చుకొని పు ♦ త్రప్రేమఁ బెంచెన్ వడిన్. 207

—*) ఉదయసింహుఁడు జగమల్లుని రాజుచేయఁ గోరుట. (*—

సీ॥ చిత్తూరుదుర్గంబు ♦ చెడిన నాల్గేండ్లకు వసుధేశునకు గొప్ప ♦ వ్యాధి గలిగె;
మఱఁదులు సచివసా ♦ మంతబాంధవజనుల్ గనుఁగొనవచ్చి; రొ ♦ క్కదినమందు
నుదయసింహుఁడు వారి ♦ నొద్దకుఁ బిలిచి "నే మనఁబోను; నానోట ♦ మాటయున్న
యపుడె నావెన్క మీ ♦ రాచరింపఁగఁదగ్గ పనులు దెల్పినను మే ♦ లనుచుఁ దోఁచెఁ!
గీ॥ కొడుకు లిర్వదైదుగురు నా ♦ కుం గలిగిరి; సూక్తుఁడు ద్వితీయుఁ; డైదేండ్లు ♦ చొచ్చినపుడె
చేరఁగొనిపోయి యీకృష్ణ ♦ సింగు పెంచుఁ బరమవాత్సల్యమున సలుం ♦ బ్రాపురమున.
గీ॥ చందురునినిండ జ్యోత్స్న యుం ♦ పొందినట్లు నగవు మొగమునఁగులుక సుం ♦ తయుఁగలఁగక
తనగళంబున వేఁడిర ♦ క్తంబునైన నేఱు పాఱింపఁగల కడుఁ ♦ గ్రూరుఁ డతఁడు. 209

క॥ అదయుం డతఁ డిలువెడలుట పదికోట్లని యుంటె; వానిఁ ♦ బార్థివుగాఁ జే
యఁదగునె? దేశము సర్వంబు దహించు నొకింత యనల ♦ మును లేకుండన్. 210

ఉ॥ మూఁడవవాడు సాగరుఁడు; ♦ మూర్ఖులలోఁ బ్రథముండు! నిర్వదా
నేఁడులు వచ్చె; నుండఁ డెపు ♦ డేనియు నొకడ; నాల్కవేఁడి; యే
నాఁడును ద్రవ్య మిచ్చియయి ♦ నన్ ఋణమున్ గొనితెచ్చి పెట్టు; మే
వాడధరిత్రి నాకొఱవి ♦ పాలనచేసిన మీకు నచ్చునే! 211

చ॥ నరహరి! వీఁడు నాసుతుల ♦ నాల్గవవాఁడగు; మింటఁ బెట్టినన్
గురియదు వాన; నేలనిడఁ ♦ గోల్కొనఁబోవదు పైరు; పిల్చినన్
దరియఁడు; చెంతకేగిన క్షు ♦ ణంబునఁ బర్విడు; వట్టి యగ్గియా;
నరహరిగాదు ప్రాణహరి ♦ నాకతఁ డియ్యెల నేల సర్వ్యుఁడే! 212

సీ॥ సకలమేవాణ్మహీ ♦ చక్రభారము దాల్చి పాలింపవలసిన ♦ ప్రథమపుత్త్రుఁ
డాప్రతాపుం డెప్పు ♦ డతిసాహసికుఁడు! యుద్ధంబన్న విందని ♦ తలఁచుచుండు!
నొరులతోఁ బలుకఁడు! ♦ పరులను బిలువఁడు! నవ్వఁడు నొవ్వఁ డే ♦ నాఁడుగాని!
యనుకొన్నపనిని జే ♦ సినదాఁక విడువఁడు! నామాటయనిన సుం ♦ తయును జెల్ల
గీ॥ దిల్లనక వాకిలనక రే ♦ యెల్లఁ దిరుగు! మనరిపులు భిల్లపతులతో ♦ మైత్రిసేయు!
నిది పెదవిదాటు పల్లని ♦ యెపుడొ విడిచి! తేమి చేయుదు! నాభాగ్య ♦ మిట్టు లుండె!

చ॥ ఇరువదియైదు పుత్త్రకుల ♦ నిర్వదినల్వురు మాది యిట్టులుం
డిరి! జగమల్లుఁడొక్కఁ డిది ♦ నీదని నాదని కొంత కాపురం
బెఱిఁగిన బుద్ధిశాలి; యెపు ♦ డింటనె యుండి సమస్తకార్యముల్
జరుపుచునుండు; నందఱను ♦ జక్కఁగఁ బిల్చియు మాటలాడెనున్. 214

చ॥ అదియును నాఁడువారని య ♦ నాదర మూనక యమ్మ యప్పయుం
చెద గరఁగన్ జరించు; నెపు ♦ డేనియు శౌర్యము గర్వమించునన్
వదరఁడు; బైటఁబోఁడు; భయ ♦ భక్తులు గల్గిన ప్రోడ; సద్గుణా
స్పదుఁడని మీ రెఱుంగుదురు ♦ వాని నొకించుక సేపు చూచినన్. 215

చ॥ కొడుకుల శ్రేయమున్ దలఁచి ♦ గొప్పగఁ దండ్రులు చెప్పఁగూడ, దా
తఁడె సకలావనీభరముఁ ♦ దాల్పఁగ యోగ్యుఁడు; నాదు మాటలన్
బెడచెవిఁ బెట్ట కాదరము ♦ పెంచుచు నాదు ననంతరమ్మ మీ
రుడుగక సింహపీఠమున ♦ నుంచుచు వానిని రాజుఁ జేయుఁడీ! 216

మ॥ మఱియొక్కం! డధికారిమంతయు సలుం ♦ బ్రినాథుఁడున్ నాయనం
తరమందున్ వహియించి యేర్పఱచు రా ♦ జ్యానొక్కనిన్ గాన; ని
త్తఱి నాతో జయమల్లు రాజుగను సం ♦ స్థాపింతువం చాతఁడిం
దఱిలోఁ జెప్పుచుఁ జేతఁజేయిడినచో ♦ నాయాత్మ శాంతిన్ గనున్." 217

మ॥ అనుచున్ బల్కినఁ గృష్ణసిం గుదయసిం ♦ హాధీశ్వరున్ "నీయను
జ్ఞను బాలించిన మేటిభాగ్యముగు; రా ♦ జస్థానసింహాసనం

బునఁ జూతుర్ జగమెల్లు; నేకొఱ మనం ♦ బుల్ జేరఁగా నీకు; దే
వుని ధ్యానించుచు శాంతి నొందు"మని సం ♦ బోధించె నయ్యందఱల్. 218

చ॥ త్వరపడి కృష్ణసింగు వసు ♦ ధాపతిమాటల కొప్పెనంచు నం
దఱును నతృప్తిగాంచి వగ ♦ దారఁగ నుండిరి; కాని, క్షత్రివా
దరకరణిన్ బ్రతాపగుణ ♦ తన్మయుఁ డప్పులిరాజు మ్రోల నె
వ్వరిదియుఁ గాదు కూడదని ♦ పల్కఁగ నేర్తురు ధైర్యమూనుచున్! 219

మ॥ శిరముల్ వంచుచుఁ బ్రక్కప్రక్కలకు వి ♦ చ్చేసెన్ మహామండలే
శ్వరసంఘంబు; పరితాపమామయగు నా ♦ ఝులూరిరా వెల్లుఁడ
ద్దిర! రాజౌనను నాస లూఁడెనని చిం ♦ తించెన్; మహారాజ్ఞియున్
గరమున్ శోషిలె; బంధు లందఱును బో ♦ కన్ జొచ్చి రవ్వార్తకున్. 220

మ॥ "అవురా! పుత్రులలోన జ్యేష్ఠుఁడు ప్రతా ♦ పాలంకృతుం డా ప్రతా
పు వృథాచేసెనె రాజ్యహీనునిగ నీ ♦ భూమీశుఁ! డా కృష్ణసిం
గవలీలన్ దలమెట్టులూఁపె! నెటుచే ♦ యన్ వచ్చు! నెద్దినె న
న్న వెనన్ గొట్టమునందుఁ గట్టుఁడను చం ♦ దంబయ్యొ! నేఁడెంతయున్. 221

మ॥ కమలాప్తాన్వయమా! భవత్కృతమహా ♦ ఘంబేమొ! రాముండు పూ
ర్వము కొన్నేండులు మానియుండవలసెన్ ♦ బట్టాభిషేకంబు; చం
డమహీనాథుఁడు లేకయే చనియె; నీ ♦ నాఁడీ ప్రతాపుండు స
ర్వముఁ గోల్పోయెను; దుర్బలుల్ జనకు ఛా ♦ రా! యెంతకున్ గర్తలో." 222

—*) ఉదయసింహుఁడు దివంగతుఁడగుట. (*—

చ॥ అని వగనొంది బంధుజను ♦ లంద ఱరుంతుదమౌ విషాదవే
దనలను బొంది యుండిరి; ప ♦ దంపడి యజ్జననాథు జబ్బు హె
చ్చెను; మఱునాఁటిరే యుదయ ♦ సింహుఁడు తాఁ బరలోకయాత్రకే
గెను, సుతులున్ సతీజనము ♦ కేవల దుఃఖపయోధి మున్గఁగన్. 223

క॥ అవనిపతులు మరణించిన శవముఁ బురోహితుని యింటఁ ♦ జక్కవిడువ నం
త్యవిధుల నతండు దీర్పుట యువ్వుఁ బూర్వాచార మచటి ♦ యధిపుల యిండ్లన్. 224

క॥ వరసౌధము 'నాచోకి' నగరులోఁ బట్టాభిషేక ♦ కార్యక్రమముల్
జరుగఁగఁ దొడఁగె; ముహూర్తము త్వరపడి జగమెల్లుఁడలరఁ ♦ దఱియఁగవచ్చెన్. 225

—*) పట్టాభిషేక ప్రయత్నము. (*—

సీ॥ పన్నీరు పునుఁగు జ ♦ వాది యత్తరు దెచ్చి యెల్లవీథులయందుఁ ♦ జల్లినారు!
ప్రతిగృహాంగణము కం ♦ బముల రంభాస్తంభనివహంబులను దెచ్చి ♦ నిలిపినారు!
సౌరభంబులకు మం ♦ దారమంజులమాలికలు తోరణంబులు ♦ గట్టినారు!
'భువనగురుండొందుఁ ♦ బూర్ణవైభవ'మంచు స్వాగతాక్షరములు ♦ వ్రాసినారు!
గీ॥ దివ్యమగు రంగవల్లులు ♦ దీర్చినారు! పెక్కెడలఁ జల్వపందిరుల్ ♦ వేసినారు!
వీదలకు నన్నమేర్పాటు ♦ పెట్టినారు! సిరులఁజిమ్మంగఁ బురమెల్లఁ ♦ జేసినారు! 226

సీ॥ సౌభాగ్యలక్ష్మి కా ♦ స్థానమొక్కొ! యనఁ బలువిధాలంకార ♦ ములను గూర్చి
నిత్యజయోత్సవ ♦ నిలయమై యలరార నాస్థానమండపం ♦ బలవరించి
సమచతుష్కోణ వి ♦ శాలవితర్దిపై నవరత్నదివ్యసం ♦ తతులు గలిగి
కనకమయంబు ను ♦ త్కటకాంతి మంతమా నొక్కసింహాసనం ♦ బొనరనునిచి
గీ॥ దానికవ్వల శోభాప్ర ♦ ధానమైన పీఠపంక్తులు వరుసగాఁ ♦ బెక్కునిలుప
నింద్రుని సుధర్మయోయన ♦ నెసఁగె! సుప్రభాస్థలంబగు రాణాస♦భాస్థలంబు. 227
గీ॥ సమచతుష్కోణవేదికాం ♦ తమునఁ దూర్పు కోనను సింహాసనమునకు ♦ వెనుక నొక్క
వేయియపరంజికిరణముల్ ♦ వెలుఁగ నలరె నతితరానందదంబు సూ ♦ ర్యధ్వజంబు 228
సీ॥ గ్వాలియర్‌పతి మొదల్ ♦ గాఁగలిగిన రాజపరమేశ్వరులు కుడి ♦ ప్రక్కఁ దనరఁ!
జిత్తూరిరాణాల ♦ సేవించు సామంతజనపతుల్ వామపా ♦ ర్శ్వమున వెలయ!
నున్నతోద్యోగసం ♦ పన్నులై శూరులౌ రాజబంధులు వెన్క ♦ ప్రక్క వెలుఁగఁ!
గవులు దైవజ్ఞులు ♦ గాయకుల్ చారణుల్ సింహాసనముముందుఁ ♦ జెలఁగుచుండ!
గీ॥ బహుళసంఖ్యాకులగుచు భూ♦ప్రజలు వికసితాస్యములతోడ వచ్చి యం♦దందనిలువ!
నిత్యకల్యాణమందిర ♦ నియతి నొప్పి యాసభామందిరం బప్పు ♦ డందగించె.! 229

—*{ జగమల్లు సింహాసనము నెక్కరాఁగా సలుంబ్రా కృష్ణసింహవిభుఁ డనుమతింప కపోవుట. }*—

మ॥ అరుదెంచెన్ జగమల్లు నూత్నతరది ♦ వ్యాలంకృతుల్ మేనన
చ్చెరువుప్పం గొల్వఁగఁ దాల్చి; తత్క్షణమె యా ♦ సింహాసనంబెక్కి భా
స్వరశోభాకరరాజదండమును హ ♦ స్తంబునఁ గీలించి "యం
దఱు నన్గొల్వుఁడు మీకు నెల్లరకు రా ♦ ణానైతి నే నిత్తఱిన్. 230

మ॥ అని యెంతో యధికారయుక్తవలె నం ♦ దాసీనుఁడౌ వాని జో
రనఁ జేరన్ జని బుజ్జగించుచు సలుం ♦ బ్రా కృష్ణసింహుండు తా
ననువౌ మాటల "సింహపీఠమిది దే ♦ వా! నీదిగా దా ప్రతా
పుని; దర్పీరుఁడు వచ్చు; లేచి యిటు నీ ♦ వున్ రమ్ము దూరమ్ముగన్. 231

క॥ అదియు నృపుఁడు కాఁదగువాఁ డుదయం బభిషేకమై ము ♦ హూర్తము దరియన్
గదియఁదగు సింహపీఠం; బిది తగునే! ముందెవచ్చి ♦ యిటఁ గూర్చుండన్." 232

మ॥ అని పల్కన్ జగమల్లుఁ "డేమనెద వా ♦ హా! నాఁడు మాతండ్రి చె
ప్పినయాచొప్పున సమ్మతించియును నీ ♦ వేళన్ ననున్ లేచిపొ
మ్మని యెట్లాడెదు! ధర్మసూక్ష్మముల నా ♦ వంతైనఁ బాటింప! వె
వ్వని రాజున్ బొనరించెఁ దండ్రి యతఁడే ♦ పాలింప నర్హుండగున్. 233

ఉ॥ ముప్పదియేఁడు లేలి చనె ♦ భూమిని! దండ్రియనుజ్ఞగాక నీ
విప్పుడు చెప్పినన్ వినెద ♦ నే! యివి యేటికి వెఱ్ఱిమాట! లే
నొప్పును! నన్ను వీడి చను ♦ మూఱక! వద్దని గద్దరింప నీ
కెప్పుడు గల్గె బాధ్యత! యి ♦ సీ! జగమల్లుఁడు నీకలంతియే!" 234

మ॥ అని కోపమ్మునఁ బల్కు నాతని సలుం ♦ బ్రాధీశుఁడున్ చూచి "సి
జనకుం డక్కట! ధర్మమున్ విడిచి రా ♦ జ్యంబందు నిన్నుంచుమీ!
యన నాఁడో మఱునాఁడో చచ్చు; నపుడే ♦ లా యీమహీనాథు నా
జ్ఞ నిరోధింప నటంచు మంచిదని శీ ♦ ర్షంబూఁచి దాఁటించితిన్. 235

మ॥ అటుగాకుండిన నాప్రతాపుఁ డఖిల ♦ క్ష్మాధీశ్వరుల్ గొల్వఁగాఁ
బటుదర్పంబున సార్వభౌముఁడగుచున్ ♦ బాలించునన్ మాట నీ
కెటులన్ జ్ఞప్తిని లేదు! బంధువులు భూ ♦ మీశుల్ హితుల్ భూజనం
బెటుమాన్పన్ గల! రమ్మహాత్ముని బలం ♦ బేమంచు భావించితో! 236

మ॥ అతిపూజ్యంబని తండ్రియానతికి శీ ♦ ర్షంబొగ్గి కూర్చుండెఁగా!
కతఁడే రేఁగిన దేవదైత్యులకు శ ♦ క్యంబానె వారింప! ని
చ్చతురంభోనిధి సంవృతాఖిలమహీ ♦ చక్రంబునున్ భస్మసా
త్కృతమున్ జేయఁడె! కుయ్యొ మొఱ్ఱోయనినన్ ♦ దిక్కుండ దామీఁదటన్. 237

సీ॥ జననమాదిగ వేయి ♦ కనులతో నాతని వీరవర్తనముఁ గ ♦ న్పెట్టియుందు!
రవికులోద్భవ రాజ ♦ రాజశిరోమణి కాఁదగ్గ గుణకోటి ♦ కల దతనికి!

మేవాడఖనిని జ ♦ న్మించిన మణులలో నింత తేజముగల ♦ దేది లేదు!
చిత్తూరురాజ్యల ♦ క్ష్మీభాగ్యవశమున నేకలింగేశుఁడే ♦ యిట్లు వొడమె!
గీ॥ నుర్వి రవిచంద్రతారక ♦ లుండుదాఁక నవతరింపఁబోఁ డట్టి మ ♦ హామహుండు!
కోటి బ్రహ్మాండములనైనఁ ♦ గోట మీఁటి పట్టభద్రుని జేతు! నా ♦ ప్రాణమాన. 238
మ॥ అనిశోత్సాహపరాక్రమస్ఫురణ రా ♦ జ్యంబేలె! సంగ్రామసిం
హుని వెన్కన్ బలహీనుఁ డయ్యుదయసిం ♦ హుం డెక్కి రాకుండఁ దీ
వ్రనితాంతప్రతిమప్రతాపుఁడు ప్రతా ♦ పస్వామి సింహాసనం
బునఁ గూర్చుండియెయున్నఁ జిత్తురుపురిన్ ♦ బోఁగొట్టి యిట్లేస్తుమే! 239
ఉ॥ ఏమని రాజ్యభారము వ ♦ హించెనో, నాఁటనుగోలె ముష్కలే
సీమకుఁ దెచ్చె; యుద్ధమునఁ ♦ జేసెడు గుండెలుగాఁగఁ బాలె నూ
ఆమడ; కాలమెట్లొచనె; ♦ నాతఁడు మేలనిపింతు వీవు; నీ
తో మహిరాజ్య మాకొలవి ♦ తోఁ దలగోఁకిన యొట్టులుండదే! 240
ఉ॥ ఇప్పటి దేశకాలముల ♦ నెంచిన నప్రతిమానశౌర్యుఁడా
యొప్పులకుప్ప సర్వసుగు ♦ ణోన్నతుఁ డింకఁ బ్రతాపుఁ డొక్కఁడే
తప్పక రాజుగా నిలువ ♦ దార్ఢ్యము గల్గిన బుద్ధిశాలి! ని
న్నిప్పుడు నిల్పినన్ జెలితు ♦ వేమియుఁ జేతికిఁ జిక్కకుండఁగన్. 241
ఉ॥ కాన మదీయబోధనముఁ ♦ గైకొని ప్రక్కకు రమ్ము; వాక్యమున్
మాను"మటన్న లోకమున ♦ మంచియుఁ జెడ్డ యెఱుంగనట్టి య
జ్ఞాని యతండు "నీనుడులు ♦ సాఁగవు; పొమ్మిక నన్ను వీడి; తా
మైనను సింహపీఠి విడి ♦ యవ్వలికేగ నొకింతయేనియున్.
మ॥ జనకుం డాజ్ఞయొసంగె; నక్కతన రా ♦ జస్థానసింహాసనం
బునఁ గూర్చుండఁగ నేనె యర్హుఁడ; ననున్ ♦ బోనాడుచున్ బ్రక్కకుం
పిన సామంతులు భూజనుల్ కినిసి యి ♦ ష్టే నిన్ను శిక్షింతు; గొ
క్కనివీ విందలి నేమిచేసెదవొ! చ ♦ క్కన్ జూతుగా కిద్యోర్దన్. 243
శా॥ ఏమయ్యా! యిటు మూఁచుచుండెద రిదే ♦ మీ చోద్య! మాడంగులెం
తో మేలే! యొకయక్రమంబు తమక ♦ న్నుల్ చూడఁగా సాగనీ;
రేమో యీతఁడు ప్రేల భీతిఁగొనఁగా ♦ నేలా! యదల్పెందు; మీ
కేమేఁ బ్రాణభయంబు గల్గినను నే ♦ నిచ్చుంశి కాపాడెదన్. 244

ఉ॥ ఈనిన సింహమట్లు పయి ♦ కీతఁడు దూఁకెడి నమ్మచెల్ల! వృ
ద్ధైన యొకండు తానె బల ♦ మంతగఁ జూపిన మీఁదు పల్వు రెం
తేనియుఁ బట్టుపట్టినను ♦ నెంతలు పుట్టునో! వ్రేలు వాఁచి రో
లైనను రోలు వాఁచినఁ గ ♦ టా! మితియున్ మఱి మేర యుండునే.'' 245

—*) సలుంబ్రా కృష్ణసింహవిభుఁడు కోపోద్దీపితుఁడగుట. (*—

మ॥ అని పీఠమ్మున వెన్క-నానుకొని సా ♦ ఖ్యాసీనుఁడౌ నాతనిన్
గని కృష్ణుండును "**మేలు, తాతకును** ద ♦ గ్గన్ నేర్పు ధీశాలివౌ
మనుమం డైతివి; వీరలందఱు నినున్ ♦ బట్టాభిషిక్తున్ బొన
ర్చి నినున్ దాఁకెడువారె! నీకుఁబలె వా ♦ రిన్ వెఱ్ఱియున్ సోఁకెనే! 246
శా॥ రాణాలన్ బొనరించు బాధ్యత సలుం ♦ బ్రావారిదన్ మాట యీ
క్షోణిన్ గల్గిన వారెఱుంగఁగల; రి ♦ చ్చో నేఁ బ్రతాపున్ మహా
రాణాగా నొనరింతుఁ; గూడదను ధీ ♦ రగ్రామణుల్ గల్గినన్
బాణిన్ బైకెగనెత్తుఁ; డిప్పుడె యెదు ♦ ర్పన్ వత్తు సత్యుద్ధతిన్. 247
మ॥ ఇది నాయింటికి నాదువాకిలికి నై ♦ యోఁజేయు కార్యంబె! యి
య్యదనన్ యోగ్య సమర్థ భూధవుని జే ♦ యన్ నిత్యకల్యాణముల్
పొదలన్ రాజ్యము సౌఖ్యమున్ గనెడి; న ♦ ట్లున్ గానిచోఁ జెందు నా
పద; యప్పాపము పెద్దపేర్లలరుటన్ ♦ వ్యాపించు మాబోంట్లకున్. 248
మ॥ పనియే మొక్కరితోడ నాకిఁక! సలుం ♦ బ్రాకృష్ణుఁ డన్యాయముల్
తనమ్రోలన్ జరుగంగ నోర్వఁడని పె ♦ ద్దల్ చేయు నాశీస్సుకే
వినయం బూనెద; నిన్నుఁగాని మఱియున్ ♦ వేఱెవ్వరిన్ గాని మ
న్ననలన్ జేయఁ; బ్రతాపునిన్ బతిగ సం ♦ స్థాపింతు మేవాడకున్. 249
ఉ॥ మెత్తని మంచిమాటలివి; ♦ మేలని వైళము లేచి రమ్ము; లే
దిత్తఱి లేవనన్న నిను ♦ నెత్తుచు దూరము చేర్తు" నన్న న
య్యుత్తముఁ డింతయున్ గదల ♦ కుండినఁ గృష్ణవిభుండు చేతితో
నెత్తి మృగేంద్రపీఠి విడి ♦ యేగఁగఁ జేసెను బట్టి త్రోయుచున్. 250
ఉ॥ త్రోసిన నేమిచేయుటకుఁ ♦ దోఁపక యాజగమల్లుఁ డీసునున్
రోసము తన్గలంప వడి ♦ రోఁజుచుఁ గేసరిరాజుచేతిలో

గాసిలి దానిఁదప్పుకొను ♦ కైవడిఁ గానని గొఱ్ఱెమాడ్కి నా
లో సభవీడి యశ్రుతత ♦ లోచనుఁడై చనె బీదమోముతో. 251

మ॥ "అవురా! యెంతటి పూజ్యచిత్తుఁడు సలుం ♦ బ్రాధీశుఁ! డీవేళలో
నవకాశంబు లభించుమాత్రమున న ♦ న్యాయంబు వారించి ని
క్కువ మేపారఁగ 'సింహపీఠముపయిన్ ♦ గూర్చుండ యోగ్యుండు భూ
ధవవంద్యుండు ప్రతాపుఁడే' యనియె ని ♦ ర్దాక్షిణ్యచిత్తంబునన్. 252

మ॥ అమృతంబున్ మలయాద్రిమందపవనం ♦ బద్దంబులున్ స్వచ్ఛభా
వముఁ గోల్పోయినఁ బోవవచ్చును! సలుం ♦ బ్రాకృష్ణు మాలిన్యలే
శమునన్ సోఁకదటం చెఱింగియు నజ ♦ స్రస్వచ్ఛ మాధీరు చి
త్తమునన్ దప్పుఁదలంచియుంటి! మహరా ♦ ధంబయ్యె! నెంతేనియున్. 253

చ॥ వనితలఁ జేరి వంటయిలు ♦ వాయని యాజగమల్లు వీడి మా
మనసు హరించినట్టి యభి ♦ మానధురంధరు విక్రమైకవ
ర్తను రవివంశవర్ధనుఁ బ్ర ♦ తాపు ధరాధిపుఁ జేయనుండెడిన్!
మని యెఱుఁగాత మీతఁ డతి ♦ మానుషకీర్తి సహస్రవర్షముల్" 254

—* { సలుంబ్రాకృష్ణసింహవిభుఁడు సింహాసన మధిష్ఠింపుమని ప్రతాపసింహుని బ్రార్థించుట. } *—

మ॥ అని సామంతులు భూప్రజాళులు సలుం ♦ బ్రాధీశు వేనోళ్లఁ గీ
ర్తనముల్ సేయ "శుభాభిషేకము నొన ♦ ర్పన్ బోదము" చందఱన్
దన వెంటన్ గొని కృష్ణసింహుఁడును నా ♦ స్థానంబునందుండి భూ
పనివాసంబును జేరి యచ్చటఁ బ్రతా ♦ పస్వామికిన్ మ్రొక్కుచున్, 255

సీ॥ కష్టసౌఖ్యము లొక్క ♦ గతిఁ జూతు! యుద్ధముగాదిపండుగయట్లు ♦ గాంచుచుందు!
సాహసికాగ్రత ♦ స్సరుఁడవు! పరులబాధలు చూచి యోర్వ నీ ♦ తరముగాదు!
వీరపూజ్యము నీయు ♦ దారత దేవ! నీతండ్రి మౌర్ఖ్యముగాఁగ ♦ దప్పుఁదలంచి
జ్యేష్ఠపుత్రుఁడవౌటఁ ♦ జెందఁగావలయు మేవాడ్దేశసామ్రాజ్య ♦ భరముఁ బాపి
గీ॥ మేరువును నెత్తికెత్తుకు ♦ మారుఁడనుచు నల్లజగమల్లునకొసంగు ♦ మనియె! నప్పు
డుఱక వాఁడేల యని తల ♦ యూఁచియుంటి! సమయమైనప్డు చూచుకొం ♦ దమనితలఁచి.

శా॥ ఆరంభంబుననుండి నీపయిన నా ♦ యాశాభరంబెల్ల దై
వారున్; నాదగు విన్నపంబుఁగొని రా ♦ జ్యశ్రీని దోస్తంభ కే

శీరంగంబున నిల్పి ధర్మమునఁ బా ♦ లింపన్ బ్రయత్నింపు పు
ష్పారామంబటు సౌఖ్యసౌరభములన్ ♦ వ్యాపింప దేశమ్మునన్." 257

మ॥ అని వాక్రుచ్చిన నాప్రతాపుఁడు సలుం ♦ బ్రాధీశు వీక్షించి "మ
జ్జనకాభీష్టముఁ దీర్పకుండినను నా ♦ చంద్రార్క మగ్రాపకీ
ర్తిని నేనొందనె! ధర్మదూరగుఁడనై ♦ దేవేంద్రభోగంబులన్
గనుకంటెన్ నిరుపేదనై మనుట యో ♦ గ్యంబంచు భావించెదన్. 258

ఉ॥ ధారిణిరాజ్యమున్ స్థిరమె! ♦ ధర్మము దేవునియట్లు సుస్థిరం
బై రహియించు; ధర్మమును ♦ నాదట మీఱఁగనోపఁ! దండ్రికిన్
మారటతండ్రి! వందఱకు ♦ మాన్యుఁడ వీవొనరించు నాజ్ఞలన్
దూరముసేయనోప! నెటు ♦ తోఁపక చిత్తము తత్తరించెదన్. 259

చ॥ మృదుహృదయుండు మాజనకుఁ ♦ డెప్పుడు నీమహనీయభుజంబె యా
స్పదముగ రాజ్యమేలెను! భ ♦ వత్కృప సుంత తొలంగియున్న ని
య్యుదయపురంబునన్ నిలిచి ♦ యుండను! మేమును నిల్చియుండ! మో
సదయ! భవన్మహోపకృతి ♦ సర్వజగన్నుతిపాత్రమై తగున్." 290

చ॥ అని యెటుచేయఁదోఁపకిటు ♦ లాడు ప్రతాపుని జూచి "దేవుఁడే
నిను సృజియించె సర్వధర ♦ ణీస్థలికిన్ బతిగాఁగ జ్యేష్ఠనం
దనునిగ; నీవు రాజగుటె ♦ ధర్మము; భూప్రజ యే యుదాత్తవ
ర్తను వరియించునో యతఁడె ♦ రాజుగ నిల్చుట యొప్పుఁ గ్రొత్తయే!" 261

మ॥ అని కృష్ణుండు వచించిచూడఁగనె య ♦ ♦ ష్టాదున్న సామంతులన్
జను లొక్కుమ్మడి నైకకంఠ్యముగ "రా ♦ జస్థానసింహాసనం
బునఁ గూర్చుండి ప్రతాపుఁడే నృపతియై ♦ పూర్ణప్రజామోదమున్
గని పాలించెడుఁగాక నిర్మలయశః ♦ కల్యాణముల్ చేకురన్. 262

శా॥ మేమై కోరు ప్రతాపునిన్ విడుచుచున్ ♦ మేలంచు నీవల్ల సు
త్రాముల్ దెచ్చిన శౌరిఁ దెచ్చిన సమా ♦ ధానంబు మాకుండ దే
మో! మమ్మందఱ నుద్ధరించుననుచున్ ♦ ముందెంతకాలంబుగా
నో మాకున్నవి కోర్కె! లిప్డితని నో ♦ హో! వీడఁగా నేర్తుమే. 263

ఉ॥ ఎప్పుడితండు రాజగునొ! ♦ యెప్పుడు కన్నులవిందుగాఁగ మా
యప్పను జూతుమో! యనెడి ♦ యాసలు కొండలువోలె నుండు! సీ

యొప్పమి నేమియున్ బలుక ♦ నోడితి: మింతకు నీప్రతాపుఁడే
తప్పక రాజుగావలయుఁ! ♦ దప్పదు! తప్ప"దటంచుఁ బల్కినన్, 264
చ॥ "కనుఁగొనినాఁడవే ప్రజల ♦ కౌతుక! మిందఱికోర్కె త్రోసివే
యనగునె! సన్మహూర్తము ర ♦ యంబున డాసె! శుభాభిషేకమున్
బొనరుతు! మాజ్ఞ సేయుఁ"డని ♦ మ్రొక్కి వచించెడు కృష్ణసింహు ప్రా
ర్థనమును ద్రోయఁజాలక ప్ర ♦ తాపుఁడు సమ్మతిఁజూపె నయ్యెడన్. 265

—*) ప్రతాపసింహుని పట్టాభిషేక మహోత్సవము. (*—

క॥ కొంగులముడి యలరారఁగ బంగరుపీటల విభుండు ♦ పాటేశ్వరియున్
జెంగటను నమరసింహుఁ డనంగనిభుఁడు గూరుచుండి ♦ రతిహర్షమునన్. 266
మ॥ హరభట్టారకముఖ్యభూసురులు మం ♦ త్రానీకముల్ పల్కి బం
గరు కుంభంబులనుండు వార్ధిజలమున్ ♦ గంగాపవిత్రాంబు ల
బ్బురమున్ గొల్పఁ బ్రతాపసింహునకునై ♦ మూర్ధాభిషేకంబు చే
సిరి సంపూర్ణ విశుద్ధచిత్తముల నా ♦ శీర్వాదముల్ చేయుచున్. 267
సీ॥ సౌరభసురభిళ ♦ వారిపూరమ్ముల జలకంబుఁ దీఱిచి, ♦ జిలుఁగుఁబట్టు
వలువలు ధరియించి, ♦ తలను ముత్తెపుసరుల్ కలకలలాడు పా ♦ గా ధరించి,
విలువవజ్రాల సొ ♦ మ్ములు మేననిడి, సుగంధద్రవ్యములను గా ♦ త్రమున నలఁది,
మందారకుసుమదా ♦ మము వక్షమునఁ దాల్చి, సూర్యదేవుని మ్రొక్కి, ♦ స్తుతులొనర్చి,
గీ॥ యేకలింగేశ్వరుపదంబు ♦ లెదఁ దలంచి, భక్తిమెయి భవానీదేవిఁ ♦ బ్రస్తుతించి,
గురుల హరచంద్రభట్టార ♦ కులను గొలిచి, యాప్రతాపుఁ డాస్థానము ♦ నందుఁ జేరె.
క॥ పరిఫుల్ల రుచిర సరసిజ పరంపరలు నెఱపి నటు స ♦ భాభవనం బ
ప్పురజనముల నెమ్మోములఁ బరమామోదమున నపుడు ♦ భాసిలుచుండెన్. 269
సీ॥ దైవజ్ఞమణులు త ♦ దేవలగ్నంబంచు సమయంబు చూచి హె ♦ చ్చరిక చేయ!
వేదభూసురులు దే ♦ వీంవాచమను మంత్ర ముచ్చైస్స్వనమున వా ♦ కుచ్చుచుండఁ!
జారణుల్ పూర్వమ ♦ హీరమణాభిషేక ప్రసంగములు వే ♦ డ్కను బఠింప!
వందులు జయజయ ♦ ధ్వానపూర్వముగఁ బ్రతాపశబ్దమ్ము సం ♦ దడిగఁ బొగడఁ!
గీ॥ జంద్రభట్టారకుండు ర ♦ సంబుగురియు పెండ్లికల్యాణ వృత్తముల్ ♦ ప్రీతిఁజదువ!
నెంతసంతోషభర మొకో! ♦ యెవరెఱుఁగుదు! రందఱును మేను మఱచుచు ♦ నవశులైరి.

క॥ కలనాదం బులరఁగ, మంగళతూర్యములెల్ల మ్రోఁగ, ♦ గాయకులును బా
టలు పాడ, నాప్రతాపుఁడు కొలువున సింహాసనమునఁ ♦ గూర్చుండె నొగిన్. 271

గీ॥ ఆమహోన్నతశుభసమ ♦ యమున హర్షసరభసములైన బహుళ హ ♦ స్తములనుండి
యాసభాస్థలి నపుడె పె ♦ ల్లాక్రమించి కురిసె మెఱుఁగారు బంగారు ♦ విపులవాన. 272

గీ॥ బంగరుం బళ్ళెరమున జ ♦ వాది పునుఁగు పచ్చకస్తురి మెదిపియుఁ ♦ దెచ్చి యయ్య
నాప్రతాపుని వికసితా ♦ స్యంబునందుఁ దిలకమును సలుంబ్రాభర్త ♦ దిద్దె నపుడు.

మ॥ అమితోత్సాహముతో ఫణీశ్వరుని చా ♦ యన్ వెల్గు దుర్గాంతభు
ద్గము మధ్యంబునఁ గట్టి రత్ననివహా ♦ క్రాంతంబునౌ రాజదం
డము హ స్తంబున కిచ్చి హాటకకిరీ ♦ టంబున్ దెసల్ నిండు తే
జముతోడన్ మిఱుమిట్లుగొల్పఁగను సం ♦ స్థాపించె మూర్ధమ్మునన్. 274

మ॥ "భరియింపన్ గలఁ డీప్రతాపుఁడిక మే ♦ వాడ్దేశసామ్రాజ్య; మి
త్తఱి రాణానొనరించితిన్; బ్రజలు శ్ర ♦ ద్ధాభక్తు లేపార ని
ప్పురుషశ్రేష్ఠుని గొల్వుఁడీ"యని కరం ♦ బుల్ మోడ్చి ముమ్మాఱులున్
ధరపైఁ జాగి నమస్కృతుల్ సలిపె నా ♦ నందాబ్ధినిర్మగ్నుఁడై. 275

గీ॥ "గొడుగు పట్టినట్టులు చల్వ ♦ గూర్ప నేర్చు! రామరాజ్య మీతని"దని ♦ పరిచరపటులుఁ
బట్టిరి సితాతపత్రి; మ ♦ ప్పట్లఁ గదలెఁ జామరగ్రాహిణుల హేమ ♦ చామరములు.

గీ॥ భూధరేంద్రపుత్రికఁబోలు ♦ పుణ్యసతులు దొడ్డముత్తైదువలు హ స్త ♦ తోయజముల
వరుస బంగారు దీపాల ♦ పళ్లెరములతో నివాళించి రపుడు భూ ♦ జాని నచట. 277

గీ॥ రత్నముల నొక్క కనకపా ♦ త్రమునఁబోసి హారతుల నెత్తి యంగన ♦ లవనిఁ బోసి;
రవి వెలిఁగె నాకసమునిండ ♦ నలముకొనిన వివిధ తారకా కోరక ♦ వితతి మాడ్కి.

ఉ॥ అంతట నొక్క రొక్కరుగ ♦ నానృపశేఖరు పాద పంకజ
ప్రాంతముఁ జేరఁబోయి విన ♦ యమ్మలరార నమస్కరించి సా
మంతులు భూజనంబులు క్ర ♦ మమ్మున వస్త్రములున్ విభూషలున్
దొంతరలాడఁ గానుకలిడి ♦ తోరపు హర్షము లొంది రయ్యెడన్. 279

మ॥ హరభట్టారకుఁ జంద్రభట్టకవి వ ♦ స్త్రాలంకృతుల్ పెట్టుచున్
బరితోషింపఁగఁజేసి యల్లన సలుం ♦ బ్రా స్వామికిన్ మ్రొక్కి "యీ
చరణాబ్జంబులు నాకుసేవ్యములు మా ♦ చండక్షమానాథు శ్రీ
చరణంబుల్ వలె" నంచుఁ బీతమున హా ♦ ర్దం బొప్పనాసీనుఁడై, 280

మ॥ "పుపులుఁ జూచి సమస్తభూతలమున ♦ వ్వర్ గొల్వనన్ మాడ్కి నూ
త్నవికాసస్ఫురణంబు వెంటఁగొని చై ♦ త్రంబున్ బ్రవేశించె; రా
జ్ఞవిహంబుల్ ప్రజ లేగుదేరఁగ భవా ♦ నీమాతకున్ బ్రీతిగాఁ
గ వరాహంబుల వేఁటలాడ నరుగం ♦ గా నెంచితిన్ గానకున్." 281

మ॥ అని తేఁడాడినఁ గృష్ణసింహుఁడును "దే ♦ వా! చైత్రమాసోదయం
బున నూత్నంబుగఁ బట్టభద్రులయిన ♦ ప్డున్ వేఁటకై కానకున్
జను టాచారము తొల్తనుండియు; భవ ♦ చ్చాపంబునన్ నేఁడు గూ
లిన సత్వంబులఁ బట్టి భావిఫలమున్ ♦ లెక్కింతు రక్షోణీజనుల్. 282

—*) పట్టభద్రుఁడయిన ప్రతాపసింహుని సాగరసింహుఁ డాక్షేపించుట. (*—

చ॥ ఇది శుభసూచనం బిపుడె ♦ యేగుద"మంచన నెల్లవారు నో
ప్పిదమనునంత గోడపయిఁ ♦ బిల్లి విధంబున దూఁకి సాగరుం
డెదురయివచ్చి "యేటిపని! ♦ యెచ్చటి కేగెదు! రాజ్యలాభముల్
గుదిరెనటంచు సంతసము ♦ గొప్పగఁ గల్గెనె! నీకు నియ్యెడన్. 283

మ॥ అరరే! యాజగమల్లుఁ బోఁదరిమి య ♦ న్యాయంబుమై ధారుణీ
భారమున్ గొంటివి; మంచి చెడ్డ లవి దోఁ ♦ పన్ లేదె! యేచట్టఁపుం
బరిపాటిన్ వహియించి చేసితివొ! వ ♦ హ్వా! నేటి నీసేఁత యె
వ్వరికిన్ శక్తి యొసంగు వారె నృపులన్ ♦ భంగిన్ నిరూపించెడిన్. 284

చ॥ ఇది కొలఁదిమాలినట్టి పని! ♦ యింతటి దుర్ణయమున్ గనంగ నా
హృదయము నిల్వలేదు; నిను ♦ నింటిలనుండియు నుంత యవ్వలన్
గదలఁగనీను; నన్నుఁ గడ ♦ గాఁ దొలఁగించి యభీష్టకార్య మిం
పొదవఁగ దీర్పు; మేను మని ♦ యుండిన సాఁగవు నీప్రయత్నముల్." 285

మ॥ అని యాతండు సరోష దృష్టిని సలుం ♦ బ్రాంధీశ్వరున్ జూచి "యో
మనఁగావచ్చును నిన్ను! నేఁడిచట న ♦ న్యాయంబు నీవల్ల నే
జనియించెన్ జుమి; యిప్డు డేమనుచు నె ♦ చ్చున్ జేతొ! లోకంబు బిసీ
యనదే నిన్గని; స్వామిభక్తి యనఁ గ ♦ ట్టా! యిట్టిదై యుండునే!

సీ॥ ప్రాసపూర్వాక్షరమునందు ♦ వఱె సమస్త గుణగణంబులు నీయందుఁ ♦ గొఱంత లేక
యలరవలెఁగాక! యిఱక ని ♦ న్ననుసరించు నతని ననునేటి కోసలుం ♦ బ్రాధినాథ!"

—*) సలుం బ్రాకృష్ణసింహావిభుఁడు సాగరసింహునకు హితము నుపదేశించుట. (*—

చ॥ అనుచుఁ బ్రితాపుఁ జేరఁజను ♦ నాతనిఁ గన్గొని కృష్ణసింగు "నీ
వనుజుఁడ వమ్మహాప్రభుస; ♦ కాయన నిందఱిలోన నిప్పు డి
ట్లనుచు నిరోధముల్ సలుప ♦ న్యాయమె! శత్రువు లెవ్వ రిప్డు కా
దని యెదిరింపఁ నియ్యదియు ♦ నార్యులు మెచ్చెడి మేటికార్యమే! 288

చ॥ కలకలలాడుచున్న సభఁ ♦ గల్గిన లోకుల మోములెల్ల మం
గలములమాడ్కి నైన విపె ♦ కన్గొను దారుణమైన నీను మా
టలు వినినంత; కోపము వి ♦ డల్ జను నిత్తఱి; శాంత మూనఁగాఁ
గలిగిన మేలు సుమ్మిపుడు; ♦ గడ్డము పట్టి వచింతు సాగరా! 289

మ॥ మనమందుల్ గల క్రౌర్యముల్ విడువు; నా ♦ మాటల్ మది న్నిల్పు; పా
వన గంగాఝర వారిపూరముల వి ♦ ప్రశ్రేణి మూర్ధాభిషే
చనముల్ జేసిన యిమ్మహాత్ముని పదా ♦ బ్జంబుల్ శిరల్ సోఁక నో
క్కనమస్కారము చేయు; మీతఁడు నమ ♦ స్కారార్హుఁ డెవ్వారికిన్. 290

క॥ సరళమతిన్ యోజింపుము; పొరపడకుము; వినవె! 'పితృస ♦ మో జ్యేష్ఠ' యనన్;
గురుఁ డుదయసింహుతో నిప్పురుషవరుఁడు సముఁడు నీకుఁ ♦ బూర్వజుఁ డగుటన్. 291

చ॥ కలుగఁగఁ జేయఁబోకుసుమి ♦ గందరగోళము; విన్ము నీను మా
ట లితని సద్గుణంబుఁ బొగ ♦ డల్ దగు; నిందకుఁ బన్కిరావు; చే
తు లితనిపాదముల్ నిలుపఁ ♦ దోరఁపుఁ బాదుకలైనఁ జెల్లుఁ; గ
త్తులుగొని తాఁక దోషమగుఁ; ♦ దోఁచిన యంతయు నీకుఁ జెప్పితిన్." 292

చ॥ అని వినయమ్ములన్ నయము ♦ నాదర మొప్పఁగఁ గృష్ణసింగు ప
ల్కిన విని సాగరుండును జ ♦ లింపక "ధర్మ మొకండె నేను గో
రిన; దది పీడి ఫీను లల ♦ రించెడు నీతు లివేల! తెల్పు మే
మనెదో ప్రతాప! నీ విపుడు ♦ న్యాయము నిల్పెదో! ప్రక్కకేగెదో! 293

చ॥ స్థిరగుణమాన్యుఁ డయ్యుదయ ♦ సింహమహీరమణాగ్రగణ్యుఁ డం
దఱను సమంబుగాఁ గనిన ♦ తండ్రి; కుమారుల తారతమ్యతాపరం
పరల నెఱింగి రాజు జగ ♦ మల్లును జేయఁగ నాన ఇచ్చె; న
వ్వరమపవిత్రిమానుని ♦ పల్కును నిల్పుట పుత్రధర్మమా. 294

గీ॥ ఇరువదైదుగురైన భ్రా ♦ తృవరులందు జ్యేష్ఠుఁడవు! ప్రపంచముత్రోవ ♦ తెలియఁగువాఁడ!
వనుచితంబని తోఁపక ♦ యనుజు సొమ్ము నపహరించితి! వింత య ♦ త్యాశ తగునె!
సీ॥ కనుమూసి గుడ్డక ♦ ట్టిన దేమిలేదు; సమస్తభూపప్రజయు సా ♦ మంతనృపులు
పరికించు నెడఁ బట్ట ♦ పగటివేళను దండ్రి "జగమల్లు రారాజు ♦ సలుపుఁ"డనుచు
గొంతెత్తి యనె; నందుఁ ♦ గూడిన వారెల్లఁ దల లూఁచి; రిపుడు నీ ♦ దండఁజేరి
ప్రియభాషలాడు నీ ♦ కృష్ణసింగానాఁడు చిత్తంబని కరంబు ♦ శిరము వంచె;
గీ॥ నేఁడుగద రాజరాజుల ♦ నిర్ణయించు దొడ్డయధికార మితని చే ♦ తులకుఁ జిక్కె!
మీర లిరువు రేకతమున ♦ మెదిపి మెదిపి కార్య మిట్లు త్రిప్పియుంటిరి ♦ కట్టకడకు. 296
చ॥ ఇఁక నొకవేయుమాటలఁ బ ♦ నేమి! యిదే జగమల్లు రాజుఁజే
యక జనకాజ్ఞ మీఱుచు ధ ♦ రాశ ధరేశత సంగ్రహించు నీ
వకట! మదీయవాక్యముల ♦ నాదృతి నుంతువె! తల్లిఁ జంపు వా
నికిఁ బినతల్లి చేతులు గ ♦ ణింపఁ జివుళ్ళను చొప్పెఱుంగవే! 297
ఉ॥ ముందొకఁడాడి వెన్కకును ♦ బోయి మఱొక్కగతిన్ జరించు నా
చందము లెప్ప నేనెఱుఁగ; ♦ స్వాంతము విప్పి వచింతుఁ; దండ్రియా
జ్ఞం దలఁదాల్చి భూరమణు ♦ సల్పుము మా జగమల్లు; లేనిచో
నిందలు గల్గుఁ; గష్టములు ♦ నీకును బెక్కులు వచ్చు నిమ్మెయిన్." 298
చ॥ అని బిరుసెక్కు చూపులను ♦ నందఱిఁ జూచెడు తమ్మునిన్ గనుం
గొనుచుఁ బ్రతాపుఁ "డోకుమర! ♦ కూడునె తొందర! మంచి చెడ్డలన్
మనమున నిర్ణయించి జగ ♦ మల్లుని యోగ్యత నెంచి పౌరు లె
ల్ల నుడువు మాటలెంచి యిటు ♦ లన్ బొనరించితి సుమ్ము సోదరా! 299
సీ॥ ఎఱుఁగుదు నే మన ♦ మిరువదైదుగురలో జగమల్లునకుఁ దండ్రి ♦ మిగులఁ గూర్చు!
టెఱుఁగు దాతని వసు ♦ ధేశుఁ జేయుఁడటంచు మనతండ్రి నృపులతో ♦ ననిన తెఱఁగు!
నెఱుఁగుదు నెదురాడ ♦ కెల్లరు మంచిదం దొకమాటె యూఁదల ♦ లూఁచుటయును!
నెఱుఁగుదు జగమల్లుఁ ♦ డెట్టైన మేవాణ్మహోర్వి నేలెదనంచు ♦ నూఁగుటయును!
గీ॥ నిన్ని యెఱిఁగియె నాపైన ♦ నెసఁగు భార మవలఁ జనెనంచు నాబూని ♦ ఖాగ్రసీమ
నేకలింగేశు చరణనా ♦ ళీకయుగము నెడఁదఁ గొలుచు నుపాయంబు ♦ నెఱిఁగియుంటి.
సీ॥ అతిపూజ్యుఁ డుదయసిం ♦ హ క్ష్మావరోత్తంసు కొడుకులలోఁ బెద్ద ♦ కొడుకనొట!
మారట తండ్రి స ♦ న్మాన్యుఁడీ కృష్ణ భూజాని యానతి మీఱి ♦ రాని దగుట!

సామంత మండలే ♦ శముఖు లేకగ్రీవముగను సింహాసనం ♦ బునకుఁ గోరఁ!
బ్రస్తుతస్థితిని నీ ♦ పాలన లేకున్నఁ జెడుదు" మంచని పౌరు ♦ లడలు చుండ!

గీ॥ నిన్నికష్టసుఖంబుల ♦ నెంచి యెంచి విముఖమై యున్న మనసును ♦ వెనుకఁ ద్రిప్పి
యున్నరో! పట్టభద్రుండ ♦ నైతిఁ; గాని కోరి భారంబు తలను దై ♦ కొనఁగ లేదు. 301

చ॥ మన జనకుండు ధాత్రి జగ ♦ మల్లున కిచ్చె నటంచు విన్నయాం
తనె "తొలఁగెన్ దలన్ గలుగు ♦ తద్దయు భారము; నే స్వతంత్ర జీ
వనమును నెంచుఁగాని జర ♦ పన్ గల; దేవుఁడు కూర్మిఁ జూచెఁ బో"
మ్మని మది యుబ్బి పోవునటు ♦ హర్షముఁ గాంచితి సుమ్మి సోదరా! 302

శా॥ ఈ మేవాడ నివాసమున్ దవిలి నే ♦ నిందున్న క్షోణీజనం
❁ బేమాడ్కిన్ దలపోయునో మది నటం ♦ చే 'పర్షియా' చేరి యా
'భామాసాహి' పదాంబుజంబులకడన్ ♦ వర్తింపఁ గాంక్షించి యి
ష్టే మున్నందు ప్రయాణమున్ సలుప నుం ♦ టిన్ గంటకున్ ముందటన్. 303

ఉ॥ అప్పుడు కృష్ణసింహుఁడు ప్ర ♦ జాళి నృపాళియు వెంటరాఁగ నే
ర్పొప్పఁగ వచ్చి "యూరకిటు ♦ లుండఁగ నేటికి! లేచి రమ్మి! నీ
విప్పృథివీతలంబుఁ గొని ♦ యేల వలెన్ జుమి! నీవు తప్ప మా
యప్ప! యొరుల్ మహీరమణు ♦ లైనను రాజ్యము నిల్వ దీయెడన్." 304

చ॥ అని యభిషేకమున్ సలిపి ♦ యహ్వాదుకూలముఁ గట్టఁజేయుచున్
గొని యిటు తెచ్చెఁ; బౌరులును ♦ "గూడదు కాదిక సింహపీఠమం

---

❁ It has been said that the brahmanical religion was foreign to India, but as to the period of importation we have but loose assertion. We can easily give credit to various creeds and tenets of faiths being from time to time incarporated ere the present books were compcsed; and that previously the sons of royalty alone, possessed the office. Authorities of weight inform us of these grafts for instance, Mr. Colebrook gives a passage in his "Indian classes." "A chief of the twice-born tribe was brought by Vishnu's eagle, from 'Saca Dwipa.' By Saca-Dwipa, Scythia is understood of which more will be said hereafter. Ferista also translating from ancient authorities says to the same effect, that in the reign of Mahrage, King of Kanooj, a brahmin came from Persia, who introduced magic, idolatry and the worship of the stars, so that there is no want of authority for the introduction of new tenets of faith. "Annals of Mewar."

దున వసియింపుమీ” యనినఁ ♦ ద్రోయఁగఁజాలక విజ్ఞు లాజ్ఞ చే
సిన యటు సింహాపీఠిని వ ♦ సించితి దేశము సేమ మెంచుచున్. 305

మ॥ పరమోత్కృష్టమృదుస్వభావుఁడు సలుం ♦ బ్రాస్వామి! యీధన్య భా
స్వర కారుణ్య కళా విశేషమున మే ♦ వాల్లక్ష్మి శోభా పరం
పరలన్ గోల్పడ కున్న దిప్పటికి! రా ♦ ణ్మాదారుఁ డిప్పుణ్యసా
గరునిన్ దూఱుచు వ్రేల్లుచూపి యఱవం ♦ గాఁ బాడియే! నీకిటన్. 306

మ॥ ఎఱుఁగకయుందువొక్కొ! పురు ♦ టింటినిఁ బాయనిదాది తండ్రినిన్
మఱువఁగఁజేసి యీభువన ♦ మాన్యుఁడు నన్నును నిన్నుఁ దమ్ములం
దఱిఁ గొని యంతవారలను ♦ దద్దయుఁ బెద్దలఁ జేసి పెంచె; నొ
క్కరుఁ డెదురైన నేఁటికిని ♦ గాఁగిటఁ జేరుచుఁ దండ్రి భంగిగన్. 307

గీ॥ దుర్గమారణ్యములుచేర్చి ♦ త్రుంపుమనుచుఁ దండ్రిపంపఁడె సూక్తు! నా ♦ తఁడు చిరాయు
వై సలుంబ్రాపురమున సౌ ♦ ఖ్యమునమనుట యెవరిబలమూని! యీధన్య ♦ కృపను గాక!

క॥ పౌరులసేమంబును క్షోణీరాజ్యము సేమములును ♦ నీ సేమం బా
ధీరుఁడెఱుంగు; నెఱుంగఁగనేర! వతఁడె తల్లి తండ్రి ♦ నీకున్ నాకున్. 309

మ॥ మనముత్తాత యొకప్డు చండవిభుఁ డా ♦ త్మత్యాగమున్ జేసి త
మ్మునికై రాజ్యము వీడెఁ; దజ్జనకుఁ డ ♦ ప్పూజ్యున్ సలుంబ్రాప్రభున్
బొనరించెన్; దనుదారవంశము యశం ♦ బున్ బొంద జన్మించె ని
య్యనఘుండున్ మనతాతచందమునఁ బూ ♦ జార్హుండు ముమ్మాటికిన్. 310

చ॥ హిమకరునందుఁ గందుగల! ♦ దీశు గళంబున నల్పెసంగుఁ! బం
కము కమలంబు నంటుకొనుఁ! ♦ గాని జగంబులు క్రుంగినన్ గిరీం
ద్రము లవి బెండుదేలినను ♦ ధన్యచరిత్రుఁడు కృష్ణసింగు స్వాం
తమునను గందొకించుకయుఁ ♦ దార్కొననేరదు! కోటి చెప్పినన్. 311

గీ॥ నేను నృపుఁడనై యీతని ♦ నెత్తిఁ బెద్ద మకుట మిడలేను; మఱి జగ ♦ మెల్లఁ డవని
నాథుఁడయి తీయునది లేదు; ♦ నడుమఁజిక్కి పరులచే నాఱుదూఱును ♦ బడుట తక్క.

చ॥ జనకుఁడు పెద్దకాలము రు ♦ జా పరిపీడితుఁడౌట నెట్టులన్
మనమున నిర్ణయించెనో! కు ♦ మారులలోఁ బ్రథముండు తండ్రి పో
యిన పిదపన్ ధరావలయ ♦ మేలుట యొకఁడును లేదె! వైపరి
త్యనియతి నేఁడు పుట్టెనె! క ♦ టా! యిది లోకము పాడియే కదా! 313

చ॥ ఇది జనకోటి కిష్టమని ♦ యెక్కటి నిత్తటి సింహపీఠి; ని
య్యాదనను నీకు నొక్కనికి ♦ స్వాంతము సమ్మతిఁగాంచకున్న నే
వదలుట యెట్లు సాధ్యమగు! ♦ బాలక! నేనిదె శక్తివంచనల్
గాదుకఁగనీక కష్టపడి ♦ క్షోణిని నేలఁ బ్రియత్నమూనెదన్." 314

—*) సాగరసింహుఁడు రాణాప్రతాపసింహు నిలువరించుట. (*—

చ॥ అనుచుఁ బ్రశాంతరీతిని న ♦ యంబును వత్సలతానిరూఢి నె
క్కొనఁగఁ బ్రతాపసింహుఁడనఁ ♦ గోపము పట్టఁగలేక సాగరుం
"డనుజుఁడ వంచు మే ల్దలఁచి ♦ యాడిన నీతలకెక్క దయ్యె; రా
జ్యనియతిముందు నీతులు వి ♦ సంబుగఁ దోఁచెను నీకు నేఁడిటన్. 315

సీ॥ బహుకాలముగను మే ♦ వాడ్దేశమేలిన జనకుండు దీర్ఘరు ♦ జా ప్రపీడఁ
దై యెట్టులో నిర్ణ ♦ యమొనర్చెనట! నతఁ డన్యాయవర్తనుం ♦ డంట! యణువు
మొదలుగా బ్రహ్మాండ ♦ మును మ్రింగి త్రేఁచెడు నీకృష్ణసింహుఁ డ ♦ స్తోక ధర్మ
నిరతుఁడౌనట! మీర ♦ లిరువురొక్కండయి ధర్మదేవత భార ♦ తంబు నుండి

గీ॥ లేవఁగొట్టంగఁ బుట్టు క ♦ లిస్వరూపులని తెలిసెఁ! బట్టపగలు ప్ర ♦ జాళియెదుట
నింద్రజాలమునొనరించి ♦ యిట్టులుకనుఁ బ్రామఁగలిగితి! రేమన ♦ వచ్చు మిమ్ము.

మ॥ సదయుం డాజగమల్లునిన్ బిలిచి రా ♦ జ్యంబిమ్ము; కాదేని నేఁ
గదనంబందునఁ దాఁకి లోకమలరం ♦ గా ద్వంద్వయుద్ధంబు చే
సెద నీతోడ; మదీయమానసము కిం ♦ చిత్తైన ధర్మంబు మీ
అను; ప్రాణంబు లశాశ్వతంబులగు; ధ ♦ ర్మంబే చిరస్థాయియౌ. 317

మ॥ అవనీరాజ్యము నిత్తువో! వివిధశ ♦ స్త్రాస్త్రంబులన్ దాల్చి యా
హవరంగంబున నన్నుఁ దాఁకెదవొ! యీ ♦ యర్థద్వయంబందు నీ
వవలంబింపు మొకండు; లేనియెడ శౌ ♦ ర్యస్ఫూర్తి నిట్టట్టులన్
లవమేనిన్ గదలంగనీ! నిపుడె తె ♦ ల్పన్ బోలు నీభావమున్." 318

క॥ అని బిఱ్ఱబిగిసి తనమోమునఁ జూడ్కులు నిలిపి యుద్ధ ♦ మును గోరెడు త
మ్ముని గనుఁగొనుచుఁ బ్రతాపుం డనె గాంభీర్యప్రధానుఁ ♦ డై జనులు విననా. 319

మ॥ "అదుగైనన్ గదలంగనీని శ్రమమే ♦ లా! రాచపుట్టొందు నె
వ్వఁడుగానీ రణమన్నఁ బండుగనుచున్ ♦ భావించు; నీయందలున్

గడుమార్గంబునఁ దెచ్చి నాపయినఁ జ ♦ క్కన్ నిల్పి రీరాజ్యమున్;
గడఁద్రోయన్ జన; దట్టు లౌట రణమే ♦ కర్తవ్యమై కన్పడున్." 320

మ॥ అని యప్డప్పుడె మధ్యమంబున సలుం ♦ బ్రాధీశుఁడున్ గట్టియుం
చిన నాగేంద్రసమానఖడ్గమునకై ♦ చేసాచె; నాసాగరున్
గని సామంతులు భూపరిజానివహముల్ ♦ "కట్టా! యితం డేడవ
చ్చెనో! పిడ్గున్ బలె మామనోరథము శు ♦ ష్కీభూతమై పోవఁగన్. 321

చ॥ కనికరమన్న మాటను జ ♦ గమ్మున నీతఁడు విన్నయట్టులన్
గనఁబడ; డిందుఁ జేరియు ర ♦ ణంబు రణం బనుచున్ క్షణక్షణం
బు నుడువు; స్థానమో సమయ ♦ మో గ్రహియింపఁడు; వాని కేమి! గె
ల్చిన సకలావనీభరము ♦ చేపడునన్న దురాశ తక్కఁగన్. 322

మ॥ అమితప్రాభవ మొప్ప నిప్పుడు సలుం ♦ బ్రాధీశుఁ డాస్యంబు నం
దమునొందన్ నెలకొల్పు నాతిలకముల్ ♦ మట్టారదే! ద్వంద్వయు
ద్ధము రానేల! ప్రతాపుఁ డేటికి సమా ♦ ధానంబు సూచింపఁ! గ
ష్టములన్ దెచ్చు నితండు! వల్దనుచు నా ♦ జ్ఞాపింపఁగా రాదొకో! 323

మ॥ కులశైలోపమ ధైర్యభూధవశిరః ♦ కోటీర కోటీ మణి
జ్వలదారక్తరుచుల్ పదంబులు నహిం ♦ చన్ జూచుచున్నట్టి క
న్నులతో దారుణసంగరాంగణమునం ♦ దన్ ఖడ్గముల్ చీల్పఁగా
వెలికిన్ దూఁకెడు క్రొత్తరక్తములనున్ ♦ వీక్షింపనా నేమొకో!" 324

మ॥ అని యిట్లంచు వచింపరాని కడుఁజిం ♦ తావేశ దైన్యంబులన్
గని దుఃఖింపఁగఁ గృష్ణసింగు "రణమే ♦ కర్తవ్యమే! వేఱుత్రో
వ నిరూపింపఁగరాదె! యిప్పుడిపుడే ♦ పట్టాభిషేకంబు శో
భనమై సాగెను; యుద్ధమెట్లయిన ని ♦ ల్పన్ భావ్యమా నియ్యోడన్." 325

చ॥ అనఁగఁ బ్రతాపసింహుఁడు "మ ♦ హాత్మ! భవద్వచనంబు మానసీ
యనియతి నొప్పు; నైన నొరుఁ ♦ డాహవమున్ బొనరింపఁగోరి పి
ల్చినను నిరాకరింపఁగల ♦ లేఁతమనం బది లేదు; కాని మీ
రనినటు లిట్టిసౌఖ్యసమ ♦ యంబున నెట్లని చింత కల్గెడున్. 326

క॥ దండించుట క్రౌర్యమ్మగు; దండింపమి దుర్బలతకుఁ ♦ దావగు; నవనీ
శుండనయి నాపరిస్థితి యొండేటికి! సున్నితముగ ♦ నున్నది తండ్రీ. 327

మ॥ సరి; యీమంగళవేళయందు రణముఁ ♦ సాగింప కొండొక్కఁడొ
కరణిఁ గార్యముఁద్రిప్పి యీతనిఁ దోలం ♦ గన్ జేతుఁ బొమ్మంచు "సా
గర! చిత్తూర్పురరాజ్యమెల్ల మదుద ♦ గ్రస్ఫార బాహాబల
స్ఫురణన్ రక్షణసేయనెంచితి శుభం ♦ బుల్ నేఁడు సంధిల్లఁగన్. 328

మ॥ అనిశప్రేమ వెలుంగ నయ్యుదయసిం ♦ హక్ష్మావరుం డీమహా
వనిఁ బాలించి యశంబు గాంచెను; సలుం ♦ బ్రాణాథుఁ డానేత పో
యినవెన్కన్ దనకున్ లభింపఁగల పి ♦ త్ర్యేకాధికారంబు పే
ర్మిని నన్నీడకుఁ దోడితెచ్చుచును ధా ♦ త్రీనాథుఁ జేసెన్ వడిన్. 329

మ॥ ఎవఁడో యొక్కఁడు రాజుగా నిలిచి యి ♦ ష్ప్రృథ్వీస్థలిన్ వాని శ
క్తివిశేషమ్మున నేలుటొప్పుఁ; బ్రజ భ ♦ క్తిన్ వాని యాజ్ఞాబలం
బవలంబించుట యొప్పు; లేనియెడఁ జీ ♦ కాకై విపత్కోటిచే
నవరుద్ధంబగు రాజ్య మెవ్వనికి వాఁ ♦ డై యేలఁగాఁ బూనినన్. 330

ఉ॥ ఓరువరాని కార్యమిది; ♦ యూఱక కావర మూని నీతివి
ద్యారమణుండు కృష్ణవిభు ♦ నాడితి నోరికి వచ్చినట్లు; నా
తో రణమాచరింపుమని ♦ త్రుళ్లుచు నాదు మహాధికార ధి
క్కారము చేయుచుంటి; విఁకఁ ♦ గాదు సహింప భవత్ప్రవర్తనల్. 331

—*) రాణాప్రతాపసింహుఁడు సాగరసింహుని దేశమువీడి పొమ్మనుట. (*—

మ॥ నిను వీక్షించుచు మత్ప్రజల్ సుగుణని ♦ ర్ణిద్రుల్ భవద్దుష్ట వ
ర్తనమున్ నేర్చిన నేర్తు; రావున నినున్ ♦ దండింపఁగా నొప్పు; వే
చను నాదేశమువీడి యిప్డె పరరా ♦ ష్ట్రశ్రేణులన్ జేర; నో
ర్వ నిమేషం; బిట నాలసించినను; శీ ♦ ర్షచ్ఛేదమున్ జేసెదన్. 332

మ॥ ఇది నాయాజ్ఞ! బహిష్కరించితిని ని! ♦ న్నీదేశమం దెచ్చటన్
మెదలన్ బోకు'న సాగరుండు నగి "స్వా ♦ మీ! చాల సంతోషమై
నది! రాజ్యంబది యెంతలీపనుచు డెం ♦ దంబందు భావించితో
విదితంబయ్యె సమస్తభూజనులకున్! ♦ బెక్కేల వాక్రువ్వఁగన్. 333

మ॥ ఇది నాయూ రిది నాదురాష్ట్రమనుచున్ ♦ హీనుల్ మఱిన్ దుర్బలుల్
మది నూహింతురు; కాని విక్రమకళా ♦ లంకారులౌ వారి క

య్యుదయాస్తాచలమధ్యగంబయిన స ♦ ర్వోర్వీతలంబున్ ముదా
స్పదమై కొంగుపసిండివోలెఁ దమదై ♦ భాసిల్లు నెల్లప్పుడున్. 334

మ॥ పరమప్రాభవమొప్పు నీదయిన మే ♦ వాడ్రాజ్యమందుండఁగా
నెరియున్ నామది; నీవు శత్రుఁడగుటన్ ♦ నీవారలున్ శత్రులౌ
దురు; నీకెప్పుడు గర్భశత్రువులు మి ♦ త్రుల్ నాకు; నట్లౌట మ
చ్ఛరణంబుల్ క్షణకాలముంచుచుఁ జరిం ♦ చన్ నీదు దేశంబునన్. 335

సీ॥ పనియేమి పరభూమి ♦ పతులసీమల కేగ! మేవాడ నెప్డెప్పు ♦ మ్రింగుదునని
కనువిచ్చియుండు న ♦ క్బరుఁధరామండలాఖండలుం! డాతని ♦ కడకుఁ బోదుఁ;
ద్వద్వికటప్రవ ♦ ర్తనమున నతనికి మిత్రలాభము గల్గు ♦ మేర యొదవె;
నిప్పుడె పయనించి ♦ యేగెద ఢిల్లీపురమునకుఁ గొన్ని ది ♦ నములలోన!

గీ॥ హెచ్చరికగల్గి రాజ్యంబు ♦ నేలుచుండు! మిదియె శాశ్వతమనియుండ! ♦ కెప్పు డెవ్వ
రెచట నేరీతి నిన్ను జ ♦ యించి దాని నపహరింతురొ! తెలియఁబో ♦ దజునకైన."

—*) రాణాప్రతాపసింహుఁ డనుచరులతో వేఁటకుఁ బోవుట. (*—

మ॥ అని గాంభీర్యమెలర్పఁగాఁ బలికి య ♦ శ్వారూఢుఁడై పోయె! నా
తని వీక్షించుచుఁ గొంతసేపటికి యో ♦ ధశ్రేష్ఠులున్ బెక్కురున్
దనవెంటన్ జనుదేర నయ్యెడ నర ♦ ణ్యప్రాంతమున్ జేరఁగాఁ
జనె వేఁటాడ బ్రతాపసింహుఁడు జనుల్ ♦ సంతోషమున్ బొందఁగన్. 337

ఉ॥ కొమ్ములులేని యమ్మహిష ♦ కోటులు, తొండములేని భద్రనా
గమ్ములు నాఁగనొప్పు వనిఁ ♦ గల్గిన మత్తమహావరాహ పో
తమ్ముల నాప్రతాపుఁ డతి ♦ దారుణలీలల నీఁటియన్ శరీ
రమ్ములు గాడఁగాఁ బొడిచి ♦ రాసులురాసులువోసె నేలపై. 338

మ॥ అరుణాంశుచ్ఛటలీన నేత్రములు, శౌ ♦ ర్యాటోప మేపార, ను
గ్రరసోద్రేకమునన్ బ్రతాపధరణీ ♦ కాంతుండు సత్త్వాత్రసం
భరితుండై త్రినయీఁ జెందింపక మహా ♦ మాయాకిరాతుండటుల్
నిరతోదగ్రవిహారముల్ నెరపి ఖం ♦ డించెన్ వరాహమ్ములన్. 339

మ॥ మొగి సామంతులు వీరయోధనివహం ♦ బుల్ వారి దోశ్శక్తికిన్
దగు చందంబున నొక్కమైఁ గదిసి కాం ♦ తారమ్మునన్ గల్గు న

మృగసంతానముల౯ క్షణంబునను భూ ♦ మి౯ గూల్చి పెక్కంటిఁ గు
ప్పగఁ దా మొక్కెడఁ జేర్చి రారుధిరముల్ ♦ పాఱంగఁ బెన్కాల్వలై. 340

చ॥ అరిది ముదంబు మీఱ మృగ ♦ యారతి సాగఁగఁ జేసి నిల్పి స
త్వరముగ లెక్కసేయఁగఁ బ్ర ♦ తాపుఁడు గూల్చు వరాహపంక్తి యుం
దఱు సమయించు నమ్మృగవి ♦ తానము మీఱుటఁ జూచి హర్షముల్
వఱలఁగ మంచి కాలమది ♦ వచ్చె నటంచుఁ దలంచి రందఱు౯. 341

మ॥ శివముత్తైదువ ప్రీతి కేకలముల౯ ♦ జెండాడి చెండాడి యో
ధవితానంబులు నూతనోత్సవసము ♦ ద్యత్స్వాంతులై భూమియు౯
దివియు౯ గ్రక్కదలంగ నార్చుచుఁ గడు౯ ♦ దేజంబు దీపింప ను
గ్రవనంబు౯ విడి రాజధానిని జొరం ♦ గాఁబోయి గొక్కుమ్మడి౯. 342

సీ॥ చిత్తూర్పురము శత్రు ♦ చేఁబడి రాజ్యభాగము తద్దపెద్దది ♦ గాకయున్నఁ!
దమదేశసామంత ♦ ధరణీశు లొక్కరొక్కరు పోయి యక్బరుఁ ♦ గలియుచున్నఁ!
గడలేని యుద్ధసం ♦ ఘర్షణంబులఁ దమదేశమంతయుఁ బిప్పి ♦ తేలియున్నఁ!
బరిపంథియో నభో ♦ భాగభూభాగముల్ తలక్రిందుచేసెడు ♦ బలియుఁడైనఁ!

గీ॥ దమమది హరించు ఘనుఁడు దు ♦ ర్దాంత తేజుఁ డర్కకులవర్ధనుఁడు సుగు♦ణాంబురాశి
యా ప్రతాపుఁడు రాజౌట ♦ హర్షమొంది మించి మిన్నంది ప్రజ రమి ♦ యించెనపుడు.

గద్య:— ఇది శ్రీమత్కామేశ్వరీ కరుణా కటాక్ష వీక్షా సమాసాదిత రసవత్కావ్య
నిర్మాణ చాతురీధురీణ, సుగుణగణపారీణ, దుర్భాకవంశదుగ్ధాంభోరాశి
రాకాకైరవమిత్ర, శాలంకాయనగోత్ర పవిత్ర, సుజనజనాను
గ్రహపాత్ర, వెంకటరామార్యపుత్ర, కవిసింహాఽవధాని
పంచానన కావ్యకళానిధీత్యాదిబిరుద విఖ్యాత, సుకవి
రాజశేఖర, రాజశేఖరకవి ప్రణీతంబయిన
"రాణా ప్రతాపసింహ చరిత్రం" బ
ను పద్యకావ్యమునం
దుఁ బ్రథమా
శ్వాస
ము

సంపూర్ణము.

శ్రీ

కామేశ్వర్యై నమః.

# రాణాప్రతాపసింహచరిత్ర.

## ద్వితీయాశ్వాసము.

---

మ॥ వరసౌఖ్యంబులకున్ నిరోధమగు నే ♦ ర్పాటుల్ దొలంగించి సు
స్థిరతన్ బెంచు వ్యవస్థలన్ దిటముగాఁ ♦ జేకూర్చుచున్ సత్యధ
ర్మరతుల్ మీఱఁగ రాజ్యమేలుకొనుచున్ ♦ రాణాప్రతాపావనీ
శ్వరమందార మొకానొకప్పుడు సలుం ♦ బ్రాధిభర్త నీక్షించుచున్, 1

—* { సూక్తసింహుని రాజధాని కంపుమని ప్రతాపసింహుఁడు కృష్ణసింహు నర్థించుట. } *—

మ॥ "మొదలన్ నెత్తురు పంచుకొం చనుజుఁడై ♦ పుట్టెందె; నాపైన బా
ల్యదశన్ బైనను ప్రక్కనున్ బడుచుఁ దు ♦ ల్యప్రేమతో మైత్రి కా
స్పదమై వర్తిలె; సూక్తుఁ డొక్కత్రుటి నన్ ♦ బాయం; డొకప్పైనఁ ద
ల్లిదరిన్ జేరఁడు; ప్రాణ మొక్కఁడు నొడల్ ♦ రెండైన యట్లుండెడిన్. 2

గీ॥ రాము నుపమ నాయెడఁ బల్క ♦ రాదు! గాని తెప్పవాల్పక కనుపెట్టి ♦ రేయుఁ బవలు
ననుచరుండయి నన్గొల్చు ♦ నపు డతఁడు నిజంబు మూఁడుమూర్తులకు ల ♦ క్ష్మణుఁడె సుమ్ము

గీ॥ సూర్యవంశప్రదీపుఁడౌ ♦ సుతువిపత్తుఁ బాపి కాపాడితనుచు నీ ♦ భవ్యయశము
నలుదెసలఁ బ్రాకె! సూక్తుఁడ ♦ నంతకోటి జనవిజయసూక్తుఁడగుచుఁ దే ♦ జమునఁ బెఱిఁగె.

గీ॥ అతఁ డడుగు మోపు సమయభా ♦ గ్యమునఁ జేసి యెంతకాలమొ సంతాన ♦ మెఱుఁగకుండి
కడుపు ఫలియించి కొమరులఁ ♦ గనితి నీదు దొడ్డయిల్లాలు జగము సం ♦ తోషమంద.

చ॥ ఎఱుఁగుదు రెంతొ సౌమ్యముగ ♦ నేను వచించిన వాక్యమూని సా
గరుఁడు సభాముఖంబుననె ♦ కాఱులు ప్రేలుట; దానఁ గోపవి
స్ఫురణను దేశమున్ విడచి ♦ పొమ్మని పంపితిఁ! గాని కూర్మిసో
దరు నెడఁబాటుచే మది య ♦ థాయథలై చనె నేమి తెల్పుదున్! 6

గీ॥ సూక్తు నంపుము; చెంతనుం ♦ చుకొననెంతు; నెచటనున్న నీవాఁడు గాఁ ♦ డే యతండు!
నేను మొదలుగ నీరాజ్య ♦ మెల్ల యుష్మ దమృతహస్తాభిరక్షితం ♦ బగును గాదె!" 7

మ॥ అని యొంతేనిఁ బ్రతాపసింహుఁడును ద ♦ న్నర్థింపఁగాఁ గృష్ణసిం
గను మోమున్ వికసింప "దేవ! నిను ని ♦ త్యంబున్ మహాభక్తి నె
క్కొనఁగాఁ గొల్చుటకన్న నొండుపని నా ♦ కున్ హర్షదంబౌనె! యొ
దను నీయానతి వేదతుల్యమని తా ♦ ల్తున్ నేను శీర్షమ్మునన్. 8

శా॥ నామాటొక్కఁడిదేల; నేను సుతులున్ ♦ నాబంధులున్ నాసలుం
బ్రాముఖ్యావనిరాజ్యలక్ష్మియును స ♦ ర్వస్వంబు నీచేతిదే;
యీమే నియ్యెలలోన నుండువఱ కి ♦ ట్లే సాఁగినన్ జాలు; నా
స్వామిస్నేహముమ్రోలఁ దుచ్ఛములు స ♦ ప్తద్వీపసామ్రాజ్యముల్. 9

గీ॥ వత్సరమున నార్నెల్లు తా ♦ వకసమతుమందు నేనుందు; నాసమ ♦ యంబునందు
దేవ! నీమృదుపాదరా ♦ జీవయుగము సూక్తు వదనారవింద మే ♦ జూడఁగందు." 10

చ॥ అనుచుఁ బ్రతాపసింహవసు ♦ ధాధిపసింహు ననుజ్ఞ నొంది శో
భనతర లక్షణాన్వితము ♦ వార్వము నెక్కి నిజాప్తయోధులున్
దను గొలువంగ నాత్మసద ♦ నంబును జేరి లతాంగిసమ్మతిన్
గొని కొనివచ్చె సూక్తు రవు ♦ కుంజరసింహుఁ బ్రతాపుఁజేరఁగన్. 11

గీ॥ తావియును బూవు కరణి సో ♦ దరు లిరువురు కలిసి రాగరసాతిసం ♦ కలనఁ బెరసి
యేకమతు లేకవాక్యులై ♦ యెల్లరలర నొండొరులు పాయ కొక్కఁడై ♦ యుండిరపుడు

—*) వసంతోదయము. (*—

గీ॥ పల్లవవ్యాప్తి పుష్పవ ♦ ద్వైభవంబు ఫలనవోదయభూతి కొ ♦ మ్మలకుఁ గూర్చి
మాధవగృహీతయగు మధు ♦ మాసలక్ష్మి యఖిలజగము పూఁదోటయ ♦ ట్లలరఁజేసె.

—*) సలుంబ్రాకృష్ణసింహాదు లుగాదికానుకలు గొనివచ్చుట. (*—

మ॥ తలపైనన్ మగఱాఁడురాయి వెలుఁగొం ♦ దన్, ధాళధళ్యంబు రం
జిలు ఖడ్గంబులు వ్రేల, దొడ్డ నునుతే ♦ జీలెక్కి యోధాళి చెం
తల నేతేరఁ, బ్రతాపసింహుఁ గొలువన్, ♦ నానామహీమండలేం
ద్రులు వేంచేసి యుగాదికానుకలు దొం ♦ తుల్ దొంతరల్ తెచ్చుచున్. 14

---

⊕ As Vasanti or Spring personified, the consort of Hur is worshipped by the Rajput, who opens the season with a grand hunt led by the prince and his Vassal chiefs when they chase slay and eat the boar. Personal danger is disregarded on this day as want of success is ominous that the great Mother will refuse all petitions throughout the year. "Annals of Mewar."

శా॥ లోకైక స్థిర విక్రమక్రముఁడు సు ♦ శ్లోకుండు చండేశ వం
శాకల్పుండు శిశోదియాభిజన దు ♦ గ్ధాంభోధిచంద్రుండు ని
ర్భీకస్వాంతుఁడు స్వామిభక్తమణియన్ ♦ పేర్గన్నవాఁ డాసలుం
బ్రాకృష్ణుం డరుదెంచె స్వామిచరణ ♦ ద్వంద్వంబు సేవింపఁగన్. 15

గీ॥ ధీరలోకైకమౌళి ఝా ♦ లూరినృపతి సోనెగుర్రకులాంభోధి ♦ సోముఁడైన
భానుసింహుఁడు వేంచేసెఁ ♦ గానుకలుగఁ జామనవరత్నదివ్యభూ♦షలను గొనుచు. 16

గీ॥ ముందుఁ జిత్తూరురణమున♦భూమి వడఁక మెలఁగు జయమల్లసుతుఁడు దో♦ర్బలయుతుఁడు
తేజసింగు రాఠోడ్వంశ ♦ దీపకుండు తరలె బదనూరునుండి ప్ర ♦ తాపుఁ గొలువ. 17

క॥ ఝాలాకులేంద్రుఁడు మహోత్తాలమగు రుమాలుఁదాల్చి ♦ తపనీయవిభూ
షాలిఁగొని శ్యామసింహుఁడు హేలాగతి సాద్రినుండి ♦ యేతెంచె వడిన్. 18

ఆ॥ స్వామిభక్తి యుగ్గు ♦ పాలతో మఱఁగిన పావనుండు ధేల ♦ వార నృపతి
యరుగుదెంచె నప్పు ♦ డామనస్సింహుండు కందులేని మనసు ♦ కాన్క చేయ. 19

గీ॥ మదన-మాధవులటు గాఢ ♦ మైత్రితోడ వెలయు బేడ్లా-కొఠేరియా ♦ పృథ్వినాథు
లాప్రతాపమహీంద్రు పా ♦ దాంబుజములఁ జేరి సేవింపనెంచి వేం ♦ చేసి రపుడు. 20

మ॥ విమలారణ్యమనోజ్ఞ వస్తువితతుల్ ♦ పెక్కుల్ రహింపన్ స్వతం
త్రమహీరాజ్యరమాధురంధరుఁ డహో ♦ ర్యస్థైర్యుఁ డాహిద్విష
త్సమదవ్యాఘ్రమహాకిరాతుఁడు కిరా ♦ తస్వామి యాభీమచాం
దమలస్నేహమెలర్ప వచ్చెను బ్రతా ♦ పాధీశ్వరున్ జూడఁగన్. 21

మ॥ తనసామంతుల గారవించి ముదమం ♦ దన్ జేసి యాబాల్యమి
త్రుని భిల్లేశ్వరు భీమచాందుఁ గడు సం ♦ తోషంబు నొందించి మ
న్ననలన్ దన్పి ప్రతాపుఁడంతట "నప ♦ ర్ణాదేవికిన్ బ్రీతిగా
ననికిన్ బోవలె వేఁటలాడ" ననియెన్ ♦ వారంద "రానా" ననన్. 22

—*) సామంతరాజ సహితుఁడై ప్రతాపసింహుఁడు వేఁటకు వెడలుట. (*—

సీ॥ చైతకంబనెడు నా ♦ జానేయమున మహోదాత్తుండు రాణాప్ర ♦ తాపసింహుఁ!
డాతనికడ నుత్త ♦ మాశ్వంబుపై ధీరుఁ డినకోటితేజుఁడౌ ♦ కృష్ణసింహుఁ!
డితని చేరువ వాజి ♦ నెక్కి గ్వాలియరు మహామహీనాథుండు ♦ రామచంద్రుఁ!
డతనిపక్కన సము ♦ ద్ధతహయారూఢుఁడై శూరశిఖామణి ♦ సూక్తసింహుఁ!

గీ॥ ఇతని చేతను భానుసిం ♦ గతని పొంతఁ దేజసింహుఁ. డితని కుడి ♦ దెసను శ్యామ
సింహుఁ! డితని పిఱుఁద మన ♦ స్సింహుఁ! డవలఁ దరతమస్ఫూర్తి వెడలిరం ♦ దఱును గలిసి.

మ॥ నుదుటన్ దొడ్డవిభూతిరేఖ కటియం ♦ దున్ శాటి కంఠంబునన్
రుదురాకల్ గల పేరులున్ ముఖమునం ♦ దున్ బ్రహ్మతేజోగతుల్
పొదలన్ రాజపురోహితాగ్రణి జగ ♦ త్పూజ్యస్వభావుం డవా
ర్యదయుండౌ హరభట్టునున్ వెడలె ది ♦ వ్యాందోళికారూఢుఁడై. 24

చ॥ వెలిజిగివల్వలన్ దొడిగి ♦ శ్వేతహయంబుల నెక్కి విచ్చుక
త్తుల తెలికాంతిపుంజముల ♦ తోఁ జను నాశ్వికు లొప్పిరయ్యెడన్
గొలకున గుంపుకట్టి చను ♦ కోమల రాజమరాళముల్ వలెన్!
బలుచనిగాలిసోఁకుల శు ♦ భంబుగఁ దూఁగెడు పూలగుంపటుల్! 25

గీ॥ పణవరవము భేరీభాంక ♦ రణరవంబు తప్పెటల బూరగొమ్ముల ♦ ధ్వానములును
బూరటిలి రోవసిఁ బగిల్చి ♦ నీరధులను గలఁచుగతి మిన్ను మన్ను నే ♦ కముగ మ్రోసె.

గీ॥ వనము వలయాకృతిగఁ జుట్టు ♦ కొనుచు నిలిచి యలబలంబుల నొనరించి ♦ యలబలంబు
భీకరాట్టహాసములతోఁ ♦ బిలిచి పిలిచి తట్టి తట్టి మృగాళి నం ♦ తటను లేపె. 27

గీ॥ భయద వార్షుక మేఘగ ♦ ర్భంబు వెడలి వివిధముఖములఁ బరతెంచు ♦ పిడుగులట్లు
చిమ్మచీఁకట్లు క్రమ్మిన ♦ సమ్మునుండి ఘాతుకమృగాళి నానాము ♦ ఖముల వెడలె.

ఉ॥ ఎత్తిన హస్తయుగ్మముల ♦ నీఁటెల ముందుకుఁ దూలఁబట్టి య
త్యుత్తమ మంజులాశ్వముల ♦ నూల్కొని పాఱఁగ హెచ్చరించి శే
కెత్తు మహోత్సవస్ఫురణ ♦ నెల్లరు నొండొరుఁ బిల్చుకొంచు రా
హుత్తులు ముందుకున్ వెడలి ♦ యుగ్రమృగావళులన్ వధింపఁగన్. 29

చ॥ సకల దిశావకాశముల ♦ శాత కృపాణ ముఖోజ్జ్వలాయుధ
ప్రకరముఁ బోడ దూఁకు భట ♦ వర్గముఁ దప్పుకొనంగలేక దా
మొకఁడును రెండు మూఁడిటుల ♦ నుగ్రమృగంబులు గుంపులై యొకా
నొకభటు మీఁదికిన్ గవయు ♦ చుండుట చూడఁగ వేడుకై తగెన్. 30

మ॥ ఒకపర్యాయమె యొక్కచోటనె మహా ♦ యోధుం డొకొక్కండు కుం
తకృపాణాదులఁ బర్వఁజేసి మృగసం ♦ తానమ్ములన్ గూల్చి యీఁ
టెకొనన్ వాని గుదుల్ గుదుల్ గొనుచు న ♦ ట్లేవచ్చు నాదృశ్య మిం
చుక చూడన్ గనులున్న భాగ్యమని తోఁ ♦ చున్ గాదె యెవ్వారికిన్! 31

—*) వేఁటచాలించి కూర్చుండిన రాజపుత్రసైన్యమధ్యమునకు వరాహము వచ్చుట. (*—

శా॥ ఘనకుంతంబులు దీర్ఘశూలములు వ్య ♦ గ్రంబింతయుఁ గాక సా
ధ్యములై యొప్పు మృగంబులన్ దునిమి వీ ♦ రశ్రేష్ఠు లక్కానన నా
శ్రమముఁ బోలె రచించి వేఁట నపుడే ♦ చాలించి; రంతన్ వరా
హ మొకం డయ్యెడ కేగుదెంచి జనమ ♦ ధ్యంబందు దూఱెన్ వడిన్. 32

మ॥ ధనురస్త్రంబులు పట్టి ఖడ్గములు చే ♦ తన్ దాల్చి యుత్సాహవ
ర్ధనులై యెల్లరు చూచుచుండఁగ సమం ♦ దస్ఫూర్తి నద్దానిఁ గూ
ల్పను సూక్తుండు ప్రతాపుఁ డశ్వములపై ♦ లంఘించి; రాక్రోడమున్
జనియెన్ గుమ్మరసారెయట్లు భటులన్ ♦ బల్మాఱునున్ జుట్టుచున్. 33

చ॥ ఒకమొగమై పెనంగుచు మ ♦ హోన్నతరోషముతోడ భీకరాం
బకములు పర్వఁ జేసినను ♦ బందియు నక్షత భూరిగాత్రమై
సుఖముగఁ బాఱుచుండె; నిది ♦ చూచి సహింపక వార లిద్ద రొ
క్కొక నొకమోముగాఁ దిరిగి ♦ యుగ్రతఁ దాఁకిరి క్రోడపోతమున్. 34

క॥ వెనుక ధనంజయవిక్రమ ఘనుఁడగు సూక్తుండు ముందు ♦ గా ఫాలవిలో
చనసదృశుండు ప్రతాపుఁడు చని మోదిరి సూకరము ని ♦ శాతాస్త్రములన్. 35

—*) సూక్తసింహుఁడు ప్రతాపసింహునితో వాదించుట. (*—

క॥ ముడుచుకొని పంది పుడమినిబడి నీల్గెఁ; బ్రతాపసింహ ♦ వసుధావరుఁ డ
య్యెడఁ జేరెఁ; దత్క్షణమ సూక్తుఁడు దూఁకెను "బంది నాది ♦ తొలఁగు"మటంచున్.

క॥ "కాదిది నాచేఁబడె; నీయేదు ముఖము పగిలి కూలె; ♦ నిదె కనుఁగొనుమీ!
నాదుదెస పురోభాగము; నీది వెనుకు; ముందుఁ దగులు ♦ నే! నీశరముల్" 37

గీ॥ అని విభుండన సూక్తుఁ "డ ♦ యారె! పంది మొపు డెచట నెట్లు తిరిగెనో ♦ యెవ రెఱుఁగుదు!
రిందు నీదని వ్రాసితే ♦ యేమిగుఱుతు! నాది గాదన దృష్టాంత ♦ మేది" యనియె. 38

గీ॥ "పనికిమాలిన పందికై ♦ యనృతమాడె; దిలయుఁ గ్రుంగెనె! యంభోధు ♦ లింకిచనెనె!
వెలగలుగు వస్తువేయైన ♦ వెనుకఁబడెదె! కోటి యనృతమ్ము లేనిఁ బ ♦ ల్కుటకుఁగాని."

క॥ అని నిలుచున్న ప్రతాపునిఁ గని సూక్తుఁడు "పంది నేమి ♦ గాఁ దలఁచితివో!
మును దానికై కదా పార్థునితోఁ బోరాడె శంక ♦ రుఁడు ఘోరముగన్! 40

గీ॥ తలఁపు లోకఁడైన లవము శ్రీ♦దమునురాదు; కౌస్తుభంబైనఁ జనుఁ జిల్లి♦గవ్వమాడ్కిఁ!
బౌరుషము మాటపట్టింపు ♦ వచ్చినపుడు గడ్డిపోఁచయె మేరువై ♦ గణుతిఁగాంచు. 41

మ॥ పలుకన్ బూనిన విల్వనున్ గుఱిఁచి మే ♦ వాఙ్రాజ్యమున్ బోలఁగాఁ
గల భాగ్యం బిలలేదు; సోదరకృత ♦ ఘ్నత్వంబునన్ మీఱఁగాఁ
గల పాపంబును లేదు; నీతులను బ ♦ ల్కన్ వచ్చు; నెవ్వారు వా
రలతప్పుల్ గ్రహియింతురే! జనుల మ ♦ ర్యాదల్ కడున్ జిత్రముల్. 42

సీ॥ విశ్వస్తుతాఖండ ♦ విక్రమక్రమునిసా మ్మవనిరాజ్యవిభూతి ♦ యంద్రు బుధులు;
మనలోన విక్రమ ♦ మహిమఁ బూజ్యుండెవఁ డతఁడె మేవాల్లక్ష్మీ ♦ కర్హభర్త;
కాని నీవొకఁడవే ♦ గళమునఁదాళిఁగూర్చిన భర్తగావు; నిన్ ♦ బ్రేమింగఁగలుగు
పోటరు లుండక ♦ పోరు; నీనెత్తిని బాడవైన యొకకొమ్ము ♦ పుట్టెనొక్కొ!
గీ॥ యేను దప్పిన నీరాజ్య ♦ మేలు ఘనుఁడు పుట్టఁడని యెంచినావు! నీ ♦ ముఖమునందె
ప్రొద్దుపొడుచునె! యిటు లేని ♦ పోని దురభిమాన మూనితి; వికనైన ♦ మానుటొప్పు.

క॥ పదికోట్ల మాటలేటికిఁ! గుదురుగ వాదంబు మాని ♦ క్రోధంబు నొసం
గుమవో! నాతో మార్కొని కదనము చేసెదవో! తెల్పఁ ♦ గావలె” ననినన్. 44

చ॥ “కలఁగెనొ ప్రజ్ఞ! లేక చెడు ♦ కాలమె వచ్చెనొ! స్నేహమెంతయున్
వెలసిన యన్నఁదమ్ములకు ♦ నిప్పువిధాన మనోవిభేదముల్
గలిగెను జూచుచుండనె; య ♦ కారణవైరము లిట్టివేకదా!
ప్రళయము వచ్చె; మాన్పఁగ ను ♦ పాయము దోఁపద-యేమిచేతుమో!” 45

క॥ అని పుట్లకొలఁదిగా విసమును గడుపులఁ బోసినట్లు ♦ పొగులుచు దృష్టుల్
మొనయించి రంద ఱొక మొగమునను సలుంబ్రాధినాథు ♦ ముఖకమలముపై. 46

—*) సలుంబ్రా కృష్ణసింహుఁడు సూక్తసింహునకు బుద్ధిచెప్పుట. (*—

ఉ॥ ఆతఁడు లేచి సూక్తు దరి ♦ యన్ జనుదెంచి “శిశోదియాకులో
ద్భూతులు పూర్వజుల్ గనిన ♦ మొక్కఁగనేర్తురు కాని యెన్నఁడున్
నీతితొలంగి తిట్టఁగను ♦ నేరరు; క్రొత్తలు తెచ్చి పెట్టి మా
చేతములన్ దహించితివి; ♦ చెప్పెడి దేమిక నీప్రవర్తనల్! 47

చ॥ శివశివ! యెట్టిపాపకము ♦ చేసితి; దేవుని దిట్టి కొట్టు దా
నవులయినన్ మహోన్నత గు ♦ ణంబులఁ బొల్చిన యగ్రజన్ము పా

దవనజముల్ భజించి నుతిఁ ♦ దన్పుమురే! గురుతుల్యు జ్యేష్ఠు ని
ట్లవినయబుద్ధివౌచుఁ దెగ ♦ నాడుచు ధర్మముఁ బూడిఁగల్పెదే! 48

మ॥ అనురాగాంబుధి స్వామికాళ్ళఁబడుచున్ ♦ బ్రార్థించి మూన్నాళ్లు నీ
వనుతాపమ్మునఁ గ్రాఁగి పస్తువడి ప్రా ♦ యశ్చిత్తముల్ జేయకుం
డిన మేవాడధరిత్రి నెందరిగినన్ ♦ 'నీవిందురా; కూరుచుం'
డనువా రుందురె! యెవ్వరోర్చెదరు క ♦ ట్టా! స్వామిధిక్కారముల్. 49

మ॥ మనవంశంబున నెన్నఁడుం గలుగ దీ ♦ మర్యాద; యన్నన్న! నే
మనియున్నప్పుడె నాసమక్షమున న ♦ స్మత్స్వామి నిందించు నీ
వనుకంపార్హుఁడవౌదె! వధ్యుఁడవు! బా ♦ ల్యంబందు నిన్నెత్తి పెం
చిన దోషంబున నోర్చుకొంటిఁ! గడునో ♦ ర్చెన్ జేత మిప్పట్టునన్." 50

—*) సలుంబ్రా కృష్ణసింహునెడ సూక్తసింహుఁ డవినయము జూపుట. (*—

మ॥ అని వాత్సల్యముఁ ద్రుంపలేక యిటు న్యా ♦ యంబాడు నాకృష్ణునిన్
గని సూక్తుండును "బిల్లికిన్ జ్వరమనం ♦ గాఁజెల్లె; నీమాటలన్
వినఁగా నోపను; నీపరితాపవిభవన్ ♦ నేమ్రొక్కఁగా నోపఁ; బం
ది నెటుల్ వీడఁగ నోప; నోపరణమం ♦ తేనిన్ విసర్జింపఁగన్. 51

ఉ॥ గుట్టుగ మీరలిర్వురును ♦ గూడుచు నాజగమల్లు బాధ్యతల్
మట్టని బెట్టె రాజ్యరమ ♦ లాగు చెఱుంగదె లోక! మందఱున్
గుట్టిడు తేలు ధర్మమిది ♦ గోయని చూపిన యట్టులయ్యె; నీ
కిట్టటులాడె బుద్ధి; కడు ♦ వృద్ధవు; నోరు మెదల్పకుండుమీ: 52

మ॥ సిరి పీరున్ వెదకున్; ఘనుల్ బెదరి యి ♦ స్సీ! మూలలన్ దాఁగఁబో;
రురుశౌర్యోజ్జ్వలు లిందుఁ గల్గు మగలం ♦ దొక్కొక్కమా ఱొక్క రె
వ్వరినేఁ బూన్పుము చెండివై చెదఁ! బ్రతా ♦ పస్వామి మద్విక్రమం
బెఱుఁగున్; బైఁబడఁ; డీవు సాయమయి ర ♦ మ్మా! చూతు నాయుద్ధతిన్." 53

మ॥ అని గర్వించెడు సూక్తునిన్ గని సలుం ♦ బ్రాధీశుఁ "డేమంటి! ని
గ్గనఁబాపం! బిసుమంత యోర్వ గురుధి ♦ క్కారాఘముల్! నిన్నుఁ బెం
చిన వాత్సల్యమునైనఁ జూడక శిర ♦ శ్ఛేదంబు గావింతు ని"
ష్ఠని ఖడ్గంబుఁ గొనన్ బ్రతాపుఁడు రయం ♦ బారన్ సమీపించుచున్," 54

—*) ప్రతాపసింహుఁడు సలుంబ్రాకృష్ణసింహునకుఁ గోపోపశమనము చేయుట. (*—

మ॥ "గురుతుల్యుండవు! మాకు వంద్యుఁడవు! సూ ♦ క్తుండాడు గర్వోక్తులన్
దరుణాబ్జాత దళాతికోమలము స్వాం ♦ తం బెంతగా నొచ్చెనో
స్థిరకారుణ్యసముద్ర! వానిబదు ల ♦ ర్థింతున్ క్షమాభిక్షు! యే
కొఱ లేకుండఁ బ్రసన్నమూర్తివయి నా ♦ కున్ దర్శనం బీయవే! 55

గీ॥ గురుని దండన తన్ను మే♦ల్పఱచు ననుచు నెఱుఁగ కితఁడాడు నుడుల వం♦దుఱఁగఁ బోకు!
వాఁడు నాచేత నిపుడు త్రో♦వకునువచ్చు నస్త్ర మస్త్రేన శామ్యతి ♦ యనెడు నట్లు."

క॥ అని సూక్తుఁ జూచి "కొమరా! కనుచుండనె యొంతవఱకుఁ ♦ గడపితి నుడులన్!
నిను నీవెఱిఁగితొ లేదో! యనుచితమని నీకుఁ దోఁప ♦ దా! యిపుడైనన్. 57

ఉ॥ తండ్రికిఁ బంగనామములు ♦ తద్దయుఁ దీర్చెడు పుత్రుఁడండ్రె పె
క్కం! డ్రొకమంచి పేర్గొనుట ♦ కష్టము; దుష్టుఁడటంచుఁ బేరు చే
కొం డ్రవివేకు లూఱక; ♦ కూడిన వీరవరేణ్యు లిందఱే
మాడ్రనిదైన నెంచ కిటు ♦ లాడుచు నిందలఁ గట్టుకొందువే! 58

మ॥ జనకప్రాయు మహాత్ముఁ గృష్ణవిభు సు ♦ స్వాంతంబు నొప్పించి న
న్ననురాగార్ద్రుని జ్యేష్ఠు భూరమణు హా ♦ స్యంబాడ నూకించి; తిం
కను గన్విచ్చుచు మంచిచెడ్డల నెఱుం ♦ గన్ లేక యిట్లున్న నే
మని నీభావము నెంచఁగానగును! గ ♦ ట్టా! యిట్లు వర్తింతువే! 59

గీ॥ గురు లమృతహస్తములతోడఁ ♦ గొట్టినపుడు విసముగా నది తోఁచుట♦విలయమునకె;
మొదలను గొట్టెదీవు! నేఁ ♦ డేల యిట్టి తలబిరుసుమాట! లిపుడైనఁ ♦ దెలివిఁగనుము.

మ॥ ఉరుశౌర్యుల్ మనవెత్తిపై నడచువా ♦ రున్నారు బ్రహ్మాండము
క్కఱఁజేయంగల విక్రమప్రకటులు: లే ♦ లా నీదు గర్వోక్తు లిం
దఱిలోఁ! దాడిని దన్నువాని తలపై ♦ దన్నంగలాఁడుండు! నీ
గరువంబున్ సకలంబు దింపఁగల నొ ♦ క్కండున్ నిమేషంబునన్." 61

గీ॥ అనిన "ముంజేతి మణిఁజూడ ♦ నద్దమేల! కుడువఁబోయి కూరలరుచి ♦ యడుగనేల!
చేయి చేయిని గలుపు! నీ ♦ శీర్ష మెగిరి యవలఁబడకున్న నను సూక్తు ♦ డనఁగఁబోకు!

గీ॥ ఇంక నొక్కఁ డిందున్నవా ♦ రెవ్వరైన నందఱైనను నన్ను మా ♦ ర్కొందు రేని
మిముల హర్షించి ప్రళయభై ♦ రవుని మాడ్కి సర్వసంహార మొనరింతు♦క్షణములోన."

—*) హరభట్టారకుఁడు సూక్తసింహునకు నీతిఁ గఱపుట. (*—

మ॥ అని మీసంబునఁ జేయిమోపుచును గ ♦ ర్వావేశముం జూపు సూ
క్తుని వీక్షించి ప్రతాపసింహుఁడు కడుం ♦ గ్రుద్ధాత్ముఁడై "నె త్తికిం
గనులెక్కెం జుమి నీకు; నిప్పుడె భవ ♦ ద్గర్వాంధతం డింతు ర"
మ్మనునంతం హరభట్టు వారలను డా ♦ యం బోయి దీనాస్యుఁడై, 64

ఉ॥ "నాయనలార! సూర్యకుల ♦ నాశకరమ్మగు ఘోరకృత్యముం
జేయఁగ నుంటిరేల! పగ ♦ చే రిపులం సమయింపవచ్చుఁగా!
కీయెడ నన్నఁదమ్ము లటు ♦ లీసును రోసము నూని పోరు ట
న్యాయమటంచుఁ బూజ్యులన ♦ రా! వినరా! రణధర్మపద్ధతుల్. 65

మ॥ ఒకకాడం జనియించు రెండుపువుల ♦ ట్లొప్పారి మీరెప్డుఁ గూ
ర్మికినిం బ్రేమకుఁ దావులై మెలఁగినం ♦ మిన్నంది మాబోంట్లమూ
ఱక హర్షింతుము! కాని యుద్ధము లోన ♦ ర్పం బూనినం మానసం
బకటా! వ్రయ్యలు వ్రయ్యలై చనదె! క ♦ ష్టా! చూచి యెట్లోర్తునో! 66

చ॥ అదియును నాశ్రితుండగుట ♦ నందఱు మెచ్చఁగ నిచ్చకంబులం
వదరె నితండటంచుఁ దలఁ ♦ పం వల; దింటిపురోహితుండ న
భ్యుదయమె మీయెడం దలఁచు ♦ చుండుట క్రొత్తయుఁగాదు; క్షేమసం
పదఁ బరికింప నాకుఁ గడు ♦ బాధ్యత యుండు నెఱుఁగు లోకముం. 67

చ॥ తరములకొద్ది మిమ్ము వసు ♦ ధాపతులంచని మేము మమ్ములం
గురువులటంచు మీరలును ♦ గొల్చి పరస్పరభేదలేశముల్
పొరయఁగనీక కాలమును ♦ బుచ్చితి; మట్టులుగాన మిమ్ములం
దఱియు విపత్తు లేశమయి ♦ నం మఱి మేరువుగాఁ గనంబడుం. 68

ఉ॥ మంచియుఁ జెడ్డయుం దెలుపు ♦ మాన్యులు లేరు; గతించెఁ దండ్రి; ప్రా
పంచిక పద్ధతుల్ తెలియు ♦ ప్రాయముగా; దిఁక రాజ్య మెంతొ భా
రాంచితమా; రిపుల్ బలియు; ♦ రాహవ మల్పముగాదు; మిమ్ముఁ బ్రా
ర్థించెదఁ దండ్రులార! విన ♦ రే! గురువాక్యము మీఱరాదనం. 69

మ॥ వల దాత్మక్షయకారకంబయిన యీ ♦ వ్యాపార; మిందుండియుం
దొలఁగం బొం; డిది సోదరత్వమునకుం ♦ దూరంబు; నాయానయుం

గల" దంచాడిన నవ్వి సూక్తుఁడు "నమ ♦ స్కారంబు దైకొంచు న
వ్వలకున్ బొం డిఁక; నడ్డువచ్చి కలిగిం ♦ పన్ బోకుఁ డాలస్యమున్. 70

గీ॥ అపజయము లేక జయము యి♦ష్టందఁగోరి చావు బ్రదుకుల నున్నాము! ♦మీరువచించు
చప్పనగు మాట లూఁకొట్ట ♦ మొప్పఁబోవ! మేమిటికిఁ గష్టపడఁగ! నిం♦కేల వగవ!

మ॥ తనదాశక్తికి మీఱు కార్యములకున్ ♦ దార్కొన్నచో ముప్పు న
చ్చును; మాయుర్వరలోన నొక్కఁడు రణ ♦ క్షోణిన్ మృతిన్ గన్న మీ
రును రావచ్చును! నేడ్వవచ్చు! మఱిఁ బా ♦ రోహిత్యమున్ జేయవ
చ్చును! లబ్ధిన్ గొనవచ్చు! నిష్టు చనవ ♦ చ్చున్ దాఁటి దూరమ్ముగన్." 72

క॥ అనిన హరభట్టు నిలువెల్లను నీరయి యడుగు నవ్వ ♦ లన్ వైచి ప్రతా
పుని వంకను దీనముగాఁ దనదృష్టులు వఱపె; నా ప్ర ♦ తాపుండంతన్, 73

క॥ "గురుఁడనక దైవమన కెవ్వరినైనను దెగడు వీని ♦ పై నభిమాన
స్ఫురణము మాను; మెఱుంగవె! యరసికులన్ బలుకరింప ♦ నగు ముప్పునచున్. 74

క॥ మలినమును జలముకై వడి నిల నలమిన పాపసమితి ♦ నింకించు రణం
బు; లవశ్యము కరణీయంబులు నృపవంశమునఁ బుట్టు ♦ పురుషులకెల్లన్. 75

క॥ ఏవేళ కేదివచ్చునో యేవెరవునఁ బరిణమించు ♦ నెవరెఱుఁగఁగలా!
రీవేళ మమ్ముఁ గూఱిచి భావమునను నొవ్వ"కనుచుఁ ♦ బలుకుచు వెడలెన్. 76

—*) సూర్యసింహ-ప్రతాపసింహులు లొండురు పోర యత్నించుట. (*—

మ॥ కమలాప్తాన్వయ మీఁదినం బపయశః ♦ కాలుష్యమున్ బొంది పూ
ర్ణముగాఁగన్ జెడనున్న! దీప్రళయమున్ ♦ దప్పింపఁగా నిష్టు మా
ర్గ మొకండున్నదె; తెప్పపా టదను మీ ♦ రన్ బోయినన్ వీరి దే
హములున్ జేతికిఁ జిక్కునే! యకట! ప్ర ♦ య్యల్ ప్రయ్యలై రాలవే." 77

మ॥ అని యందుండిన వారలందఱును దుః ♦ ఖావేశ దైన్యంబులన్
గని శోషిల్లఁ బ్రతాపసూర్యులు నిజో ♦ గ్రస్ఫార ఖడ్గంబులన్
గొని వేగమ్ముగఁ ద్రిప్పు చొండొరుల ను ♦ గ్గున్ నూచమున్ జేయ ముం
దున కొక్కుమ్మడి దూఁకి! రేమనఁగ నుం ♦ డున్ మీఁది కార్యంబులున్! 78

—*) హరభట్టారకుఁడాత్మార్పణము గావించుట. (*—

చ॥ మెఱుపు తటాలునన్ మెఱయు ♦ మెల్పున నాహరభట్టు తత్క్షణ

స్ఫురిత మనోవికాసమున ♦ భూరి కృపాణము నెత్తి వచ్చుచున్
బరియలుగాఁగ జీల్చుకొని ♦ వారల మధ్యను నేల వ్రాలుచున్
బోరిపోఁ బ్రాణముల్ విడిచె ♦ ముఖ్యున నోరము నెత్తు రొల్కఁగన్. 79

⊛ మ॥ తనసేవించు నృపాలనందనులు కృ ♦ ద్ధత్వంబుమై నొండొరున్
దనసేత్రమ్ముల వ్రేల్మాల మాన్కొనుచు నం ♦ తంబొందఁ జూడన్ సహిం
పని పుణ్యాత్ముఁడు! నాఁటి కష్టదశఁ దీ ♦ ర్పన్ బూని యాత్మార్పణం
బు నొనర్చెన్ హరభట్టు త్యాగనిధియై ♦ ముల్లోకముల్ మెచ్చఁగన్. 80

మ॥ వనధిధ్వానగభీరఘోషము రహిం ♦ పన్ బ్రక్కనున్ వచ్చి సూ
క్తుని వీక్షించి ప్రతాపుఁడున్ "నినుఁ గనుం ♦ గొన్నన్ గడున్ బాపముల్
జనియించున్! గలుగంగరాని యిడుముల్ ♦ సంధిల్లె! క్షీరాబ్ధిఁబో
లిన సూర్యాన్వయ మొందె నీకతన మా ♦ లిన్యంబు లీనాఁటికిన్. 81

ఉ॥ ఓ త్తికిచేసి కోరకుము ♦ యుద్ధము వద్దని కృష్ణసింహుఁడున్
నెత్తిన నోరుపెట్టుకొని ♦ నీకు వచించె; వినంగనైతి వ
య్యుత్తము బోధ మించుకయు; నూఱక వ్రేలితి; నేఁడు నీతలన్
గ్రొత్తలు పుట్టె; మిట్టిపడి ♦ కొంపకుఁ జేటును దెచ్చి తెంతయున్. 82

మ॥ సమరంబున్ బొనరింపనుండఁగ వసి ♦ ష్ఠప్రాభవాఢ్యుండు పు
ణ్యమయుం డీహరభట్టు తా నుదయసిం ♦ హక్ష్మాతలాధీశు చం
దమునన్ వంద్యుఁడు ముందు దూఁకి మనమ ♦ ధ్యంబునన్ వ్రాలి జీ
వము లర్పించి త్యజించె దేహముఁ దృణ ♦ ప్రాయంబుగా నెంచుచున్. 83

చ॥ ఇతఁడును వేదరాశి! శత ♦ వృద్ధు! కుమారులభంగి నిన్ను, నన్
సతతము పెంచె; నిట్టి సుగు ♦ ణవ్రతుఁడున్ బలియయ్యె నీకు మూ

---

⊛ As they ( Pratap and Sookta ) took their ground and agreed to charge together, the purohit (family priest) rushed between the combatants and implored them not to ruin the house. His appeal however being vain, there was but one way being left to prevent the unnatural strife, the priest drew his dagger and plunging it in his breast, fell a lifeless corpse between the combatants. Appalled at the horrid deed "the blood of the priest on their head" they desisted from their infuriated aim. Pratap waving his hand commanded Sookta to quit his dominions who, bowing, retired and carried his resentments to Akbar.

"Annals of Mewar."

ర క్షితవలనన్; గనుంగొనుము ♦ కాలువ గట్టుచు నమ్మహాత్ము ర
క్తతతులు పాఱఁజొచ్చె! నెటు ♦ కన్గొని యోర్చెద నిట్టిదుష్కృతున్. 84

మ॥ పలుకష్టమ్ములఁ గూడు నీళ్లు గొన కీ ♦ బ్రహ్మాండ మున్నంతకున్
దలక్రిందౌచుఁ దపంబు చేసిన గురు ♦ ధ్వంసాఘపుంజంబులున్
దలఁగన్ బాఱునె! తన్మహానలశిఖల్ ♦ దర్పించి నిన్నున్ ననున్
గులమున్ దేశముఁ గాల్పవే! యెటుల నా ♦ కున్ దప్పు! నిష్పాపముల్. 85

చ॥ గురురుధిరంబు దాఁటఁగను ♦ గూడదు; కావున నిష్ఠు సంగర
స్ఫురణము మానుటన్ బ్రదికి ♦ పోతివి; నీవిదె నాదు రాజ్యమున్
దవరగఁ ద్యజించి యిష్టమగు ♦ తావునకున్ జను; మాలసించినన్
శిరము నిమేషమాత్ర ధర ♦ నేల బడు" నంచు వచింప సూర్యుఁడున్, 86

—*) ప్రతాపసింహుఁడు సూర్యసింహుని దేశభ్రష్టుని గావించుట. (*—

మ॥ "హరభట్టారకమూర్తి పుణ్యతముఁ; డ ♦ య్యాచార్యుఁ డిట్లాటకున్
నెరియున్ నామది; కాన నేఁడు రణమున్ ♦ నేఁగోర; భీతిల్లి నే
నరుగన్ బూనితినంచు నెంచకుము; నీ ♦ యాద్ధత్యబాహాబల
స్ఫురణన్ వమ్మొనరింపకుండినను నే ♦ సూర్యుండనే కాదుపో! 87

చ॥ ఇరువుర నెవ్వరో యొకరుఁ ♦ డీజగతిన్ విడునంతకున్ బర
స్పర ముఖదర్శనంబు కొన ♦ సాఁగక యుండెదుఁగాత ఘోరసం
గరములఁదప్ప; బ్రాణమును ♦ గాచి మెలంగు"మటంచుఁ బల్కి తా
నరిగెను ఢిల్లితో వకుఁ గు ♦ లాంతకు లందఱు పోవు తావునన్. 88

మ॥ "సమయన్ జేసి కృతాఘపుంజములఁ బ ♦ శ్చాత్తాపదీప్తాగ్ని, శు
ద్ధమతిన్ వచ్చినఁ జోటులేదనదు వా ♦ త్సల్యంబువారాశి కో
పము జన్మింపని దొడ్డతల్లి మనమే ♦ వాణ్మాత! దాక్షిణ్యహ
స్తము పైఁగప్పు శతాపరాధికయినన్ ♦ సద్భక్తిఁ బ్రార్థించినన్." 89

మ॥ అని తా నింటికి వెళ్ళి యయ్యుదయసిం ♦ హస్వామికిన్ బోలె న
య్యనఘాచార్యున కంత్యసత్క్రియలు చే ♦ యన్ బంచి యాత్మోపశాం
తిని బెంపన్ జపహోమదానములు సం ♦ ధింపన్ మొదల్పెట్టి య
జ్జననాథాగ్రణి యిచ్చెఁ దత్సుతునకున్ ♦ సాగ్రహారంబులన్. 90

గీ॥ హరగురుం డనంతత్యాగ ♦ మాచరించి సట్టియెడ నొక్క సత్రంబు ♦ గట్టఁబనిచె
శాశ్వతాన్నదానంబును ♦ జరుపఁదలఁచి దుర్మరణదోష మతనిని ♦ దొరయకుండ. 91

క॥ ఆమఱునాఁడు కిరాత గ్రామణి సామంతనృపులు ♦ గ్వాలియరు మహా
భూమీశ్వరుఁడు ప్రతాపస్వామికడకు వచ్చి రతని ♦ సందర్శింపన్. 92

మ॥ పసఁజెన్నారు చిరత్నరత్నతతి శో ♦ భల్ గుల్కు క్రొమ్మేడపై
వసమానంబగు వ్యాఘ్రచర్మమున న ♦ ధ్యాసీనుఁడై రాజయో
గసమాధిస్థితినున్న భూపమణియున్ ♦ గన్నెత్తి వీక్షించి చెం
త సమాసీనులు గండటంచుఁ గనుస ♦ న్నన్ జేసి యత్యాదృతిన్, 93

—*) ప్రతాపసింహుఁ డనుచరులతోఁ గర్తవ్యము నాలోచించుట. (*—

సీ॥ "తనదేశలక్ష్మి సం ♦ తతభోగభాగ్యవైభవములఁ దులఁదూఁగ ♦ వలయుననుచుఁ!
దనప్రజ లీతిబా ♦ ధలు లేక బహువిధైశ్వర్యంబులు వహింప ♦ వలయుననుచుఁ!
దనయిల్లు పూర్వాగ ♦ తప్రతిష్ఠాభరంబుల వృద్ధినొందంగ ♦ వలయుననుచుఁ!
దనపేరు పరుల నిం ♦ దల కాస్పదంబీక. స్వచ్ఛమై యెపు డుండ ♦ వలయుననుచు!

గీ॥ వసుధపై జన్మమెత్తిన ♦ ప్రతిమనుజుఁడు జీవితమునిండ యత్నంబు ♦ చేయుటొప్పుఁ!
గాని మనదేశమందభా ♦ గ్యమునఁజేసి యదియుఁ దలపోయ దుర్ఘటం♦బై రహించె.

మ॥ కనుఁ డామధ్యధరాసముద్రము మొదల్ ♦ కాబూలుపర్యంత మొ
ప్పిన విస్తారసమస్తదేశముల వ్యా ♦ ప్తిన్ గన్న తౌరుష్కభూ
పనికాయంబులు పూర్వ మేడవశతా ♦ బ్దంబాదిగా భారతా
వని కేతేరఁదొడంగె నాహవకళా ♦ ప్రత్యర్థిదుర్వారమై. 95

క॥ ఎంటెంట వారు లక్షలుఁ గోటులుఁగా సైన్యములను ♦ గొనివచ్చు మహా
ధాటికి భారతదేశము బీటలువాఱిన విధంబు ♦ వెలి పొనఁగూర్చున్. 96

సీ॥ ఆఖొరాసా నిస్ప ♦ హా నాఫ్గనిస్థాన మాబెలూచిస్థాన ♦ మాయిరాను
టర్కి యిరాకు బా ♦ గ్దాదు మెసపొటోమియా శిరియా సీమ ♦ లందునుండి
వసుధ యీనినయట్లు ♦ బహుసంఖ్యగలుగు యావనవీరభటకోటి ♦ బయలుదేఱి
పలుశతాబ్దములుగాఁ ♦ బరతెంచి పైఁబడి భరతఖండంబు డీ ♦ ల్పడఁగఁజేసె!

గీ॥ నందనోద్యానమట్టులుం ♦ డంగఁదగిన భూమి పారతంత్ర్యమహాబ్ధి ♦ మునిఁగి, కఱవు
వ్యాధు లీతిబాధలు గల్గి ♦ బలముతఱిగె! మనభరతఖండపాప మే ♦ మని వచింతు!

సీ॥ కోటిసూర్యప్రభాం ♦ కుండు పృథ్వీసార్వభౌముఁ డీయవనుల ♦ బారి మడిసె!
సర్వజ్ఞతుల్యుఁడా ♦ సమరసింహనృపుండు తురకలతోఁ బోరి ♦ తొలఁగెఁదనువు!
సమవర్తిమూర్తి దు ♦ ర్దమశౌర్యుఁడా హమీరాయువున్నంత కా ♦ హవమొనర్చెఁ!
గుంభుండు రాజది ♦ కుంభి తదర్థమై తనజీవితము నెల్ల ♦ ధారపోసె!
గీ॥ నింక సంగ్రామసింహ భూ ♦ మీశ్వరాదు లప్రతీపప్రతాపులు ♦ యవనసేన
నాపి మెండొడ్డి దేహంబు ♦ ప్రాణములనుగోరువెట్టి స్వాతంత్ర్యంబుఁ ♦ గాలిచిరపుడు.
మ॥ ఒకనాఁడా! యొకమాసమా! మఱియుఁదా ♦ నొక్కబ్దమా! వేయియేం
డ్లకుఁ బైనయ్యె మహమ్మదీయసుభటుల్ ♦ లక్షోపలక్షల్ లయాం
తకులై పైఁబడసాగి; యెంత జనబృం ♦ దంబున్న మేవాడమా
తకునైనన్ దలమున్కలై బ్రమ కసా ♦ ధ్యంబౌచుఁ దోఁపించదే! 99
శా॥ ఒడ్డారించుచు సైన్యముల్ గొని యలా ♦ యుద్దీను చిత్తూరుపై
నొడ్డెన్ ముట్టడి; వానిధాటికి జగం ♦ బూటాడె; వాఁడెంతఁగాఁ
జెడ్డల్ చేసెనొ దేవుఁడే యెఱుఁగుఁ: ని ♦ స్సీ! ధర్మమో సత్యమో
యడ్డంబుండునె! నాస్తికాధముల దు ♦ ర్వ్యాపారముల్ మాన్పఁగన్. 100
మ॥ అరుదెంచెన్ బహదూరుశాహి బహుసై ♦ న్యానీకమున్ గొంచుఁ జి
త్తురుపైనన్; బ్రళయాగ్నిఁబోలె నతఁ డు ♦ ద్ద్యోతించి దుర్గంబు రూ
పఱ నన్యాస్త్రములన్ నిగుడ్చుచు స్వరూ ♦ పధ్వంసమున్ జేసె; వీ
రరసాంభోనిధు లెందఱో మడిసి రా ♦ రా! నాఁటి యుద్ధంబునన్. 101
గీ॥ ఆ లలాటాక్షుమూర్తులో ♦ యనఁదగు హరకులజులై దువందలమంది ♦ కొలుచుచుండ
దుర్జయుడు మాపితామహ ♦ తోడఁబుట్టు రణము సాగించి యర్జున ♦ రావు మడిసె. 102
సీ॥ నాదు ముత్తాత చం ♦ దనృపాలు సంతతివాఁడు దుర్గారావు ♦ పృథ్వియభైర
వారావుఁడై వైరు ♦ లడలిపాఱఁగఁ బోరి పడియెఁ జోండావద ♦ న్వయులఁగూడి!
యాపైనవచ్చి మా ♦ యవ్వ జవాహిరిబాయి గాయంబులు ♦ వేయుఁగాఁగ
మహిషాసురేశ్వర ♦ మర్దనివలె రేఁగి విమతుల నోర్చి ప్రా ♦ ణములు విడిచెఁ!
ఆ॥ బదియుమూఁడు వేలు ♦ పడతులు గొలువఁ గర్ణావతియును నాదు ♦ నాయనమ్మ
రోహితాశ్వశిఖల ♦ జోహారు గావించె! నిట్టి వీరమూర్తు ♦ లెందుఁ గలరు! 103
సీ॥ కడకు మూఁడవమాఱు ♦ గా నక్బరేతెంచె నంతములేని సై ♦ న్యములఁగొనుచు!
వీరులందఱుగూడి ♦ విశ్వపూజ్యంబైన చిత్తూరుకోట ర ♦ క్షింపవచ్చి!

రల పరంగుల పిరం ♦ గుల్మమోాల దుర్గంబు గాజువిధాన ద్రవ ♦ కర్ములయి కూలె!
మేవాడ వీరల ♦ శ్రీమద్వజమకుటముల్ జయమల్ల ముఖవీర ♦ సమితి ద్రుగ్గె!

గీ॥ గనుదెఱచి కావురని కూయఁ ♦ గాఁ దెలియని శిశువులాదిగ జగదేక ♦ జేతృశౌర్య
పరులవఱ కందఱను బట్టి ♦ నఱికె నక్బ! రెటులు చిత్తూరురమ తల ♦ యెత్తిబ్రదుకు!

గీ॥ ఆచతుశ్శాల! లాభవ ♦ నాంగణమ్మ! లాజయ స్తంభతతులు! దే ♦ వాలయమ్మ!
లూఁచముట్టుగఁ జెడియెఁ! జి ♦ త్తూరుపురము కాదుగామాఱె పాండవ ♦ బీడు దేశె.

సీ॥ తలపైనఁ గొమ్మున్న ♦ ధైర్యమేరువులు ఝూలావనీంద్రుల సేన ♦ లడఁగిపోయె!
సహిరాజు కోఱల ♦ నైనఁ బట్టి పెకల్చు చోహాణబలములు ♦ చొప్పుదప్పెఁ!
బాతాళ మఱచేతఁ ♦ బగిలించు ప్రమర లేవలన స్రుక్కిరో సుంత ♦ తెలియరాదు!
గగనధాత్రుల నేక ♦ ముగఁజేయఁజాలిన రాఠోడ్కులంబు పే ♦ ర్మాఱువనయ్యె!

గీ॥ సల చతుర్దశలోకముల్ ♦ గలిసె నేని సమయఁజేయు చోండావతుల్ ♦ సన్నగిలిరి!
నలుగు రెదిరించినను దాఁకి ♦ నిలువరించు పోఁడిమికిఁ దప్పి మేవాడ ♦ వాడు దేలె!

ఉ॥ వైరులు మాసమాసమును ♦ బైరులఁ గోసెడు నట్లు వీరులన్
నూఱులు వేలు గోయఁగ, మ ♦ నోజ్ఞ సువర్ణ శలాకలట్లు లం
గారశిఖాచయంబులను ♦ గాలుచు వేలకు వేలు స్త్రీలు జో
హారులు చేయ, దేశ మక ♦ టా! జనశూన్యము గాక నిల్చునే! 107

సీ॥ తనదు కండలును ర ♦ క్తము గ్రుమ్మరించి మేవాణ్మాత వీరసా ♦ భాగ్యలక్ష్మి
యొకవేయియేండ్లుగా ♦ నోర్చె! నోర్చుచునుండె! శాత్రవతతిపోటు ♦ సడలదయ్యెఁ!
దద్ఘాతములకు నా ♦ తల్లి శరీరమ్ము కుమ్మెలు పోవుచుఁ ♦ గుట్టు పట్టె!
నుపచారశతముల ♦ నొల్లపెట్టదు! చిక్కి చిద్రుపలై శల్యావ ♦ శిష్టమయ్యె!

గీ॥ నమ్మహామాత గతి తలఁ ♦ పైనయప్పు డొడలు పరవశమై రక్త ♦ ముడుకు లెత్తుఁ!
గడుపు చుమ్మలుచుట్టు! నే ♦ కరణి నామెఁ దేర్తునని రేయుఁబవలు చిం ♦ తించుచుందు.

మ॥ తన లోకావన కచ్ఛవాహాన్వయము పా ♦ తాళంబునన్ గ్రుంగఁ బు
త్రిని ఢిల్లీశునకిచ్చి వియ్యమును బ్రీ ♦ తిన్ గూర్చి తత్పుత్రు నా
తని కల్పించెను మానసింహు, భగవాన్ ♦ దాసుండు త్రొల్ద్రొల్త; నే
మని వర్ణాశ్రమ ధర్మ పద్ధతి తిరం ♦ బై నిల్చు! లోకమ్మునన్. 109

❁ సీ॥ తనయంతరాజు లేఁ ♦ డనిపించి విస్తారభూమి మార్వారేలు ♦ భూపమాళి
యుదయసిం గక్బరు ♦ నెదురేగి తోడ్తెచ్చి తనరాజ్యలక్ష్మి స్వా ♦ తంత్ర్యలక్ష్మి
నొసఁగుచు సోదరి ♦ యోధబాయి నొసంగి యేకసహస్రహ ♦ యేశుఁడయ్యె!
ననుజుని జంద్రసే ♦ నుని నిజాత్మజు శూరసింహు ఢిల్లిని సేవ ♦ చేయఁబనిచె!
గీ॥ బదులుగా నక్బ రొకకొన్ని ♦ పల్లె లియ్య నతని సామంతుఁడగుచు రా♦జ్యంబొనర్చు!
ధీరుఁడెవఁ! డధీరుఁడెవండు! ♦ పిరనృపులె సిగ్గుచెడి తగ్గుకూటి కా ♦ సించినపుడు.

మ॥ బికనీరీశ్వరుఁడున్ జసల్మియరు పృ ♦ థ్వీనాథుఁడున్ వారి క
న్యకలన్ ఢిల్లికిఁ గాన్కగాఁబనిచి సే ♦ నాధీశ సామంతులై
సుకముం గోరుచు నక్బరున్ గొలువఁగాఁ ♦ జొత్తెంచి! రక్కొందఱో
యకటా! సోదరభూపతుల్ చెడిరి! హా ♦ యంబైన దాస్యమ్మునన్. 111

మ॥ వడకించెన్ సచరాచరావనిఁ బ్రతా ♦ పస్ఫూర్తిఁ జిత్తూరుము
ట్టడియా ప్రస్తుసరావు; శూరధనుఁ డి ♦ ష్ట్రశ్రేష్ఠుఁ డమ్మాన్సు పు
త్రుఁడు! మాతండ్రికి మేనమామకొడు! కెం ♦ తో కూర్చువాఁడయ్యె నన్
విడి ఢిల్లీశ్వరుఁ జేరె! నీకథలు వి ♦ న్నింపంగ సిగ్గయ్యెడిన్! 112

మ॥ దురదృష్టంబది యెల్ల నాపయిని గం ♦ తుల్ వెట్టెఁ! గాదేని సా
గరుఁ డప్పద్మహితాన్వయం బపయశః ♦ కాలుష్య మొందంగ న
క్బరు పాదాబ్జముఁగొల్వ నేలచను! హా ♦ ద్బంధుల్ హితుల్ సోదరుల్
పరునిన్ జేరిరి! మందభాగ్యమున కె ♦ బ్బంగిన్ వగన్ గాంతునో! 113

❁ Raja Udai Singh of Marwar, surnamed the fat, chief of the Rahtores held but the munsub of one thousand, while a scion of this house Raj Singh of Bikanir had four thousand. The independent prince of Chanderi kerowli Duttea with the tributary fewdatories of the larger principalities and members of the Shekavati Federation were enrolled on the other grades from four to seven hundred. In short it became general and what originated in force or pursuation was soon coveted from interested motives and as nearly all the states submitted in time to give queens, to the empire, few were left to stigmatize this deraliction from Hindu principle.

Akbar thus gained a double victory, securing the good opinion as well as the sword of these princes in his aid. A judicious perseverance would have rendered the throne of Timoor immoveable, had not the tolerant principles and beneficence of Akber Jahangir and Shah Jahan been lost sight of by the bigotted and blood-thirsty Aurangzeb. "Annals of Mewar."

మ॥ అకటా! సూర్యుఁ డకారణంబుగ నెక ♦ య్యంబెంచి వాదాడి ఢి
ల్లీశ వేంచేసెను నిన్న; శత్రుజనపా ♦ ళిన్ మన్నిమ తూఁటాడు సిం
హాకిశోరంబులు తమ్ము లిట్లగుటకై ♦ యస్మన్మంబెట్టి బా
ధకు లోనయ్యెనొ దేవుఁడే యెఱుఁగు! ని ♦ ద్రన్ గాన రేయంతయున్. 114

సీ॥ సువిశాలదుర్గిరీ ♦ శవికాస మక్బ రాస్థానరంగప్రభా ♦ తతికి బ్రమసి!
యాశ్రయించినవారి ♦ యాసలన్నియుఁ దీర్చు నతని వింతగు వదా ♦ న్యతకు నలరి!
తమ పేరు జగమునం ♦ దకుఁ బెద్దరారాజు పేరుతో జతగూడు ♦ పెంపు నెంచి!
కనకసౌధాగ్రభా ♦ గములందుఁ దెరలలో విహరించు తురక బి ♦ బ్బీలఁ దలఁచి!
గీ॥ సేతుశీతనగాంతర ♦ సీమఁ గలుగు మనుజపతులెల్ల మతిచెడి ♦ కనులు తిరిగి
విడని పేరాస నక్బరు ♦ విజయరథము కాడి మోసిరి స్వాతంత్ర్య ♦ ఘనత మఱచి.

మ॥ కనుసన్నన్ ననుఁగొల్చు భూపతులు మో ♦ గల్ జేని గుఱ్ఱాలు గా
యను వేంచేసి! రనేకదుర్గవితతుల్ ♦ హారావళీపర్వతా
వనిదక్కన్ రిపుచేతఁ జిక్కెఁ! జముపుల్ ♦ వమ్మయ్యె! భాండారముల్
ధనశూన్యంబు! లికెట్లు నిల్పనగు! స్వా ♦ తంత్ర్యంబు మేవాడకున్. 116

సీ॥ స్థానమా! విశ్వవి ♦ శ్వంభరాదేవికి వజ్రభూషణము మే ♦ వాడసీమ!
యన్వయమా! జగ ♦ దారాధ్యదశదిశా వ్యాప్త కీర్తియుతంబు ♦ భానుకులము!
పూర్వులా! లోకైక ♦ పూజ్య లిక్ష్వాకు హరిశ్చంద్ర మాంధాతృ ♦ నృపతిమణులు!
ప్రజలా! జగజ్జైత్ర ♦ పరిపూర్ణవిక్రమ ప్రాభవోద్దాము లా ♦ రాజపుత్రు!
గీ॥ లాత్మలో క్షాత్రగుణ మణు ♦ వంతయైనఁ గలుగువాఁ డెవఁ డులుకక గా ♦ జులు ధరించి
చల్లఁగా నింటఁగూర్చుండ ♦ సాహసించు! దనదు సర్వస్వ మర్పింపఁ ♦ దలఁచుఁ గాని.

సీ॥ తప్తగోళమును ముంచు ♦ గాఢాంధతమసంబుఁ గరదివ్వెతో నార్పఁ ♦ గడఁగునట్లు!
లత్యగాధము సాగ ♦ రానంతజలముల కేతమ్మ వేయ నూ ♦ హించునట్లు!
వసుధ బొగ్గుగాఁ గాల్చు ♦ ప్రళయాగ్ని హోత్రంబుఁ గన్నీటిచే నార్ప ♦ నున్నయట్లు!
క్షయకాలమున రేఁగు ♦ సప్తమారుతధాటి, తేటి రెక్కల నాపఁ ♦ దివురునట్లు!
గీ॥ లని జగము నన్నుఁ బరిహాస ♦ మాడుఁగాక! యొక్కఁటిని నిల్చి బలమెల్ల ♦ నెదురు పెట్టి
విధికి మాఱొడ్డి స్వాతంత్ర్య ♦ విజయలక్ష్మి యడుగులకు నిత్తుఁ గల్యాణ ♦ హారతులను.

గీ॥ ఎట్టి బ్రహ్మప్రయత్నంబు ♦ నేనిఁ జేసి యుదయపురలక్ష్మికిఁ గిరీట ♦ ముంతుఁ దలను!
గాక దైవోపహతుఁడనై ♦ కడిమిచెడిన రక్తతతిఁ గూర్తు రతనాల ♦ రావి రేక. 119

శా॥ నా కొక్కించుకయైనఁ గష్ట మెదురై ♦ నన్ మేరువుల్ గాఁగఁ జే
కారున్ జెందు మృదుస్వభావులరు! మీ ♦ యాశీస్సు శ్రీరామర
క్షాకల్పంబగు! ధర్మసూక్ష్మముల నీ ♦ సందిగ్ధకాలమ్మునన్
నాకున్ జెప్పి కృతార్థుఁజేసి కడుఁ బు ♦ ణ్యంబొందఁ బ్రార్థించెదన్." 120

క॥ అని వెండికొండ సింహాసనమున శివుఁబోలె శాంతి ♦ సదనంబగు స్వా
మినిగని భక్త్యావేశంబునను సలుంబ్రామహీశ ♦ పుంగవుఁ డంతన్, 121

—*) సలుంబ్రా కృష్ణసింహవిభుఁడు తన నిశ్చయము నెఱిఁగించుకొనుట. (*—

మ॥ "ఇవియున్ వీరరసాబ్ధివీచికలు గా ♦ నీ మాటలున్ గావు; హైం
దవమం దెంచను సత్యధర్మములు సం ♦ స్థాపింప మేవాడభా
గ్యవిశేషంబునఁ బుట్టువున్ గనిన సా ♦ క్షాద్విశ్వనాథుండవౌ
దువు; మర్త్యుఁడవు గావు; నిన్గొలుచు టెం ♦ తో మాకు శ్రేయంబగున్. 122

మ॥ తెలియున్ దేశము నాదు స్వామిపదభ ♦ క్తిస్థైర్యలీలల్; చతు
❁ ర్జలరాశిప్రమితావనీతల మహా ♦ సామ్రాజ్య మర్పింప దా
సలికాలన్ దగులంగ నొల్లను; భవ ♦ త్పాదాబ్జాముల్ భక్తిమైఁ
దలపైనన్ ధరియించి నామనుగడన్ ♦ ధన్యంబు గావించెదన్. 123

గీ॥ నాదు భటకోటి ధనము ప్రా♦ణంబు రాజ్యరమయు నర్పింతు! మఱియు నా♦ప్రాణమిత్త్రుఁ
దండ్రి! నీమస్వాతంత్ర్యర ♦ థంబు మోయఁ గుడిబుజం బప్పగించుట ♦ గొప్పయగునె!

మ॥ తమగర్జారవధాటి నెల్లెడల గో ♦ త్రక్ష్మాధరశ్రేణి ఖం
డములై త్రెళ్ళఁగఁజేయు దోర్బలులు చోం ♦ డావన్మహావీరసిం
హములన్ దోడ్కొనివచ్చి నిల్పెద! విప ♦ క్షారణ్యముల్ గాల్చి భ
స్మముగావింత్రు సమగ్రవిక్రమకళా ♦ సంరంభపారీణతన్. 125

మ॥ పదివేలేన్గులయంత దార్ఢ్యమున మ ♦ ద్భావంబు నీపాదముల్
గదియున్ నిక్కము! దేవదానవులు లా ♦ గన్ జూచినన్ సుంతయున్

---

❁ It is a rare thing for a Rajput to betray his Thacoor. Fidelity to the chief, 'Swami Dharma.' is the climax of all virtues. The Rajput is taught from his infancy in the song of the bard to regard it as the source of honor here and of happiness hereafter.

"Annals of Mewar."

గదలఁగాఁ బో! దనిలోన శత్రులను ద్రు ♦ గ్గన్ జేతుఁ; గాదేని నీ
పదపద్మంబుల మ్రోల వ్రాలి విడుతున్ ♦ బ్రాణంబులో యీశ్వరా! 126

మ॥ తనువుల్ నశ్వరముల్; విశుభ్రయశమున్ ♦ ధర్మంబు సుస్థాయియై
తనరారున్; వెనుకంజవేయకు; పవి ♦ త్రంబైన దీకార్య; మే
యనుమానంబును లేదు; వేగమె రణ ♦ ప్రారంభమున్ జేయుమీ!
నిను సేవించెద; నీకుముందు రిపుసం ♦ క్షిన్ జించి చెండాడెదన్." 127

—*) భానుసింహుఁడు ప్రతాపసింహునితోఁ దన నిర్ణయము దెలుపుట. (*—

గీ॥ అనుచుఁ గేల్మోడ్చి విరమించు ♦ నతనిమాట నందుకొని భానుసింహుఁ "డో ♦ యధిప! మాకు
స్వామిభక్తియె రక్తరూ ♦ పమునఁ బాఱు; నిన్ననుసరింప కేరీతి ♦ నిలువఁగలము. 128

సీ॥ స్వామి! స్వాతంత్ర్యప ♦ భామనోజ్ఞంబు నీవదనమ్ము భువనసే ♦ వ్యమ్ముగాదె!
యకలుషస్వామిభ ♦ క్తికిని మాచిన్నిరాష్ట్రమ్ములు పూర్వకా ♦ లమ్మునుండి
సూతికాగృహముల ♦ శోభఁ జెన్నారు! నిందుకుఁ దోడుగా నీమ ♦ నోజ్ఞనామ
సంస్మరణంబు దు ♦ స్సాధ దుర్భేద దుర్గముగాఁగ మమ్ము ర ♦ క్షణము చేయుఁ!

గీ॥ కంఠమునఁ బ్రాణవాయువుల్ ♦ గలుగుదాఁక ముందునకెకాని వెనుకవై ♦ పునకుఁ జూడ!
మరుల కలవాలములు పూల ♦ సరములట్లు కంఠములు కౌఁగిలించిన ♦ కాలమందుఁ.

చ॥ ముదుసలినైన మోఁగలు చ ♦ మూవిసరంబు ముఖంబు, భూస్థలిన్
గదియుచుఁ జీల్చు నాఁగఁటివ ♦ గన్ బగిలించుచు, రెండుపాయలై
చెదరఁగఁ జేతు; బాణములు ♦ చిచ్చుఱపిడ్గులువోలె వైతుఁ! గ
ల్గిను లవమేనియున్ బిఱికి ♦ కండ మదీయశరీరమందునన్. 130

ఉ॥ కూర్మిరతురుష్కసంతతుల ♦ కున్ మఱి నీకు ఘటిల్లు నామహా
భారతయుద్ధరంగమున ♦ ఫల్గునతుల్యుఁడవౌచు నీవు చె
న్నారఁగ నీపదంబులు హృ ♦ దబ్జతలంబున నిల్పి మత్స్యధా
త్రీరమణుండొకో యన న ♦ రిప్రతతిన్ గడతేర్తు నాజిలో. 131

మ॥ దివియున్ భూమియు నొక్కఁడై పడిన నా ♦ దేహంబునన్ బ్రాణవా
యువు లున్నంతకుఁ గన్నులెత్తి యహితుం ♦ డొక్కండు నిన్ జూడఁగా
నవకాశంబు నొసంగఁబోవ; సముద ♦ గ్రాటోప మేపార న
య్యవనాంభోనిధిఁ దచ్చివైచెద జగం ♦ బానందమున్ బొందఁగన్. 132

క॥ వినిపింపనేల పెక్కులు! నిను మ్రొక్కి వచించువాఁడ ♦ నీప్రాణము వె
న్కను మాప్రాణంబులు మున్ దనిన మనస్సింహుఁడప్పు ♦ డందఱు వినఁగన్. 133

—*) మనస్సింహుఁడు తన యభిప్రాయము వెల్లడించుట. (*—

క॥ "ఝాలాన్నృపతులు శౌర్యోత్తాలులు పరిపంథి గహన ♦ దహన జ్వలన
జ్వాలాభు లనెడు కీర్తిని నేలఁగలుప సాహసింతు ♦ నే! నీమ్రోలన్. 134

సీ॥ శూరులౌ గ్వాలియర్ ♦ సోనెగుర్త్తేశ్వరుల్ ద్రుపద మాత్స్యక్షితీం ♦ ద్రులును గాఁగ!
సకలసంగరమర్మ ♦ సర్వజ్ఞమూర్తి యాభీమచాందును యదు ♦ స్వామిగాఁగ!
శ్రీసలుంబ్రాకృష్ణ ♦ సింహుండు దోర్బలోద్దండసాహసుఁడు భీ ♦ ముండుగాఁగ!
దేజసింహుఁ డమాను ♦ షాజేయ విక్రమగురుకీర్తిఘనుఁడు ఫ ♦ ల్గునుఁడుగాఁగ!

గీ॥ శ్యామసింగేను కవలమై ♦ యుండ నుండ! ధర్మరాజవై నిలిచి స్వా ♦ తంత్ర్యరథము
స్వర్ణజయఘంట మ్రోయించి ♦ జయముగాంచి ధర్మసంస్థాపనాచార్య ♦ తను వహింపు.

గీ॥ దస్యుశవకోటిపైన మ ♦ ద్భటులు నేను దనువులను వాల్చి, నీవు స్వా ♦ తంత్ర్యలక్ష్మి
కలవఱిచు రత్నదేవాల ♦ యమ్ముఁ జేరఁ బరచఁగలమయ్య! కనక సో ♦ పానపంక్తి. 136

మ॥ 'పనులెల్లన్ సమకూరె మీవినయసే ♦ వల్ తృప్తి సంధించె స్వ
స్వనివాసంబుల కేగుఁ'డంచు భవదా ♦ జ్ఞల్ వచ్చుదాఁకన్ దినం
బును భూశయ్యయు నేకభుక్తము వ్రతం ♦ బున్ బూని వహ్నిన్ జొరుం
డనినన్ దక్షుఁ బట్టుఁడన్న వెనుదీ ♦ యన్ బోము రాజేశ్వరా!" 137

—*) శ్యామసింహుఁడు తన నిశ్చయ మెఱిగించుకొనుట. (*—

క॥ అని వచియించిన నుగ్రాశనితుల్యుఁడు శ్యామసింగు ♦ సాద్రీశ్వరుఁ "డో
యినవంశాభరణా! నాయనుజుని మార్గమునె నేను ♦ ననువర్తింతున్. 138

ఉ॥ ప్రాణము తీపుగాదు, కర ♦ వాలభుజంగికిఁ గ్రూరశాత్రవ
ప్రాణసమీరమిచ్చి విజ ♦ యంబు యశంబు గడించి నిత్యక
ల్యాణము లొందుటొక్కఁడు; మ ♦ హాహవరంగములందు వ్రాలి ని
ర్వాణమునొందు టొక్కఁడు ప ♦ రాక్రమపూజ్యము రాజకోటికిన్. 139

సీ॥ విశ్వంబు నగలించు ♦ వేడిపిడుగులనైనఁ బువ్వులవలె శిరం ♦ బున వహింతు!
శేషాహిపతినైనఁ ♦ జేనెత్తి ముత్యాల హారంబువలెఁ గంఠ ♦ మందుఁ దాల్తు!

హిమవత్కుధరశీర్ష ♦ 'మెవరెస్టు'పైనుండి దూఁకెదఁ బాతాళ ♦ లోకమునకు!
నాత్మగర్జాస్ఫూర్తి ♦ నడవి మార్మ్రోయించు మృగరాజు నశ్వమ ♦ న్నిక్కనేర్తుఁ!
గీ॥ క్రూరశౌరుష్కతతుల నీ ♦ క్రోలఁ బట్టి కసిమసఁగనేర్తు మననేర్తుఁ ♦ గాని నిన్ను
విడువనేర్తునె! ప్రాణముల్ ♦ విడిచియైన నరుణకేతనచ్ఛాయలఁ ♦ దిరుగనేర్తు. 140

మ॥ మిడియెండైనను నర్ధరాత్రమయినన్ ♦ మిట్టైన గుంటైన నె
క్కుడువాఁడైనను లొచ్చువాఁడయిన మీ ♦ కున్ దోఁచిన ట్లాజ్ఞపె
ట్టుఁడు! ముందున్ మఱి వెన్కచూడకయె పి ♦ ట్టుగ్ బోల్చ వైరివ్రజం
బడఁగన్ దాఁకెదఁ! జూడు వేయునుడులే ♦ లా! ముందుఁగార్యంబులన్. 141

మ॥ కడప్రాణంబులు బొందివీడి చనుదాఁ ♦ కన్ నిన్ను సేవింతు; నె
క్కుడు దర్పోన్నతి సంగరాంగణములన్ ♦ ఘోరారి సంఘంబులన్
దొడరన్ బోయెద; వీడ కందఱను గొం ♦ తుల్ గోసి తద్రక్తముల్
మడవల్ గట్టెద దేశమంతట; యశో ♦ మందారముల్ పెంచెదన్." 142

క॥ అని వచియింపఁ బ్రతాపుఁడు తనచెంతను ధైర్యపర్వ ♦ తమువోలె వసిం
చిన బదనూర్ నరపతిఁ జూచిన వదనంబెత్తి తేజ ♦ సింహుండంతన్, 143

—*) తేజసింహుఁడు తన తెలివిఁ గెఱింగించుకొనుట. (*—

మ॥ "అవనీభారము హెచ్చి ధర్మములు వ్య ♦ త్యస్తంబులై పోవఁ బూ
ర్వవికాసం బలరింప నీశ్వరుఁడు స ♦ ర్వజ్ఞుండు మీవంటి మా
నవమూర్ధన్యుల రూపమొంది యిల జ ♦ న్మంబెత్తు; నీదర్శనా
దివిశేషంబులు లోకమంతటికి సం ♦ ధించున్ మహాశ్రేయమున్. 144

సీ॥ ఒకయెత్తు నీవు వే ♦ ఱొకయెత్తుగా దైవకోటి నిల్పిన నిన్నె ♦ కోరుకొందు!
స్వామి! యీనీపద ♦ ద్వయి విశ్వపూజ్యంబు! నడుమ తోఁచవను నీవు ♦ నడచునప్పు
డమగు సోఁకిన ధూళి ♦ యణుమాత్రమంటిన నఖిలలోకముఁ గాల్చు ♦ హాలహలము
చేదంతయును దగ్గి ♦ శీతమై తీయనై నిమిషమ్మలో నమృ ♦ తముగ మాఱుఁ!
గీ॥ ద్వత్పదము లెంత కొలిచినఁ ♦ దనివి లేదు! నీయనఘనామ మెంత ధ్యా ♦ నించుచున్న
విసుగు గనుపింప! దింకను ♦ విడక కొలువ ధ్యానమొనరింపఁగాఁ గోర్కి ♦ యగునుగాని.
సీ॥ ధర్మసంస్థాపనా ♦ ర్థము ధాత్రి మెలఁగు దేవా! యేకలింగావ ♦ రావతార
పదినూఱులేండ్లు యా ♦ వననృపుల్ భరతఖండమునకుఁ గూర్చు బ ♦ న్నములు, వాని

వారింపఁగాఁ బూర్వ ♦ వీరుల త్యాగంబు, ప్రస్తుతకార్య క ♦ ర్తవ్యములను
నెఱిఁగించుచో నీవు ♦ మృదులాతిమృదుల భావం బెంతనొచ్చెదై ♦ వమ యెఱుంగు!
గీ॥ వినుకొలఁది చిచ్చుదరికొన్న♦విధమతోఁచె! సైన్యబల మల్పమనె కాని ♦ చాలియున్నఁ
దలను బూవాడ కింట ని ♦ న్నిలిపి నేనె రిపుల సర్వనాశన మాచ ♦ రించియుందు.
సీ॥ భువనపావన! నీవు ♦ పూనినకృతి జగద్వంద్య! మందఱము దో ♦ డ్పడఁగఁగలము!
రణమహోత్సాహవ ♦ ర్ధనమైన సుముహూర్త మెంచి సూర్యధ్వజం ♦ బెత్తి నిలుపు!
కలికి బంగరు చిఱు ♦ గజ్జెల మ్రోఁత మోఁగలులు యామ్యమహిష ♦ కంఠ కాంస్య
ఘంటానినాదంబు ♦ గా వినెదరు గాక! ధ్వజము చుట్టుందుము ♦ బలిసి కొలిచి
గీ॥ పులులఁ బోలిన చరణదా ♦ సులముమేము! కడకు మేవాడ నొకచిన్న ♦ కత్తి పట్టు
మగనిసువ్వుగల్గ నది రాల♦కెగుగఁగాక! యమరులు నుతింత్రుగాక! నీ♦విమల యశము.
సీ॥ 'ప్రాభవంబిత్తు రా ♦ ష్ట్రమునిత్తు ధనమిత్తు రాణాను విడనాడి ♦ రమ్మటంచు
ఢిల్లీపురంబునుం ♦ డి దినంబు వచ్చు లేఖల నొక్క కొట్టంబుఁ ♦ గప్పవచ్చుఁ!
త్యాగైకమూర్తి! ధ ♦ ర్మావతారా! నీముఖము నొక్కమాఱు దూ ♦ రమునునుండి
కనువిందుగాఁగఁ జూ ♦ చినవాఁ డెవండైన నీనీచతరమార్గ ♦ మెట్లు సొచ్చుఁ!
గీ॥ ప్రాణములతోడ నిన్నుడఁ ♦ బాయఁగలుగు వాఁడొకఁడు లేఁడు నీదు సే ♦ వకులలోనఁ!
బొంతఁ జింతామణిని వీడి ♦ చిల్లిగవ్వ కెగుబుజము చూప నెవ్వాని ♦ మొగము వాఁచె.
సీ॥ హారావళీ భూధ ♦ రావతంసప్రాంత సానుభాగము యజ్ఞ ♦ శాలగాఁగఁ!
బావనాత్ముఁడు చంద్ర ♦ భట్టారకు కవిత్వధారలు వేదమం ♦ త్రములుగాఁగ!
నల సలుంబ్రా కిరా ♦ తాధీశు లసమానవిక్రమక్రములు ఋ ♦ త్విజులుగాఁగ!
శార్ఙ్గసన్నిభ బల ♦ స్థౌల్యశోభితము నీపటుమహాధనువు యూ ♦ పంబుగాఁగఁ!
గీ॥ బ్రిబల యవనసేనలు పశు ♦ ప్రతతిగాఁగ! యాయజూకుఁడవై దీక్ష ♦ నవధరించి
సవనమును దీర్చి జగము ని ♦ ర్యవనముగను జేసి త్రైలోక్యనుతుల రం ♦ జిల్లవయ్య!
శా॥ 'ఔరా! శాత్రవకోటిపాలిఁటికిఁ బ ♦ శ్యత్కాలమూర్తుల్ గదా
యీరాణ్ముఖ్యు'లంచుఁ జిత్తురురణాం ♦ బం దందఱెన్నన్ రవి
ద్వారంబందునఁ జేసె శాత్రవకుల ♦ ధ్వసంబు మాతండ్రి; యా
వీరాగ్రేసరచక్రవర్తి యడుగుల్ ♦ వేయేండ్లు సేవించెదన్. 150
మ॥ "పదివేల్ వీరుల బాహుశౌర్యయుతుఁడీ ♦ బాలుం"డటం చెన్నఁగాఁ
గదనం బెచ్చట భీమమా నచటఁ జ ♦ క్కన్ వ్రాలి దుర్దాంత శ

త్రిదశచ్ఛేదము చేసి నిన్ను జయయు ♦ క్తుఁ జేయ యత్నింతు! నీ
బదనూర్ సింహాము తేజసింహాము నుదుల్ ♦ వ్యర్థంబు గాకుండఁగన్! 151

శా॥ నింగిన్ ముట్టెడు కోటకొమ్మగుమ్ములున్ ♦ దేవాలయమ్ముల్ జయో
త్తుంగ స్తంభము లొప్ప; స్త్రీపురుషు లెం ♦ దఱన్ బుత్రపౌత్రాప్తి నొం
దంగా. మాదృశభూపతుల్ కొలువునన్ ♦ ద్వత్పాదముల్ మోయఁగా,
సింగారించిన తేరియ ట్లలరు నా ♦ చిత్తూర్పురిన్ గాంతునే!" 152

మ॥ అని వాక్రుచ్చి హృదంతరాళమున వీ ♦ రావేశ ముప్పొంగ, వి
చ్చిన కెందామరలైన కన్నులతుదిన్ ♦ జెన్నారు లేమంచుబొ
ట్టన నొక్కశ్రుకణంబు జాఱఁగను వీ ♦ రాగ్రేసరుండుండె; వె
న్కను గూర్చుండిన గ్వాలియర్ విభుఁ డనం ♦ తత్త్యాగ సంశోభియై, 153

—*) రామచంద్రదేవుఁడు తన మనోగతము దెలియఁజేయుట. (*—

సీ॥ "దరిలేని జల మగా ♦ ధస్థాయి వెలుఁగొందు కడలికి నొకతోయ ♦ కణమునట్లు!
బ్రహ్మాండమంత గొ ♦ ప్పగనున్న పెనుసైకతాద్రికి నొకచిన్న ♦ యణువునట్లు!
శాఖాచయంబు ది ♦ శాకోణములఁ బ్రాకు నవనీజమున కొక్క ♦ యాకునట్లు!
భూదేవి మకుటమై ♦ పొడవు నెత్తున్న పర్వతరాజమున నొక్క ♦ రాయియట్లు!

ఆ॥ లేబలంబు లేని ♦ యేకాంగి బహువాహినీశు నీకు సాయ ♦ మేమి చేతు!
హృదయకుసుమ మొక్కఁ ♦ డే నాదు సర్వస్వ! మదియె నీపదముల ♦ నప్పగింతు.

చ॥ అజిత పరాక్రమంబున మ ♦ హాహవసీమలఁ గత్తిమోసి నా
బుజములు కాయగాఁచెఁ! గడుఁ ♦ బూర్వుఁడ వృద్ధుఁడ నైతిఁగాని, నీ
విజయరథంబు మోయ భుజ ♦ వీర్యము పట్టున లోటులేదు! నే
గజిబిజిచేసి శాత్రవుల ♦ కండలు మెండుగ రాల్తు మేదినిన్. 155

శా॥ చండారాతి కులాటవీ దహన శ ♦ శ్వత్కీర్తి! సర్వస్వ మీ
తం డొక్కండె ప్రపంచమందుఁగల మ ♦ ద్భాగ్యంబు నాకూన! యీ
ఖండేరావు కురంగముల్ దునుము వ్యా ♦ ఘ్రస్వామిపోలెన్ బలో
ద్దండుండై తెగటార్చు వైరులఁ గృతాం ♦ తప్రాయుఁడై యాజిలో. 156

సీ॥ కరుణావిహీనుఁ డ ♦ క్బరు సర్వభక్షకుండయి గ్వాలియరును గొ ♦ న్నయది మొదలు
నెట్టిసాయము లేక ♦ యొంటి రెక్కలు లేని పక్షినై పడిన యీ ♦ బడుగునన్ను

మేవాడఁజేరిచి ♦ మీతండ్రిగారు సహస్రహస్తములతో ♦ నాదరించి!
రతని యనంతరం ♦ బభిమానమెనయఁ దండ్రివిధాన నోమితి; ♦ నీఋణంబు

గీ॥ వేయిజన్మంబులెత్తి నీ ♦ విమతనృపుల నసమరణభూమిఁ జీల్చి చెరి ♦ డాడియైనఁ
దీర్పఁజాలమి సత్య! మీ ♦ దేహ మెపుడు త్వత్పదసమర్పితంబు భూ ♦ ధవకులేంద్ర!

సీ॥ నిత్యకల్యాణమం ♦ దిరము చిత్తూరుమండలము వివాహమం ♦ డపముగాఁగ!
రంగుగుల్కు సనేక ♦ రాజపుత్రస్యందనమ్ము లై రేనికుం ♦ డలునుగాఁగ!
కృష్ణసింహాది వీ ♦ రేశ్వర దోఃప్రతాపస్ఫూర్తి రత్నదీ ♦ పతతిగాఁగ!
యవనభూధవ కిరీ ♦ టాళి నిర్గతమణుల్ వజ్రరంజిత రంగ ♦ వల్లిగాఁగ!

గీ॥ దస్యుగళరక్తముల వసం ♦ తమ్ములాడి నీదుకరవాల మెచటఁదా ♦ నై దనర్చి
సకలమును దీర్చు నాగప ♦ సానిగాఁగ! విజయలక్ష్మి వరించి నీ ♦ బెండ్లియాడు."

గీ॥ అని యుపరమించె; నంత నా♦తనిసమీపమున మహోన్నతరూపుఁడై ♦మూర్తిఁగొనిన
వీరరసవార్ధియో యనఁ ♦ గూరుచున్న భిల్లలోకైకనాథుఁ డా ♦ భీమచాంద, 159

—*) భీమచాంద తన సాయమును వివరించి చెప్పుట. (*—

సీ॥ "కాండ్రుకాండ్రని పెద్ద ♦ గా మ్రోతల నిగిడ్చి గబ్బిబెబ్బులిపిండు ♦ బొబ్బరించు!
శైలముల్ పగిలి ప ♦ చ్చడిగాఁగ ధ్వనిచేసి సింహపోతములు గ ♦ ర్జించుచుండుఁ!
జేవెత్తు లేచి వ ♦ చ్చివిసంబు వెదచల్లి కోడెనాగులు బుస ♦ కొట్టుచుండు!
వసుధ యిట్టటులాడ ♦ బరువై పరువులెత్తి యేనుంగుగుములు ఘీం♦కృతులు సేయుఁ!

గీ॥ బద్మజాతాండమంతలై ♦ భయము గొలుపు గండశిలలఁ గొండలు చుట్టు♦నిండియుండుఁ!
బ్రమథయుతుఁడైన కైలాస ♦ భర్తకైనఁ జాలునే గుండె! నాదు రా ♦ జ్యంబుఁ జొరఁగ

సీ॥ భూలోకనాకమా ♦ బోమెపో శెంబుండుఁ! జందనతరువర ♦ చ్ఛాయలుండుఁ!
గొలువుకూటంబుండుఁ! ♦ గోడెగుబ్బెతగముల్ వింజామరమ్ములు ♦ వీచుచుంద్రు!
బొమిడికంబుల భిల్ల ♦ పుంగవుల్ నడచివ్వెలగుదు! రందఱును నీ ♦ యాజ్ఞనుంద్రు!
నాయాత్మకెంతో యా ♦ నందమా! నాదు సింహాసనంబుదు నీ ♦ వధివసింపు!

గీ॥ మండఁ గూర్చుండి క్షణమైన ♦ నవలఁ బోక కొలిచి దేవునకట్లు సే ♦ వలు ఘటింతు!
నడుగు మన్నాట కోర్వ! నా ♦ హస్తయుగము జాళువా పట్టుదిండుగా ♦ సంతరింతు!

మ॥ సదియంచుక్ పలయూఁదిచూడు మఱి! నా ♦ స్వర్గంబు నందైన ని
ర్జరులున్ ముప్పదిమూఁడుకోట్లెపుడు పూ ♦ జల్ చేసి సేవించు న

ప్పురుహూతుండును జూచియుండని సుఖం ♦ బుల్ భోగముల్ వచ్చి దొం
తరలై చుట్టునుజేరి కొల్చు నిను! మ ♦ ద్వాక్యంబు నాలింపుమా! 162

మ॥ అకటా! నీయెడ నెయ్యపుం బలిమి నే ♦ నట్లాడితిం గాక యే
టికి నాప్రార్థన మియ్యకొందు! వెపుడుం ♦ డెందంబునం దేశమా
తకు వాటిల్లు విపత్తులకై వగచి చిం ♦ తం గ్రాఁగు నీ వగ్గి క్రిం
గక స్వాతంత్ర్యము దక్కుదాఁక నొకచోఁ ♦ గాలూని కూర్చుందువే!. 163

సీ॥ జాతియు జన్మదే ♦ శమును భిన్నములైన! మనపూర్వులకు మైత్రి ♦ దనరకున్న,
నాకన్న వయసు నుం♦తగఁ దక్కువైన, బాల్యమున నొండొరుఁజూచి♦నది మొదలుగ
నీపైన నవ్యాజ ♦ నియతి నామదినిల్చె! రెండవదేవుఁడం ♦ రీతిఁజూతుఁ!
గడఁబోదు నీదు జా ♦ గ్రన్మంగళాకృతి కలనైన హృత్ఫల ♦ కముననుండి!

గీ॥ నీవు పాల్గొననట్టి యీ ♦ నిఖిలలోక సార్వభౌమత నరకవా ♦ సముగ రోతు:
నండ నీవున్న నంబలి ♦ నైన నమృత మట్లు సేవించి యానంద ♦ మంద నేర్తు! 164

సీ॥ అహితకై తేయ ప ♦ శ్యత్ఫలమూర్తులా శౌర్యమర్జయు లొక్క ♦ జాతివారు
తరతరంబులుగ స్వా ♦ తంత్ర్య లక్ష్మీమహోదయముఁ గోరి విదేశ ♦ ధరణిపతుల
మాఱొడ్డి బాహుశుం ♦ భత్ప్రతాపము చూపి ధనధాన్య వస్తువా ♦ హనయుతముగ
సర్వార్పణ మొనర్చి ♦ శాశ్వత ధన్యత్వ మందు రెవ్వరికి వం ♦ ద్యంబుగారు!

గీ॥ హృదయముగలట్టి మానవుం♦డెవఁడు వారియడుగులను గొల్చి, యహితుల♦నణఁచిజన్మ
పావనముసేయఁ డాతని ♦ బ్రదుకదేల! బల మదేల! నిరర్థకై ♦ శ్వర్య మేల! 165

మ॥ అకటా! ముప్పదికోట్ల హైందవులు మో ♦ యం దగ్గ భారంబుఁ గొం
కక నీవొక్కఁడ వెత్తికోఁ దలఁచి! తిం ♦ కం నిన్ను సేవించి గొం
తుక లర్పించెదువారు పూజ్యులగు భ ♦ క్తుల్! నీపతాకంబు క్రిం
దికి రానొల్లనివార లందఱును మా ♦ తృద్రోహులుం వంచకుల్. 166

మ॥ పొదలం వెల్వడు దొడ్డకోఁలుపులు లే ♦ పుం జూపు నాసింగపుం
గొదమల్ వీరని శాత్రవుల్ బెదరు ను ♦ క్కుందుట లున్నార లేఁ
బదివేల్లెంకలు భిల్లవంశజులు నీ ♦ పాదాబ్జముల్ గొల్వ నే
కొదలేకుండఁగ నందఱుం బనిచి నీ ♦ కుం బ్రీతి గావించెదం. 167

సీ॥ వెదురు పొదలనుండి ♦ ప్రిదిలిన యాణిముత్యములు కుప్పలు కుప్ప ♦ లై రహించు!
ఫణిఫణాగ్రములందుఁ ♦ బండి రాలిన మణుల్ పరుపులు పరుపులై ♦ ఫరిడవిల్లు!

గనుల మొల్చిన యన ♦ ర్ఘస్వర్ణ రౌప్యాది లోహముల్ పెనుకొండ ♦ లుగఁ దనర్చు!
శైలసానువులలోఁ ♦ జంద్రకాంతశిల లీజగమంతటికి నైనఁ ♦ జాలియుండుఁ!
గీ॥ బెరుగుటయె కాని తఱుఁగుట ♦ యెఱుఁగనట్టి రత్నగర్భ సార్థముగ నా ♦ రాజ్యసీమ!
యూఁచముట్టఁగ నాయొద్ద ♦ నున్నసిరులు నాథ! నీమ్రోల సర్వార్ప ♦ ణం బొనర్తు.
మ॥ రవిబింబధ్వజమొప్పు నీ వనికిఁ జే ♦ రఁగ నీకు మున్మున్నె యా
రవికన్నఁగ మునుదోఁచు నప్పొడుపుఁదా ♦ రఁ బోలె జృంభించి యా
హవరంగాభ్రముఁ జొచ్చి శాత్రవ కుల ♦ ధ్వాంతంబుఁ జీల్తుఁగ బ్రతా
పవిభుండన్న పిరంగి కీఘనుఁ దయః ♦ ప్రస్ఫీత గోళంబనఁగ. 169
సీ॥ పారతంత్ర్య మదల్చి ♦ స్వాతంత్ర్యమునునిల్పు భవదమ్మ వచ్చు! సం ♦ వత్సరాది
పండుగువోలె నీ ♦ భారతప్రజకెల్ల సమభాగమైన యు ♦ త్సాహవేళ!
యండఱ మొకమొగం ♦ బై నిల్చి యరుల గెల్చితిమేని స్వాతంత్ర్య ♦ సిద్ధియొదవు!
ననిలోనఁబడినఁ గ ♦ ల్పాంతంబువఱకు శాశ్వత నాకలోక వా ♦ సంబు గలుగు!
గీ॥ రెంట నేదిగల్గినఁ గృత ♦ కృత్యులగుదు! మింతకన్నను జిరపుణ్య ♦ మేది గలదు!
మీనమేషంబులను బ్రొద్దు ♦ మించకుండ నిపుడె ప్రస్థానభేరి మ్రో ♦ యింపవయ్య!"

—*) ప్రతాపసింహుని నిర్ణయము—నిబంధనములు. (*—

మ॥ అన గాంభీర్యము పూరుషాకృతిని దృ ♦ శ్యంబౌచు నిందుండెనో
యనఁ గూర్చున్న ప్రతాపసింహుఁడు "మహా ♦ త్మా! నీ కసాధ్యంబు గ
ల్గనె! యీనాఁటి కిరాత వేషమునఁ జె ♦ ల్వొంబోటి వెన్వెంట లే
దనుటే కాని పురాకిరాతుఁడవు గా ♦ వా! శత్రుపూర్దాహకా! 171
గీ॥ త్యాగమూర్తులు మీరధ ♦ ర్మైకనిరతులింద యుండఁగ జయసిద్ధి ♦ కేమికొఱఁత!
యాకసము వ్రాలుఁగాక చే ♦ యప్పళించి యాపఁగలము! విపత్కోటి ♦ నోపఁగలము!
సీ॥ సమరముల్ నిష్ఫల ♦ ములై రత్నగర్భయు రక్తగర్భయయా ♦ పనికిఁ జాల!
నొకచీమకైన నిం ♦ చుకహాని గలిగినఁ గనలేను; భారతా ♦ వనిని గలుగు
తరు లతా గుల్మ భూ ♦ ధర గహ్వరములఁ బ్రేమింతుఁ బ్రాణమును బ్రే ♦ మించునట్లు!
నాదుహృద్బంధు లిం ♦ దఱ మిమ్ముఁగొనిపోయి రణరంగమునను శా ♦ త్రవుల కత్తి
గీ॥ వాదరల కప్పగింపఁగా ♦ వలయు ననిన మేరువంతటి బాధ జ ♦ నించు నాకుఁ!
గటకటా! కోరరానిదు ♦ ష్కార్యముల రణంబునంతటి ఘోరకృ ♦ త్యంబు గలదె!

గీ॥ అలఘుమేవాడ లక్ష్మి ము ♦ ఖాబ్జమునకుఁ గుంకుమంబట్టి చిత్తూరు ♦ గూలుతుఁబాపి
యిపుడు హారావళీసీమ ♦ నెల్లఁ గొనఁగ నక్బరు తలంచినటు తెలి ♦ యంగనయ్యె.

గీ॥ రాజ్యలక్ష్మి సేనాలక్ష్మి ♦ రౌప్యలక్ష్మి లంచములుచూపి యతఁడు వం ♦ చించెటేటు!
ఎంత బలవిక్రమములున్న ♦ నిపుడు మనకు నాత్మనిగ్రహమును ద్యాగ ♦ మవసరంబు.

గీ॥ ఏను మొదలుగ సామంతు ♦ లెల్ల ప్రజలు రజత సౌవర్ణరత్నపా ♦ త్రములు విడిచి.
ప్రకృతియర్పించు పచ్చఱా ♦ పల్లెరములు చనురుటాకు లందున మెస ♦ వుదముగాక.

గీ॥ తలఁచిన మనోరథప్రాప్తి ♦ గలుగుదాఁక వ్రతము నడిపిన దశరథ ♦ రాము కరణి
హంసతూలికాతల్పమ్ము ♦ లవల విడిచి మృదుల దర్భాసనముల నుం ♦ డుదముగాక.

క॥ పెరుగునుగాపుత చికురో త్కరము శిర శ్చుబుక గండ ♦ తలముల; భద్రా
కరణము సేయింపకయుండెదరుగాత మహర్షి కోటి ♦ తో నెన యగుచున్. 178

క॥ మొరయునుగాపుత ముందఱ మొరసెడు దుందుభులు వెనుక ♦ మొగమై మునిలో!
నఱనిదురయు నఱకడుపును బొరయుఁగఁ బూనుదము వీర ♦ పూర్ణవ్రతమున్. 179

సీ॥ ఈశ్వరపదభక్తి ♦ యెపుడు మానఁగరాదు! మధుమాంససేవన ♦ మఱుగరాదు!
బంగారు పట్టువ ♦ ల్వలు గట్టఁగారాదు! భోగకోటులవంకఁ ♦ బోవరాదు!
కామాది శత్రువ ♦ ర్గము లంటరాదు! సత్యంబు శౌచము విడ ♦ నాడరాదు!
త్యాగంబుఁ గలనైనఁ ♦ దగ్గనీయంగరా! దాత్మనిగ్రహము పో ♦ నాడరాదు!
గీ॥ మాన ముత్తమధనమాట ♦ మఱువరాదు! ధర్మమే దైవమనుబుద్ధి ♦ తలఁగరాదు!
నిఖిలజగములు మాఱొడ్డి ♦ నిలుచుఁగాక దేశభక్తిని విడనాడి ♦ తిరుగరాదు! 180

సీ॥ స్వాతంత్ర్య ధర్మవాం ♦ ఛాశీలురగువారి దాఁకఁగష్టంబులు ♦ చేరియుండు!
నావిపత్కోటితో ♦ నడలక వీరులు శాశ్వతయుద్ధంబు ♦ సలుపవలయు!
ననుపమత్యాగస ♦ మారాధనములతో ధర్మదేవతఁ గొల్చి ♦ తనుపవలయుఁ!
దద్భక్తజన జీవి ♦ తమ్ము దుర్దమ తపోమయమై సురక్షితం ♦ బయి తనర్చు!
గీ॥ మహితకష్టానుభూతి ధ ♦ ర్మంబు పొలుచు! నపజయంబుల నది తగ్గ ♦ కతిశయిల్లుఁ!
గాన విజయంబె ముఖ్యంబు ♦ గాదు మనకు! ధర్మనిర్వహణంబుఁ గ ♦ ర్తవ్య మెపుడు!

సీ॥ ఉదయమే లేచి తే ♦ పుదయపురమువీడి కుంభల్మియర్ కోట ♦ కును జనుదము;
పదివేలపల్లెల ♦ ప్రజలు స్వస్వనివాసములు వీడి యచటికే ♦ పోవవలయుఁ;
పొలములుదున్న నాఁ ♦ గలి మోపఁగారాదు; పశువుల నెచట మే ♦ పంగరాదు;
బాటల నెవ్వరు ♦ పయనింపఁగారాదు; కూపముల జలంబుఁ ♦ గోలరాదు;

గీ॥ వనమృగం బొక్కఁడైనఁ జం♦పంగరాదు; మఱచియో తప్పియో చెట్టు♦నఱుకరాదు;
కేల నొకగడ్డిపోఁచయు ♦ గిల్లరాదు; గిరులు విడనాడి బయళులఁ ♦ దిరుగరాదు.

శా॥ సీరంధ్రి ద్రుమ పుంజ రంజితమునై ♦ నిద్రాణ నానామృగ
స్ఫారంబై భయదాంజనాచల మిటుల్ ♦ వ్యాపించెనాఁ జీకటుల్
బారై యంబరు దేశమాదిగ సలుం ♦ బ్రాసీమయుఁ దాఁక బ్ర
హ్మారణ్యం బగుఁగాక దేశము జనం ♦ బందేగరాకుండఁగన్. 183

క॥ తనకించుకయును లాభము దనరదనుచు నక్బ రెఱిఁగి ♦ దండెత్తక యుం
డిన నిరుదెగలకు మేలగు! మన ముందము కొన్నినాళ్లు ♦ మానముతోడన్. 184

క॥ తనపట్టు విడక సంగర మునకున్ దొరకొనినఁ దడిసి ♦ ముప్పందుము మో
యును! నిక్కము మనకున్న దతనికున్నది! తప్పదపుడు ♦ ధారుణి క్రుంగన్. 185

సీ॥ తతహరిశ్చంద్ర మాం ♦ ధాత్రాదులు చరించు వజ్రిలబాట నా ♦ భానుకులము!
నరమాత్రుఁ డొకని కే ♦ శిర సొగ్గి యిక్ష్వాకులకు మసిసోఁక నో ♦ ప్పుకొనలేను!
భరతఖండంబు కం ♦ పము పట్టి మేవాడ మునిఁగి క్రిందికి గ్రుంగి ♦ పోవుఁగాక!
యవనులతోడి బాం ♦ ధవ మూన! నిన్నాళ్లు మని తురుష్కులకూడు ♦ తినఁగఁజాలఁ!

గీ॥ గాన బలమెల్లఁ జూపి సం♦గర మొనర్చి గెలిచి స్వేచ్ఛాభిమానముల్ ♦ నిలుపుకొనుటొ!
దురమునను వ్రాలి మరణమొం♦దుటొ నిజంబు! కలుగ దెందును మధ్యమా♦ర్గంబు నాకు.

క॥ ఇది నానిర్ణయ"మన "మంచిది యెల్లర కనుసరింపఁ ♦ జెల్లు నటులె చే
యుదు"మని యందఱు గదలుచు సదనములకు వెళ్లి రధిక ♦ సంతోషమునన్. 187

మ॥ "పరివారంబులతో ధనావళులతో ♦ వస్తుప్రపంచంబుతో
⊕ నరుగన్ గావలె నేఁడె యందఱుజనుల్ ♦ హారావళీగహ్వరో

---

⊕ Pratap commanded his subjects on pain of death to retire into the mountains. During the protracted contests the fertile tract watered by the Bunas and the Beris, from the Aravalli chain west, to the eastern table-land was be-cheragh (without a lamp.)

Many tales are related of the unrelenting severity with which Pratap enforced obedience to this stern policy. Frequently with a few horse he issued forth to see that his commands were obeyed. The silence of the desert prevailed in the plains; Grass has usurped the place of waving corn; the high ways were choked with thorny babul and beasts of prey made their abode in the habitations of his subjects. In the midst of this desolation a single goat-herd trusting to elude observation disobeyed his prince's injunction and pastured his flock in the

త్కారముల్ చేరఁగ; నెవ్వ డాజ్ఞను దిర ♦ స్కారంబు గావించినన్
ధరపై రాలుఁ దదీయశీర్ష" మని ప్రో ♦ తల్పెట్టె ధక్కాధ్వనుల్. 198

గీ॥ అట్టి హారావళీపర్వ ♦ తాంతరమునఁ బరిణయము లోకకలక్షయు ♦ జరిగెనేని
§ యంత జనబృంద ముండఁబో ♦ దనఁగఁదనరె! నఖిలదేశంబుప్రజయెల్ల ♦ నచటనుండె.

(*—
—*) మేవాడ్దేశమంతయుఁ బాడువడి యరణ్యముగ మాఱుట.

సీ॥ రాజులు నివసించు ♦ ప్రాసాదములు గూలి వనమృగంబులకు ని ♦ వాస మయ్యెఁ!
బాలములలోన వి ♦ త్తులు రాలి మొలిచి చెట్లాకాశమును దాఁకు ♦ నట్లు పెరిగెఁ!
గొలఁకులలోఁ గూప ♦ ములలో జలము నిల్చి వాడుక లేమిని ♦ బాడువడియె!
నరులు పోఁకమి స్వేచ్ఛఁ ♦ బెరుగుచు నొకటికి వేయిగా మృగములు ♦ వృద్ధినొందె!
గీ॥ నలఘు రావి-వనాశాంత ♦ రావనీతలము లతావృక్షమృగవిహం ♦ గమవృతమయి
దేవదానవులకు నైనఁ ♦ దేరి చూడరాక చొరరాక మృత్యువ ♦ క్త్రముగఁ దనరె.
గీ॥ తరులు రాపాడుమ్రోత, వా♦తములమ్రోత, మృగవితతిమ్రోత, పలుసెల♦యేళ్లమ్రోత,
ఖగతతులమ్రోత, గలిసి యోం♦కారనాద మెపుడు నల్దెసలందుఁ బై ♦ కెగయుచుండె.
మ॥ ఒకమా ఆ 'బదనూ'రరణ్యములలో ♦ నుద్దండులై శత్రు సై
నికు లేతేరఁగ నాప్రతాపవిభుఁడున్ ♦ వీక్షించి యాత్మీయ సై
న్యకదంబంబులతోడ వచ్చి మదశుం ♦ డాలమ్ములన్ జీల్చు సిం
హకిశోరంబటు దాఁకి కూల్చెను జగం ♦ బౌరా యటం చెన్నఁగన్. 192
ఉ॥ వేఱొకసారి యిట్లె పది ♦ వేలభటుల్ షహాబాజుఖాను చి
త్తూరికి వెళ్ళుచుండఁగ మ ♦ హాగ్రివనంబున ముట్టడించె; వా

---

laxuriant meadows of Ontolla on the banks of the Bunas. After a few questions he was killed and hung up in terrorum. By such patriotic severity Pratap rendered the garden of Rajasthan of no value to the Conqueror.

"Annals of Mewar."

§ Without a capital, without resources, his kindred and clansmen dispirited by the reverses of his house, yet sympathising with him in his refusal to ally himself with a muhammadan, Pratap Singh had established himself at Kumbhalmer in the Aravallis and had endeavoured to organize the country for renewed struggle.

G. B. Malleson C. S. I.

రూఢిక నిల్పిరందఱు; ద ♦ యోదయుఁడౌచుఁ బ్రతాపుఁ డంత సం
హారముసేయకే విడిచె, ♦ నద్దిర! యాతని ధర్మ మెట్టిదో! 193

సీ॥ గొల్లలు మేకలఁ ♦ గొని మేపుదురటంచు బచ్చికబయళులఁ ♦ జొచ్చి చూచుఁ!
గాపు పొలాన నాఁ ♦ గలి మోపునోయంచు దూరప్రదేశముల్ ♦ తొంగిచూచు!
వేటరుల్ మెకముల ♦ పిండుఁ జంపుదురంచు ఘోరవనంబులు ♦ దూరిచూచుఁ!
దరుల బోయలును వా ♦ గుర లొడ్డుదురటంచుఁ గొండపేటెక్కి యం ♦ దుంకిచూచు!
గీ॥ నాసలుంబ్రాధిపతి వెంట ♦ నంటియుండ దేశమెల్లెడఁ దిరిగి శో ♦ ధించుచుండుఁ!
దనదు నానతి లవమైనఁ ♦ దప్పెనేని ప్రళయమగుఁగాక! యెవ్వాఁడు ♦ బ్రతుకఁగలఁడు!
గీ॥ భోగసన్న్యాసమున వీర ♦ పూర్ణదీక్ష పట్టి యిటఁ బ్రతాపుఁడు కష్ట ♦ పడుచునుండ!
రాజ్యతృష్ణాభరైక పూ ♦ ర్ణవ్రతంబు దీక్షగొని యక్బ రచట సా ♦ ధించుచుండె.

—*) అక్బరుసార్వభౌముని దిగ్విజయములు. (*—

సీ॥ అంబరుదేశమం ♦ దా రణస్తంభపురము నాఘనుఁడు పాల ♦ నము నొనర్చె;
నల శమంతకసింహుఁ ♦ డనువీరుఁ డాదుర్గమును వానికడనుండి ♦ కొనుచు “నుదయ
పురికి సామంతుఁడై ♦ పరిపాలనముసేయు” మని తనపతి శూర ♦ ధనునకిచ్చెఁ;
గోటవాఁకిటనున్న ♦ గొప్పపల్లె శమంతకుఁడు గొని తా నేలు ♦ కొనుచునుండెఁ;
గీ॥ గొండకన్న దుర్భేద మా ♦ కోటఁగొనఁగ దండువిడిసి యక్బరు నిల్చె ♦ రెండునెలలు;
చెంతనున్న నుందంత పో ♦ సినను గాని జయమొదవునన్న యాన లే ♦ శమును లేక.
సీ॥ తురకలు సంధిగో ♦ రిరి; దుర్గపతి యొప్పె; సేవకుఁడును మాన ♦ సింహుఁ డరిగి;
రంద యాస్థానము ♦ నందుఁ జేరిరి; శూరధనరావు పినతండ్రి ♦ తనకెదురుగ
మానసింహుని వీర ♦ మాని నిల్చిన భటుఁ గనుఱెప్పపెట్ట కొ ♦ క్కగతిఁ జూచి
యక్బరని గ్రహించి ♦ యతని చేతులుపట్టి సింహపీఠమున నా ♦ సీనుఁ జేసె;
గీ॥ నక్బరును శూరధనరావు ♦ నాదరించి కాశికామండల మొసంగి ♦ గారవించెఁ;
⊛ గోటవెలికి రాఁదలఁపఁ గ ♦ వాటసీమ నతనిఁ దాఁకె శమంతకుం ♦ డతిరయమున.

---

⊕ But this dereliction of duty was effaced by the rigid virtue of the brave Sawunt Hara who as already stated had cojointly with the Kotario Chohan obtained Rinthumbhor. He put on the saffron robes and with his small but virtuous clan determined inspite of his sovereign's example, that Akbar should only gain possession over their life-less bodies. Previous to this useless explosion of fidelity he set up a pillar with a solemn anathema engraved thereon on "what-

మ॥ "పురముల్ పోయిన రాజ్యముల్ చెడిన నె ♦ ప్డు౯ మాకు రాణా యెసు
స్థిరదైవంబగు; నట్టిస్వామిపదభ ♦ క్తి౯ మాని మోగల్ ధరే
శ్వరు పాదంబులు గొల్వ శూరధనుడు౯ ♦ భాగ్యంబు నాసించి; యో
హారవంశ్యాగ్రిణులార! యీయధము దు ♦ ర్వ్యాపారముల్ మెత్తురే." 198

మ॥ అని తాను౯ దనయైదునూర్లు హారవం ♦ శ్యశ్రేష్ఠులౌ సద్భటుల్
చని యొక్కుమ్మడి వారల౯ దగిలి యా ♦ స్వాతంత్ర్యయుద్ధంబున౯
దనువుల్ వీడుచు నిత్యనాకసుఖమొం ♦ ద౯ బోయి; రాదేశభ
క్తిని లోకంబులు మెచ్చి వారియశము౯ ♦ గీర్తించె వేనోళుల౯. 199

గీ॥ రామచంద్రుఁడు రీవాహ ♦ హామహీంద్రుఁ డలఘు కాలంజరీ దుర్గ ♦ మప్పగించె!
బాజబహదూ రొసంగె మాళ్వము! సహస్రవాజిపతులౌచుఁగొలిచి ర♦క్బరును వారు.

గీ॥ జోధబాయి మార్వార్మహీ ♦ శునితనూజ కనె జహంగీరు; తక్కిన ♦ కాంతలందు,
నక్బరు 'మురాదు' 'దనియాలు' ♦ననెడు సుతులఁ బుత్రికామణు లొక్కరి♦ర్వురనుబడసె.

—*) అక్బరుసార్వభౌముఁడు ఘూర్జరదేశము జయించుట. (*—

❁ మ॥ జనసమ్మర్దము ఘూర్జరంబు 'ముజఫర్ ♦ షా' యన్న దుర్మార్గుఁ డా
ఘనుఁడు౯ బాలనసేయఁగా నచటి క ♦ క్బర్ కొంతసైన్యంబుతోఁ
జనె; వాఁడెంతయు భీతుఁడై యతని ప ♦ జ్జ౯ జేరె; డిల్లీశుఁ డా
తని సీమ౯ గొని కొన్నిపల్లె లొసఁగె౯ ♦ దజ్జవనార్థంబుగ౯. 202

---

evrr Hara of gentle blood should ascend the castle of Rinthumbhor or who should quit it alive." Sawunt and his kin made the sacrific to honor, they gave up their life's blood to maintain their fidelity to the Rana albeit himself without a capital; and from that day no Hara ever passes Rinthumbhor without averting his head from an object which caused disgrace to the tribe.

"Annals of Mewar."

❁ The possession of numerous ports and the resulting extensive maritime commerce made Guzarat the richest kingdom in India. Ahmadabad the capital was justly reputed to be one of the finest cities in the world, while the manufacture of salt, cloths, paper and other commodities flourished in many localities. A sovereign consumed as Akbar was by the lust of conquest and the ambition of empire, could not possibly allow, such a delectable land on his frontier to continue in the enjoyment of unfettered independence.

"Akber the great Mogul."

మ॥ మును బైరాముఁడు రాజరక్షకుఁడు! త ♦ త్పుత్రున్ బదాఱేండ్ల వా
నిని నబ్దూరహిమాను సైన్యపతిగా ♦ నేమించి యాఘూర్జరం
బునకున్ రెండవమాఱు సేనల రణం ♦ బున్ జేయఁగా నక్బరున్
గొనిపోయెన్ సచరాచరావని వడం ♦ కున్ బొంది శోషిల్లఁగన్. 203

సీ॥ ఉభయసేనలకు మ ♦ హోద్ధతయుద్ధంబు పడియె నహమ్మదా ♦ బాదు పొంత!
నక్బరుపతి ఘూర్జ ♦ రాధిపు రణరంగమందుఁ బెల్లుగఁదాఁకి ♦ బందె గొనియె!
సమర మంతమునొందె! ♦ జయ మక్బరు వరించె! ఖాండీషు కైరాయుఁ ♦ గధియవాడ
కాంబె బ్రోచియు రివా ♦ కాంత మాహీకాంత, రాధాపురంబు సూ ♦ రతు బలిస్న
గీ॥ పయి బరోడా యహమ్మదా ♦ బాదు మఱియుఁ బాలనపురాది బహుమండ♦లాలియవన
సార్వభౌముని మృదుపదా ♦ బ్జములు చేరి యేఁబదియులక్షలధనంబు ♦ నియ్యఁదొడఁగె.

—*) అక్బరుసార్వభౌముఁడు వంగదేశమును జయించుట. (*—

మ॥ వరుసన్ వంగవిహారముల్ గొనఁగ న ♦ క్బర్ కోరె; నాసీమలన్
బరిపాలించె సుఖప్రదమ్ముగ సులే ♦ మాన్ ఖానుఁ; డాపిఁదున్
మరణంబొందినమీఁదఁ దత్సుతుఁడు స ♦ మ్రాట్టయ్యె దావూదు; ము
ష్కరుఁడై లోకుల బాధపెట్టుచును రా ♦ జ్యంబేలె వాఁడయ్యెడన్. 205

సీ॥ ధనము లక్షలు కోట్లు ♦ దనరె; నర్వదివేల యాశ్వికుల్ మూఁడువే ♦ లాఱునూర్లు
ద్విరదంబు లిర్వది ♦ వేల్ పిరంగులును లక్షయును నల్వదివేలు ♦ కాలిబంట్లు
పదినూర్లు యుద్ధనా ♦ వలు గల్గి దావూదు చక్రవర్తిని లెక్క ♦ సలుపఁబోక
సరిహద్దునందున్న ♦ 'జామేనియా' దుర్గమును సేనలను గొంచు ♦ ముట్టడించె;
గీ॥ నదియుఁ గోపకారణమయ్యె ♦ నక్బరునకు; మానసింహుఁడు తోడర ♦ మల్లు వీర
బఁహుఁడు ఖాసిముఖానాది ♦ ప్రబలవీరు లండఁ గొలువుండ వెడలె బ్ర♦హ్మాండమద్రువ

మ॥ అమర ద్వీపవతీ తటాంతరమునన్ ♦ హాజీపుర ప్రాజ్య దు
ర్గమునన్ జేకొని పాటలీనగర దు ♦ ర్గంబున్ గొనెన్! బెక్కయు
ద్ధములన్ జేసి విహారవంగముల నా ♦ తర్వాత నోఢ్రంబునున్
గ్రమమొప్పన్ గ్రహియించె నక్బరు సమి ♦ ద్గాండీవి యాతండనన్. 207

క॥ పరిపూర్ణవిజయమున నక్బరు ఢిల్లీపురముఁ జేరి ♦ కడు సంతోష
స్ఫురణమున మానసింహుని సరసకుఁ బిలిపించి గోష్ఠి ♦ సలిపెడు వేళన్, 208

—*{ అక్బరుసార్వభౌముఁడు కున్వార్ మానసింహప్రభువుతో మంత్రాంగము చేయుట. }*—

మ॥ పదమూఁడేడులు దాఁటిదాఁటకమె లేఁ ♦ బ్రాయంబునన్ దండ్రియున్
ద్రిదివం బేగెను; నాఁటనుండియు ధరి ♦ త్రీ రాజ్యభారంబు నన్
గదిసెన్; దేవునికూర్మి సర్వమును జ ♦ క్కన్ దాల్చి కల్యాణసం
పదలన్ లోపము గల్గకుండ నెపుడున్ ♦ వర్ధిల్లఁగాఁ జేసితిన్. 209

సీ॥ తెగినహారమున ము ♦ త్తియములువోలె భారతరాజ్యమది పెక్కు ♦ వ్రక్కలగుచుఁ
జినచిన్నపాయలై ♦ చెడె; రాష్ట్రపతులలో నొండొరులకు మైత్రి ♦ యొదవదెపుడు;
నిత్యలక్ష్మీ శుభ ♦ నిలయములై యుండవలయు రాజ్యములు శా ♦ శ్వత రణముల
ధనజనవస్తువా ♦ హనశూన్యమై పాడువడి శ్మశానములట్లు ♦ ప్రభఁదొలంగె!
గీ॥ నిట్టి కుబ్జావతారంబు ♦ లెల్లఁబోయి భరతఖండ మఖండైక ♦ భాగ్య విభవ
నిలయమైయుండఁ జూడఁగా ♦ వలయుననుచుఁ గడుపులోఁ గొండయంతాస ♦ గలిగె నాకు

సీ॥ సింహాసనం బధి ♦ ష్ఠించినదాది నీభావమే మది వేరు ♦ పాఁటియుండె!
నాగ్రా మొదల్గాఁగ ♦ ననుదినం బొక్కొక్క రాజ్యంబు గెలిచి రా ♦ ష్ట్రమునఁ జేర్చి
ప్రాభాత మృదుగంధ ♦ వహునట్లు భారతమేదినీతల మాక్రి ♦ మించి ప్రజల
కామోదసౌభాగ్య ♦ మలవరించుచు రామరాజ్యవిఖ్యాతిఁ గూ ♦ ర్పంగఁగంటి!
గీ॥ నెందొ యొకరిరువురు రాజ్య ♦ తృష్ణచేత నక్బరును దిగ్జయ మొనర్చు ♦ నంద్రు! గాని
సత్య మీవెఱుంగవె! ధాత్రి ♦ జను లెఱుఁగరె! భువనములనేలు నాదిదే ♦ వుండెఱుఁగఁడె

సీ॥ సహగమనము భీతి ♦ సడలించుచుంటి, నన్యాయమా పన్నుల ♦ నణఁచియుంటి;
మధుమాంససేవన ♦ మాన్పితి; భారతనృపులతో వియ్యంబు ♦ నెరపుచుంటి;
నొకకంట నమృత మిం ♦ కొకకంట సున్నంబు గలిగి వీక్షింప; మో ♦ గలులు హైంద
వులటన్న భేదంబు ♦ గలుగదు; మీలోన మత్ప్రాణసము లెంత ♦ మంది లేరు!
గీ॥ భారతాభ్యుదయముఁ గూర్చి ♦ పవలు రేయు నేను పడుబాధ లాదేవుఁ ♦ డే యెఱుంగు!
నీకుఁ జెప్పిన దప్పున్న ♦ దే! కనులకు క్షణము సేపైన నిద్దుర ♦ గదియరాదు. 212

శా॥ రారాజైమితిలేని సౌఖ్యభరమున్ ♦ బ్రాపించి యున్నాఁడటం
చీరెన్నందగుఁగాక; నాదు హృదయం ♦ బెన్డాక్క చింతాగ్నిచే
క్షీరాంభోనిధి క్రూరబాడబమహా ♦ గ్నిజ్వాలచేఁబోలెఁ గం
గారాచుండును; దాని బాధలకుఁ గ్రుం ♦ గన్ సాగితిన్ బెల్లుగన్. 213

మ॥ అది యెవ్వారల తోడనేఁ దెలుపరా! ♦ దద్దాని నెవ్వారు తీ
ర్చెదమన్నన్ మఱి తీరఁబోవ! దెపుడున్ ♦ జింతించి చింతించి నేఁ
దుదిదాఁకన్ మది నోర్వనేవలయు; నెం ♦ తో కూర్చు మిత్రుండ! వ
య్యది నేఁజెప్పిన నీదు మానసము చిం ♦ తాయత్తమై క్రుంగెడున్. 214

చ॥ ఇరువదియేండ్లుగాఁగ సహి ♦ యించుచునుంటిని; యెన్నిమార్లొ నీ
వెఱుఁగవుగాని యేకతమ ♦ యిర్వుర ముండినయప్డు నావ్యథా
భర మిటులుండెనంచుఁ దెలు ♦ పన్ గమకించితి; నంతలో హృదం
తరము కలంగి మాటయయి ♦ నన్ వెలిదాటక నిల్చిపోయితిన్. 215

చ॥ ఒకయెడ సింధువాహిని మ ♦ హోత్కటఁ బూజ్యము బ్రహ్మపుత్ర యిం
కొకయెడ వింధ్యభూమిధర ♦ ముత్తరమందు హిమాలయంబు వీ
నికి నడుమన్ గలట్టి యవ ♦ నిస్థలి నాపరిపాలనమ్మునన్
వికసన మొందె భూప్రజయు ♦ నేనును సౌఖ్యము గంటి మంతయున్. 216

మ॥ అరులెల్లన్ నశియించి; రక్బరన నా ♦ హా! యంతరాజేఁడి యం
దురు; గర్భంబు ఫలించి పుత్రికలు పు ♦ త్రుల్ గల్గి; రత్యంతభా
గ్యరమల్ పొల్చెడి; కోటిమంది హితు; లిం ♦ కన్ బ్రాయమో స్వల్ప; మే
కొఱఁత ల్లేవు; మహోన్నతస్థితులె నా ♦ కున్ జెల్లె నీనాఁటికిన్. 217

మ॥ అమరాణీసుఁడుగూడ నాసవదు నా ♦ ర్యావర్తదేశంబు స
ర్వము నాఛత్రము క్రిందికై నడిచె; మే ♦ వాడ్ రాజ్య మొక్కండు మా
త్రము స్వాతంత్ర్యరమాభిమానముల మ ♦ త్సామ్రాజ్యాధికారంబు లే
శము మన్నింపక గర్వముల్ బలిసి శి ♦ క్షం బెత్తి క్రోశించెడున్. 218

చ॥ నను గడుఁజేర్మిమైఁ గనుచు ♦ నాప్రభుతన్ మదిమెచ్చి కన్యని
చ్చిన మిమువంటివారి వెలి ♦ చేసి ప్రతాపనృపుండు పంక్తిభో
జనములకైన నించుకయు ♦ సైపక తేలికచేసి చూచె; మీ
ఘనతకు హానివచ్చినను ♦ గల్గవె నాకు విషాదవేదనల్! 219

చ॥ కలుగఁగరాదు లాభ మొక ♦ కాసును నాకని దేశమందు లో
కులఁ బురముల్ త్యజించుచును ♦ గొండలనుండఁగఁ బిల్చి సంపదల్
వెలసెడి దేశమెల్లఁ బెను ♦ బీడుగఁజేసె; వివేక మున్నదే!
యెలుకల దాడి కోడి తన ♦ యింటికి నిప్పిడు కూళలుందురే! 220

ఉ॥ ఆదిమసూర్యవంశభవుఁ ♦ డంట; తురుష్కులఁజేరి కొల్వఁగా
రాదఁట; నల్వురెవ్వరో ప ♦ రాక్రమవాక్యము లాడినంత మా
మీఁదికిఁ గాలు దువ్వనఁట; మేము భయంపడి దూరమున్న మ
ర్యాదఁట; కాక కేఁగినను ♦ నంతముచేయు నటంట; వింటివే! 221

మ॥ మఱి నాయొద్దను జేరు భూమిపతులన్ ♦ మర్యాదతోఁ జూడనో!
ధరణీభాగము లియ్యనో! పిలిచి బాం ♦ ధవ్యంబు చేకూర్పనో!
చిరమైత్రిన్ విహరింపనో నృపులు నన్ ♦ సేవించి చే దేమి మే
సిరి! తానింతటి మౌర్ఖ్యమేమిటికిఁ దా ♦ ల్చెన్! జెప్పఁగాఁ జాలుదే! 222

సీ॥ నేఁగోరునది యెల్ల ♦ నిఖిలభారతఖండభాగ మొక్కడనేల ♦ వలయు ననియొ!
యెపు డిర్వురు స్వతంత్రు ♦ లిటనుండఁ జోటుండరాదు! లోకము పెద్ద ♦ రాజననుచు
నంగీకరించె న! ♦ న్నాతఁ డంగీకరించిన దాన నిసుమంత ♦ చేటు గలదె!
తనకిరీటంబు క్రిం ♦ దను వ్రాలునే! పట్టి పెడసరకట్టె య ♦ న్పించుకొనుటె

గీ॥ కాని! నేనేఁగినను నాపఁ ♦ గలుగువారలేరి! తానెంత! తనదేశ ♦ మెంత! తనదు
సేనయది యెంత! హృద్బంధు ♦ లైన మిమ్ము వంటివారలఁ గని యూర ♦ కుంటిఁగాక.

సీ॥ నిజము చెప్పుటకేమి! ♦ నీవాతనినిగూర్చి పలుమాఱు గడుఁగార ♦ వంబు నెరపి
పలుకుటఁజేసి నీ ♦ భావమెచ్చటనొచ్చునో యంచు నెట్టులో ♦ యోర్చియుంటి!
"నీవాఁడ" ననమను! ♦ నేనేల నీకిష్ట మైనట్టు లతని మ ♦ ర్యాద చేయు!
మతఁడు స్వతంత్రుఁడై ♦ యలరరాదనికాదు! దేశ మొక్కటిగ వ ♦ ర్ధిల్లవలయు

గీ॥ ననుచు నింతగఁ జింతింతు; ♦ నతని మౌర్ఖ్య మంతకంతకుఁ బెరిగె; రా ♦ జ్యంబు పాడు
వడియె; నేమనఁగూడక ♦ యెడరుపడితి హృదయశల్యము పాయు చో ♦ ప్పెఱుఁగనైతి.

⊕ చ॥ విను కడమాటగా వినుతుఁ! ♦ బెద్దయుఁగాలముగా శరీరమున్
దినియెడి రాచపుండువలెఁ ♦ దీరని వ్యాధియుఁబోలె నాప్రతా

---

⊕ It is not necessary to adduce any particular incident as supplying a motive for the attack on the Rana Pratap, who is represented by Abul Fazl as deserving chastisement by reason of his alleged arrogance, presumption, disobedience, deceipt and dissimulation. His patriotism was his offence. Akbar had won over most of the Rajput chieftains by his astute policy and could not endure the independent attitude assumed by the Rana, who must be broken if he would not bend like his fellows. The campaign of 1576 was intended to destroy the Rana utterly and to crush finally his pretentions to stand outside the empire. The

పునిదెసనైన చింతఁ దను ♦ వున్ మనసున్ వ్రీల మయ్యె; నేఁగతిన్
దినములు దాటుఁ! దీఱ దిది ♦ దేహముతోఁ డతఁగాని యీజనిన్. 225

మ॥ అకటా! చల్లఁగ నింట నన్నిలిపి య ♦ య్యస్త్రాద్రియందుండి చూ
డ్కికి వేగా నుదయాద్రిదాఁకఁగల ది ♦ గ్దేశమ్ములన్ గెల్చి లా
భశళల్ నించెదు నీవు నాప్తమణివై ♦ వర్తించినన్ జింతఁబా
యక నేనిప్పుడు క్రుంగిపోవలసెఁ! గ ♦ ట్టా! దైవ మెబ్భంగిదో!" 226

—*) అక్బరుచక్రవర్తికి మానసింహప్రభువు మనస్తాపోపశమనము చేయుట. (*—

మ॥ అని యాస్యంబును వాల్చి చూపు ధరపై ♦ వ్యాపింపఁగాఁజేసి చిం
తను సూచింపఁగ మానసింహుఁడు ప్రచం ♦ డప్రాభవోద్దండుఁ డా
తని వీక్షించుచు "దీని కింతవడిఁ జిం ♦ తన్ బొందఁగా నేటి! కీ
పని నీకోరినయట్లు తీర్పఁగను మ ♦ ద్భారంబు! నీ కేటికిన్! 227

ఉ॥ ఇంతకు నీవు కోరుపని ♦ నెవ్వరికేనియుఁ దప్పుపట్టఁ గా
సంతయుఁ జోటు లేదు! జగ ♦ మంతయు సేమమునొందు సౌఖ్యసి
ద్ధాంతమె చూపినావు! తఱి ♦ యైనపు డమ్మహనీయుఁ జూచి త
త్స్వాంత మెఱింగి వీలయిన ♦ యట్టులు కార్యము నిర్వహించెదన్. 228

సీ॥ అతఁడు మాకులముల ♦ కధిపతి; యతని శ్రేయముఁ జూడ మాధర్మ♦మండ్రు; కాని
యెప్పటిమాటలో! ♦ యెన్నటిజోలియో! వినుటయే యతని నేఁ ♦ గని యెఱుంగ!
ధ్వజినీపతిత్వసం ♦ బంధంబు సామంతభావంబు వియ్యంబు ♦ బాంధవంబు
నేండ్లుపూండ్లును దాటు ♦ హితవృత్తి యెల్లప్డు సముఖమ్మున మెలంగు ♦ చనువుకలిమి
గీ॥ పయిని నొకవేయి సంబంధ♦బంధములును దొడరి పూలసంకెలలు నా♦మెడనుబడుచుఁ
గట్టుపడినాఁడ నీపాద ♦ కమలములకు! నాతనికిఁ గూర్తు నే! నిన్నె ♦ యనుసరింతు.

సీ॥ ఉదయపురిపైన దండెత్తి ♦ కడియఁబోకు! స్వల్పరాజ్యము! నీధాక ♦ సైపలేదు!
మృదుశిరీషపుష్పమ్ము! తు♦మ్మెదయెవ్రాల నోర్వదు! ఖగేశ్వరుఁడు త్రొక్క ♦ నోర్వఁగలదె!

---

failure of the effort caused deep disappointment to Akbar The emperor desired the death of the Rana and the absorption of the territory in the imperial dominions. The Rana while fully prepared to sacrifice his life if necessary was resolved that his blood should never be contaminated by inter-mixture with that of the foreigner and that his country should remian a land of freemen. After much tribulation, he succeeded and Akbar failed. "Akber the great Mogul."

చ॥ అన "సరి యట్లుచేయు"మని ♦ యక్బరు "పెక్కురు కార్యదక్షులన్
బనిచితి! రెండుసారులుగ ♦ వారలు ఘూర్జరదేశ మేగి యం
దునఁగల రాజ్యకార్యములు ♦ తోఁచినయట్టులు తీర్చి! రైనఁ బా
లనము స్థిరత్వమున్ గనిన ♦ లాగగుపింపదు పెక్కులేండ్లకున్." 231

—*) మానసింహప్రభువు ఘూర్జరమునకు వెడలుట. (*—

క॥ అనిన "నదియెంతపని లెమ్మ"ని పలుకుచు మానసింహుఁ ♦ డామఱునాఁడే
తనవెంటఁ గొంతసైన్యముఁ గొనుచుఁ బ్రయాణం బొనర్చె ♦ ఘూర్జరమునకున్. 232

చ॥ చని యటనున్నకార్యములు ♦ సర్వముఁ దీఱిచి యుత్తమవ్యవ
స్థను నెలకొల్పె; రాజ్యరమ ♦ సర్వసుఖంబులు గాంచి వృద్ధినొం
దెను; బలవంతుఁడున్ బ్రబల ♦ నిర్ఝర మెంతటి దుర్గమస్థలం
బునయినఁ జీల్చి చొచ్చుకొని ♦ పోవు నటంచను పల్కు నిల్పుచున్. 233

మ॥ తనయంబక్పురిఁ జేరఁగా మఱలి మ ♦ ధ్యన్ గల్గు మార్గంబునన్
జనుచో నొక్కెడ మానసింహుఁడు "కడున్ ♦ సద్భక్తి నీపాద ద
ర్శనమున్ జేయఁగఁ గోర్కెకల్గె! నిదె యా ♦ జ్ఞన్ వేగఁ బాలింపవే"
యని మామన్ జయమల్లు బంచెను బ్రతా ♦ పాధీశు నర్థింపఁగన్. 234

చ॥ కదిసి ప్రతాపసింహనృపుఁ ♦ గార్య మతం డెఱిఁగించె; సమ్ముదా
స్పదుఁడయి భూవిభుం 'డుదయ ♦ సాగరసీమను జూతు' నన్న వా
ర్తఁదెలిపె నాతఁ; డిచ్చటఁ బ్ర ♦ తాపుఁడు నచ్చట మానసింహుఁ డ
య్యుదయపురంబుఁ జేర గమ ♦ నోన్ముఖులై చని చేరి రిర్వురున్. 235

గీ॥ అన్నియును బర్ణశాలలే, ♦ యంతరమున నన్ని దర్భాసనంబులే, ♦ యన్నిచోట్ల
నతినిరాడంబరత్వమే, ♦ యందఱు ముఖముల నమాయికత్వంపుము ♦ ద్రలె, రహించె.

గీ॥ అచటి యందఱు భోగస♦న్న్యాసిమణులు! పరమహంస ముఖ్యుఁడు ప్రతా♦పప్రభుండు!
పజ్జనున్న గంభీరాద్ర ♦ వంతి వోలెఁ బరమగంభీర మందఱి ♦ భావవృత్తి. 237

గీ॥ అతుల సువిశాల పర్ణశా ♦ లాంతరమున మృదుల దర్భాసనంబులు ♦ పది దనర్ప
నొక్కదానిపైనఁ బ్రతాపుఁ ♦ డుండె! నతని చెంతనే సలుంబ్రాకృష్ణ♦సింహుఁడుండె.

—*) మానసింహప్రభువు ప్రతాపసింహుని దర్శించుకొనుట. (*—

§ సీ॥ వజ్రదీధితులు శు ♦ భ్రకపోలములపైన నాట్యమ్మొనలుపు కుం ♦ డలము లలరఁ!
బరమదుర్లభమహా ♦ భాగ్యరేఖ లెసంగు రమణీయ దీర్ఘ నే ♦ త్రములు దనర!
సౌందర్యదేవతా ♦ సదనమై సంపూర్ణ చంద్రుని గేరు నా ♦ స్యంబు వెలుఁగ!
క్షితి నెల్లఁ ద్రుటిని వ ♦ శీకృతి గావించు భూరిలక్షణదివ్య ♦ మూర్తి యమర!
గీ॥ మంచి చందురుకావి రు ♦ మాలుపైన రాజచిహ్నమా మగఱాతు ♦ రాయిగులుక!
మానసింహుండు ప్రబలాభి ♦ మానధనుఁడు హయముడిగి పర్ణశాలకు ♦ నరుగుదెంచె.

మ॥ కరముల్ రెండును మోడ్చి భూమిపుఁడు మో ♦ కాలూని కూర్చుండుచున్
శిరమున్ వంచి నమస్కృతుల్ సలిపి ని ♦ ల్చెన్ మానసింహుండు; సా
దరచిత్తుండు ప్రతాపసింహవిభుఁ డు ♦ త్సాహంబుతో "నంబరే
శ్వర! రమ్మిచ్చటఁ గూరుచుండు"మని సం ♦ భావించె సంప్రీతిమై. 240

గీ॥ "రాజపుత్రభూస్థలిఁ గల ♦ రాజులందు నాయనా! నిన్నుఁబోలు రా ♦ ణ్మణులు గలరె!
ప్రాభవమునందు యశమందు ♦ బలమునందు నింతవాఁ డింక లేఁడన ♦ నెసఁగినావు!

చ॥ ఒకతృటియేనియున్ వ్యవధి ♦ యుండదు; భారతదేశకార్యముల్
సకలము నీపయిన్ బడి తొ ♦ లంగవు; వేసవియందు మండుటెం
డకుఁ గడుదూర మిట్లు పయ ♦ నం బొనరించితి; వెట్టి దొడ్డ కా
ర్యకరణ మూనియో! తెలుప ♦ నర్హమయైనను విందు" నావుడున్. 242

మ॥ "నిజధర్మాచరణం బొనర్పఁ బురమున్ ♦ దేశంబు సర్వస్వమున్
స్వజనంబున్ విడనాడి యొప్పు ప్రబల ♦ స్వాతంత్ర్యమున్ గొల్చి బే

§ Mann singh the nephew and the successor of Bhagavandoss was the most brilliant character of Akbar's court. As the Emperor's Lieutenant he was entrusted with the most arduous duties and added conquests to the empire, from Khotam to the Ocean. Orissia was subjugated by him; Assam humbled and made tributary; and Kabul maintained her allegiance. He held in succession the governments of Bengal and Bihar the Deccan and Kabul. Raja Mann soon proved to Akbar that his policy of strengthening his throne by Rajput alliance was not without hazard; these alliances introducing direct influence in the state which frequently thwarted the views of the sovereign. "An account of the life of Raja Mann would fill a volume. There are ample materials at Jaipur.

"Annals of Amber"

రజ మొక్కింత యెఱుంగకుండెడు మహా ♦ రాజర్షి! నీపాదపం
కజముల్ గొల్చుటకన్న నిష్ఠ మఱి యే ♦ కార్యంబు నాకుండెడిన్! 243

సీ॥ హారావళీపర్వ ♦ తాటవి రాజ్యంబు! కొండగుహాలు కొల్వు ♦ కూటములును!
బూచిన పెనువృక్ష ♦ ములు సితచ్ఛత్రమ్ము' లాగండశిలలు సిం ♦ హాసనములు!
విరులగుచ్ఛమ్ములు ♦ వింజామరమ్ములు! పంచాస్యవితతి సే ♦ వకగణంబు!
ప్రకృతిసౌందర్యంబు ♦ భాగ్యసౌభాగ్యంబు! జ్ఞానమే మోక్షల ♦ క్ష్యంబుగాఁగ!
గీ॥ ముప్పదియునాఱు కులముల ♦ భూపమణులు పాదములు గొల్వఁదగు జగ♦త్పావనుండ
వడవిఁ బడరాని యిడుములు ♦ పడుచునుంటె! ధర్మ నిష్ఠుర వీర వ్ర ♦ తంబుఁ బూని."

క॥ అని మానసింహభూవరుఁ డనఁగఁ బ్రతాపుఁడును "మత్కు ♦ లాభరణులు పూ
ర్వనృపాలుర ధర్మము నే ననుసరణ మొనర్చుచుంటి ♦ నతిదృఢనిష్ఠన్. 245

మ॥ స్థిరదీక్షన్ గొని ధర్మదేవత నుపా ♦ సింపన్ బ్రయత్నించు నా
నరులన్ గష్టములెల్ల మార్కొను! ననం ♦ తత్యాగ ధైర్యంబు ల
క్కరయౌ వారికిఁ! జీకటుల్ బలియఁ జు ♦ క్కల్ తేజముల్ బెంచు నా
కరణిన్ ధీరులు పెంచుచుందురు విప ♦ త్కాలంబునన్ ధైర్యముల్. 246

సీ॥ దృక్పథంబున భేద ♦ మే కాని దైవదత్తములెకా కష్టసౌ ♦ ఖ్యములు రెండు!
రెంటిలోఁ గష్ట ము ♦ తత్కృష్టమం! ద్రది దాను వలగొన్నవారి పా ♦ పములు గడిగి
ప్రకృతివిజ్ఞానసం ♦ పదలఁ బెంపొందించి శమదమాదిగుణాళి ♦ సంతరించి
యఖిలజగం బీశ్వ ♦ రాధీనమని తెల్పి యుత్తమజ్ఞానంబు ♦ నొందఁజేయు!
గీ॥ నిరత మాత్మశోధనచేసి ♦ నిశితశిక్ష పెంచి కష్టానుభూతి ప్రా ♦ పించి గాక
మనుజుఁ డొకకోటియోగముల్♦మరగినైన నుత్తమోత్తమపురుషత్వ♦ మొందఁగలఁడె!

మ॥ అమరోద్యానముఁబోలె నెల్లెడ సమ ♦ గ్రానందముల్ బెంచి లో
కముఁ గల్యాణపుమండపంబటు వెలుం ♦ గన్ జేయు స్వాతంత్ర్యధ
ర్మమహాదేవత మున్గెఁ గిల్బిషసము ♦ ద్రంబందునన్; రక్తహ
స్తములన్ లేపిన లేచు; లేవ దణుమా ♦ త్రన్ రిక్తహస్తంబులన్. 248

మ॥ పొడమొందైనను సోఁకఁగా నెఱుఁగ కే ♦ ష్ఠున్ శీతలచ్ఛాయలన్
బడినన్, దుఃఖము మాటెఱుంగక సుఖ ♦ ప్రాబల్యభావంబు తే
ర్పడినన్, నొప్పి రవంతయున్ దెలియ క ♦ శ్రాంతంబు భోగంబు చొ
ప్పడినన్, మానవుఁ డాత్మజీవితపు శో ♦ భాలాభముల్ చెందునే! 249

కం॥ నాకష్టంబులఁ గూర్చి వాకొనకుము; కష్టములకు ♦ భయపడ" నన "నేఁ
గాక"నుచు మానసింహుఁడు "నాకొక్కఁడు తోఁచుఁ! దెల్పి ♦ నఁ గనలకుఁడీ! 250

—*) ప్రతాపసింహునితో మానసింహప్రభువు సంధిమాటలు జరుపుట. (*—

❀ సీ॥ కాబూలు మొదలు వం ♦ గముదాఁక వ్యాపించు సకలభూతలమేలు ♦ చక్రవర్తి!
యవనహైందవులందు ♦ లవము భేదములేక సమదృష్టిఁ జూచు వి ♦ జ్ఞానశాలి!
యడుగ రేకాని త ♦ న్నడిగిన రాజ్యమైన నొసంగఁగల వదా ♦ న్యప్రభుండు!
తనచూపు పాఱు ది ♦ క్కున నెందపజయంబు వినరాని రణరంగ ♦ విజయమూర్తి!
గీ॥ కాలిబంట్లేఁబదైదు ల ♦ క్షలును బదియు నైదులక్ష లాశ్వికదళం ♦ బైదువేలు
హస్తితతి గల్గు విశ్వలో ♦ కైకభర్త! యక్బరున్నృపాలుతుల్యు లీ ♦ యవనిఁ గలరె!
సీ॥ భూదేవి పూలమే ♦ ల్మెసుఁగూనెనో యన వఱలు నుద్యానముల్ ♦ పెరుగఁజేసె!
ఛత్రముల్ వలె వంగి ♦ చలువ నిచ్చెడు చెట్ల రాజమార్గముల నే ♦ ర్పాటు చేసె!
ద్వాదశవర్షముల్ ♦ వర్షంబు లేకున్నఁ దఱుఁగని చెఱువులఁ ♦ ద్రవ్వఁజేసె!
మహినెల్ల నీశ్వర ♦ మయమంచుఁ జాటఁ గో వెలులు దీపములట్లు ♦ వెలయఁజేసె!
గీ॥ సకలభాషాకవీంద్రుల ♦ సత్కరించి కృతులు వ్రాయించి బహుబహూ ♦ కృతులు చేసెఁ!
బదియు నాఱునూఱులు సైన్య ♦ పతులు గొలువ మీఱె మధ్యమలోకమం ♦ దారుఁడగుచు.
సీ॥ శాస్త్రచక్రమెల్ల నే ♦ కచ్ఛత్రమైయుండ నాసించి దిగ్విజ ♦ యము లొనర్చుఁ!
దనచేఁ బరాభూతిఁ ♦ గనిన రాజులనెల్ల సమగౌరవమ్మున ♦ సత్కరించుఁ!
దనయేలుబడిని నాఁ ♦ దలఁదాల్తు మనిపించి వారిదేశమ్ముల ♦ వ్వారి కిచ్చు!
నిఁకఁ గొంత రాజ్యంబు ♦ నిచ్చు! నాస్థానము దరసి సేనాధిప ♦ త్యంబు నిచ్చు!

---

❀ Students well versed in European History seldom, if, ever, realise the fact that the empire ef Akber during the last quarter of the sixteenth century, undoubtedly was the most powerful in the world and that its sovereign was immeasurably the richest monarch on the face of the earth. Proof will be given later, that when he died in 1605 he left behind him in hard cash not less than fifty millions of pounds sterling equivalent in purchasing power to at least two hundred millions at the present time and probably to much more. Even in 1576 the amount of his hoarded riches must have been stupendous and none but the bravest of the brave could have dared to match the chivalry of poverty-striken Mewar, against the glittering hosts of rich Hindustan.

"Akber the great Mogul"

గీ॥ నెయ్యమునకుఁ దోడుగఁ దన ♦ వియ్యమిచ్చు! నడుగ లేదనఁజాలఁ! డే ♦ మైన నిచ్చు!
గల్పకము మేరుగిరి కామ ♦ గవియుఁజేరి యతనియాకృతి నిల జన్మ ♦ మందె నిజము.

⊛ మ॥ అలబృందావనమేగి యందలి మునీం ♦ ద్రానీకమున్ గొల్చి గో
కులపాలాన్వయవార్ధి చంద్రుఁడగు నా ♦ గోవిందు భావించి కో
వెలలన్ నాలుగు గట్టినాఁడు! యవనో ♦ ర్వీనాథు లీభారతీ
యులదైవంబుల మ్రొక్కి దేవళము లో ♦ హో! కట్టి సేవించిరే!. 254

సీ॥ ప్రజ బానిసలుచేయఁ ♦ బడు చట్టమును నిల్పె! జుట్టుపన్నును దుద ♦ ముట్టఁజేసెఁ!
బరమేశుఁగొలువ నం ♦ దఱును సమానార్హులని యాత్రికులపన్ను ♦ నణఁచివైచెఁ!
బ్రతిదినోదయము త ♦ ల్పమునుండి లేచినయంతఁ బరబ్రహ్మ ♦ మాత్మఁ దలఁచు!
నాత్రిమూర్తులకన్న ♦ నాదిదేవునికన్నఁ బూతంబులంచుఁ గో ♦ వులకు మ్రొక్కు!

§ గీ॥ నార్షవిధి సూర్యభగవాను♦నర్చ సేయుఁ! దెల్లగడ్డయు మాంసంబుఁ♦దినఁగరోయు!
నింకఁ జెక్కుల నీకాల ♦ మీగుణమ్ము లుత్తమబ్రాహ్మణులకైన ♦ నున్నె చెపుమ.

గీ॥ స్వామి యాతండు! సద్గురు♦స్వామివీవు! నిహ మతఁ డొసంగుఁ! బరసౌఖ్య♦మీవొసంగె!
బిరువురును రెండుకనులు నా ♦ కేకరీతిఁ గొలుతు నిరువుర పాదముల్♦తల ధరించి.

---

⊛ The most notable examples of the eclectic style of Akber's age, with a predominance of Hindu elements, outside Agra and Fatepur Sikri are to be found at Brindaban in the Madhura District, the reputed residence of the Demigod Krishna. Local tradition affirms that in 1573, the year of the conquest of Guazarat, Akber was induced to pay a visit to the gosains or holy men of Brindaban and was taken blindfold into the sacred enclosure of the Nidhbhan ( Grove of the nine treasures ) where a vision was revealed to him so marvellous that he was constrained to admit that he had been permitted to stand upon holy ground. The Rajahs who bore him company expressed a desire to commemorate the visit and do honour to Krishna by the erection of four temples which were constructed in due course.

"Akber the great Mogul."

§ He ( Akber ) performed private devotions four times a day, at sun rise, noon, sunset and midnight spending a considerable time over them. In his latter days these devotions consisted largely of acts of reverence to the sun, fire and light............Akbar's action in abstaining almost wholly from eating meat and in issuing strongest prohibitions resembling those of Asoka restricting to the narrowest possible limits, the destruction of animal life, certainly was taken in obedience to the doctrine of his Jain teachers.

" Akber the great Mogal "

మ॥ భవదత్యుత్తమధర్మదీక్ష త్రిజగ ♦ ద్వంద్యంబయా! దేశకా
లవిధుల్ చూచియు సుంతమార్చుకొనినన్ ♦ లగ్గయ్యెడిన్; రాజనీ
తివికాసం బఖిలార్థసిద్ధులను సం ♦ ధించున్; వృథాకష్టన
ష్టవిచారంబులు పెంచుపట్టుల నను ♦ ష్ఠానంబు మార్పన్ దగున్. 256

సీ॥ నీవీరధర్మంబు ♦ నెపమున లోక మెంతగ బాధనొందుచు ♦ న్నదియొ చూడు!
ప్రజలు నిల్వఁగ నీడ ♦ పడయక తినఁగూడు కట్ట బట్టయు లేక ♦ గాసిపడిరి!
పాడుపడె ధరిత్రి! ♦ బలియురౌ మగలు కంకాళమ్ములోయనఁ ♦ గానఁబడిరి!
భాగ్యదేవతలట్టి ♦ పడతులు దుర్భరదారిద్ర్యదేవత ♦ ల్గా రహించి!
గీ॥ రనుదినం బేకభుక్తంబు ♦ నవనిశయ్యఁగొని ప్రపంచోన్నతుండవై ♦ మనఁగఁదగిన
నీవు సన్న్యాసివేషాన ♦ నిలువ గుండె దిటవు చెడియెఁ! గొండంత సం ♦ కటముగలిగె!

ఉ॥ నీరవివంశగౌరవము ♦ నిల్పుట పూర్వమునుండివచ్చు నా
చారము మాకు; వందనము ♦ సల్పి వచించెద; నట్టివానితో
వైరము మేలుగా; దెపుడుఁ ♦ బాలును నీరునుబోలె నొక్కఁడై
మీరు మెలంగినన్ జగము ♦ మేలు గనున్; సుఖమగ్గలంబగున్. 258

మ॥ గురువైరాగ్యకళాసముద్రుఁడవు నీ ♦ కున్ బూర్ణసౌభాగ్యభా
గ్యరమాసేవధి యక్బరీశ్వరునకున్ ♦ కల్లోల గంభీర సు
స్థిర పాథోధులఁగూర్చు చిన్ని జలసం ♦ ధిన్ బోలె నే సంధినిన్
వఱలన్ జేసెద! శంభుమాధవుల తే ♦ వన్ మైత్రి వర్తింప రే!. 259

క॥ సిరులఁ దులఁదూగ వలసిన ధరణిని యుద్ధములు లేపి ♦ దారుణవధలన్
జరిపించి రక్తబలులను నెఱపఁ దలఁపఁ బోకుమనుచు ♦ నిన్నర్థింతున్." 260

క॥ అన మోముమందహాసము చినుకఁ బ్రతాపుఁడును మాన ♦ సింహు వదనమున్
గని "నీవచించు హితములకును నామది నెంతయేనిఁ ♦ గుతుకంబయ్యెన్. 261

సీ॥ సచరాచరప్రపం ♦ చము పుట్టుటాది యాత్మస్వేచ్ఛ ప్రథమబా ♦ ధ్యత నరునకు!
నొకమానవుండు వే ♦ ఱొకనికి లోఁబడి మనుటయు దైవస ♦ మ్మతముగాదు!
ధన రాజ్య విభవ సా ♦ ధనము లాసగఁజూపువారు వానికి నాస ♦ పడెడువారు
సహజముగాఁ గలుషభా ♦ జను! లైహికాముష్మికసుఖముల్ వారికిఁ ♦ గలుగఁబోవు!
గీ॥ స్వేచ్ఛ మదినెంచి స్వజనంబు ♦ నెల్లసిరులు ప్రాణమును సర్వమును బాయు ♦ వారియెడల
దైవమే లేకయున్న నీ ♦ ధరణియందు సత్యమే లేదు! పైన నీ ♦ శ్వరుఁడె లేఁడు. 262

సీ॥ రాజనీతియును ధ ♦ ర్మం బీద్వయిని నీతి తలుచుగా లాభప్రి ♦ దముగఁ దోఁచుఁ!
గాని కామోపభో ♦ గముల కైశ్వర్య సంపాదనకే యది ♦ పనికివచ్చు!
ధర్మం బఖిలలోక ♦ తత్వంబులకునెల్లఁ దల్లియుఁ దండ్రియుఁ ♦ దైవమగును!
నీతియో గౌరవ ♦ స్వాతంత్ర్యముల కడ్డుపడనంతవఱకె సం ♦ భావనీయ!
గీ॥ మాత్మగౌరవహాని దా ♦ పైనయపుడు మానధనులకుఁ ద్యాగసం ♦ పదయుఁ బౌరు
షమును సాహసమును గాక ♦ శరణయోగ్యమగు పథం బొకటుండదీ ♦ యవనియందు.
సీ॥ పలుపురు నీవంటి ♦ వారు ఢిల్లీశ్వరుం డగణితగుణశాలి ♦ యనఁగ విందు;
నతఁడు ఘనుండుకాఁ ♦ డనను నేఁగూడ; నక్బరుదెసఁ గడుగౌర ♦ వం బెసంగు;
నతఁ డమానుషసద్గు ♦ ణాఢ్యుం డనను; గాని యవనభూపతుల యో ♦ గ్యతముఁడగుఁ;
గొన్నిమంచిగుణంబు ♦ లున్నవి నిజము; శాత్రవుఁడైన గుణమున్న ♦ దాఁపరాదు;
గీ॥ పరులవృత్తి విమర్శించి ♦ పాఱఁబట్టి లేని పోని దుశ్శంకలు ♦ లేవనెత్తి
నలుపులు గణించి లేని నిం ♦ దలుఘటించు టభిమతముగాదు నాకు బా ♦ ల్యంబునుండి
సీ॥ జగమునందిప్పున్న ♦ సమ్రాట్టులందెల్ల నక్బరు పెద్దవాఁ ♦ డగుట నిజము!
నీవనినట్లు సే ♦ నావారములు లక్షలుం గోట్లు లతనికుం ♦ డంగవచ్చుఁ!
బట్టిన దంతయు ♦ బంగారు గావచ్చు! గోపాలదేవునిఁ ♦ గొలువవచ్చు!
సర్వేశ్వరుని కటా ♦ క్షమున శ్రీమంతుఁడై జనియించె! నతఁడు సం ♦ శయములేదు
❁ గీ॥ కాని నరుఁడౌట నిష్పాక్షి ♦ కముగఁజూడ నుండనే యుందు లోపమ్ము ♦ లొకఁడు రెండు!
మనకును దురుష్కులకును ధ ♦ ర్మములు వేఱు! మనది వేదంబు! వారిదై ♦ చనుఖొరాను
మ॥ తనచే నిర్జితులైన భూపతులు క్రో ♦ ధంబుల్ విసర్జించి యె
ప్డును బ్రేమంబునఁ దన్నుఁ జుట్టుకొని కొ ♦ ల్వన్ జేయఁ గాంక్షించి యొం

---

❁ He never gave anybody the chance to understand rightly his inmost sentiments or to know what faith or religion he held by; but in whatever way he could best serve his own interests, he used to feed one party or the other with the hope of gaining him to itself, humouring each side with fair words and protesting that he had no other object with his doubts than to seek and find out by their answers the simple truth till then hidden from him! And in all business this was the characteristic manner of king Akbar a man apparently free from mystery and quite as honest and candid as could be imagined but in reality so close and self-contained with twists of words and deeds so divergent one from the other and most times so contradictory that even by such seeking one could not find the clue to his thoughts.

"Bartoli."

దను దేశంబు మతంబు వేఱయిన బం ♦ ధుత్వంబుఁ గల్పించు నా
షనికిఁ డిగ్గె; నిగూఢ మాతని మనో ♦ వ్యాపార లీలాగతుల్. 266

గీ॥ అల్లుఁడై బావయై మామ ♦ యైన తన్ను వెలితి గననీక శ్రీమహా ♦ విష్ణునట్లు
భారతీయులు గొలుతురఁ ♦ భావ మెఱిఁగి యక్బ రిటుచేసె; హేతు వ♦న్యంబు గలదె!

§ సీ॥ తనకెదురుండరా ♦ దను దీక్ష కకట! దుర్గావతితోడి సం ♦ గరము సాక్షి!
చాందేలు వంశాబ్ధి ♦ కిందిరాసతి! మహోబా గన్న పుణ్యాసం ♦ పన్నమూర్తి!
యామహాజనని రా ♦ జ్యము సంపదలతోడ వేదనాదముతోడ ♦ విద్యతోడ
వ్యాపారములతోడ ♦ వస్తువ్రజముతోడ నానందసదనమై ♦ యతిశయిల్లె!

గీ॥ రాజ్యతృష్ణాభరైకకా ♦ రణముగాక తోడరి చంపంగ నేటి కా ♦ దొడ్డతల్లి!
జగము కటకటపడె; స్వదే ♦ శప్రభువులమైన మాకెల్లఁ దలవంపు ♦ లై దనర్చె.

సీ॥ అఖిల ప్రజా హృద ♦ యక్షేత్రముల సత్య ధర్మబీజములుంచు ♦ ధన్యచరిత!
యాబాజబహదూ ర్మ ♦ యానాపతుల గెల్చి పరిభూతి యెఱుఁగని ♦ బలిమికత్తె!
పల్లెలపైఁ బులి ♦ పడెనన్నఁ జని చంపుదాఁక నుపవసించు ♦ ధర్మమూర్తి!
వివిధ వర్ణాశ్రమ ♦ విధులు తూచా తప్పకయె ప్రతిష్ఠించిన ♦ గౌరవాఢ్య!

గీ॥ యట్టి క్షాత్రతపస్విని ♦ నరులుదాఁక ♦ బ్రాణముల నియ్యలేక భా ♦ రతమహీశు
లంగనలకన్న దుర్బలు ♦ లైరటంచు దేశదేశముల్ తిట్టు ద ♦ స్థితులు వచ్చె. 269

సీ॥ సిరి పుట్టినిల్లు ఘూ ♦ ర్జరదేశమును దవానలమొకో యన క్షామ ♦ మలముకొనియె;
మ్రింగ మెతుకులేక ♦ మేదినీప్రజ తినరానిజంతుల శరీ ♦ రములు దినియు
నాకలి చల్లార ♦ కట్టె కుప్పలు కుప్పలై కూలెఁ; దక్కు-వా ♦ రా శనములఁ
గాకులు గ్రద్దల ♦ కరణిఁ బైబడి పీకి తినఁజొచ్చి; రక్బరు ♦ దిగ్విజయము

---

§ That country was then governed by a gallant lady Rani Durgavati who, fifteen years previously had become regent for her minor son. She proved herself worthy of her noble ancestry and governed her adopted country with courage and capacity doing great things by dint of her far seeing abilities. It was her custom that when she heard that a tiger had made his appearance, she did not drink water until she had shot him. She carried out many useful public works in different parts of the kingdom and deservedly won the hearts of her people. Her name is still remembered and revered. Akbar's attack on a princess of a charactor so noble was mere aggression wholly unprovoked and devoid of all justification other than the lust of conquest and plunder.

"Akbar the great Mogul"

⊛ గీ॥ చల్లఁగా సాగ వంగదే ♦ శమునసుండెఁ! గాని త్రుటిమైనఁ జింతించు ♦ కరణి లేదు!
జగము సర్వంబు గెలిచిన ♦ సౌఖ్యమేమి! ప్రజ కెరుకలేక పాలింప♦వలయుఁగాదె!

§ మ॥ పదిపండ్రెండు వసంతముల్ గడచిపో ♦ వ లేదె సన్న్యాసులన్
గదనంబున్ బురికొల్పి యందు నొకప ♦ క్షంబూని తా నందఱన్
దుదముట్టించి ధనేశ్వరంబునను గ ♦ న్నుల్ చల్లఁగాఁ జూచుచున్
మదిమోదింపఁడె; దొడ్డవారి కుచితం ♦ బా! యిట్టి హింసారతుల్!. 271

మ॥ ఘనదుర్గంబులు వాహినీతతులు భా ♦ గ్యశ్రేణులన్ బట్టి యె
ప్డును దేశోన్నతి నెన్నరాదు; గుణసం ♦ పూర్ణత్వమున్ నిగ్రహం
బును ధర్మాచరణంబు సత్యము యశం ♦ బున్ ద్యాగమున్ గల్గు న
య్యనఘస్వాంతుల సంఖ్యఁ బట్టి యెపుడా ♦ యౌన్నత్య మేపారెడున్. 272

క॥ తనతల్లియుఁ దనదేశము తనకా స్వర్గమునకన్నఁ ♦ దత లక్ష్మీవ
ర్ధనములు పూజ్యతమంబులు నను నిది సత్యమును సహజ ♦ మై పొలుపొందున్. 273

సీ॥ అచలవృత్తి వహింతు ♦ నాధర్మమూని! లోకము పుట్టినాది యీ ♦ క్షణముదాఁక
మాభానువంశంబు ♦ మానవమాత్రున కెవనికిఁ దలయొగ్గి ♦ యెఱుఁగ దెప్డు!
దస్వతంత్రము మేరు ♦ వైన లక్ష్యము చేయ! స్వేచ్ఛ జీవింప నూ ♦ హింతుగాని!
యక్బరు తనరాజ్య ♦ మంత యిచ్చెదనన్న నదియేల! క్రీఁగంట ♦ నైనఁ జూడ!

---

⊛ The ruling passion of Akbar was ambition. His whole reign was dedicated to conquest. His aggressions made without the slightest regard to moral calculations were not determined in any instance by desire to better the condition of the people attached. In reality, a more aggressive king never existed. His attacks on Gondwana, Kashmir, Sind were aimed avowedly at destroying the independence of every state on his borders and of securing the material gains of conquest. We may be tolerably certain that the people of Gondwana were happier under Rani Durgavati than they were under Asaf Khan.

"Akbar the great Mogul."

§ It is disappointing to find that a man like Akbar could encourage such sanguinary spirit and even wantonly sacrifice the lives of his own soldiers who had no interest in the quarrel. In his youth he certainly had no qualms of conscience about bloodshed. The story does not stand alone as a proof that the ferocity of his Turk and Mogul ancestors was an essential element in the character of Akbar, kept under control as a rule, but occasionally given free play.

"Akbar the great Mogul."

గీ॥ వల్కలముఁ గట్టి స్వాతంత్ర్య♦వైభవమున నిట్లు సన్న్యాసినై యున్న ♦ నిదియె చాలు!
నాకు భోగభాగ్యముల కెం ♦ తయును దూర! మాస విడిచిన వానికా♦యాసమున్నె!

సీ॥ అఖిలభోగములున్న ♦ నాత్మతృప్తియు లేక దారిద్ర్యజలధి నా ♦ తఁడు మునుంగు!
నేసంపదయు లేక ♦ యే స్వతంత్రతనుండి యీశ్వరుకృప గడి ♦ యింప నేర్తు!
గౌరవమునకు భం ♦ గము దెచ్చు నక్బరుతో సంధి నాకు సం ♦ తోష మిడదు!
మేమిర్వురము దూర ♦ మై మనుటయె శ్రేయ! మిది దైవసంకల్ప! ♦ మింతమాత్రి

గీ॥ భారతావని క్షిత్రి లో ♦ పమును రాదు! కాలచక్రము తిరిగెనా ♦ కలిమి తిరుగుఁ;
దిరుగదా యుండనిమ్ము! సా ♦ ధింపరాని పనికి వగపేల! యాయాస ♦ పడఁగ నేల!

శా॥ ఆకాపట్యము! లాదరస్మితము! లా ♦ గాఢాదార్య! మావియ్య! మా
మోకాల్ మ్రొక్కులు! నాచమావిభవ! మా ♦ ముప్పొద్దు సేవించుటల్!
నాకెట్లైఁ దలపొప్పి పట్టణముల ♦ న్నన్; మీకు నెట్లుండునో!
నా కే కొండలు కోటలై సౌఖ్యమిడు శాం ♦ తస్థానముల్ లేవు పో! 276

శా॥ ఈసర్వంసహ నెల్లఁ గోల్పడక పో ♦ నీ నా కటం చెప్పుడున్
గాసిం బొందఁ; భోగసక్తిపై మదినిడన్; ♦ గష్టంబు లెక్కింపఁ; బే
రాసన్ ద్రవ్యముఁ గోర; నిట్టి తృణశ ♦ య్యల్ పర్ణశాలల్ సుధ
ర్మాసింహాసనశైలయంత్రముల మే ♦ రన్ జూచి యుప్పొంగెదన్." 277

గీ॥ అనుచుఁ దనమాట మోయుని ♦ యమిని జేసి మో మొకింత వివర్ణతఁ ♦ బొందుచుండ
నెట్లో సవరించుకొని ప్రతా ♦ పేంద్రుఁ జూచి మానసింహుఁడు కార్యంబు ♦ మఱువలేక,

సీ॥ "క్షాత్రంగా నేఁడు ♦ కొనఁగ నేమిటికి! నీ యెఱుఁగని ధర్మంబు ♦ లెందు లేవు!
మేవాడరాజ్యల ♦ క్ష్మీదేవి నొక్కొక్క కను నైచియుండు న ♦ క్బరునృపాలుఁ!
డెప్పుడు రేఁగునో ♦ యేమి సవచ్చునో! యెట్లు చేయునో! యెవ్వ ♦ రెఱుఁగఁగలరు!
పట్టుపట్టినయేని ♦ వానిచలంబును పౌరుష మింతని ♦ పలుక వశమె!

గీ॥ లేడిపయి దూఁకు సింగంబు ♦ జాడవచ్చు! నెంత విక్రమోన్నతియున్న ♦ నేమి ఫలము!
వాని పౌరుషధాటి కో ♦ ర్వంగలేక బాధ పడెదవు; బలవద్వి ♦ రోధ మేల! 279

చ॥ పెరనృపులెల్ల లోఁబడెడు ♦ వేళలఁ గొన్ని నిబంధనంబు ల
క్బరు విధియించుచుండుట జ ♦ గంబెఱుఁగున్ గద! నైన నిన్ను నా
తెఱఁగునఁ బొమ్మనన్ గలఁడె! ♦ దేవునియిల్లు మఱొక్కచోటు నే
నెఱిఁగెదను! మొల్లకాల్యముల ♦ నే సమకూర్చెద నీకుఁ దృప్తిగన్. 280

సీ॥ నీకన్నియల వాదు ♦ షా కిచ్చుటయులేక! జుట్టుప న్నెన్నఁడు ♦ గట్టకుండఁ!
బనిమీఁద సింధువా ♦ హిని దాటుటయులేక! యాస్థానమున కెప్పు ♦ డరుగకుండ!
జాతియు మతము లే ♦ శము వీడుటయులేక! సేనాధిపత్యంబు ♦ చెందకుండ!
మోఁకాలిపై వ్రాలి ♦ మ్రొక్కి నిల్చుటలేక గుఱ్ఱంబులను దెచ్చు ♦ కొనకయుండ!
గీ॥ వత్సరారంభపు నవరా ♦ త్ర్యుత్సవముల సంతలకు రాణివాసమ్ము ♦ చనుటలేక!
కడుపులోఁ జల్ల యిటునటు ♦ గదలకుండ! సమత దైవార మీకు నే ♦ సంధిఁగూర్తు.
సీ॥ నీకగౌరవమైన ♦ నాకైనయట్లె! నీదివ్యచిత్తము సుఖ ♦ స్థితిని నుంచు!
మీపర్ణశాలలో ♦ నేకాంతముగనుండు! మిచటికి నోరులెవ్వ ♦ రెఱుఁగకుండ
మెలమెల్లఁ జీకటుల్ ♦ మొలుచువేళకుఁ దెత్తు! నక్బరుచెవిని ర ♦ హస్యముగను
"సరియె పొమ్మ"ను! మొక్క ♦ క్షణమున నాతని నేను గొంపోయి ఢి ♦ ల్లీని జేర్తు!
గీ॥ నుదయపురినేలుకొనుము! చిత్తూరుపురము బాగుపఱుపంగఁ బట్టు ద్ర ♦ వ్యంబుఁదెత్తుఁ!
గొదువ యనిపించినను మాళ్వ ♦ ఘూర్జరములు తీసికొన నాజ్ఞ నెత్తిపై ♦ మోసి తెత్తు.
సీ॥ ముప్పదిమూఁడు రా ♦ ణ్మఖ్యవంశములు పాదములు గొల్చెడు గురు ♦ స్థానమీవు!
నీపాదపాంసుల ♦ నిరత మాఁదలఁ దాల్చు నేను నీయున్నతి ♦ నెగ్గఁజేతు!
సంధి సంగరములే ♦ శరణమై కనుపించు; సంధిఁ ద్రోసినను ని ♦ శ్చయము రణము!
ప్రస్తుతస్థితుల న ♦ క్బరువీడి నినుజేరి దుర మొనర్చుట నాకు ♦ దుర్లభ మగు!
గీ॥ నతఁడు విడఁ డీవు లోఁబడ ♦ వంతమేది! మకర గజరాజముల పోరు ♦ మాడ్కి సాగుఁ!
బుష్పవనమట్టి భారత ♦ భూమియెల్ల నగ్గి పెట్టితిరంచు దు ♦ ర్యశము గలుగు. 283
ఉ॥ భూరమణేంద్రులందఱును ♦ బోయిన మార్గమె యోగ్య! మింతకున్
వేఱగు త్రోవలేదు; పృథి ♦ వీ గల సర్వము వెంటఁగొంచు నీ
యే ఱిటు పాఱఁజొచ్చె నెదు ♦ రీద నెవండు సమర్థుఁడో; వృథా
పౌరుషమున్నదంచు బడ ♦ బాజ్వలనంబును బాఱ ప్రమింగదే" 284
క॥ అన ముసిముసి నగవులు మోమునకుం జెంగావిరంగు ♦ మొనయింపఁ బ్రతా
పనృపతి యంబర్పతి యాననముదెసను గాంచి "ముగిసె ♦ నా! నీమాటల్. 235
సీ॥ కోమటి యొకచిల్కఁ ♦ గొని కొన్నియేండ్లకుఁ బంజరంబును గొంచు ♦ వనికిఁ బోయె!
నడవిచిలుక "చుట్ట ♦ మా: బందెగొనిరె! స్వాతంత్ర్యమ్ము చెడె! నెట్లొ ♦ తప్పుకొనుచు
నేగుదె"మ్మనె! స్వేచ్ఛ ♦ యెఱుఁగని తొలిచిల్క "గాలిలో నెట్టులు ♦ తేలుచుంటి!
క్రిందఁ బడవె! యేమి ♦ తిందువీ యడవి! నెవ్వరు సాకెదరు! శత్రు ♦ భయము లేదె!

గీ॥ పంజరమునఁ జోటిత్తు! నా ♦ పజ్జనుండు! కోమటెయుఁ దియ్యమామిడి ♦ గుజ్జుపెట్టుఁ!
బిల్లి కరువదు! పామును ♦ బీక దిచట; భయములేక కాలముఁ గడ్ప ♦ వచ్చు"ననియె.

సీ॥ ఆది సెల్యూకసుం ♦ డరుదెంచినపుడు సర్వబలంబు లుండె భా ♦ రతధరిత్రి!
కాచంద్రగుప్తుఁ డా ♦ హవమందుఁ దాఁకి వానిని మూఁడుచెఱువుల ♦ నీళ్లుదాపె!
నాపిమ్మట నరబ్బు ♦ లరుదెంచి! రప్పుడు దార్ఢ్యతేజము కొంత ♦ తగ్గి పోయె!
నవలఁ బఠానులు ♦ యవనులు వచ్చి! రయ్యెడ దేశవీర్య మె ♦ క్కుడుగఁజెడియె:

గీ॥ నిపుడు భారతలక్ష్మి తా ♦ నెట్టు లుండెఁ! గోట్లకొలఁదిగ జనులెల్ల ♦ గూడులేక
పరమదారిద్ర్యజలధి ము ♦ న్గిరి; కనుఁగొను మినుపసంకెలల్ మనకాళ్ల ♦ కెక్కియుండె!

సీ॥ పదివేల పల్లెలు ♦ పాడుగాఁ బడియుండె; రాష్ట్రమంతయు మహా ♦ రణ్య మయ్యె;
నొకకాని ధనమేని ♦ నొకచిట్టి ధాన్యమేఁ గరగతమా నట్టి ♦ వెరవు లేదు;
పడమటికొండల ♦ బ్రహ్మరాక్షసులమాడ్కి బీదలమగుచు జీ ♦ వితముఁ దీర్తు;
మిట్టిదేశముపైన ♦ నీపట్టుదలయేల! మము గెల్చి యేమి లా ♦ భము వచింపు!

గీ॥ పరుల కావంత కీడొన ♦ ర్పంగలేని హరిణశాబము హింసించు ♦ నతఁడు రెండు
కొమ్ములును జర్మమును గాక ♦ కోట్ల కట్టె పడగలెత్తెడు భాగ్యంబుఁ ♦ బడయఁగలఁడె.

సీ॥ స్వాతంత్ర్యలక్ష్మి వి ♦ శాల సేవలకు జీవితమును నేఁదీసి ♦ పెట్టినాఁడ;
బ్రహ్మాండమంత వి ♦ పత్తు వచ్చిన నోర్తు; నించుకయేని జం ♦ కించఁబోను;
మఱినెందుఁగాని ని ♦ ర్మాణమ్మునకు ముందు విధ్వంసనము ముఖ్య ♦ విధిగనుండుఁ;
బరతంత్రగతి నొందు ♦ వైభవంబునకన్న స్వాతంత్ర్యమున వచ్చు ♦ చావు మేలు;

గీ॥ మాశిశోదియా వంశ సం ♦ భవులు బ్రదికి స్వేచ్ఛమై నుండవలె; లేని ♦ యెడలఁ జచ్చి
స్వర్గముననైన నుండఁగా ♦ వలయుఁ; గాని మధ్య వేఱొండు మార్గంబు ♦ మాకు లేదు.

సీ॥ ఆర్త రక్షణము చే ♦ యఁగఁబూని మేని కండలు చెండియిచ్చు వి ♦ జ్ఞాననిధులు!
సత్యంబుకొఱకు యో ♦ షాపుత్రకుల నమ్మి మాలనిఁ గొలిచిన ♦ మానధనులు!
పితరులకై పూని ♦ క్షితియెల్ల మేల్కొంద స్వర్గంగఁ దెచ్చు దీ ♦ క్షానిరతులు!
జనకాజ్ఞకై పెక్కు ♦ సంవత్సరము లరణ్యములఁ గష్టములొందు ♦ విమలయశులు!

గీ॥ భానుకులమునెకాక స ♦ ర్వప్రపంచమును యశశ్చంద్రికలఁ బూత ♦ పూయఁగలిగి!
రట్టి పూర్వుల దొడ్డపే ♦ రగ్గిఁ గలుప నోర్తునే! ప్రాణములు వీడ ♦ నేర్తుఁగాక. 290

సీ॥ మానసింహా! యభి ♦ మానసింహుఁడవుగా కగుదని యిట్లాడఁ ♦ దగునె నీకు!
నుర్వి యెప్పుడు పుట్టె ♦ నో యప్డె మాభానువంశంబు పరిభవించి ♦ వాసిఁగాంచె!

నెన్నియుగంబులో! ♦ యెన్నియుద్ధంబులో! యిందాఁక దలవంప ♦ కెత్తి నిలిచె!
మావంశనృపతుల ♦ మహిమ నూహించి నే బరవశత్వమున నై ♦ మఱచుచుందు!

❁ గీ॥ నట్టి విశ్వోన్నతంబైన ♦ యన్వయమున కకట! యేనీచుఁడైన దు♦ర్యశముఁగూర్పఁ
బూనినను బ్రాణములతోడఁ♦బోవఁగలఁడె! ప్రక్కలై శీర్ష మది నేల♦వ్రాలుఁగాక.

సీ॥ అప్రతిహతముగా ♦ నక్బరొక్కఁడె యేల క్షితిని దేవుఁడు సృష్టి ♦ సేయలేడు;
వితత ప్రజాకోటి ♦ యతనిచేఁ దునుమాడఁబడుటకై పుట్టింపఁ ♦ బడఁగలేదు;
సకలభూపాల క ♦ న్యక లాఘునుని భోగపరత కుద్దేశింపఁ ♦ బడఁగలేదు;
ధరణీశులెల్ల నా ♦ తనిఁజేరి కొలిచి పాదము లొత్తఁ బుట్టువం ♦ దంగలేదు;

గీ॥ తనయొకనిరాజ్యతృష్ణకై ♦ ధరణిఁగలుగు ప్రజయు స్వాతంత్ర్యమును బాసి♦పారతంత్ర్య
మున మునుఁగుటెల్లఁ బాడిగా ♦ దనుచు నక్బరెంత యెఱిఁగిన జగమున ♦ కంత మేలు.

మ॥ "అకటా! కష్టము! నాకుఁ దోడుపడుమీ;" ♦ యం చొక్కనిన్ వేఁడు పా
తక మే నేరను; మీఁదుమిక్కిలి భవ ♦ త్సాహాయ్యమున్ నాదు కు
త్తుకయున్ బోయెడు నప్పుడైన నడుగన్; ♦ దోర్దర్పుఁ డారుష్కు నిం
టికి ని న్నిల్లటపల్లుగా విడిచి, పా ♦ డిన్ దప్పి వర్తింతునే! 293

సీ॥ తెఱవ లఖుండ పా ♦ తివ్రిత్యబలమున జ్వలదగ్నిశిఖల శే ♦ వను రహింత్రు!
పురుషులు వీరధ ♦ ర్మరసావతారులై వితత ఘోర శతఘ్ని ♦ పిండములటు
లొక్కొక్క రొకదుర్గ ♦ మోయన నుందురు; వైరుల దృష్టి మే ♦ వాడసీమ
చిన్నదై కానుపిం ♦ చినను దుర్భేదమా; దేశ నైసర్గిక ♦ స్థితులఁబట్టి

---

❁ From the most remote periods we can trace nothing ignoble nor any vestige of vassal origin. Reduced in power and circumscribed in territory, compelled to yield much of their splendour, and many of the dignities of birth they have not abandoned an iota of pride and high bearing arising from a knowledge of their illustrious and regal descent. On this principle, the various revelutions in the Rana's family never encroached and the mighty Jahangir himself the Emperor of the Moguls, became like, Caesar, the commentator on the history of the tribe of Sesodia. The potentate of the twenty two satraphies of Hind, dwells with proud complacency on this Rajput King, having made terms with him. He praises heaven that what his immortal ancester Baber, the founder of the Mogul dynasty failed to do, the project in which Humayun had also failed and in which the illustrious Akber his father had but partial success, was reserved for him. It is pleasing to peruse in the commentaries of these conquerors Baber and Jahangir their sentiments with regard to these princes. "Annals of Mewar."

గీ॥ యెంతమేరయు గెలిచిన ♦ నంతె కాని! యంగుళంబైన ముందున ♦ కరుగు టరిది!
శతశతాబ్దముల్ యుద్ధముల్ ♦ జరిపియైన నక్బ రఖిలంబుఁ గొనుట సా♦ధ్యంబె కాదు.

మ॥ నను నారాజ్యము దూరముంచి తనస ♦ న్నాహంబు లెచ్చోటనై
నను సాగించిన నాకునేమనుచు మా ♦ నంబూనఁగావచ్చు; నా
ఘనుఁడున్ నాడెసఁ జిన్నిత్రైలోకుఁడు ని ♦ శ్చల్ బెట్టినన్ మాటలన్
బని యేమున్నది! దేశమున్ బ్రళయమొం ♦ దన్ జేతు నిశ్చంబుగన్. 295

క॥ విమతుల ఖడ్గము హృదయాబ్జముఁ జొచ్చునుగాక యచటి ♦ స్వాతంత్ర్యపు బీ
జముఁ జంపుట మాత్ర మసాధ్యము; నెఱవేఱదు జగంబు ♦ తల క్రిందైనన్. 296

మ॥ పుడిసెండూపిరి మేన నున్నవఱకున్ ♦ బోరాడి యీత్రోవనే
నడతున్; గాదని యాకసం బురలుచున్ ♦ నాశక్తికిన్ మీఱున
ప్పుడు ఢిల్లీపురిఁజేరి యక్బరు సభా ♦ భూమిన్ బ్రవేశించి కే
ల్మొనతున్ బొమ్మిక; నంతదాఁకను విసన్ ♦ బో నేరి సందేశమున్." 267

గీ॥ అనుచు గంభీరముద్రయా ♦ స్యమునఁ దొలకరింపఁగానుండె నంతలోఁ♦గృష్ణసింహుఁ
డాత్మభావ మించుక తెలి ♦ యంగఁజేయ మానసింహుని వదనప ♦ ద్మమును గాంచి.

—*) సలుంబ్రా కృష్ణసింహుఁడు మానసింహు నధిక్షేపించుట. (*—

సీ॥ "సాటిరాజుల భుజా ♦ శౌర్యవంతుఁడవు! ధైర్యబలంబు సాహసం ♦ బలరు ప్రోడ!
వఖిలదేశమ్ము దా ♦ స్యాంధకారమ్మునఁ బడి దుర్గతుల మున్గి ♦ చెడెడువేళ
భుజమిచ్చి లేపక ♦ మొగలురాజులఁ జేరి సేవించుచుంటకై ♦ సిగ్గుపడక
తగుదు ననుచు వచ్చి ♦ ధర్మదేవతవంటి యిమ్మహాప్రభు సము ♦ ఖమ్మునందుఁ

గీ॥ బికికిముందు పోయఁగ నిట్లు ♦ పెనఁగుచుంటి వీర! యిన్నాళ్లు బ్రదికి నీ ♦ నీరసోక్తు
లాలకింపఁగనయ్యెఁగా ♦ యనుచుఁ జింత హెచ్చె! నేమందు! నీభాగ్య ♦ మిట్టులుండె.

సీ॥ నవ నిబంధనముల ♦ నవలనుంచుదువంట; చీఁకటిలో సంధి ♦ చేతువంట;
యక్బరుచెవి నేమొ ♦ యూడఁగావలెనంట; యెవరిని బ్రదికింప ♦ నిన్నిపాట్లు!
టాటోటువిద్దెలు ♦ బూటకం బీమహావిభుఁ డొప్పుననియె భా ♦ వించినావె!
మాయ యెఱుంగని ♦ మహనీయులకు రహస్యములతో నెపుడైన ♦ నవసరంబె!

గీ॥ కనులు కర్ణంబు లొకవేయు♦గలిగి జగము నిండియుండెడు దేవుండు♦నిజ మెఱుఁగఁడె!
ధర్మతత్త్వైకమూర్తి ప్ర ♦ తాపుఁడేడ! జగముల్నయు రోయు నీ ♦ సంధియేడ! 300

§ గీ॥ యవనుల పదంబుఁ గొలిచి వి♦య్యంబు వలచి కుశమహారాజు కులకీర్తి♦గంటఁగలిపి
చెడుపవచ్చితె మమ్మ! దాఁ♦జెడ్డ కోతి వనము నంతయుఁ జెఱుచునట్లు♦భంగిదోఁప.

కం॥ ఉరగమును వృశ్చికమ్మును గరళక్రూరగములు; పాము ♦ కన్నను మేలం
దురు తేలు; నిన్నుఁగన నక్బరు మేలనవచ్చు స్వకుల ♦ వర్ధనుఁడౌటన్. 302

శా॥ పావిత్ర్యంబున కాటపట్టు! పరిశు ♦ భ్రంబైన సత్కీర్తికిన్
దా! వాసత్యము నూఁతకోల! యగు నీ ♦ ధర్మాత్ముతో నూఱులున్
వేవే లక్బరులైనఁ దూఁగుదురొకో! ♦ నీకేటి కీ వెఱ్ఱి! కా
శీవిశ్వేశ్వరుఁ డొక్కఁడే సవతుగాఁ ♦ జెప్పంగఁబోలున్ జుమీ! 302

మ॥ లవమున్ నీదగుబోధ మొప్పఁడన నే ♦ లా! యేకలింగేశుఁ డీ
య్యవనీచక్ర సమగ్ర రాజ్యమును నీ ♦ కర్పింతు నన్గూర్చి యు
య్యవనాధీశ్వరు మైత్రిచేయుమనఁగా ♦ నౌనం చనన్ బోఁడు; మా
నవుఁడీ ధైర్యసురాద్రి పట్టుదల మా ♦ న్పన్ నేర్చునే యెవ్వఁడున్. 304

మ॥ సకలస్థావర జంగమాత్మక మహీ ♦ చక్రంబునన్ సత్యధ
ర్మకళల్ నించు ప్రతాపసింహవిభుఁ! డీ ♦ రాజర్షి కాలుంచు పా
దుకలున్ మోయఁగ యోగ్యతల్ మనకు నెం ♦ దున్ గల్గునే! యట్టివా
నికి ధర్మంబులు నేర్పఁజాలుదుమొకో! ♦ నీవున్ మఱిన్ నేనునున్. 305

చ॥ కరఁగిన లక్కపైన వదు ♦ కన్గల ముద్రికవోలె మాకుసం
దఱకు మనోంబుజంబులఁ బ్ర ♦ తాపుఁడు తాండవమాడు; నీతఁడొ
క్కరుఁడని యెంచెనేమొకొ యె ♦ గల్పతి; యిర్వదిరెండువేల యు
ద్ధురబలులుండు మించుకయుఁ ♦ దొట్రిలఁబోని శతఘ్నులున్ బలెన్. 306

మ॥ కరముద్రేకముతోఁ దరంగతతు లా ♦ కాశంబునన్ సోఁక సా
గరమధ్యంబున శీర్షమెత్తి లవమున్ ♦ గంపింపఁగాఁబోని దు
ర్భర భీతిప్రద గండశైలమువలెన్ ♦ రాణాప్రతాపేంద్రుఁ డ
క్బరు సేనాంబుధి చుట్టినప్డు నిలువం ♦ గానేర్చు శౌర్యోగ్రుఁడై. 307

§ From Kush descend the Cutchwaha princes of Nirwar and Amber, and their numerous clans. Amber, though the first in power is but a scion of Nirwar transplanted about one thousand years back, whose chief, the representative of the celebrated Prince Nala, enjoys but a sorry district of all his ancient possessions.

"The Rajput tribes."

మ॥ ధరణిన్ గల్గిన రాజులందఱు బలా ♦ ద్ధత్యప్రభారేఖ న
క్బరు మన్నాథుఁడటందు; వీశ్వరకటా ♦ క్షుంబున్న నాస్వామి యొ
క్కరుఁ డవ్వానినిఁ బట్టి గావుగొను; భూ ♦ కంపంబు దుర్వారభూ
ధరముల్ ఱెప్పయు మూయులోపలనె పా ♦ తాళంబునన్ డింపదే! 308

మ॥ ఘనుఁ డయ్యక్బరు మాట యేమిటికి; న ♦ క్బర్ వానిసేనల్ స్వదే
శనృపాలుర్ మఱి భారతక్షితియు వి ♦ శ్వంబెల్ల బైనెత్తివ
చ్చినఁ దానొక్కఁడటంచుఁ గొంచమయినన్ ♦ జింతింపఁ! డువ్వెత్తుగాఁ
గొని జృంభించి రసాతలంబునకుఁ ను ♦ గ్గున్నూకఁగాఁ ద్రొక్కెడున్. 309

మ॥ కనులన్ మూసియు నూఱకుండినను మే ♦ ల్లర్గున్! బ్రతాపప్రభం
జనుఁడున్ రేఁగిన సర్వవస్తుతతులున్ ♦ శైలంబులున్ భారతా
వనియున్ సప్తసముద్రముల్ చెదిరి స ♦ ర్వం బేకమై చూర్ణమై
చను; నీయక్బరు నెచ్చటన్ వెదకెదో ♦ సందేహ! మామీఁదటన్. 310

మ॥ రవి యస్తాద్రిని మొల్చుఁగా! కఖిల పా ♦ రావారముల్ కుంగుఁగా!
కవనీచక్రము వ్రీలుఁగాక! చెడుఁగా ♦ కాకాశ! మయ్యుగ్రభై
రవుఁడై విశ్వముఁ గాల్చుఁగాని! లవమున్ ♦ రాణాప్రతాపుండు గౌ
రవమున్ గోల్పడి మర్త్యమాత్రునకు శి ♦ క్షం బొగ్గఁ డెప్పట్టునన్! 311

గీ॥ పెద్ద పిన్న మర్యాదల ♦ విధము లెఱుఁగు టభ్యుదయము గోరెడు వాని♦కత్యవసర!
మట్టి తొందరపడకు”మ ♦ టంచుఁ దెలిపి యాప్రతాపాధినాథు నా♦స్యంబుఁ జూచి,

సీ॥ “వసుమతీదేవి కీ ♦ శ్వరుఁడిచ్చు మణిభూషలగుచుఁ బుష్పము లుండు ♦ నంతదాఁక!
తృణమైన విడక జ ♦ గత్ప్రాణుఁడును జగత్ప్రాణమగుచు నుండు ♦ నంతదాఁక!
నమరసన్నుతము స ♦ త్యంబు చిరస్థాయియై లోకమున నుండు ♦ నంతదాఁక!
స్వాతంత్ర్యధర్మ శ ♦ బ్దము ధీరహృదయాభ్రమందు మ్రోయుచునుండు ♦ నంతదాఁక!

గీ॥ నో ప్రభూ! నీమహార్ఘగు ♦ ణోజ్జ్వలతయు భావపరిశుభ్రతయు సత్య ♦ వైభవంబు
ధర్మసంత్రాణకీర్తి యీ ♦ ధరణి నిండి యారవి సుధాకరం బౌచు ♦ నలరుఁగాక.” 313

గీ॥ అని పలుకునంత నొక్కసే ♦ నాధినాథుఁ డరుగుదెంచి “జగద్గురూ! ♦ యారగింప
వేళ యయ్యె” నటంచని ♦ విన్నవించి నిలువ నందఱు లేచి లో ♦ పలికిఁ జనిరి. 314

మ॥ అటఁ జుట్టున్ గల తావులందుఁ బదివే ♦ లాకుల్ దగన్ వేయఁగా
భటులెల్లన్ వడిఁ జేరి; రొంటొక యెడన్ ♦ బ్రత్యేకమర్యాదఁ గొ

న్నిటిని వేయుచుఁ గూడుఁగూరలును పా ♦ నీయంబు వడ్డించి; ర
తటఁ గూర్చుండిరి మానసింహుఁడును జెం ♦ తన్ వానిసైన్యప్రభుల్. 315

సీ॥ అచటికప్డు ప్రతాపు ♦ నాత్మజుఁ డమరసింహుఁడు వచ్చి మానసిం ♦ హునిఁ గనుఁగొని
"ప్రొద్దయ్యె; భోజనం ♦ బునకుఁ గూర్చుండుఁడు పరిషేచనం బొన ♦ ర్పంగఁ దొడఁగుఁ"
డన నంబరేశ్వరుం ♦ డమరసింహునిఁ జూచి లోకగురుం డింక ♦ రాక పోయె"
ననుఁడు, వా రారోగ్య ♦ మనువుగా లేమి నన్ బనిచిరి మీకు స ♦ పర్య సేయ"
గీ॥ ననిన మానసింహుఁడు ముఖ ♦ మట్టె యెత్తి "యతిథినై యున్న నాకు మీ ♦ యయ్యగారు
స్వయముగా వచ్చి పంక్తిభో ♦ జనము పెట్టి ప్రియము దోఁపకాడఁగా గార ♦ వించుటొప్పు.

మ॥ తనమర్యాదకు నాయశంబునకు నిం ♦ దల్ దెచ్చెఁ! దా వచ్చి చెం
తను గూర్చుండకయున్న నొక్కెమెదురై ♦ నన్ దాఁక; నాపిమ్మటన్
బను లేలాగున సాగునో తెలియఁగా ♦ వచ్చున్ జుమీ! పోయి యా
యన రప్పింపుము! తప్పదో యమరసిం ♦ హా!" యంచు వాక్రుచ్చినన్; 317

సీ॥ అంతలోనఁ బ్రతాపుఁ ♦ డక్కడి కేతెంచి "యయ్యా! నీవెఱుఁగని ♦ యదియుఁ గలదె!
యవనులతోడ బాం ♦ ధవమూను వారల సరసఁ గూర్చుండి భో ♦ జనము సేయ
నని నియమమ్ము నా ♦ కగుట నీచెంత భుజింపలేమిని దద్ద ♦ చింత యొదవె!
నేనేమి చేయుదు! ♦ నీధర్మ మిట్లుండె; నియమంబు విడనాడ ♦ నేర నేను;
గీ॥ పంక్తిభోజన మది తప్ప ♦ వలయురీతిఁ గోటిమర్యాదలను గూర్తుఁ! ♦ గొదువ గలుగ
దయ్యా! భటులును నీవు విం ♦ దారగించి చల్లఁగాఁ బొందు దేవు మీ ♦ ఢిల్లిపురికి."

మ॥ అనుచున్ బల్కినఁ దోఁక ద్రొక్కిన భుజం ♦ గాధీశు మర్యాద బో
రన శృంగంబులు భంగమై చనిన గో ♦ రాజంబు చందంబునన్
గినుకన్ దాల్చుచు మానసింహుఁ "డరరే ♦ నీయున్నతిన్ బొంపుసే
యనె తౌరుష్కనరేంద్రబాంధవము చే ♦ యన్ గల్గె నాబోంట్లకున్. 319

ఉ॥ నేఁడును నక్బరీశ్వరుని ♦ నేను భరంపడి నిల్పకున్న న
వ్వాఁడు ప్రచండవారినిధి ♦ భంగములో యన సేన లంపి మే
వాడ రసాతలంబునకుఁ ♦ బంపుచు నిన్నును బట్టి తున్మియూ
టాడకపోయియుండఁ! డిపు ♦ డైనను గండము తప్పిపోయెనే! 320

మ॥ తలతో నీపదపద్మముల్ గొలువఁ జెం ♦ తన్ జేరు నన్నున్ మహా
బలదర్పోద్ధతుఁ బంక్తిబాహ్యుఁ డనుచున్ ♦ వాక్రుచ్చె! దిట్లైనచో

నిలువన్ నేర్చునొకో భుజద్వయిపయిన్ ♦ నీశిర్షమున్! గన్నులన్
దలకెక్కెన్ జుమీ! నీదు గర్వమును డిం ♦ దన్ జేతు నేకత్రుటిన్. 321

గీ॥ తెగియె నేఁటి కిరువ్వరను బం♦ధించియున్న స్వామిభృత్యధర్మము! లాహ♦వములు పెంచి
నిలువ నీడ లేకుండ గు ♦ ట్టలఁజరింపఁ జేయలేకున్న నను మాన♦సింహుఁడనకు."

సీ॥ అని కోపమునఁ బల్క ♦ నాప్రతాపమహీంద్రుఁ "డీ నిష్ఠురోక్తుల ♦ నేమి లాభ!
మున్న మాటాడిన ♦ నులుకు నొందెదవేల! యిట నీకుఁ బరిభవ ♦ మేమిగలిగె!
నేనయి నినుఁబిల్చి ♦ యిటుచేసియున్న లోపంబెల్ల నానత్తి ♦ పయిన నుండు!
నీవె వచ్చితివి! సం ♦ భావించి దర్శనం బిచ్చితి! భేదమిం ♦ తేని లేక

గీ॥ చేయఁదగిన మర్యాదలు ♦ చేసియుంటిఁ! బూర్వనియమానుసారము ♦ భోజనమును
విడిచితివి; వేఱుగతిని భా ♦ వించి కినుకఁజెంది యేమేమొ పలుకఁజొ ♦ చ్చితివి నీవు.

గీ॥ నేను గోపంబు నొందను! ♦ గాని మానసింహు రణమందు సంధించి ♦ చేయిచేయి
గలిపి బలము తూఁచుకొనంగఁ♦గలిగెనేని యదియ పదివేలటంచు స♦మ్మదముఁగాంతు"

మ॥ అని మందస్మితరోచులన్ నెఱపఁగా ♦ నయ్యంబరీశుండు "నీ
వనియున్నంతకు నాదునామము జపిం ♦ పన్ జేసి రే నిద్రయున్
దినమం దన్నము బుద్ధికిన్ లవము శాం ♦ తిన్ గల్గఁగానీక నే
బెనుకష్టంబులు పెంచి డీల్పఱచి నిన్ ♦ వెన్నంటి వేటాడెదన్." 325

మ॥ అని శేషాష్టివిధాన రోఁజుచు నమ ♦ ర్షావేశుఁడై యున్నదే
వుని ప్రీత్యర్థముగాఁగ నైదుమెదుకుల్ ♦ బోసేసి చేగడ్గి ప్రో
లనె నిల్చుండిన యాత్మసైనికుల నె ♦ ల్లన్ శీఘ్రమే లేచి రం
డని తా నానతి యిచ్చి వచ్చి జవనా ♦ శ్వారూఢుఁడయ్యెన్ వడిన్. 326

మ॥ పరమోల్లాస హృదంతరుండగు నలుం ♦ బ్రౌస్వామి "యోయంబరీ
శ్వర! నీమాట యటుండనీ; నగరిలో ♦ వర్తించు నీబావ న
శ్వరు నీవెంటనె తేవలెన్! మఱచిపో ♦ వన్ రా"దటంచాడ నం
దఱు నొక్కుమ్మడిఁ జప్పటల్ చఱచి రు ♦ త్సాహమ్ము దైవారఁగన్. 327

గీ॥ మండిపడి వెన్కచూచి యం♦బరువిభుండు "భవునికడ నున్న బసవన్న♦వలెఁ బ్రతాపుఁ
గొలిచి తలయూఁప మఱఁగిన ♦ పలుకుబంద! నిన్ను లక్ష్యపెట్టుదునె! నే♦నెన్నఁడైన.

క॥ కనుఁగొందువులే నీగతి" యనుచు నెలుంగెత్తి పలికి ♦ యాత్మీయదళం
బును గొంచు ఢిల్లిదెసకై చనె మదిఁ క్రౌర్యమ్ము నీసు ♦ నందడిగొనఁగన్. 329

మ॥ అవనీదేవులఁ బిల్వఁబంచుచును బు ♦ ణ్యాహమ్ము చేయించి గ్రామా
ల వెలుంగొందు నదీజలంబుల పచే ♦ లస్నానముల్ చేసి పూ
జ్యవిధానమ్మునఁ బంచగవ్యమును బ్రా ♦ యశ్చిత్తముం బొంది మ
క్కువమై నందఱు పోయి చేరుకొని రా ♦ 'కుంభల్మియర్' దుర్గముం. 330

గద్య:— ఇది శ్రీమత్కామేశ్వరీ కరుణా కటాక్ష వీక్షా సమాసాదిత రసవత్కావ్య
నిర్మాణ చాతురీధురీణ, సుగుణగణపారీణ, దుర్భాకవంశదుగ్ధాంభోరాశి
రాకాకైరవమిత్ర, శాలంకాయనగోత్ర పవిత్ర, సుజనజనాను
గ్రహపాత్ర, వెంకటరామార్యపుత్ర, కవిసింహాఽవధాని
పంచానన కావ్యకళానిధిత్యాది బిరుద విఖ్యాత, సుకవి
రాజశేఖర, రాజశేఖరకవి ప్రణీతంబయిన
"రాణాప్రతాపసింహ చరిత్రం" బ
ను పద్యకావ్యమునం
దుఁ ద్వితీయా
శ్వాస
ము

సంపూర్ణము.



శ్రీ

కామేశ్వర్యైనమః.

# రాణాప్రతాపసింహచరిత్ర.

## తృతీయాశ్వాసము.



మ॥ జలపూరం బడుగంటె కూపములు కా ♦ సారంబులున్ వీఁలి సం
దులఁ బాతాళము లోఁతు చూప; ధరయున్ ♦ దుర్వార ఘోరాగ్నిమం
డలమై మండుచుఁ బేలగింజవలెఁ బె ♦ ట్లన్ జంతుజాలంబు శో
షిల గ్రీష్మంబది నిప్పులన్ జెఱఁగి డా ♦ సెన్ సర్వమున్ గాల్చుచున్. 1

—*) అక్బరు సార్వభౌముఁడు మేవాడపైఁ దన సైన్యముల నంపుట. (*—

⊕ సీ॥ స్థిరవైరియముఁడనన్ ♦ జెల్లు తోడరమల్లు! రణమర్మము లెఱుంగు ♦ రాయసింగు! §
చండారి విపినాన ♦ లుండు వీరబలుండు! ప్రబలకీర్తినిదేలు ♦ రాయశీలుఁ!
డుల్లాసమతియు న ♦ బ్దుల్లాచమూపతి! పౌరుషంబూను షా ♦ బాజుఖానుఁ!
డభిమానసంధానుఁ ♦ డబ్దూరురహిమానుఁ! డసమశౌర్యనిధానుఁ ♦ డసఫుఖాను!
గీ॥ మఱియు ఖాసిముఖాన్ముఖుల్ ♦ మహితశౌర్య రేఖ ముల్లోకములఁ జప్ప ♦ రింపఁగలుగు
యవననరపాలవాళి. సై ♦ న్యాధినాథు లేకముఖమునఁ గదలి దం ♦ డెత్తిరపుడు.

మ॥ అరిసంత్రాసకరోగ్ర సత్వయుతమై ♦ హారావళీ పర్వతాం
తరమందున్ జెలరేఁగుచున్ జగమునం ♦ తన్ గాల్చు స్వీయాగ్రసో

---

⊕ Todar Mal was born in Oudh and after serving in subordinate offices received his first important commission by being entrusted with the Revenue assessment of Guzarat. He proved himself to be good and valiant soldier when serving in Bengal with old Muniam Khan and in 1577—1578 received his reward by being appointed as Vizier.

"Akbar the great Mogul"

§ Raja Rai Singh led a gallant band of his Rahtores in all the wars of Akbar, the emperor obtained for Prince Selim, Rai Singh's daughter for wife. The unfortunate Purvez was the fruit of the marriage.

"Annals of Rajasthan."

దర శౌర్యప్రబలాగ్ని నార్పఁగ మహా ♦ ధారాధరస్ఫూర్తి సా
గరసూక్తద్వితయంబు లేచెను దు ♦ రుష్క శ్రేణి మేల్మే లనఁ. 3

సీ॥ యువరాజమణి సలీ ♦ ముకమదించిన కొమ్ముటంబారియేన్గుపై ♦ నధివసించె!
❁ నతివిక్రమోద్భాసి ♦ యగు మానసింహుండు యవనదేశమహోన్న ♦ తాశ్వమెక్కె!
నతనితో నిర్వది ♦ మైదువే లాశ్వికుల్ గదలి! దుర్వార గడ ♦ గడ వడంకె!
నక్బరు సర్వసే ♦ నాధిపత్యముభార మంబరేశ్వరు శిర ♦ మందు మోపె!
గీ॥ జలనిధితరంగములఁబోలు ♦ సైన్యములును దత్తదధినాయకులుగూడి ♦ తరలిపోవ
ఢిల్లిపురి జనశూన్యమా ♦ శేపఁ దనరె! నరిగి యంద 'అంబరు'దాటి ♦ రతిరయమున. 4

గీ॥ మండలగృహంబను పురంబు ♦ దండఁ గనుమ కరిగి హారావళీ పర్వ ♦ తాంతరమున
లోయలఁబడి పయనంబు ♦ చేయసాగి రతిభయంకర విపిన మ ♦ ధ్యంబుఁ జొచ్చె. 5

—*) హాల్దీఘాటు కనుమ వర్ణనము. (*—

సీ॥ హారావళీపర్వ ♦ తాంత ముత్తరము 'కుంభల్మియర్,' దక్షిణ ♦ పార్శ్వమందు
రుక్ననాథమ్ము, తూ ♦ రుపు సతుల్లా, పశ్చిమము మేరుపురము, లీ ♦ మధ్యసీమఁ
బొడ వెనుబదిమైళ్లు ♦ వెడలు పెన్బదిమైళ్లు గలుగు హాల్దీఘాటు ♦ కనుమ తావు
పాషాణములతోఁ బ్ర ♦ పాత సంతతులతో లతలతో నిబిడ గు ♦ ల్మములతోడఁ
గీ॥ బొదలతో గండశిలలతో ♦ నదులతోడఁ గంటకమ్ములతోడ వృ ♦ క్షములతోడఁ
నీఁగకైనను జొరఁగ సం ♦ దీయనట్టి భీకరారణ్య శైల దు ♦ ర్భేద తలము. 6

---

❁ Raja Mann who had succeeded to the throne of Amber was the most celebrated of his race and from him may be dated the rise of his country. This prince exemplified the wisdom of the policy which Baber adopted to strengthen his conquest, that of connecting his family by ties of marriage with the Hindu. It has been already related that Humayun espoused a daughter of Bhagawandoss, consequently Raja Mann was brother-in-law to Akbar. His courage and talents well seconded this natural advantage and he became the most conspicuous of all the generals of the empire. To him, Akbar was indebted to half his triumphs. The Cutchwaha bard found a delightful theme in recounting his exploits from the snow-clad Cacasus to the shores of the golden Chersonese. Let the eye embrace these extremes of his conquests, Cabul and the Parapomisan of Alexander and Araccan on the Indian Ocean; the former reunited; the latter subjugated to the empire by a Rajput prince and a Rajput army.

" Annals of Mewar. "

సీ॥ కుండలీంద్రుఁడు చుట్టు ♦ కొని పండెనోయన వలగొనియున్న ప ♦ ర్వతపుఁబంక్తి!
నిలువుగా నఱికిన ♦ ట్టులు ప్రాకఁగా రాక చక్కఁగా నిలుచు పా ♦ షాణసమితి!
ప్రకృతి నైసర్గిక ♦ భంగిఁ బ్రోవుగనిడ్డ కొండపేటులమీఁది ♦ కోటగములు!
మలిచి కొలిచియుంచు ♦ మాదిరినై యేటవాలగు పర్వత ♦ పార్శ్వములును!
గీ॥ శకటములు రెండు సుళువుగాఁ ♦ జనుటకైన నను వొసఁగనట్టి యొకచిన్న ♦ కనుమగలిగి
§ యల సురాసురులకుఁ జొర ♦ నలవిగాని కఠినతలము 'హాల్డీఘాటు' ♦ కనుమ సీమ!
ఉ॥ ముందుగ మ్రోఁగు దుందుభుల ♦ మ్రోఁతలు నిల్పుచు సైన్యకోటి నం
దందును నిల్వఁజేయుచు ర ♦ యంబునఁ దా నొకచోటఁ జేరి య
య్యందఱ వాహినీపతుల ♦ నచ్చటఁ జేరిచి మంతనంబు చె
ల్వొందగ మానసింహవిభుఁ ♦ డాదర మేదుర చిత్త మేర్పడన్, 8

—*) మానసింహుఁ డనుచరులను హాల్డీఘాటుకనుమఁ జొర నియోగించుట. (*—

సీ॥ "ఇఁక దుర్గమము మార్గ; ♦ మీ మీఁదటి ప్రయాణ మతికష్టతరము; భ ♦ యాస్పదంబు;
గంటకుఁ దక్కువ ♦ గాఁ బ్రొద్దు నిలిచె; 'కుంభల్‌మియ' రిటకు ని ♦ ర్వదియుమైళ్లు
గలదు! హాల్డీఘాటు ♦ కనుమ కట్టెదురఁ గన్పడి మృత్యుముఖమట్లు ♦ భయముఁ గొలిపె!
మెలమెల్లఁ జీఁకటుల్ ♦ మొలుచువేళకునైనఁ గనుమ నెట్టులొ దాఁటి ♦ చనెదమేని
❁ గీ॥ యర్ధరాత్రము కుంభల్‌మి ♦ యరును జేరఁగలము! జయమొందఁగల! మటు ♦ గాకరిపులు
మనకుముందుగఁ గనుమ దూ ♦ రిననుఁ బిదప నంగుళంబైన ముందున ♦ కరుగు టరిది.

---

§ Pratap trusted to his native hills and the valour of twenty two thousand Rajputs to with-stand the son of Akber. The range to which Pratap restricted was the mountainous region around, though chiefly to the west of the new capital. From north to south Kumbhalmir to Ricumnath about eighty miles in length and in breadth from Merpur west to Satolla east about the same. The whole of this space is mountain and forest, valley and stream. The approaches to the capital from every point to the north, west and south are so narrow as to merit the term of defile; on each side lofty perpendicular rocks with scarcely breadth for two carriages abreast, across which are those ramparts of nature termed (col) in the mountain scenery of Europe which occasionally open into spaces sufficiently capacious to encamp a large force. Such was the plain of Huldighat, at the base of a neck of mountain which shut up the valley and rendered it almost inaccessible
"Annals of Mewar."

❁ Kumbhalmere (Kumbalgarh) is situated on a mountain near the western border of Mewar about 40 miles to the north of Udaipur City.
"Akber the great Moghul."

సీ॥ ఈగిరులెల్ల రా ♦ ణాగారికి సమీప; మెపు డెందు దూఁకునో ♦ యెఱుఁగరాదు;
మనగాలి సుంత సోఁ ♦ కినను సింహంబులవంటి శిశోదియా ♦ భటులు గొలువ
నీనినపులి యట్లు ♦ లెగిరి పైవ్రాలు; నాతని నోర్వ నుదుట నే ♦ త్రమ్మ గలుగు
నా గజాసురవైరి ♦ కైన దుర్భర; మెంత యప్రమత్తుల మైన ♦ నంత మేలు;
గీ॥ కాన వాద్యంబు లెల్లను ♦ గట్టిపెట్టి పెదవి గదలింపకయె మౌన ♦ విధి వహించి
వడివడిగఁ దూఁటి కనుమవెం ♦ బడిని సాఁగి యవలఁ జేరంగవలయు నే ♦ ర్పతిశయిల్ల."

మ॥ అనుచర్ నల్వురు నల్వురై నిలువ సై ♦ న్యం బంతయున్ దీర్చి యీ
పని సంద్రంబున కేత మెత్తు టనుచర్ ♦ భావించియున్ మానసిం
హనృపాలుండు ప్రతాపునిన్ గెలుచు న ♦ త్యాశా బలా కృష్టుఁడై
చనుఁడం చాజ్ఞ నొసంగె ముందునకుఁ ద ♦ త్సైన్యాధిపుల్ భీతిలన్.

—*) సలుంబ్రా కృష్ణసింహుఁడు హఠాత్తుగాఁ గనుమ నాక్రమించుట. (*—

సీ॥ కడ గానరాని దీ ♦ ర్ఘశరీరమున మహోరగము నికుంజగ ♦ ర్భంబు వెడలి
వంకరగా సాఁగి ♦ పైకిఁ బ్రాకెడురీతి యవన సేనా దండ ♦ మల్ల నల్లఁ
గదలి హల్దీఘాటు ♦ కనుమ డాయుచు నందు మొదటినల్వురు కాలు ♦ మోపునంతఁ
బిడుగులచప్పు డె ♦ ల్లెడ రేఁగ మూఁడువే లాశ్వికోత్తములు త ♦ న్ననుసరింపఁ
గీ॥ దటములెకతట్టుకొని మహో ♦ ద్ధతిని దూఁకు పరమ గంభీర గంగాప్ర♦వాహ ధాటి
నాకనుమఁదూఁటి యాద్యంత♦మలమి నిలిచె సింహమటు సలుంబ్రాకృష్ణ♦సింహవిభుఁడు.

చ॥ అనుపమ వాయువేగమున ♦ నద్రి ప్రతిధ్వను లీన నుద్ధతిన్
గనుమమొగంబు చొచ్చుకొని ♦ కట్టెదురన్ లయకాలరుద్రుఁడో
యనఁ బయిదూఁకు కృష్ణవిభు ♦ నా మొగలుల్ గని భీతిఁ గ్రుంగుచున్
వెనుకకు మ్రొగ్గి రగ్గరుఁడు ♦ నిన్ గని తగ్గు నహివ్రజం బనన్.

—*) యవనసైన్యంబులు రాత్రికి దండువిడియుట. (*—

మ॥ సమయం బెంతయుఁ బ్రాతికూల్యము వహిం ♦ చన్ గట్టునన్ జిక్కి తా
లిమివో రోఁజెడు నాదిశేషువలె ని ♦ ల్చెన్ మానసింహుండు వై
రము సాధించెదనంచు; నంతఁ జతుర ♦ శ్రవ్యూహమున్ బన్ని ప
శ్చిమదిఙ్న్యస్త ముఖంబుతోడ వసియిం ♦ చెన్ బాదుషా సైన్యముల్.

హల్దీఘాటుకనుమ

[ నాలుగు గజముల వెడలుపు ]

| | | | | |
|---|---|---|---|---|
| 2500 పిరంగులు | ఆసప్‌ఖాను 25000 ఆశ్వికులు | తోడరమల్లు సూర్యుడు-సాగరుడు 50000 ఆశ్వికులు | ఖాసింఖాను 25000 ఆశ్వికులు | 2500 పిరంగులు |

ద

హకీంఖా 50000 కాల్వురు

రాయసింహుడు 50000 కాల్వురు

ధనధాన్యశాలలు

25000 భటులు

రాణివాసము

పాకశాలలు, గోశాలలు

మూలబలము

గాయకులు

జహంగీరు

కున్వార్ మానసింహుడు

కవులు

కున్వార్ మానసింహుని

వైద్యశాలలు, అంగళ్లు

వేశ్యలు

అంబరదేశము

మద్యశాలలు

రాయశీలుడు, జయమల్లుడు 50000 తుపాకి ఫౌజులు

అబ్దుల్లా 50000 కాల్వురు

ఉ

| | | | |
|---|---|---|---|
| 2500 వారణ బలము | అబ్దురు రహిమాను 50000 కాల్వురు | వీరబలుడు 50000 కాల్వురు | 2500 వారణ బలము |

తూ

§ మ॥ బలుసింగంపుఁ గడానికేతనము శో ♦ భల్ నల్దెసల్ నిండఁ గ్రొం
జిలుఁగుల్ బట్టు జిరా గుడారమున ని ♦ ల్చెన్ దా జహాంగీరు; ముం
గలిప్రక్కన్ నను పంచవన్నియ పతా ♦ కం బొప్ప గ్రొమ్మించు చ
ల్వల డేరాకడ మానసింహుఁడు వసిం ♦ పన్ బోయె నారాత్రికిన్.

క॥ ఇరువుర గుడారముల నలుతెఱఁగుల యువరాజు నింటి ♦ తెరవలు గణికల్
మఱి కవులు గాయకులు విడిసిరి తత్తద్దత్త రుచిర ♦ శిబిరములందున్. 16

క॥ నలుదెసల నీగుడారంబులచుట్టును మానసింహ ♦ భూవరు నంబర్
బల మిరువదియైదగు వే లలరారె నరాతివిక్ర ♦ మాపహలీలన్. 17

మ॥ అలసైన్యంబులచుట్టు వీథులను జే ♦ యన్ బంచి పానీయశా
లలు గోశాలలు నాఁటి ధాన్యధనశా ♦ లల్ చేర్చి సద్వైద్యశా
లలు నెక్కొల్పియుఁ బెక్కులంగడులు ని ♦ ల్పన్ జేయుచున్ మద్యశా
లలు స్థాపింపఁగ గొప్పపట్టణము లీ ♦ లన్ గ్రాలెఁ జో టంతయున్. 18

క॥ ఈవీథుల వెలివరుసను యావనపాదాతిదళము ♦ లాశ్వికులును దం
తావళసమితి పిరంగుల ప్రోవులు నందంద భీతి ♦ పొడమఁగ నిలిచెన్. 19

సీ॥ మొనసి హల్దీఘాటు ♦ కనుమకు నెదుర యావనచమూ పశ్చిమ ♦ పార్శ్వమెల్ల
ముగురుసేనాధీశ ♦ ముఖ్యు లమ్మేడఁ బంచుకొని వారివారి యి ♦ క్కువల నుండి;
రవ్వాలిలో మధ్య ♦ మందున నేఁబదివేల యాశ్వికులు సే ♦ వించుచుండఁ
బరిభూతి యెట్టిదో ♦ యెఱుఁగని విక్రమమహితుండు తోడర ♦ మల్లు నిలిచె;
గీ॥ ఘనుఁ డసఫ్ ఖాను ఖాసిము ♦ ఖాను ప్రబల బాహుబలు రొక్కరొక్క రి ♦ ర్వదియునైదు
వేల యాశ్వికుల్ గొలువ న ♦ వ్వీరవర్యు నుభయపార్శ్వదళంబుల ♦ నుండి రపుడు.

మ॥ అదయాక్రామ దరాతివీరభట శౌ ♦ ర్యాగ్ని చ్ఛటా వార్షుకాం
బుద మబ్దూర్ రహిమాను వీరబలుఁ డా ♦ పూర్ణప్రభారాసు లేఁ
బదివేల్ కాల్వురతో నొకొక్కరుఁడు ప్రా ♦ గ్భాగంబునన్ నిల్చి రా
త్మదళంబుల్ జయనాదముల్ సలుప ను ♦ త్సాహంబు దీపింపఁగన్. 21

---

§ The great banner of Mewar exhibits a golden Sun on a crimson field, those of the chiefs bear a dagger. Amber displays the Panch-Ranga or five-coloured flag.

"Annals of Mewar."

మ॥ చలదంభోధి గంభీర ధీర గుణు లా ♦ షాబాజుఖాన్ రాయసిం
హులునున్ దక్షిణమందు; నుత్తరము శా ♦ ర్యోదగ్రులై క్రోలుబె
బ్బులులన్ బోలిన రాయశీలుఁడును న ♦ బ్దుల్లాయుఁ దారుష్కసే
నల నొక్కొక్కరుఁ డర్థలక్ష గొనుచున్ ♦ దాముండి రాయామొదన్. 22

సీ॥ రాత్రికాలమ్మున శా ♦ త్రవవాహినీ సమూహమున కతిసమీప ♦ మగుటఁ జేసి
పడమటిదెసయందు ♦ వాయవ్య నిరృతికోణములఁ బిరంగితం ♦ డములు నిలిపి
తూరుపు తరులతా ♦ దుర్గమారణ్యంబు గానఁ దద్భాగర ♦ క్షణము మదిని
వలచి యీశాన వై ♦ శ్వానర కోణంబులందు వారణసమూ ♦ హంబు నిలిపి
గీ॥ పనులు పదివేలకనులతో ♦ భద్రపఱచి మానసింహుఁడు శిబిరంబు ♦ లోని కరిగె;
గాయకుల గేయములు గణి ♦ కాచయముల యాటలును సాగఁగాఁ జేసె ♦ నాసలీము.

—*) రాజపుత్రసైన్యము లెదిగివచ్చి హాల్దీఘాటు కనుమ చేరుట. (*—

సీ॥ కల్ప నిర్ఘాత సం ♦ కాశ రాఠోడ్వంశ దీపకుల నడపెఁ ♦ దేజసింహుఁ!
డతులవిక్రములఁ జో ♦ హాణవీరులను గొంచుఁ బరతెంచె బలియుండు ♦ భానుసింగు!
ఝేలవారా సుభ ♦ టాళుల నడిపించె సింహశౌర్యుఁడు మన ♦ స్సింహవిభుఁడు!
పులిపిల్లలని శాత్ర ♦ వులు భీతినొందు ఝాలాన్వవాయులఁ దెచ్చె ♦ శ్యామసింగు!
గీ॥ హరకులోద్భవులును దేవ ♦ రాన్వయులును బ్రమరభటులు, హారావళీ ♦ పర్వతంబు
ముక్కముక్కలై పడఁ బెడ ♦ బొబ్బ లిడుచు వెడలి రష్టా దిర్వదిరెండు ♦ వేలదొరలు.
గీ॥ సకలయవనుల కాల మా ♦ సన్నమైనఁ బూని సంయమనికిఁ గొని ♦ పోవ వచ్చు
యముఁ డతనిభటుల్ వీరని ♦ యరులు వెఱవ భిల్లభటులతో ముందుండె ♦ భీమచాందు.
❁ సీ॥ సర్వ సర్వంసహా ♦ స్వాతంత్ర్యధర్మ మంత్రోపదేశ గురూత్త ♦ మోత్తముండు!
నియతేశ్వర ధ్యాన ♦ నియతి బ్రహ్మైక్య సంధానంబు నెఱపు నా ♦ నందవార్ధి!
కారణమాత్ర సం ♦ సార మంటియు నంటకుండు నుత్తమరాజ ♦ యోగివాళి!
సచరాచర ప్రపం ♦ చము నెల్లఁ దనుఁబోలె సమబుద్ధిఁ జూచు వి ♦ జ్ఞానశాలి!

---

❁ It is worthy the attention of those who influence the destinies of states in more favoured climes to estimate the intensity of feeling which could arm this prince (Pratap) to oppose the resources of a small principality against the then most powerful empire of the world; whose armies were more numerous and far more efficient than any ever led by the Persians against the liberties of Greece. Had Mewar possessed her Thucydides or her Xenophon, neither the wars of Pelepo-

గీ॥ ధర్మ సంస్థాపనార్థ ము ♦ ద్భవము నొందు దేవతాదివ్య తేజం బు ♦ దీర్ణమూర్తి!
యా ప్రతాపుఁడు "చైతక" ♦ హయము నెక్కి తరలె సమరులు మెచ్చి యాఁ ♦ దలలనూఁప

సీ॥ రాజపుత్ర భటోత్క ♦ రంబు దొంతరలుగాఁ గనుమకు రెండు ప్ర ♦ క్కలను జేరెఁ;
ప్రబల శిశోదియా ♦ వంశ్యవీరులతోడ దానికి నడుమఁ బ్రి ♦ తాపుఁ డుండె;
నతని దక్షిణపార్శ్వ ♦ మందుఁ జోండావద్వరేణ్యులతో నిల్చెఁ ♦ గృష్ణసింహుఁ;
డవ్వలఁ దేజసిం ♦ గాతని చెంత ఖేల్వాపతి నిల్చిరి ♦ భటుల తోడ;

గీ॥ నాపరితాపుని వలపట ♦ శ్యామసింగు భానుసింహుండు గ్వాలియర్ ♦ పతియు ఖేల
వార భూపతి బేడ్లా-కొ ♦ ఠేరియా నృపాలకులు నిల్చి రహిత దు ♦ ర్వార లీల. 27

మ॥ తళుకు న్నిద్దఁపు జాళువా కలికి పూఁ ♦ తల్ గుల్కుచున్ వేయి వె
ల్గులు నల్దిక్కులఁ బిక్కటిల్లఁ బలుని ♦ గ్గల్ దేలు బంగారు గ
జ్జెలు వాతాహతి మ్రోఁత లెత్తఁగఁ జలిం ♦ చెన్ వైరిసైన్యంబు గుం
డెలు ప్రీలంగ రవిధ్వజోత్తమము హా ♦ ల్దీఘాటు సీమోపరిన్. 28

సీ॥ పరిసర భూభృచ్ఛి ♦ ఖర కోటిపైన! నుగ్రములైన ప్రకృతిదు ♦ ర్గములపైనఁ:
గడునెత్తుగానున్న ♦ గండశిలలపైన! మధ్య నుండెడు నితం ♦ బములపైన!
నేలవాలగు కొండ ♦ పేటులపైనఁ! జెంగటనున్న గొప్పవృ ♦ క్షములపైనఁ!
గ్రింద మీఁదనుగల్గు ♦ సందుగొందులలోన! గుమురులై తగు నికుం ♦ జములలోన!

గీ॥ నెందుఁ గనుఁగొనినను నేల ♦ యీనినట్లు భీమచాందు తోడ్తెచ్చిన ♦ భిల్లభటులు
సింహనాదంబుతోఁ బోయి ♦ చేరుకొనిరి పర భయంకర శర ధను ♦ ష్పాణు లగుచు.

సీ॥ హైందవాంగనల నా ♦ ట్యము సాఁగె రుచిరమై రాయశీలుని గుడా ♦ రమ్ములందు;
నమృత మూరెడు గాన ♦ మలరారె నబ్దూరురహిమాను పటకుటీ ♦ రములయందు;

---

nessus nor the retreat of the "Ten thousand" would have yielded more diversified incidents for the historic muse, than the deeds of this brilliant reign, amid the many vississitudes of Mewar. Undaunted heroism, inflexible fortitude, that which keeps honour bright perseverence, with fidelity such as no nation can boast, were the materials opposed to a soaring ambition, commanding talents, unlimited means and the fervour of religous zeal; all however insufficient, to contend with one unconquerable mind. There is not a pass in the Alpine Aravali that is not sanctified by some deed of Pratap. Some brilliant victory or oftener more glorious defeat. Haldighat is the Thermopalae of Mewar, and the field of Davier her Marathon.

"Annals of Mewar."

మొగలు నపుంసకా ♦ పూర్వ నృత్యపుగోల చెలఁగె నాసప్ఖాను ♦ శిబిరములను;
ద్రాక్షారసంపుఁ బా ♦ త్రలు సల్పె నర్తన ల్షాబాజుఖాను వే ♦ లములయందు;
సీ॥ నవల మిగిలిన యవనసే ♦ నాధిపతుల విడుదులను బ్రొద్దుపోకకై ♦ వెలసె మద్య
పానమును ధూమపానమ్ము ♦ పచ్చి నల్లమందు విందులు నందుపై ♦ సందడులును. 30

మ॥ యవనాశ్వంబులు హైందవాశ్వములు లసం ♦ ఖ్యాకంబు లొండొంటిఁ జూ
చి విరోధమ్మునఁ గాలు దువ్వ రజనీ ♦ సీమంతినీ కర్ణరం
ధ్ర విదారంబుగ హేషలన్ సలిపెఁ గాం ♦ తారంబు భేదిల్ల; ని
కుక్కవలన్ నిల్చుచుఁ గొండకోళ్ల గుములున్ ♦ గూసెన్ విశేషార్భటిన్. 31

మ॥ నగవున్ వెన్నెల మోముచందురునితో ♦ నాణెంపుఁ బావాలతో
సొగసున్ జందురుకావి నిద్దపు జిరా ♦ చొక్కాయతోఁ గాంతులన్
బగటిన్ గూర్చు కృపాణితో నటఁ బ్రతా ♦ పస్వామి శైలంబుదం
ప గుడారంబులలోఁ జమూపతులఁ జూ ♦ డన్బోయె శీఘ్రమ్ముగన్. 32

సీ॥ తల్లి పుత్రకుల నా ♦ దరమునఁ జూచున ట్లనురాగ పూర్ణుఁడై ♦ యధిపుఁ డరయ
వీరులందఱు భక్తి ♦ వివశులై "మాదేవుఁ డిట మమ్ముఁ బ్రోవ ని ♦ ష్డేగుదెంచె!
మందహాసజ్యోత్స్న ♦ లందమై వర్షించు నీమోము చూచిన ♦ నెల్లలోక
సామ్రాజ్య మిడిన హ ♦ స్తము సోఁకనిత్తుమే! యీతని పదసేవ ♦ యింద్రభోగ"
గీ॥ మనుచుఁ గన్నులఁ గని హృద♦యములఁ దలఁచి భూవిభుని సద్గుణంబులు♦పొగడుచున్న
యంత నుదయ ధరాధర♦మందు మొలిచె వెలుఁగు గములకుఁ బలునిక్క♦వేఁగుఁజుక్క

మ॥ "కలనాదంబు లొనర్చెఁ బక్షితతి; చు ♦ క్కల్ వీడె వజ్రంపుశో
భలు; ప్రాచీదిశఁ గాంతిపూర మలమెన్; ♦ బ్రాభాత మందానిల
మ్ములు వీతెంచె" నటంచు మంజులరవ ♦ మ్ముల్ మీఱఁ దౌరుష్కయో
ధులకున్ బాడిరి మేలుకొల్పు లపు డెం ♦ తో రక్తి వైతాళికుల్. 34

—*) సూర్యోదయము. (*—

మ॥ "కులమున్ బ్రోచెడు ధర్మమూర్తులకు నె ♦ గ్గుల్ కల్గరా దీ తురు
ష్కులబారిన్ బడకుండఁ బ్రోచెద" నటం ♦ చున్ వేయి బంగారుచే
తులు పైఁగప్పుచు నాదరించె ననఁ బ్రా ♦ దుర్భావమున్ బొంది తొ
ల్తొలుతన్ సూర్యుఁడు దోఁచెఁ దూర్పుమలయం ♦ దున్ రాజపుత్రాళికిన్. 35

—*) ప్రతాపసింహుఁడు సూర్యోపాసనము చేయుట. (*—

శా॥ "వీరుల్ పోయిన రాజ్యముల్ చెడిన ను ♦ ర్వీ దేశదేశప్రజా
వారం బేగిన నూత్నజీవ మిడు శో ♦ భారాశివై విశ్వమం
దారప్రాయుఁడవై నభోగతి ననం ♦ త బ్రహ్మకల్పంబుగా
మీఱఁగగ్గిన బ్రహ్మమూర్తివి! నినుఁ ♦ బేర్కొందు ఛాయాధిపా! 36

సీ॥ నగరమందలి ప్రధా ♦ నద్వార మెల్లప్డు సూర్య మహాద్వార ♦ శోభఁ గాంచు!
మాహార్మ్యమ్మున రాజ♦మణులు కొల్వుండు భాగము సూర్యభవన వి♦ఖ్యాతిఁ గాంచు!
జనులకు నృపులు ద ♦ ర్శనమిచ్చు పైమేడ సూర్య శిఖర మంచు ♦ స్తుతి వహించు!
సింహాసనము వెన్కఁ ♦ జికిలి బంగరు మేటి సూర్యబింబము మూర్తి ♦ సొబగు నొందు!
గీ॥ ధ్వజములు సితాతపత్రముల్ ♦ తనరు నీదు పేరనే; నిన్ను మించిన ♦ వేల్పు లేఁడు;
తలఁపులను గదలికలను ♦ బలుకులందు నీ వెపుడు గోచరించుచుం ♦ డెదవు మాకు.

మ॥ జననం బిడినవాఁడ నీకులమునన్! ♦ స్వాతంత్ర్య ధర్మంబు ని
ల్పను గాంక్షించితి; నేఁడు వైరుల నద ♦ ల్పన్ గూల్ప యత్నింతు; నీ
మనిమన్నండ మదీయ గౌరవయశం ♦ బుల్ నిల్వ దీవింపుమీ"
యని ప్రార్థించెఁ బ్రతాపుఁ డర్యముని భ ♦ క్త్యావేశ ముప్పొంగఁగన్. 38

ఉ॥ ఆపయి నేకలింగవిభు ♦ నవ్వలఁ బర్వతసార్వభౌము పు
త్రి పదపద్మ యుగ్మము మ ♦ దిన్ గడుభక్తి భజించి ధర్మశీ
లాపరులైన పూర్వనృప ♦ సత్తములన్ దలఁచెన్ బ్రతాపుఁ డిం
తో పరిశుద్ధమౌ హృదయ ♦ తోయరుహంబున భక్తిఁ బెంచుచున్. 39

సీ॥ పదపడి దుందుభి ♦ ధ్వానంబు చెలరేఁగె; రాజపుత్రులు తను ♦ త్రాణములను
ధరియించి దీర్ఘకుం ♦ తములు ఖడ్గములు హ స్తములఁ దాలిచి శిర ♦ స్త్రాణములను
వహియించి యున్నతా ♦ శ్వము లెక్కి భండనోచిత మండనములు రం♦జిల్లుచుండ
సమర సన్నద్ధులై ♦ తమతమ సేనాధిపతులపైఁ గన్పించి ♦ పజ్జ నిలువఁ
గీ॥ గృష్ణసింహాది బహువాహి ♦ నీశ్వరులును వీరరస పూరుషాకృతుల్ ♦ వెడలి వచ్చి
యాప్రతాపుని యనుగుల♦యందు వ్రాలి 'యుద్ధ మొనరింపఁగా సెల♦వొసఁగు' మనిరి.

—*) ప్రతాపసింహుఁ డనుచరులకు యుద్ధముచేయ సెల వొసంగుట. (*—

మ॥ తలఁగన్ బోవని దేశభక్తిమెయి స్వా ♦ తంత్ర్యంబు భావించి యీ
ధర మున్నెవ్వరు పూనియుండని మహా ♦ ధర్మవ్రతం బూని భో
గ రమావైభవముల్ త్యజించితిరి! ని ♦ ష్కామ క్రియా యోగు! లిం
దఱ మిమ్మున్ గనుఁగొన్న నాహృదయ మా ♦ నందాబ్ధి నోలాడెడిన్. 41

శా॥ నా మేవాడఁ గలట్టి వీరరస స ♦ న్నాహంబు సర్వస్వ మీ
భూమిధ్రంబున నేఁడు చేరినది పూ ♦ వుల్ పూచు చందాన! 'మీ
రా మేమా' యని ముందు దూఁకవలె వీ ♦ రశ్రేష్ఠు! లీనాఁటిసం
గ్రామంబట్టి మహావకాశ మిఁక గ ♦ ల్గన్ బోవ దెన్నేండ్లకున్. 42

సీ॥ అక్బరు సకలలో ♦ కాతిశాయిబలుండు: లక్షలున్ గోట్లు కా ♦ ల్బంట్లు, లక్ష
లాశ్వికుల్ గలధీరుఁ! ♦ డఖిలజగం బొక్కనిమిషమే పిండిపిం ♦ డిగను జేయఁ
గల పిరంగులు వేలు ♦ గలవాఁడు! నడకొండ లట్టి వారణబలం ♦ బలరువాఁడు!
వేయేటి కీసర్వ ♦ విశ్వంబు ప్రతికూలముగ మనపైఁ ద్రిప్పి ♦ పూన్చినాఁడు!

గీ॥ మనము నిరుపేదలము! విక్ర ♦ మం బొకండె మనకుఁ గల సర్వసమరసా♦మగ్రి; కాన
జంకకయు వెత్తిఁగనక యు ♦ త్సాహ మంది పోరు సలుపుద మపకీర్తి♦పొరయకుండ.

సీ॥ రాజ్య తంత్రములు కా ♦ ర్యస్వతంత్రత వైభవంబులు చతురంగ ♦ బలము లొకట!
ధర్మంబు దైవత ♦ త్పరతయు స్వాతంత్ర్యవాంఛ యాత్మబలోప ♦ పత్తి యొకటఁ!
దమతము శౌర్యవీ ♦ ర్యములతో మొనకట్టి యొండొంటి డీకొన్న ♦ యుద్ధ మిదియు!
నేపక్షు మిచట జ ♦ యించునో యని ప్రపంచమువారి కన్ను లి ♦ చ్చటికిఁ దిరిగె!

గీ॥ నాత్మవంచన లేక యా♦హవము నడిపి జయముఁ గైకొన్న స్వాతంత్ర్య♦సౌఖ్యమబ్బుఁ!
బహుబలము నిల్వలే దాత్మ♦బలముప్రోల ననెడి సిద్ధాంతమును నిల్పు♦యశముగలుగు.

సీ॥ కల్లోల భయద సా ♦ గరమధ్యమున నిల్చు గండోపలము మాడ్కిఁ ♦ గష్టవేళఁ
గంప మొందని భట ♦ గ్రామణి వీరుఁ! డాతనికన్న మేటి యీ ♦ ధరణిఁ గలుగఁ!
డాతని వైభవం ♦ బాత్మగౌరవ దీక్ష! ప్రఖ్యాతి యతని సం ♦ పాదనంబు!
తలఁగని కష్టవే ♦ ళల స్వదేశీయుల దృష్టు లాతని దెసఁ ♦ దిరుగుచుండు!

గీ॥ దేశ భక్తాగ్రగణ్యుఁడౌ ♦ ధీరు బ్రదుకు వేయునేండ్లైన క్షణమైన ♦ వెలితి యున్నె!
కాలగర్భంబునందుఁ రాఁ ♦ గలయుగముల నతనికీర్తి దివ్యజ్యోతి ♦ యై వెలుంగు. 45

శా॥ నా యీ సైన్యములందు నొక్కభటుఁడై ♦ నన్ భీరుఁడై యున్న ని
ష్ఠే యుద్ధాంగణమున్ ద్యజించి యెటకే ♦ నేగంగ లగ్గా; జిగీ
షాయత్తుల్ భయమే యెఱుంగని యుద ♦ గ్రాటోపులే నేఁడు నా
కా యా పార్శ్వములందు నిల్చి జయమున్ ♦ హర్షంబు నీయన్ దగున్. 46

క॥ సమయమున భీతిఁగొని శౌర్యముఁ గోల్పడి లోకపూజ్య ♦ మగు మీ సంతా
నము దాస్యశృంఖలా బద్ధము చేయకుఁడనుచు మిమ్ముఁ ♦ దగ నర్థింతున్. 47

సీ॥ నాల్గు దిక్కులఁ జుట్టు ♦ నభము సోఁకెడు మహోద్దండ శైలము లొప్పు ♦ కొండలోయ
మనల నెవ్వరు చూతు ♦ రని తలంపకుఁడు! జగచ్చక్షుఁడైన యా ♦ కర్మసాక్షి
పైనుండి చూచు లో ♦ పలి తలంపులు! విపక్షచ్ఛేద మొనరించి ♦ సమయు వారి
నభినందనము చేసి ♦ యశము నిల్పి రటంచుఁ గడుపుపైఁ జేరిచి ♦ గారవించుఁ!
గీ॥ దాతలకుఁ దాతయైన యా ♦ ధన్యతముని బొజ్జపై కెక్కి మాహేంద్ర ♦ పురము పోవు
తొలిమహాద్వారమున దేవ ♦ దూతలెల్ల మ్రొక్కఁగలభాగ్య మొందు ట ♦ ద్భుతము గాదె!

సీ॥ శత్రులు నాల్గుల ♦ క్షలకుఁ బైఁబడియుంద్రు! ద్వావింశతిసహస్ర ♦ దళము మనది!
యొక్కఁ డిర్వదిమంది ♦ యోధుల నోర్చిన జయమున కింక సం ♦ శయము గలదె!
యాపాటి సాహసం ♦ బలరనివాఁడు మీయందఱిలో నొక్కఁ ♦ డైనఁ గలఁడె!
కవచఖడ్గములుండఁ ♦ గా రాజపుత్రుఁ డిర్వదిమందిఁ గూల్ప దు ♦ ర్ఘటమె యెందు!
గీ॥ నైదువేల పిరంగులు ♦ నంతసంఖ్య ద్విరదతతియున్న భయమేమి! ♦ వేఁడి వేఁడి
పిడుగు లురలెడు మనచూపు ♦ లడర గజము లజములు పిరంగులవి బొంగు ♦ లగుచుఁబడవె

సీ॥ వనచరసాహాయ్య ♦ మున రాముఁ డొక్కఁడే యసురబలంబుఁ జ ♦ క్కాడ లేదె!
గోగ్రహణమునాఁడు ♦ కురువీరకోటుల ఫల్గునుం డొకఁడె డీ ♦ ల్పఱుపలేదె!
మూంజుని భిల్లచ ♦ మూసమూహము నెల్ల హమ్మీరుఁ డొకఁడె తు ♦ న్మాడ లేదె!
నాముముత్తాత చం ♦ డనృపాలుఁ డొక్కఁడె చిత్తూరిసేన ని ♦ గ్గింప లేదె!
గీ॥ యాత్మతేజోబలాఢ్యు లి ♦ య్యఖిలజగము లెత్తివచ్చినఁ ద్రుటిని జ ♦ యింపనేర్తు!
రందఱేకాగ్రమనముల ♦ సహితభటుల సూఁచముట్టుగఁ దాఁకంగ ♦ నొప్పు నిపుడు."

—*) ప్రతాపసింహునితోఁ గృష్ణసింహుఁడు తన పట్టుదల నెఱిఁగించుట. (*—

గీ॥ అనిన రాణానుగని సలుం ♦ బ్రాధినేత "యిచటి భటుల భీరుం డొకం ♦ డేని లేఁడు!
కట్టకడపటి భటుఁడైనఁ ♦ గట్టితెచ్చి మృత్యుదేవతఁ జెఱసాల ♦ నిడఁగఁ గలఁడు. 51

సీ॥ ఒక్కొక్కఁడును సమ ♦ స్తోర్వీతలమునిండ నిరుపమామోదంబు ♦ నెఱపునట్టి
పూవు లసంఖ్యముల్ ♦ పూచె రాజస్థాన నందన దేవమం ♦ దార తరువు!
తడ వొకింతయులేని ♦ తౌరుష్క వాహినీ జైత్రయాత్రా ప్రభం ♦ జనముధాటిఁ
గూఁకటివ్రేళ్లతోఁ ♦ గూడఁ గంపించె జె! ట్టా పూవు లన్నియు ♦ నవని రాలె!
గీ॥ నీవనేడు పోఁడ్డపూనైన ♦ నిలుచుఁ బొలుచు విశ్వవిశ్వంభరామోద ♦ విజయలక్ష్మి
నలుదెసల నించునంచని ♦ తలఁచుచుండ నక్బరనెడి జంఝూనిలం ♦ బలమె నేఁడు! 52

శా॥ పోనీ రాజ్యము; భోగభాగ్యవితతుల్ ♦ పోనీ; సతీపుత్రులుఁ
బోనీ; ప్రాణము పోవనీ; మఱియు నీ ♦ భూచక్రమే పిండియై
పోనీ; చండనృపాలు పావనకులం ♦ బుఁ దాస్యముఁ బొయ్యఁగాఁ
బోనీయఁ త్రిదివాధిపత్యవిభవం ♦ బుల్ దక్కున ట్లుండినన్." 54

క॥ అనుచు సలుంబ్రాకృష్ణుం డనినంతనె తేజసింహుఁ ♦ డమలస్మిత శో
భన వదనం బెత్తి ప్రతాపుని గని సైన్యంబులెల్ల ♦ మోదంబుఁ గనన్, 55

—*) తేజసింహుఁడు తన శక్తి యుక్తు లెఱిఁగించుకొనుట. (*—

సీ॥ "శతశతాబ్దములు క ♦ ష్టముచేసి కట్టిరి వంశపావనులు మే ♦ వాడరాజ్య
సౌవర్ణ సౌధరా ♦ జము; దుర్బలులమైన నిమిషంబులో నది ♦ నేల వ్రాలుఁ;
బరతంత్రగతి సార్వ ♦ భౌములై బ్రహ్మాండ మున్నంతకు బ్రదికి ♦ యుండుకంటె
దారిద్ర్యయుక్త స్వ ♦ తంత్రజీవన మొక్క గంటయుఁ గడకొక్క ♦ క్షణము చాలు;
గీ॥ దేశధర్మరక్షాదీక్ష ♦ ధీరవృత్తి మాకెదముగాక! రిపులఁ జం ♦ పెదముగాక!
భీతి మృత్యుమహావృక్ష ♦ బీజ మగుటఁ బిరికిచేతి బల్లెం బది ♦ బెండుగాదె! 56

సీ॥ తనపాలు తోఁ్రవ దు ♦ ర్గమగండశిలలైనఁ దునియలుతునియలై ♦ తొరగునట్టు
లతితరోన్నత పర్వ ♦ తాగ్రంబునుండి యప్రతిహతధాటితో ♦ వచ్చి దూఁకు
నచలసరిత్ప్రవా ♦ హము ముందునకెకాని వెనుకను మఱలని ♦ విధముతోఁప
జృంభించి రేఁగి యే ♦ కైకధాటిఁ దురుష్కవీరుల నిపుడె యు ♦ వ్వెత్తుగొంగు!
గీ॥ మొక్కఁ డిరువండ్రనేటికి! ♦ నొక్కవేయి మందినైనను దొడరి చం ♦ పంగనేర్తు!
మేము విహరించు చోటెల్ల ♦ మృత్యుదేవతా విహారస్థలంబయి ♦ తనరుఁగాక. 57

మ॥ యవనుల్ నాలుగు లక్ష లుందురని యే ♦ లా చూడ! మద్బాహుసం
భవ శౌర్యోగ్ర విహారమారుతము శుం ♦ భద్ధాటికిన్ వైరి యో

ధవితానంబులు వృక్షసంతతుల ప ♦ త్రశ్రేణులుఁ బోలె ని
య్యవనిఁ దుల్లఁగఁజూతు! నీమదికి నా ♦ హ్లాదంబు చేతుఁ బ్రభూ! 58
క॥ శ్రమమేల; యగాధసముద్రముఁబోలిన యీ యపార ♦ తౌరుష్కవ్యూ
హమునందు వామభాగార్ధము లేదని యింతనుండి ♦ తలఁపుము దేవా!" 59
క॥ అన భీమచాందు "భళి! నీజనకుని మఱపింపఁగలవు ♦ శౌర్యోద్భటోపం
బున" నని ప్రతాపసింహునిఁ గనుఁగొని లయకాలమేఘ ♦ గర్జారభటిన్, 60

—*) భీమచాందు యుద్ధమునుగూర్చి యుత్సాహవాక్యము లాడుట. (*—

సీ॥ మనువులు పదునాల్గు ♦ మంది పుట్టకమున్నె! భరతోర్వి నార్యు లే ♦ ర్పడకమున్నె!
రామాయణంబు భా ♦ రతము వ్రాయకమున్నె! వేదముల్ భాగముల్ ♦ విడకమున్నె!
రాజాధిరాజు లే ♦ ర్పడుటకుమున్నె! నాగరకత భువిని బ్రా ♦ కకయ మున్నె!
యీ యేరు లీ కొండ ♦ లీ గండశిలలు నీ వనములు మాభిల్ల ♦ వంశజులవి!
గీ॥ యీతురుష్కులె కాదు మ ♦ హేశుఁడైన నరుగుదెంచినఁ బ్రాణ ము ♦ న్నంతలోన
శిరములను ఖండఖండముల్ ♦ చేతుఁగాని మిగులనిచ్చిన నిది యొక్క ♦ మీస మొక్క!
సీ॥ గొలుసులనున్న బె ♦ బ్బులిపిల్లలనఁగ యౌవనవీరమృగముల ♦ పైన వ్రాలి
కడికండలొలుచు యో ♦ గం బెప్పు డెప్పుడం చదె భిల్లభటులు ము ♦ ప్పదియువేలు
కొండకోటలపైన ♦ నుండి గుప్పునదూఁక నుత్సాహభరమున ♦ నున్నవారు!
రణమం దరుల డీల్ప ♦ ఱచి గెల్చుటో లేక చచ్చుటో మూఁడన ♦ జాడ గలుగ!
గీ॥ దింక మేవాడపైన దం ♦ డెత్తు టనిన మృత్యుముఖముఁ జొచ్చుటెయంచు ♦ నెడఁద ప్రీలి
యక్బరును భీతిఁగొనఁగ నా ♦ హవము సేతు నీపదములాన ప్రాణంబు ♦ తీపుగాదు. 62
మ॥ మదమాతంగ సమూహమట్లు బలసం ♦ పన్నాన్యు లొక్కొక్క రేఁ
బదిశైలంబుల నెత్తి సంభ్రమునఁ ద్రో ♦ వన్ జాలు వారల్లము
ప్పదివేల్ భిల్లుల నింటికిన్ మఱలిపో ♦ వన్ గోరఁ డొక్కండు! నే
దుదిప్రాణంబులు మేన నుండువఱకున్ ♦ దోడుండు నీముందటన్." 63
గీ॥ అనిన నాభానుసింహాదు ♦ లందఱొక మొగమున "నేఁడు హల్దీఘాటు ♦ కనుమనిండ
వైరిరక్తప్రవాహముల్ ♦ పాఱఁజేతు" మనిన నంద ఱొందల లూఁపు ♦ నంతలోన, 64
మ॥ "అరిసంఘుంబులఁ గూల్చి గెల్పుఁగొన నా ♦ యత్తంబు గం" డంచు నం
దఱకున్ దెల్పుచు యౌవనాయస బృహ ♦ న్నాళాస్త్ర శుంభద్గళాం

తరమందుండియుఁ బ్రేలె గుండ్లాకఁడు ది ♦ గ్దంతిశ్రవోయుగ్మగ
హ్వారవిచ్ఛేది కఠోర దుస్సహ మహా ♦ ధ్వానంబు సంధించుచున్. 65

—*) మొగలు సైన్యంబులు యుద్ధమున కాయత్తమగుట. (*—

శా॥ బారుల్ బారులు తీర్చి యావనభట ♦ వ్రాతంబు లశ్వంబులం
దారోహించుచు నిల్చెఁ గట్టెదుర! బా ♦ హావిక్రమప్రాభవో
దారుల్ తోడరమల్లముఖ్యులు తను ♦ త్రాణాదులన్ దాల్చి యా
మేరుక్ష్మాధరశృంగముల్ వలెఁ గదున్ ♦ బెంపారి రత్యుగ్రులై! 66

శా॥ ధీరశ్రీ లయకాల మృత్యుముఖ స ♦ ధ్రీచీన ఘోరంబులై
నోరుల్ విచ్చు శతఘ్నులన్ నిలిపి యం ♦ దున్ శ్వేతసూచీముఖుల్
క్రూరాత్ముల్ భృతిపాలితుల్ జగము సం ♦ క్షోభింపఁగా నిల్పి రా
శూరుల్ పంచసహస్రముల్ బుడుతకీ ♦ చుల్ నిప్పులన్ గుప్పుచున్. 67

మ॥ సమసత్త్వంబులు నగ్నిచూర్ణయుతముల్ ♦ షష్ట్యంగుళక్రూరనా
శముల్ భీకరతిర్యగూర్ధ్వబిలమూ ♦ లమ్ముల్ తుపాకుల్ విశా
లముఁ దా జొమ్ముల కాన్చి పచ్చితురకల్ ♦ బహాబలాటోపదు
ర్దములై నిల్చిరి దీర్ఘకాయులు రణా ♦ రంభక్రియాలోలురై. 68

సీ॥ ధవళ ధూసర హరి ♦ ద్ర శ్యామ లోహిత పింగవర్ణ తనుత్ర ♦ వితతిఁ దొడిగి
కరవాల పరశు ము ♦ ద్గర భిండివాలాది సమరోచితాయుధ ♦ సమితిఁ దాల్చి
మూఁడులక్షలభటుల్ ♦ మూఁగిరి; మృగ మిశ్ర భద్ర మంద్రవిభేద ♦ వారణములు
నాకర్ష దీర్ఘ ము ♦ ఖాభీల కఠిన శాతాంకుశహస్తులౌ ♦ హస్తిపకులు
గీ॥ నిలువ వివిధబలంబుల ♦ యలబలంబు యుగసమయఘూర్ణమాన ప ♦ యోధిరవము
ననుకరింపంగ యవనసై ♦ న్యప్రపంచ మొక్కమొగి విజృంభించె మహోగ్రగతుల.

—♦) ప్రతాపసింహుఁడు యుద్ధసన్నద్ధుఁ డగుట. (♦—

గీ॥ శుభద గోధూమసమ్మిశ్ర ♦ స్థూలలోహ వర్మమును దాల్చి యాప్రతా ♦ పప్రభుండు
తనరె భారతభూమి స్వా ♦ తంత్ర్యలక్ష్మి వీరయోధావతారమై ♦ వెలిఁగె ననఁగ. 70

సీ॥ నలువదియంగుళం ♦ బుల దీర్ఘవదన మంతకును మూఁడంత లౌ ♦ న్నత్య మలరి
మాయూరకంఠస ♦ మగ్రీవమును హ్రస్వకుక్షియు నత్యల్ప ♦ ఖురపుటమును

మేఘనిస్వనము న ♦ మేయసారము కాంతకాంతిమంతమ్ము సు ♦ గంధరుచిర
మాకాశనీలవ ♦ ర్ణామోఘమును సర్వతోభద్ర పద్మ ప్రభ ♦ మాభిరామ
గీ॥ ముత్తమోత్తమ లక్షణ ♦ యుతము పూర్ణహర్షము సువర్ణరత్నభూ ♦ షాంచితంబు
నైన చైతకాజానేయ ♦ మధిపుఁ డెక్కె నఖిల సామంత మండలి ♦ యభినుతింప. 71

శా॥ హేరావ శ్చ్యచలప్రపంచము నితం ♦ బాపత్యకోపత్యకాం
తారామాశ్మగుహాధునీయుతముగా ♦ నాకంపమొందఁ మహో
దారప్రాభవుఁ డాప్రతాపుని మహా ♦ న్యద్దక్షిణావర్తశం
ఖారావంబులు భూనభోంతరము ప్రవ ♦ య్యల్గాఁగ మ్రోసెన్ వడిన్. 72

సీ॥ తపనీయవజ్రసూ ♦ త్రములు నాల్గంచులెక్కిన శంఖమూదెను ♦ కృష్ణనృపతి!
సౌవర్ణచిత్రపు ♦ ష్పమనోజ్ఞశంఖంబు మ్రోయించె గ్వాలియర్ ♦ భూమివిభుఁడు!
మెఱుఁగారు మగఱాల ♦ మిసిమిగజ్జెలసరుల్ దెమరు శంఖంబొత్తెఁ ♦ దేజసింహుఁ!
డాణిముత్తియముల ♦ హారముల్ తుదివ్రేలు శంఖంబుఁ బూరించె ♦ శ్యామసింహుఁ!
గీ॥ డుత్తమావర్త మర్ధహా ♦ స్తోన్నతంబు పశ్చిమాంభోధిభవము సౌ ♦ వర్ణవృంత
మగు మహాశంఖ మొత్తె స ♦ ర్వాతిశాయి వీరలోకైకమౌళి యా ♦ భీమచాంద. 73

సీ॥ అచలోపమాన దే ♦ హాభీల యావన ద్విపసమూహము భూరి ♦ బృంహితములు!
జగదేకవిక్రమో ♦ జ్వల రాజపుత్రవీరకదంబ సింహాగ ♦ ర్జా విరావ!
మహితసైంధవదర్ప ♦ నాతిరోషిత తురుష్కతురంగబహుళ హే ♦ షాస్వనంబు!
లనిలధాటీచలి ♦ తాసంఖ్య సూర్యకేతన జాత పటపటా ♦ త్కారరవము!
గీ॥ తురకల పిరంగిగుముల యు ♦ ద్ధురరవంబు! భిల్లసుభటకోదండ మౌ ♦ ర్వీధ్వనులును!
రెండుసైన్యంబులను రేఁగు ♦ డిండిమరవ! మట్టె మిన్ను మన్నేకమౌ ♦ నట్లు మ్రోసె.

—*) { రణమున కుపక్రమింపుమని చంద్రభట్టారకుఁడు ప్రతాపసింహుని హెచ్చరించుట. } (*—

ఉ॥ "వైరులు సర్వసన్నహన ♦ భారముఁ దీర్చి రణంబుసేయ ను
న్నారలు; వారలన్ బలిగొ ♦ నన్ మనవారలుగూడఁ బూనియు
న్నార; లుపక్రమింపుము ర ♦ ణంబు క్షణంబున" నంచుఁ జంద్రభ
ట్టారకుఁ డాప్రతాపు నిక ♦ టమ్మునకున్ జని తెల్ప నాతఁడున్, 75

## —*) ప్రతాపసింహుని విషాదము. (*—

మ॥ శిరమున్ వంచి నమస్కరించి "సుకవి ♦ శ్రేష్ఠా! సుఖావాప్తి సం
బరమున్ గష్టమునన్ విషాదమును బెం ♦ పన్బోని యస్మన్మహా
స్థిరచిత్తంబు నిమేషమాత్రము చలిం ♦ చెన్ ముందుఁ గన్పట్టు నా
పరిపంథి ధ్వజినీ సమూహమును స ♦ ర్వం బిప్డు వీక్షించుటన్. 76

§ సీ॥ స్వచ్ఛజాంబూనద ♦ చంద్రహాసధ్వజప్రభలు నల్దిక్కులఁ ♦ బర్వుచుండ
యావనసేనా ము ♦ ఖాగ్రభాగమున లక్షలులక్షు లాశ్విక ♦ సమితి తనదు
కనుసన్నల మెలంగఁ ♦ దనరు తోడరమల్లు మాయయోధ్యాపుర ♦ మండలభవుఁ;
డితని పితామహు ♦ లెపుడు మాపూర్వుల కాంతరంగికులయి ♦ యలరువారు;
గీ॥ కాల మించుక ప్రతికూల♦గతిని దాల్ప నక్బరునృపాలు పదము సే♦వ్యమని పోయి
యసమమేధాబలమున సై♦న్యపతియగుచు నిదిగో మనమీఁది కిపుడు దం♦డెత్తివచ్చె.

మ॥ అనియుం దైనను దేవతార్చనము సే ♦ యన్బోక నీరైన ము
ట్టని యాచారపరుండు! సజ్జనుఁడు! తో ♦ డర్మల్లు! సద్వంశవ
ర్ధనుఁ! డీయుత్తమభారతీయుఁడు స్వధ ♦ ర్మచ్ఛేదమున్ జేయుచున్
మనపై వచ్చె స్వదేశమిప్డు పరతం ♦ త్రత్వంబుమైఁ బ్రింగఁగన్. 78

సీ॥ ఆవైపు కాంచన ♦ వ్యాఘ్రకేతన మూని కడుపొడవైన ప ♦ గా ధరించి
సువిశాలపాదాతి ♦ నివహంబు నడపు నా రాయసింగు బికనీర్ ♦ రాజమౌళి!
మాపూర్వులకును సా ♦ మంతుఁడై కల్యాణసింహుఁ డితనితాత ♦ సేవ చేసె!
యప్పసెల్లెండ్రఁ బెం ♦ డ్లాడి యీతం డక్బ రన్నదమ్ములవావి ♦ యలరుచుండు!
గీ॥ రౌశ మహారాజ్యమేలుచు ♦ నుండవలయు నితఁడు నాల్గువేల్హయముల♦కీశ్వరుఁడయి
తురకలనుగొల్చి మనతోడఁ ♦ దొడరవచ్చె! నింక స్వామిభృత్యన్యాయ♦మెందుఁగలదు

---

§ The chief adviser of Akber in matters of revenue, finance and currency was the Raja Todar Mall, of whom I have spoken in the last chapter, He was a man of great ability and of tried integrity. Though attached to the court of a Muhammadan sovereign, he was an earnest Hindu and performed faithfully all the ceremonies of his religion. On one occasion when accompanying Akber to the Punjab, in the hurry of department he forgot his idols. As he transacted no business before his daily worship, he remained for several days without food or drink and was at last with difficulty consoled by the Emperor.

"G. B. Malleson C. S. I."

సీ॥ ఆయుత్తరదిగంత ♦ మందుఁ దుపాకిఫౌజుల నెల్ల సంగ్రామ ♦ సుముఖులుగను
❀ జేయుచుండెడి రాయ ♦ శీలుఁ డంబరునృపుండగు భగవాన్ దాసు ♦ నంకితుండు!
వానిపజ్జఁ దురుష్క ♦ పాదాతిదళము మందారమహీజకే ♦ తనముక్రిందఁ
బూన్చుచునున్న జాం ♦ బూనదకవచుండు జయమల్లుఁ డంబరే ♦ శ్వరుని మఱఁది!
గీ॥ యోధపురరాజమాళియా ♦ నుదయసింహు ప్రియతనూజను జేకొన్న ♦ పెండ్లికొడుకు!
మావసింహుని దవకూర్మి ♦ మేనయల్లు మొన్న నేగద దర్శన ♦ మునకుఁ దెచ్చె. 80

మ॥ కడఁజూడన్ బడనట్టి దుర్దమ తురు ♦ ష్కప్రాజ్యసైన్యాధినా
థుఁడనై సంగరచక్రమున్ గరములం ♦ దున్ద్రిప్పు నామానసిం
హుఁ డెవం! డన్నియుఁ జక్కనుండినను న ♦ త్యుల్లాసినై యెప్డు నా
యడుగుల్ గొల్చెదు నాశ్రితుండెకద! యా ♦ రా! కాల మెబ్బంగిదో! 81

సీ॥ అందఱొక్కవిధంబు ♦ ముందున్నది ముసల్ల పండుగ యన్నట్టి ♦ భంగిదోఁప
నిదిగో తోడరమల్లు ♦ నిరుదెస సింహమ్ముఁ జేరి కొల్చెడు వ్యాఘ్ర ♦ శిశువులట్లు
సూక్తసాగరులు నా ♦ సోదరు లిరువురు గనుపింతు! రకట! ర ♦ క్తంబుఁ బంచు
కొని యేకగర్భంబు ♦ నను బుట్టితిమి! ఛాయయట్లు నన్నెప్డు ♦ ననుసరింత్రు!
గీ॥ నాకు వారికి భేదమిం ♦ తయును గలదె! కదలినంతనె వారలే ♦ యెదురుపడుదు
రిది యవనసేనతోఁ జేయు ♦ కదనమో! స్వజనముతోఁ జేయు కదనమో! ♦ శంక గలిగె.

చ॥ బవరము లోకపావనము; ♦ భ్రాతలు మిత్రులు తండ్రులైన నా
హవమునఁదాఁక బోరుట నృ ♦ పాళికి ధర్మమటందు; రట్టి ధ
ర్మవెఱుఁగ లేకకాదు; మొగ ♦ ముల్గని సోదర బంధు మిత్ర కం
ఠవిదళనం బొనర్చుట క ♦ టా! కడుఁగ్రూరమటంచుఁ దోఁచెడున్." 83

సీ॥ అనఁ గవి "లేవాత్మ ♦ కయ్యవస్థాభేదనాశముల్ దేహంబు ♦ నకునుబోలె!
నాత్మ నిత్యంబు! దే ♦ హం బనిత్యము! వీరుఁడగువానికిని స్వధ ♦ ర్మాచరణము

---

❀ Raisi accompanied his proper liege lord the great Raja Mann of Amber against the heroic Rana Pratap of Mewar. Jaimall had been a great favourite with Akbar, for, of all the Rajapootana nobles, he had been the first to pay his respects to him and had ever rendered his true and loyal service. He had married a daughter of Raja Udai Singh of Jodhpur a princess possessing great strength of will.

"G. B. Malleson C S. I."

తల్లిదండ్రులకన్నఁ ♦ దనకన్న మిత్రులకన్నఁ జుట్టంబుల ♦ కన్న మిగుల
నుత్తమంబగు! క్షత్రి ♦ యుం డెప్పు డుత్తమోత్తమకర్మనిరతుఁడై ♦ తనరవలయు!
గీ॥ సమధికాత్మైకతత్త్వవి ♦ జ్ఞానమయుఁడ! వోటు గెలుపుల సమబుద్ధి ♦ నూహసేతు!
నీకు ధర్మంబులను నేర్ప ♦ నేనెవండ" ననిన దిటవూని నృపతి సై ♦ న్యములఁజూచి;

—*) ప్రతాపసింహుఁడు సైన్యాధిపతుల యుద్ధమునకుఁ బురికొల్పుట. (*—

సీ॥ "హారావళీపర్వ ♦ తాగ్రిగణ్యము విశ్వపావనమైన మే ♦ వాడసీమ
యీ కోన లీ లోయ ♦ లీ నదు లీ వను లీ భానుమండలం ♦ బిన్ని మనవి!
పూర్వు లెన్నియొ యుద్ధ ♦ ములుచేసి వారిరక్తములతో నీభూమిఁ ♦ దడిపినారు!
ప్రాణ మున్నంత కీ ♦ యవని విదేశీయు లాక్రమింపంగ నీ ♦ యంగరాదు!
గీ॥ కట్టకడయూపి రున్నంత ♦ కట్టె తనదు పట్టి బిగఁబట్టి పరులకుఁ ♦ బట్టియీని
జననికరణి హల్దీఘాటు ♦ కనుమ నాని పూని కాపాడుఁడో రాజ ♦ పుత్రులార! 85
సీ॥ ఇంతవిస్తారమం ♦ చెఱుఁగరానిది కాలపాథోధి! యలలు సం ♦ వత్సరమ్ము!
లా కాలగర్భంబు ♦ నం దెందఱు నృపాలు! రెన్నెన్ని దేశంబు! ♦ లెన్ని రణము!
లెన్నెన్ని జాతులో! ♦ యెందఱు గెలిచిరో! యెందఱు మడిసిరో! ♦ యెఱుఁగఁగలమె!
యందఱిలో నొక్కఁ ♦ డైన నేఁడున్నాఁడె! యశమె చిరస్థాయి ♦ యయ్యెఁగాక!
గీ॥ మూటలనుగట్టి యాయువు ♦ బుట్టకెత్తి శాశ్వతబ్రహ్మకల్ప మీ ♦ జగతినుందు
మో! యరులఁదాఁకి గెలుపొ యో ♦ టో గ్రహింత! మందతేకమనస్కులై ♦ యనికిఁజనుఁడు

ఉ॥ ఆవడగండ్లవానవలె ♦ నంతట విశ్వములోని దుష్టవా
తావరణంబు శుద్ధమగు ♦ నట్లొనరించెడు యుద్ధముల్ జగ
త్పావనముల్; విపక్షబల ♦ భంజనులై గెలుపొందివచ్చినన్
బూవులసోనవానలను ♦ భూజనముల్ గురియింత్రు మీపయిన్. 87
సీ॥ వనిని బూవులు రాలి ♦ పడును! వసంతుఁ డాదటవచ్చి మఱల న ♦ న్నిఁటిని దెచ్చుఁ!
జెడ నెండఁబాఱిన ♦ చెట్టులు క్రొక్కాఱు చినుకుల మఱల లేఁ ♦ జివురు దాల్చుఁ!
గొందఱో మనలోన ♦ నందఱో మడిసిన మనతావు చేకొంద్రు ♦ మనతనయులు!
నాయంతకేమొ యం ♦ తమునొందుదు నటన్న భయమింతయైనఁ గ ♦ న్పడఁగఁబోదు!
గీ॥ సాహసంబునఁ బోరి వి ♦ శ్వప్రపంచమునఁ బ్రజాహృదయముఁ జూఱఁ ♦ గొనెదమేని
మాట లేటికి! మనకింక ♦ మరణ మేది! క్షితిఁ జిరంజీవులమయి ని ♦ ల్చెదముగాక."

చ॥ అను విభువిక్రమోక్తులను ♦ నంతట నంతట నిల్చి తేజసిం
గును మహీఁగృష్ణసింహుఁడును ♦ గొండొకవైపున భానుసింగు యో
ధ నికర కర్ణపేయముగఁ ♦ దద్రస మింత తొలంగకుండఁగా
వినిచిరి యక్షరాక్షరము! ♦ వీరరసంబున నూఁగె సైన్యముల్. 89

సీ॥ గగనభాగంబెల్లఁ ♦ బగిలించి పరతెంచు పిడుగుతండముల స ♦ వ్వడులఁబోలి!
ప్రళయకాలాభీల ♦ వనదముల్ రాపాడ జనియించు మేఘగ ♦ ర్జనము మించి!
రంగ దుత్తుంగ త ♦ రంగపంక్తులు రేఁగు వనరాశి ఘోర ని ♦ స్వనముఁ గేరి!
సచరాచరప్రపం ♦ చము తూలిపడ వీచు ప్రకటప్రభంజను ♦ ధ్వనిని మీఱి!
గీ॥ దిగ్గజంబులు చెవు డెత్తి ♦ తెలివి దప్ప నట్టె హారావళీశైల ♦ మంత నిండి
యంబరేశ్వరు శిబిరంబు ♦ నదుర మ్రోగె సంగరారంభ దుందుభి ♦ స్వనభరంబు 90

—*) రాజపుత్ర సేనాధిపతులు యవనసేనలను దాఁకుట. (*—

సీ॥ అద్రి నెల్లెడ 'హర! ♦ హర! మహాదేవ!' యన్ సమరనాదం బాక ♦ సంబు నిండ
శ్రీసలుంబ్రాకృష్ణ ♦ సింహుఁ డాసప్‌ఖాను మూఁడువేల్ భటులతో ♦ మొదటఁదాఁకె!
బదసూరుభర్త షా ♦ బాజ్‌ఖాను రాయసింహుల కడ్డుపడె నంత ♦ బలముతోడ!
నాశ్వికత్రిసహస్ర ♦ మమర ఖేల్వాపతి యబ్దూరురహిమాను ♦ నని నెదిర్చె!
గీ॥ నప్రతీపప్రతాపాంకుఁ ♦ డాప్రతాపుఁ డతులకాలాగ్నిసమమూర్తు ♦ లగు శిశోది
యాన్వయులు మూఁడువేలతో ♦ యవనసైన్య మధ్యముననున్న తోడర ♦ మల్లుఁదాఁకె!
సీ॥ రెండువేలాశ్వికు ♦ లండఁగొల్వఁడ ఖాసింఖానుతో శ్యామ ♦ సింహనృపతి!
యంతటి బలముతో ♦ నద్రిధైర్యుఁడు రాయశీలునితో భాను ♦ సింహభర్త!
పూని యబ్దుల్లా చ ♦ మూపతితో రామచంద్ర మనస్సింహ ♦ శౌర్యఘనులు!
విక్రమ ప్రకటు లా ♦ వీరబలునితోడ బేడ్లా-కొఠారియా ♦ పృథ్వినాథు!
గీ॥ లాహవారంభ మొనరింప ♦ నలఘుబలుల నాత్మసుభటులఁ గొనుచు బ్ర ♦ హ్మాండమద్రువ
వీరగర్జారవమెలర్ప ♦ భీమచాందు భీకరాస్త్రంబులు నిగుడ్చి ♦ తాఁకె రిపుల. 92

మ॥ వనధుల్ రెండును దాఁకి ఘూర్ణిలెడు తే ♦ వన్ గొండతోఁ గొండ ఢీ
కొనున ట్లంబుదమాలికల్ దొడరి సం ♦ క్షోభించుచందాన యా
వనసైన్యంబులు రాజపుత్రచముపుల్ ♦ వైరంబు వీర్యంబు నె
క్కొనఁగ నొండొండు కలంగఁదాఁకె సమర ♦ క్రోధప్రవృద్ధంబులై. 93

# హల్దీఘాటుకనుమ.

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| | | | | ... | ... | ... | ... | ... భిల్లులు |
| ఖేల్యాపతి 3000 ఆశ్వికులు | రాఠోడు తేజసింహుఁడు 3000 ఆశ్వికులు | సలుంబ్రా కృష్ణసింహుఁడు 3000 ఆశ్వికులు | మహారాణా ప్రతాప సింహుఁడు 3000 ఆశ్వికులు | శ్యామ సింహుఁడు 2000 ఆశ్వికులు | భానుసింహుఁడు 2000 ఆశ్వికులు | రామచంద్రుఁడు ఖండేరావు మనస్సింహుఁడు 2000 ఆశ్వికులు | బేడ్లా-కొఠేరి యాన్నృపులు 4000 ఆశ్వికులు | భీమ చాంను 30000 భిల్లులు |

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| అబ్దూ రహిమాను 50000 కాల్బల్వురు | షాబొజుఖాఁ- రాయ సింహుఁడు 100,000 కాల్బల్వురు | ఆసఫ్ఖాను 25000 ఆశ్వికులు | తోడరమల్లు- సూర్తుఁడు- సాగరుఁడు. 50000 ఆశ్వికులు | ఖాసింఖాను 25000 ఆశ్వికులు | రాయశీలుఁడు 50000 తుపాకి ఫౌజు | అబ్దుల్లాఖాఁ 50000 కాల్బల్వురు | వీరబలుఁడు 50000 కాల్బల్వురు |

| |
|---|
| కున్వార్ మానసింహుఁడు- సలీము అంబరు బలము 25000 ఆశ్వికులు. |

మ॥ పెడఁగుంగత్తుల మేల్తళ్ళత్తళల దోః ♦ వీథిఁ దటిత్పుంజముల్
పొడమన్; వీరరసావతారులగుచున్ ♦ మోగల్ భటగ్రామణుల్
కడుశౌర్యమ్మున రాజపుత్త్రకులపై ♦ లంఘించి దోర్దర్పమే
ర్పడ నొక్కుమ్మడిఁ దాఁకి యార్చిరి రణ ♦ ప్రారంభ సంరంభులై. 94

—*) ఖేల్వాపతి-యబ్దూరహిమానుతోఁజేయు యుద్ధము. (*—

ఉ॥ తారకదైత్యనాథు ననిఁ ♦ దాఁగొని యొంచు కుమారుభంగి ఖే
ల్వారమణుండు బాహుబల ♦ వైభవుఁ డా లయకాలభైరవా
కారుల యోధులన్ గొనుచు ♦ గాఢరయంబున నేగి తాఁకె న
బ్దూరహిమాను మోగలులు ♦ తోడనె వెన్కకుఁ దూలి యార్వఁగన్. 95

ఉ॥ ఆతఁడు శైలముల్ పగుల ♦ నార్చుచు నేఁబదివేలు వీరపా
దాతుల హెచ్చరించుచు గ ♦ దా కరవాల పరశ్వధాయుధ
వ్రాతములన్ ధరించి గిరి ♦ వర్గము భేదిలఁ దాఁకు నాబలా
రాతివిధానఁ దాఁకె నతి ♦ రౌద్రభరమ్మున రాజపుత్త్రులన్. 96

మ॥ ఇరువైయేఁడుల ప్రాయమున్ జెలువమున్ ♦ హెచ్చింప వారిర్వురున్
స్మరుఁడున్-శంబరు నట్లు సాత్యకియు-న ♦ శ్వత్థామయున్ బోలె నొం
డొరు వెన్నీక హయాధిరూఢులగుచున్ ♦ యుద్ధంబు సాగింప న
య్యిరువాగున్ భటులెల్ల నిల్చిరి దిదృ ♦ క్షైకాగ్రచేతస్కులై. 97

సీ॥ ఉభయకూలంబుల ♦ నుప్పొంగి యుల్లోలకల్లోలమాలికల్ ♦ గడలుకొనఁగ
నతితరధాటితో ♦ నరుగు నఖండగంగాప్రవాహాభరంబు ♦ కరణి దూఁకు
రాజపుత్రచమూభ ♦ రంబుదాకకు మొగల్కాండముల్ పులినోటి ♦ కండలయ్యె;
నెంత ఖండించిన ♦ సుంతయుఁ జెడక సముద్రతరంగముల్ ♦ పోలెఁ బొంగి
గీ॥ పొరలి పైకెత్తివచ్చు న ♦ మ్మొగలుపక్ష వాహినీభూరిపరిమాణ ♦ భార మప్పు
డతులిత పరాక్రమోపేతు ♦ లైన రాజపుత్రసైనికులకుఁ దల ♦ మున్కలయ్యె. 98

మ॥ కుదురొంచున్ మహబాజుఖానుఁడు తుపా ♦ కుల్ ప్రేలిపింపంగ నేఁ
బదివేల్ గుండులు లేచి ధూమము నభో ♦ భాగంబుఁ గప్పంగఁ దు
మ్మెదలున్ బోలె దటాలునన్ వెడలి క్రు ♦ మ్మెన్ రాజపుత్రాస్యప
ద్మదళంబందునఁ! జేతఁ దట్టి యవి క్రిం ♦ దన్ గొట్టి రవ్వీరులున్! 99

—*) తేజసింహుఁడు యవనసైన్యముపైఁ బడి ధ్వంసముచేయుట. (*—

మ॥ పెడబొబ్బల్ నికటాద్రిశృంగములఁ ద ♦ బ్బిబ్బై పడన్ జేయ. బ
ల్విడిఁ దారుష్కపదాతివర్గము విజృం ♦ భించెన్; మహావీరయో
ధుఁడు రాణ్మణి తేజసింగు భటులన్ ♦ దోడ్కొంచు వైరివ్రజం
బడఁగన్ దాఁకెను శంఖమూఁదుచును బ్ర ♦ హ్మాండంబు భేదిల్లఁగన్. 100

సీ॥ ఒకమాఱు ముందున ♦ కుఱికి సందొనరించి యవనయోధుల శిరం ♦ బవియ మోదు!
నొకమాఱు దాపటి ♦ కుగ్రుఁడై దూఁకి యందిన వారినెల్లను ♦ ద్రెళ్లఁ జేయు!
నొకమాఱు వలపటి ♦ కురవడి లంఘించి యందఱఁ దున్మి తూఁ ♦ టాడి నైచు!
నొకమాఱు పిఱిఁది కిం ♦ చుకతగ్గి తనచుట్టు వెనుక నుండెడివారిఁ ♦ బిలుకుమార్చుఁ!

గీ॥ దీఁగమెఱుపట్టు లశ్వంబుఁ ♦ ద్రిప్పికొనుచు మృత్యుదేవత చందాన ♦ మెలఁగె! నపుడు
యవనపాదాతిదళముల ♦ చెవుల మ్రోసె యమ మహిష కంఠ ఘంటా మ ♦ హాస్వనంబు.

చ॥ అడరి మహాగ్నికీలలను ♦ నంతటఁ జిమ్ము తుపాకిగుండులున్
గడుపునఁ జొచ్చి చుట్టుతిరు ♦ గన్ బలువేదన నొందు మర్త్యులై
పడి నల తేజసింగు భట ♦ వర్గము దానును గర్భమున్ జొరన్
బడఁగఁ దురుష్కసైన్యములు ♦ బగ్గముపాడుగఁ గూలె నేలకున్. 102

ఉ॥ ఆమహబాజుఖాను సుభ ♦ టాళులఁ గొందఱఁ గొంచు విద్విష
ద్భీషణబాహుగర్వమునఁ ♦ దేజిని ముందుకుఁ బూన్చె; నంతలో
రోషకషాయితాక్షుఁడు గు ♦ రుస్థిరశౌర్యుఁడు రాయసింహుఁ డా
శేషఫణీంద్రుమాడ్కిఁ గవి ♦ సెన్ రభసమ్మునఁ దేజసింహుపై. 103

శా॥ ఆవీరుల్ హయముల్ గదల్చుకొని శౌ ♦ ర్యాయత్తులై మీఁదికిన్
రా వీక్షించి గజంబులన్ గనిన హ ♦ ర్యక్షప్రభుం డో యనం
గా విచ్చేసెను సింహనాదము వెలుం ♦ గన్ దేజసింహేంద్రుఁ డా
ప్రావృట్కాల పయోద గర్భగత గ ♦ ర్జాస్ఫూర్తిఁ గ్రేణించుచున్. 104

సీ॥ కల్పాంతకాల మే ♦ ఘము గర్భముననుండి వెడలు సౌదామనీ ♦ వితతి మించి
తతమండలాగ్రి దీ ♦ ధితులు దిక్కులఁబర్వఁ ద్రిప్పుకొంచును బోయి ♦ తేజసింగు
వార లిర్వురమధ్య ♦ వ్రాలి పో రొనరింప జ్యోతిర్లతలు చుట్టు ♦ ముట్టినట్లు
కనులు కానఁగరాక ♦ వెనుకకుఁ దిరిగి భీకరహయంబులు త్రిప్పి ♦ మఱలఁదాఁకి!

గీ॥ రంత రాఠోడ్కులుండు క ♦ ల్పాంతరుద్రు శూలమునుబోలు కుంతంబుఁ♦గేలఁ దాల్చి
"తెగితి రింకెందుఁ బోదురో ♦ ధీరులార!" యనుచు సింహనాదమునఁ బై ♦కురుగు దెంచె.

మ॥ ఉదయద్భాను సహస్ర బింబగత ర ♦ క్తోగ్ర కాంతిచ్ఛటల్
వదనం బీనెడు తేజసింగు నెదిరిం ♦ పఁగ ధైర్యముల్ లేక పైఁ
గదియుండంచు భటాళికిం దెలిపి చ ♦ క్కఁగ బాటి రాయిర్వు; ర
య్యదనం గాల్చెను దేజసింహదహనుం ♦ డావైరి సైన్యాటవిన్. 106

గీ॥ అసమ దక్షాధ్వర ధ్వంస ♦ మాచరించు నుగ్రశివుఁబోలెఁ దేజసిం ♦ హుండు పొదివి
ద్రచ్చి-వందఱలాడ, వి ♦ పక్షసైన్య మాక్షణం బకాండప్రళ♦యమున మునిఁగె. 107

—*) సలుంబ్రా కృష్ణసింహుఁడు – ఆసఫ్ఖానుతోఁ దలపడుట. (*—

శా॥ ఆసంరంభ విజృంభణంబు నఖిలం ♦ బాలించి కోపోగ్రుఁడై
యాసఫ్ఖానుఁడు పంచవింశతి సహ ♦ స్రానీకినిం బూన్చుచుం
డా సేఁ ముందుకు; మూఁడువేలు భటు లం ♦ దం గొల్వఁగా నాసలుం
బ్రాసింహం బెదిరించె నాతని భుజా ♦ వష్టంభ సంరంభమై. 108

సీ॥ ఎనిమిదంతలు బలం ♦ బెక్కుడై యున్నఁ జోండావతుల్ విక్రమా ♦ డంబరమునఁ
జిచ్చఱపిడుగులై ♦ చెలరేఁగి యావనాశ్వికులపై ప్రాలి ని ♦ ర్జింపఁ జొచ్చి;
రాతురుష్కులు విజ ♦ యాతురుల్ సంఖ్యాబలమున నొక్కఁడుగఁ గ ♦ లంగఁదాఁకి;
రుభయసైన్యంబు లొం ♦ డొంటి సోఁకినఁ దోఁచె నుదధిద్వయము పొంగి♦యొరసినట్లు;

గీ॥ ప్రళయకాలాంతకోగ్ర జి ♦ హ్వా కరాళ దీర్ఘకుంతంబురుచులు న ♦ ల్దెసలఁ బరవ
నాసలుంబ్రాధినాథుండు ♦ యవనవీర సుభటవక్షమ్ములను గ్రుమ్మఁ ♦ జొచ్చె నపుడు.

క॥ కడు నున్నతాశ్వమును గుడి యెడమలకుం ద్రిప్పుకొనుచు ♦ నిన తేజుఁడు కృ
ష్ణుఁడు రిపులగాత్రములు పచ్చడిమైపడ నడికెఁ శౌర్య ♦ సాహసవృత్తిన్. 110

చ॥ అదిగని యోర్వలేక జ్వలి ♦ తాగ్రహుఁ డాసఫుఖాను కృష్ణునిం
గదిసిన నాతఁ డశ్వమును ♦ గ్రక్కున వెన్కకుఁదీసి యొక్కపె
ట్టదరఁగఁ దాఁకి సాక్షుఁడగు ♦ నాసఫుఖానుని గొంచుఁబోయెఁ బె
ల్లెదిగి తృణంబు నెత్తుకొని ♦ యేగెడు నా సుడిగాలి కైవడిన్. 111

ఉ॥ సాహసవంతులుం సమర ♦ శౌర్యనిధానులు రాజపుత్రులు
త్సాహభరంబుతోడ రిపు ♦ సైన్యములం జొరఁబారి చీల్పఁ ద

ద్వాహిని పట్టుదప్పి నలు ♦ వంకలకుం జెడఁబాఱె! నట్టి కో
లాహల మాకసంబు పగు ♦ లం గవిసెం నలుదిక్కులందునన్. 112

—*) ప్రతాపసింహుఁడు — తోడరమల్లు సైన్యముఁ దాఁకి చీకాకుగావించుట. (*—

మ॥ తనసూర్యధ్వజ మొక్కచేత నొకచే ♦ తం శేషనాగేంద్రుఁబో
లిన దుర్వారకరాళఖడ్గము రుచుల్ ♦ నింపం జగజ్జాలముం
దునుమాడం జనుదెంచు నాప్రళయ రు ♦ ద్రుండోయనంగాఁ బ్రతా
పనృపోత్తంసుఁడు కొండ డిగ్గి యహిత ♦ వ్రాతంబు డాసెం వడిన్. 113

ఉ॥ ఎత్తుననుండి వచ్చు కడు ♦ నెత్తగు నశ్వము! దానిపైన లో
కోత్తర శౌర్య సాహస స ♦ మున్నతమూర్తి ప్రతాపదేవుఁ! డా
యుత్తమువెంట నొత్తుకొని ♦ యుగ్రబలాఢ్యులు సూర్యవంశ్యరా
హుత్తులు! మొత్తమై గదలి ♦ రుర్విసమస్తము కంప మొత్తఁగన్. 114

క॥ ఆరాజపుత్రసుభటుల యారభటులు యవనసైని ♦ కాళుల పృథుగ
ర్జారావంబులు నిబిడంబై రోదసినిండిఁ బొంగి ♦ యవలికిఁ బర్వెన్. 115

మ॥ త్వర లంఘించుచు వచ్చి సింహములు మా ♦ తంగోత్తమాంగంబులన్
ఖర నిర్ఘాత నఖాగ్రసంతతుల వ్ర ♦ క్కల్ చేయుచందాన భా
స్వరశౌర్యాఢ్యులు రాజపుత్రులు తురు ♦ ష్క శ్రేణిపై వ్రాలి నె
త్తురునుం గండలు కాల్వలై ధరణియం ♦ దుం బార్చి రొక్కుమ్మడిన్. 116

ఉ॥ శృంగము భంగమైన వృష ♦ భేంద్రనిచందము దోఁపఁ దోఁకఁ దొ
క్కంగనె పైకిఁదూఁకు భుజ ♦ గప్రభుమాడ్కి సరోషసాహసా
భంగురమై తురుష్కభట ♦ వర్గము రేఁగుచు రాజపుత్ర సే
నాంగము వెన్కకుంబడ మ ♦ హాబలధాటిని దాఁకె నయ్యెడన్. 117

ఉ॥ కత్తులు తాఁకు చప్పు! డెయిఁ ♦ గప్పిన జోడులు చిన్గు చప్పు! రా
హుత్తులు వ్రాలు చప్పుడు! హ ♦ యోత్తమముల్ ధరఁగూలు చప్పుడుల్!
దుత్తలఁబోలె నెత్తురులు ♦ దూఁకెడు చప్పుడు! గాయ మొంది యె
ల్గెత్తినవారి చప్పుడులు! ♦ నెల్లెడ రేఁగె రణాంగణంబునన్. 118

ఉ॥ ఒక్కొకరాజపుత్రకుల ♦ యోధుని బెక్కురు చుట్టుముట్టి యు
క్కెక్కిన మొగలుల్ గవిసి ♦ యెల్లెడ నొంపఁగసాఁగి రౌర! వా

రౌక్కకరున్ బ్రతాపనృపు ♦ నుజ్జ్వలమూర్తులనంగ వైరులన్
సుర్క్కఁగఁజేసి! రెంతటి య ♦ శోనిధులొక్కొ! శిశోదియాకులుల్. 119

మ॥ పొదివై తాఁకెదు రాజపుత్రుల బలం ♦ బుల్ పుష్కలావర్తనీ
రదముల్గాఁగఁ, బ్రతాపభూవరుఁడు ప ♦ ర్జన్యుండుగాఁగన్, బ్రభా
స్వదవర్మంబులు చంచలాతతిగ, శుం ♦ భత్ఖడ్గ తీవ్రాశనుల్
గుదులై రాల్పఁ దురుష్క సైన్యములు ను ♦ గ్గున్ నూచమై పోలినన్; 120

మ॥ విరియన్ బారెదు వాహినీనికరమున్ ♦ వీక్షింపఁగాలేక తో
డరమల్లందఱ హెచ్చరించుచుఁ బ్రచం ♦ డస్ఫూర్తిమైఁ దాఁకె; సా
గరుఁడున్ సూర్తుఁడు కోపఘూర్ణిత కటా ♦ క్షశ్రీలు రంజిల్లఁ గే
సరియుగ్మంబువలెన్ బ్రతాపుపయి ను ♦ త్సాహంబుతోఁ దూఁకఁగన్. 121

సీ॥ త్రిజగద్విరోధులౌ ♦ త్రిపురాసురులతోడఁ దొరయు కైలాసమం ♦ దిరుఁ డనంగ!
విలయకాలమున జృం ♦ భించు త్రేతాగ్నుల ముంచెడు వరుణదే ♦ వుం డనంగ!
మాల్యవన్మాలి సు ♦ మాలిముఖ్యులఁ బట్టి వేధించు శ్రీమహా ♦ విష్ణుఁ డనఁగ!
ఖరదూషణాది ర ♦ క్షశ్శ్రేష్ఠులన్ గోపమునఁ దాఁకు శ్రీరామ ♦ మూర్తియనఁగ!
గీ॥ నసమ విక్రమ రణ సాహ ♦ సాంకమూర్తి యాప్రతాపుఁడు సర్వసం ♦ హారలీల
సాఁగి సూర్త తోడరమల్ల ♦ సాగరులను మించి కలగించి యొంచి డ♦య్యించెనపుడు.

మ॥ బరువై యొప్పెడు దీర్ఘఖడ్గము ప్రతా ♦ పస్వామి పైకెత్తి తో
డరమల్లున్ బడమోది కంకటము గా ♦ డన్ జీల్చి సూర్తున్ ధరన్
బొరలన్ దప్పఁగఁద్రోసి సాగరు శిరం ♦ బున్ జూచి వేయంగ, ము
వ్వురు నవ్వీరునిమ్రోల నిల్వక పరీ ♦ భూతాత్ములై పాఱినన్, 123

మ॥ ఉరగవ్రాతము సంహరింపఁగ మహో ♦ గ్రోత్సాహమున్ బెంచు నా
గరుత్మంతుఁడు వానిచుట్టములపై ♦ కన్ రాజరాజేశ్వరుం
డరుగన్ దెంచెఁ బ్రతాపుఁడున్ భటయుతుం ♦ డై! యావనశ్రేణి దు
ర్భర తద్ఘోర కఠోరధాటికిఁ జలిం ♦ పన్ సాగె నాద్యంతమున్. 124

❀ మ॥ కడుశాంతంబు నగాధమై పొలుచు నా ♦ గంభీరవారాశిలో
నుడుకున్ నీళ్లప్రవాహ మొక్కముగమై ♦ యుప్పొంగుచున్ బాఱు నై

❀ It emerges from the gulf as the famous Gulf Stream and is joined by the Ncr.h Equatorial current. At first the Gulf-Stream is a rapid current of dark

వడి రాణాయు శిశోదియాభటులు గ ♦ ర్భంబున్ బ్రవేశించి య
య్యెడఁ దౌరుష్క చమూసమూహము బలం ♦ బింకించి రత్యుగ్రులై. 125

ఉ॥ మందరశైల మంబునిధి ♦ మధ్యము చొచ్చి కలంచునట్లు చు
ట్టుం దళమొందు మొగలు భ ♦ టుల్ పదులున్ శతముల్ సహస్రముల్
మ్రిందఁ బ్రతాపసింహుఁడు బ ♦ లస్థిరు లాతని యోధవీరు లం
దండఁ బరాక్రమస్ఫురణ ♦ మచ్చుపడన్ విహరించి రయ్యెడన్. 126

—*) శ్యామసింహ – ఖాసింఖానుల యుద్ధము. (*—

మ॥ ఇరువైయైదగు వేల యాశ్వికబలం ♦ బిర్వంకలన్ గొల్వ సు
స్థిర దుర్వార పరాక్రమక్రముఁడు ఖా ♦ సింఖానుపై శత్రుసం
హరణోద్యోగుఁడు శ్యామసింహవిభుఁ డా ♦ సాదీశుఁడున్ వీరకే
సరియో నాఁగఁ బరాక్రమించి నడిచెన్ ♦ ఝూలాన్వయుల్ గొల్వఁగన్. 127

మ॥ క్రతుకాలమ్మున యాయజూకుఁడు హవి ♦ ర్వ్రాతంబులన్ వహ్ని నా
హుతులన్ జేసెడునట్లు శత్రుభటులన్ ♦ యుద్ధంబునన్ దాఁకి శీ
ర్షతతిన్ ద్రుంచుచు శ్యామసింహుఁడు గుహా ♦ సంఘాతముల్ వ్రక్కలై
క్షితిపై రాలఁగ సింహనాదము నొన ♦ ర్చెన్ వీరశౌర్యార్భటిన్. 128

ఉ॥ దండధరోపమాన భయ ♦ దస్థిర మేచక దీర్ఘదేహు లు
ద్దండ కృపాణపాణులయి ♦ దర్ప మెలర్ప మహమ్మదీయు లా
భండనసీమ వైరిభట ♦ భంజనమున్ బొనరింప, గాలిచేఁ
బండులు భూమిపైఁ బొరలు ♦ భంగి శిరంబులు దుల్లెఁ బెల్లుగన్. 129

శా॥ బాహాశౌర్యులు శ్యామసింహుఁడును ఖాన్ ♦ వర్యుండు శౌర్యోగ్రులై
బాహాబాహి కచాకచిన్ బల మెల ♦ ర్పన్ బోరఁ దద్దర్శనో
త్సాహశ్రీరతులౌచు రెండు మొనలన్ ♦ దైవారు రాహుత్తు లెం
తో హర్షంబున మాన మూని రణమం ♦ దున్ నిల్చి రవ్వేళలో. 130

---

blue warm water. The average is three miles an hour or five miles in the coldest and warmest seasons. This is about equal to the speed of the Ganges or Irrawady. The current speeds out and becomes the North Atlantic Drift, flowing right across the Atlantic and keeping warm the shores of the British Isles and north western Europe generally.

"L. Dudley Stamp"

ఉ॥ అత్తఱి విక్రమించి భయ ♦ దాహవశౌర్యుఁడు శ్యామసింహభూ
భృత్తిలకుండు శీర్షకము ♦ భేదిల మోదుచు ఖాను ఖడ్గము
ద్వృత్తి వియత్తలంబునకుఁ ♦ దెవ్వఁగఁగొట్టి హయంబుఁ గూల్చ నో
రెత్తక వాఁడు మానము వ ♦ హించుచుఁ బాఱెను నేల దూఱుచున్. 131

—*) భానుసింహుఁడు — యవనసేనల నుఱుమాడుట. (*—

మ॥ దెసలెల్లన్ దన కేతనప్రభలు సం ♦ దీప్తంబులై వెల్గ సా
హసశౌర్యాంకుఁడు భానుసింహవిభుఁ డ ♦ య్యాదిత్యుఁడున్ బోలె వె
క్కసమౌ తేజముతోడఁ బొంగుచు విప ♦ క్షవ్రాతమున్ జీల్చ వీ
రసమూహంబును మోహరించుకొను సం ♦ రంభంబు వీక్షించుచున్; 132

చ॥ యవనులవైపు యోధులను ♦ నాజయమల్లుఁడు రాయశీలుఁ డా
హవమున కెచ్చరింప రయ ♦ మారఁ దుపాకులు గాల్చి రందఱున్;
బవనము వీవఁ దుమ్మెదలు ♦ పద్మములన్ విడివచ్చునట్లు గుం
డ్లు వెడలి రాజపుత్రభట ♦ లోకముపైఁబడియెన్ మహోగ్రమై. 133

చ॥ పిడుగులు గుంపులై పడెడు ♦ వీఁకను నిప్పులు రాలునట్లు పైఁ
బడెడు తుపాకిగుండ్ల జడి ♦ వానలపెల్లున కోర్వఁజాలమిన్
దడఁబడి రాజపుత్రభట ♦ తండము ముందును వెన్క దోఁప క
య్యెడ స్పృహలేక నిల్వఁబడె ♦ నెచ్చటి గుంపచటన్ స్థిరంబుగన్. 134

మ॥ "అకటా! శత్రులు వేయఁ బెల్లెగయు న ♦ య్యాగ్నేయ మాహేంద్ర నా
గ కఠోరాస్త్రచయంబుఁ జూపులనె ప్ర ♦ క్కల్ సేయువారయ్యు రా
జకులాగ్రేణ్యులు స్వల్ప మియ్యనలవ ♦ ర్షంబున్ భరింపంగఁజా
లక ముం దేగక వైరిఁగూల్ప కిటు ని ♦ ల్వన్ బాడియే! యియ్యెడన్." 135

చ॥ అనుచును భానుసింహవిభుఁ ♦ డాడి హయంబుఁ గదల్చి వెంటరం
డని కదలన్ భటాళి నిబి ♦ డాళిప మారవివెంట నేగు న
ట్లనుపమధాటి లేచి యన ♦ లాస్త్రపరంపర కోర్చి శత్రుసే
న నెదుగఁ బాఱె; నంతట ర ♦ ణంబు చెలంగె భయానకస్థితిన్. 136

చ॥ కదువడి రాజపుత్రులు ము ♦ ఖాముఖిఁ జెంతకువచ్చి దూఁకి పైఁ
బడఁగ మహమ్మదీయులు తు ♦ పాకులు గాల్పఁగ వీలులేక యా

బడెలను ద్రిప్పి మోదిరి; కృ ♦ పాణ భయంకర తీక్ష్ణ ధార లై
లైడ నిగుడంగ వారి నల ♦ యించి కలంచిరి రాజపుత్రకుల్. 137

చ॥ తరణి నభంబునన్ దిరుగు ♦ దారి మెలంగుచు భానుసింహుఁ డ
త్తఱి జయమల్లు శీర్షకము ♦ ధాత్రిని వ్రాలఁగ మోది ముందుకున్
బరచుచు రాయశీలు ఘన ♦ వక్షము నుద్ధతి వ్రేయ నాతఁడున్
సరగునఁ బాఱె ఖడ్గము భు ♦ జంబున సోఁకుచు నెత్తు రొల్కఁగన్. 138

మ॥ ఖురసంఘట్టన రేఁగు ధూళి సమర ♦ క్షోణిన్ దివిన్ జేరఁగా
హరిశౌర్యాఢ్యులు రాజపుత్రకులు కో ♦ పాటోప మేపారఁ ద
త్కరవాలోగ్ర భుజంగకోటికిఁ దురు ♦ ష్క ప్రాణవాతంబు ల
త్తఱి భక్షింపఁగఁ బెట్టి యార్చిరి వియ ♦ ద్ధాత్రుల్ ప్రకంపింపఁగన్. 139

—*) రామచంద్రదేవుని యుద్ధము. (*—

మ॥ సమరోత్సాహ విజృంభమాణ పటు గ ♦ ర్జాస్ఫూర్తితోఁ గొండనుం
డి మనస్సింహుఁడు రామచంద్రపతి ఖం ♦ డేరావు దోస్సారులై
బొమవిండుల్ ముడిదేలఁగా వెడలి య ♦ బ్దుల్లా చమూశ్రేణి స
ర్వము చీకాకుపడంగఁ దాఁకి సమయిం ♦ పన్ జొచ్చి రాచెంగటన్. 140

శా॥ తోఁకన్ ద్రొక్కు భుజంగరాజువలె న ♦ బ్దుల్లా ఖొరాసాన్ భటా
నీకంబున్ బురికొల్పి గ్వాలియరుక్షో ♦ ణీనాయకున్ దాఁకె; ము
క్కాఁకల్ దీఱిన యానృపోత్తముఁడు ఖ ♦ డ్గం బెత్తి సింహంబటుల్
కేకల్ వేయుచు వానిమస్తముఁ బగి ♦ ల్చెన్ మొగలుల్ బెగ్గిలన్. 141

శా॥ పెల్లై రక్తము దూఁకి మూర్ఛిల, భటుల్ ♦ వీక్షించి శీఘ్రంబె య
బ్దుల్లాఖానుని మోసికొం చవలికిన్ ♦ బోవన్ మనస్సింహుఁ డ
త్యుల్లాసంబునఁ బొంగుచున్ రిపులపై ♦ నుద్వృత్తి లంఘించుచున్
ద్రుళ్ళన్ జేసెఁ దురుష్క వీరభటసం ♦ దోహంబు నిర్వంకలన్. 142

మ॥ ఒకమూల్తానువిభుండు దుర్దముఁ డలా ♦ యుద్దీనుఁడన్ వీరుఁ డో
ర్వక యుద్ధాంగణమందు నల్దెసలకున్ ♦ బాఱన్ బ్రయత్నించు సై
న్యకదంబంబుల హెచ్చరించుచు దద ♦ ధ్యక్షత్వమున్ బూని యా
జికి ధైర్యం బిగురొత్తఁ జేసి మరలిం ♦ చెన్ బూన్చి యవ్వేళలో. 143

—*) ఖండేరావు యుద్ధము. (*—

సీ॥ పదునాఱువర్షముల్ ♦ పాయని ప్రాఁపలేఁబ్రాయంబు సౌకుమా ♦ ర్యము వెలార్పఁ!
దరుణారుణాబ్జప ♦ త్ర విశాలమగు తేట కనుఁగవ పరమభా ♦ గ్యంబుఁ దెలుపఁ!
దనమూర్తి సొబగు మ ♦ దన వసంత జయంత సౌందర్యములకు సి ♦ గ్గందఁ జేయ!
నిజ తనుత్రాణ కాం ♦ తిచ్ఛట లఖిలభాగములందు దుర్నిరీ ♦ క్షతను బెంప!
గీ॥ నసమ వజ్రాభరణశోభి ♦ యై తనర్చు దొడ్డకాంభోజహయము ముం ♦ దునకుఁ ద్రిప్పి
రామచంద్రు ఖండేరావు ♦ రణముఖమునఁ దాఁకె విక్రాంతి వఱల మూ ♦ ల్తానుదొరల.

మ॥ పులిపిల్లల్ చెలరేఁగి పైబడునటుల్ ♦ మూల్తాన్ ఖొరాసాను యో
ధులు కౌక్షేయక కుంత ముద్గర గదా ♦ దుల్ దాల్చి శౌర్యంబు వా
టిల నొక్కుమ్మడి వచ్చి పైఁబడిరి; ఖం ♦ డేరాయఁడున్ దుర్భర
జ్వలనుండోయన యుద్ధసీమఁ జరియిం ♦ పన్ సాగె వీర్యాఢ్యుఁడై. 145

మ॥ నికటారామఫలాళిఁ బాలకుఁడు ఖం ♦ డింపన్ మొదల్ పెట్టు నా
రకమై పాచకసార్వభౌముఁడును గూ ♦ రల్ గోయు నట్లాచుఁ బూ
నికమై వీరవిహారముల్ నెఱపి ఖం ♦ డేరావు తౌరుష్కయో
ధకదంబంబుల మస్తముల్ దునిమె దు ♦ ర్దాంతక్రియాభీలుఁడై. 146

మ॥ వరుసన్ భీమ-ఘటోత్కచా-ర్జునులద ♦ ల్పన్ భీతిమైఁ బాఱు న
క్కురుసైన్యంబుల భంగిఁ బాఱిరి తురు ♦ ష్కుల్ రామచంద్రుండు సు
స్థిరశౌర్యుండు తదీయపుత్రుఁడు మన ♦ స్సింహుండు దుర్దాంతవీ
రరసావేశముతో నరాతిభటశీ ♦ ర్షంబుల్ విదారింపఁగన్. 147

—*) బేడ్లా - కొఠేరియా ప్రభువుల యుద్ధము. (*—

గీ॥ ప్రణయబద్ధులు చోహాణ ♦ వంశ్యమణులు వీరమూర్తులు బేడ్లా-కొ ♦ ఠేరియా నృ
పతులు నాల్గువేలాశ్విక ♦ బలము గొలువ యవనులను దాఁకి రపుడు భ ♦ యంకరముగ.

ఉ॥ గండశిలాప్రపంచము న ♦ గంబుననుండియు దొర్లినట్టు లు
ద్దండమహోన్నతాశ్వికవి ♦ తానము నాలుగువేలసంఖ్య పై
నుండియు మీఁదరా నిలువ ♦ నోపక యావనసేన లన్నియున్
బండిన పైరునాఁ దలలు ♦ వాల్చుచు మ్రొగ్గె రణాంగణంబునన్. 149

మ॥ కవలున్ గౌరవసేనలన్ బొదివి త్ర ♦ క్కుల్ చేయుచుండాన దా
నవసైన్యంబుఁ గలంచు దంతిముఖ-సే ♦ నానుల్ వలెన్ వచ్చి శౌ
ర్యవికాసంబునఁ జోహణప్రభుకుమా ♦ రద్వంద్వ మవ్వేళ శా
త్రవసైన్యంబుల కంఠలుంఠన మొన ♦ ర్పన్ సాగె వేభంగులన్. 150

—*) భిల్లులు - యవనులతోఁ జేయు యుద్ధము. (*—

మ॥ కడునెత్తుండెడు కోటకొమ్ముగుములన్ ♦ గండోపలశ్రేణిపైఁ
వడిఁ గూర్చుండిన భిల్లులున్ ధనువులన్ ♦ బాణాళి సంధించి సం
దడిగా నార్చుచు వేయఁగాఁదొడఁరి; రే ♦ తద్బాణసందోహముల్
జడివానల్ వలెఁ బెల్లు ముంచెను దురు ♦ ష్క ప్రాజ్య సైన్యంబులన్. 151

చ॥ అచలనితంబభాగముల ♦ యందు రహించెడి గొప్పగుండులన్
బ్రచురబలుల్ కిరాతభట ♦ వర్యులు నూఱులు వేలు పట్టి పూ
నిచి కదలించి, దొర్లెడు ధ్వ ♦ నిన్ గిరు లన్నియు వ్రీల శత్రుహ
స్తిచయము నిల్చుచోటికిని ♦ జెచ్చెరఁ ద్రోసిరి గుంపుగుంపుగన్. 152

ఉ॥ ఆపయినుండి దుర్గమ మ ♦ హాబలఘాటిని దాఁటివచ్చు గం
డోపలకోటి మార్గమున ♦ నున్న పదార్థములెల్ల నజ్జుగు
జ్జై పడ వ్రాలి మోగలు గ ♦ జావళిఁ జొచ్చి పదుల్ శతంబులున్
రూపఱ దొర్లసాఁగె యవ ♦ నుల్ ప్రళయంబున మున్గి కూలఁగన్. 153

మ॥ హనుమద్వానరభర్త శైలముల బా ♦ హాశక్తిమై తెచ్చి వై
చిన రామాయణయుద్ధమందు నసుర ♦ శ్రేణుల్ వలెన్ వ్రాలి యా
వనదంతావళకోటియున్ శిలలు పై ♦ వ్రాలన్ ధరన్ వ్రాలి యొ
క్కనిమేషంబున మ్రగ్గె నట్టులవలెన్ ♦ గాత్రంబులున్ నుగ్గుగాన్. 154

చ॥ వెఱచుచుఁ గాలిమూఁకలును ♦ బిక్కబలంబునఁ బాఱె; నాశ్వికుల్
పరచిరి నోరులన్ దెఱచి ♦ ప్రక్కలకున్ గిరి నెక్కలేక; యు
ద్ధురతఁ దుపాకిఫౌజులును ♦ దోడనె కాల్చిరి; కాని గుండు లా
గిరిపయినున్న భిల్లతతి ♦ క్రేవకుఁ బోక పడెన్ ధరిత్రిపై. 155

శా॥ ఆమాయాశబరస్వరూప మనఘుం ♦ బై యింద్రకీలాచలో
ద్దామప్రస్థములన్ జరించు గజదై ♦ త్యధ్వంసి చందంబునన్

భీమాటోపుఁడు భీమచాందు ధరణీ ♦ భృచ్ఛృంగమందుండి యు
గ్రామోఘప్రదరాళిఁ గూల్చెను విప ♦ క్షారణ్య సత్వంబులన్. 156

గీ॥ అలరి యలరించు నొక్క—మా♦ఆ ప్రతాపుఁ! బరుల నొకమాఱు కనుసన్న ♦ బ్రమియఁ జేయు!
విడక యుభయసైన్యముమధ్య ♦ విజయలక్ష్మి యబ్జనాళపుఁదూఁగుటు ♦ య్యాలనూఁగె!

—*) మధ్యాహ్న వర్ణనము. (*—

శా॥ మెండై యొండలు నిండె; నల్దెసలఁ గ్ర ♦ మ్మెన్ నిప్పులన్ గుప్పు చు
ద్దండ గ్రీష్మసమీరముల్; నిఖిల స ♦ త్వంబుల్ గదున్ డస్సె; బ్ర
హ్మాండంబందుఁ బొగల్ సెగల్ తుటుములై ♦ వ్యాపించె; మధ్యాహ్నమా
ర్తాండుం డుజ్జ్వలకాండుఁడై గగన మ ♦ ధ్యంబందు వెల్గొందఁగన్. 158

ఉ॥ ఆతప నాతపోద్ధతికి ♦ నాయసవర్మములెల్లఁ గ్రాఁగి సం
జాతకృశానుకీలలు భృ ♦ శమ్ముగఁ జిమ్ముటఁజేసి యోధసం
ఘాతము దేహముల్ బడలి ♦ కల్ గని సేనలు రెండువైపులం
దాతఱి సుంత కన్మొగిచి ♦ నట్టులు కూర్కె నిమేషకాలమున్. 159

సీ॥ తలలపై బొమిడికం ♦ బుల యున్న రేకుల నలమి దహించు సూ ♦ ర్యాతపాగ్ని!
నలుదెసల మిడుంగు ♦ రులు చిమ్మ రక్తదీర్ఘాక్షులఁ గోపభ ♦ యంకరాగ్ని!
ప్రాభాతసంగర ♦ వ్యాయామమున రేఁగి జగము మ్రింగఁగఁగోరు ♦ జాఠరాగ్ని!
భువనసంతతినెల్లఁ ♦ బొడిపొడిగావించు బహుబృహన్నాళాస్త్ర ♦ భైరవాగ్ని!
గీ॥ యన్నిఁటిని మించి లోకభ ♦ యంకరమయి యతిశయిల్లు బాహుప్రతా♦పాగ్ని! వెలుఁగ
భటులు పంచాగ్ని యోగ భా♦వనల మెదిగి మఱలఁ దలఁపడి రనికి ని♦ర్జరులు పొగడ.

—*) మానసింహుఁడు పరంగుల నుసికొల్పి పిరంగులు ప్రేలిపించుట. (*—

చ॥ "ఇరువదిరెండువేల భటు ♦ లొల్లెడ నాలుగులక్ష లున్న మ
మ్మరవఱిచేయఁ జొచ్చి రక ♦ టా! గతియే"మని కుంది దక్షిణో
త్తరముల మానసింహుఁడు శ ♦ తఘ్నుల సంతతధార నిప్పులన్
గురిసి విపక్షసైన్యములఁ ♦ గూల్పఁగ నాజ్ఞ యిడెన్ భటాళికిన్. 161

సీ॥ మొగలాయి సేనా స ♦ ముద్రాంతరమునుండి పొడతెంచు బడబాగ్ని ♦ మూర్తు లనఁగ!
రాణా ప్రభంజన ♦ రాజి మొగల్ శాఖి నిలువ కూడెడు తాళ ♦ ఫలము లనఁగ!

రణదుర్గ వీరరౌ ♦ ద్రమునఁ జేతికొలంది గుప్పు నిప్పులఁగొప్ప ♦ కుప్ప లనఁగఁ;
దురకదండను తోఁటఁ ♦ దోడిమ యూడుచు దోర్లు పరిపక్వకూష్మాండ♦ఫలము లనఁగ!
గీ॥ సమయమాంత్రికమాళి భూ♦తములఁ దనుప నడుపు రక్తాన్న నిబిడ పిం♦డంబులనఁగ!
నల పరంగులు పెనుపిరం ♦ గులను బేల్ప రాలె డెసలఁ దప్తాయస ♦ గోళతతులు. 162

మ॥ అవి లోకంబులఁ గాల్పఁగాఁ దొడరు బ్ర ♦ హ్మాస్త్రాళినా నిప్పులన్
దివికిన్ జిమ్ముచు వ్రాలి యోధులను భే ♦ దింపంగ రాణాచమూ
నివహం బుబ్బట లూఁగి యెత్తువడి భ్రాం ♦ తిన్ జెంది వెల్వెల్లఁబో
యి వితాకొందిన లేఁతమోముల విధం ♦ జేమంచు వాక్రువ్వఁగన్. 163

⊕ మ॥ గుములై నిల్చి గుభా ల్గుభా లని పిరం ♦ గుల్ మ్రోగుటేకాని స
ర్వము నిశ్శబ్దతఁ దాల్చె; యోధతతి చా ♦ పన్ జూడఁగా లేక డెం
దమునన్ గుందుచు చాంసుభ ట్టొక మహా ♦ దంతావళం బెక్కి యు
త్తమ గంభీర మనోజ్ఞ నిశ్చల గళ ♦ ధ్వానంబు శోభిల్లఁగన్, 164

—*) చంద్రభట్టారకుఁడు రాజపుత్రసేనలకు రణోద్రేకముఁ గలిగించుట. (*—

ఉ॥ "ఓయసమాన సాహస స ♦ మున్నత శౌర్య సమగ్రమూర్తులా
రా! యడలంగఁబోకుఁడు పి ♦ రంగుల గుండ్లు! కఖండయుద్ధవి
ద్యాయుతులైన మీకుఁ గర ♦ మందు ధరింపఁగఁ బూలచెండ్లు గా
వే యవి! యొక్కమై దగులుఁ ♦ డీ! పొడిమైపడ సర్వలోకముల్. 165

సీ॥ మొన్నగాఁ జిత్తూరి ♦ మూఁడవ ముట్టడి! పదియునాఱేండ్ల లేఁ ♦ బ్రాయమందె
కరకంకణములు మం ♦ గళవస్త్రములతోడఁ బెండ్లిపీటలనుండి ♦ వెడలి వచ్చి
పుత్త సూర్యద్వార ♦ మున శాత్రవులఁ గూల్చె! భార్య పండ్రెండేండ్ల♦పడుచు రిపులఁ
గుప్పగూరగఁ ద్రుంచెఁ! ♦ గోమలి త్యాగవిక్రమములు సకలలో ♦ కములు మెచ్చె!
గీ॥ నా యరుంధతీదర్శన ♦ మపుడె స్వర్గమునకు నచ్చరల్ కనుసన్న ♦ లను బొనర్ప
వలచు శౌర్యైకధనులు మీ♦కొలమువార! లతుల మతులార! ఖేల్వా భ♦టాళులార!

⊕ In the sacred bardai of the Rajput, we have the bard of our Saxon ancestry; those reciters of warlike poetry of whom Tactus says "With their barbarous strains they influence their minds in the day of battle with a chorus of military virtue."

"Annals of Mewar."

సీ॥ గౌతమగోత్రంబు! ♦ గాధిపురము రాజధాని! యాచార్యుండు ♦ దైత్యగురుఁడు!
వంశంబుకర్త వి ♦ శ్వామిత్రుఁ! డాస్వర్గమర్త్యముల్ మునుపు స్తం ♦ భన మొనర్చెఁ!
బదునాల్గులోకముల్ ♦ పైకి వచ్చిన సుంత కీడెఱుంగనిది రా ♦ ఠోడు కులము!
బిగఁబట్టి తెచ్చి ని♦ల్పినఁ దురుష్కులు మీముఖముఁ జూడ వెఱతురఁ♦ఖ్యాతిగలిగె!
గీ॥ నఖిలభారతవీర మ ♦ హాభవనము గోపురమున నెత్తిన పూర్ణ ♦ కుంభతుల్యుఁ
డగుచు మీతండ్రి జయమల్లు♦యశముఁగాంచె! ధ్వీణ్మదేభేంద్రసింహ! యో♦తేజసింహ!
సీ॥ సామ్రాజ్య మఖిలంబు ♦ సవతితమ్మునకిచ్చె సంతతత్యాగి యా ♦ చండనృపతి
యా బయానాసీమ ♦ నరుల తలల్ వేలు రాలఁగా విహరించె ♦ రత్నసింగు!
చిత్తూరుకోట డు ♦ స్సినచోట నిలిచి దుర్గారావు ప్రళయరా ♦ ద్రమునఁ బోరె!
నెనిమిదేడుల క్రింద ♦ నీరేడులోకముల్ జయపెట్ట వర్తించె ♦ సాహిదాసు!
ఆ॥ సకల పూజ్యమైన ♦ చండేశు వంశంబు స్వామిభక్తి యుగ్గు ♦ పాలఁ బెఱిఁగె!
నాకులంబు వీరు ♦ లందు నాయకమణి కృష్ణసింహవిభుఁడు ♦ కృష్ణవిభుఁడు. 168
సీ॥ జగదేకదుర్నిరీ ♦ క్షుప్రకాశు లటన్నఁ జూపు నూర్లకొలంది ♦ సూర్యకులము!
నిత్యసత్యవ్రత ♦ నిష్ఠాపరు లటన్నఁ జూపు వేలకొలంది ♦ సూర్యకులము!
కండ లొలిచియిచ్చు ♦ ఘనవదాన్యు లటన్నఁ జూపుఁ లక్షకొలంది ♦ సూర్యకులము!
లోకంబులెల్ల గె ♦ ల్చు ధనుర్ధరు లటన్నఁ జూపుఁ గోట్లకొలంది ♦ సూర్యకులము!
గీ॥ క్షోణి వెలయు నసంఖ్యాక♦కులములందు సురలకును సాయమొనరించె♦సూర్యకులము
సూర్యకులము దూరం బుంచి ♦ చూచు నెడల నఖిలభువనంబు లంధకా♦రావృతములు
సీ॥ ఇక్ష్వాకు వెటు లోక ♦ హితుఁడు! కాకుత్స్థత్రిశంకులు మఱి హరి ♦ శ్చంద్రుఁ డెట్టి
వారు! మాంధాంత ప్రా ♦ భవ మెంత! నాభాగుఁ డంబరీషభగీర ♦ థాది నృపులు
సామాన్యులే! యిఁక ♦ సగర-దిలీప-రఘుక్షితీశులకీర్తిఁ ♦ గొలువఁ గలమె!
బ్రహ్మాండమంతయుఁ ♦ ద్రాసున నిడిన నిందుల నొక్కఁడొక్కఁడే ♦ తూఁగఁగలఁడు!
గీ! భువనసామ్రాజ్యలక్ష్మి కా ♦ పురము చేయు వజ్రహర్మ్యరాజంబు మీ ♦ భానుకులము!
శతశత నమస్కృతులు చేసి ♦ సకలజగము నీపదముఁ గొల్చు టరుదె ప్ర ♦ తాపదేవ!
సీ॥ కాఫరిస్థాన్ ప్రజా ♦ గణము నేఁటికిఁగూడ బప్పరాయుల ఖడ్గ ♦ పటిమఁ బొగడు!
నాఖొరాసాన్ దేశ ♦ మందు ఖోమనసింహు నాణెంబు లింకను ♦ నడచుచుండు!
సమరసింహేంద్రు వి ♦ క్రమగాథ లెల్లప్డు ఘోరీజనులు కొడు ♦ కులకుఁ దెలుపు!
కుంభరాణా శౌర్య ♦ జృంభణం బేవేళ దేశదేశములు గీ ♦ ర్తించుచుండు!

గీ॥ భారతీయుల యొడళులఁ ♦ బ్రాణముండ మఱువనేర్తు రె రవివంశ ♦ మహిమ నెప్పుడు!
ధర్మసంస్థాపనార్థ మే ♦ తత్కాలమున దేవుఁడై పుట్టితి ప్రతాప ♦ దేవ! నీవు. 171

సీ॥ భరతఖండక్షమా ♦ భరము నిజోద్దండ బాహుదండంబున ♦ వఱలఁజేసి
జగమెల్ల జయపెట్ట ♦ శకము నిల్పినమేటి విక్రమాదిత్య పృ ♦ థ్వీవిభుండు!
సతత మింద్రప్రస్థ ♦ సామ్రాజ్యమున సార్వభౌమపరంపరఁ ♦ బాదుకొలిపి
బహుకాల మేలి శా ♦ శ్వతకీర్తిఁ గనిన యనంగపాలాది రా ♦ ట్పుంగవులును!
ఆ॥ సకలసుగుణగణావి ♦ శాలు రేవంశసాగరము గనిన దొ ♦ కౌస్తుభమ్ము!
❀ అట్టి మేటివంశ ♦ మపకీర్తిఁ బడకుండఁ బోరరయ్య! త్వరు ♦ వీరులార! 172

సీ॥ పావకాన్వయ సంభ ♦ వక్షత్రియులకెల్ల నాధారయష్టి చో ♦ హాణకులంబు!
ము న్నేడవ శతాబ్ది ♦ మునఁ దురుష్కులను ఖండించె లక్షలుగ మా ♦ ణిక్యరాయఁ!
డితని యన్నకుమారుఁ ♦ డేఁడేండ్ల లాటుండు దస్యుకోటిని ద్రుంచి ♦ తాను మడిసె!
సకలవీరప్రసూనం ♦ చము మహాళివెలయు దివ్యజ్యోతి యితఁడను ♦ ఖ్యాతిఁగాంచె!
గీ॥ నతనితండ్రి దూలారావు ♦ యవనవీర వాహినీ వార్ధి కుంభసం ♦ భవమహర్షి!
§ మిమ్ముఁ గనినంత జగము కం♦పించుచుండు! బాహుబలులార! చోహాణ♦ప్రభువులార!

---

❀ If it had to boast only of Vikramaditya, the paramount lord of India whose era established fifty six years before the Christ, still serves as the grand beacon of Hindu chronology, this alone would entitle the Tuar to the highest rank But it has other claims to respect. Delhi the ancient Indra-prastha, founded by Udisthira and which tradition says, lay waste for eight centuries, was rebuilt and peopled by Anangpal Tuar (A D 792) who was followed by a dynasty of twenty princes which concluded with the name of the founder, Anangapal [1164] when contrary to the Salic Law of the Rajputs he abdicated [having no issue] in favour of his grand child the Chohan Prithwi Raj.

"Annals of Mewar."

§ Chohan: This is the most valiant of the Agniculas and it may be asserted, not of them only, but of the whole Rajput race. Actions may be recorded of the greater part of each of the Chateeskula which would yield to none in the ample and varied pages of history. Its branches have maintained all the vigour of the original stem and Haras the Keechees, the Deoras, the Sonegurrahs and others of the twenty four, have their names immortalized in the song of the bard.........There were several princes whose actions emblazon the history of the Chohan. Of these was Manikya Rao who first opposed the progress of the Muhammadan arms. Even the history of the conquerors record that the most

సీ॥ ఆ యనంగు ననుంగు ♦ టాఁడుబిడ్డకొడు! కింద్రప్రస్థపురము పు ♦ ణ్యమలపంట!
సోమేశు కులవార్ధి ♦ శుభ్రమరీచి! రుక్మా గర్భ శుక్తి ము ♦ క్తాఫలంబు!
సమరసింహుని స్నేహ ♦ సౌహృదప్రతిమ! పృథామహాదేవి సౌ ♦ దర్యధనము!
కల్యాణు మేనటి ♦ కపు ముద్దుమామ! సంయుక్తా మనోజ్ఞ భా ♦ నూదయంబు!
గీ॥ సమద జయచంద్ర జలద జం♦ఝామరుత్తు! ఘోరి గజ సింహ! మితనిఁబోల్♦వీరు లేరె!
యీచతుర్భుజరాజేంద్ర ♦ నెన్నఁదరమె! పృథ్వీరాజై చతుర్భుజుం ♦ డెసఁగెఁగాక.
శా॥ సౌరాష్ట్రంబుననుండి వచ్చుచుఁ దురు ♦ ష్క శ్రేణిఁ జక్కాడుచో
మారాణాలను దోత్తనుండి బలసం ♦ పన్నాన్యులై కొల్చి దో
స్సారం బెల్ల జగంబునన్ బొగడె! మీ ♦ ఘూలామహావంశ మా
ధార స్తంభము భారతాభ్యుదయ సౌ ♦ ధస్థాయితన్ నిల్వఁగన్. 175
శా॥ ఐదారేఁడుల చిన్నకుఱ్ఱలయినన్ ♦ హర్యక్షశాబంబుల
ట్లాదస్యుప్రకరంబుఁ గూల్చు కులము ♦ ర్యాదల్ వెలుంగన్ రిపు
చ్ఛేదంబున్ బొనరించి వారితలలన్ ♦ జెండాడి చెండాడుఁడీ!
యేదీ చూతము మీభుజాబల మహా ♦ హేలా కళా దీధితుల్! 176
ఉ॥ తొమ్మిదినూఱులేండ్లు ధృతి ♦ తో నెలకొల్పు మతాభిమానభా
వమ్మును మాతృభక్తి ఫల ♦ పాకము వమ్మగు వైరి నోర్చు తూ
కమ్మనఁ దక్కువైన; నటు ♦ గావున నిష్ఠుర దీక్షఁ బూని శౌ
ర్య మ్మఖిలంబు చూపి రిపు ♦ లందఱ నొంపరె! కీర్తి నింపరే!” 177
మ॥ అని విప్రోత్తముఁ డంబుదస్వనముతో ♦ నందందునన్ నిల్చియుం
డిన యవ్వీరుల వంశగౌరవము వ ♦ ర్ణింపన్ శ్రవఃప్రీతిగా
విని యాద్యంతము సైన్యమంతయు విజృం ♦ భించెన్ సముద్రంబు పొం
గినచందమ్మున భూరి వీర రస సం ♦ కీర్ణ ప్రభావమ్మునన్. 178
ఉ॥ అంతట మానసింహవిభు ♦ నాజ్ఞఁ బరంగులు పెన్పిరంగుల
త్యంతజవంబు రౌద్రమును ♦ దార్కొనఁ ద్రిప్పుచుఁ జెంతనున్న మం

---

obstinate opposition which the arms of Muhammad of Ghazni encountered, was from the prince of Ajmir who forced him to retreat, foiled and disgraced from this celebrated stronghold in his destructive route to Sourashtra.

"Annals of Mewar."

దెంతయుఁ దొంటికన్న నిపు ♦ డిబ్బడి ముబ్బడిగాఁగఁ బ్రేల్పఁ గ
ల్పాంత మహాశనిప్రతతి ♦ యట్లవి యాత్మబలంబుఁ గూల్పఁగన్, 179

గీ॥ హరుని నయనాగ్నిఁ బొడమి ది♦గంతరములఁ గ్రమ్ము చండాగ్నికణముల♦కరణి యవన
సైనిక ముఖాబ్జ నిర్గత ♦ చంచరీక పటలములు పైన బ్రాలెఁ దు ♦ పాకి గుండ్లు. 180

—*) రాథోడ్తేజసింహుఁడు విజృంభించి పిరంగుల పైకేగుట. (*—

సీ॥ ఆజానుదీర్ఘ బా ♦ హార్గళయుగళంబు సమధికోదాత్త ల ♦ క్షణముఁ దెలుప!
నతనుసింహాసనం ♦ బైన వక్షము మహారాజన్య పట్టభ ♦ ద్రిత వెలార్ప!
నరుణరేఖామనో ♦ హర దీర్ఘనేత్రముల్ సతత లక్ష్మీనివా ♦ సతను బెంప!
దర్శనీయంబైన ♦ తనమూర్తి నవకోటి మన్మథసౌందర్య ♦ మహిమ నింప!
గీ॥ నమృతరస మొల్కు మొలకన♦వ్వలరు మోము శతశరచ్చంద్ర సౌభాగ్య♦సరణి గేరఁ!
దన భటుల వీడి హయము ముం ♦ దునకుఁ ద్రిప్పె ధీరలోకైకమౌళి యా♦ తేజసింగు.

సీ॥ రణదుర్గ పరమ శౌ ♦ ర్యప్రాభవము మెచ్చి పైఁజల్లు శతపత్ర ♦ పటల మనఁగ
గుహలు మార్మ్రోయంగ ♦ బహుశతఘ్నిక లవిచ్ఛిన్నధారల నగ్నిఁ ♦ జెఱఁగుచుండ
వేదమంత్రముల దీ ♦ వించుచు భూదేవతతి చల్లు మంగళా ♦ క్షతల నడుమఁ
గరములు ముకుళించి ♦ శిర మొకించుక వాల్చి పెండ్లికొడుకు ద్రొక్కు ♦ వెళ్లినట్లు
గీ॥ గుదియఁ గేడెంబుఁ జేతులఁ ♦ గుదిలపఱచి చిత్రధార నశ్వముఁ బూన్చి ♦ శిరము వంచి
పరమసాహసుఁడగుచుఁ బ ♦ ర్వతము డిగుచుఁ దేజసింగు పిరంగుల ♦ దెసకు దూఁకె.

మ॥ "నిమిషంబున్ నిను వీడి యుండఁగలమే ♦ నీతోడిదే మాకు లో
క"మటంచున్ దమజన్మమాది దృఢదీ ♦ క్షా భర్తులన్ గొల్చు ను
త్తమరాథోడ్కులవీరు లందఱును మొ ♦ త్తంబై నిజాధీశు పా
దములన్ గొల్వఁగ వెంటఁ దూఁకి రరిసం ♦ తానమ్ము చింతింపఁగన్. 183

శా॥ ఆలోకోన్నత శౌర్యసాహస సమ ♦ గ్రాశ్చర్య దృశ్యంబుఁ దా
మాలోకించుచు రెండుపక్షముల వా ♦ "రౌరా! సురల్ గూడ నీ
లీలల్ నేర్తురె! నీసమాను లిలలో ♦ లే" రంచుఁ దద్విక్రమ
శ్రీలన్ బాడిరి తేజసింహునకు "జే! ♦ జే!" యంచుఁ గీర్తించుచున్. 184

—*) రాథోడ్ తేజసింహునకు సలుంబ్రాకృష్ణసింహుఁడు తోడగుట. (*—

శా॥ దూరంబందుననుండి యాకృతులు సం ♦ తోషమ్ముతోఁ జూచి "యా

రా! రాణోన్మణీ! నీబలోద్ధతి ప్రపం ♦ చాతీత! మద్దానికిన్
బారం బున్నదె” యంచు మెచ్చుచు సలుం ♦ బ్రాస్వామి చోండావతుల్
బారై కొల్వ శతఘ్నికాతతిపయిన్ ♦ లంఘించె సింహాకృతిన్. 185

మ॥ తనచేఁ గాలుని దండమంతటి గదా ♦ దండంబు సంధించి భీ
మునిచందంబున గొప్పకన్నుఁగవ ని ♦ ప్పుల్‌రాల దుర్దాంతవృ
త్తిని రోషించుచుఁ దేజసింహుఁడును నాం ♦ డిన్ దీర్చి పుణ్యాహవా
చనమున్ జేసె శతఘ్నికాత్రయము పి ♦ చ్చల్‌గాఁ బడన్ మోదుచున్. 186

మ॥ ఖరఖడ్గంబునఁ బోర్చుగీసుభటులన్ ♦ ఖండించుచున్ ఘోరము
ద్గరఘాతంబుల నాశతఘ్నులను వ్ర ♦ క్కల్ చేయుచున్ లోకసం
హరణోద్యోగపరాయణుండయిన ఘా ♦ లాక్షుక్రియన్ ధీర సు
స్థిరరౌద్రోద్ధతిఁ దేజసింహుఁడు చరిం ♦ చెన్ శాత్రవుల్ బెగ్గిలన్. 187

❀ మ॥ సునిశాతస్థిరవీరవిక్రమయుతుల్ ♦ చోండావతుల్ వారిప్ర
క్కన రాఠోడులు బాహుశక్తి యలరం ♦ గా నా“షహారా”యె డా
రని నిప్పుల్ దిను గోడిపుంజులటు లు ♦ ద్వృత్తిన్ శతఘ్నీచయం
బును వ్రయ్యల్ పడ మోదసాగిరి గదా ♦ భూరిప్రఘాతంబులన్. 188

చ॥ కెరలుచు వ్రాలుచున్ బుడుత ♦ కీచులఁ గూల్చుచు నాశతఘ్నులన్:
జెరచెరలాడి వ్రక్కలుగఁ ♦ జేయుచు దక్షిణ మాదిచేసి యు
త్తరమున కేగు లోకభయ ♦ దప్రతనిష్ఠుఁడు తేజసింహభూ
వరమణి యుత్తరాయన ది ♦ వాకరుఁబోలె వెలింగె నత్తఱిన్. 189

సీ॥ ఖగరాజు కినిసి ప ♦ న్నగరాజుశీర్షముల్ చిదురుపలై వ్రాలంగఁ ♦ జెండినట్లు!
వానకారునఁ గృషీ ♦ వలుఁడు గుద్దలి పట్టి పుట్టలన్నియుఁ దెగఁ ♦ గొట్టినట్లు!
కడురోషమున లోహ ♦ కారుండు మండెడు మూసలన్నియు దుల్ల ♦ నేసినట్లు!

---

❀ Among exotic birds there can be hardly one better known by report than the strange majestic and fleet footed creature that scorneth the horse and his rider or one that from the earliest times to the present has been oftener more or less fully described. And an adult male (bird ostrich) will stand nearly 8 feet in height and weigh 300 lb. The great mercantile value of ostrich feathers has led to the formation of the numerous "Ostrich-Farms." In favourable localities and with judicious management these establishments are understood to yield very considerable profit.

"Encyclopaedia Britannica."

గ్రీష్మవాతము బిట్టు ♦ రేఁగి యారామ జపాపుష్పముల రాల్చి ♦ నైచినట్లు!
గీ॥ దండధర గదాదండ ప్రౌ ♦ చండ దీర్ఘ దండమున శతఘ్నీసము ♦ దాయ పృథుల
వక్త్రములు వక్రవక్రలై ♦ పడఁగ మోదెఁ దేజసింహుండు క్షాత్రసం♦దీప్తుఁడగుచు

మ॥ వడిమై నిష్ఫలయేఱు దాఁటి భువన ♦ ప్రాంతంబుపై నెత్తి వ
చ్చెడు వైవస్వతుఁడో యనంగ "బదనూర్ ♦ సింహంబు" రాతోడులె
ల్లెడఁ జుట్టుర్ దనుఁగొల్వఁగా యవన వా ♦ హిన్యగ్రముల్ దాఁకి యొ
క్కడు విక్రాంతి భటాళి మస్తముల ను ♦ గ్గుల్ నూఁకగా దంచినన్; 191

—*) యవనసేనాపతు లొక్కమ్మడి రాజపుత్ర సేనలను దాఁకుట. (*—

ఉ॥ ఆరటమంది సైన్యవిభుఁ ♦ డాసపుఖానుఁడు, రాయసింహు న
బ్దూరహిమానునిన్ సమర ♦ ముష్కరు నాషహబాజుఖానునిన్
జేరఁగఁబిల్చి సైన్యములు ♦ చేరిచి నల్వురు గూడి శౌర్యదు
ర్వారులు రాజపుత్రకుల ♦ పై దొడరన్ నియమంబుచేయుచున్, 192

మ॥ తనకంఖాణహయంబుఁ ద్రిప్పి సముదా ♦ త్తప్రౌఢి నాతేజసిం
గు నెదిర్చెన్; షహబాజుఖాను దవిలెన్ ♦ గ్రోధోద్ధతున్ గృష్ణసిం
హుని; ఖేల్వాపతి దూరమందు సకలం ♦ బూహించి యత్యంతధా
టిని జేరన్ జని రాయసింహవిభుఁ బ ♦ ట్టెన్ సైంహికేయుండనన్. 193

మ॥ బదనూర్ సింహము సింహవిక్రమమునన్ ♦ బైవచ్చి ఖడ్గద్యుతుల్
చదలన్ బర్వఁగ నొక్కమ్రాఁ దగిలె నా ♦ సఫ్ఖాను; వాఁడంత బె
ట్టిదమౌ కోపముతోడఁ గుంతమును నా ♦ టెన్ దీర్ఘవక్షంబుపై;
నది తుంటల్ పడెఁ దేజసింహవిభు ఘో ♦ రాశ్రప్రయోగంబునన్. 194

మ॥ త్వరమై సాయుధుఁడౌచు వాఁడు బదనూర్ ♦ భర్తన్ సమీపించె; నా
బిరుదుల్ వీరరసాబ్ధివీచికవలెన్ ♦ వీతెంచె నాఖానుపై;
మెఱుపుల్ వోలెఁ గృపాణముల్ దిరిగె; గ్ర ♦ మ్మెన్ వాజిపై వాజి; యా
పరివేషమ్ముల సూర్యచంద్రులవలెన్ ♦ భాసిల్లి రద్దిర్వురున్. 195

మ॥ కరవాలమ్ములు నాగుపాములవలెన్ ♦ గంఠంబులన్ జుట్టె; ని
ర్వర ప్రేటుల్ మఱి పోటు లిన్నియనుచున్ ♦ రూపింప రాకుండె; భా
స్వరఖడ్గంబునఁ దేజసింహనృపుఁ డా ♦ సఫ్ఖాను మోదంగఁ, ద
త్తురగం బీల్గినఁ, జెట్టుతోడఁ బడు మ ♦ ర్త్యుం డట్లు వాఁడున్ బడెన్. 196

ఉ॥ ఆరణవీరుఁ డిట్లయిన ♦ నవ్వల దాఁటుచుఁ దేజసింహుఁ డ
బ్దూరహిమానుపైఁ గవిసెఁ; ♦ దోడని వాఁడును దాఁకె, వారిధిన్
వారిధి దాఁకు నట్టులు; ర ♦ ణంబు క్షణంబున ఘోర మయ్యెఁ; బా
కారి బలాసురుల్ పెనఁగు ♦ నట్టులు పోరఁగసాఁగి రిర్వురున్. 197

ఉ॥ భూరిభుజాప్రభావగుణ ♦ మున్ బ్రకటించుచుఁ దేజసింహుఁ డ
బ్దూరహిమాను ఖడ్గరణ ♦ ధూర్వహశక్తి వెలుంగ, నుగ్రులై
యారణవేది వెల్గెడు మ ♦ హాదహనోగ్రసమగ్రమూర్తులై
పో రొనరించి రిర్వురును ♦ బూర్ణ పరాక్రమ రేఖ యొప్పఁగన్. 198

శా॥ "ఔరా! నీదగు సాహసం"బని మనం ♦ బాదెంచుచున్ విద్విష
ద్వీరారణ్య దవానలుండు బదనూర్ ♦ పృథ్వీశ్వరుం డశ్వమున్
బ్రేరేపించుచు ముందు దూఁకి తనవై ♦ రిన్ గుఱ్ఱమందుండి దు
ర్వారేభంబు మృణాళమున్ గొనిన తే ♦ వన్ గొంచుఁబోయెన్ వడిన్. 199

ఉ॥ సైంధవుఁడో యనంగ బల ♦ సాహసుఁ డాషహాబాజుఖాను ద
ర్పాంధుఁడు త్రోవకడ్డువడ ♦ నాతనిఁ బైకొనెఁ గృష్ణసింహుఁ డా
కంధిని జొచ్చు కుంజరము ♦ కైవడిఁ! దద్బలధాటి వాఁడు వ్రా
లెం ధరపైన దోమయుఁ బ ♦ లెన్ గనుమూసిన యంతలోపలన్. 200

మ॥ పరమోదారుఁడు రాయసింహవిభు ఖే ♦ ల్వాభర్త యా కౌరవే
శ్వరునిన్ దాఁకెడు సాత్యకిన్ బలెఁ గడున్ ♦ సంరంభ మేపార సం
గరరంగంబునఁ దాఁకి యాతని భుజా ♦ గర్వమ్ము వమ్మై చనన్
గరవాలమ్మున వేయ నాతఁ డుఱికెన్ ♦ గాయంబు గాయంబుగాన్. 201

శా॥ ప్రావృట్కాల పయోధర ప్రతతి తే ♦ వన్ రేఁగి రాఠోడు చోం
డావద్వీరు లరాతిసైన్యపటలాం ♦ తర్భాగమున్ జేరి వీ
రావేశమ్మున వైరివీరతతి నం ♦ దందన్ విదారించుచున్
బ్రోవుల్ ప్రోవులు పోసి రెల్లెడ సమి ♦ ద్భూమిన్ శిరశ్శ్రేణులన్. 202

ఉ॥ చండపరాక్రమంబు భుజ ♦ శౌర్యము శోభిలఁ దేజసింహుఁడున్
ఖాండవమున్ దహించెడు ధ ♦ నంజయుఁ బోలె నరాతియోధులన్
మొండుగ శీర్షముల్ తఱిగి ♦ నేలకుఁ గోలకుఁ దెచ్చినంత నా
భండనసీమ మోగలులు ♦ పచ్చముపాడుగఁ గూలి రెల్లెడన్. 203

మ॥ పరసేనన్ బదనూరుభర్తయు సలుం ♦ బ్రానేతయున్ జొచ్చి యి
ర్వురు ఖడ్గంబుల కష్టు తీరనిపనిన్ ♦ బుట్టించి! రవ్వారి వీ
రరసోద్రేకమునందుఁ జిక్కి యమదం ♦ ష్ట్రామధ్యమున్ జొచ్చు నా
కరణిన్ వైరులు నూర్లు వేలుగను ద్రుం ♦ గన్ సాఁగి రవ్వేళలో. 204

ఉ॥ ఓడలు గుంపుగూడుచు మ ♦ హోదధియందలి నీటిమొత్తమున్
దోడనె చించుచున్ జవము ♦ తోఁ జనున ట్లరిసేనఁ జొచ్చి చ
క్కాడుచు వార లిర్వురును ♦ నాశ్వికవర్గము గొల్వ సంగర
క్రీడల ద్రేఁగు చూపి విహ ♦ రించిరి శాత్రవ మధ్యసీమలన్. 205

—*) ప్రతాపసింహుని ద్వితీయ యుద్ధము. (*—

మ॥ ద్విసహస్రంబు శిశోదియాభటులు సే ♦ వింపన్ బ్రతాపప్రభుం
డసమాన స్థిర వీర విక్రమ కళా ♦ వ్యాపార మేపార శ
త్రుసమూహంబుల మీఁదికిన్ వెడలి గొం ♦ తుల్ గోసి కోరాడి యు
గ్ర సహస్రాంశుఁడు వోలెఁ దేజము వెలుం ♦ గన్ నిల్చె దుర్వారుఁడై. 206

మ॥ కడుదట్టంబయి యొప్పు చెట్టడవి చీ ♦ కాకై ధరన్ వ్రాల సం
దడిమై దంతిపరంపరల్ గవియు చం ♦ దంబార, రాణాప్రతా
పుఁడు తద్యోధులు వైరిసైన్యము ముఖం ♦ బున్ జీల్చి దోర్దర్ప మే
ర్పడఁ దన్మధ్యమునందు దూఁకి రహితుల్ ♦ పాఱంగ నల్దిక్కులన్. 207

శా॥ తోడర్ మల్లును యుద్ధనైపుణకళా ♦ దోస్సారులౌ యోధులున్
దోడై కొల్వ. శిశోదియాప్రభువరే ♦ ణ్యున్ వీకమై దాఁకి పో
రాడన్ జూచెఁ; బ్రతాపసింహవిభుఁ డు ♦ ద్యద్ధాటిఁ దచ్ఛీర్ష మూఁ
టాడన్ ఖడ్గము నెత్తి మోది యరిమ ♦ ధ్యంబందు దూఁకెన్ వడిన్. 208

ఉ॥ రోసమునొంది చుట్టును దు ♦ రుష్కులు కొందఱు కొల్వ, లోకసం
త్రాస విశేషశౌర్యబల ♦ దర్పుఁడు సాగరుఁ డగ్రసోదరున్
డాసెఁ; బ్రతాపుఁ డాతని క్ష ♦ ణంబునఁ గ్రిందికిఁ దెచ్చె; నిట్టి భ
స్మాసురు లట్టి యుగ్రనిట ♦ లాక్షుల చెంగట నిల్వ నేర్తురే! 209

శా॥ దూరంబందుఁ దురుష్కయోధులను సూ ♦ క్తుం డొక్కెడన్ జేర్చి "మీ
రీ రాణా నెదిరించి కూల్చుఁ"డన వా ♦ రెల్లన్ బ్రతాపేంద్రుపై!

బారై దూఁకిరి; కొందఱున్ దునిమి కో ◆ పస్ఫూర్తిమై సూక్తునిన్
జేరన్ బోయి తదీయశీర్షకముఁ జిం ◆ చెన్ రాజమార్తాండుఁడున్. 210

చ॥ జలరుహబాంధవుం డుదయ ◆ శైలము నెక్కినఁ దత్ప్రకాశముల్
నలుదెసలన్ వడిన్ గవియు ◆ లాగు ప్రతాపుఁ డరాతిసైన్యసీ
మల మెలఁగన్ దదీయభట ◆ మండలి చుట్టును జుట్టుకొంచు మో
గలుభట శీర్షకోటి కడి ◆ కండలుగా నిలరాల్చె నయ్యెడన్. 211

సీ॥ అతిపావనంబు హ ◆ రావళీశైలరాజమున హల్డీఘాటు ◆ సవనశాల।
యతులప్రతాప బా ◆ హావీర్యభర యశోధనుఁడు తోడరమల్లు ◆ దక్షువౌని!
యాతని యాజమా ◆ న్యమునఁ జేరి మెలంగు రాజపుత్రకులు ని ◆ గ్గరుల గణము!
వేలకువేలు సే ◆ వించు యౌవనభటుల్ వ్రేలెడు పొడుగు గ ◆ డ్డాల ఋషులు!

గీ॥ శూరవరులు శిశోదియా ◆ వీరభటులు ప్రమథగణములుగాఁ! బ్రతా ◆ ప ప్రభుండు
ప్రళయ భైరవ విగ్రహ ◆ ప్రాభవమున! నరిచమూతతిఁ జొచ్చి చ ◆ క్కాడె నపుడు.

మ॥ కఱకుంబీరపు రాజపుత్రకుల డా ◆ కన్ సైపఁగా లేక యా
కొఱప్రాణంబులతోడ నెల్లెడఁ దురు ◆ ష్కుల్ పాఱఁగాఁజొచ్చి! రా
హరిశౌర్యుండు ప్రతాపుఁడున్ యవనసే ◆ నాంతంబుఁ బ్రాపించి శం
ఖరవంబున్ బొనరించె భూధరగుహా ◆ గర్భంబు లూఁటాడఁగన్. 213

మ॥ ప్రళయాంభోధర గర్జనంబువలెఁ ద ◆ ధ్ధ్వానంబు వీతేర న
వ్వల నిల్వంబడు మానసింహవిభు నం ◆ బర్ యోధులున్, జెంతనే
పులి గాండ్రించిన దద్దఱిల్లి హరిణం ◆ బుల్ పాఱుచందాన, ది
క్కులకున్ బాఱఁగఁ జొచ్చి; రెంతభయ మొ ◆ క్కో! యాప్రతాపుండనన్. 214

గీ॥ అంతలోఁ బ్రక్కనున్నట్టి ◆ యవనసేనఁ జెండుబెండాడి శ్రీకృష్ణ ◆ సింహవిభుఁడు
శంఖనాదంబు విని చాల ◆ సంభ్రమమున స్వామి యొద్దకు మెఱుపట్లు ◆ వచ్చిదూఁకి.

మ॥ "అకటా! యొంటిగ నిట్లు రాఁదగునె! దే ◆ వా! శత్రుమధ్యం బభ
యకరస్థానము! వైరిసైన్యము లసం ◆ ఖ్యాకంబుగా నున్నచో
టికి రాఁజెల్లదు! నాదు ప్రార్థనముఁ బా ◆ టింపుం"డటం చొండుప్రి
కటకుఁ గళ్లెంబును బట్టి యశ్వముఁ దొలం ◆ గన్ ద్రిప్పెఁ గార్యజ్ఞుఁడై. 216

చ॥ పువు వికసించినట్లు మొగ ◆ మున్ జిఱునవ్వలరింపఁగాఁ బ్రతా
పవిభుఁడు "తండ్రి! వీరున క ◆ పాయము లేని స్థలంబులున్నె! యా

హావ మిది; వెన్కఁ జూడఁ దగ" ♦ దంచన నంతటఁ దేజసింహుఁ డా
యవనులసేనఁ జించుకొని ♦ యక్కడకున్ జనుదెంచె సూటిగన్. 217

చ॥ ఒకయెడఁ గృష్ణసింహుఁడు మ ♦ ఱొక్కయెడన్ బదనూరుభర్త చై
తకము ఖలీనమున్ గొని ప్ర ♦ తాపునిఁ జేర్చిరి తొంటిచోట; దా
ని కవల రెండుసైన్యములు ♦ నింగియు నేలయు రాయునట్టి పో
లిక, నతిరౌద్రఘాటిఁ దవి ♦ లెన్ రణశౌర్య విజృంభణంబునన్. 218

—*) యవనుల వారణబలముతో రాజపుత్రులకైన యుద్ధము. (*—

సీ॥ స్థావరత్వము మాని ♦ జంగమత్వముఁ దాల్చు నంజనాచల సమూ ♦ హము లనంగ!
మొగలాయి వాహినీ ♦ వ్యోమసీమఁ జరించు నీలకాదంబినీ ♦ నివహ మనఁగ!
దళముగా మొలిచి వి ♦ చ్చలవిడిఁ బెఱుగు నుత్తాల తమాల సం ♦ తాన మనఁగ!
మొగలు నదీజలం ♦ బులు తగ్గ వెలిఁదోచు విపులగండోపల ♦ వితతియనఁగ!
గీ॥ యవనసైన్యోత్తర దిశా ము ♦ ఖాగ్రసీమ నిలిచి ఘీంకారముల నింగి ♦ నేలఁ గలిపి
కరిఘటాకోటి కాఱుచీ ♦ కటుల దాఁటి యరితతులఁ దాఁక వెడలె! భ♦యానకముగ.

సీ॥ కడుఁబదనైయున్న ♦ గన్నెరాకమ్ములఁ దలలలో మెదడు బ్ర ♦ ద్దలుగఁగోసి!
బలమైన కత్తివా ♦ తి లకోరులు నిగుడ్చి దీర్ఘదంతంబులఁ ♦ ద్రెళ్ళ వ్రేసి!
నిశితధారల నొప్పు ♦ నెలవంకకోలల శ్రోత్రవృంతములు రా ♦ సులుగఁబోసి!
వాఁడిమి గల పాఱ ♦ వాఁతియలుంగులఁ దుండముల్ మిగులఁ దు ♦ త్తుమురు చేసి!
గీ॥ పలురకంబుల నంపడె ♦ బ్బాటువాన గురిసి కుంభస్థలంబులు ♦ గూలఁద్రోసి!
శరములను 'జిత్తజల్లు'గాఁ ♦ బరపి భీమచాందు భటులు గూల్చిరి దంతి♦సంతతులను.

క॥ బలవంతులైన భిల్లుల యలుగులు మెయి నిండ నాఁటి ♦ యావనగజముల్
వెలిఁగె నొడలెల్ల ముండులు పులకెత్తిన యేదుపంది ♦ మూఁక లనంగన్. 221

ఉ॥ బిట్టుగ మావటీంద్రు గజ ♦ బృందములన్ నిశితాంకుశంబులన్
నెట్టుచుఁ బూన్చి రద్రి; కవి ♦ నెమ్మది నెక్కఁగసాఁగె ఘీంకృతుల్
పెట్టుచు; మోగలుల్ కరుల ♦ వీఁపుననుండి తుపాకిగుండ్లతోఁ
గొట్టిరి; వాని డాకలకుఁ ♦ గొందఱు భిల్లులు కూలి రయ్యెడన్. 222

ఉ॥ దట్టముగాఁగ మూఁగి బల ♦ దర్పులు భిల్లులు ప్రాసముల్ గదా
పట్టిస భిండివాల కర ♦ వాలతతుల్ గొని తుండముల్ తెగన్

గొట్టినఁ గుంజరోత్కరము ♦ కొండలు గూలినయట్లు బిట్టు గీ
పెట్టుచు నేలపై నొఱఁగెఁ ♦ బెంటలు పెంటలు గాఁగ నత్తఱిన్. 223

—*) భీమచాందు యుద్ధము. (*—

సీ॥ వామబాహువు నంటి ♦ వఱలు చాపము, మహోరగరాజ దీర్ఘహా ♦ రంబుగాఁగ!
గడలెల్ల దుర్నిరీ ♦ క్ష్యద్యుతుల్ వెదచల్లు శూలంబు ముమ్మొన ♦ వాలుగాఁగ!
హస్తాగ్రమున దక్షి ♦ ణావర్తశంఖ మయ్యంబుజాసను కపా ♦ లంబుగాఁగ!
గడియయైనను దన్ను ♦ విడక కొల్చెడు భిల్లతతులెల్ల బ్రమథసం ♦ తతులుగాఁగ!
గీ॥ నప్పు డబ్దార్ నబీ తెచ్చు ♦ హస్తిదైత్యు భిల్లపశుపతి గదనెత్తి ♦ పిప్పిసేయ
గాయపడి చెంచిరపుఁగొండ ♦ కరణి నదియుఁ గాళ్లపై కెత్తి పిల్లేరు ♦ గంతునైచె.

ఉ॥ భండనభీముఁ డాశబర ♦ వంశ్యశిఖామణి భీమచాందు దో
ర్దండ గదాభిఘాతముల ♦ దంతిసమూహము కుంభగోళముల్
మెండుగఁ జీల్చివైచుచు వె ♦ లింగెను గండశిలాప్రజంబులన్
బిండిగఁ గొట్టుచుండు నొక ♦ పెద్ద యయోమయ యంత్రమోయనన్. 225
క॥ బరువయిన గదను దాలిచి యరవరలై పడఁగమోద, ♦ నాద్విరదము లే
కరదములై యాపిమ్మట నరదములై కూలె నంగ ♦ లార్పఁగ యవనుల్. 226
మ॥ విబుధేంద్రుండు పవిప్రయోగముల ను ♦ ర్వీధ్రంబులన్ బోలె ని
న్నుబడెన్ ద్రిప్పుచు వ్రేయుచున్ యవనసే ♦ నాలక్ష్మి సింగారపుం
గబరీభారముఁ గోసివైచెనో యనం ♦ గా! దంతిసంతానమున్
శబరస్వామి హరించె దోర్బలకళా ♦ సంరంభ మేపారఁగన్. 227

—*) బుడుతకీచులు పిరంగులను బ్రేల్చుట. (*—

సీ॥ యావన సైన్య దు ♦ గ్ధాబ్ధిఁ ద్రచ్చినఁ బుట్టు కాలకూటానల ♦ జ్వాలలనఁగ!
దురకదండను చిల్వ ♦ దొర ఫణంబులఁ దోఁచు మాణిక్యపటలసం ♦ పదలనంగ!
కదనానిలమున మో ♦ గలు సరస్సుననుండి రాలెడు శతపత్ర ♦ రాజియనఁగ!
బహుళ శతఘ్నీప్ర ♦ వాళవల్లుల జాలు గుమురైన పగడాల ♦ గుత్తులనఁగ!
గీ॥ బరగి తాళ బింబ కపిత్థ ♦ ఫలసమాన నీల భయద తప్తాయస ♦ గోళతతులు
బహుబృహన్నాళికాస్త్రముల్ ♦ పఱఁగఁజేసి బుడుతకీచులు నడిపి ర ♦ బ్బురముదోఁప.

సీ॥ మొగలాయి సైన్య జీ ♦ మూతగర్భమునుండి వెలిజాఱు పిడుగుల ♦ పిండనంగ!
యావనసుభట బా ♦ హాపత్రితాపమహాగ్నికడ లేచు నంగార ♦ కణములనంగ!
రణదుర్గ యురిమి నే ♦ త్రముల రౌద్రము గ్రిక్కఁ బొడమిన గొప్ప ని♦ప్పుకలనంగ!
మృత్యుదేవత కోప ♦ మెత్తి తూరుపుపట్టఁ దోతెంచు కౌరవ్రుల ♦ తుంటలనంగ!
గీ॥ నల్లనేరేడుపండ్లంత ♦ లగుచు యవన భటతతులనుండి వెడలుచు ♦ పాకిగుండ్లు
రాలె నీలోత్పలచ్ఛాయ ♦ రాజపుత్రి సైనికులకుఁ గర్ణావతం ♦ సంబులగుచు. 229

క॥ వడివడి నవి తొడరుచుఁ బైఁబడినన్ దడఁబడియు డీలు ♦ పడి యీడిగిలన్
బడి యెత్తువడి బడల్పడి బుడివడి కదుఁజెడిరె రాజ ♦ పుత్త్రుల సేనల్. 230

క॥ పదుగురు పదునేనుగు ఇర్వదిగురు నలువదిగురు నఱు ♦ వదిగురు మఱి తొం
బదిగురు నూర్గురు సుభటులు తుదముట్టిరి వేఁడిగుండ్ల ♦ తోరపు జడికిన్. 231

—*) ఖండేరావు యుద్ధము. (*—

శా॥ చండాగ్నేయ కరాళగోళములు వ ♦ ర్షంబట్లు పై శేర, బ్ర
హ్మాండంబంతయుఁ బిండిసేయఁగల దై ♦ ర్యాహార్యులున్, సుంతయున్
గుండెల్ నిల్వక కుఱ్ఱింగు కష్టదశ, న ♦ క్షుద్రప్రభావాఢ్యుఁడై
ఖండేరావు నిజాప్తయోధు లలరం ♦ గా నశ్వమున్ ద్రిప్పుచున్, 232

క॥ పుష్పసమయావసరమునఁ బుష్పంధయసేన గొలువఁ ♦ బుష్పరథముపై
బుష్పాస్త్రమ్ములఁ జిమ్మెడు పుష్పశరునిమాడ్కి నపుడు ♦ ముందుకుఁ గదిలెన్. 233

చ॥ వెనుక నె రాజపుత్త్రకుల ♦ వృద్ధపితామహుఁడైన భానుసిం
గు నడిచె; శ్యామసింహుఁడును ♦ గొండవిధంబున వారివెంబడిన్
జనియెను; రామచంద్రనృప ♦ సత్తముఁ డట్టులె చేరె; ధేలవా
రనృపతి వచ్చి దూఁకెను; జో ♦ రంబడి రయ్యెడఁ జోహణప్రభుల్. 234

ఉ॥ అందఱు ప్రక్క ప్రక్కలకు ♦ నా రణరంగమునన్ శతఘ్నికా
బృందము లున్న చోటు విడి ♦ యేగి తుపాకులవారిఁ జేరి యిం
దిందిరరాజిమాడ్కిఁ బర ♦ తెంచి కలంచెడి గుండ్ల కోర్చి వా
రిం దెగవ్రేయసాఁగి! రర ♦ రే! యల వీరుల శౌర్య మెట్టిదో! 235

మ॥ మురువౌ కస్తురి వానలున్ గురియ నా ♦ ప్తుల్ చుట్టునుండన్ వధూ
వరు లూరేగెడు నట్టి మాడ్కిని బ్రతా ♦ పస్వామి సామంతభూ

వరసైన్యంబు తుపాకిగుండ్లను సహిం ♦ పఁగల్గి యానాఁటి సం
గర వైవాహిక మండపంబున వెలుం ♦ గన్ జొచ్చెఁ గేళీగతిన్. 236

మ॥ "యమునంశంబులఁ బుట్టియుండవలె! లే ♦ దా యిట్టి బాహాప్రతా
పము ధైర్యంబు మనుష్యమాత్రుల కెల ♦ ర్పన్ సాధ్యమే!" యంచు ఖా
సిముఖానాది సమస్తయోధులును యో ♦ జింపన్ మొదల్ పెట్టి సై
న్యము లన్నింటిని జేర్చి రొక్కెడ విప ♦ క్షానీకమున్ దాఁకఁగన్. 237

మ॥ వలిగెన్ హైందవసైన్యఘాటికినిఁ బ్రా ♦ హ్ణాంబందుఁ దౌరుష్కసే
నలు; నాహైందవసేన డస్సె నపరా ♦ హ్ణాంబందుఁ దౌరుష్కసే
నల నాశాగ్నులు; కట్టిచో నుభయసై ♦ న్యంబుల్ రణోన్మాద మ
గ్గలమై యొండొరు మీఱఁ బోరు సలుపం ♦ గాఁ బూను టాశ్చర్యమే! 238

సీ॥ శూరాగ్రయాయి ఖం ♦ డేరావు యవనుల నఱఁటిమొక్కలనట్లు ♦ నఱికివైచె;
భానుసింహునిధాటిఁ ♦ బరసేన శిశిరంబునం దాకు రాలెడు ♦ నట్లు రాలె;
సింహశౌర్యుఁడు శ్యామ ♦ సింహభూభృన్మణి చెట్టుకొక్కఁడు పాఱఁ ♦ జేసె రిపుల;
నరిరాజసమవర్తి - యగు మనస్సింహుండు విమతసైన్యము పీన్గు ♦ పెంటచేసె;
గీ॥ మహితయశులు మదన- ♦ మాధవ తుల్యులు ధైర్యరతులు సమర ♦ శౌర్యఘనులు
వెలగపండ్లువోలె ♦ జేడ్లా-కొలేరియా నృపులు రాల్చి రపుడు ♦ రిపుల తలలు. 239

సీ॥ ప్రత్యేక భయదార ♦ వములు శోభిలు రాజపుత్రాశ్వ హేషా స ♦ మూహరుతము!
లహితుల గుండియ ♦ లవియ రేఁగెడు యోధసముదాయ సింహగ ♦ ర్జాస్వనంబు!
పరిపుష్ట తౌరుష్క ♦ భటకపాలములు కత్తులు తాఁకి పగులు ను ♦ ద్ధురరవంబు!
రాజపుత్రుల చమూ ♦ రాజ హస్తాంభోజ భాస్వన్మహాశంఖ ♦ నిస్వనములు!
గీ॥ భటసమూహాట్టహాస శుం ♦ భన్నినాద మఖిలదిశలను బగిలించి ♦ యడలు గూర్ప
నతిభయము నొంది మానసిం♦హప్రభుండు 'పద పదం' డని తనమూల ♦ బలము నడిపె.

## —*) భానుసింహ - వీరబలుల యుద్ధము. (*—

ఉ॥ వాడినచేనిపైఁ బడెడు ♦ వర్షము నట్టులు మానసింహుఁడున్
దోడయి వచ్చినంత యవ ♦ నుల్ ధృతితోఁ జెలరేఁగి మూఁపులున్
మూఁడయి పొంగ, వీరరస ♦ పూర్ణుఁడు వీరబలుండు యోధులన్
గూడి యెదిర్చె నయ్యహిత ♦ కుంజరసింహము భానుసింహమున్. 241

మ॥ కరవాలంబులు కన్నుఁగోనలు స్ఫులిం ♦ గశ్రేణి నల్దిక్కులన్
బరపన్ భీషణచంద్రహాసరుచు ల ♦ భ్రంబంటి వర్తింప ని
ర్వురు గంధర్వములన్ విచిత్రగతులన్ ♦ బోనిచ్చుచున్ దాఁకి సం
గరమున్ జేసిరి బాహుశౌర్యము సమ ♦ గ్రప్రౌఢి దీపింపఁగన్. 242

మ॥ తన గర్జారవధాటికిన్ దెసలు బ్ర ♦ ద్దల్ బ్రద్దలై పోవ, నూ
తన సంరంభ విజృంభణంబున నమి ♦ త్రశ్రేణి భీతిల్లఁగా
వెనుకన్ జూడక భానుసింహుఁడు రణో ♦ ర్వ్యన్ శాత్రవున్ దాఁకి, యా
తని యశ్వంబు గళంబునన్ దఱిగె ను ♦ ద్యత్ఖడ్గధారాహతిన్. 243

ఉ॥ వీరబలుండు వ్రాలి రణ ♦ వీధి మఱొండు హయంబు నెక్కి 'రా
రో! రణవీరులార!' యని ♦ యోధులఁ బిల్వ నరాతివీర సం
హారపరాయణుల్ సుభటు ♦ లట్టులె దూఁకిరి; భానుసింహధా
త్రీరమణుండు వారి నెది ♦ రించె నొకండె పరాక్రమమ్మునన్. 244

క॥ కమలసరోవరమున ద్విరదము విహరించిన విధానఁ ♦ దనివి సనక వి
క్రమరాశి భానుసింహుఁడు సమయించెఁ దురుష్కభటుల ♦ సమరతలమునన్. 245

చ॥ అదిఁగని మానసింహవిభుఁ ♦ డంబరు వీరుల 'భానుసింహుపైఁ
గదిసి రణంబుసేయుఁ' డని ♦ కట్టడసేయఁగ నట్టహాసముల్
పొదలఁగ వారు పైఁబడిరి; ♦ భూరిభుజాబలరేఖ యొప్పఁగాఁ
గదనము చేయఁసాగె లయ ♦ కాలయముండన నాతఁ డుగ్రుఁడై. 246

ఉ॥ క్రూరతురుష్కవీరుఁ డొక ♦ రుం డతనిన్ దరిఁజేరఁ బోయి దు
ర్వారకృపాణ మెత్తి తల ♦ వ్రక్కలుగాఁ బడ మోద, రక్తముల్
వాఱఁగ భానుసింహుఁడును ♦ వ్రాలె ధరిత్రిఁ; దదీయవాజి య
వ్వీరునిపైన నిల్చె నరి ♦ వీరులు పైఁబడకుండఁ గాచుచున్. 247

ఉ॥ అంతట శ్యామసింహుఁడు ర ♦ యమ్మున నచ్చటి కేగుదెంచి జం
భాంతకు నోటువుచ్చి విమ ♦ లామృతభాండముఁ గొన్న యాగరు
త్మంతుఁడు పోలె, వీరబలు ♦ దర్ప మడంచుచు, భానుసింహు సే
నాంతరమందునుండి కొని ♦ యవ్వలి కేఁగె సురక్షితమ్ముగన్. 248

చ॥ "పడెఁ బడె భానుసింహుఁ!" డను ♦ వార్త దవానలమో యనంగ నె
ల్లెడలను నాక్రమింప విని ♦ యీనిన బెబ్బులిమాడ్కి, రామచం

ద్రుఁడు, జయమల్లుసైన్యముల ♦ తో నొనరించు రణంబు వీడుచున్
వడివడి వచ్చె వీరబలు ♦ పై గిరిపైఁబడు వజ్రమో యనన్. 249

—*) రామచంద్రుదేవుని ద్వితీయ యుద్ధము. (*—

ఉ॥ కైటభదైత్యుపై నడచు ♦ కంజదళాయతనేత్రుఁడో యనన్
సూటిగ రామచంద్రనృప ♦ సోముఁడు మొగలువీరయోధులన్
దాటుచు వచ్చి, వీరబలుఁ ♦ దాఁకి తదీయభటాళిఁ జేతులన్
దీట యడంగఁ గంఠములు ♦ ద్రెంచి యనేకులఁ గూల్చె నత్తఱిన్. 250

శా॥ గుల్లల్ గుల్లలు గాఁగఁ గొందఱును, ను ♦ గ్గున్ నూకఁగాఁ గొందఱున్
ద్రెళ్లన్ జేయుచు, రామచంద్రుఁడును ద్వా ♦ ర్వీరుల్ విజృంభించు న
ద్యల్లీలల్ గని మానసింహవిభుఁడున్ ♦ దౌదవ్వులందున్న య
బ్దుల్లాఖానునిఁ బిల్చి వారిపయికిన్ ♦ బూన్చెన్ మహోగ్రాజికిన్. 251

శా॥ ధీరోదాత్తుఁడు రామచంద్రుఁడును సం ♦ దీప్తానలజ్వాలయై
తౌరుష్కాటవి భస్మసాత్కృతముగా ♦ దర్పించి చెండాడి, యా
శ్రీరామప్రభుఁ డస్త్రధార నసుర ♦ శ్రేణీశిరశ్శ్రేణులన్
నూఱుల్ నూఱులు రాల్చునట్లు రణమం ♦ దున్ రాల్చె మస్తంబులన్. 252

చ॥ అలయక రామచంద్రపతి ♦ యావనసేనల గీటడంచి, చే
తులకసిపోవఁ బోరి బల ♦ ధుర్యుని వీరబలేంద్రుఁ దాఁకి, మం
ట లుమియు ఖడ్గరాజము బె ♦ డంగుగఁ ద్రిప్పుచుఁ, దచ్ఛిరంబు వ్ర
క్కలుగను మోదె! వాఁడు పడఁ ♦ గన్ భటులున్ గొని పోయి రవ్వలన్. 253

మ॥ పొగవోలెన్ దగఁ బాటి యానృపతి య ♦ బ్దుల్లాచమూనాయకున్
దగిలెన్; వాఁడు పరాక్రమించి, నడగొం ♦ డన్ బోలె వచ్చెన్; మహో
రగమున్ దార్క్ష్యుఁడువోలెఁ బట్టి యిలపై ♦ రాల్పంగఁ, దత్సేనయున్
మొగవిచ్చెన్ గను విచ్చి యంబరువిభుం ♦ డున్ గాంచి శోకింపఁగన్. 254

శా॥ గాసిన్ బెంచుచు రామచంద్రుఁడు తురు ♦ ష్కశ్రేణి ఖండించుచో
ఖాసింఖాను పదాఱుమందిభటు లం ♦ గశ్రేణి రక్షింప యు
ద్ధాసక్తుం డయి యాతనిన్ దొడరి యు ♦ ద్యద్ధాటిమై ఖడ్గమున్
వేసెన్; భూపతి దాని రాల్చె నవనిన్ ♦ నిస్త్రింశధారాహతిన్. 255

⊕ ఉ॥ ఆపదునేడువుంది యొకఁ ♦ డై పయినం బడి; రంత దోర్బలా
టోపముమై నెదిర్చుచుఁ గ ♦ డుం గడు డస్సియు రామచంద్రధా
త్రీపతియున్ దురుష్కభటు ♦ దెబ్బ గళంబున సోఁకి క్రిందుమీ
దై పడి కూలెఁ; గల్పకమ ♦ హావనిజాతము కూలు చాడ్పునన్. 256

—*) శ్యామసింహాదుల యుద్ధము. (*—

శా॥ ఝూలావీరుల శ్యామసింహుఁడు తురు ♦ ష్కశ్రేణిపైఁ బూన్చి దా
నాలంబున్ బొనరించి రక్తతతు లే ♦ త్రై పార్చెఁ; దద్ధాటికిన్
రాలెన్ మస్తము లెల్లెడన్; లయసమీ ♦ రమ్ముల్ విజృంభింపఁగాఁ
దాళీపక్వఫలంబులున్ ధరణి మీఁ ♦ దన్ రాలు చందంబునన్. 257

మ॥ పరుషాకారులు, యామ్యకింకరుల చే ♦ వన్ వెల్గు, నాచోహాణుల్
సరసన్ గొల్వఁ గొటేరియావిభుఁడు, చే ♦ డ్లాభర్తయున్, యావనో
త్కరముల్ భీతిలి నాల్గువైపులఁ జనం ♦ గా, సంగరక్షోణి శౌ
ర్యరసోన్మాదముతోడఁ బోరిరి మృగేం ♦ ద్రారావమున్ జేయుచున్. 258

శా॥ ఆటోపమ్మున రామచంద్రసుతుఁ డా ♦ వ్యాఘ్రంబువోలెన్ నిరా
ఘాటప్రక్రియ వైరిసైన్యమృగసం ♦ ఘాతంబుపై వ్రాలెఁ; ద
ద్ధాటిన్ సైపఁగలేక తుత్తుమురుగాఁ ♦ దందోపతండంబుగా
రోటన్ బెట్టి సడించుమాడ్కి యవనేం ♦ ద్రుల్ స్రుక్కి రవ్వేళలో. 259

చ॥ జలధితరంగమాలికల ♦ చాడ్పున యావనసేన పైఁబడెన్;
జలమున రామచంద్రనృప ♦ సత్తముసూనుఁడు శేషనాగ మ
య్యలుకలపిండుపైఁబడెడు ♦ నేఁపున వ్రాలుచుఁ బోరుచున్ దురు
ష్కుల తల లేరివైచె, సుమ ♦ గుచ్ఛము లల్లన గిల్లుకైవడిన్. 260

---

⊕ The exiled prince of Gwalior Ramsah, his son Khandi Rao' with three hundred and fifty of his brave Tuar clan, (paid the debt of gratitude with their lives. Since their expulsion by Baber, they had found sanctuary in Mewar whose princes diminished their feeble revenues to maintain invoilable the rights of hospitality. 800 Rupees or £ 100 daily, is the sum recorded for the support of this prince.

"Annals of Mewar."

మ॥ అతఁడున్ రెండవభైరవుం డనఁగ బా ♦ హాటోపసాహంక్రియా
రతి నుప్పొంగుచు వీరవిక్రమవిహా ♦ రమ్ముల్ పౌనర్పున్ దురు
ష్కృతతుల్ మ్రగ్గెను; మృత్యుదేవతయు నా ♦ లుకన్ జాచెనో నా రణ
క్షితియెల్లన్ భటశూన్యమౌచుఁ గనుపిం ♦ చెన్ వాని నల్దిక్కులన్. 261

శా॥ "అందున్ జేరఁగ నీఁడు! తుత్తుమురుసే ♦ యన్ జొచ్చె మమ్మెల్ల! నీ
ఖండేరావు యముండొ! రుద్రుఁడొ! మమున్ ♦ గాపాడి రక్షింపఁగా
రం" డంచున్ యవనుల్ చమూపతుల మొ ♦ ఱ్ఱల్ వెట్టి ప్రార్థింప, ను
గ్రుండై యాజయమల్లు దూఁకె! 'భయమున్ ♦ గోల్పోవుఁ' డం చార్చుచున్. 262

శా॥ చండాటోప మెలర్ప నయ్యెడ ఖొరా ♦ సాన్ వీరులున్ వచ్చి యా
ఖండేరాయనిఁ దాఁకి; రాతఁడు భుజా ♦ గర్వంబుమై మార్కొనెన్;
బెండై శౌర్యము, కొంద ఱేఁగిరి రణో ♦ ర్విన్ వీడుచున్; గొంద ఱు
ద్దండస్ఫూర్తి నెదిర్చి, రప్పరశు కుం ♦ తశ్రేణులన్ గ్రుమ్మచున్. 263

చ॥ తడయక రామచంద్రవసు ♦ ధాపతిసూనుఁ డవక్రవిక్రమా
ఢ్యుఁ డయి రణంబు సేయ, నొక ♦ యోధుఁడు ఖడ్గము నెత్తి వేయఁగాఁ
గుడిభుజ మట్టె ప్రీలి బెడఁ ♦ గుం గరవాలము ధాత్రి డుల్లినన్
బొడువుఁ డటంచు వైరు లుర ♦ మున్ బడఁ గ్రుమ్మిరి కుంతసంతతిన్. 264

—§) ఖండేరావు రణరంగమునఁ గూలుట. (§—

సీ॥ గగనహర్మ్యాగ్రభా ♦ గమున నిల్చుట మాని, యిలఁ జేరు చంద్రమః ♦ కళ యనంగఁ!
క్రౌంచభేదనము గా ♦ వించి విశ్రాంతిఁ గూర్చుండెడు షాణ్మాతు ♦ రుం డనంగఁ!
క్రతువైరి ఫాలనే ♦ త్రజ్వాలలకు సొమ్మసిల్లి కూలెడు మన ♦ సిజుఁ డనంగఁ!
గల్పాంతపవనసం ♦ ఘర్షణంబున కోర్వ కిల వ్రాలు హేమాద్రి ♦ శృంగ మనఁగ!
గీ॥ నభ్రముననుండి తనదు పు ♦ ణ్యంబుఁ దప్పి సూటి తెగిపడ్డ చక్కని ♦ చుక్క యనఁగఁ!
దనువుఁ దాల్చిన భువనసాం ♦ దర్య ధనము బవరమందు ఖండేరాయఁ ♦ డవనిఁ గూలె.

మ॥ వనరాశిన్ జొరఁ బాఱు వాహినులటుల్ ♦ బారై మనస్సింహుఁ డా
తనితోమ్మంద్రు సహోదరుల్ యవనమ ♦ ధ్యంబందుఁ బోరాడఁ జొ
చ్చిన ఝాలాసుభటేంద్రులున్ భటశిర ♦ శ్ఛేదంబు సేయన్, విప
క్షనికాయంబులు దిగ్భ్రమన్ దవిలి వె ♦ న్కన్ జూడఁగా సాఁగినన్, 266

ఉ॥ గ్వాలియరీశులున్ దెగిరి; ♦ వ్రాలెను నేలను భానుసింహుఁడు; డి
వ్వేళ జయంబు తప్పు; దోక ♦ పెట్టన వైరులఁ దాఁకి కూల్చుటల్
మేలని మానసింగు నియ ♦ మించెఁ; దురుష్కులు దిక్కులెల్ల గ
గ్గోలుపడంగ నార్చి రిపు ♦ కోటులఁ దాఁకి రవార్యశౌర్యులై. 267

సీ॥ భయద యావనవీర ♦ భటు లారభటులతోఁ బ్రళయకాలపయోద ♦ పటలిమాడ్కిఁ
జెలరేఁగి నాల్గుది ♦ క్కులఁ గ్రమ్మ, దావాగ్ని యలమిన మృగములు ♦ కలఁగినట్లు,
లగ్నివర్షించు గ్రీ ♦ ష్మాతపోద్ధతికిఁ బుష్పవనంబు తలవాల్చి ♦ వాడినట్లు,
వారాశి యుప్పొంగి ♦ మేరమీఱఁగ, నదీ తోయపూరం బెక ♦ దొట్టినట్లు,
గీ॥ రాజపుత్రులు పటుపరా ♦ క్రమసమగ్ర మూర్తులై పోరుచున్నను ♦ మొగలువీర
భటులసంఖ్య హెచ్చౌట నో ♦ ర్వంగలేక బరువుపడిరి కొండలు పైన ♦ వ్రాలినట్లు.

—*) చంద్రభట్టారకుఁడు యవనులపైఁ గవియుట. (*—

మ॥ అరు లాత్మీయబలంబు నొంపఁ, గవిలో ♦ కైకాగ్రగణ్యుండు స
ద్గురుఁడున్ విప్రుఁడు చాందుభట్టు కర ము ♦ గ్రుండై రణోన్మాద వి
స్ఫురితుండై గజరాజవాహముఁ, గలం ♦ బున్ గైతమున్ వీడుచున్,
గరవాలంబు ధరించి దూఁకెఁ బ్రతిప ♦ క్షుచ్ఛేదమున్ జేయఁగన్. 269

చ॥ అనిలజవంబునన్ విఱుగు ♦ నభ్రము లట్టులు, శ్యేనధాటికిన్
వెనుకకుఁ బోవు నవ్విహగ ♦ బృందము నట్టులు, వేఁటకాని ద
ర్శనమున నోడి పర్విడెడు ♦ సత్వము లట్టులు, చాందుభట్టు ఘో
ర నిబిడధాటి బెండువడి ♦ ప్రగ్గిరి మొగలు యుద్ధవీరులున్. 270

సీ॥ కడదాఁకఁగనిన భ ♦ గ్న ప్రాసనివహంబు! ఖండితాలంకార ♦ మండనంబు!
నసమన్వితోరు ప ♦ దార్థసంఘాతంబు! స్ఖలిత వ్యవస్థాక ♦ గణయుతంబు!
దుష్క్రియాకృత శబ్ద ♦ దోషభూయిష్ఠంబు! నపరాసహిష్ణు వా ♦ క్యాన్వితంబు!
నధిక విసంధియు! ♦ నపగత నియతియు! నగణమాన గురు ల ♦ ఘ్వంతరంబు!
గీ॥ నపగత రసావకాశంబు! ♦ నత్యనన్వయక్రమముగాఁగ, యవనసై ♦ న్యంబునెల్ల
సరసకవిలోకపతియయ్యుఁ ♦ జంద్రభట్టు కుకవికావ్యంబుఁబోలె నె ♦ క్కొనఁగఁ జేసె.

మ॥ “పిడుగుంబాటున సైన్యగర్భమున నా ♦ వేశించె నీతఁడు; చం
పుఁడు పోనీకుఁ” డటంచు నొండొరులు గుం ♦ పుల్ గుంపులై వ్రేలు మో

పెఁడు సందీయక చుట్టు మూఁగిరి మొగల్ ♦ వీరుల్ తదధ్యక్షు! ల
య్యెడ దేవాసురయుద్ధమట్లు సమరం ♦ బేపారె నత్యుగ్రమై. 272

సీ॥ చంద్రహాసం బెత్తి ♦ జయమల్లు కేడెంబు శీర్షకంబును జించి ♦ చెండి వైవ!
రాయశీలుఁడు సుప ♦ ర్ణప్రాభవుం డౌచుఁ గలవాలఫణిని ద్రు ♦ క్కలుగఁ జేయ!
సింహశౌర్యుండు ఖా ♦ సింఖాను మున్మున్న పరతెంచి యున్న తా ♦ శ్వంబు నఱుకఁ!
బులివంటిప్రోడ య ♦ బ్దుల్లాచమూపతి నెత్తిపై ఖడ్గంబు ♦ నెత్తివేయ!
గీ॥ రాజపుత్రశతాధిక ♦ గ్రంథకర్త చంద్రభట్టారకుఁడు యశ ♦ స్సాంద్రమూర్తి
తల పగిలి యశ్వముననుండి ♦ తెలివి తప్పి ముందునకు సోలి ధరవ్రాలి ♦ మూర్ఛమునిగె.

చ॥ ఎవని పదాంబుజాతము ల ♦ హీన నృపాలవరేణ్యసేవ్య మా
కవి ధర వ్రాలినన్ మెఱుపు ♦ గ్రక్కున వీచినయట్లు ధేలవా
రవిభుఁడు వచ్చి దూఁకి కరి ♦ రాజు మృణాళముఁబోలె నెత్తి యా
హావతలమందునుండి వడి ♦ నవ్వలఁ జేరిచె నశ్రమంబుగన్. 274

మ॥ 'కవి నిర్యాణమునొందె; మమ్ము నెదురం ♦ గా లేఁ డొరుం'డంచు న
య్యవనుల్ పొంగుచుఁ గేక లార్పులును జే ♦ యన్, దన్మహానాదముల్
దివి మ్రోయంగఁ బ్రతాపభూవిభుఁడు త ♦ త్సేనాధిపుల్ నెమ్మనం
బవియన్ శోకము నొంది కుందిరి దురం ♦ తాయాసభారమ్మునన్. 275

—*) రాఠోడ్ తేజసింహుని మూఁడవ యుద్ధము. (*—

సీ॥ సాగరాంతర నివా ♦ సము మాని ధరణికిఁ బరతెంచు బాడబ ♦ వహ్ని యనఁగ!
నాప్రతాపేశ్వరుం ♦ డను గజాసురవైరి ఫాలనేత్రానల ♦ జ్వాల యనఁగ!
సచరాచరప్రపం ♦ చముఁ గూల్పఁ బరతెంచు ప్రళయకాలపరేత ♦ రా జనంగ!
యవనసేనారణ్య ♦ మలమి భస్మము చేయఁ దవిలెడు నిర్ధూమ ♦ దహనుఁ డనఁగ!
గీ॥ ధరకు డిగి వచ్చు చండమా ♦ ర్తాండుఁ డనఁగ! వైరిగిరికోటిపై వ్రాలు ♦ వజ్రమనఁగ!
భూతలంబు నిర్యవనంబు ♦ చేతు ననుచుఁ దేజసింగు హయంబును ♦ ద్రిప్పి కదలె.

మ॥ తనరాఠోడులు రెండువేల్ భటులు చెం ♦ తన్ గొల్వఁగా సింహగ
ర్జనమున్ జేసి యజాండకర్పరము పి ♦ చ్చల్గాఁ బడన్ దూఁకఁ, ద
ద్ధ్వనియున్ మృత్యువు నట్టహాసమటు క్రో ♦ త్రద్వంద్వమున్ జీల్ప 'నిం
డెను నూతేం డ్ల'ని ప్రీలె మొగలుల గుం ♦ డెల్ తేజసింహున్ గనన్. 277

ఉ॥ మారట రుద్రుఁడై యతఁ డ ♦ మందపరాక్రమరేఖ యొప్పఁ గ్రొ
క్కారుమెఱుంగువోలెఁ దుర ♦ గంబు రణాంగణమందుఁ ద్రిప్పి దు
ర్వారజవంబునన్ దలల ♦ పై నడిపించి తురుష్కలోక సం
హార మొనర్పఁగాఁ దొడఁగె ♦ నచ్చటి యందఱు కన్నిరూపులై. 278

మ॥ కృతసర్వాహవసాధనాఢ్యము రణో ♦ ర్విన్ దేజసింహాగ్నిప
ర్వత ముప్పొంగుచుఁ దన్మహానలము ప ♦ ర్వన్ దప్పకో లేసి దు
ష్టస్థితిఁ దౌరుష్క చమూమహావనము భ ♦ స్మీభూతమై చుట్టునన్
క్షితిపై రాలెను గుప్ప తెప్పలుగ ని ♦ ర్జీవస్థితిన్ గూలుచున్. 279

మ॥ యవనోర్వీరుహకోటిఁ ద్రుంచి ధరపై ♦ వ్యాపింపఁగాఁ జేసి యా
హవసుక్షేత్రము సర్వమున్ జదను సే ♦ యన్ గల్గి దుర్వారసైం
ధవసంఘట్టనతోడ మెత్తఁగను దు ♦ న్నన్ గల్గి రాఠోడు పుం
గవుఁడున్ శత్రుల రక్తధార మడవల్ ♦ గట్టన్ బ్రతాపోన్నతిన్. 280

గీ॥ అహితులందఱు తనదు సా ♦ హసము మెచ్చ విసుగ కంతంతకును విజృం♦భించి పొంగి
యాఱుగుమి దూసి పోసిన ♦ యట్లు నఱకి వైరిసంహార మొనరించె ♦ వాలుమగఁడు.

మ॥ ఖురసంఘట్టన తాళమానముల ని ♦ గ్గున్ జూప రాఠోడ్భటుల్
తురగవ్రాతముఁ బూన్చి యాప్రళయరు ♦ ద్రుల్ వోలెఁ దీండ్రించి యు
ద్ధురతౌరుష్కచమూసమూహములపైఁ ♦ ద్రొక్కించి స్రుక్కింప, న
య్యరులున్ వ్రాలిరి పీన్గుపెంటలుగ హా ♦ హాకారముల్ చేయుచున్. 282

మ॥ తెగియున్నట్టి మనోజ్ఞ హారమున ము ♦ త్తెంబుల్ వలెన్ దిక్కులన్
మొగలుల్ పాఱిరి; మానసింహుఁడు "జయం ♦ బుల్ చేతికిన్ జిక్కచోఁ
దెగఁబాఱన్ దగునయ్య! ధైర్యరమ సం ♦ ధిల్లన్ రిపుశ్రేణిఁ గూ
ల్పఁగఁ బోం" డంచని మందలింప నట ని ♦ ల్వన్ లేక వా రందఱున్, 283

సీ॥ "ప్రళయరుద్రులు గాని ♦ బదనూర్ భటులుగారు! తెలియవే రాఠోడు ♦ తేజసింగు!
మృత్యుదేవతకైనఁ ♦ గృప గల్గుఁగాక! చంపినదాఁక నీతండు ♦ విడువఁబోఁడు!
నితనితో మార్కొని ♦ యేన్గుతొండంబంత బుసవచ్చె! నొడళుల ♦ నుసురు లేదు!
గొలుసులఁ గట్టి తో ♦ డ్కొనిపోయినను మోము తేజసింహునిదిక్కు ♦ ద్రిప్పఁబోము!
గీ॥ నిలక తూగాడెఁ గాళ్లు! నీ♦కొలువు చాలుఁ! బ్రాణ ముండిన లాభముల్ ♦ పడయవచ్చు!
"రాము రాలేము మేము పో♦రంగఁ జాల" మనిన, మానసింహుఁడు దిగు♦లంది నిలిచె.

శా॥ ఆసఫ్ఖానుఁడు కొంతసేనఁ గొని డా ♦ యన్ వచ్చి నచ్చోటి; క
ష్టాసక్తిన్ గని మానసింహవిభుఁడున్ ♦ ప్రాణంబుఁ బ్రాపించి పె
ల్లాసల్ బాసలు పెంచి కష్టపడ, నా ♦ యా సైన్యముల్ దైన్యముల్
వాసెన్; డాసిరి తేజసింహుఁ డెదిరిం ♦ పన్ బూని వా రందఱున్. 285

మ॥ చిఱున వ్వాస్య మలంకరింప; రిపులన్ ♦ జేయెత్తి "వేంచేయుఁ డం
దఱు వీరుల్! మిముఁ దాఁకి పోరుటకు డెం ♦ దం బుత్సవం బందె; సు
స్థిరులై పాఱక నిల్వుఁ" డంచు బదనూర్ ♦ సింహంబు పూరించె ని
ష్ఠురశంఖంబు విపక్షకోటిపయి రా ♦ తోడుల్ వడిన్ దూఁకఁగన్. 286

చ॥ ఒకయెడ రెండులక్షలగు ♦ యోధులు గుండెలు లేక నిల్వ; నిం
కొకయెడ రెండువేల భటు ♦ లుర్వి వడంకఁగ వారిఁ దాఁకఁగా;
నొకనికి నూఱుమంది భటు ♦ లోడెకి యీ రణరంగవైభవం
బొకవెయికండ్లఁ జూడవలె! ♦ నూఱక వర్ణన చేయు టెట్లగున్. 287

చ॥ ఉదధి తరంగపంక్తులు మ ♦ హోన్నతధాటిని శైలపార్శ్వమం
దుఁ దగిలి పాయలై విఱిఁగి ♦ తోడనె వెన్కకుఁ బాఱి శాంతమై
పొదలుగతిన్ దురుష్కచము ♦ వుల్ రభసమ్మునఁ దేజసింహుపైఁ
గదిసి తదీయధాటికిని ♦ గ్రమ్మఱి వెన్కకు బ్రొమ్మొగ్గ నయ్యెడన్. 288

మ॥ పురదైత్యేంద్రుల నొంచు రుద్రునివలెన్ ♦ బోనీక యాలోకభీ
కరుఁ డయ్యుగ్రనృసింహమూర్తి యరులన్ ♦ ఖండించి దోర్దర్ప వి
స్ఫురణన్ వెల్గ, రణాంగణం బఖిలమున్ ♦ శూన్యంబుగాఁ దోఁచెఁ; "గు
మ్మరి కేఁడున్; గుదె కొక్కనాఁ" డనెడు సా ♦ మ్యం బొప్ప రూపించుచున్. 289

మ॥ అలఘువ్యోమ ధునీప్రవాహభరమ ♦ ట్లత్యార్భటిన్ దూఁకు నా
జలపాతం బటు దేజసింహుఁ డతిభీ ♦ ష్మప్రాభవుం డౌచు ముం
గలికిన్ దూఁకఁ; దదీయధాటి నిలువం ♦ గా లేక సర్వంబు మొ
గలుసైన్యంబు దిశాముఖంబులఁ గలం ♦ గన్ బాఱె దైన్యంబునన్. 290

ఉ॥ "ఈ యపమృత్యువున్ దొడరి ♦ యీశ్వరుఁ డైన మనంగలేఁడు! మా
యాయువు గట్టి దాట నొడ ♦ లం దసువుల్ గనఁ గంటి! మింటికిన్
బోయియు నాలుబిడ్డలఁ గ ♦ నుంగొనువారము! వైరి గెల్వ నే
దో యొకదారి చూచుకొను! ♦ మూఱక చంపకు కూటిపేదలన్." 291

మ॥ అనఁగా, నంబరుభ ర్త యాటుగుర సై ♦ న్యాధీశులన్ జేర్చి యే
మని తా నాశలు చూపెనో; భటులు తో ♦ డై కొల్వ వారున్ రణో
ద్ధ్వని దూరమ్మునఁ బొంచి పొంచి యనువౌ ♦ వేళన్ వడిన్ దేజసిం
హునిచుట్టున్ వలయాకృతిన్ గవిసి ర ♦ త్యుగ్ర ప్రతాపాఢ్యులై. 292

చ॥ అది గని తేజసింగు ధను ♦ రాకృతి వార్వముఁ ద్రిప్పి, ఖడ్గముల్
చిదియఁ, దురంగమంబులు న ♦ లిన్ బడ, యోధులు దుల్లి కూల, 'స
ర్వదమనుఁ' డంచు నెల్లరును ♦ బల్కఁగ; వైరుల నొక్కఁ డైన దె
బ్బ దినని వాఁడు లేఁ డన న ♦ వార్యబలంబునఁ జేసె యుద్ధమున్. 293

సీ॥ “ఇదె చెంతఁ జేరితి ♦ నిపు డైన నెదిరింపుఁ' డని కొందఱను దాఁకి ♦ యసువు లూడ్చి!
“పరువు లెత్తెద రేల! ♦ మరణంబు దప్పునే” యనుచుఁ గొందఱ తల♦లవియ మోది!
“యేది మీ విక్రమం ♦ బిట్టిదేనా” యంచుఁ గొందఱ డాసి ను ♦ గ్గుగను జేసి!
“యొదిగియుండెద రేల ♦ కదిసి రా రం”డని కొందఱ నసిధార ♦ గ్రమ్మ నేసి!

గీ॥ “మీరు కంపించు టట్లుండ♦మీ హయములు వడఁకెఁ గనుఁ”డంచుఁ గొందఱఁ♦బట్టికూల్చి
మెలఁగె రణమునఁ దేజసిం ♦ గెలుకపిండు నలముకొని పిల్లి చెరలాట ♦ మాడు నట్లు.

సీ॥ ఆననేందువు దర ♦ హాసచంద్రికలీనఁ జని రాయశీలు వ ♦ ఱుమ్ముఁ గ్రుమ్మె;
నొయ్యారమునఁ బోయి ♦ యోరచూపునఁ జూచి జయమల్లు నశ్వంబు ♦ సంహరించె;
నిలిచి నట్టులె నిల్చి ♦ చెలరేఁగి ముందేఁగి వీరబలేంద్రు ను ♦ ర్విఁబడ మోదె;
నొర ఖడ్గ మూంచి య ♦ త్యుల్లాసమునఁ జేయి సాచి ఖాసింఖానుఁ ♦ జక్కడంచెఁ;

గీ॥ గరయుగంబున ఖడ్గయు ♦ గంబుఁ దాల్చి, చనుచు నటికె నబ్దుల్లా భు ♦ జద్వయంబు
మీస మొత్తి యాసప్ఖాను ♦ మేను చించెఁ! దేజసింగు ప్రతాప సం♦దీప్తుఁ డగుచు.

మ॥ కడురక్తిన్ జయలక్ష్మియున్ వధువు, మో ♦ గల్ వీరు లాదేవి సం
దడిమైఁ గొల్చెడు చుట్టపక్కములు, యు ♦ ద్ధంబున్ వివాహంబుగా,
బెడగున్ గత్తుల పూలమాలలు శుభా ♦ ప్తిన్ గూర్చుచున్ దేజసిం
హుఁడు డేగాటల నాడు పెండ్లికొడు క ♦ ట్లొప్పారె నవ్వేళలో. 296

గీ॥ దేవ తిర్య ఙ్మనుష్యులఁ ♦ దేజసింహు నట్టి వీరుండు లేఁ డని ♦ యంద ఱనఁగ
సమర మొనరించె; శాత్రవుల్ ♦ సమసి! రపుడు శిశిరమున నాకు రాలెడు♦చెలువుదోఁచె.

ఉ॥ పోఁడిమిమీఱ నార్వురు చ ♦ మూపతులున్ భటు లెంతకాల ను
ల్లాడినఁ దేజసింహుఁ డిసు ♦ మంత కలంగుటగాని వాజి తూ

గాడుటగాని, కత్తి కర ♦ మందుఁ జలించుట గాని లేద; క్రో
వ్వాఁడిమితోఁ దురుష్కభట ♦ భంజనముఁ బొనరించె నుగ్రుఁడై. 298

మ॥ కదనక్షోణిని మానసింహుఁ డట వె ♦ న్కన్ వెన్క నే పొంచి సా
గి దరిన్ జేరుచు జోడుగుండుల తుపా ♦ కిన్ బ్రేల్పఁగా వర్మముల్
జిదురన్, వెన్ను నగల్చి వక్షమున దూ ♦ సెన్ గుండు; లాదెబ్బతోఁ
జదియన్ మోదెను తేజసిం గతని దో ♦ స్స్తంభంబు బెండై చెడన్. 299

—*) రాథోడ్ తేజసింహుని నిర్యాణము. (*—

సీ॥ గిరిభేదనము చేయు ♦ తటి నొక్కచో శ్రాంతిఁ బడయు దైవతచక్ర ♦ వర్తి యనఁగ!
గగనహార్మ్యాగ్రభా ♦ గ విహారమును మాని ధరఁజేరు చండమా ♦ ర్తాండుఁ డనఁగ!
దివి నేగువేళఁ గ్రిం ♦ దికి విమానము జాఱి పడిన ఖేచరసార్వ ♦ భౌముఁ డనఁగ!
భువనముల్ గంపిల్ల ♦ మ్రోఁగి యాఁగిన ప్రతాపాబ్జాక్షు పాంచజ ♦ న్యం బనంగ!

గీ॥ నంతదాఁకను మొగలుసే ♦ నాబ్ధి యింకఁ బరమవీర్యంబున జ్వలించు ♦ బాడబాగ్ని!
దేజసిం గశ్వముననుండి ♦ త్రెళ్లి పడియె 'నోజగద్గురు! త్రిజగద్గు ♦ రూ!' యటంచు.

శా॥ ఆరాథోడ్భువనప్రతాపతపనుం ♦ డస్తంగతుండై చనన్
భేరీనాదము బొబ్బ లార్పులును శో ♦ భిల్లెన్ మొగల్ సేన; శో
కారావంబుల రాజపుత్రకుల సై ♦ న్యం బాతయున్ స్రుక్కి ని
స్సారంబై స్పృహ తప్పె జీవకళ లే ♦ శంబైనఁ గన్పింపమిన్. 301

—*) ప్రతాపసింహుఁడు విజృంభించి యవనసైన్యముఁ జొచ్చుట. (*—

సీ॥ హారావళీపర్వ ♦ తాంతరమందుండి వచ్చు కేసరిసార్వ ♦ భౌముఁ డనఁగ!
యావనభువనసం ♦ హారంబు గావింప నెత్తి పైఁబడు పెను ♦ మిత్తి యనఁగ!
జగము లన్నిఁటిని ధ్వం ♦ సం బొనర్పఁగ రెచ్చి పరతెంచు లయకాల ♦ భర్గుఁ డనఁగ!
గల్పాంతమున జగ ♦ ద్గణము దుమ్ముగఁజిమ్ము సప్తప్రభంజనో ♦ చ్ఛలన మనఁగ!

గీ॥ దేజసింహుని మృతికి నా ♦ ర్తిని వహించి "యవనసైన్యాంబునిధి మదీ ♦ యాస్త్రబాడ
బానలవ్యాప్తి నింకింతు" ♦ నని ప్రతాపవిభుఁ డరాతులపై విజృం ♦ భించె నపుడు.

సీ॥ ముక్కు తోడరమల్లు ♦ భూరిసైన్యం; బసఫ్ఖాను ఖాసింఖాను ♦ కన్నుఁగవయుఁ;
గంఠ మబ్దుల్లాయుఁ; ♦ గడుపున జయమల్ల రాయశీలుల ♦ భట వ్రాతములును;

బాదంబులను వీర ♦ బల-రాయసింహుల సైన్యంబు; రెండుప ♦ క్షంబులందు
షాబాజుఖాన్ చమూ ♦ సమితి యబ్దూరహిమానుసేనాపరం ♦ పరలు బెరసి;
గీ॥ యంబరీశుండు పుచ్ఛంబు ♦ నందు నిలిచి; గారుడవ్యూహ మొనరింపఁ ♦ గాఁ బ్రతాప
విభుఁడు సామంతులందఱు ♦ విడక కొలువ, దస్యుకోటి దండవ్యూహ ♦ ధాటిఁ దగిలె.

మ॥ ఉరగాధీశు సహస్రజిహ్విక లటం ♦ చూహింప దోర్దర్పదు
ర్భరులై యొప్పు శిశోదియాసుభటు లా ♦ రాణాపిఱుందన్ భయం
కర నిస్త్రింశకఠోరధార నిగుడం ♦ గా, గండభేరుండముల్
హరిణవ్రాతము నట్లు చెండిరి విప ♦ క్షానీక మత్యుద్ధతిన్. 304

శా॥ లోకమ్ముల్ పొడిగాఁగఁ దాండవకళల్ ♦ దొల్కాడ నర్తించు నా
శ్రీకంఠున్ బురుడించు రౌద్రరసమూ ♦ ర్తిప్రాభవం బొప్పఁ బ
ట్టాకత్తిన్ గొని యాపరితాపుఁ డరికం ♦ ఠంబుల్ విదారించుచున్
జీకాకై పడఁ జేసె; మొగలుచమూ ♦ శ్రేణిన్ సమీకస్థలిన్. 305

మ॥ క్రమమై హాస్తము లట్టె లేచుటయు, ఖ ♦ డ్గవ్రాతముల్ కాంతిపూ
రములన్ జెల్లఁగఁ గ్రమ్మటల్, భటుల మా ♦ ర్గమ్ముల్ వడిన్ బ్రీలి ర
క్తములన్ బైకెగఁజిమ్మటల్, యవనయో ♦ ధవ్రాతముల్ గాలి ప్రా
ణము గోల్పోవుట తప్ప వేఱెదియుఁ గా ♦ నన్ రాదు నల్వంకలన్. 306

మ॥ తమవ్యూహంబు చౌరన్ బడన్ యవనయో ♦ ధశ్రేష్ఠు లిర్వంకలన్
గుములై పైఁబడఁగాఁ, బిపీలికములున్ ♦ గుంపౌచుఁ బై కెక్కు న
శ్రమమై పాఱు భుజంగరాట్సదృశమా ♦ రాణాచమూదండ మా
ర! మహావేగముతోఁ దురుష్కభటగ ♦ ర్భం బంను దూరెన్ వడిన్.! 307

మ॥ శతధాఖండము లౌచు రాలె సమర ♦ క్ష్మామధ్యమందున్, విశీ
ర్ణ తనుత్రాణచయంబులున్, దళిత కుం ♦ తశ్రేణు, లాపై విలూ
ఠిత కంఠంబులు; భగ్న ఖడ్గములు; కుం ♦ ఠీభూత భేరుల్; నిపా
తిత కేతువ్రజముల్; విఖండిత గదా ♦ దివ్యన్మహాదండముల్. 308

చ॥ తడయక వైరిశీర్షములు ♦ తాళఫలంబులువోలె డుల్లఁగన్
బొడువఁగ నమ్మహాపురుష ♦ మూర్తికె చెల్లును; శాత్రవాశ్వముల్
వడిఁ దనుఁ గాంచి భీతిగొని ♦ పాఱఁగ వల్గితధార నెత్తి వ
చ్చెడు పని చైతకంబునకె ♦ చెల్లు ననంగ మెలంగి రిర్వురున్. 309

ఉ॥ అప్రతిమాన సాహసమ ♦ హాబలవిక్రముఁ డైన రాజపు
త్రప్రభుఁ డాప్రతాపుఁడును ♦ దస్యుసమూహములన్ వధించి; బ్ర
హ్మప్రళయంబు చేసె; సమ ♦ రాంగణమున్ విడి యంబరీశు సై
న్యప్రతతుల్ గలంగుచు భ ♦ యావిలచిత్తతఁ బాఱె దిక్కులన్. 310

—*) ప్రతాపసింహుఁడు మానసింహ - సలీములఁ దగులుట. (*—

⊕ గీ॥ పూచి పట్టిన నడగొండ ♦ పోల్కెఁ దనరి; పట్టు బంగారు జిలుగుటం♦బారి నెసఁగి
"పంచమంగళ" గజరాజు ♦ వఱలె; నందు మానసింహ-సలీములు ♦ గానఁ బడిరి,

గీ॥ తెఱలి తీవ్రక్రుధాశోణ ♦ దృగ్యుగంబుఁ బఱపి; యశ్వముఁ గోత్తలఁ ♦ బైఁ గవించి;
యుగ్రసింహంబు వేదండ ♦ యుగమునట్లు బల్లె మెత్తి ప్రతాపుఁ డ ♦ వ్వారిఁ బోదివె.

సీ॥ రౌద్రరసారూఢి ♦ శ్రవణముల్ రిక్కించి వీఁపున నున్న ప్ర ♦ తాపుతోడ
నుబికి; ముందరికాళు ♦ లున్నతంబుగ నెత్తి; యువరాజమానసిం ♦ హుల గజంబు
దంతద్వయంబుపైఁ ♦ దగ మోపి భయదహేషలఁ జేసి దర్పించి ♦ చైతకంబు
నిలిచె; నాపంచమం ♦ గళము తద్ధాటికి వెఱచి తొండముఁ దల ♦ విసరుకొనుచు

గీ॥ వెనుక కొక్కుమ్మడిగఁ బాఱెఁ♦బృథివియద్రువఁ; గజగమనధాటి గండంబు♦గడచి పోయి
మానసింహ-సలీములు ♦ మనఁ గలిగిరి; మావటులు మాత్ర మిరువురు ♦ మడిసి రపుడు

సీ॥ కను లున్నభాగ్య మీ ♦ తని యమానుషశౌర్య రేఖఁ గంటి మటంచు ♦ రెండుపక్షు
ముల భటు లని మాని ♦ నిలిచి; రబ్బురహిమాను నిల్వెల్ల వి ♦ స్మయము గదురఁ

---

⊕ In vain he ( Pratap ) strained every nerve to encounter Raja Mann. but though denied the luxury of revenge, on his Rajput foe, he made good a passage to where Selim commanded. His guards fell before Pratap, and but for the steel plates which defended his howdah, the lance of the Rajput would have deprived Akbar, of his heir. His steed the gallant Chytuc, nobly seconded his lord and is represented in all the historical drawings of this battle, with one foot raised upon the elephant of the Mogul, while his rider has his lance propelled against his foe. The conductor destitute of the means of defence was slain. When the infuriated animal, now without control, carried off Selim. On this spot the carnage was immense, the Moguls eager to defend Selim, the hordes of Mewar to second their Prince who had already received seven wounds. Marked by the Royal umbrella, which he would not lay aside and which collected the might of the enemy against him, Pratap was thrice rescued from amidst the foe.

"Annals of Mewar."

"బదునాల్గు భువనముల్ ♦ వెదకిన రాజపుత్రకులట్టి విక్రమ ♦ రాసు లుండ!
రిట్టి పూజ్యులఁ బట్టి ♦ హింసించు మామొగల్ జాతులు పరమదు ♦ ర్జాతులగుటఁ!
గీ॥ దనువునను జీవ ముండెడు ♦ దాఁక, వారి చరణసేవ చేయుదుఁ గాని! ♦ మఱచి తప్పి
యైన, నిసుమంత యపకార ♦ మాచరింప" నని ప్రతిన చేసి తనఖడ్గ ♦ మవని వైచె.

మ॥ తనచే నున్న రవిధ్వజంబుఁ గని "యీ ♦ తండే ప్రతాపేశ్వరుం"
డని మోగల్ భటకోటి చుట్టుకొని ఖ ♦ డ్గానీకకుంతాది సా
ధనముల్ వైచిరి; కాని యాతఁ డణుమా ♦ త్రన్ వెన్కకున్ బోక, కే
తనమున్ వీడక, పోరుచుండె నరిసం ♦ తానంబు ఖండించుచున్. 315

సీ॥ అరి వీఁడు, వీఁడాప్తుఁ ♦ డనరాక సంకులరణ మయ్యె; రాణా న ♦ రాతికోటి
ముట్టడించెను; రాజ ♦ పుత్రవీరులు క్షీణబలులౌట మేవాడ ♦ భానుని గతి
సందిగ్ధముగఁదోఁచె; ♦ మందేహగణముతో రణమున రక్తధా ♦ రలను దోఁగు
తపనునిమాడ్కిఁ బ్ర ♦ తాపప్రభుండు గాయములతో రక్తసి ♦ క్తాంగుఁ డయ్యె!
గీ॥ విరియఁ బూచిన కింశుక ♦ తరువువోలె వెలుఁగుచుండియుఁ గడు విజృం ♦ భించి వైరి
భటుల శిరములు చిద్రుపలై ♦ వసుధ రాల, నతఁడు రణ మొనరించె భ ♦ యంకరముగ.

సీ॥ వెనుకముందులు చూచు ♦ కొనక, యూపిరి పుచ్చుకొనక, యాలోచించు ♦ కొనక, వీరు
వా రనుకొనక, క ♦ న్పడువారలను బట్టి చంపు నా సంకుల ♦ సమరమందు,
⊛ నాసఫుఖానుతో ♦ నాబదోనియు "మన ప్రక్క, వైరుల ప్రక్క, ♦ రాజపుత్రు
లుందురుగా; వీరి ♦ యందు శాత్రవు లంచు హితు లంచు మీ రెట్టు ♦ లెఱుఁగుచుందు"
గీ॥ రన, నసఫ్ఖాను "కన్నుమూసి ♦ కొనుచుఁ జీల్చి వేయుదుము; రాజపుత్రులు ♦ విమతులైన
విహితులైన యావనమత ♦ ద్వేషు లగుట నం దెవరు నీల్గినను మేలె" ♦ యనుచుఁ దెలిపె.

సీ॥ తమరాజరాజు ర ♦ క్తము గన్పడ శిశోదియావీరులును సలుం ♦ బ్రాధిపతియు,
శ్యామసింహాదులు ♦ సంవర్త సమవర్తిమూర్తులై యరిగళం ♦ బులను జీల్చి;
రపుడు మనస్సింహుఁ ♦ డా ప్రతాపేంద్రుని యడుగులు మ్రొక్కి నా ♦ ర్యధ్వజంబు
పెఱికి కొండొకదూర ♦ మరిగె; నెచ్చట రవిధ్వజ మున్న నచటఁ బ్ర ♦ తాపుఁడుండు

---

⊛ At one stage in the fierce struggle Badouni asked Asaf-Khan how he could distinguish between the friendly and the enemy Rajaputs and was assured in reply that he could not do wrong if he shot, as sportsmen say "into the brown" because, as the commander cynically observed 'On whichever side they may be killed it, will be a gain to Islam.' "Akbar the Great Mogul"

గీ॥ వనుచుఁ బెక్కురుయవను లం♦దరిగి;రంత,దురము భర మయ్యె;భటులతోఁ♦దొమ్మిదిగు
§ సోదరులతో మనసింహుఁ ♦ డాదినంబు స్వర్గమున కేఁగి చెల్లించె ♦ స్వామిభక్తి! 3

మ॥ అవనిన్ బ్రాలఁగ ఝేలవారనర పా ♦ లాధీశుఁ, డుద్యత్ప్రతా
పవికాసంబునఁ బెల్లురేఁగుచుఁ బ్రతా ♦ పస్వామి రోషించి శా
త్రవవిచ్ఛేదము చేయఁ జొచ్చెను సలుం ♦ బ్రాభర్తతో డాచు నా
హవరంగంబున వైరి వీరభటశీ ♦ ర్షాళిన్ విదారింపఁగన్. 3

⊛ గీ॥ బల్లెమది మూఁడుచోట్లఁ,దు♦పాకియొక్క చోటఁ,జంద్రహాసము మూఁడు♦చోటులం
దాఁకి రక్తము లురలఁ బ్ర ♦ తాపదేవుఁ డొప్పె నంగారవల్లరి ♦ యో యనంగ!

ఉ॥ తూములనుండి ధార లయి ♦ తోయము దూఁకెడు నట్లు; భీప్రదం
బై మెయినుండి తొమ్మిదియు ♦ నవ్వది గాయములందు నెత్తురుల్
భీమముగాఁగ దూఁక, రిపు ♦ వీరహయాళి భయంబు నొంది ది
క్సీమలఁ బాఱఁ, జైతకము ♦ సింహము మాడ్కిఁ జెలంగె నయ్యనిన్. 3

మ॥ "విన! నేఁడీమొగలాయివీరుల తలల్ ♦ ఛేదింతు; నిందుండి రా!"
నని జృంభించుచు వైరిఁ గూల్చెడు ప్రతా ♦ పాధీశు నర్థించి ప్రా
ర్థనముల్ సేసియు విన్నవించియు సలుం ♦ బ్రా భిల్లలోకేంద్రు లా
తనిఁ దోడ్తెచ్చిరి శత్రువీరభట మ ♦ ధ్యంబందుఁ దప్పించుచున్. 3

మ॥ తనవంశంబునఁ బుట్టి స్వచ్ఛమగు స్వా ♦ తంత్ర్యంబుఁ గాంక్షించి యా
వనసైన్యంబును జించి చెండుచుఁ బ్రతా ♦ పప్రాభవుండౌ ప్రతా
పునకున్ గల్గఁగనున్న క్లేశము లవం ♦ బున్ జూడఁగా నోడి క్రుం
కె ననంగా రవి పశ్చిమాంబుధి మునిం ♦ గెన్ రక్తకాంతిచ్ఛటన్. 3

---

§ Manah seized upon the insignia of Mewar and rearing the golden S
over his own head, made good his way to an intricate position drawing after h
the brunt of the battle, while his prince was forced from the field. With all
brave vassals, the noble Jhala fell and in remembrance of the deed his descenda
have, since the day of Huldighat, borne the regal ensigns of Mewar and enjo
the right hand of her princes.

"Annals of Mewar."

⊛ Three from the spear, one shot, and three by the sword.

"Annals of Mewar."

సీ॥ ఆనాఁడు రణరంగ ♦ మందుఁ గూడిన ప్రతాపప్రభుసుభటు లి ♦ ర్వదియు రెండు
§ వేలలో నెన్మిది ♦ వేల్మంది బ్రదికి; రాతని బంధు లైదువం ♦ దలు మడిసిరి;
త్వారుపీరులు మూఁడు ♦ వంద లేఁబదిమంది పడి; రొక్కొకకులంబు ♦ వందలుగను
భటులఁ గోల్పడియె; యా ♦ వనపతిమందుఁ దొంబదివేలు ప్రాలి ర♦క్కదనమందు;
గీ॥ మూఁడులక్షల కెక్కుడై ♦ మొగలుభటులు మనినవారెల్ల గాయముల్ ♦ దినినవారె!
శత్రులందాఁక నోపక ♦ సైన్యమెల్ల నిలిచె బెగడంది నింగిఁ జా♦దుక్కలు నిగుడ్చి.

—*) కృష్ణసింహుఁడు యుద్ధమునుండి వెడలిపొమ్మని ప్రతాపసింహు నర్థించుట. (*—

మ॥ పరమోదారుఁ బ్రతాపుఁ గన్గొని సలుం ♦ బ్రాభర్త "యెల్లప్పు డిం
తరుదై నీముఖచంద్రునిన్ దవిలి లో ♦ కాహ్లాదమున్ బెంచు నా
దరహాసాంకుర మెందు డాఁగె! నిటు చిం ♦ తన్ గుంద నేలా! సురే
శ్వరుఁడున్ గాలము దప్ప నొక్కకరణిన్ ♦ వర్తించుటల్ వింతయే! 325

సీ॥ "ఏకలింగేశ్వరుఁ ♦ డిచ్చిన దానితో నేవేళఁ దృప్తి వ ♦ హించు టొప్పు;
సాధనసంపత్తి ♦ చాలమి విజయ మొందఁగలేక పోయియుం ♦ డంగవచ్చుఁ;
బరిభూతి యనినంతఁ ♦ బ్రళయమంచుఁ దలంప; మపజయంబున సత్య♦మతిశయిల్లు;
నీపూట కిది చాలు; ♦ రేపు మరల వచ్చి భువనముల్ కీర్తింపఁ ♦ బో రొనర్తు;
గీ॥ మెంతకాల మజేయమై ♦ యెసఁగి ధర్మ మహిమ స్వాతంత్ర్యదీక్షయు ♦ మనల విడువ
వంతకాలము శాత్రవు ♦ లంగుళంబు మేర యైనను గదలింప ♦ లేరు మనల. 326

చ॥ ఇదియుఁ బ్రదోషకాల; మిపు ♦ డెట్లును యుద్ధము నిల్పి; నిందుఁ జే
యఁ దగిన దేది కన్పడదు; ♦ హాయిగఁ గొండను దాఁటి పొమ్ము; నేఁ
డుదిమొదలీచమూతతులఁ ♦ దోడ్కొని నీపదముల్ భజింపఁగా
నుదయమె వత్తు; నొండుగతి ♦ నుల్లమునన్ దలపోయ కేఁగుమీ!" 327

మ॥ అనఁ "దండ్రీ! నను నమ్మి కొల్వఁగల నే ♦ నాధీశ్వరుల్ వ్రాలి కూ
లిన నీచీఁకటిఁ ద్రోసి నే నెటుల హా ♦ ల్డీఘాటు వీడంగ నే

---

§ But the desperate valour on the part of Rana Pratap was unavailing against such a force with numerous field artillery and dromedary corps mounting swivels and out of twenty two thousand Rajputs assembled that day for the defence of Huldighat, only eight thousand quitted the field alive.

"Annals of Mewar"

ర్తను! మేవాడ్భటశౌర్యలక్ష్మి రణమం ♦ దున్ దుమ్ము పా లయ్యె! నే
ననిఁ గావించెద; శత్రులన్ దునిమెదన్; ♦ ప్రాణంబు లర్పించెదన్. 328

మ॥ "గురులున్ మాన్యులు చుట్టపక్కములు నా ♦ కున్ గూర్చు సామంతభూ
వరు లీలోకమునందు నాకుఁగల సం ♦ బంధుల్ భుజావీర్యవి
స్ఫురణన్ బోరుచు వారి వారి పొడుగున్ ♦ క్షోణీస్థలిన్ గూల్చి పం
డిరి; వీరందఱ వీడి దొంగఁబలె నొం ♦ టిన్ బోవఁ గాళ్లాడునే! 329

మ॥ ఒడలం దూపిరి యాడునంతకు రణో ♦ ద్యోగంబునందుండి నా
యడుగుల్ వెన్కకు రావు; సుంతయు శరీ ♦ రాయాసమున్ దోఁప దీ
కడ; రే యైన దివంబ యైన, నొకఁడై ♦ కన్పట్టుఁ; బూర్వాద్రి సూ
ర్యుఁడు దోతెంచెడుదాఁక శాత్రవుల ♦ నోర్తున్; గూర్తుఁ గీర్తిచ్ఛటల్." 330

సీ॥ అని ప్రతాపుఁడు పల్క ♦ విని భీమచాంద "భారతఖండ చండమా ♦ ర్తాండమూర్తి!
యని యొనర్పంగ లే ♦ వనికాదు; భీతిల్లు దనికాదు; సకలలో ♦ కాళి మెఱుఁగు
నినువంటి వీరుఁ డెం ♦ దును త్రిలోకములఁ ద్రికాలమ్ములందును ♦ గలుగఁ డనుచు;
సమయ మట్టిది గానఁ ♦ "జనుట మే" లనెఁ గృష్ణసింగు: నాకట్ల తోఁ ♦ చెడిఁ దలంపఁ

గీ॥ గొంతకాలము సంగర ♦ క్షోణి విడిచి యవలఁ దొలఁగుట పౌరుష ♦ హాని గాదు;
నీవు గలిగిన నిఖిలార్థ ♦ నియతి గలుగు; దైవ మున్నది యాపై వి ♦ ధానమునను"

చ॥ అనినఁ బ్రతాపుఁ "డేమియును ♦ నాడఁగలేను; పరాభవాగ్ని నా
మనసు దహించె" నంచన, న ♦ మాత్యశిఖామణి కృష్ణసింహుఁడున్
వినయ మెలర్ప వేఁడుకొని ♦ వేయు విధంబుల విన్నవించి సాం
⊕ త్వనములఁ గుస్తరించుచుఁ బ్ర ♦ తాపునిఁ బంపె రణంబునుండియున్. 332

—*{ రణరంగము వీడిపోవు ప్రతాపసింహుని యవన సేనాధిపతులు వెన్నంటుట. }*—

సీ॥ కాలిబాటను జైత ♦ కముపైఁ బ్రతాపుఁడు గిరి వెంటఁ గొంత ద ♦ వ్వరుగునంతఁ,
జెంత నశ్వఖురాళి ♦ క్షితి సోఁకు ధ్వని విని తిరిగి వెన్కకుఁ జూచి ♦ తురకభటులు
తఱుముకొనుచు వచ్చు ♦ టెఱిఁగెఁ; గొండొకదూర మరిగి మరలి చూచి ♦ యం దొకండు

---

⊕ The Rana having been wounded, fled to the hills mounted on his beloved steed Chytuc and his vtctors were too exhausted to pursue him.

"Akbar the Great Mogul"

తగ్గియుండుటఁ గాంచెఁ; ♦ దనప్రయాణము సాగఁ జేయుచు మరలి వీ ♦ క్షించెఁ; నింక
గీ॥ నొకఁడు లోపించె; నంతలో ♦ నుద్ధురగతిఁ బాఱు పదిమూరల వెడల్పు ♦ టేఱు దవిలెఁ;
జైతకము దేహమునను న్న ♦ సత్వమెల్ల నొక్కచోఁ జేర్చి సెలయేటి ♦ నుబికి దాఁటె.

§ మ॥ కడుఁ గష్టంబున వెన్కవచ్చు భటుఁ డా ♦ కట్కం డేటియంగూర్ హాయం
బడుగుల్ మోవఁగఁ జేసి, దాఁటుకొని "నీ ♦ లాశ్వంబుపై నెక్కిపో
యెడి యో యోధకులాగ్రణీ! నిలువుమీ! ♦ యి" ట్లంచుఁ బల్కెన్ బ్రతా
పుఁడు; "సిద్ధంబుగ నుంటి ర" మ్మని హయం ♦ బున్ డిగ్గి నిల్వంబడెన్. 334

—*) సూక్తసింహుఁడు ప్రతాపసింహుని మన్నన వేఁడుట. (*—

మ॥ త్వరమై నశ్వము డిగ్గి యోధుఁడును జెం ♦ తన్ వ్రాలి "నానామహీ
శ్వర శీర్షస్థ కిరీట రత్నచయ శో ♦ భాపూర నీరాజన
స్ఫురణన్ మించు భవత్పదాంబుజయుగం ♦ బున్ గాంచి సేవించు నా
పరమైశ్వర్యము గల్గె నేఁటికిఁ! బ్రతా ♦ పా! విశ్వలోకార్చితా! 335

మ॥ "ధర, సామాన్యపు శబ్దజాలమున "సా ♦ తంత్ర్యంబు" దా నొక్కఁ డై
పరఁగెన్; నేఁడు భవత్పరిగ్రహ మహా ♦ భాగ్యంబునన్ జేసి, స
ర్వరసాధిస్థితరూఢి నొప్పుచుఁ బర ♦ బ్రహ్మప్రభావప్రభన్
వఱలన్ జొచ్చెను; దివ్యమూర్తివి! ప్రతా ♦ పా! విశ్వలోకార్చితా! 336

---

§ Pratap unattended fled on the gallant Chytuc who had borne him through the day and who saved him now by leaping a mountain stream when closely pursued by two Mogul chiefs, when, this impediment momentarily checked. But Chytuc, like his master was wounded, his pursuers gained upon Pratap and the flash from the flinty rock announced them at his heals; when, in the broad accents of his native tongue, the Salutation " Ho! nila Ghodaca aswar ( ho! rider of the blue horse! ) made him look back and he beheld but a single horse-man, that horse-man his brother Sukta, whose personal enimity to Pratap had made him a traitor to Mewar, beheld from his ranks of Akbar, the blue horse flying unattended. Resentment was extinguished and a feeling of affection mingling with sad and humiliating recollections took possession of his bosom. He joined in the pursuit but only to slay the pursuers who fell beneath his lance and now for the first time in their lives, the brothers embraced in friendship. Here Chytuc fell and as the Rana unbuckled his caparison to place it upon " Unkaroo " presented to him by his brother, the noble steed expired.

" Annals of Mewar "

సీ॥ అన్నవు; స్వామివి; ♦ యాచార్యుఁడవు; ప్రాణమెత్తుగాఁ జూచి న ♦ న్నేలు నిన్నుఁ
దెగనాడి, యకట! భ్రా ♦ తృద్రోహమును గురుద్రోహంబు నొడిగట్టి, ♦ తురకలందుఁ
గలిసి, మేవాడపైఁ ♦ గత్తిగట్టుటను మాతృద్రోహ మొనరించి ♦ తిట్లు పడితి!
నేఁడు వాఱెడి బాష్ప ♦ వారి నీయడుగులు తడుప నాచిత్తము ♦ త్తలము నొందె!

గీ॥ నఖిలభువనవంద్యంబు నీ♦యడుగుఁదోయిఁ దలఁకుదుఁ నాదు పాడుచే♦తుల స్పృశింపఁ;
బెఱఁగెఁ గొండలు కొండలై ♦ దురితరాశి; యెట్లు కృపఁ జేల్తువో! నన్ను♦నింకమీఁద.

సీ॥ మరణదండన మాన్పి ♦ కరుణించి యమృతసారము పోసి తనదుప్రా ♦ ణమున కన్న
నెక్కుడుగాఁ జూచి ♦ యిర్వదేఁడులదాఁకఁ గ్రింద మన్నని బొజ్జ ♦ యందుఁ జేర్చి
జనకుఁడై పెంచె శా ♦ శ్వతయశోనిధి సలుంబ్రారాజ్యలక్ష్మి గా ♦ రాపుభర్త;
యకటకటా! నోర ♦ ననరాని విధమునఁ గాఱు లాడితిఁ గండ ♦ కావరమున;

గీ॥ నభినవ కిసాల కోమలం ♦ బై తనర్చు నామహారాజు మది యెంత ♦ యడలెనొక్కొ!
యీపితృద్రోహ మొక్కఁడే ♦ యెట్టిదుర్గతులకు నైనను గొంపోవఁ ♦ గలదు నన్ను.

క॥ ఈతటి నీపంచమహాభూతమ్ములు సాక్షి; వైర ♦ ము నశించెను నా
చేతమ్మున; నన్నుఁ గృపాన్వితుఁడవై యేలు” మనినఁ ♦ బృథ్వీశ్వరుఁడుఁ, 339

సీ॥ “నిర్హేతుకంబుగా ♦ నీవు వాదాడి నన్నెడఁబాసి చని పెక్కు ♦ లేడు లయ్యెఁ!
బోరాని చోటికిఁ ♦ బోతివి! కొలువంగఁగూడని విమతులఁ ♦ గొలుచుచుంటి!
వుదయంబునుండి న ♦ న్నెదిరి తఱిమి పోరు నడిపితి సాయంత ♦ నంబువఱకు!
మూఁడుమాఱులు నన్ను ♦ ముట్టి యంతంబునొందింప గట్టిగఁ బ్రయ ♦ త్నించియుంటి!

గీ॥ వని ముగిసి గంటకాలేద!♦యపుడె యేండ్లపాడవున నెసంగు వైరంబు ♦ పొలిసెననుచు
నిచ్చకపుమాటలాడుచు ♦ నిటులువచ్చి! తెటుల నిను నమ్మనగును! నా ♦ కెఱుకపడదు

క॥ దుర మొనరించుటకే యిపు డరుదెంచియయున్న యుష్మ ♦ దగ్రజుఁ డెపు డె
వ్వరు కోరిన వెనుదీఁడని యెఱుఁగు” మని వచింప సూక్తు ♦ “డిటు లేమిటికిఁ! 341

సీ॥ సకలసామంతరా ♦ జసమూహములు సభాస్థానంబునందు ని ♦ ర్జరగణంబు
తెఱఁగునఁ గొలువంగ ♦ దేవేంద్రసమవైభవంబున నీవు మే ♦ వాడరాజ్య
సింహాసనం బధి ♦ ష్ఠించి యేలుటఁగాంచి యెడఁద నోరిమిలేక ♦ యీర్ష్యవొడమెఁ!
గాని యెన్నెన్నియో ♦ గతుల యత్నించి బయల్పడనీక లో ♦ నణఁచికొంటి!

గీ॥ వేఁటచాలించి కూర్చున్న ♦ వేళ నెట్టులో హఠాత్తుగ నదియుఁ బై ♦ కుబికిరాఁగఁ
బుది నెపమున నీతోడ ♦ వాదుపెంచి యుంటి! నాచిత్తవృత్తి య ♦ ట్లుండె నాఁడు.

సీ॥ సందేశమున నిన్న ♦ శత్రుసైన్యములు హల్దీఘాటుకనుమఁ గా ♦ ల్నిలుపఁబోవ
నెటనుండివచ్చెనో ♦ యేఱుదూఁకినయట్లు మాతండ్రి యాసలుం ♦ బ్రాముహింద్రుఁ!
డిరులు క్రమ్మెడువేళ ♦ కిరువదిరెండువే ల్దొరలు గొల్వంగ నీ ♦ వరుగుదెంచి
సూర్యధ్వజము నిల్పఁ ♦ జూచితి! నపుడ నామదిలోన నొకగొప్ప ♦ మార్పుగలిగెఁ!
గీ॥ బక్షివలె నీపదములొద్ద ♦ వ్రాలియుందుఁ గాని రిపుల యుప్పునుదిన్న ♦ కారణమున
రాత్రి నిలిచి పొద్దుటనుండి ♦ రణము నడిపి వారిఋణ మావిధమున దీ♦ర్పంగఁగంటి
గీ॥ అని ముగిసినంత సకలసే ♦ నాధిపతుల మంబరీశ్వరు శిబిరంబు ♦ నందు నుంటి!
మంత నీవు దేవ! చైత ♦ కాశ్వ మెక్కి యరుగు టందఱమును గంటి♦మద్రి దెసను.
సీ॥ అంబరీశుఁడు 'పోయె ♦ నడుగో! ప్రతాపుఁ డాతనితలఁ దెచ్చు నీ ♦ రునకు మాళ్వ
ధర యిత్తు'ననియె; మూ ♦ ల్తాన్ ఖోరాసాన్ దొరల్ గదలి; రేకాకి నిన్♦గాంచి కరిగి
మొగలులదెసఁ గిన్క ♦ పొడమి యాయురువురఁ దఱిమి గీటడఁచి నీ ♦ దరిఁ దరిసితి;
మూఁడేండ్లకఱవున ♦ మునిఁగి నేఁటికిఁ గంటిఁ దనివివో భ్రాతృవ ♦ త్సలుని నిన్ను;
గీ॥ సకట! యీర్ష్యాగ్రహగ్రస్త ♦ మైన హృదయపాపమెల్లఁ బశ్చాత్తాప♦వహ్ని సమసెఁ
ద్వత్కృపామృతవృష్టి నా ♦ పైనఁ గురిసి ననుఁ గృతార్థుని జేయు మ ♦ నాథనాథ!
గీ॥ అకట! నావంటిపాపాత్ము ♦ నకుఁ బవిత్రమైన మేవాడఁ జోటుండ♦దని యెఱుఁగుదుఁ!
గాని నీమువిశ్వవిశాల ♦ మైన హృదయసీమఁ దావుండుననియె వ ♦ చ్చితి క్షమింపు.
క॥ మదిఁ గోపము వాయదయే నదె కుంతము నీదుహస్త ♦ ము! దిదిగో నా
హృదయము! సూటిగఁ బొడువుము! పదసీమను వ్రాలి విడుతుఁ ♦ బ్రాణానిలముల్!''
క॥ అని జడివట్టినవడువునఁ గనులను బాష్పములు దొరఁగ ♦ గద్గదకంఠం
బునఁ గేలు మొగిచి నిలిచినఁ గనుఁగొని వాత్సల్యరాగ ♦ కళ లుట్టిపడన్, 348
సీ॥ ఔను! నావెన్కమూఁ ♦ డశ్వముల్ తఱుముచు నరుగుదెంచుట మున్నె♦యరసియుంటి!
నటఁ గొంతసేపటి ♦ కగపడె రెండుమాత్రము! మఱియును గొంత ♦ తడవునకును
మిగిలె నొక్కం! డంతఁ ♦ దగిలె నీ యేఱడ్డమై! దీని దాఁటెదు ♦ నంత నీవ్ర
పిలిచితి! శాత్రవ ♦ పీకులయశ్వంబు లవిగో! రౌతులులేక ♦ యడవిపట్టె!
గీ॥ మంచిమనసున నీవరు ♦ దెంచియుంట కింతకన్నఁ దార్కాణ మిం ♦ కేమి వలయు!
రణపరాజయదుఃఖని ♦ ర్మగ్నుఁడనగు నాకు సోదరలాభ మీ ♦ నాఁడు గలిగె. 349
గీ॥ ఇట్టు లనుతాపపడి యుప ♦ కృతి యొనర్చి సరసఁ జేరితివని విన్న ♦ క్షణమె నిన్ను
శిరమునను జేర్చుకొనుఁ గృష్ణ♦సింహవిభుఁడు! పరమ కోమల మమ్మహా♦ప్రభువుమనసు

గీ॥ మబ్బుతెర జాఱ సుప్రభా ♦ మహితుఁడైన చంద్రునివిధానఁ గిల్మిష ♦ క్షాళనమున
ద్విగుణిత కళావిభాసివై ♦ తేజరిల్లుచుండు నీ వేరికైన మా ♦ న్యుఁడవు కొమర! 351

మ॥ నను నీవింతగ వేడుకోవలెనె! య ♦ న్నా! ర”మ్మటంచున్ బ్రతా
పనృపోత్తంసుఁడు సూక్తుఁ గౌఁగిటను ని ♦ ల్పన్, వాఁడు హర్షించె; నం
తన నిల్వంగనులేక చైతకము క్రిం ♦ దన్ వ్రాలె; వీక్షించి గ్ర
క్కున జీనిన్ సడలించి తేఁడు సరసన్ ♦ గూర్చుండెఁ జింతారతిన్. 352

—*) చైతకాశ్వము వీరస్వర్గమున కేగుట. (*—

మ॥ అతిదీనంబుగ స్వామిమోముఁ గని యా ♦ యత్యుత్తమాశ్వంబు బా
ష్పతతుల్ వీడుచు మందమందముగ హే ♦ షాధ్వానమున్ జేసి, యం
చితమౌ భక్తిఁ దదీయపాదములపై ♦ శీర్షంబుఁ బొందించి స్వ
స్థతఁ గన్మూసె; మఱెప్డు మేల్కొనని ని ♦ ద్రానిష్ఠలో మున్గుచున్. 353

చ॥ ‘అకటకటా! జగత్ప్రియ ♦ మైన, నొకంగుళమైనఁ దప్పదా
టికిఁ జన కాయరాతిహయ ♦ బృందము భీతిలి పాఱఁ దాఁకి యౌ
ర! కుడిభుజంబ పోచు సమ ♦ రంబుల నన్ను భరించుచుంటి; చై
తకమ! ఋణానుబంధములు ♦ తప్పెనె! నీకును నాకు నేఁటికిన్. 354

సీ॥ నాయెడ నీకు నెం ♦ తటి భక్తి! యెంత విశ్వాస! మెంతటి మహో ♦ త్సాహభరము!
కొడుకునకన్న నె ♦ క్కుడు ప్రీతిఁ బంద్రెండు వత్సరంబులుగ నా ♦ పంచ గాచి!
తకటకటా! శిర ♦ మందుఁ దురాయితోఁ బెండ్లికొడుకునట్లు ♦ వెడలివచ్చి
కనుపిం దొనర్తువు; ♦ కదనరంగముల నీసరిలే దనఁగఁ గీర్తి ♦ నెరపినావు;

గీ॥ బంధులను నాప్తులను వీడి ♦ వచ్చునన్ను విడువఁజాలక యిందాక ♦ వెంట వచ్చి
తోయి! మధురాతిమధురమై ♦ యొప్పు నీదు వీరహేష నాలించెదు ♦ పెంపు చెడెనె!”

—*) సూక్తసింహుఁ డన్న కశ్వమునిచ్చి యవనుల శిబిరమున కేగుట. (*—

సీ॥ అని కుందఁ గని సూక్తుఁ ♦ “దభ్రంబు తలపైన నొఱుఁగ సుంత కలంగి ♦ యెఱుఁగ వీవు;
చైతకంబు మృతికి ♦ శతపత్రజైత్ర నేత్రముల బాష్పములు ము ♦ త్యంబులట్లు
క్రమ్మ నేఁ గని యోర్వఁ ♦ గాఁ జాల; నిదిగో నా “యంకారు;” నీ సేవ ♦ లవధరించు;
దీనినిఁ గొని భద్రి ♦ మా నెడ కేగు; మంబరుభర్త మో మొక్క ♦ మాఱు చూచి

గీ॥ త్వరితముగ వచ్చి నీపద♦ద్వయముఁ గొలుతు," ననుచు, నశ్వము నిచ్చి జో♦హారొసర్చి
యఱుతనున్న ఖొరాసాను ♦ హయము నెక్కి యరిగి కనె మొగల్ సర్వసే♦నాధినాథు.
గీ॥ "ఆప్రతాపుని శిర మేది! ♦ యకట. కానరారె! ముల్తాన్‌ఖొరాసాను ♦ వీరవరులు!
నీహయం బేది! సూక్త! సం♦దేహమయ్యెఁ! జెప్పు సత్యం" బనిన, మాన♦సింహుఁగాంచి,
సీ॥ "అల్ల హల్దీఘాటు ♦ నందు సూర్యధ్వజం బెత్తినప్పుడె చిత్త ♦ వృత్తి మాఱె;
నాల్గులక్షలు మిమ్ము ♦ నావార లిరువదిరెండువేల్ దొర లెది ♦ రింపఁ గంటి;
సహజయంబున ఖిన్నుఁ ♦ డై యన్న యని వీడి యొంటిఁ బోఁ దలను దె♦మ్మంటి వీవు!
పొగిలి నాహృదయంబు♦ముల్తాన్-ఖొరాసాను భటులఁ గూలిచి వాఁడు♦వాజి నిచ్చి
గీ॥ పంపి నినుఁ జూచి పొ నిట్లు ♦ వచ్చినాఁడ! నమ్మినను నమ్ము; లేక చి ♦ త్తమ్ము వచ్చు
నట్లు దండింపు! వెఱవ! నా♦ప్రాణమాన"యనిన, మానసింహుఁడు కోప♦మంది నిలిచి,
శా॥ "మేమై నీవిపు డాప్రతాపు తలఁ దె ♦ మ్మిమ్మ పొమ్మనన్ లేను; తా
నై ముందున్ బడిపోయి మాహితుల సం ♦ హారంబు గావించి రా
ణా మే లెంచి తొలంగఁ బంపె; నను నిం ♦ దల్ చేయుచున్ వచ్చె; నీ
స్వామిద్రోహినిఁ బట్టుకొండు; చెఱ నుం ♦ పన్ బోలుఁ, బో నీకు రే!" 359

—*) సూక్తసింహుని దండింపవలదని యబ్దూరహిమాను వాదించుట. (*—

గీ॥ అనుచు గర్జింప నచటి సై ♦ న్యాధిపతులు వానిఁ జుట్టి; రబ్దూరహి ♦ మానుఁ "డితఁడు
ధైర్యమున వచ్చి యున్న స♦త్యంబు చెప్పె; నే మనఁగఁ బోకుఁ" డని యంబ♦రీశుఁ జూచి
మ॥ "ఇతఁడున్ నేనును రెండువత్సరము ల ♦ య్యెన్ మైత్రిఁ బాటించి; పు
ణ్యాతముం డంచు వచింతు నిక్కముగ; ద్రో ♦ హం బుండెనేనిన్ బ్రతా
పు తలన్ దెమ్మనినప్డె నీదగు శిరం ♦ బున్ జెండియే యున్న మా
స్థితి యెట్లుండెడి! నించుకేనియును యో ♦ జిం పంగ సందుండునే! 361
ఆ॥ భ్రాత, కొలముసామి, ♦ పౌరుషవంతుండు, రాజరాజు, రణప ♦ రాజితుఁ డయి
చను ప్రతాపుఁగూర్చి♦సాయంబు చేయు టబ్బురమె!" యని సలీము♦మోముఁ గాంచి,
ఉ॥ 'ఈరణమం దిటుల్ మనల ♦ నిందఱ నొంచి కలంచి తోలఁగా
నేరిచె! నాప్రతాపవిభు ♦ నేఁటి యమానుష వీర విక్రమో
దార విహారముల్ గనినఁ ♦ దప్పక లోకము లన్నియున్ నమ
స్కారము చేయు నన్న, నను ♦ జన్ముఁడు మెచ్చి చనంగ వింతయే! 363

ఉ॥ ఏనును రాజపుత్రుల జ ♦ యించి యశంబుఁ గడింప వచ్చితిన్;
గాని, తదీయపౌరుష వి ♦ కాసము దైవత దైత్యకోటులున్
గానము చేసి రిప్పుడుఁ జ ♦ గన్నుతశౌర్యుఁ బ్రతాపు మానవుం
డౌ ననరాదు! దేవుఁ డను ♦ టర్హ్యమటం చని తోఁచు నామదిన్. 364

సీ॥ హారావళీపర్వ ♦ తాగ్రంబునం దొక్క నవరత్నదివ్య మం ♦ డపము గట్టి!
యపరంజితో నామ ♦ హాభాగు విగ్రహం బమరించి తన్మధ్య ♦ మందు నిలిపి!
విశ్వశోభన మైన ♦ వేళలో నాధీరు పరమపావన వామ ♦ పాదమందు
సకలజగజ్జేతృ ♦ సంజ్ఞా మనోహర స్వర్ణతులాకోటి ♦ సంతరించి!
గీ॥ భక్తిమెయి విశ్వవీరప్ర ♦ పంచ మెపుడు నర్చ చేయంగవలయు శూ♦రాగ్రయాయి!
యమ్మహారాజుఁ బోలు ధ ♦ ర్మానుయాయి! సురలయందైన వెదకిన ♦ దొరుకుటరిది.

సీ॥ జగముసంభవ మైన ♦ క్షణమునుండియు నేఁటిదాఁక స్వాతంత్ర్య మిం ♦ తటి మహోగ్ర
దీక్షతోఁ గొలిచిన ♦ ధీరుండు గనుపింపఁ; డిప్పుడు మనియున్న ♦ యెల్లవార
లడుగులకు మడుగు ♦ లిడి కొల్తు; రాఁగల యుగములలోఁ బుట్టు ♦ వొందువారు
స్వాతంత్ర్యధర్మదీ ♦ క్షాగురుమూర్తముఁ డంచు నాచంద్రతారార్క ♦ మభినుతింతు;
గీ॥ రమ్మహాత్ముని సోదరుఁ ♦ డైన సూక్తుఁ డింతకాల మిచ్చట నిల్చు ♦ టెంతొ భాగ్య;
మీతనిఁ బ్రతాపుఁజేరఁ బో♦నిండు నేఁడు; మన్ననము చేసి, కడుఁ బెద్ద♦మనసు చేసి."

మ॥ అని భాషింప, సలీము, సూక్తుఁగని "య ♦ య్యా! నీవు మాయుప్పునున్
దిని మీయన్నకె సేవ చేసితి; నినున్ ♦ శిక్షింపఁగా నొప్పు; నై
నను సత్యంబు వచించుటన్ బ్రదికి, తం ♦ డన్ నిల్వ కెందేనిఁ బో"
మ్మని శాసించె, "సెబాసు మంచిది సలా" ♦ మం చేఁగె నాసూక్తుఁడున్. 367

—*) బదోని ఢిల్లీకివెళ్లి పానుపాకు యుద్ధఫలము దెలుపుట. (*—

సీ॥ అప్పు డంబరుభర్త ♦ యాజ్ఞ బదోనియు నానాఁటియుద్ధంబు ♦ నంతఁ జంద్ర
భట్టారకుని భద్ర ♦ వారణంబును గొంచు శీఘ్రప్రయాణముల్ ♦ చేసి, ఢిల్లి
కరిగి, యక్బరువిభు ♦ నడుగుఁదమ్ముల వ్రాలి, పూసగ్రుచ్చినవిధం ♦ బునను సమర
వార్త లన్నియుఁ దెల్పి ♦ వారణరాజంబు నర్పించి నిలిచిన ♦ యక్బరుపతి
గీ॥ ముద్దుమోమునఁ జిఱునవ్వు ♦ మొలకలెత్త నాణిముత్తెంపు హారంబు ♦ నఱుత వైచి
చంద్రహాసంబు యావనా ♦ శ్వంబుఁ బారితోషికము లిచ్చి యతని సం♦తోషపఱచె.

ఉ॥ అంతటఁ గొన్నినాళ్లురుగ ♦ నంబరుభర్త; సమస్తవాహినీ
కాంతులు సైన్యముల్ గొలువఁ ♦ గాఁ బయనించుచు ఢిల్లి చేరి భూ
కాంతుని పాదపంకజయు ♦ గంబు సమీపమునందు వ్రాలి, నే
కాంతమునన్ విభుం డతని ♦ కార్యము మెచ్చక మందలించుచున్, 369

—*) అక్బరుసార్వభౌముఁడు మానసింహునితో నిష్ఠురోక్తులాడుట. (*—

మ॥ "నిను మేవాడకుఁ బంపునప్డు మది నుం ♦ డెన్ గొండల ట్లాప్రతా
పుని నిర్జింతు వటన్న యాసలు; సమి ♦ ద్భూమిన్ నిన్నున్ వైరి మా
ర్కొ—నెనో లేదొకో! సర్వమున్ విడిచి నా ♦ కున్ జెప్పఁగా వచ్చి; తే
మని చింతింతును! మందభాగ్యునకు నే ♦ లా పట్టు! సద్యోగముల్. 370

చ॥ అకటకటా! ప్రతాపు నెటు ♦ లైనను ద్రుంపు మటంచు నేను జె
ప్పుకొనిన యంతసే పయినఁ ♦ బోవలదే! యొకపూటలోన వె
న్కకు కరుగుదెంతురే! యకట! ♦ కట్టిడినై నిను నమ్మినందుకై
వెకలిని జేసి; తేమనుచు ♦ వేయి విధంబుల నిన్ను దూఱుదున్! 371

సీ॥ ఎంత కాలమ్మొగా ♦ నీయుద్ధ సంరంభ! మెంతటి సన్నాహ! ♦ మెంత సేన!
యెన్ని శస్త్రాస్త్రంబు! ♦ లెన్ని సంబారమ్ము! లెందఱు సేవకు! ♦ లెంత వ్యయము!
నాస్థితి యకట! కొం ♦ డను ద్రవ్వి యెలుకను బట్టిన చందానఁ ♦ బరిణమించెఁ;
గడకు హల్దీఘాటు ♦ కనుమలో నఁట! యొక్కపగలఁట! ఘోరాహ ♦ వంబు గలిగె
గీ॥ నఁట! తుదకు నాకె జయ మయ్యె ♦ నఁట! యివేటి మాటలో! నేను విన నోప! ♦ మానసింహ!
నా వెతలు మాన్పి ననుఁ దేర్పు ♦ నీ వెవండ! వగు నదియుఁ గాక మాన" ద ♦ టంచు విసిగె.

సీ॥ అప్డు డంబరునేత ♦ యక్బరీశుని గాంచి "దేవ! నీ విట్లు చిం ♦ తింపఁ దగునె!
నాజీవితంబును ♦ నాయభిమానంబు నీయధీనము చేసి ♦ నిలిచినాఁడ;
శక్తివంచన లేక ♦ క్షణ మేమఱఁగఁ బోక యాప్రతాపాధీశు ♦ నని నెదుర్తు;
యముఁడనై యతనిప్రా ♦ ణానిలముల నూడ్చి పీల్చి పిప్పియొనర్చి ♦ వెతలఁ బెనుతుఁ;
గీ॥ బలుకు లొకవేయు నేటికి! ♦ భరతఖండ మందు శాశ్వతస్థాయిగా ♦ యవనలోక
రాజ్యసంస్థాపనాచార్య ♦ రాజరాజ బిరుదములు నీకుఁ గూర్చి శో ♦ భిల్లఁ జేతు."

మ॥ అన, నక్బర్ విభుఁ 'డౌనుగా'కని కరం ♦ బానందమున్ బొంది "యొ
క టెనిమేషంబును నూరకుండక మె సం ♦ గ్రామంబు సాగింపు పొ"

మ్మని శాసించిన, మానసింహుఁడును సే ♦ నాధీశ సైన్యంబులఁ
గొని రాణాపయి కేఁగు నుత్సుకతతోఁ ♦ గొల్వొండె నీర్ష్యాళుఁడై. 374

గద్య:— ఇది శ్రీమత్కామేశ్వరీ కరుణా కటాక్ష వీక్షా సమాసాదిత రసవత్కావ్య
నిర్మాణ చాతురీధురీణ, సుగుణగణపారీణ, దుర్భాకవంశదుగ్ధాంభోరాశి
రాకాకైరవమిత్ర, శాలంకాయనగోత్ర పవిత్ర, సుజనజనాను
గ్రహపాత్ర, వెంకటరామార్యపుత్ర, కవిసింహాఽవధాని
పంచాననఃకావ్యకళానిధీత్యాది బిరుద విఖ్యాత, సుకవి
రాజశేఖర, రాజశేఖరకవి ప్రణీతంబయిన
"రాణా ప్రతాపసింహ చరిత్రం" బ
ను పద్యకావ్యమునం
దుఁ దృతీయా
శ్వాస
ము

సంపూర్ణము.



శ్రీ

కామేశ్వర్యై నమః.

# రాణాప్రతాపసింహచరిత్ర.

## చతుర్థాశ్వాసము.

---

మ॥ స్థిరశౌర్యుండు ప్రతాపసింహపతి హ ♦ ల్దీఘాటు యుద్ధంబురా
తిరి సూర్యుం డిడనాడు నాపిదప న ♦ ద్రిశ్రేష్ఠమున్ దాఁటుచున్
మఱునాఁ డయ్యుదయాద్రి సూర్యుఁ డుదయిం ♦ పన్ బోవు నవ్వేళకున్
దరియన్ బోయెను శైలమార్గములగుం ♦ డన్ "గైలవారా"ధరన్. 1

సీ॥ జాము ప్రొద్దెక్కఁడు ♦ సమయంబునకు సలుంబ్రాభర్త యొదిగి భూ ♦ పతి పదాబ్జ
ముల వ్రాలి "దేవ! వీ ♦ రలు ప్రమరలు; వీరు చోండావతుల్; వీరు ♦ చోహాణభటు;
లీతఁడు శ్యామసిం; ♦ గితఁడు ఖేల్వాపతి; బేద్లా-కొఠేరియా ♦ విభులు వీరు;
తమతమ సైన్యశే ♦ షములు గొల్వంగ నీశ్రీపాదసేవఁ గాం ♦ క్షించి వచ్చి;
గీ॥ రాదరింపవె!" యనిన, సై ♦ న్యపతులెల్ల మ్రొక్కి నిలిచిరి; భిల్లులు ♦ ముందుఁగొలువ
వందన మొనర్చె భీమచాం; ♦ దండఁ గని కూరుచుండంగ నియమించి ♦ క్షోణివిభుఁడు,

—*) వీరస్వర్గమున కేగిన యనుచరులఁగూర్చి ప్రతాపసింహుఁడు విచారపడుట. (*—

చ॥ "మనమును నాలుగేండ్లుగ స ♦ మస్తవిధంబుల నాని పూని చే
సిన బహుళశ్రమంబు ఫల ♦ సిద్ధి వహింపక నేఁడు నిష్ప్రయో
జనముగ నయ్యె! సాటి నృప ♦ సత్తములన్ దలయెత్తి యెట్లు చూ
డ నగు! విధాతచెయ్దము మక ♦ టా వికటించెనె! యిట్లు నాదెసన్. 3

సీ॥ భూదేవతాళి క ♦ ర్పూరపుహారతు లిచ్చి మంత్రపుష్పము పెట్టు ♦ మహితదేవ
పూజాగృహం బట్లు ♦ పాడఱె నాసేనతో నిన్న హల్దీఘాటు ♦ నికటసీమ!
గంట లిర్వదినాల్గు ♦ గడచిపోకయ మున్నె పెండ్లికొడుకులట్లు ♦ వెలయు శూరు
లెందఱు కన్నుల ♦ కందక చాఱైరి! పదునాల్గువేలు స ♦ ద్భటులు గూలి!

గీ॥ "రక్కటా! కడుపున హాల ♦ హాలము పోయు వడువునం దేహమంతయు ♦ నుడుకులెత్తె;
నమృతభాండము పలువ్రక్క ♦ లగుచు విరిసెఁ! బెండ్లి చవికె గుభాలున ♦ విఱుఁగఁబడియె.

మ॥ "అదయుల్ శత్రులు గ్వాలియర్ గొనిన, రా ♦ జ్యం బూడి చిత్తూరులోఁ
బదముల్ మోపినదాదిఁ, దండ్రివలె మే ♦ వాడ్ రాజ్యలక్ష్మీపదం
బుఁ దలన్ నిల్పుచు, రామచంద్రనృపుఁ డే ♦ పూర్ణ భక్తి సేవించె; నా
సదయస్వాంతు ఋణంబుఁ దీర్పఁగలనే ♦ జన్మాంతరం బందునన్! 5

శా॥ "ఆఱున్ బైఁ బదియేండ్ల ప్రాయమును బూ ♦ జ్యస్వాంతమున్ మన్మథా
కారం బొప్పెడు లేఁతకుఱ్ఱఁడు తురు ♦ ష్క శ్రేణులన్ దాఁకి, కం
గా రై పాఱఁగఁజేసి శాశ్వతయశః ♦ కాయంబునన్ నిల్చె; ఖం
డేరావున్ బురుడించు పోటరులఁ గం ♦ టే! యే యుగంబందునన్. 6

సీ॥ "తొరుష్క విపుల ప ♦ దాతివర్గము దూసి యాఁశాంతముల కేఁగు ♦ నట్లు దోలె!
యావన బహుళ బృ ♦ హన్నాళికాస్త్రముల్ వేలకు వేల్ పిండి ♦ పిండి లేపె!
రెండు వేల్ భటులతో ♦ రెండులక్షలు తురుష్కుల లీలఁ దాఁకి గ ♦ గ్గోలుపఱచె!
నైదువందలు వీరు ♦ లదిమి చుట్టిన వ్రేలు తనపైఁ బడకయుండ ♦ నని యొనర్చె!
తే॥ జగము పుట్టినదాది నీ ♦ క్షణముదాఁక బదియు నేడేండ్ల ప్రాయంపు ♦ బాలుఁ డింత
శౌర్యముం జూప లేదని ♦ జనము వొగడఁ దివిరె! నకట! సామాన్యుఁడే ♦ తేజసింగు!

సీ॥ "తనదేహ ధన జీవి ♦ తము లిచ్చి మాతృదేశముఁ గొల్చు భక్తివి ♦ జ్ఞానమయుఁడు!
పదునాల్గులోకముల్ ♦ గదిరినఁ దనపట్టు వీడని పరమగం ♦ భీరమూర్తి!
మృత్యుదేవతనైన ♦ మిత్రునియట్లు ప్రేమించెడు వీరల ♦ క్ష్మీప్రభుండు!
మత్పదం బేకాగ్ర ♦ మనమునఁ గొలుచు పూర్ణస్వామిభక్తిప ♦ రాయణుండు!
తే॥ "భారతమునకె కాక వి ♦ శ్వమునకెల్ల యశముఁ జేకూర్పఁ జాలు మ ♦ హాబలాఢ్యుఁ!
డౌర! రాఠోడుకులంబు ధ ♦ న్యతమ మయ్యెఁ! దేజసింహావతారసం ♦ యోజనమున! 8

తే॥ తండ్రివలె నేలె; మనసు మె ♦ త్తనిది!; వీర సమరరంగాగ్రభూమిఁ బ్ర ♦ చండభానుఁ!;
డకట! భానుసింహుఁడు గూలె!" ♦ ననుచు వగచు నా ప్రతాపునిఁ గని సలుం ♦ బ్రాధిపతియు

చ॥ "అనిఁ బడు భానుసింహవసు ♦ ధాధిపు సాద్రినృపాలుఁ డప్డె చెం
తనుగల శైలగహ్వరము ♦ దాపునఁ జేర్చి సపర్య చేసె; నా
తనికి భయంబు లే"దనఁ బ్ర ♦ తాపుఁడు "కీడున మేలు గల్గె! దే
వుని కృప" నంచు నాత్మఁ దల ♦ పోయుచు ప్రమోద నిమీలితాక్షుఁడై. 10

—*) ప్రతాపసింహుఁడు సేనాధిపతుల సత్కరించుట. (*—

సీ॥ అల సలుంబ్రాధీశు, ♦ నవ్వల సాద్రీశుఁ, బదపడి ఖేల్వాన్ప్ర ♦ పాలుఁ, బిదప
బేండ్లా-కొఠేరియా ♦ పృథ్వినాయకులఁ బేర్మిని జూచి "మీరును ♦ మీరు మీరు
సంవర్త-సమవర్తి ♦ సదృశులై నిన్న హల్దీఘాటుకనుమ న ♦ మోఘధాటిఁ
బరసేనఁ దాఁకి యు ♦ గ్రరణంబు సాఁగించి కొఱలేక రిపులను ♦ గూల్చినారు;
తే॥ స్వామిభక్తిపరాయణుల్ ♦ సరళమతులు మీయెడఁ గృతజ్ఞుఁడ" నటంచు ♦ సాయము విను
తించి వేత్వర సరసకుఁ ♦ దీసి వారి వారికినిఁ గొన్ని ఫలములు ♦ పంచి విభుఁడు; 11
సీ॥ "యువరాజ మానసిం ♦ హులయేన్గు చైతకాశ్వము ధాటి కోర్వక ♦ పాఱు పిదప,
వేలు లక్షలు మొగల్ ♦ వీరులు నను ముట్టఁ ద్వర వచ్చి నారవి ♦ ధ్వజముఁ గొనుచుఁ,
దురకమూఁకలఁ జాల ♦ దూరంబుఁ జేర్చి నాపైని యొత్తడి తద్దఁ ♦ బాయఁజేసి,
తొమ్మండ్రుగురు తన ♦ తోఁబుట్టువులఁ గూడి స్వామిభక్తిని జూపి ♦ స్వర్గ మేగె;
తే. నామనస్సింహునకును మే ♦ లేమిసేతు! నతని యనుజుండు జ్ఞాతి యీ ♦ శ్యామసింహుఁ
⊕ బ్రిధనసీమల నాకుడి ♦ వంకఁ బోరుపట్టి యధికార మిచ్చి యి ♦ ష్టాదరింతు. 12
సీ॥ ఇఁక మీఁద యుద్ధంబు ♦ లెసఁగుచో సాద్రినృపాలురే దినమణి ♦ ధ్వజము పట్టి
నన్నుఁ బాయక యె వెం ♦ టన యుండెదరుగాక! యాస్థానమును జేర ♦ నరుగునపుడు
§ తద్దుందుభులు రాజ ♦ ధాని నాహర్మ్యసింహద్వారమును జేరు ♦ నంతదాఁక
మ్రోయుచుండెడుఁగాక! ♦ యీయన్వయమున నిప్పటినుండి సాద్రినృ ♦ పాలమాళు
తే॥ లందఱును దమ నామధే ♦ యములముందు రాజపదలాంఛనమ్ము గౌ ♦ రవపదమ్ము
దాల్త్రు గావుత వంశజుల్ ♦ తరతరముగ" ననిన, 'బళి' యనె నైకకం ♦ ఠ్యముగఁ గొలువు.
క॥ "దేవా! నీసేవను ఝాలావంశము ధన్యమై చె ♦ లంగె" ననుచు శ్యా
మావనిపతి మ్రొక్కెను; సంభావనమెయిఁ బతియు భిల్ల ♦ పతిఁ గన్గొనుచున్, 14

---

⊕ A splendid act of self devetion of the Jhala chief, when Rana Pratap was oppressed with the whole weight of Akber's power, obtained with the gratitude of this prince, the highest honours he could confer—his daugater in marriage and a seat on his right hand.

"Annals of Mewar."

§ The descendants of Manah yet hold Sadri and all the privileges obtained on this occasion. Their Kettle drums beat to the gate of the palace, a privilege allowed to none besides and they are addressed by the title of Raja.

"Annals of Mewar."

మ॥ "తరమే! నిన్ను నుతింప; నీభుజమ యా ♦ ధారంబు నా కుగ్రసం
గరరంగంబుల; దేన నెట్టులు బహూ ♦ కారంబుఁ గావింతుఁ! బ్రే
మరసం బొదఁగఁ గౌఁగిలింతు" నని సం ♦ భావించె; నట్లె వడిన్
మొరసెన్ భేరులు, సూక్తుఁడున్ నిజబలం ♦ బుల్ గొల్వఁ గానంబడెన్. 15

—*) సూక్తసింహుఁడు ప్రతాపసింహుని జేరవచ్చుట. (*—

ఉ॥ "నిన్న నితండు చేసిన ప ♦ నిన్ దని వొందక వైర మూని, నేఁ
డన్నను దాఁక వచ్చెఁ! దును ♦ మాడరె వీని" నటంచుఁ బల్కు యం
దున్న సమస్తవీరులు మ ♦ హోద్ధతి లేవఁ, బ్రతాపుఁ డంతఁ జే
సన్నను వారి నిల్పి "యొక ♦ సంగతి మీ కెఱిఁగింతు; సైపుఁడీ!. 16

సీ॥ అందఱు గూర్చుండుఁ; ♦ డని నిల్చుపై నిన్న గిరివెంట నే వచ్చు ♦ టెఱిఁగి, యంబ
రీశుండు ననుఁ గూల్ప ♦ నిరువుర వీరులఁ బంపె; వారు పిఱుంద ♦ వచ్చి రంత!
సూక్తుఁడు వారిఁ గూ♦ల్చుచు నన్నుఁ గని మ్రొక్కె; నితని నేఁ గనికరిం♦చితిని;బిదపఁ
జైతకం బిల వ్రాలి ♦ సమసె; నిజాశ్వము నా కిచ్చి తఱలి, యీ ♦ నాఁడు వచ్చెఁ;
తే॥ గలిగె నాకు హల్దీఘాటు ♦ కదనమందు నిన్న సోదరలాభ!'' మ ♦ టన్న హర్ష
మలర నందఱు నెమ్మోము ♦ లడరె నపుడు: నవవికసితారవింద సం ♦ తతుల కరణి.

సీ॥ సూక్తుఁ డశ్వము డిగ్గి ♦ సూటిగఁ జని సలుంబ్రాధీశునకు మ్రొక్కి ♦ యన్న కెఱిగి
"దేవ! నీయొద్ద రా ♦ తిరి యనుమతిఁ గొని చని మానసింహు ద ♦ ర్శనము చేసి,
యవనసేనాధినా♦యకులఁ గూల్చుట, నిన్నుఁ గొలుచుటాదిగఁ, గార్య♦ములను దెలిపి
నన్ను సేవించు సై♦న్యము వెంటఁ గొనుచు మార్గమున వచ్చుచు "భిల్స♦రా"పురంబుఁ
తే॥ గాంచి యవనుల నోంచి దు ♦ ర్గము గ్రహించి దాని గురుదక్షిణగ నీప♦దద్వయమున
నప్పగింపంగ వచ్చితి; ♦ నాదరించి చేకొను" మటన్న నవ్వి యా ♦ శీర్వదించి, 18

ఉ॥ ఎత్తి కవుంగిటన్ బొదివి ♦ యిష్టు కుమారక! నాకు నీమహో
దాత్తగుణంబు మిక్కిలి ము ♦ దం బొడగూర్చె; భవత్పరాక్రమో
పాత్తము భిల్సురానగర ♦ వర్యముఁ జేకొని నాకు మాఱుగా
నిత్తఱి నేలు" మంచు వచి ♦ యించి ప్రతాపుఁడు మిత్రకోటితో, 19

—*) ప్రతాపసింహుఁ డనుచరులతోఁ గర్తవ్యము నాలోచించుట. (*—

సీ॥ "మనము హల్దీఘాటు ♦ కనుమలోఁ జూపిన త్యాగ-శౌర్యములు శ్లా♦ఘ్యములె! కాని,

గుఱికి బెత్తెడుగఁ ద ♦ క్కువ యోట జయలక్ష్మి యందని ప్రమాని పం ♦ క్తై తనర్చె!
మన కపజయము గ ♦ ల్గిన దంచుఁ గుందకుఁ! డపజయంబున దీక్ష ♦ యతిశయించు!
నెంత త్యాగం బున్న ♦ నంతగా దేవుని వాత్సల్యమునకు స ♦ త్పాత్రమగద!
తే॥ యింక రాఁగలవేళల ♦ నేమి సేత! మరివిజయకాంక్ష విడువక ♦ యని యొనర్త
మనుచు మదిఁదోఁచె నాకు; మీ ♦ యంద ఱెట్టు లానతిచ్చెద"రన, సలుం ♦ బ్రాధిపతియు,
ఉ॥ "శ్రీలు తొలంగి గేహమునఁ ♦ జీఁకటిమూలల గోళ్లు మీఁటి వై
ద్యాలయమందు రోగులక్రి ♦ యన్ శయనించెడు మందమర్త్య కం
కాళము లెట్లు లోకహిత ♦ కార్యముఁ దీర్చెడు! విక్రమానల
జ్వాలలు నిన్నుఁబోలు పటు ♦ శౌర్యులు దీర్తురుగాక రాణ్మణీ! 21
సీ॥ ఆనాఁటి కొకమాట ♦ యీఁనాఁటి కొకమాట పలుక నేర్చునె సలుం ♦ బ్రావిభుండు!
నామాట యేమి! యం ♦ దఱభావ మెఱుఁగుదుఁ; బ్రాణంబు మేన ను ♦ న్నంతవఱకు
స్వాతంత్ర్య సమర దీ ♦ క్షావృత్తి సాఁగించి మీ దివ్యచరణస ♦ మీపసీమ
నాత్మార్పణ మొనర్చి ♦ యజరామరఖ్యాతిఁ జెంద సేవింపఁ గాం ♦ క్షింతు మెపుడు!
తే॥ క్షణము తడవుసేయకయె ర ♦ క్త మెగఁజల్లి రణ మొనర్చుచు శత్రుమా ♦ రణ మొనర్తు;
మెత్తిన ధ్వజంబు డింప కా ♦ యత్తపడఁగ వలయు"నన భీమచాందు భూ ♦ వరుని గాంచి,
సీ॥ "జనదుర్నిరీక్ష తే ♦ జశ్శాలి! భారతఖండ ప్రచండ మా ♦ ర్తాండమూర్తి!
నీ వుండుచోటనే ♦ నిఖిలధర్మము లుండు; సత్య ముండును; నిత్య ♦ జయము నుండు;
నా సూర్యభగవాను ♦ నట్టివాఁడవు; దినదినమును నిన్నుఁ జూ ♦ చిననె చాలుఁ;
బావిత్ర్య గాంభీర్య ♦ భావముల్ క్రొత్తందనంబును దఱుఁగ వే ♦ నాఁడు గాని;
తే॥ పూర్ణ సాత్వికానందరూ ♦ పుఁడవు! రాజ పుత్రసంస్థాన మేటికి ♦ భూభువనము
లన్నిఁటి జయింపఁ గలుగు మ ♦ హాభుజుండ; వనఘ! నీమైత్రి పరమభా ♦ గ్యంబుగాదె!
క॥ "మాజీవితములు నీపద పూజకు విడిచితిమి; కొదవ ♦ పొడమ" దనఁగ, ఖే 24
ల్వాజాని "సందియం బేలా! జయవెట్టంగ లోక ♦ మని సేయఁ దగున్.
సీ॥ రేఁగెడు సమరఖే ♦ రీభాంకృతుల్ విప్రవితతి నాందీవాద ♦ వేదరవము!
గళముల వ్రాలు వై ♦ రుల తీక్ష్ణకరవాలధారలు కల్యాణ ♦ హారచయము!
పొగ రేఁగి క్రాఁగి గు ♦ ప్పునఁ బ్రేలు లోహనాళాగ్నులు మంగళ ♦ హారతులును!
దస్యుల గళ గళ ♦ ద్రక్తపూరములు దేహమున సోఁకిన వసం ♦ తముల రంగు!
తే॥ వైరిసాధ్యస్థలంబు వి ♦ వాహవేది! మొగలుభటవిదారణములు ♦ భూతబలులు!

గా విజృంభించి సమరరం ♦ గమునఁ బోరి పెండ్లియాడుదు మిఁక వీర♦విజయలక్ష్మి." 22

తే॥ అనిన, బేడ్లా-కోఠేరియా ♦ మనుజవిభులు; "మాతృదేశ విముక్తికై ♦ మాయఖిలము,
నించుకయు జాగుసేయ క♦ర్పించుకొనఁగ సిద్ధముగ నుందు"మనఁ, గృష్ణ♦సింహవిభుఁడు,

సీ॥ "విన్నవించెద నొండు ♦ నిన్న హాల్దీఘాటుకనుమలో నసమసం ♦ గరము నడపి,
వ్రాలిన వారు శా ♦ శ్వతయశస్సాంద్రు లౌదురు; కాని వారి కం ♦ దఱకుఁ దోడు
చైతకాశ్వము చిర ♦ స్మరణీయమై యొప్పు; నది వ్రాలిన ప్రదేశ ♦ మందుఁ బెద్ద
యరుగును నద్దాని ♦ యంచునఁ గూపసత్రములు ప్రతిష్ఠించి ♦ దానిపేరు

తే॥ నిలుప సెల వీయఁదగు" నన్న♦నృపతి "యకట! దానిఋణమును దీర్ప నా♦తరమె! మీరు
కోరినటులు చేయింపుఁడు ♦ కొఱఁత వలవ" దని పలికి యందఱను గల♦యంగఁజూచి,

ఉ॥ "పట్టిన పట్టు పట్టినదె; ♦ ప్రాణము దేహమునందు నుండ, నే
పట్టున మానఁగాదు; మన ♦ పై కరుదెంచు తురుష్క-సేన లీ
గుట్టలు చొచ్చు టెల్ల యము ♦ కోఱలు చొచ్చుటె యంచు గుండియల్
కొట్టుకొనన్ మెలంగవలె ♦ లోకులు కన్నులు విచ్చి చూడఁగన్. 28

సీ॥ యవనసంగ్రామ మ ♦ హానాటకప్రదర్శనమున నిన్నఁటి ♦ దినమునందు
జరగు హాల్దీఘాటు ♦ సమరోత్సవంబు ప్రస్తావంబు చందమై ♦ సాఁగియుండెఁ;
బ్రథమాంక మింకఁ బ్రా ♦ రంభంబు గానుండు; నడుమ వ్యవధి తద్ద ♦ యడరఁ బోవ;
దెన్ని యంకంబు! లె ♦ న్నెం డ్లాడవలయునో! యెట్టులు ముగియునో! ♦ యెఱుఁగరాదు!

తే॥ మంగళాచరణము మొదల్ ♦ మంగళంబు వఱకు నుత్తరోత్తర రస ♦ ప్రోషి వెలయఁ,
దేఁకువ వహించి వర్తించి ♦ తృప్తిపఱుప వలయు నీవిశ్వసభ్యప్ర ♦ పంచకమును. 29

తే॥ చెలఁగె నొకభంగి మనపరి ♦ స్థితులు నేఁటివఱకు; "ముం దున్నది ముసళ్ల ♦పండు"వ నెడు
కరణి వచ్చుకాలము కష్ట ♦ గర్భిత మగు; నేకలింగేశ్వరుండె తో ♦ డింక మనకు." 30

సీ॥ అనినఁ "గొండలు పిండి ♦ యైపడ వర్తింతు మింక సందేహింప ♦ నేల! దూరము
నిలుపక సాఁగింప ♦ వలె" నంచుఁ బలికి రందఱు; 'మంచి" దనుచుఁ బ్ర ♦ తాపవిభుఁడు
హర్షాశ్రుకలితనే ♦ త్రాంచలుఁ డయ్యె; వా రరిగిరి భూధర ♦ ప్రాంతములకు;
వానకా రరుదెంచి ♦ భయదనీలాంభోధరము లాకసమ్మునఁ ♦ గ్రమ్మసాఁగె;

తే॥ వాన జడిపట్టి కురిసె; యా ♦ వనబలములు గిరులఁ ఓరుగఁ జాలక వెన్క♦కరిగె; నంత
ఘూర్మిబిడౌజున కబ్బె వి ♦ శ్రాంతి కొంత; పెరిమ హేమంతము ప్రస ♦ వించెఁ బ్రకృతి.

గీ॥ కాఱుమొగిళులతో వాన ♦ కారు దాఁటెఁ; గెఱలి చలి ప్రకృతికి గిలి ♦ గింత లిడియెఁ;

గానఁ గోనల మహబాజు ♦ ఖాను గడచి ఫౌజు హారావళీసీమ ♦ పట్టుఁ జేర్చె. 32

సీ॥ అలసలుంబ్రాసీమ ♦ యందుండి పిడుగుల గేరు వీరులఁ దెచ్చెఁ ♦ గృష్ణసింగు;
ఝాలూరిసేనల ♦ తో లేచి వచ్చె దుర్వారవిక్రముఁ డైన ♦ భానుసింగు;
సాద్రియందుండి ఝా ♦ లాన్వవాయులసేన లన్ని దోడ్కొనివచ్చె ♦ శ్యామసింహు;
డా బునేరా—షాపు ♦ రాధీశులు శిశోదియావీరభటులతో ♦ నరుగుదెంచి;

§ తే॥ రింక బేండ్లా-కోఠేరియా♦నృపులువచ్చి; రవల సూర్యమహలునుండి♦యచటఁజేరె
దుర్జయుఁడు; దుర్నివార బం ♦ ధురబలుండు భిల్ల సేనలతో డాసె ♦ భీమచాందు. 33

—*) రెండవ సంవత్సరము యుద్ధము. (*—

చ॥ తనపయి వచ్చు వైరులఁ బ్ర ♦ తాపమహీంద్రుఁడు మాఖశుద్ధపం
చమి నెదిరించె, శైలముల ♦ దండ, విశాల సమున్నతప్రదే
శముల; దురంబు ఘోరముగ ♦ సాఁగె; తురుష్కులు రాజపుత్రులున్
సమసిరి వేనవేలుగను ♦ నాఁటి మహాసమరాంగణంబునన్. 35

చ॥ యవనులసేన సంఖ్యలకు ♦ నగ్గలమై జలరాశి వీచి పం
క్తివలెను బొంగి పైఁబడ ను ♦ దీర్ణ పరాక్రము లయ్యు నాప్రతా
పవిభుని రాజపుత్రభట ♦ వర్యులు తజ్జ్వలనాస్త్రధాటి కో
ర్వ వలనులేక డీల్పడి ప ♦ రాజయ మొందఁగ సాఁగి రయ్యెడన్. 35

⊕ క॥ మఱుసటి సంవత్సర మక్బరు మేవాడ్సీమఁ జొచ్చి ♦ స్వయముగ వసుధా
పరిపాలనాదికమ్ములు స్థిరముగ నేర్పాటుచేసి ♦ చేరెన్ బురికిన్. 36

క॥ అల బహిరంగసహీకంబుల యవనుల నోర్వఁ గష్ట ♦ ముగఁ దోఁపఁగ సే
నలఁగొని ప్రతాపవిభుఁ డిమ్ములఁ గుంభల్మియరు దుర్గ ♦ మును జొరఁదలఁచెన్. 37

సీ॥ క్రమముగాఁ గైలవా ♦ రాసీమ దాఁటుచు, నెత్తైన కొండల ♦ నెక్కి పోయి,
దట్టంబుగా నాగ ♦ దాళి మొల్చుటఁ గ్లిష్టమగు శైలమార్గంబు ♦ లందు నడచి,

---

§ We have also amongst the nobility of Mewar, two, who hold independent title of Prince or Rajah, one of whom is by far too powerful for a subject. These are the Rajas of Benera and shapoora, both of the blood royal.

⊕ Akbar himself entered Mewar, arranged the mode of administation, then procceded to Malwa.

" G. B. Malleson, C. S. I."

తొలుత బహిర్ద్వార ♦ ములు రెండు గడచుచుఁ జని హనుమద్ద్వార ♦ మునఁ గమించు
చును, విజయద్వార ♦ మునను శోణద్వారమునను రామద్వార ♦ మునను జొచ్చి
తే॥ సేన లన్నియుఁ గోటలోఁ ♦ జేరికొనియె; నా ప్రతాపప్రభూత్తంసుఁ ♦ డంబుదముల
నొరయుచు మహోన్నతమయి సుం♦దరమునైన మేఘభవనంబులో విశ్ర♦మించెనపుడు.

—*) కుంభల్‌మియరు యుద్ధము. (*—

ఉ॥ పుట్టలు వ్రీలి చీమల గు ♦ ముల్ వెలికిన్ బరతెంచు కైవడిన్
దట్టములై వడిన్ మిడుత ♦ దండు గుముల్గొని దూఁకునట్లు పెం
గుట్టలలోఁ దురుష్కభట ♦ కోటి చొరంబడి నాల్గుదిక్కులన్
ముట్టడివేసి దుర్గమును ♦ ముంచెను పెద్ద పిరంగి వ్రేటులన్. 39
సీ॥ విక్రమంబున కాది ♦ పీఠమైన ప్రతాపుఁ డడరి నాల్కలు సాఁచు ♦ నగ్నిశిఖల
వంటి రాజస్థాన ♦ భటులఁ బ్రేరేప, నా మడమ ద్రిప్పని మేటి ♦ కడిమికాండ్రు
గోడలు బురుజులు ♦ గోపురంబుల నెక్కి వీడ కొక్కఁట శిలా ♦ వృష్టి గురియ,
భిల్లవీరులు లోక ♦ భీకరంబుగ ధనుష్టంకార మొనరించి ♦ శాత శర ప
తే॥ రంపరలఁ జిత్తజల్లుగా ♦ నింపుచుండ యముఁడు నాల్క సాఁచినయట్లు ♦ యవనసేన
దిన దినము గంట గంటకుఁ ♦ దేకువ సెడి బలము తఱిఁగి యంతంతకుఁ ♦ బలుచనయ్యె.
తే॥ ప్రళయమార్తాండువలెఁ బ్రతా♦పప్రభుండువహ్నిఁగురియింపమొగలాయి♦భటులుకోట
వైపు చూడలేరైరి; షా ♦ భాజుఖాను రాతిగుండియలోఁ బెద్ద ♦ బీతు దవిలె. 41
సీ॥ గుదులుగుదుల్ బాణ ♦ కోటు లాయుధములు కుంభవృష్టిగఁ బెల్లు ♦ కురియుకతన
యవనవీరులు తల ♦ లవిసి సంధులు వ్రీలి గాత్రముల్ రక్తసి ♦ క్తంబుగాఁగ
రణరంగలక్ష్మియు ♦ రక్తాభిషేకంబు చేసిన చందమై ♦ చెదరె సేన;
క్షణములు బలిసి యు ♦ గంబులై నిలిచె; షాభాజుఖా నేమొన ♦ ర్పంగఁ దోఁప
తే॥ కడలు నొంది యాబూపర్వ ♦ తాధికారి నాప్తుని బ్రతాపఘురు దేవ ♦ రాధిపతిని
ధన కనక వస్తు వాహన ♦ తతులతోడ నరిగి, తన్నుద్ధరింపుమం ♦ చాశ్రయించె. 42
ఉ॥ క్రచ్చఱఁ గోటఁ జొచ్చి నడు ♦ రాతిరి యన్నరూపదానవుం
డచ్చఁపుఁ జీకటిన్ ‘నవగు’ ♦ నాఖ్య రహించెడు కూపమందునన్
బెచ్చు విసంబు వోసి కలి ♦ వెన్ నెనరించుకయైన లేక; హా
పచ్చని యింటఁ జిచ్చునిడు ♦ పాపుల కేపని చేయఁ గానిదా! 43

తే॥ కోటలో నది యొక్కఁడే ♦ కూపమగుట, నంద తానీరమును గ్రోలి; ♦ రం దనేకు
లసువులను వీడి; రిదిచూచి ♦ యాప్రతాపనరపతిని భానుసింహుండు ♦ దరియ నేగి,

సీ॥ "జలముల విసమును ♦ గలిపి దేవరపతి తడిగుడ్డ గొంతుకల్ ♦ తఱిగినాఁడు;
నెలలుగా మొగలునే ♦ నలు పోరినను నేఁడు గలిగిన నష్టంబు ♦ గలుగలేదు;
నిటఁ దడవున్న ని ♦ ర్హేతుకంబుగ సంఘమృతి గల్గుటయు ధ్రువం; ♦ బీవు కృష్ణ
సింహాదులను గూడి ♦ శీఘ్రంబె దుర్గంబు దాఁటిపోవుట మేలు; ♦ తనువులందుఁ

తే॥ బ్రాణములు గల్గుదాఁక మ♦ద్భటులు నేను కోట మొగలాయిబలము చే♦కొనకయుండ
నని యొనర్తుము;మాఱుమా♦టాడకేగు; మస్తకోనువాఁడఁ గనుల నీ♦యడుగుదోయి."

⊛ క॥ అని వినయంబునఁ బ్రార్థించిన నందఱు నట్లె యొత్తి ♦ చెప్పకొనఁ బ్రతా
పనృపతి సమయ మెఱుంగుచు మనమును నోడఁబఱచె నొక్క ♦ మాదిరిగాఁగన్.

—*) ప్రతాపసింహుఁడు చేవందా దుర్గమును జేరుకొనుట. (*—

క॥ క్రందుగ మేవాణ్ణిరృతి దిశందగు చప్పన్నసీమ ♦ శబరులదేశం
§ బం దరిగి ప్రతాపుఁడు "చేవందా"దుర్గంబుఁ జేరె ♦ బలములతోడన్. 47

సీ॥ "మునుపటివలె దుర్గ ♦ మునునుండి పోరాడఁబూనిన విషజలం ♦ బులను ద్రావి
పూటకేనును సైన్య ♦ ములును గ్రుగ్గుట ధ్రువం; బిహపరంబులు రెంటి♦కిదియు దూర;
మెట్టులైనఁ దప్పదు ♦ మృతి; యట్లుగాన దుర్గబహిర్గతుఁడనై య ♦ రాతిసేనఁ
జిచ్చఱ పిడుగట్లు ♦ చీలిచి చెండాడి చిందరవందర ♦ చేయనె తగు"

తే॥ ననుచుఁ దలపోసి తనదుసై♦న్యమ్ముఁగొనుచు ముందుఁగల హనుమద్ద్వార♦మును దెఱచుచు
హరుని ఫాలనేత్రజ్వాల ♦ ననుకరించి భానుసింహుఁడు వైరుల ♦ పైన వ్రాలె. 48

---

⊛ Pratap took post in Kumbhalmer which was invested by Koka Shabaz Khan. He here made a gallant and protracted resistance and did not retire till insects rendered the water of the "Nougun" well, their soul resource, impure. To the treachery of the Deora chief of Aboo, who was now with Akbar, this deed is imputed.

"Annals of Mewar"

§ 'Chaond' is a town in the heart of the mountainous tract on the south west of Mewar called Chuppan, containing about three hundred and fifty towns and villages peopled chiefly by the aboriginal bhills.

"Annals of Mewar."

—*) చంద్రభట్టారకుఁడు భానుసింహునకుఁ దోడుపడుట. (*—

తే॥ అనిలుఁ డనలంబునకును దో ♦ డైనయట్లు సిద్ధహస్తులు విక్రమ ♦ శుద్ధులైన
సద్భటులఁగొంచుఁ గవిరాజు ♦ చంద్రభట్టు భానుసింహునకును సాయ♦పడియె నపుడు.

ఉ॥ మండెడు వహ్నికుండముల ♦ మాడ్కి విలోకన విస్ఫులింగముల్
నిండ, హయవ్రజంబుఁ గద ♦ లించుచు భూరిఖురాగ్రఘట్టనా
ఖండ ధరాపరాగముల ♦ క్రందున గాఢతమంబుఁ గూర్చి యు
ద్దండత రాజపుత్రభట ♦ తండము దాఁకె నరాతికాండముల్. 50

తే॥ వీరకేసరులను బోలు ♦ భిల్లభటుల కర కలిత కార్ముక కదంబ ♦ కములనుండి
పక్షితతి మాడ్కి శితబాణ ♦ పటలి లేచి తురకమూఁకల శిరముల ♦ నతికికైచె. 51

ఉ॥ అంతఁ దురుష్కసేనల మ ♦ హాహవ శౌర్య విలాస రేఖ సా
యంతన మొందుచుండ, నలి ♦ నాప్తుఁడు పశ్చిమవార్ధి డాసి సా
యంతనముల్ బొనర్చెను! ర ♦ యమ్మున నాసఫుఖాను సేనతోఁ
జెంతఁ గనంబడెన్ యవన ♦ సేనలు పొంగె సముద్రముల్ బలెన్. 52

చ॥ యముని కరాళజిహ్విక క్రి ♦ యన్ జెలరేఁగుచు భానుసింహుఁడుల్
సమర మొనర్చుచున్ మొగలు ♦ సైన్యముఖంబును వ్రచ్చి చొచ్చి గ
ర్భమునను దూఁటి వైరుల శి ♦ రంబులు రాసులు పోసి పోసి ప్రా
ణమును ద్యజించె నబ్బురము ♦ నన్ రిపులున్ దను మెచ్చి యార్వఁగన్. 53

మ॥ కవిరాజాదినరాజువోలెఁ గర ము ♦ గ్రస్ఫారతేజంబుతో
నివముల్ మాపెడునట్లు వైరిగణముల్ ♦ హింసించి మందేహదై
త్యవితానంబులలోనఁబోలె రిపుసం ♦ తానమ్మునన్ జిక్కి, గా
యపడెన్; నిర్గత రక్తధారలు తిరం ♦ బై పాఱెఁ బెన్కాల్వలై. 54

సీ॥ బ్రహ్మవంశంబు పా ♦ వనమై పొదల బృహస్పత్యంశమునఁ బుట్టు ♦ బ్రహ్మవేత్త,
పికరాజువోలె గొం ♦ తుకమెత్తి మధురగీతికలు పాడిన మేటి ♦ సుకవిరాజు,
క్రమత హాల్దీఘాటు ♦ రణమునం దరికోటి దోమలట్టులు ♦ దోలు భీమసేనుఁ,
డజరామరఖ్యాతి ♦ నవనిపై నిలుపంగఁగలుగు శతాధిత ♦ గ్రంథకర్త,

ఆ॥ వీరరసము వెల్లి ♦ విరియఁ గుంభల్మియర్ రణము నడపు విలయ ♦ రౌద్రమూర్తి,
❁ చంద్రభట్టు చొచ్చె ♦ సవితృమండలి, నమావాస్యగాఁగ నాత్మ ♦ పతుమునకు.

---

❁ On this occassion also fell the chief bard of Mewar, who inspired by his deeds as well as by his song, the spirit of resistance to the ' ruthless King ' and

మ॥ వనధిన్ జేరు మహానదీజలము స ♦ ర్వం బందునన్ లీనమై
చను చందంబున రాజపుత్రులు తురు ♦ ష్కశ్రేణులన్ జీల్చుచున్
జని నిశ్శేషముగాఁగఁ గూలి; రటుపై ♦ షాభాజుఖాన్ సేనలన్
గొని మోగల్ ధ్వజ మెత్తి చేరికొనియెన్ ♦ గుంభల్ మియర్ దుర్గమున్. 56

—*) మానసింహుఁడు ధర్మేతి-గోకుండా దుర్గములఁ జేకొనుట. (*—

శా॥ నిండెన్ గొండలలోన మోగలుభటా ♦ నీకంబు లుద్దండ; ను
ద్దండప్రాభవశౌర్యధైర్య రతుఁడా ♦ "ధర్మేతి" దుర్గంబు "గో
కుండా" దుర్గము మానసింహుఁడును జే ♦ కొంచున్ మొగల్ సేన లం
దుండన్ జేయుచు ఢిల్లికిన్ జనియె న ♦ త్యుత్సాహ మేపారఁగన్. 57

తే॥ ప్రళయకాలాగ్ని శిఖమాడ్కిఁ ♦ బ్రజ్వరిల్లి శత్రుసైన్యాటవులఁ గాల్చఁ ♦ జాలు యోధ
శేఖరుఁడు మహబత్ఖాను ♦ సేనతోడ నుదయపుర మాక్రమించి యం ♦ దుండసాఁగె.

ఉ॥ "స్థాణుఁడో విష్ణుఁడో మఱి ప్ర ♦ తాపుని మానవమాత్రు సంగర
క్షోణిని గెల్వ నిట్లు కొతు ♦ కం బడ నేటికి! నేఁడు నాదు న
క్షీణబలంబు లోకములు ♦ కీర్తనసేయఁగ వానిఁ దాఁకి స
ప్రాణునిగాఁగఁ బట్టుకొని ♦ వచ్చెద" నంచుఁ బ్రతిజ్ఞ చేయుచున్, 59

—*) ఫరీదుఖాను ప్రతాపసింహునితోఁ జేయు యుద్ధము. (*—

సీ॥ ఆఫరీద్ ఖాను సై ♦ న్యముల నద్రులనిండ నెక్కించె; నందుపై ♦ నొక్కనాఁడు
రాణాయు వెడలి దు ♦ ర్గబహిఃప్రదేశంబులను జరించుచునుండె ♦ ననుచుఁ దెలిసి
చమువుల నాల్గుభా ♦ గములుగా విడఁదీసి యనుమాన మున్నచో ♦ ట్లాక్రమించి
వేఁగుజామైన రా ♦ ణాగారు చిక్కును రిది తప్ప దని నమ్మి ♦ నిదురవోయె;
తే॥ నర్ధరాత్రమ్మున మహాగ్ని ♦ యద్రిఁ దోఁచె; నది ఫరీదు దవానలం ♦ బని తలంచె;
రాజపుత్రసేనలు గొల్వ ♦ రాజగురుఁడు ముందువైపునఁ దాఁకె న ♦ మ్మొగలుసేన.

---

whose laudatory couplets on the deeds of his lords are still in every month. But the spirit of poesy died not with him for, princes and nobles, Hindu and Toork vied with each other in exalting the Patriot Pratap, in strains replete with those sentiments which elevate the mind of the martial Rajput who is inflamed into action by this national excitment.

"Annals of Mewar"

ఆ॥ అంటరాని మంట ♦ యాసలుంబ్రాస్వామి యుక్తునియ లట్టి ♦ యోధులం గొని
యవను లున్న లోయ ♦ యవ్వలి దెస నెల్ల ముట్టడించి త్రోవ ♦ మూసి వైచె. 61

ఉ॥ కాకులవోలె వైరులు వి ♦ కావికలై యటవంగఁ జుట్టి ద
ర్వీకరభీకరంబులగు ♦ పెద్దకటారుల నెత్తి స్వాంతమం
దేకడ జంకులేక వధి ♦ యించి ప్రతాపుఁడు కృష్ణసింహుఁ డు
గ్రాకృతిఁ దోఁపఁజేసిరి ర ♦ ణావని మోదుగు పూచి నట్లుగన్. 62

తే॥ పదియునైదువేల్ భటులు వెం♦బడిని గొలువ రాయసిం గుదయపురిఁ జే♦రంగ నెంచి
బొబ్బ లార్పులు గర్జనం ♦ బులు దనర్ప వ్యాఘ్రశైలంబు డాయంగ ♦ వచ్చె నపుడు.

ఉ॥ వచ్చుట తా నెఱింగి శర ♦ వర్షము గుప్పుచు భిల్లసేన కా
ర్చిచ్చునుబోలి గుట్టలను ♦ జెట్టుల పుట్టలనుండి గుంపులై
వచ్చి హఠాత్తుగాఁ బొదివి ♦ పాయలు పాయలుగాఁగఁ గ్రొచ్చఁగా
విచ్చి వితాకుఁ గాకువడి ♦ బెగ్గలి పాఱెఁ దురుష్క సైన్యముల్. 64

ఆ॥ బ్రహ్మపుత్రనుండి ♦ పంజాబుదాఁకఁ గన్యాకుమారియును హి ♦ మాద్రి నడుమ
§ మెఱసెఁ బరమశాంతి; ♦ మేవాడ యొక్కండె కదనలక్ష్మి కయ్యెఁ ♦ గాపురమ్ము. 65

క॥ మెల్లగ 'మండలగృహ' మబ్దుల్లాఖాన్ మాత్స్యదుర్గ ♦ మును నా"షేరో
నెల్లా"ధరఁ గలదానిని బల్లిదుఁడగు మానసింగు ♦ పట్టెరి వరుసన్. 66

⊛ తే॥ శ్రావణమురాకఁ గొంత వి♦శ్రాంతిఁగొనుచు మార్గశీర్షమ్ముతోడఁ గ్ర♦మ్మఱఁ దురుష్క
విసరములు రేఁగ, నిసుమంత♦విసుగుపడక రణము సాగించుచుండె నా♦రాజగురుఁడు

సీ॥ ఏఁటేఁట నెలనెలఁ ♦ గృశియించె దేహంబు! నవసిపోసాఁగె సే ♦ నాబలంబు!
దుర్గంబులెల్ల శ ♦ త్రుగతంబు గాఁజొచ్చె! ద్రవ్యసంపత్తి త ♦ ద్దయును దఱిఁగె!
భారమ్ముగాఁ గుటుం ♦ బము వృద్ధి యగుచుండె! ననుదినం బాపద ♦ లతిశయిల్లె!
నానాఁట నెదిరిసే ♦ నల పెంపు లావయ్యెఁ! దలఁదాఁచుకొను చోటు ♦ తక్కువయ్యెఁ!

---

§ The ruler of Mewar was being hunted by the imperial troops, but in no other part of India was the sound of arms heard.

"The Emperor Akbar."

⊛ Unaccustomed to such warfare the mercenary moguls became disgusted in combating a foe seldom tangible; while the monsoon swelled the mountain streams filling the reserviors with mineral poisons and the air with pestilential exhalations. The periodical rains accordingly always brought some respite to Pratap.

"Annals of Mewar."

తే॥ జెట్టులను బుట్టలను బ్రాపు ♦ చేసికొనుచుఁ గడుపు నించుచుఁ బూటలు♦గడుపవలసె!
గడియగడియ కరుల్ వచ్చు ♦ కతన నిజ నివాసముల బెక్కుమార్లు మా♦ర్పంగ వలసె.

—*) అక్బరు సైన్యము నంపి కైలవారాసీమలోని ఫలవృక్షములఁ గొట్టించుట. (*—

సీ॥ "పురములు మార్చి కా ♦ పురములనెత్తించి పదివేలపల్లెలు ♦ పాడువెట్టె!
యవరేఖ యంతైన ♦ నవని దున్నుటయులే! దొకగింజయునుధాన్య ♦ మొదవఁబోదు!
కైలవారామహా ♦ గహనంబు ఫలముల దినమున కొకఁడుగాఁ ♦ దినుచుఁ బ్రదుకు!
నెన్ని యత్నంబుల ♦ నే నొనర్చినను లోఁబడఁ! దంతకంతకుఁ ♦ బటిమఁ బెంచుఁ!
గీ॥ గావునను మీరు కైలవా ♦ రావిపినము చేరి ఫలవృక్షములనెల్లఁ ♦ జెండివైచి
యాప్రతాపేంద్రు వెదకి వె♦న్నంటి వేఁట లాడుఁ"డని పాదుశాహి సై♦న్యముల నంపె.
క॥ పొడవును వెడలుపు పెక్కామడలగు నాకైలవార ♦ మహియందుఁ జొరం
బడి యవనులు ఫలతరువులు పుడమిఁబడఁ గొట్టి రొకఁడు ♦ పొలివోకుండన్. 70
క॥ కొందఱు భటులను వృషభములం దన వెంబడినిగొని ఫ ♦ లంబులకై తో
పుం దరిసి శ్యామసింహుం డంపఁ బడిన చెట్లు చూచి ♦ యాప్తులఁ గనుచున్; 71
క॥ "మన తిండి చెఱచి యవనులు చనుచుండిరి; వారిఁ గదిసి ♦ సమయింతము రం"
డని రేపి యహితసైన్యంబును దెంపరియగుచు వెన్ను ♦ ముట్టఁగఁ దాఁకెన్. 72
క॥ అనుచరులఁ బద పదండని తనముంగలఁ దఱిమి తురక ♦ దళవాయి వడిన్
దనపిక్కబలముఁ జూపఁగ వెనుదిరుగుచు శ్యామసింహ ♦ విభుఁ డరుదెంచెన్. 73
క॥ స్థితిగతులెల్ల సలుంబ్రాపతి కెఱిఁగింపఁగ నతండు ♦ స్వామిని గని "దే
వ! తురుష్కులు ఫలవిటపిప్రతతి నఱికి రనచు నేఁడు ♦ వార్తలు వచ్చెన్. 74
చ॥ దినమున కొక్కపండు మఱి ♦ తీయని తీర్థము నొక్కచేరెడున్
గొని మునిరాజవృత్తిమెయి ♦ గొబ్బునఁ గాలము పుచ్చుచున్న నీ
కును రమఁబోలు నీలలన ♦ కున్ మదనోపమ మంజులాంగులౌ
తనయుల కక్కటా! చెనఁటి ♦ దైవము తిండికిఁ గర్వుచేసెనే! 75
గీ॥ పౌరుషంబున్న సంగ్రామ ♦ వీరరంగముల మనలఁదాఁకె దర్పించి ♦ గెలువవచ్చుఁ!
గట్ట! పూచి కాచిన చెట్లు ♦ గొట్టుటయును గౌరవమొ! వట్టి కటిక మొ ♦ క్కలముగాక!
సీ॥ అడుఁగులకును మ్రొక్కి ♦ యర్థించి కొనివచ్చి యమృతాభిషేచనం ♦ బాచరించి
బంగారు జిలుఁగు దు ♦ వ్వలువలు గట్టించి నవరత్నమయ భూష ♦ ణములు దొడిగి

కర్పూరమిళిత సు ♦ గంధచర్చ లలంది పరిమళపత్ర పు ♦ ష్పము లొసంగి
నవపాయసాహార ♦ నైవేద్య మిచ్చి భక్తిమెయి నాత్మప్రద ♦ క్షిణము చేసి
గీ॥ కొలువఁదగు దేవుఁడవు నాకుఁ; ♦ గొంతకాల మారఁబండిన పండు లా ♦ హారమిడుట
కై వగలఁ బొక్కుచుంటి; నేఁ ♦ డవియు లేని యధికదుర్దశ వచ్చె; నే ♦ మని తపింతు!"
క॥ అని కడుజాలిమెయి వచించిన సచివప్రవరుఁ జూచి ♦ చిఱునగవు ముఖం
బున మొనయఁగఁ "దండ్రీ! యెంతని నీప్రేమంబు మహిమ ♦ నగ్గింపఁగనౌ! 78
గీ॥ కంచె చుట్టును నెలకొల్పి ♦ కాపు వెట్టి జలము పాఱించి పండించి ♦ ఫలము లెల్ల
బండ్లపైఁ దోలి మన కిచ్చు ♦ భంగినైన శుభమెకద! యేదిపగ తురు ♦ ష్కులకు మనకు
క॥ తలయెత్తుటాది విమతుల సిలుఁగుల నిడు మీకు వగవఁ ♦ జెల్లునె! మనమున్
వలగొని రాల్ ఱువ్విన వారలు పువ్వులు రువ్వఁబోదు ♦ రా! యెంతైనన్. 80
సీ॥ శైలవారామహా ♦ గహనంబు సువిశాల! మడ్డుకింతయు లేని ♦ యారబయలు!
ప్రకృతి యచ్చటఁ బెద్ద ♦ పండ్లతోపును బెంచె! రాకపోకలకు మా ♦ ర్గములుగలవు:
చనుదెంచి యెవరు గో ♦ సిన వద్దనవు చెట్లు! లఖిల జనాకర్ష ♦ మచటి ఫలము:
లందఱు కందెదు ♦ నా తోటపై జీవితమ్ములు మోపి యా ♦ ధారపడుట
గీ॥ మనది తప్పగు! రిపులనే ♦ మనుటకుండుఁ! బగను సాధించి మనల లోఁ ♦ బఱచుకొనఁగ
నింతకన్న వీలగుమార్గ ♦ మేదిగలదు! మనమె యాహారమును మార్పు ♦ కొనుటయొప్పు!
సీ॥ ఇందు నం దనకుండ ♦ నెందైనఁ గలదిగఁ! జిక్కింత లేక చేఁ ♦ జిక్కు నదిగ!
నెండకు వానకు ♦ నింత వాడనిదిగఁ! గాల భేదము లేక ♦ క్రాలు నదిగఁ!
బాదుషాగాదు దే ♦ వతలెల్ల వచ్చి వాసరవార మాస వ ♦ త్సరము లేల
శ్రాంతి నొందక పెక్కు ♦ బ్రహ్మకల్పములు కష్టించిన నిసుమంత ♦ చెడనియదిగఁ!
గీ॥ బారలును గుద్దలులు వట్టి ♦ పని నడిపిన మూఁడు జాములలోపల ♦ మొదటికన్నఁ
దఱిమి విమతుల వీపులఁ ♦ బెరుగునదిగ వెలయు నాహారమును గను ♦ పెట్టువాఁడ!
సీ॥ పెక్కుమడలదాఁక ♦ వెడలుపు పొడవునై హారావళీశైల ♦ మలరుచుండు!
సూదిమోపఁగ సందు ♦ సుంత లేకిచ్చోటఁ బెరుగు "మో" లనియెడి ♦ బీడుగడ్డి;
దీని రుచి యొకింత ♦ తీయనై యుండుఁ! బ్రొద్దుట వెళ్లి మనభటుల్ ♦ దోకితెత్తు!
రవిరుబ్బి గొట్టెల ♦ నను వుమైఁ బోయించి ముంచుకాలము పొట్ట ♦ పోసికొంద!
గీ॥ మకట! యిది కష్టమని మది ♦ నడలఁరాదు! కొంచె మలవాటుపడిన రు ♦ చించితీఱు!
నాకలి నడంప నే తిండి ♦ యైనఁ జాలు! గార్యగౌరవమున రుచిఁ ♦ గననిదేది! 83

మ॥ తినఁగాఁ దిండి యొకండె యేటికిఁక! నా ♦ దేహంబునన్ జీవమున్
జనెదున్ గాక మనుష్యమాత్రునకు శి ♦ క్షం బెప్పుడున్ వంచఁబో
వను; జేనెండగు పొట్టకూటికయి దై ♦ వప్రాయమై కీర్తిమో
సిన స్వాతంత్ర్యము నమ్మివేయఁగల దు ♦ శ్శీలుండు క్షంతవ్యుఁడే! 84

క॥ ఈగడ్డిరొట్టె తిండికిఁ ద్యాగము స్వాతంత్ర్యయోగ ♦ ధర్మంబును దో
డై గెలుతు! మరులు కను మేలాగున విరిగెదరో మన బ ♦ లమ్ములప్రోలన్. 85

క॥ ఇది సంతసింపనదనగు నెద వగవకు" మనుచు నినకు ♦ లేశ్వరుఁ డన "మే
లిది యాచరణీయము సౌఖ్యదమని యాకృష్ణసింగు ♦ హర్షము పొంగన్; 86

మ॥ "ఫలవృక్షంబులఁ గూల్చినంతటనె య ♦ భ్రం బంతయున్ వ్రీలుచున్
దలపై వ్రాలు నటంచుఁ గుంది తమచెం ♦ తన్ జేరి దోస్సాహమున్
పలుకుల్ పల్కెదమంచు నెంచి రహితుల్! ♦ పంచాంగముల్ చించి చు
క్కలు లేవంచు వచించు వీఱిఁడుల జో ♦ కల్ గావె యీకార్యముల్! 87

క॥ కానిం డియ్యది యొకగతిగా నున్నది భటుల బీడు ♦ గడ్డిని దెండం
చానతి యిచ్చెద నే"డని యా నూత్నాహారనియతి ♦ నారంభించెన్. 88

గీ॥ అంత నుండియు నాప్రతా ♦ పావనీశునకుఁ గుటుంబమునకు భటు ♦ లకును "మోలు"
గడ్డిరొట్టెలె గతియయ్యెఁ; ♦ గాలుచున్న కడుపునకు మందు గంజియన్ ♦ వడువుగాఁగ!

మ॥ ఒకనాఁ డాసపుఖాను సైన్యములతో ♦ నుగ్రాటవిన్ జొచ్చి ముం
దుకు నేతేరఁ బ్రతాపుఁ డాత్మబలమున్ ♦ దోడ్కొంచు నావిద్విష
త్ప్రకరంబున్ నలుమూలలన్ బెదరి పా ♦ ఱన్ బోర మర్దించి వె
న్కకు నేతెంచి నివాసభూమి దరియం ♦ గా నేగె మధ్యాహ్నమున్. 90

ప్రతాపసింహుఁ డనుచరులకు "దోనా" పంచి పెట్టుట. (*—
—*)

మ॥ ఒక దర్భాసనమందు రాజమణి కూ ♦ ర్చుండంగ సామంతు లిం
చుక దూరమ్మున నోసరిల్లి కరముల్ ♦ జోడించుచున్ నిల్చి; రా
నికటాద్రీంద్రబిలంబునుండి యనురా ♦ జ్ఞీరత్న మవ్వేళ సే
వకుతో నంపెను బండ్లు రొట్టెలు ప్రతా ♦ పస్వామి కర్పింపగన్. 91

మ॥ ఫల మొక్కించుక త్రుంచి చేకొనుచు, నా ♦ పై రొట్టె నొక్కండు ము
క్కలుగాఁ జేసి యొకింత నోర నిడుచున్, ♦ గన్నన్న నందున్న వా

రల సామంతులఁ బిల్చెఁ; దగ్గతి సలుం ♦ బ్రాభర్త కేల్మోడ్చినన్
ఫలమున్ రొట్టియముక్కఁ జేనిడెఁ బ్రతా ♦ పస్వామి దీపించుచున్. 92

సీ॥ సాష్టాంగ మెఱఁగి మ ♦ హాప్రసాదంబని చేదోయి యొగ్గి దో ♦ సిట గ్రహించి
తులకించు భక్తిఁ గ ♦ న్నుల నద్దుకొని వెన్కఁ జనుచు యథాస్థాన ♦ మున వసించె;
నటుపైన సూక్తసిం, ♦ గంత ఖేల్వాపతి, బేడ్లా-కొడేరియా ♦ విభులు, పిదప
నా పాపురా-బునే ♦ రాధీశు, లవల దుర్జయసింహుఁడును నల్లె ♦ సంగ్రహించి,

తే॥ పరమభగవత్ప్రసాదంబు ♦ భంగిఁ జూచి యాజగద్గురు చంద్రముం ♦ డారగించు
పిదపఁ దామెల్ల భుజియింప ♦ వేఁచియుండి రధికభక్తి నర్ధనిమీలి ♦ తాక్షులగుచు.93

సీ॥ కడుపునిండుగఁ గూడు ♦ కట్ట జేనెడు గుడ్డ, తలదాఁచుకొన సుంత ♦ నెలవులేక
§ పరమదరిద్రదే ♦ వతలట్టు లుండు నా పటువీరలోకైక ♦ పట్టభద్రు
లాదికాలమున మ ♦ హైశ్వర్య భోగభాగ్యములతో స్వర్ణ సౌ ♦ ధములలోన
నెంతటి మార్యాద, ♦ యెంతటి విశ్వాస, మెంత మనశ్శుద్ధి, ♦ యెంతభక్తి,

తే॥ యెంత యుత్తమక్రమరూఢి;♦యంతకన్న శతగుణము లెక్కుడుగఁ దంద్రి♦సరణిఁజూచి
యాప్రతాపునిఁ గొలుచు దృ♦శ్యంబుఁగనఁగఁ గనులు వేయైనఁ దక్కువే♦యనుచుఁదోఁచు

—*) యవన సైన్యములు మేవాడపై నెత్తివచ్చుట. (*—

ఉ॥ వైభవసాంద్రుఁడై యవన ♦ వాహిని చుట్టును గొల్వ నొక్కభ
ద్రేభము నెక్కి యామడ లో ♦ కేగతిఁ దీవ్రత వచ్చు కాలరు
ద్రాభుని మానసింహుఁ గని ♦ యచ్చట నుండిన వార లున్నయ
ట్లే భుజియింప మాని వడి ♦ నేగిరి మొగలుసేన మీఁదికిన్. 95

ఉ॥ సేనలు రెండునున్ దగిలెఁ! ♦ జేతి కటారులు పూలమాలలై
మేనుల వ్రాలుచుండె! బలి ♦ మిన్ వల చుట్టిన వేటకాండ్ర ర

---

§ Yet amidst such complicated evils the fortitude of Pratap remained unshaken, and a spy sent by Akbar represented the Rajput and his chiefs seated at a scanty meal, maintaining all the etiquette observed in prosperity the Rana bestowing the Donah to the most deserving and which though only of the wild fruits of the country, was received with all the reverence of better days. Such inflexible magnanimity touched the soul of Akbar and exhorted the homage of every chief in Rajasthan.

" Annals of Mewar. "

మ్యాననరేఖ యాయవను ♦ లందును, క్రుద్ధమృగేంద్రరేఖ రా
సైనికులందుఁ దోఁచె; రవి ♦ జారఁగ నిల్పిరి పోరు మొగలుల్. 96

—*) యవనులు రాజపుత్రుల దుర్గములను గొనుట. (*—

సీ॥ అవ్వల యవనసే ♦ నాధీశ్వరులు మూఁగి ముట్టడించిరి దుర్గ ♦ ములను గొన్ని;
నజమీరుదుర్గంబు ♦ నందె ఖాసింఖాన్; పరీదుఖానుఁ డచల ♦ గృహముఁ గొనియెఁ;
దోడరమల్లు తో ♦ డ్తోఁబట్టెఁ “జేవంద!” నింతలోపల “నమా♦యిత” గిరీంద్ర
దుర్గంబుఁ దవిలె న ♦ బ్దుల్లా, శిశోదియావీరులు మార్కొని ♦ పోరి; రిట్లు
తే॥ నెల జరిగె పోరు; కోట మో♦గలుల కయ్యె; నా“మడేరియా” ప్రాంతమ్ము♦నందు “రాతి
కోట” యను దుర్గమును బట్టు ♦ కొని ఫరీదు యవనసేనా సమూహంబు♦నచట నిలిపె.

క॥ అంతట ఖాసింఖాను “వసంతా” దుర్గంబుఁ బట్టి ♦ సైన్యము నిడి యా
చెంతఁగల “ఛత్రకోట” ననంతచమూతతులు గొలువ ♦ నరికట్టుకొనెన్. 98

మ॥ యవనుల్ నాలుగువైపులన్ గదిసి దా ♦ వాగ్నిక్రియన్ గాల్పఁగా
భువనాతీతపరాక్రమాంకుఁడు ప్రతా ♦ పుం డట్లు సాయంతనం
బవుదాఁకన్ రిపుకంఠరక్తపుఁ బ్రవా ♦ హం బూడ్చి చల్లార్చి యా
రవి క్రుంకంగఁ గుటుంబ ముండు గుహఁ జే ♦ రన్ బోయె విశ్రాంతికై. 99

—*) దేవేరీ యుద్ధము. (*—

సీ॥ వఱువాత లేచి దై ♦ వప్రార్థనముచేసి, వినతిమై నుదితభా ♦ నునకు మ్రొక్కి,
కలయఁ గన్గొనిన మొ ♦ గలు దండుతండంబు లెల్లదిక్కులఁ గొండ ♦ లీనినట్లు
పరిసర గహన గ ♦ ర్భము లాక్రమించి నిద్రింపఁ గాంచి ప్రతాప ♦ దేవుఁ డంత
నాబునేరా-షాపు ♦ రాధీశ్వరుల, సలుంబ్రాభర్త ఖేల్వాన్ప ♦ పాలు సూక్తు
తే॥ దుర్జయుని గొంచు వైరులఁ♦దొడర నరిగె; శ్యామసింహుఁ గుటుంబర ♦ క్షణకు నిలిపి!
యుభయసైన్యంబులకు నయ్యె ♦ యుద్ధ మమిత తీవ్రభంగి “దేవేరి” ప్ర♦దేశమందు.

సీ॥ శైలనిర్ఝరమట్లు ♦ సరభసమ్ముగ సలుంబ్రామహీపతి దాఁకె ♦ రాయసింగు;
ప్రజ్వలజ్జ్వాలల ♦ వలె బునేరా-షాపురాధీశ్వరులు ముట్టి ♦ రసపుఖానుఁ;
ప్రబలదంభోళి సం ♦ రంభంబు వెలయ ఖేల్వాపతి తగిలె షా ♦ బాజుఖానుఁ;
ప్రకటప్రభంజన ♦ ప్రతిమానుఁడై యెదిరించె దుర్జయుఁడు ఫ ♦ రీదుఖానుఁ;

తే॥ దండధరుఁడట్లు దాఁకెఁ బ్ర♦తాపవిభుఁడు ముందుఁ గలుగు సబ్దుల్లా చ♦మూచయమును;
భిల్లగణ మెల్లఁ గొలువ నా ♦ భీమచాంద కడు విజృంభించి ఖాసిము♦ఖానుఁదాఁకె.

క॥ పుడమి యద్రువ యమరాజుల వడువునఁ జెలరేఁగు నాత్మ ♦ భటు లందఱు వెం
బడి రాఁగ మృత్యువటు సూర్తుఁడు మహబత్ఖానుఁ దగులు ♦ కొనె ఘోరముగన్. 102

ఉ॥ ఆఁకలిగొన్న సింహనిచ ♦ యంబువిధాన మహాశిశోదియా
నీకిని బిట్టురేఁగి రణ ♦ నిష్ఠుర వీర తురుష్క కోటులన్
దాఁకి ప్రతాపసింహుని మ ♦ నం బలరారఁగ సుంత సందువో
నీక శిరంబులన్ నఱకి ♦ యేఱులు పార్చిరి వేడిరక్తమున్. 103

ఉ॥ అంతటిలోఁ దురుష్కభటు ♦ లాసఫుఖానుని గూడి లోకదు
ర్దాంతపరాక్రమంబున న ♦ రాతులఁ దాఁకుచు షాపురావనీ
కాంతునిసేన వెక్కరు ♦ గన్ విదళించి యజాండకర్పరం
బంతయు ముక్కలై పడఁగ ♦ నార్చిరి వీరరణోత్సవంబునన్. 104

ఉ॥ ఆధ్వని నాలకించి సుభ ♦ టాళులఁ గొంచుఁ బ్రతాపసింగు సూ
ర్యధ్వజ మెత్తి ముందఱిమి ♦ యాసపుఖానుని దాఁకి, తత్తురు
ష్కధ్వజినిన్ ఘోరంబడుచు ♦ సర్వము నాశనమున్ బొనర్చి, ద
క్షాధ్వరహర్తయైన నిట ♦ లాక్షుఁడు వోలె వెలింగె నయ్యెడన్. 105

ఉ॥ ముందఁగలట్టి వైరిబల ♦ ముల్ దనుఁ గాంచి తపించుచుండ, మ
ధ్యందినచండభానుని క్రి ♦ యన్ జెలరేఁగుచుఁ గృష్ణసింహుఁ డం
దంద విహారముల్ సలిపి, ♦ యందఱు ముందఱ విచ్చి పాఱుచున్
సం దొనరింప: శౌర్యరభ ♦ సమ్మునఁ బోరె భయానకమ్ముగన్. 106

తే॥ రాయసింహు సేనాధిప ♦ రమును దాఁకి చేను గోసిన చందానఁ ♦ జెండివైచు
కృష్ణసింహేంద్రు నుగ్రమూ♦ర్తిని గనంగ వీరులకునైన గుండె కం ♦ పించిపోవు.

గీ॥ ప్రళయకాల దవానల ♦ జ్వాలయయి ఫరీదుఖాన్ దుర్జయుని మించి ♦ రేఁగి దాఁటె
రాజపుత్రసైన్యంబుపైఁ ♦ గ్రమ్ముకొనుచు రక్త కీలాలనిధిఁ జేసె ♦ రణతలంబు. 108

మ॥ తనదర్పోద్ధతి కోర్వలేక మహబ ♦ త్ఖాన్ సైన్యముల్ దిక్కులన్
గని యుద్వేత్తుగఁ బాఱుచుండఁగ, ఫరీ ♦ ద్ఖాన్ కాలరుద్రుండొకో
యన వెన్వెంటనె వచ్చె; సూర్తుఁడు ప్రతా ♦ పాధీశు పేరెత్తియు
గ్రనృసింహాకృతిఁ బెంచి తాఁకెను ఫరీ ♦ ద్ఖాన్ మాళి నుగ్గైపడన్. 109

శా॥ ఆసూర్యాన్వయకానసేశ్వర మహా ♦ వ్యాఘ్రంబు దుర్వారబా
హాసంరంభవిజృంభణంబుఁ గని ధై ♦ ర్యం బూడుచున్ భీతి హె
చ్చె, సైరింపఁగలేక యయ్యవనసై ♦ న్యం బంతయున్ విచ్చుచున్
దూసెన్ దత్పతియాఘరీదు కలలం ♦ దున్ మర్వ లేకుండఁగన్. 110

సీ॥ లక్షలు సేనాబ ♦ లంబున్న, నంతటి యాశ్వికదళ మున్న, హస్తిచయము
లెన్నికకును మీఱి ♦ యున్నను, లఘుబృహన్నాళాస్త్రములు వేన ♦ వేల కున్న
సైన్యాధిపులు పోడ ♦ శశతంబుపై నున్న, రాసులురాసులు ♦ ద్రవ్య మున్న,
వలసిన యన్ని సం ♦ బారమ్ము లున్నను, సమర మోండ్లకొలంది ♦ సాగుచున్నఁ,
తే॥ దలను బూవాడకుండఁ బ్ర♦తాపుఁడుండె ననుచుఁ బాదుషా వగవ, ధై♦ర్యంబు చెప్పి
యవనిఁ దలక్రిందుగాఁజేతు♦ననుచు వచ్చి కడకు నిశ్శ్రాంతి ననుచు సం ♦ కటమునొందె,

ఉ॥ ఖాసిముఖానుఁ డుగ్రభుజ ♦ గప్రభు మాడ్కని మండి లోకసం
త్రాసకర ప్రతాపుని బ్ర ♦ తాపుని దాఁకఁ దలంప, భిల్లసే
నాసముదాయ మడ్డుపడి ♦ నన్ రణ ముగ్రముగాఁగ సాఁగె; నా
గాసురహర్త్రఁబోలె శబ ♦ రాధిపుఁ డయ్యరులన్ బోరిఁ గొనెన్. 112
తే॥ తురకదొరల సైన్యంబులు♦తురగములును పదులు నూఱులుగా గుముల్♦గుములుగాఁగ
బలి యగుచు నుండె భిల్లభూ ♦ పతిభుజంబు నెక్కి నర్తించు పెనుపుట్టె♦దుకు కడకు.

చ॥ స్థిరతర రాజపుత్రభట ♦ తీక్ష్ణభుజాబలధాటి కాగలే
కఱచి మహమ్మదీయ భటు ♦ లందఱు మారుతధాటి నిల్వలే
కొరుగుచు వార్ధిలు పైరుగతి ♦ నోజ తొలంగి కలంగువేళ, ని
ష్ఠురబలశాలి వీరబలుఁ ♦ డున్ బర తెంచె భటాళి గొల్వఁగన్. 114
సీ॥ వడదాఁకి సోలెడు ♦ వారిపై నమృతవర్షము జాఱు రీతిఁ గ ♦ ర్కశ తురుష్క
చమువు లన్నియు రణో ♦ త్సాహంబుతో సముద్రములట్లు పొంగి యా ♦ రాజపుత్ర
సేనలపైఁ గవి ♦ సెను; బ్రతాపునిదెస యోధులు పోరాడి ♦ రుగ్రభంగి;
నపుడు చూపిన శౌర్య ♦ మప్పటి సాహసం బమరలోకశ్లాఘ్య ♦ మై తనర్చెఁ!
తే॥ దురకమూఁకలు ముందుముం ♦ దునకుఁ బొంగి యొత్తుకొనివచ్చు నొత్తడి ♦ కోపలేక
యాప్రతాపుని వీరసై ♦ న్యంబులెల్ల వెనుకకును ద్రొమ్మొగ్గతిలునేమొ ♦ యనుచుఁదోఁచె

క॥ కాలాహికూరులు నిజఝూలాపీరులును బంచ ♦ శతసంఖ్యగఁ ద
న్నోలి భజింపఁగ శ్యామనృపాలుండు ప్రతాపుఁ జేరి ♦ వైరులఁ దాఁకెన్. 116

తే॥ శంఖరవములు సింహగ ♦ ర్జారవంబు లతిశయిల రాజపుత్రసై ♦ న్యంబు లెల్ల
నుబికి యుంకించి యురళించి♦యూఁదితాఁక విరిగిపడి వైరిబలము ని ♦ వ్వెఱఁగలంగె.

తే॥ సూర్యభగవానుఁ డపరాబ్ధిఁ♦జొచ్చె; యవన గణము పులి నాకి విడిచిన ♦ కండయగుచు
గడ్డికఱచెను; భిల్లులు ♦ క్రమ్మకొనిరి కడల మునిముని చీఁకటుల్ ♦ గదియు కరణి.

శా॥ నూఱుల్ మించిన రాజపుత్రకుల దం ♦ డుర్వేలకుర్మించి యు
గ్రారూఢిన్ యవనుల్ పయిన్ బడఁ బ్రతా ♦ పాధీశుఁ డయ్యందఱన్
బాఱన్ ద్రోలుచుఁ బుష్పవర్షము సురల్ ♦ వర్షింప నర్తించె; 'దే
వేరీయుద్ధ మపూర్వ' మన్న నుడి ప ♦ ర్వెన్ లోకవిఖ్యాతమై. 119

—*) ప్రతాపసింహుఁడు యుద్ధరంగమునుండి శైలగుహ కరుదెంచుట. (*—

సీ॥ "ఈనాఁడు మొగలులఁ ♦ బోనీక కడతేర్తు! మిచ్చట మీరుండ ♦ నేల! యతఁడె
శ్యామసింహుఁడుగూడఁ ♦ జనుదెంచెఁ! దల్లి పాటేశ్వరీదేవియు ♦ నేకతంబ
పిల్లలతో శైల ♦ బిలమున నున్న; దావంతయుఁ బలుకుఁడో ♦ పైన లేక!
యీనాఁటి పోరాట ♦ మెప్పుడు ముగియునో! యెపుడు రానొదవునో♦యెఱుఁగనేర!

తే॥ మనుచరులతోడ మీరేగుఁ"♦డనుచుఁ గృష్ణ సింహుఁడును భీమచాందనును♦జెప్పఁగొనఁగ
భిల్లు నొకనిఁ బ్రతాపుఁడు♦వెంటఁ గొనుచు శీఘ్రముగ శైలగుహాయుంమఁ♦జేరుకొనియె

తే॥ కడుపు మలమలమాడు నాఁ♦ కటికి వెక్కి వెక్కియేడ్చి నిద్రించిరి ♦ బిడ్డ లెల్ల;
విభుఁడు-పాటేశ్వరీదేవి-♦ భిల్లభటుఁడు గంగ ప్రిమ్మఁగక యాఁయు ♦ గమపవలసై. 121

సీ॥ లలితసౌదామనీ ♦ లతికలు చుట్టు మూఁగిన ముస్త గోపకా ♦ మినులుగాఁగ,
రణరణ చ్చారుగ ♦ ర్జానినాదము మనోజ్ఞమ్మైన వేణునా ♦ దమ్ముగాఁగ
నంచుల మెఱయు సం ♦ ధ్యారాగపటలమ్ము రమణీయ పీతాంబ ♦ రమ్ముగాఁగ,
నృత్యమ్మయూర వి ♦ స్తృత కలాపము శిరస్పందానితావతం ♦ సమ్ముగాఁగ,

తే॥ నతి విశాలమౌ సంతతి ♦ ఘనగణమ్ము చెలువ మమరు బృందావన ♦ సీమగాఁగఁ,
బూని విహరించె విశ్వర ♦ ఘనిరూఢిఁ బ్రొప్పు డంభోద బాల గో♦పాలమూర్తి! 122

ఉ॥ ఆమలకాభమై చినుకు ♦ లంతకు నంతకు నేకధారలై
పాములు వ్రేలఁ దీయు గతిఁ ♦ బర్వెచు, నేనుఁగుఁదొండ మంతలై,
భూమి జలార్ణవం బయిన ♦ పోలిక నిండుచుఁ, గుండపోత గ
ర్జాముఖరంబులై కురియ ♦ సాఁగె నభం బవియంగ మేఘముల్! 123

సీ॥ కనులుమూసిన జెల్లు ♦ కాని లోనడుగు ధగద్ధగలీను నిబిడ సౌ ♦ దామనులును,
నొక్కొక్కసారిగ జగంబు ♦ వ్రక్కలు వ్రక్కలై చనఁ జేయు మేఘగ ♦ ర్జారవములు,
కొండ లొండొంటిపైఁ ♦ గూలి బ్రహ్మాండంబు నగలించు ప్రళయ జం ♦ ఝూనిలములు,
క్షణమున విశ్వలో ♦ క ప్రాణితతిఁ గూల్చుగతి జాఱు భయద ని ♦ ర్ఘాతములును,
తే॥ నంత నంతకు జృంభించి ♦ యావరించి ప్రళయఘనముల్లు కోటి యొక్కనాఁడె ♦ గలిగినట్లు
ప్రకృతి శ్వాయువు నిండిన ♦ పగిది, మాపి రాడనీక గాలియు వాన ♦ యాలముకొనియె.
తే॥ కోటి కొక్కఁడైన నిలువక ♦ గుదులుగుదులు తరు మృగ విహంగములు గూలె ♦ ధాత్రి విశ్వ
గర్భనిర్భేదకమగు నా ♦ కాళరాత్రిఁ దలఁచు మాత్రన నిలువెల్ల ♦ జలదరించు. 125
తే॥ ఏఱు లీఁతబంటిగ ప్రవాహ ♦ లెత్తి పాఱి కలిసి యుప్పొంగి యొకదొంటి ♦ కొలఁది మీఱి
కొండలును లోయలును వనుల్ ♦ గుహలు నిండి నిఖిల మేకార్ణవముగ ఘూ ♦ ర్ణిల్లెనపుడు
మ॥ అకటా! గాలియు వాన గూడి నిబిడం ♦ బై రేఁగఁగా రాలిచ
ల్వకుఁ గ్రొన్నెత్తురు ముద్ద గట్టుకొని పి ♦ ల్లల్ ముంచుగడ్డల్ వడిన్
నికటోర్విన్ శయనించి కష్టపడఁగా ♦ నీ! జేనెదుర్ గడ్డ, క్రిం
దినికిన్ లేకయ నాఁటిరాత్రి శివరా ♦ త్రిన్ బోలె నెట్లీడ్చిరో! 127

—*) ప్రభాతము (*—

ఆ॥ వేఁగుఁజుక్క లేదు! ♦ వెల్లఁబాఱదు తూర్పు! కొండకోళ్ళ గుములు ♦ గూయ వేచెట!
రవి జనింపఁ; డెట్లో ♦ ప్రాభాత మయ్యె! వర్షంబు బల మొకింత ♦ సన్నగిల్లె. 128
క॥ తడియాఱని గడ్డిని శబరుఁడు గొనిర్వా, రాణి రుబ్బి, ♦ రొట్టెలు చేసెన్;
గడనుండి బిడ్డలాఁదఱ కిడి, పదపడి నొక్కరొట్టె ♦ నిడెఁ బతి యెమరన్. 129
సీ॥ పద్మాసనమున దై ♦ వధ్యాననియతి నేత్రయుగంబు మూసెఁ బ్ర ♦ తాపదేవుఁ;
డంత నొక్క బిడాల ♦ మా గుహకడ నాడుకొనెడు బిడ్డయెడలు ♦ గోళ్ల గిరి
చేతిరొట్టెను నాఁచి ♦ శీఘ్రంబె యొక్క శాఖిని నెక్కె చన! బిడ్డ ♦ కెవ్వమనుచు
నఱచి భూమిని వ్రాలె! ♦ నాధ్వని కడలి పాటేశ్వరి చని బిడ్డ ♦ నెత్తికొనియెఁ!
గీ॥ దనయ యేడ్పునఁ జెవులు చీఁ ♦ దఱలు వోవఁ గనుదెఱచి యోమ్మ గ్రమ్మఱ ♦ క్రుంబుఁ గనుట
వజ్రపంజరకల్ప మ ♦ ప్పార్థివేంద్రు వీరహృదయము చెదరి ద్ర ♦ వించి పాఱె! 130
సీ॥ "పదియుఁబండ్రెండు సం ♦ వత్సరంబులు సంఘటించు పోరులకుఁ జిం ♦ తించ లేదు;
జగము మ్రింగు నసాధ్య ♦ శత్రు వక్బరు రేఁగి పగవట్టెనని సుంత ♦ వగపు లేదు;

కోటలు సేనలు ♦ కోశంబు దేశంబు బలము తగ్గెనటంచు ♦ భయము లేదు;
కడు దీర్ఘకాలంబు ♦ గడచినఁగూడ జయము గల్గదని విచా ♦ రమును లేదు;
తే॥ ఆపదల కోర్చుటకె పీరుఁ ♦ డవతరించు నని విపత్కోటి నెదిరి ధై ♦ ర్యమున నడతుఁ;
గాని యీనోరులేని ర ♦ క్తంబు సొత్తు లనుభవించు కష్టము చూడ ♦ నలవిగాదు. 131
తే॥ దాసదాసీసహస్రముల్ ♦ తమ్ముఁ గొలువఁ బమరభాగ్యోదధిని దేల ♦ వలయువారు
కూడు లేకుండ మలమల ♦ మాడుచుండ్రు! తుద కొకండె నదృష్టవం ♦ తుండుఁగాఁడె! 132
తే॥ అంతిపురి లేదు; తూఁగుటు ♦ య్యాల లేదు; కొండలను గుట్టలను జీఁకు ♦ గుహలయందు
గాలి వాన యెండలఁజిక్కి ♦ కరకురాలఁ బఱచుకొనలేక పడియుండ ♦ వలసె నకట! 133
ఆ॥ నాయనంతరమున ♦ నీయఖండక్షోణి నంత యేలవలయు ♦ "నమరసింహుఁ"
డిట్టు లిడుమ పడెడు! ♦ నిది యెట్టికాలమో! క్రోలుపులియుఁ బిల్ల ♦ కూనయయ్యె! 134
సీ॥ మూర్తిభవించు మ ♦ త్పూర్వ పుణ్యఫలంబు, మానుక హృదయ సా ♦ మ్రాజ్యలక్ష్మి,
పావిత్ర్య మందిరో ♦ పరి పూర్ణకలశంబు, తనువు ధరించు సౌం ♦ దర్యధనము,
శాశ్వత శాంతి మ ♦ హైశ్వర్యదేవత, ప్రకట సౌభాగ్య ప ♦ ర్యాయపదము,
కష్టాపనుద మహా ♦ కల్పధాత్రీజంబు, నిరుపమ వరవర్ణి ♦ నీ మతల్లి,
తే॥ ప్రియతమంబైన మత్ప్రేమ ♦ విగ్రహంబు, నృప మకుట రత్న రోచిః ప ♦ రీత చరణ,
మైన పాటేశ్వరీదేవి ♦ యకట! యిట్లు పరమ దారిద్ర్యమున మున్గ ♦ వలసె నేఁడు. 135
క॥ దిన మంతటి శోకఫలమును గొని తీరని యుద్ధములఁ ద ♦ గుల్కొని కండల్
దునిసి యెముకపట్టెను మే;నినుమైన నికెంతకాల ♦ మింక నిలిచెడునో! 136
ఆ॥ వానకాలమందు ♦ వణకుచుఁ దలదాఁపఁ గూటిపేదకైన ♦ గుడిసెయుండుఁ;
జక్రవర్తినయ్యు ♦ సంతాన మిటు శైల గుహల నిలిచి గోడు ♦ గుడువ వలసె. 137

---

⊕ It is universally admitted that there is no better criterion of the refinement of a nation than the condition of the fair sex therein ...... Like the ancient German or Scandinavian the Rajput consults her in every transaction; from her ordinary actions he draws the omen of success and he appends to her name, the epithet of Devi or 'godlike' ...... Of one thing we are certain, seclusion of females can only originate in a moderately advanced stage of civilization......Of all the nations of the world who have habituated the female to a restricted intercourse with society, whether Grecian, Roman, Egyption or Chinese, the Rajput has given least cause to provoke the sentiment of pity; for if deference and respect be proofs of civilization, Rajaputana must be considered as redundent in evidence of

ఆ॥ ఉరమునందు రక్త ♦ మురలంగఁ దిలకింప మనసు చెడియె నాకు; ♦ మఱలఁ దిండి
యొదవు నెపుడొ! వైరు ♦ లెవరొ మ రింత! కీ కడుపుఁగోఁత యెట్లు♦పడఁగ నేర్తు!" 138

చ॥ అని వగ నొంది భూరమణుఁ ♦ డాకును గంటము దీసి వ్రాసి చెం
తను గల భిల్లుచేత నిడి ♦ దానిని 'బాదుశహా' కొసంగుమం
చనిపి యొకింత కన్మొగిచి ♦ ధ్యానసమాధి మునింగె! రాజ్ఞి యొ
య్యనఁ జనుదెంచి యాత్మవిభు, ♦ నాతని చెంగటి రొట్టెఁ, గాంచుచున్, 139

గీ॥ "రాజయోగసమాధి నే ♦ త్రములు మొగిచి కడలివలె నీమహారాజు ♦ కదల కుండె;
భావగంభీరమైన త ♦ ద్వదనమందు నలఁతి యలఁతి చింతారేఖ ♦ లలమియుండె." 140

చ॥ అని తలపోసి నాథు పద ♦ నాంబురుహంబునఁ జూడ్కి నిల్పి య
య్యనుపమవీరపత్ని విభు ♦ నండనె నిల్చెఁ; బ్రతాపదేవుఁడున్
గనుఁగవ విచ్చె; విచ్చిన మొ ♦ గమ్మున దేవియు డగ్గరించుచున్
వినయము నాదరమ్ము గను ♦ పింప నకంపితవృత్తి యేర్పడన్, 141

—*) పాటేశ్వరీదేవి ప్రతాపసింహుని విచారమునకుఁ గారణ మడుగుట (*—

గీ॥ "రత్నసింహాసనం బెక్కి ♦ రాజ్యమెల్లఁ గన్నుసన్నలఁ బాలించు ♦ కాలమందు,
నడవిఁ బాలించునేఁడు, నె ♦ న్నఁడునుగనని చింత మీమోమునను బ్రవే♦శించెనేల! 142

సీ॥ ప్రాణేశ! నీయుద ♦ రము నంటు నాఁకలి, నీకుణంబుల వాశ్ర ♦ యించు నిద్ర,
మోమునందుఁ బ్రసాద ♦ మును గాంతినిగతి, చిత్తములోని దుర్దమ ♦ ధైర్యగరిమ,
మెట్టి దుర్ఘటకార్య ♦ మిపుడు మీయెడనుండి దొంగిలించి యొకింత ♦ తొలఁగఁజేసె!
దృష్టిమార్పక యొకే ♦ దిక్కుగాఁ జూడ్కులు క్షితిపై నిగుడ్చి వీ ♦ క్షింపనేల!
గీ॥ మీమది నొకింతయును జింత ♦ మేకొనంగ నెఱుఁగ నెన్నఁడు; మిమ్ము నే♦నెఱుఁగుటాది
నిదియె తొలుసారి; వగపున♦కేమి హేతు! వెఱుఁగఁజెప్పుము మానసం ♦ బెరియసాఁగె. 143

సీ॥ పదియాఱుకళల వి ♦ శ్వమునిండి వెలుఁగు కళానిధి సహజ క ♦ ళంకమూర్తి;
నిలువెల్ల విచ్చి వ ♦ న్నెల నీను వెల్లదామరకుఁ దుమ్మెదపోటు ♦ మానని పని;

---

it. Where females are honored there, the deities are pleased, but where dishonored there all religious rites become useless. "Strike not, even with a blossom, a wife guilty of a hundred faults" says another sage, a sentiment so delicate that Reginald Born, the prince of Troubadours, never uttered any more refined.

Customs of Mewar.

తళతళ మెఱయు ని ♦ ద్దపుటద్దము పరాగధూసరమగుట పోఁ ♦ దో(ప్రియరాష్ట్ర

యమలవ్యాఃపూర గా ♦ రాంగ్ర గంగానది-వానకారుఁకళంకు ♦ వదల్లకుండు;

క॥ నివి ప్రకృతికి లోనైనవి; ♦ యింతవఱకు నామెఱిఁగినంతదాఁక రా ♦ ణాప్రతాప-

సింహదేవుఁడు ప్రకృతివి ♦ జేత; యిట్టిఘనుని మోహమున నీవిన్న ♦ దన మిదేల! 144

గీ॥ వైరు లెదిరింప వెన్నిచ్చి ♦ పాఱ వెపుడు; పాఱు వైరులఁ దఱిమి చం ♦ పంగఁబోవు;

కలిమిలేముల మనసు మా ♦ ర్పులనుబొంద;విటుల యోజింపఁ గారణ♦మేమి నాథ! 145

ఉ॥ 'ఆపదలందు ధైర్యగుణ' ♦ మన్న నుదాహరణమ్ము నీవ; నీ

ప్రాపున నిల్చె ధీరజన ♦ పట్టము; హేతు వెఱుంగలేక సం

తాపము నొందు నామనసు; ♦ నాథ! వచింపఁగ నర్హమైన చో

దాఁపక యానతిమ్మని ప ♦ దంబుల వ్రాలుచు విన్నవించెదన్." 146

గీ॥ అనెడుపల్కులు చెవిసోఁకు ♦ నంతమాత్ర విభుని హృదయారవిందము ♦ విచ్చె;మోము

విచ్చె; విచ్చిన కెందమ్మి ♦ వెడలివచ్చు మధురమధుధారయన బా ♦ మంజుభాషితి; 147

మ॥ "జననంబందిన నాఁటనుండియు రహ ♦ స్యం బొందు నే నెన్నఁడై

నను బాటించి యెఱుంగ నింతవఱకున్; ♦ నాయర్ధదేహాంబవై

చను నీతోడ వచింపరాని దొక యం ♦ శం బుండునే! యింతకున్

మునుపే తెల్పకపోతినే యని మనం ♦ బున్ జింతచేఁ గ్రాఁగెడిన్. 148

సీ॥ ప్రాకారవలయిత ♦ ప్రాసాదములయందు, శశికాంతమయ చతు ♦ శ్శాలలందు,

వనుపమంబైన శు ♦ ద్ధాంతసీమలయందు; మిగులనెత్తగు గాలి ♦ మేడలందు,

బరమసుఖప్రద ♦ ప్రమదావనములందు, బన్నీటి కాల్వల ♦ పట్టులందు,

సారాంబుపూర కా ♦ సారతీరములందు, మోదంబు గొలుపు పూఁ ♦ బొదలయందు,

గీ॥ దాసదాసీసహస్రముల్ ♦ దళముకొనుచుఁ గన్నుసన్నఁ బొలఁగ నొండ ♦ కన్నెఱుఁగక

యలరఁదగు మహారాజభా ♦ ర్యవుగనుండి యడవిఁ బడుచుంటి నాసుర ♦ దృష్టవశత.

ఉ॥ వీరరసావతారమని ♦ పేరు వహించు నృపాలపూజ్యుఁడౌ

శూరుని ధర్మపత్ని యొక ♦ చోఁ దలఁదాఁపఁగఁ జోటులేక మా

ర్జారికవోలెఁ బిల్ల లుద ♦ రమ్మున వ్రేలఁగఁ జెట్లగట్లఁ దా

ర్మారగుచుండ నేకతన ♦ మర్త్యుఁడు చూచి సహింపనేర్చునో!

మ॥ అకటా! నాకసుగందు లీయడవి బో ♦ యల్ మోయ నిదంకు వే

ళకు నన్నంబును నీరులేక కనువా ♦ ల్పన్ సుంతచో టింత తీ

రికయుగ్ లేక తపించుచుండ, నిఁక యే ♦ శ్రీ లొందిమే లొంద నూ
అక నేనీ యుబులాట మందవలె! ఏ ♦ రత్నంబు మే లిట్టిదే! 151

సీ॥ ఎండ్లుగాఁ బిల్లలు ♦ నీవు తపింప వీక్షించి ధైర్యమున స ♦ హించుచుంటి!
దినమంత మలమల ♦ తిండిలేక తపించు బిడ్డనోరును గొట్టి ♦ పిల్లి గీర
బొమ్మపైఁ గ్రమ్మర ♦ క్తమ్ము వీక్షించి కెవ్వని వేయు కేకను ♦ వినుటఁ జేసి
సముదారవజ్రపం ♦ జరసన్నిభంబు నాస్వాంతంబు క్షణము దు ♦ ర్బలత నొంది

గీ॥ 'యాఱుమాసముల్ విశ్రాంతి ♦ యవసరమని తోఁచె; నేడవనెల రాఁగ♦దురముచేయ
సిద్ధముగ నుందు' నని చిన్న ♦ చీటి వ్రాసి భిల్లుచేఁ బాదుషాకుఁ బం ♦ పించినాఁడ. 152

ఉ॥ వ్రాసితిఁగాని కమ్మ; నది ♦ వ్రాసినదాది నరుంతుదవ్యథా
యాసితమై మనంబు వెను ♦ కాడుచు నున్నది; సూర్యవంశ మ
భ్యాసము లేని క్రొత్తయల ♦ వాటున కాస్పద మయ్యె నేఁడు; నా
వాసి తొలంగె; నేమిటికి ♦ వ్రాసితినంచు మదిన్ దపించెదన్." 153

—*) పాటేశ్వరీదేవి ప్రతాపసింహునకు రణోత్సాహముఁ గలిగించుట (*—

చ॥ అనుచు బ్రతాపసింహుఁడన ♦ నావనితామణి సుంత విస్మితా
ననయయి భర్త మోముఁ గని ♦ "నాథ! ప్రమాదమటన్న మాటయే
జెనకదు మిమ్ముఁ; గార్యమును ♦ జేసెదుచో ఫలసిద్ధి చక్కఁగా
మనమునఁ జర్చసేయ కొక ♦ మార్గముఁ ద్రొక్కని ధీరవర్తనుల్! 154

మ॥ వ్యవధిన్ జెందఁగఁ గోరి తాఱు నెల; లీ ♦ పై యుద్ధమున్ సిద్ధమే
యవుచో లాభ మదేమి! యీగడువుచే; ♦ నాయుస్సు హెచ్చించిన
ట్లవు; నేఁడే పదనైన నీదు కరవా ♦ లానాఁటి కిట్లుండునే
యవనవ్రాత శిరోవిదారణ పటు ♦ వ్యాపార పారీణతన్. 155

సీ॥ క్షణకాలమైన వి ♦ శ్రాంతి నొందఁగఁ బోక, తనియ నూపిరి పుచ్చు ♦ కొనఁగఁ బోక,
సంతతధ్యానని ♦ ష్ఠ యెలర్పఁ గార్యసాధకుఁడు కేఁబవలును ♦ దత్పరుఁడయి
తనరంగవలయు; స్వా ♦ తంత్ర్యమహత్తమకార్యనిర్వహణంబుఁ ♦ గాంక్షచేసి
సర్వార్పణ మొనర్చి ♦ జంకక పనిచేయు భువనైక వీరపుం ♦ గవుఁడ వీవు;

గీ॥ పౌరుషోద్యోగజలదప్ర ♦ భంజనమగు శ్రాంతి నెటు కోరి! తాఱుమా ♦ సములుకూరు
చున్నయట్టి నిర్వాప్యపౌరు♦డెన్ని జన్మములు గడిచెనేని పనిచేయఁ♦గలఁడె మఱల! 156

సీ॥ గతిచెడి యఖిలభా ♦ రతలక్ష్మి యవనుల పాలయి కడగండ్లు ♦ పడుచునుండఁ,
గన్నసంతానంబు ♦ కన్న మిన్నఁగ నెంచు ప్రజ దాపులేక చే ♦ డ్పడుచునుండఁ,
గల్యాణనిలయదు ♦ ర్గము లెన్నియో కూలిపడి బీడుపడి కాడు ♦ పడుచునుండ,
హైందవాచార మా ♦ ర్యస్త్రీల పావిత్ర్య మడుగంటి మంటిపా ♦ లగుచునుండ,
గీ॥ భారతీయస్వతంత్రత ♦ పట్టుదప్పి వీఁగి నానాఁటి కుట్టూఁత ♦ లూఁగుచుండఁ,
దనకుటుంబముపై నాస ♦ ననిఁ దొలంగ నోపునే! వీరరాణాప్ర ♦ తాపమూర్తి! 157

సీ॥ భువన ముద్భవమొందు ♦ మొదలుగా నెవ్వ రూహించి కల్పించి సా ♦ గించి యెఱుఁగ
నట్టి స్వాతంత్ర్యమ ♦ హాయోగదీక్ష నారంభించితివి మహో ♦ గ్రప్రవృత్తి;
నీయనంతత్యాగ ♦ నియతియును నఖండదేశభక్తి రతి ను ♦ తించె జగము;
లా యజాండకటాహ ♦ మావరించిన జ్యోత్స్నవలె నీయశంబు వి ♦ శ్వమున నిండె;
గీ॥ ధరణి నాచంద్రతారకా ♦ స్థాయిగాఁగ నీదు పావననామంబు ♦ నెగడునట్లు
మెలఁగనేర్చితి; లోపముల్ ♦ గలుగఁగలవె! ధన్యులగు వారిలో ధన్య ♦ తముఁడవీవు.

గీ॥ సానఁదీర్చిన కొలఁది వ ♦ జ్రంపుముక్క, తఱచిన కొలంది మంచి గం ♦ దంపుఁజెక్క,
యిడుమ లందిన కొలఁది లో ♦ కైకవీరుఁడును, బ్రకాశించునన నెఱుం ♦ గనిదె నీకు!

సీ॥ కోటలన్నియు శత్రు ♦ కోటి చేకొనెనంచు, సేనాబలంబు గృ ♦ శించె ననుచు,
జయ మింతవఱకు ద ♦ ర్శన మీయ లేదంచు, నాపదల్ నెడబంటి ♦ యయ్యె ననుచుఁ,
జన నేఁడుపూండ్లను ♦ దినఁ దిండి లేదంచుఁ, బసికూన లగచాట్లఁ ♦ బడుదు రనుచు;
మదిఁ గుందవలవ! దీ ♦ మాఱు వైరులు రాఁగఁ గవచఖడ్గము లూని ♦ కాసెఁగట్టి
గీ॥ యద్వితీయబలుని నిన్ను ♦ నీద్వితీయ నైన నేను రణక్షోణి ♦ ననుసరించి
శత్రుసంహార మొనరింతు; ♦ శంక లేల! యిరువురము నిల్వ జగమెల్ల ♦ నెదురఁగలదె!

సీ॥ అరులచే, నున్నసై ♦ న్యాధిపుల్ మడిసిన, సామంతనృపులెల్ల ♦ సమసిచనిన,
భటుఁ డొకండును లేక ♦ బలమెల్లఁ దొలఁగిన, నాపదల్ వేనవే ♦ లలముకొనిన,
నేను బిడ్డలుఁగూడ ♦ నిశితఖడ్గము లూని రణము సేయుదు మిరు ♦ ప్రక్క నిలిచి;
కొండలోఁ జివర యం ♦ గుళమైన రణములే కక్బరు సుఖముగా ♦ నందరాదు;
గీ॥ మనకుటుంబములో జనిం ♦ చిన కడపటి నిసువు గళమునఁ గొనయూపి ♦ రెసఁగియుండ
దైవసముఁడ వీ విడిన స్వా ♦ తంత్ర్యసమర మజ హరాను లెదిర్చిన ♦ నాఁగరాదు.

మ॥ కొఱ యొక్కింతయు లేదు లోకమువ నా ♦ కుఁ; బ్రహ్మకల్పంబుగా
ధర జీవించెడు వారు లేరెపుడు; మం ♦ దస్మేరముల్ మీముఖాం

బురుహాంబుదమునఁ దాండవించుచు ముదం ♦ బుర్ బెంచుఁగాకంచు నీ
శ్వరుఁ బ్రార్థించెద" నన్నఁ బత్నికిఁ బ్రితా ♦ పస్వామి హర్షంబునన్; 162

సీ॥ "అనిచేసి మరలి వ ♦ చ్చినవేళ మొదలంట శ్రమఁ దీర్చు మధుర వి ♦ శ్రాంతిసీమ!
తలఁగిపోవని యాప ♦ దలు ముట్టినపుడు ధైర్యం బీయఁగల యంట ♦ రాని కోట!
కష్టాంధతమసంబు ♦ గప్పి తోఁపనియప్పు త్రోవఁ జక్కఁగఁజూపు ♦ దొడ్డజోతి!
పదికి వేయిగ వైరి ♦ భటులు పైఁబడినప్పు డసమానబల మిచ్చు ♦ నమృతఘుటిక!
గీ॥ యన్నివేళల సౌఖ్యంబు ♦ లలవరింప నందనోద్యాన మనుచు డెం ♦ దమున నెంతు
నీమధుర ధీర గంభీర ♦ నిబిడఫణితిఁ దలఁచి పాలేశ్వరీ! వని ♦ తామతల్లి!

మ॥ వరసౌశీల్యము నాభిజాత్యమును సౌ ♦ భాగ్యంబు శ్రీయున్ మనో
హర శాంతి స్థిరధీరతల్ దనరు ని ♦ న్నర్థాంగిగా నిచ్చి యు
ర్వర నాకిప్పు డనన్య దుర్లభ మహా ♦ భాగ్యంబు సంధించె నీ
శ్వరుఁడంచున్ మది నెంచి పాయని కృత ♦ జ్ఞత్వంబునన్ మ్రొక్కెదన్. 164

సీ॥ నే నెఱుంగకయున్న ♦ నిరతంబు ననుఁ గాచి నాకోప ముపశమ ♦ నంబు చేసి
మధురస్వభావసం ♦ పద చే నుడుకుఁదీర్చి యలఘుశాంతతఁ గూర్చి ♦ కలఁతదేర్చి
యూరించి లాలించి ♦ యుపచరించి కలంచి యలరించి మించి ధై ♦ ర్యంబు నించి
మది హరించెడు గుణ ♦ మాధుర్యమున రూపమాధుర్యమును బెంచి ♦ మమత నుంచి
గీ॥ యండఁ బాయక నీవుండు ♦ నంతదాఁక వనిత! కోటానఁగోటు లా ♦ పదలు వచ్చి
తలఁబడిన నంగుళంబు ప్ర ♦ తాపవిభుఁడు దారి తప్పనె! స్వాతంత్ర్య ♦ ధర్మనిరతి."
గీ॥ అనుచు వచియింపఁగా "భాగ్య ♦ మాయె నాకుఁ; బ్రాణనాథ! ప్రసాదంబు ♦ నారగింపు"
మనెడి పాలేశ్వరీదేవి ♦ ప్రార్థనమున జనవరేణ్యుఁడు లేచి భో ♦ జనముఁ జేసె. 164

(*—*) రాజపుత్ర సైన్యములు యవనుల నోడించి ప్రతాపసింహునిఁ జేరవచ్చుట. (*—*)

క॥ ఆలోన సమీపంబున శైలగుహా భూరి కుహర ♦ సంతతులెల్లన్
ప్రేలఁగ భిల్లేశ్వరు నాభీలమహాశంఖరవము ♦ వీతెంచె వడిన్. 147

శా॥ ఆకల్యాణ మహారవంబు మధురం ♦ బై వీచి శ్రోత్రేంద్రియ
వ్యాకోచత్వము సంఘటింపఁగఁ బ్రితా ♦ పస్వామి లేచెన్; సలుం
బ్రాకృష్ణాదులు వచ్చి స్వామిచరణ ♦ ద్వంద్వంబుపై వ్రాలుచున్
సాకల్యంబుగ నాఁటి సంగర విశే ♦ షంబుల్ నివేదించినన్,

క॥ విని యానందించెను యావనసేనలు దినదినంబు ♦ పైఁబడ సమరం
బొనరించుచు గెల్చుచు వెన్కను బడుచును గొన్నినాళ్లు ♦ గడిపెన్ విభుఁడున్. 169

—*) భిల్లుఁడు ఢిల్లీపురమున కరుగుట. (*—

క॥ వనముల లభించు ఫలములు తినుచును నాల్గామడలుగ ♦ దినము ప్రయాణం
బొనరించుచు భిల్లుఁడు కన్గొనె ఢిల్లీపురము కనక ♦ గోపురవరమున్. 170
సీ॥ అంజనాచలముల ♦ ననుకరించెడు దంతిసముదాయము రహించు ♦ శాల లోకట!
నుచ్చైశ్శ్రవము మేలు ♦ మెచ్చని యవనాశ్వసంఘంబు లలరారు ♦ శాల లోకట!
స్ఫటికంపుబొమ్మల ♦ భంగి వెలుఁగు పరంగు లుండెడు మంది ♦ రంబు లోకట!
నిబిడబాహాటోప ♦ నిరతులై దీపించు యవనుల్ వసించు గే ♦ హంబు లోకట!
గీ॥ గోపురంబున రెండు ది ♦ క్కులను భువనవిలయమును గూర్పఁగాఁ దొస్సి♦భీతిఁగొలుపు
పెను పిరంగుల తండముల్ ♦ గనుపడంగఁ జూపులకు వింతఁ గొలుపు ఢి ♦ ల్లీపురంబు.
గీ॥ హైందవులు గొల్చు శివకేశ ♦ వాలయములు భూరి యావనప్రార్థనా ♦ గారవితతు
లాపుర సరోవరమునఁ బె ♦ ల్లలమి వెలయుఁ గలయ విరిసిన పుండరీ ♦ కముల కరణి.
ఆ॥ సందులందు నడచి ♦ గొందుల విడిచి వీథులను రాజమార్గ ♦ ములను గడచి
వీరి వారి నడిగి ♦ భిల్లవార్తాహరి పురము మధ్యభాగ ♦ మునకుఁ బోయి, 173
క॥ లక్షలు కోట్లు ధనంబిడి లక్షలు పనివాండ్రు వరశి ♦ లాతతిఁ బెక్కేం
డ్లక్షయముగఁ గట్టిన హార్యక్షుద్వారాంగణంబు ♦ నాతఁడు డాసెన్. 174
క॥ ద్వారము రక్షించు ప్రతీహారులు కరవాలధరు లు ♦ దారబలాఢ్యుల్
'రారా'దని వారించుచు దూరమునకుఁ ద్రోయ నతఁడు ♦ తొలఁగుచు నిలిచెన్. 175
సీ॥ అలఘులక్షణభూష ♦ ణాంచితమగు పట్టపంబారి యేన్గుపై ♦ నధివసించి,
చామరగ్రాహిణీ ♦ సముదయంబు మనోజ్ఞకరములఁ గనకచా ♦ మరము లిడఁగ,
నాణిముత్తెపు సరు ♦ లలరు విశాల సితాతపత్రంబు చా ♦ యల మునింగి,
బహుళసేనాధీశ ♦ పటలంబు యవనాశ్వముల నెక్కి చుట్టును ♦ మూఁగి కొలువఁ,
గీ॥ జెలులు కనకపుష్పములు లా ♦ జలను జల్ల, భువనమోహనదరహాస ♦ మూర్తి యలర,
నిలిచి మ్రొక్కు పౌరులదెసఁ ♦ గలయఁజూచు చక్బరీశ్వరుఁ డాత్రోవ ♦ నరుగుదెంచె.
గీ॥ అణఁగి ముమ్మాఱులు సలాము ♦ లలవరించి ద్వారపాలకతతి బరా ♦ బరు లొనర్ప,
భిల్లుఁడును సార్వభౌముని ♦ ద్విరదముదెసఁ దరలి జాబున్న తనదు హ ♦ స్తంబు సాఁచె.

మ॥ 'ఎదురన్ జేరకు ప్రక్కకున్ దొలఁగు'మం ♦ చెల్లెత్తి ద్వారికుల్
వదరన్ భిల్లుఁడు నిల్చె బొమ్మవలె; న ♦ క్బర్ నేత "యేకార్య మ
న్నది! నీ వెవ్వఁడ!" వన్న భిల్లుఁడును "రా ♦ ణాగారు నీకిమ్మటం
చిదె యీ కమ్మను బంపి" రన్న విభుఁ డ ♦ య్యెగ్గున్ దిగన్ బాఱుచున్, 178

క॥ "వా రేకొండలలో సంచార మొనర్చెదరు! వారి ♦ సంతానము దే
వేరియు సేమముతో నున్నారే! యెఱుఁగంగఁ బల్కు ♦ నాతో" ననినన్, 179

సీ॥ "అందఱు సేమమే" ♦ యని కమ్మ నందిచ్చె; నక్బరుపాదుషా ♦ యాదరమున
నంజలి వట్టుచు ♦ నద్దానిఁ జేకొని సంభ్రమంబున నంతఁ ♦ జదువఁదొడఁగె;
నక్షియుగము విచ్చె; ♦ నాస్యంబు వికసించెఁ; జిత్తమందు ముదంబు ♦ చిందులాడె;
వ్యాకోచ పంకేరు ♦ హాస్యంది మధుధారలన మోదబాష్పంబు ♦ లతిశయిల్లెఁ;
గీ॥ జేష్టలం దింత తొందర♦చెలఁగఁజొచ్చె; నొడల నొకవింత రకమైన♦హొయలు పుట్టె;
నంత నంగ రేకునఁ గమ్మ ♦ సంతరించి చనియె భిల్లుఁ దోడ్కొని లోని♦సౌధమునకు.

§ గీ॥ ఐదువేల్ రాణివాసంపు ♦ టబ్జముఖులు వారి వారి నెచ్చెలులతో ♦ వచ్చి చేరి
లలిత దరహాస మధుర వి ♦ లాస మలర భిల్లమూర్తిని గని సంత ♦ సిల్లిరపుడు.

—*) అక్బరు చక్రవర్తి ఢిల్లీపురంబు నలంకరింపఁ జేయుట. (*—

❁ సీ॥ పురిని నూఱులు వేలు♦మొగలు టెక్కెములు వింతగు రంగులనుగుల్కి♦యొగురసాగెఁ
బ్రతిగృహాంగణము స్తం♦భములందుఁ దరుణరంభా స్తంభనివహంబు♦ప్రథలు గొలిపె!

---

§ The imperial harem constituted a town in itself. No less than five thousand women dwelt within the walls and each of them had a separate apartment. The maintenance and control of such a multitude of women necessitated a carefully devised system of internal administration and the organisation of adequate arrangements for discipline. The inmates were divided into sections each under a female commandant and due provision was made for the supply from the ranks of clerks to keep the accounts. A strict method of check was applied to the expenditure, which was on a large scale. The inside of the enclosure was protected by armed female guards.

"Akber the great Mogul."

❁ Over-joyed at this indication of submission, the Emperor commanded public rejoicings.

"Annals of Mewar."

నల బహిర్ద్వారసీ ♦ మలను బచ్చని మామిడాకు తోరణము ల ♦ ల్లాడఁదొడఁగె;
రత్నసంతతిఁ గూర్చి ♦ రచియించు ముత్యాల రంగవల్లికలు హా ♦ రంగు నెఱపెఁ;
గీ॥ జలువపందిరుల్ పానీయ ♦ శాల లెన్ని యెడలనో నెలకొల్పఁగాఁ ♦ బడి తనర్చె;
విరులు పునుగు జవాది య♦ త్తరువుచేతఁ బురము సిరి నించి సౌరభం♦బులను విసరె.

మ॥ అరుగ న్జొచ్చిరి వీధి వీధి జవనా ♦ శ్వారూఢు లుద్యోగు లెం
దఱో "యాస్థానమునందుఁ గొల్వమరు మ ♦ ధ్యాహ్నంబుపై నక్బరీ
శ్వరుఁడుర్; గాన నమాత్యులున్ నృపతులున్ ♦ సైన్యాధిపుల్ పౌరులం
దఱు నాస్థానముఁ జేర రం" డనుచు వా ♦ ర్తన్ దెల్ప సోత్సాహులై. 173

సీ॥ ఈశ్వరేశ్వరుఁగూర్చి ♦ యెల్లమసీదులందును భక్తి వెలయఁ బ్రా ♦ ర్థనలు జరిగె;
వైదిక మంత్రపు ♦ ష్పములు మంగళహారతులు సాగె నెల్లదే ♦ వళములందుఁ;
గూటిపేదలు మొదల్ ♦ కోటీశ్వరులదాఁకఁ బురజనుల్ మృష్టాన్న ♦ ములు భుజించి
నూతనవస్త్రసం ♦ దోహముల్ దాలిచి పలువిధాలంకార ♦ ములు ధరించి;
గీ॥ రాఁకలినిగొన్న బీదల ♦ కందఱకును బంచభక్ష్యభోజ్యంబులు ♦ పంచఁబడియె;
సీడులేని సౌఖ్యాబ్ధి నో ♦ లాడి, నాఁడు ఢిల్లిపురి స్వర్గపురి మేలు ♦ డిందుపఱిచె.

—*) అక్బరుసార్వభౌముని సభాభవనము. (*—

గీ॥ శకటములపైన యావనా ♦ శ్వములపైనఁ బల్లకీలపై నేన్గటం ♦ బారిపైనఁ
జెల్లుబడి కల్గు దొడ్డవా ♦ రెల్ల వచ్చి కొలువుసింగంపు వాఁకిట ♦ నిలిచి రప్డు. 185
గీ॥ విలువవస్తువులు ధరియించు ♦ వేత్రధరులు వంగి వంగి సలాములు ♦ ప్రచురపఱచి
తత్తదర్హాసలమ్ముల లం ♦ దఱకుఁ జూపి సమతఁ గూర్చుండఁజేసిరి ♦ క్రమత నెఱపి.
గీ॥ హేమ రుచిర మహాద్వార ♦ సీమనుండి యాసభాప్రాజ్యవజ్రసిం ♦ హాసనంబు
చూపఱకుఁ దోఁచు నొకచిన్న♦చుక్కమాడ్కి నినిన, భవనవైశాల్య మే♦మనఁగవచ్చు
సీ॥ పలుచిత్తరువులు బే ♦ బరునాఁటి యుద్ధవిశేషముల్ నొడ్వలఁ ♦ జెలఁగుచుండఁ,
బలురకంబుల యద్ద ♦ ముల గవాక్షములలో రవిరశ్మి వింత హా ♦ రంగు నెఱప,
మెఱుఁగారు లోహని ♦ ర్మితకుందమందార మాల లందందును ♦ వ్రేలుచుండ,
నొక్కొక్కఁడును వేయి ♦ దిక్కులఁ బ్రతిఫలించెడు కాచదీపంబు ♦ లడరుచుండ,
గీ॥ నేల యొక్కింతయేని క ♦ న్పింపకుండ మహితకాశ్మీర రత్నకం ♦ బళము లమర,

§ నందుపై రెండువేలు ది ♦ వ్యాసనములు దనరఁ దనరారె నక్బరా ♦ స్థానవాటి. 188

గీ॥ దాని చివర విశాల వి ♦ తర్ది యమరెఁ; గ్రింద ముకమాలు పైన జ ♦ రీపని గల
పట్టుగుడ్డ వెలుంగొందెఁ; ♦ పైననుండి వివిధముక్తాగుళుచ్ఛముల్ ♦ వ్రేలుచుండె. 189

సీ॥ ఆవితర్దికకు మ ♦ ధ్యమున వెల్గెను మనోహరనూత్నకనకసిం ♦ హాసనంబు;
నద్దాని చివరల ♦ నష్టదిక్కులయందుఁ దనరారె హాటక ♦ స్తంభవితతి;
వైడూర్యమాణిక్య ♦ వజ్రసంస్థగితమై కాంతులీనెను స్తంభ ♦ గర్భసమితి;
యా స్తంభములపైన ♦ నపరంజిపైకప్పు రేకులు రేకులై ♦ ప్రియముఁ గూర్చె;

గీ॥ నెత్తయిన చుట్టుగోడల ♦ హేమ మత్స్య సింహ గజ పక్షి శిరములు ♦ చ్చెరువు నించెఁ;
బరమభాగ్యాంకమగు నాస ♦ భాభవనము తగె మఘవు సుధర్మాస్థాన ♦ తలముఁ గేరి.

గీ॥ మంత్రులుద్యోగులాప్త సా ♦ మంతమణులు పదియు నాఱునూఱులు సైన్య ♦ పతులు గాయ
కులును బందుగుల్ నిండిరి; ♦ కొలువు దనరెఁ దరగబారులఁ దూఁగు సా ♦ గరము కరణి.

క॥ కనకపు సింహాసనమునకును గుడిదెస నగ్రపీఠిఁ ♦ గొమరొందెను శో
భన వైభవపరుఁడు 'సలీ' మనఘుఁడు యువరాజు భార ♦ తావని కెల్లన్. 192

సీ॥ బైరాముఖాన్ చమూ ♦ పతి పూర్వజన్మ తపోమహీజాతంబు ♦ పూర్ణఫలము!
యవనసంగతభార ♦ తాఖండబహుళ సామ్రాజ్యమేలెడు మహా ♦ మంత్రిమౌళి!
విశ్వోన్నతైశ్వర్య ♦ విభవసాంద్రుండైన యక్బరీశ్వరుని వి ♦ య్యాలసురభి!
పరిషియన్ భాష బా ♦ బరునృపేంద్రు చరిత్ర మనువదించినయట్టి ♦ యగ్రసుకవి!

ఆ॥ కులముగాదు దొడ్డ ♦ గుణమె ముఖ్యంబంచుఁ జాటు సజ్జనుండు! ♦ సరళహృదయుఁ!
❁ దాక్ష్యవర్తనాంకుఁ ♦ డబ్దురరహిమానుఁ డధివసించియుండె ♦ నవలి పీఠి. 193

---

§ He classified his officers in thirty three grades ranging from mansab dars of 10 to 10000. Late in the reign such officers numbered about 1600 in all and formed an official nobility.

"Akber, the Great Mogul."

❁ One of the ablest warriors and most generous of men in the service of Akbar was Mirza Abdurrahim, son of his old Atalik or preceptor Bairam Khan. For many years he exercised the office of Khan-khanan literally 'lord of lords' tantamount to commander in-chief. But he was as learned as he was able in the field. He translated the memiors of Baber, well described by Abul-fazal 'a code of practical wisdom' written in Turkish into the Persian language then prevalent at the court of Akbar, to whom he presented the copy.

"G. B. Malleson C. S. I.

సీ॥ ధరణీతలంబెల్ల ♦ దాన మిచ్చినను వే్రలుంచి తాఁకని రాజ ♦ యోగివహాళి,
వసుధాంతమునకైన ♦ వాహనం బెక్కక శ్రిమచేసి నడచు ని ♦ స్థాపరుండు,
జైనధర్మగ్రంథ ♦ సార మాస్వాదించి ఖ్యాతి వహించు జ ♦ గద్గురుండు,
బందిఁ బడినవారిఁ ♦ బక్షుల విడిపించి పశుహింస మాన్పు కృ ♦ పానిరతుఁడు,
గీ॥ యాత్రికులపన్ను గోవధ ♦ మణఁచివైవ సార్వభౌము బోధించు వి ♦ జ్ఞానరాశి,
§ "హరివిజయసూరి" భువనవి ♦ ద్యాగురుండు వేదిపైనొక్క యపరంజి ♦ పీట నుండె.

మ॥ పగిలించెన్ రిపుకోటి గుండియలు; న ♦ క్బర్ పాదుషా కిచ్చె ముం
దుగ నాత్మీయతనూజ; సైన్యపతులం ♦ దుర్ జూడఁగా నింతవాఁ
డగుపింపండనఁ బొల్చు నంబరువిభుం ♦ డౌ వృద్ధహార్యక్షు మా
"భగవాన్దాసు" వసించెఁ జెంతఁగల భా ♦ స్వత్స్వర్ణపీఠమ్మునన్. 195

సీ॥ "కచ్వహా"న్వయము లో ♦ కప్రసిద్ధ మొనర్ప నవతార నుందు మ ♦ హాభుజుండు!
రక్తాబ్ధినుండి బ ♦ ర్మాదాఁకఁ దనకత్తి కెదురు లేక జయించు ♦ పృథుబలాఢ్యుఁ!
డప్రతిహతముగా ♦ నర్థశతాబ్ద మంబరుదేశ మేలు నృ ♦ పాలచంద్రుఁ!
డాఖ్య కక్బరె కాని ♦ యఖిలంబున కితండె యనఁగ వర్తించు స ♦ ర్వాధికారి!
గీ॥ జగము పుట్టినాదిగ నింత ♦ శౌర్యరేఖ యింతటి మహోన్నతౌద్ధత్య ♦ మింత మాట
⊕ బలిమి గల సైన్యపతి యొండుఁ ♦ గలుగఁడనెడు మానసిం గధిష్ఠించెఁ బ్ర ♦ ధానపీఠ

---

The Khan Khanan [Abdurrahim] to whose daughter Danial was married, also did his best to restrain his son-in-law.

"Akbar the great Mogul"

§ Harivijaya Suri, the first named, the most distinguished of the three and credited by Jain authors with the honor of having converted Akbar, is placed by Abulfazl along with twenty others, includin Sheik Mubarak, in the first of the five classes ot the learned, among the select few who understand the mysteries of both worlds. Heravijaya Suri refused all the costly gifts pressed upon his acceptance and in accordance with the rules of his order, started on his long walk to Fathpur-Sikri He pursuaded the Emperor to release prisoners and caged birds and to prohibit the killing of animals on certain days. The Suri, who was granted the title of Jagad-guru or world-teacher returned to Guzrat.

"Akbar the great Mogul."

⊕ A desire to be rid of the Great Raja Mann of Amber, to whom he was so much indebted, made the Emperor descend to act the part of the assassin. He prepared a majoom or confection a part of which contained poison; but caught in

సీ॥ మతసహానంబు శా ♦ శ్వతధర్మమని యధీశ్వరునకు నేర్పు పా ♦ వనగుణుండు,
చతుర చతుస్సహ ♦ స్ర హయాధిపతియాచు నక్బరుఁ గొలిచిన ♦ యలఘుబలుఁడు,
తనమాట విభుఁడు వే ♦ దంబంచు మన్నించి తలఁదాల్ప మెలఁగిన ♦ ధన్యమూర్తి,
తనదు కాలంబునం ♦ దలి చరిత్రలు పెక్కు వ్రాసిన యుత్తమ ♦ గ్రంథకర్త,
గీ॥ యకలుషోదారవర్తనుం ♦ డగు ఘనుండు, దినము పదివీసియల తిండి ♦ తినెడు దొడ్డ
❁ తిండికాఁ 'డబుల్ ఫజ'లను ♦ పండితమణి యలరె ముఁదట నొక్క స్వ♦ర్ణాసనమున.
సీ॥ లాహిరీపురనృపా ♦ లకవంశ ముద్ధరింప జని చినట్టి పా ♦ వనగుణుఁడు,
హైందవాచారమ ♦ ర్యాద లామూలాగ్ర మెఱిఁగి యనుష్ఠించు ♦ గురుమనీషి,
ఘోరాహవంబున ♦ ఘూర్జరేశ్వరు గుండె లవియంగడాఁకిన ♦ యలఘుశౌర్యుఁ
డక్బరీశ్వరుని సై ♦ న్యాధీశులందు నగ్రస్థాన మొందు వీ ♦ రప్రభుండు,
గీ॥ తన గొలుసు క్రింద భారతా ♦ వనిని గొలిచి సిస్తులు విధించు నేర్పాట్లు ♦ చేయుటందుఁ
§ గలియుగమున వీని సముండు ♦ గలుగఁడనఁగ వెలయు 'తోడరమ' ల్లొక్క ♦ పీఠినుండె.
⊕ సీ॥ ధనసేనుఁడనెడు మం ♦ దస్మితమూర్తి ముం దొక్క పీఠముపైనఁ ♦ నుండె; నితఁడు
రీవామహీంద్రు కూ ♦ రిమి గాయకుఁడు; రాగ మాలాపనముచేయ ♦ యామునజల

---

his own snare, he presented the innoxious portion to the Rajput and ate that drugged with death himself. We have a sufficient clue to the motives which influenced Akbar to a deed so unworthy of him and which were more fully developed in the reign of his successor; namely a design on the part of Raja Mann to alter the succession and that Khoosru his nephew should succeed instead of Selim. With such a motive, the aged Emperor might have admitted with less scruple the advice which prompted an act he dared not openly undertake without exposing the throne in his latter days to the danger of civil contention, as Raja Mann was too powerful to be openly assaulted.

"Tod's Rajasthan."

❁ Abulfazl: his private life when judged by a muslim standard was considered to be blameless. He had a prodigious appetite rivalling that of Sultan Mahamud Bagarha of Guzarat and is reputed to have consumed daily thirty pounds of food. "Akber the Great Mogul."

§ He was born in Oudh at a village named Laharpoor, and after serving in subordinate office he was appointed Diwan. He is specially remembered for his share in the assesment of the land revenue, which he undertook in that capacity. On the whole, he was, perhaps, the ablest officer in Akbar's service.

⊕ All authorities and traditions are agreed that the best performer of Akber's Court was Miyan Tansen, whom Akber, in the seventh year of the

ముల మున్గె; రెండుగం ♦ టలపైనఁ బొగ లేచి బుగ్గలు పుట్టె; వి♦ప్రుండు మడిసె”
నని యక్బరన, వల ♦ లడరించి జాలరుల్ పట్టితెచ్చిరి; కార్య ♦ భంగమునకుఁ

గీ॥ గనలి హిందోళ-మేఘరా ♦ గములు రెండు గానమునకు నిషిద్ధమౌఁ ♦ గాకయనుచు
శాప మిచ్చిన గాయక ♦ సార్వభౌముఁ! డితని కీతఁడె సాటి యీ ♦ క్షితితలమున. 199

సీ॥ పరమశిశోదియా ♦ న్వయ ముద్ధరించు పృథ్వీనాయకుల కూర్మి ♦ పెండ్లి కొడుకు,
త్రిసహస్రగంధర్వ ♦ విసరాధిపతియయ్యు వాహినీపతులందుఁ ♦ బ్రథమగణ్యుఁ,
డకలంకవర్తన ♦ నక్బరుసభయెల్ల దలఁదాల్చు దివ్యమం ♦ దారమాల,
కవిరాజబిరుదసం ♦ కలితుఁడై యనుపమగ్రంథముల్ వ్రాసిన ♦ కవివరుండు,

గీ॥ ధరణి క్రుంగిన నభమెల్ల ♦ విఱిగిపడిన, నడ రొకించుక లేక స ♦ త్యంబు పలుకు
§ పృథ్వీరాజాఖ్యరాఠోడు ♦ వీరమూర్తి యలరె ముందున్న యొకయున్న ♦ తాసనమున.

సీ॥ కాలంజరీనమ ♦ గ్రక్ష్మాతలంబెల్లఁ బాలించుచుండు పా ♦ వనగుణుండు,
ప్రభువతంసుఁడు భగ ♦ వాన్దాసు సేవించి గౌరవం బందు వి ♦ ఖ్యాతకీర్తి,
యక్బరు హృదయర ♦ హస్యంబు లెఱుఁగంగ నేర్చు వర్తిలు చిర ♦ స్నేహితుండు,
కవి గాయకుఁడు కథా ♦ కథకుఁడై వక్తయై సభ నలరించు ప్ర ♦ జ్ఞారతుండు,

గీ॥ తనదు ప్రతిభానిరూఢికీ ♦ ధరణిజనుల వదనములు కాపురంబుండు ♦ సదనములుగఁ
⊕ జతుర సరసోక్తు లాడు సం ♦ స్తుతమనీషి, ‘వీరబలుఁ’ డుండె నొక దొడ్డ ♦ పీఠమునను.

---

reign, had required the Raja of Riwa to surrender. Abul-Fazl declared that a singer like him has not been in India for the last thousand years. He was a close friend of Sur-das and like many of his contemporaries received much of his musical education at Gualior. His talents included the composition of verse.

"Akbar the Great Mogul."

§ Prithwi was one of the most gallant chieftains of the age and like the Troubadour princes of the west could grace a cause with the soul-inspiring effusions of the muse as well as aid it with his sword: nay in an assembly of the bards of Rajasthan the palm of merit was unanimously awarded to the Rahtore Cavalier.

"Annals of Rajasthan."

⊕ Raja Birbal was a brahmin, a poet and a skilful musician. He was noted for his liberality and bonhomie. His short verses and jokes are still in the mouths of the people of Hindusthan.

"G. B. Malleson. C. S. I."

గీ॥ అలఘు లీలావతీ గణి ♦ తానువాదకుఁడు, నలచరిత్ర వ్రాసిన ♦ గొప్పసుకవి,
§ యా 'ఫయాజి'ముందున్న హే♦మాసనంబు నందుఁ గూర్చుండె నవిరళా♦నందమూర్తి.
ఆ॥ పారసీకభాష ♦ భారతరామాయణములు వ్రాసె; నిజమ ♦ తమున దురభి
⊕ మానశాలి యా బ ♦ దోనికవీశ్వరుం డవలి స్వర్ణపీఠి ♦ నాక్రమించె.
§ సీ॥ బికనీరురాజ్యపా ♦ లకుఁడై చతుస్సహస్రహయాధి పతియైన ♦ 'రాయసింగు!'
మాళ్వదేశాధీశ ♦ మణి గాయకవిభుండు సౌజన్యరాశి 'బా ♦ జబహదూరు!'
పలుదేశచరితముల్ ♦ వ్రాసి దిగంత యశస్సాంద్రుఁడగు 'పెరి ♦ స్తామనీషి!
⊕ యల తులసీదాసు ♦ తుల యీతఁడగునను వాసి గాంచిన "సూరి♦దాస" సుకవి!

---

Birbal was at first in the service of Raja Bhagavan Das. He enjoyed the rank and pay of a commander of a 2000......He then recieved the title of Raja-Birbal. He actually enjoyed the jagir of Kalanjar in Bundel-Khand later in his life.

"Akbar the great Mogul."

§ His abundant leisure Faizi devoted to poetry. It is said that he composed a hundred and one books.

"G. B. Malleson. C. S. I."

The poem rehearsing his adventures under the title of Nal and Damayanti was translated into Persian at Akbar's command by Faizi, brother of Abul fazl and has since been made known to the admirers of Sanskrit literature by Professor Bopp of Berlin.

"Rajasthan Volume II."

The influence of the two brothers Faizi and Abul-fazl dominated as long as they lived.

⊕ Badouni was a remarkable man. Under instructions from Akbar he translated the Ramayana from its original Sanskrit into Persian as well as part of Mahabbharata. Badouni to his intense disgust was compelled to labour on the infidal Mahabbharata & Ramayana. He could find only faint comfort in the thought that he was a blameless victim of destiny ;—

Faizi made the version of the treatise on arithmetic.

"Akbar the great Mogul."

§ Rae singh and the Emperor had married sisters, princesses of Jessulmir. This connexion obtained for him on his introduction to court by Raja Mann of Amber, the dignity of a leader of four thousand horse, the title of Raja and the government of Hissar.

"Annals of Bikanir"

Yet that Hindu (Tulsidas) was the greatest man of his age in India

గీ॥ యట్టి గసగసగింజపై ♦ నాఖొరాను ద్వాదశాధిక శతతమా ♦ ధ్యాయ మెల్లఁ
§ బూర్ణముగ వ్రాసినట్టి "య ♦ బ్దూస్సమాదుఁ" డధివసించిరి యాణి ♦ ముత్యాలపీట.
గీ॥ 'షేక్ముబారక్' మొగల్ బుధ ♦ శేఖరుండు, నా 'హకీం హుమా' మక్బరు ♦ నాప్తమిత్రు
డిరువు రొకచోటఁ బీఠంబు ♦ లెక్కియుండి రవిరళానందమున సస్మి ♦ తాస్యులగుచు.
క॥ విరియు వివిధకుసుమంబులఁ బరిమళములు నించు పుష్ప ♦ వాటిక సొబగుల్
బురుడించి సభాభవనము దొర లందఱు గొలువ నలరెఁ ♦ దోరపుఁ గళలన్.

—*) అక్బరుసార్వభౌముఁడు కొలువుఁగూటమునకు వచ్చుట. (*—

గీ॥ సకల కల్యాణ భూషణ ♦ సహితమైన చారు లక్షణ భద్ర కుం ♦ జరము నెక్కి
యక్బరు సభాభవనమున ♦ కరుగుదెంచె భిల్లుఁడును పల్లకీ నెక్కి ♦ వెంటరాఁగ. 187
ఉ॥ అంతటఁ దూర్యముల్ మొరసె! ♦ నక్బరు భిల్లునితోడ డిగ్గి య
భ్యంతరమందుఁ జొచ్చె! దొర ♦ లందఱు నిల్చి నమస్కరించి! రం
తంతనె వారి వందనము ♦ లందుచుఁ జేరెను సింహపీఠి; దు
ర్దాంతరవం బెలర్పఁగ బి ♦ రంగు లనేకము వ్రేలె నయ్యెడన్. 208
గీ॥ దుద్దుఁగంబడి బుజముల, ♦ దుడ్డుఁగఱ్ఱ కరమున, నెసంగు గంభీర ♦ కాలమూర్తి!
భిల్లుఁడు వసించె నొకదొడ్డ ♦ పీటపైన వేదికాంతమం దక్బరు ♦ విభుఁడు చూప. 209
క॥ చుక్కలలోఁ జంద్రునివలె నక్కజముగ వెలిఁగె నక్బ; ♦ రందఱు దొరలున్
గ్రిక్కిరియుచుఁ గూర్చుండిరి; చక్కఁగ సభదెసను బాదు ♦ షా కనుఁగొనుచున్,
సీ॥ "అఖిలసేనాధీశు ♦ లార! సామంత నృపోత్తంసులార! యు ♦ ద్యోగులార!
యిది మహాసుదినమా! ♦ నిపు డనంతానంద మలరించు దొడ్డకా ♦ ర్యంబు జరిగె;

---

greater even than Akbar himself in as much as the conquest of the hearts and minds of millions of men and women effected by the poet was an achievement infinitely more lasting and important than any or all of the victories gained by the monarch... The second place after Tulsi-Das is accorded by unanimous consent to Sur-Das, the blind bard of Agra. He is said to have excelled in all styles.

§ Khwaja Abdus Samad, the most notable artist at Akbar's court in the early years of the reign...enjoyed much influence at court. His skill of eye and hand was so marvellous that he is recorded to have written on a poppy seed the much venerated chapter 112 of the Koran, which is reported to be worth a third of the whole book. "Akbar the great Mogul.

నా మహోదివ్యహ ♦ ర్షాంశంబుఁ దెలుప మి మ్మాదట రమ్మంటి ♦ నాదరమున;
నాజీవితమున నిం ♦ తటి యమూల్యసువార్త నింతవఱకుఁ దెల్పి ♦ యే నెఱుంగ;

గీ॥ నందఱును నాలకించి యా ♦ నంద మొందుఁ"డనుచు నంగ రేకునను దా ♦ టాకుఁ దీసి
"యిందలి పవిత్రవార్తల ♦ నిపుడె చదువు" మనుచు లేఖఁ బృథ్వీరాజు ♦ నందఁ జేసె.

మ॥ వినయం బేర్పడ జాబు దోసిటను బృ ♦ థ్వీరాజు చేకొంచు దా
నిని వీక్షించుచు రాతిబొమ్మకరణిన్ ♦ నిల్చుండె; నక్బర్ విభుం
డనురాగోత్సుకచిత్తుఁడై "సుకవిరా ♦ జా! యేటి కట్లుంటివో!
వినిపింపన్ దగుఁ గాదె! లేఖ" యనఁ బృ ♦ థ్వీరాజు మో మెత్తుచున్, 212

సీ॥ "ఆస్థానవాటియం ♦ దడుగిడినది మొద లారోగ్య మొకరీతి ♦ ననువుపడదు;
కన్నులు పచ్చనై ♦ కానరా! వీ తాళపత్ర మించుక కావఁ ♦ బడునె; కాని
యక్షరం బొకఁడైన ♦ నగపడ; దిట్టి దుస్థితి నివేదింపంగ ♦ సిగ్గు దోఁచె"
నన "శ్రమ మేటికి! ♦ ననువుగాఁ గూర్చుండి కొంతకుఁ గొంత వి ♦ శ్రాంతి నొందుఁ"

గీ॥ డని వచించి యక్బ ♦ 'రబ్దూరురహిమాను' వదనసీమ దృష్టి ♦ పఱపి "మీరు
జాబు నందఱు వినఁ ♦ జదువుం"డనఁగ దాని నతఁడు గొనుచు నిలువ ♦ యవనపతియు:

క॥ "మీరును జదువఁగఁ దొరకొన! రూఱక యేమిటికి నిలిచి ♦ యుండెద! రిపుడే
ప్రారంభింపుం" డన, నబ్దూరహిమానుండు వినయ ♦ భూషణుఁడగుచున్, 215

సీ॥ "పదినాళ్లుగా జ్వర ♦ బాధచే నారోగ్య మనువుగా నుండ లే; ♦ దైనఁ నీదు
నాజ్ఞ యనుల్లంఘ్య ♦ మగుట నెట్టులొ కష్టపడి సభాస్థలికి నే ♦ వచ్చినాఁడ;
గొంచెముకాలంబు ♦ గూడ నిల్వఁగ నాకు శక్తి లేకున్నది; ♦ సత్య మిపుడు
దేవరకడ నివే ♦ దించితి" నని విన్నవింప నక్బరు నేత ♦ వెత వహించి

గీ॥ యేలముందె తెల్పకపోతి ♦ రీవిధంబు! నుఱక సభకు రప్పింపక ♦ యుండి యుందు!
నైన నిపుడేమి! చతురంత ♦ యానమెక్కి యింటి కరుగుఁడు! శ్రమమంద ♦ నేలయిచట!

ఆ॥ త్వరగ వెడలుఁడనఁ బ్ర ♦ థానమంత్రియు "నిప్పు డింటి కరుగఁజాల! ♦ నిందె కొంత
సేపు విశ్రమింపఁ ♦ దాపంబు తగ్గు! విచారపడకుఁ" డనుచుఁ ♦ గూరుచుండె. 216

క॥ అనఘుం డక్బరు తనకరమున లేఖను గొనుచు ముఖము ♦ ఫుల్లాంబురుహం
బును గేర మధురకంఠ స్వనమున 'వినుఁ' డనుచు సభను ♦ జదువఁగఁ దొడఁగెన్.

"అక్బరు నృపాలకా!

స్వస్తి! ♦ యవధరింపు!
మొదలెఱపిలేని యుద్ధంబు ♦ లెసఁగె; భుజముఁ
దనువు పాల్పడె! విశ్రాంతిఁ ♦ గోనఁ దలంతు;
నోడఁబడుదువేని యార్శ్నలల్ ♦ గడువు చాలు;
వైరి వ్యయ్యూనుదారభా ♦ వమ్ము గలన్న;
నన్నెఱుంగుదు! వెఱుగుదు ♦ నైతికమ్ము!
హితము యోజించి, నీమతం ♦ బెల్లొ తెలుపు!
తప్పక మెలంగు నట్లు..........

ప్ర ♦ తాపసింగు."

సీ॥ అనుచు విశ్వములోని ♦ యవనీశ్వరులయందు నగ్రగణ్యస్థాన ♦ మాక్రమించు
నా పవిత్రశిశోది ♦ యాన్వయాంభోరాశి రాకాసుధాకర ♦ ప్రచురమూర్తి,
ధన్యుండు రాణాప్ర ♦ తాపసింహనృపేంద్రుఁ డాఱుమాసంబులు ♦ వ్యవధిఁగోరెఁ;
నతని ప్రస్తుతపరి ♦ స్థితులెల్ల విషమమై పరిణమించినయట్టి ♦ సరణి తోఁచె;
గీ॥ నచిరకాలమునకు ♦ నామహాభాగుండు సంధి కరుగుదెంచు ♦ జాడ తోఁచు;
నంబరీశు మేటి ♦ యసమప్రియత్న మీ యానుకూల్యములకు ♦ నాస్పదంబు. 219
సీ॥ అకలుషానందదా ♦ యకమైన కల్యాణవార్తను మీకుఁ దె ♦ ల్పంగఁగోరి
యుండఱ నీదిన ♦ మాస్థానమునకును జేర్చితి"ననుచు వ ♦ చించు నంత
"సంధియుఁ దప్పక ♦ జరగుఁబో"మ్మని కొంద, "అతఁడు లోఁబడు సత్య" ♦ మనుచుఁగొంద
"ఆ 'జలాలుద్దీను' ♦ హరిహరాదులుగూడ నాపంగనేర్తురే!" ♦ యనుచుఁ గొంద
గీ॥ "ఆ ప్రతాపుని దశసహ ♦ స్రాశ్వపతిగఁ జేయుఁ"డని కొందఁ ఱెత్తుగాఁ ♦ జేతులెత్తి
యాసభాభవనములోన ♦ నన్నికడల లోకులును మిన్నుముట్టంగఁ ♦ గేక లిడిరి. 220
గీ॥ అంత నక్బరునృపమౌళి ♦ "యవును! వారు మైత్రి పాటింతురని తోఁచె ♦ మా"కటంచుఁ
⊛ బృథ్వీరాజుఁ జూచుచు "నేటి ♦ కిట్లు నిల్తు! లేల కూర్చుండ!" రని పల్కఁ ♦ బృథ్వీరాజు,

---

⊛ He adored the very name of Pratap and the intelligence filled him with grief. With all the warmth and frankness of his nature he told the king it was a forgery of some foe to the fame of the Rajput Prince. "I know him well" said he "for your crown he would not submit to your terms. He requested and obtained permission from the king to transmit by his courier a letter to Pratap, ostensibly to accertain the fact of his submission, but really with a view to prevent it.

"Annals of Mewar."

—* అక్బరుసార్వభౌమునితో లేఖ ప్రతాపసింహునిదిగాదని పృథ్వీరాజు నివేదించుట. *—

గీ॥ "సేవకుఁడ నేను; నాస్వామి ♦ వీవు; నాకుఁ దెలిసినంత నీకడ నివే ♦ దించుటయును
ధర్మమగు! విన్నవింతుఁ; బ్ర ♦ తాపసింహ కర లిఖిత లేఖ యిది కాదు! ♦ కాదు! కాదు!

గీ॥ అనుల కైలాసశైల శృం ♦ గమునకన్న రమ్యతరమైన యామహా ♦ రాజు కీర్తి
నైపఁ జాలని యొంగర్భ ♦ శత్రుఁ డెవఁడో యిట్లు కల్పించి లిఖియించె ♦ నిది నిజంబు!

సీ॥ ప్రాణప్రతిష్ఠ స ♦ ద్భక్తితో నొనరించి, యమృతాభిషేకంబు ♦ నలవరించి,
కోటి కొక్కఁడు తెచ్చు ♦ కుసుమంబు లర్పించి, సాంబ్రాణి వాసనల్ ♦ సంతరించి,
పూర్ణ నైవేద్యంబు ♦ ముందుంచి యర్పించి, కర్పూరపు టారతుల్ ♦ కాన్క లొసఁగి,
మంత్రపుష్పము పెట్టి, ♦ మమత నాత్మప్రదక్షిణనమస్కారస ♦ త్క్రియలు దీర్చి,

గీ॥ భక్తుఁ డెట్టులు నాత్మదై ♦ వతముఁ గొలుచు నట్లుస్వాతంత్ర్యమును గొల్చు ♦ నా ప్రతాపు
డతని గళమునఁ గొనయూపి ♦ రాడుచున్న నీకు లోఁబడు ననుమాట ♦ నీళ్లమూట.

సీ॥ బ్రహ్మవిద్యామహా ♦ తత్త్వరహస్య మెఱిఁగిన యుత్తమోత్తమ రాజ ♦ యోగిమౌళి,
హరిహరబ్రహ్మదు ♦ లడ్డువచ్చిన సుంత వెనుదీని భువనైక ♦ వీరమూర్తి,
పదునాల్గులోకముల్ ♦ ప్రతిఘటించినఁ బట్టుదల మానని భగీర ♦ థ ప్రభుండు,
తవిలి మార్కొన్న మే ♦ రువునైనఁ బాదుతోఁ బెకలించు దుర్దమ ♦ పృథుబలుండు,

గీ॥ చంద్రసూర్యులు గతిదప్పి ♦ చనిన నాత్మవైభవముఁ గోలుపోని యా ♦ భానుకులుఁడు
శ్రీఁవొఱఁగితానుగా నీదు ♦ చెలిమి కోర నిలయుఁ గుర్రింగెనె! యంభోధు ♦ లింకిచనెనె!

గీ॥ ఢిల్లితో మొగల్ సామ్రాజ్య ♦ మెల్లఁగొనుచు స్వయముగా నీవుపోయి త ♦ చ్చరణయుగళి
మును భజించెద నంచు ప్రమొ ♦ క్కనుగాని తగులఁ డాతండు వామపా ♦ దమున నేని.

సీ॥ తౌరుష్కనృపమహా ♦ స్థానవాటికలోన నిందలు దొరలు నేఁ ♦ డిట్లు చేరి
తనకమ్మఁ బరికించి ♦ తగునంచు నీపట్టపగలి ట్లభిప్రాయ ♦ పడిరటంచుఁ
దెలిసెనేని ప్రతాప ♦ దేవుని కోమల దివ్యచిత్తం బెన్ని ♦ దిశల నొగిలి
జాలినొందునో తెల్పఁ ♦ జాల; నక్బరటన్న నతనికిఁ గొంత మ ♦ ర్యాద యుండె;

గీ॥ నక్కట పరేంగితజ్ఞాన ♦ మణువుగూడ లేదె! విపరీతవర్తనుల్ ♦ వీరలంచు
నమ్మహాత్ముండు తలపోయు; ♦ నతనిమదిని నున్న మర్యాదయును గూడ ♦ నూడిపోవు."

ఆ॥ అని వచింప నతని ♦ యంబుదగంభీర భాషణములు విని స ♦ భాజనంబు 228
లబ్బురంబు నొందిః ♦ రక్బరు నవమంద హాస రోచియగుచు ♦ నతనిఁ జూచి,

—*) అక్బరుసార్వభౌముఁడు పృథ్వీరాజునకు బదులు చెప్పుట. (*—

సీ॥ "ఆమహామహుఁడు పు ♦ ణ్యస్వరూపుఁడటంచు, భువనైక వీరపుం ♦ గవుఁడటంచు,
నర్కవంశనృపాల ♦ కావతంసంబంచు, ననుపమ శుద్ధవ ♦ ర్తనుఁడటంచుఁ,
గొలఁదిమీఱిన పట్టు ♦ దల గలవాఁడంచు, నసమానధైర్య హే ♦ మాద్రియనుచు
నాశలేని యమాను ♦ షానందపరుఁడంచుఁ, బ్రతిలేని యీశ్వర ♦ భక్తుఁడనుచుఁ,
గీ॥ గ్రమ్మఁకొను బహుళాపదా ♦ ర్ణవములందుఁ గడిమి తగ్గని నెఱయీఁత ♦ కాఁడటంచు,
నే నొకఁడ నేల! యీదేశ ♦ మెల్ల భువన మెఱిఁగి యెఱిఁగి వేనోళుల ♦ నెపుడు మెచ్చు.

గీ॥ సర్వమంగళోదారప్ర ♦ శస్తమూర్తి శ్రీప్రతాపు స్వాతంత్ర్యల ♦ క్ష్మిస్వరూప!
తల్లి పాళేశ్వరీదేవి ♦ ధైర్యమహిమ శిశువు లాటలలోఁ బ్రశం ♦ సించు మంద్రు. 230

గీ॥ ఆమహీంద్రుపై నెంత మ ♦ ర్యాదగలదొ పల్లకీ నెక్కి వచ్చి స ♦ భాస్థలమున
వేదిపై హేమపీఠిపై ♦ వెలసియున్న వననివాసియా యాభిల్ల ♦ వరుఁడు సాక్షి! 231

క॥ వీరకుటుంబం బగును మహారాణాగారి దనుచు ♦ నొఁదల యూఁపన్
నేరనివాఁ డిలపై మన నేరని వాఁడందు; నిజము ♦ నిజ మిది యెందున్. 211

క॥ ఉన్నదిదె తాటియా; కిం దున్నది నృపగురుని వ్రాత; ♦ యున్నది తుది వ్రాఁ;
లున్నాఁడు భటుఁడు; పనియే మున్నది లేదనఁగ, లేని ♦ దున్న దనంగన్! 212

గీ॥ తన్నునిపె మహారాణాప్ర ♦ తాపసింగు జాబు నాకియ్య ననుచు నొ ♦ సంగె దీని
బొంకనఁగ నెట్టిదో దాని ♦ పుట్టుఁగని మంచి మనసున్న యీభిల్ల ♦ మధురమూర్తి.

క॥ "ఇందు నసత్యం బుండదు! సందేహము వాయదేని ♦ శబరభటుని మీ
రిందఱిలో నడుగుం" డన సందియ్యాక పృథ్వీరాజు ♦ "శ్రమ మేమిటికిన్! 235

క॥ ఈలేఖకిఁ దఁ దవిలిన వ్రాలునకును సత్యమైన ♦ వ్రాలున కెంతో
పోలిక గల దంతియ; యీవ్రాలును నృపగురుని దనుచుఁ ♦ బలుకఁగఁ జాలన్. 215

క॥ వివరం బిది; యీభిల్లుని నెవఁడేనియుఁ బంపియుండు! ♦ నీకాలమునం
దివి క్రొత్తలె! ధన మున్నను భువనంబులు మార్పవచ్చుఁ ♦ బో! నిమిషమునన్. 237

గీ॥ అంత యేటికి! దేవర ♦ యనుమతింపఁ బరమవిశ్వాసియైన సే ♦ వకునిఁ బంపి
యరయువాఁడ నిందలిసత్య; ♦ మంతదాఁకఁ గమ్మ నమ్మకయుండుదు ♦ గాక మీఁదు."

—*) మానసింహుఁడు ప్రతాపసింహునిగూర్చి తేలికగా మాటాడుట. (*—

క॥ అని బలము నిగుడవచియించిన వదనం బెత్తి మాన ♦ సింహుండు "ప్రతా

పన్నగపతియెడ నాకును దీరని వైరంబుంట యంద ♦ ఱకు విదితంబే! 239

క॥ అతఁ డతిలోకబలోన్నతుఁ డతులితవిక్రమనిధానుఁ ♦ డలఘుత్యాగా
న్వితుఁడనుట సూర్యదేవుం డతితరతేజస్స్వరూపుఁ ♦ డనుటయ కాదే! 240

క॥ ఇనచంద్రులు గతిదప్పినఁ దనస్వాతంత్ర్యంబు విడక ♦ ధైర్యంబున డీ
కొని కోటివిపత్తులు గోటను మీటెడు ధీరుఁడని దృ ♦ ఢమ్ముగ నెంతుర్. 241

గీ॥ ధైర్యశౌర్యాదిగుణసము ♦ దాయమునకుఁ దగ్గనిది పెంకెతన మాత్ర ♦ తాపుసంమఁ!
గానిచో నందఱట్లు సౌ ♦ ఖ్యమున మనక యూపిరాడని రణముల ♦ నేపుచెడునె! 242

సీ॥ "అఖిలదేశాధీశుఁ ♦ డగు మహమ్మదుజలాలుద్దీను సాహాయ్య ♦ మొదవియుండ,
నుదయపర్వతమునం ♦ దుండి యస్తాద్రిమేరకుఁ గల్గు సకల గో ♦ త్రాధరంబు
నెదిరి లేకుండ జ ♦ యించిన నావంటి పటుపరాక్రమశాలి ♦ ప్రతిఘటింప,
మానవమాత్రులే ♦ రైన నింతటికన్న నిమిషంబు తలయెత్తి ♦ నిలువఁజాల;

గీ॥ రిడకే పాదుషాగారి ♦ తోడి పోరు తలమునుకలౌచుఁ బడియెఁ బ్ర ♦ తాపుమీఁద;
నాతఁ డొంతకాలమొ యింక ♦ నని యొవర్పఁ బూనఁ; డీయాస మఱి కల ♦ లోని బాస.

సీ॥ మేవాడరాజ్యల ♦ క్ష్మి యనాథయయ్యె! దుర్గమదుర్గనివహముల్ ♦ గాలిఁ గలిసె!
భాండారములు పటా ♦ పంచలై చెడిపోయె: సేనాబలం బెల్ల ♦ శిథిలమయ్యె!
సామంతనృపు లన్య ♦ సీమల కేగిరి! బంధుసంతానంబు ♦ పలుచనయ్యెఁ!
దల దాఁచుకొన నింత ♦ నెలవును గఱవయ్యెఁ! గట్టుగుడ్డలు పేలి ♦ కలుగఁ జిరిగెఁ!

గీ॥ గడుపు మలమలమాడె! బిం ♦ కంబు లూడె! బలము సుడిసె! స్వాతంత్ర్యపి ♦ పాస లెడసె!
నిట్టి నిరుపేద యని సేయ ♦ నెంచునేని యతని సంరంభ మెల్ల స ♦ న్న్యాసిపెండ్లి.

చ॥ అడిగెను నేఁటి కీవ్యవధి ♦ ప్రాణము వోవక; నాఱుమాసముల్
గడువఘ్న చూడుఁ; డీగడువు ♦ కాలము దాఁటకమున్నె పాదుషా
యదుగుల వ్రాలి తా నవిన ♦ యం బొనరించిన జాడఁదెల్పి క్రమొ
క్కడి; నివి లోకమందుఁ బరి ♦ కించిన చర్యలె; నేఁడు క్రొత్తలే!" 245

క॥ అను మానసింహు మాటలు విని నంత నొకింత వంత ♦ పెరుగఁగ స్వాంతం
బునఁ బృథ్వీరా జడఁపంగనులేక సభాజనంబుఁ ♦ గలయఁగఁ గనుచున్, 246

—*) పృథ్వీరాజు మానసింహుని మాటలను ఖండించుట. (*—

శా॥ "ఏమో! నాకటువంటి భావము రవం ♦ తేనిన్ మదిన్ లేదు! వి

శ్వామేయప్రకట ప్రతాపుఁడు ప్రతా ♦ పాధీశుఁ డాబూగిరి
స్వామిన్ గా కొరు మొక్కఁ డప్డు! శతల ♦ క్షల్ వీరయోధుల్ సమి
ద్భూమిన్ ముట్టినఁ గెంజివుళ్లటు శిరం ♦ బుల్ గిల్లివైచున్ జుమీ: 247

సీ॥ గోచిపాఁతయు లేని ♦ కుంభసంభవుఁడు సముద్రముల్ ద్రావె నా ♦ పోశనముగ;
బడుగయ్యు మఱి వసి ♦ ష్ఠుఁడు గాధిసుతు సేన బ్రహ్మదండమున లో ♦ పలికిఁ గొనియెఁ;
బ్రహ్లాదుఁ డైదేండ్ల ♦ ప్రాయంపువాఁడయ్యు విశ్వంబు నెల్ల స్తం ♦ భింపఁజేసె;
సంగముల్ లేనివాఁ ♦ డయ్యుఁ బంచశరుఁడు పూవుటమ్ముల లోక ♦ ములు జయించె;

గీ॥ నాత్మబలము ప్రధానమై ♦ యలరుఁగాని యుపకరణములఁ బనియేమి ♦ యుత్తములకు!
లేమి యున్న, సాయంబేమి ♦ లేకయున్న, నాప్రతాపుఁ డధ్యాత్మ ♦ సత్వప్రభుఁడు.

గీ॥ అకట! యతఁ డేడ! నీ వేడ! ♦ యక్బ రేడ! యమరగిరి కణువునకున్న ♦ యంతరంబు!
జగము తలక్రిందయినఁగాని ♦ జరుగఁబోవ దాప్రతాపుఁడు లొంగుట" ♦ యని వచించె.

గీ॥ పులకితశరీరులౌచు నాఁ ♦ డలల నూఁపు దొరల తలల రుమాలులు ♦ వఱలె నపుడు;
కమ్మతెమ్మెర గ్రమ్మ వృ ♦ క్షములతుదల గునిసియాడెడు క్రొవ్విరి ♦ గుత్తు లట్లు. 250

సీ॥ "మానసింహనృపాల! ♦ మనము పృథ్వీరాజు విన్నపంబును ద్రోసి ♦ వేయఁబోల;
దిట నుండు వారిలో ♦ నితఁ డొక్కఁడే మహారాణాప్రతాపు గా ♦ రాపుఁజుట్టు;
మితఁ డప్పు డప్పు డా ♦ యినకులస్వామి దర్శన మొనరించిన ♦ చనువుకలిమి
నామహామహు భావ ♦ మన్నియంశంబులయెడ నెక్కుడగురీతి ♦ నెఱిఁగియుండు;

గీ॥ నింత కితఁడు తొందరమాని ♦ యెల్ల కార్య గతుల దీక్ష మాలోచింపఁ ♦ గాఁ దగు ననెఁ;
మనకు మాత్ర మిప్పటికి మిం ♦ చినది గలదె! విడియఁ దోఁపని చంపుండు ♦ తడియఁదోఁచు!

గీ॥ ఎదిరి వాదమ్మునకుఁదగు ♦ నెన్నివసతు లన్నియు నొసంగి సత్యంబు ♦ నరయు టుచిత!
మాత్ర మేమిటి కిపు" డని ♦ యవననృపతి దృష్టిమార్చి పృథ్వీరాజు ♦ దెసనుగాంచి,

ఉ॥ "నీవు వచించుమాట గణ ♦ నీయము: యట్టులె నీకు నిష్టమా
కైవడి నమ్మ నేర్చిన యి ♦ కానొక సేవకుఁ బంపి, యాజగ
త్పావనసత్త్వుండగు ప్ర ♦ తాపుని భావ మెఱింగి, మాకు నా
యావివరంబులన్ దెలుపు ♦ మందలి సత్యము రూప మేర్పడన్. 253

గీ॥ 'అంతదాఁక మేవాడపై ♦ నరుగరాదు మొగలు సైన్యంబు' లని నేను ♦ ముదలసేతుఁ;
బనులు చాలింతమిపు" డని ♦ పలికి లేచి సభ ముగియఁజేసె; నంతదుం ♦ దుభులు మ్రోసె.

—*) పృథ్వీరాజు భిల్లుని దోడ్కొని తన యింటి కరుగుట (*—

సీ॥ కుండంబునుండి ది ♦ క్కులనిండ నగ్నికణంబులు చెదరు చం ♦ దంబు దోఁప,
సైన్యాధినాథు లా ♦ స్థానరంగము వీడి యాత్మమందిరముల ♦ కరిగి రపుడు;
రాజమార్గమున న ♦ గ్రస్థానమున నిజగృహము జేరఁగఁబోయెఁ ♦ బృథ్వీరాజు;
ద్వారసీమ కతని ♦ భార్య జోషీబాయి స్వర్ణకుంభంబున ♦ జలము దెచ్చి
ఆ॥ పాదయుగము గడిగి ♦ పై చెఱంగునఁ దడి యార్చె; లోని కిరువు ♦ రరిగి రపుడు;
పావనానురాగ ♦ బద్ధ శోభన రాజహంస దంపతులను ♦ ననుకరించి. 255

గీ॥ "ఆఱుమాసముల్ విశ్రాంతి ♦ యవసరమని పాదుషాకడ కీభిల్ల ♦ బటుని బంపె
నాప్రతాపదేవుం" డని ♦ యతనిఁజూపెఁ బృథ్వీరాజు; జోషీబాయి ♦ వెతఁ గలంగె. 255

సీ॥ "ఏమంచు నీకిచ్చె ♦ నీకమ్మ! రాణాప్రతాపేశ్వరుం" డంచు ♦ ధవుఁడు నుడువ,
"వ్రాయునప్పుడు కమ్మ ♦ వ్రాయుపైఁ దద్భావ మెట్టులుండె!" నటంచు ♦ నింతియడుగు;
"నామహామహుముఖం ♦ బంత నొచ్చినయట్లు కనుపించెనే!" యంచుఁ ♦ గాంతుఁడనఁగ;
"బాలేశ్వరీమాత ♦ ప్రభుఁడు లేఖ లిఖించు కతమెఱుంగునె!" యంచు ♦ నతివ పలుకు;
గీ॥ "భక్తమణి సలుంబ్రాస్వామి ♦ పాయ కెపుడు విభునిగొల్చునె" యనిభర్త ♦ పృచ్ఛసేయఁ,
"గసరుమొగ్గలు మాతల్లి ♦ కాన్పులడవి కాకలకుసుస్రిక్కురో" యంచుఁ ♦ గాంతయడుగు.

ఉ॥ "చెప్పుము చిత్తమిచ్చి యిదె ♦ శ్రీనృపలోకజగద్గురుండు మా
యప్ప ప్రతాపదేవుని ము ♦ ఖాంబురుహంబునఁ జంద్రబింబమా
దొప్పెడి వెన్నెలట్లలరు ♦ నుత్తమహా దరహాసరేఖ తా
నెప్పటియట్ల పాయక ర ♦ హించుచు నుండునె! భిల్లశేఖరా!" 258

క॥ అని మఱియు మఱియు నయ్యంగనయును బతి యొత్తియడుగఁ ♦ గా భిల్లుండున్
దనమది కుదురుపఱచి కల్గిన సంగతు లెల్లవారి ♦ కిన్ వినిపించెన్. 259

సీ॥ "తొలిదినంబునఁ జీఁక ♦ టులు క్రమ్మువఱ కాజి విడక రేఁగె" నటన్న ♦ వెత వహించు;
"దినరాత్రములు రెండు ♦ తిండిలేక కుటుంబ మలసిపోయె" నటన్నఁ ♦ గళవళించు;
"గాలియు వాన జ ♦ గత్ప్రళయము రేఁప నఁబికె" నన్నను మది ♦ నుమ్మలించుఁ;
"బిల్లి రొట్టెను నాఁచి ♦ బిడ్డకొమ్మను జీల్చిపోయె"నంచు వచింపఁ ♦ బొక్కిపోవు;
గీ॥ "రాజగురుసార్వభౌము వ ♦ జ్రంపుగుండె కఱకుసెకి మెత్తవడి వ్రాసెఁ ♦ గమ్మ" యనిన
వేఁడినిట్టూర్పు వుచ్చి యా ♦ పృథ్వీరాజు లేమ కన్నీటి మున్నీటి ♦ లో మునింగె. 260

సీ॥ "తపనీయ ఘటిత సుం ♦ దరమందిరములున్నఁ, బలురకంబుల నుప ♦ వనములున్నఁ
మదనోపమానుఁడై ♦ మన్నించు మగఁడున్న, దాసీజనంబు వం ♦ దలుగనున్నఁ,
జెన్నిధులనుమీఱు ♦ విత్తసంపదయున్నఁ గరమరుదైన భో ♦ గంబులున్న,
వలువలు నగలు రా ♦ సులు రాసులుగనున్నఁ, దమమాట వేదమై ♦ తనరుచున్న
గీ॥ మాటవినఁ గష్ట మిప్పటి ♦ మానవతులు; తినఁగఁ గట్టఁగ లేక కా ♦ ననము వెంట
నాథు దేవునివలెఁ గొల్చె; ♦ నాదుపెద్ద తల్లిఁబోలిన సాధ్వీమ ♦ తల్లి గలదె! 261
గీ॥ జగములోని వీరులును రా ♦ జన్యవరులు గొలువ విశ్వోన్నతుండునై ♦ యలరవలయు
తండ్రి పడుపాట్ల కకట! యం ♦ తంబె లేదె!" యని కలంగి జోషీబాయి ♦ యడలువడియె.
గీ॥ తనకుల సుధాంబురాశి పూ ♦ తమ్ముసేయ నవతరించిన పద్మాల ♦ యావతార
యలఘుసాధ్వి జోషీబాయి ♦ యడలు చూడరాదనుచు సూర్యుఁ డపరవా♦రాశి డాసె.
సీ॥ పలురంగులీను పు ♦ వ్వులచే నలరి మందిరము వెన్కనొక్కయా ♦ రామ మలరు;
నారామమున వట్టి ♦ వేరులతోఁ గప్పఁబడి యొక్క చలువ చ ♦ ప్పరము దనరు;
నద్దాని నడుమఁ గ ♦ మ్మోసనములు కొన్ని వాని నడుమ నొక్క ♦ బల్ల యుండె;
మొకమాలు వలువ సొం♦పులుగులుకఁ బైన; బ్రాంతకుఁ దగ్గ యన్ని సా♦ధనములుండె;
గీ॥ నంతఁ బృథ్వీరాజొక విశా ♦ లాసనమున బల్లముందుఁ గూర్చుండి ని ♦ ల్వెల్ల దీర్ఘ
యోజనల మున్గి కొంతసే ♦ పుండి పిదపఁ గరమునను గాగితంబును♦గలముఁ గొనియె.

—*) ప్రధానమంత్రి యబ్దూరహిమాను పృథ్వీరాజును దర్శింప వచ్చుట. (*—

గీ॥ అంత సేవకుఁ డరుదెంచి ♦ "యగ్రమంత్రిగారు విచ్చేసి"రన వెళ్లి ♦ గారవించి
ప్రక్కవాఁకిటఁ జలువచ ♦ ప్పరమునందుఁ జేర్చి తానును జెంత నా ♦ సీనుఁ డయ్యె.
క॥ "పదినాళ్లుగ నారోగ్యము కుదురుగ లే దనుచు మీరు ♦ కొలువునఁ దెలుపన్
మదిఁ జింతవడితి; నెటు లున్నది! యి" ట్లని పృథ్వీరాజ ♦ నంగ సచివుఁడున్, 266
సీ॥ "అచటి విశేషంబు ♦ లన్ని మీకెఱిఁగింపవలెననియే యిట్లు ♦ వచ్చినాఁడ;
భానుకులస్వామి ♦ వ్రాసిన యాలేఖ నవలోకనముచేయు ♦ నంతమాత్ర,
నామహామహుఁడు లో ♦ కైకాగ్రపీఠంబు డిగ్గి యక్బరుకుఁ జే ♦ యొగ్గునట్టి
దుస్థితి యేర్పడెఁ; ♦ ద్రోవ యింక లేదె యని నాకు మనసులో ♦ మనసు లేదు;
గీ॥ కమ్మఁ జదువఁగ మది జాలి♦క్రమ్ముకొనుచుఁ "బదిదినంబులు బాధించె♦జ్వర" మటంచుఁ
బలికి తప్పుకొంటిని: గాని ♦ బాధ గలుగ; దెప్పటట్ల నాకారోగ్య♦మొసఁగియుండు.

సీ॥ పుట్టినప్పటినుండి ♦ బొంకన్న నెట్టిదో దానిరూప మొకింత ♦ యే నెఱుంగ;
నామహారాజు వ్రా ♦ యంగలేక వ్రాయు నా కష్టగర్భితలేఖఁ ♦ గాంచి నపుడు
నాసత్య మెట్లు పా ♦ డై సమసిన మానె, ననృతంబు పలికి నే ♦ నాచరించు
ద్రోహంబు లేదని ♦ తోఁచి, యెట్టులో కష్టమున 'జ్వరం'బని నేను ♦ బొంకినాఁడ;
గీ॥ ననృతదోషంబునైన ధై ♦ ర్యమున నోర్తు; నామహాభాగు మదిని దై ♦ న్యమున కోర్వ
లే” నటంచు నబ్దూరహీ ♦ మానుఁ డనఁగఁ, బ్రీతి యుట్టిపడంగ, నా ♦ పృథ్వీరాజు,
సీ॥ “ఆనందమయ్యె మా ♦ యారోగ్యవార్తకు; నాకమ్మ సభను నే ♦ నంది చూడఁ,
బదములక్రింద భూ ♦ భాగ మట్టులె క్రుంగి పాతాళమున కేగు ♦ పగిదిఁ దోఁచెఁ;
వీరాధివీర ని ♦ త్యారాధ్యదేవతా క్షత్రతేజోమయ ♦ స్వర్ణమూర్తి
యవనిని బొరలునే ♦ యని, పెండ్లిపందిరి కుప్పఁగూరఁగ ధాత్రిఁ ♦ గూలునె యని,
గీ॥ దేవ! నాపరితాపంబు ♦ దేవుఁ డెఱుఁగుఁ; గమ్మఁ బరికింప దగ్గుత్తి ♦ కయి జనించి
యింత మాట రాదయ్యె; నే ♦ నేమి సేయరాక, నటె నిల్చిపోతి, ఱా ♦ ప్రతిమ భాతి.
ఉ॥ అమ్మహనీయు గౌరవము ♦ నంతయొ యింతయొ తగ్గఁజేయు నా
కమ్మ నొకింతయుం జదువఁ ♦ గా మన సించుక లేక “నాదు నే
త్రమ్ములు పచ్చనయ్యె; లిఖ ♦ తమ్ముఁ గనుంగొన లే” నటం చస
త్యమ్మొకఁ డడ్డు వెట్టి యెటొ ♦ తప్పుకొనంగను గంటిఁ గొల్వునన్” 270
క॥ అన, లేనగ వాకయందము ననువుపటప నెమ్మొగమున ♦ కబ్దూరహిమా
నును “జిట్టచివరఁ జక్కని పని చేసితి రందఱును నె ♦ బాసని మెచ్చన్. 271
ఉ॥ ‘ఈకడఁ గమ్మ బొం’ కనుచు ♦ నేర్పడ దెల్పి నిజాప్తభృత్యులో
నైకగురూత్తముం దరియ ♦ నంపఁగ నక్బరునేగ సమ్మతిన్
గైకొనివచ్చి గొప్పయవ ♦ కాశముఁ గూర్చితి రిట్లు; విస్మయై
కాకరమైన నీదు సమ ♦ యస్ఫురణంబు నుతింప నొప్పెదన్.
సీ॥ అవిరళత్యాగంబు ♦ నకలంకవర్తన స్వాతంత్ర్యశక్తి దే ♦ శమునభక్తి
సౌజన్యయుక్తి నా ♦ జనపాలకులవాళి సకలభారతయోగి ♦ చక్రవర్తి;
కనవు రొట్టెలు స్ఫటి ♦ కంపునీరముఁ గొంచుఁ గామధేనువుభంగిఁ ♦ గ్రోలు; నతని
నాదర్శమూర్తి యో ♦ గ్యతఁ బెంప వారు వీరన కందఱకును బా ♦ ధ్యత మొసంగు;
గీ॥ హృదయమున వీరరసమున్న ♦ నెవ్వఁడైన దేవపూజాగృహమున నా ♦ ధీరు విగ్ర
హము నిలిపి మూఁడువేళల ♦ నర్చ సేయు టర్హమను సూక్తి యాదు లే ♦ దతిశయోక్తి.

గీ॥ ఆశిశోదియా వంశ దు ♦ గ్దాబ్ధిచంద్రు చరణములు పూజ సేయ వి ♦ జ్ఞప్తి వ్రాసి
తీసికొనివచ్చినాఁడ నే; ♦ దీనిఁ జదివి వలయు మార్పులు గావింప ♦ వలయు" ననిన,

గీ॥ "అయ్య! నీకమ్మ కన్నుల ♦ నద్దుకొనుచుఁ జదివి హర్షింపఁగల యదృ ♦ ష్టంబె చాలుఁ;
గమ్మతావుల వీచు నీ ♦ కవనమునకు మెఱుఁగులను గూర్పఁజాలు నే♦ర్పరులు గలరె!"

గీ॥ అనుచుఁ బృథ్వీరాజు విశేష ♦ హర్ష మలర సచివు విజ్ఞప్తి పత్రంబు ♦ చక్క విప్పి
విడివిడిగ ముత్తియములట్లు ♦ వెలయుచున్న కమ్మయందలి ప్రత్యక్ష ♦ రమ్ము చదివె.

సీ॥ తూఁచియుంచిన మాడ్కిఁ ♦ దోఁచు శబ్దంబుల హాయికి మదిలోన ♦ నలరి యలరి,
సరస స్వభావపే ♦ శల మనోభావంబు లచ్చొత్తినట్లుండ ♦ మెచ్చి మెచ్చి,
యాత్మావబోధర ♦ హస్యాంశములు నిండి యుబుకుటఁ గని తల ♦ యూఁచి యూఁచి
ప్రసరించి నిలువెల్ల ♦ రసముట్టిపడునట్టి ఘట్టంబులను జూచి ♦ కరఁగి కరఁగి,

గీ॥ భారతీయగౌరవము కా ♦ పాడుమనుచు భక్తి వెదచల్లుచో మోద ♦ బాష్పతతులు
వెల్లువలుగట్టి దూఁక, నా ♦ పృథ్వీరాజు హర్ష జలరాశిఁ దేలి నీ ♦ రై స్రవించె. 277

ఉ॥ "ఎంత మహానుభావులరొ! ♦ యెంత తపం బొనరించినారొ! దు
ర్దాంతపరాక్రమాంకుఁడు ప్ర ♦ తాపమహీంద్రు పదాబ్జయుగ్మమం
దెంతటి భక్తిభావము వ ♦ హింతురొ! వేయును నేల! లేఖ యా
ద్యంతము సద్రసస్ఫురణ ♦ మంది సుధన్ గురియించుచుండెడిన్. 278

ఉ॥ ఈరచనావిశేషమును ♦ నిందలి త్యాగము వీరపూజయున్
గూరుచునట్టి మోదమున ♦ కున్ గలిగించెడు దేశభక్తికిన్
బారము లేదు; నిక్కముగ ♦ భారతదేశచరిత్రమం దలం
కారవిశేషమౌచుఁ ద్రిజ ♦ గంబులు మెచ్చి నుతింప నొప్పెడిన్. 279

గీ॥ ఒక్కవ్రాలున్న నిది దేవ♦యోగ్యమగుచు వెలయు"నని పృథ్వీరాజనఁ♦బ్రెగ్గడయును
"ననఘ! యాలోపమును దీర్చు♦నట్టి భార మిపుడు మీపైన నుండు; వ్రాలిడఁగవలయు"

మ॥ అని పల్కన్ విని పృథ్వీరాజు "సచివేం♦ద్రా! నీమనోవీధి సం
జననం బౌ మృదుభావసంపదలు ను♦త్సాహమ్మునన్ జేర్చి కూ
ర్చిన యీయుత్తమలేఖకున్ జివర మీ ♦ శ్రీనామధేయంబు నుం
చినచో శీర్షముపైఁ గిరీట మిడు నా ♦ చెల్వంబు దీపించెడున్. 281

క॥ అమలమయి, లోకవిఖ్యాతము నౌచు, గురుత్వమందు ♦ త్వన్నామసువ
ర్ణమయాక్షరముల లేఖాంతమునన్ శోభిల్లఁజేయు ♦ ధన్యప్రవరా!" 282

చ॥ అని వచియించునంత వద ♦ నాంబురుహంబున వింతభావముల్
మనుకొని తోఁప, నా సచివ ♦ ముఖ్యుఁడు మోమును వాల్చి "లోకపా
వనసుచరిత్రుఁడైన యల ♦ భానుకులేంద్రు కటాక్షవీక్షణం
బున కిసుమంత పాత్రమగు ♦ పోఁడిమి గల్గునె నన్ను బోంట్లకున్! 283

సీ॥ ఇనకులేశ్వరుఁడు నే ♦ నెవ్వఁడ ననుమాట గూడ నెఱుంగని ♦ క్రొత్త వాఁడ;
నార్ష మతవిరుద్ధ ♦ మైన మహమ్మదీయకులంబునను జన్మ ♦ మందినాఁడ;
భారతదేశంబు ♦ వాఁడఁ గాను; ప్రతాపభూరమణునకును ♦ దూరగుండఁ;
బరమశత్రుండంచు ♦ వారు భావించు నక్బరుపాదుశాహికిఁ ♦ బ్రియమంత్రి;

గీ॥ నామహాత్ముని దొడరిన ♦ యాపదలకు నంతయో యింతయో హేతు ♦ వైనవాఁడ;
గాన నీకమ్మ నాసంత ♦ కమ్మ మోపఁ గాదు; నాకట్టి భాగ్యయో ♦ గంబు లేదు. 284

ఉ॥ ఆరవివంశ్యమౌళి జగ ♦ మంతకుఁ బూజ్యుఁడు నాకు; నన్నుఁబోల్
క్రూరతురుష్కవ్రాలుఁ గని ♦ కోపము నొందునొ యేఁమొ; శాంతి వి
స్తారము తన్మనం బెరియు ♦ జాడఁ బ్రవర్తిలఁజాలఁ నెన్నఁడున్;
క్షీరఘటంబునన్ విషముఁ ♦ జిల్కెడు కిల్బిషచిత్తు లుందు రే!

మ॥ తలఁతున్ నే నొకరీతి సుస్థిరముగాఁ ♦ దద్దర్శన స్పర్శనం
బులు లేకున్నను నీభవంబున జగ ♦ త్పూజ్యంబులౌ తత్పదం
బుల ధ్యానింపుచు, దివ్యనామము జపం ♦ బున్ జేయుచున్, గాలమున్
దొలఁగన్ ద్రోయుదు నేని ధన్యుఁడనటం ♦ దున్; లేవుపో లోపముల్. 286

క॥ రాజకులోద్భవుఁడవు కవిరాజవు, మఱి బంధుతావి ♦ రాజితుఁడవు, రా
రాజుహితుఁడవు, వేఱగు యోజన లేమిటికి! వ్రాల ♦ నుంపుము వేగన్." 287

క॥ అనఁ బృథ్వీరాజు తనమనమున నాతని భక్తిభావ ♦ మున కాశ్చర్యం
బును బొంది "సచివశేఖర! నినుఁ గొని యాడంగ నెవరు ♦ నేర్తురు! ధరణిన్, 288

సీ॥ విశ్వోన్నతంబైన ♦ వీరపూజాసక్తి, తనివోని యసమాన ♦ దైవభక్తి,
సముదారభవ్యపే ♦ శలహృదయంబును, బరిశుభ్రమగు నార్ష ♦ వర్తనంబు,
సర్వసమత్వ ని ♦ శ్చల దివ్యభావంబు, స్తుతిసేయఁదగినట్టి ♦ మతసహనము,
సకలదిగంత వి ♦ శ్రాంత భూరియశంబు, స్వాంతంబు నిండ ద ♦ యారసంబు,

గీ॥ నలరు ఘనుఁడవు: యవనుఁడ ♦ వైన నేమి! యుత్తమోత్తమభారతీ ♦ యుఁడవు; నీవు
వ్రాయు నీకమ్మ నాప్రతా ♦ పక్షితీంద్రుఁ డాదరించుఁ దప్పక" యన, ♦ యవనమంత్రి,

గీ॥ "కులముఁ దలఁపక గుణ గణం ♦ బులు గ్రహించు జ్ఞానఖని, నిత్యసాత్త్విక ♦ చక్రవర్తి!
యతనిమదిఁ దావుగలదె కో ♦ పాంకురమున; కకట! యెఱుఁగక యాడితి ♦ నంతెగాక.
సీ॥ అతికష్టమగు పరి ♦ స్థితులందు భక్తిరసోద్బుద్ధమైన యీ ♦ యుక్తలేఖ
నామహామహుని ది ♦ వ్యాభిధానంబె యాద్యంతంబు వర్ణితం ♦ బగుట, నిదియు
భారతఖండంబు ♦ భావిచరిత్రలో నతులితాగ్రస్థాన ♦ మాక్రమించు,
నట్టి యుత్తమలేఖ ♦ యందు నా వ్రాలుంట యసమాన పరమ భా ♦ గ్యమ్ము నిజము;
గీ॥ భక్తిమెయి నిందు వ్రాసిన ♦ పద్యమాల భువనగురునకు విరజాజి ♦ పూల మాల
యగుచు, హృదయమెక్కి కృతార్థ ♦ మయ్యెనేని మనల మించు ధన్యులు లేరు ♦ క్ష్మాతలమున.
క॥ సామాన్యాహారం బది స్వామి యెదుర నుంపఁబడి ప్ర ♦ సాద మగు నటుల్,
పామరుఁడ యవనుఁడను నా నామ మతనిఁ జేరి పావ ♦ నం బగుఁ గాతన్. 292
గీ॥ ఆత్మధర్మంబు నెంచి కా ♦ ర్యంబు నెంచి, యన్నిఁటిని మించు నాపర ♦ మాప్తమిత్రు
లైన మీయాజ్ఞ నెంచి నా ♦ స్వాంత మిపుడు వ్రాలిడుటె యుక్తమంచు ని ♦ ర్ణయమొనర్చె."
గీ॥ అనుచు, వ్రాలుంచెఁ; బృథ్వీరా ♦ జట్లు చేసి, దాని నదికించి, "రాణాప్ర ♦ తాపసింహ
దేవునకుఁ, గైలవారాప్ర ♦ దేశ" మనుచుఁ బైన లిఖియించి, యాభిల్ల ♦ భటునకిచ్చె.

—*) భిల్లుఁడు డిల్లీపురము వీడివచ్చుట. (*—

ఆ॥ పలురకముల తిండి ♦ బండాలముల తోడఁ, గంబళమునఁ గట్టు ♦ కమ్మ తోడఁ,
బైనఁ గురియుచుండు ♦ పలు దీవనల తోడఁ, దరలె భిల్లుఁ డురు ము ♦ దంబుతోడ.
ఆ॥ "అల్లవాఁడె భిల్లు ♦ డంట; యక్బరుశాహి యోలగమునఁ గూరు ♦ చుండె నంట;
నాప్రతాపు దూత ♦ యఁట యితం"డని, మేడ లెక్కి నిక్కి చూచి ♦ రంతులెల్ల.
క॥ శ్రావణమాసము ముదిరెను! మేవాడ్దేశమున నభము ♦ మేఘాకీర్ణం
బై వాన లలముకొనె! హారావళి విడి ఢిల్లిఁ జేర ♦ నరిగిరి యవనుల్. 297
శా॥ అంతన్ రాగమెలర్ప భిల్లపతి డా ♦ యన్ వచ్చి "హారావళీ
ప్రాంతారణ్యము వీడి రయ్యరులు! సం ♦ గ్రామంబునున్ నిల్చె! వి
శ్రాంతిన్ జెందఁగ నాదు గూడెమునకున్ ♦ రమ్మంచుఁ గొంపోయెదు
ర్దాంతప్రాభవు నాప్రతాపుని సభా ♦ ర్యాపుత్ర సైన్యంబుగన్. 298
గీ॥ రచ్చపట్టునఁ బెనురచ్చ ♦ మ్రానికింద శబరపతి కృష్ణసింగు పా ♦ ర్శ్వముల నుండ
దుర్జయుఁడు లోనుగాఁ గల్గు ♦ దొరలు చుట్టుఁ గొలువఁగఁ బ్రతాపుఁ డొకనాఁడు ♦ కొ
లువు చేసె.

గీ॥ ఆమడయు నొక్కయడుగుగా ♦ నరుగుదెంచి మోము ముసిముసినగవుల ♦ మురువు గులుక
భిల్లుఁ డధిపులకును బ్రణ ♦ మిల్లి భక్తి దనరఁ గమ్మఁ బ్రతాపుప ♦ దముల నుంచి,

సీ॥ "ఎకిమీఁడ! పాదుషా ♦ కిచ్చెఁ గమ్మ! యాతని యరుసం బింత ♦ యనఁగఁ జెల్ల!
దూరు సింగారించె! ♦ నొడఁగూర్చె నొకపెద్దసభ! కమ్మ నందిచ్చి ♦ చదువు మనియెఁ!
బృథ్విరా జదిచూచి ♦ వెనుక కిచ్చెను! పెద్దమంత్రి గొని చదువ ♦ మానెఁ! దురక
రేఁడు తానె చదివెఁ! ♦ బృథ్విరాజు "ప్రతాపనృపుఁ డిట్లువ్రాయఁబోఁ! ♦ ఇది యెవరిదో"

గీ॥ యని పలికె! నక్బ "రొకబంటు ♦ నంపి నిజము నరయు"మనెఁ! బృథ్విరాజును ♦ నగ్రమంత్రి
యిరువు రేకాంతముగఁ గూడి ♦ యిట్లు జాబు వ్రాసి శ్రీపాదములు చేరఁ ♦ బంచినారు."

ఆ॥ అనుచు మ్రొక్కి నిలిచె! ♦ నందఱు మౌన ముద్రా విముద్రితాస్యు ♦ లై వెలింగి!
రాప్రతాపుఁడంత ♦ నా సలుంబ్రాస్వామిఁ గాంచెఁ! గృష్ణసింగు ♦ కమ్మఁ దీసి, 302

—*) ప్రతాపసింహునకు డిల్లీనుండి వచ్చినలేఖ. (*—

⊕ సీ॥ మేవాడ రాజ్యల ♦ క్ష్మీ భారధౌరేయ పరిణాహి దక్షిణ ♦ బాహుదండ!
కమలబాంధవ వంశ ♦ కలశపారావార సంపూర్ణ రాకా తు ♦ షారకిరణ!

---

⊕ The hopes of the Hindu rest on the Hindu; yet the Rana forsakes him. But for Pratap, all would be placed on the same level by Akbar, for, our chiefs have lost their valour and our females their honour. Akbar is the broker in the market of our race; all has he purchased but the son of Oodah; he is beyond his price. What Rajput would part with honor for nine days (Norcza); yet how many have bartered it away? Will Chittor come to this market, when all have disposed of the chief article of the Khetri? Though Putto has squandered away wealth, yet this treasure has he preserved. Despair has driven many to this market to witness their dishonour; from such infamy the descendant of Hamir alone has been preserved. The world asks, whence the concealed aid of Pratap? None but the soul of manliness and his sword; with it well has be maintained the Khetri's pride. This broker in the market of men will one day be over-reached: he cannot live for ever; then will our race come to pratap, for the seed of the Rajput to sow in our desolate lands. To him all look for its preservation, that its purity may again become resplendent.

"Annals of Mewar."

It is no affectation to say that the spirit evaporates in the lameness of the translation. The author could feel the force, though he failed to imitate the strength of the original.

"Colonel James Tod."

బప్పరాయాన్వయా ♦ భరణ! దుర్మదవైరి తామిస్ర చండమా ♦ ర్తాండమూర్తి!
స్వాతంత్ర్యపూజ్యరా ♦ జ్యరమా స్వయంవరాస్థాన సింహాసన ♦ సార్వభౌమ!
గీ॥ భవ్య భారతదేశ సం ♦ భావనీయ సన్మత స్థాప నాచార్య ♦ సకల బిరుద!
స్థిరతరపరాక్రమక్రమా ♦ జేయ విమత భూప గజరాజ సింహ! ప్ర ♦ తాపసింహ!
గీ॥ శ్రీలఁ దనరారు విశ్వదే ♦ వాలయమున నలఘు మేవాడ గర్భాల ♦ యంబులోన
వెలయు నర్ధేందుకోటీర ♦ విగ్రహంబ వనఘ! నీపాదములకు జో ♦ హారు లివిగో!
గీ॥ గజము చర్మంబుఁ జిచ్చుఱ ♦ కన్నుఁ బూప చంద్రుని రేక కైలాస ♦ మందు విడిచి
భరతఖండంబు నుద్ధరిం ♦ పఁగ జనించు ధూర్జటివి నీవు; రాజమా ♦ త్రుఁడవు గావు.
గీ॥ సత్వభరితుండవై నిత్య ♦ సత్యమూర్తి వగుచు ననవరతాత్మోప ♦ హారముల నొ
సంగి స్వాతంత్ర్యమును గొల్చు ♦ జ్ఞానరాశి! నీవు దైవస్వరూపమ ♦ వే! నిజంబు. 306
గీ॥ జగము గొనియాడు స్వాతంత్ర్య ♦ సౌధమునకు వజ్రసోపానపంక్తులు ♦ పఱచు చున్న
నీ యశోవైభవముల వ ♦ ర్ణింతురి నిర్జరాంగనలు స్వర్ణమయవీణ ♦ లాలపించి. 307
ఉ॥ తావక ధర్మయుక్తియు ను ♦ దార యశంబును దేశభక్తి హా
రావళి యొందుగాక భర ♦ తావని యొక్కఁడుగాక యింక నీ
స్థావర జంగ మాత్మకము ♦ సర్వజగంబును వేయినోళ్ళ సం
భావనసేయుటల్ చెవుల ♦ పండువుగా వినుచుందు మెప్పుడున్. 308
గీ॥ పుష్పరాశినిఁ బడు వహ్ని ♦ పోల్కిఁ, బాలఁ బడిన విసముట్లు, కంటిలోఁ ♦ బడిన ముల్లు,
నటు హఠాత్తుగ నీకమ్మ ♦ యట్టివచ్చి స్వాంతములు వ్రచ్చెఁ; గొండంత ♦ వగపు దెచ్చె.
మ॥ ఘనసౌభాగ్యము లూడి భారతమహా ♦ ఖండంబు దాస్యాంధకా
రనిమగ్నంబయి యుండ, 'లోకముల దౌ ♦ ర్భాగ్యంబులున్ దీఱె నేఁ'
డని హర్షింపఁ బ్రతాపభానుఁ డుదయం ♦ బై యుండె; మానుష్యకృతం
బున లేమబ్బులు సోఁకి చాటుపడునే ♦ మో యంచు నొచ్చెన్ మనుల్. 310
సీ॥ "సప్తపారావార ♦ సంవృతాఖిలమహీవలయ మేల" నటంచు ♦ వగవ వెపుడు!
"ధనధాన్యవసనవా ♦ హనకోటి బొత్తుగా లే" దంచు మదిలోనఁ ♦ గ్లేశపడవు!
పార్వతీసతిఁబోలు ♦ పాటేశ్వరీదేవి పడు కష్టములకునై ♦ యడలఁబోవు!
బాలచంద్రికళల ♦ వంటి బిడ్డలు తినఁ గూడు లేదని వంతఁ ♦ గుంద వెప్డు!
గీ॥ దనఘ! వాతాంబుపర్ణాశి ♦ వయ్యు నిఖిల భువనములు గెల్వఁదగు వీర ♦ మూర్తివీవు!
కటకటా! నీవు పంపిన ♦ కమ్మలోని జాలియగు పల్కు విని గుండె ♦ వ్రీలె మాకు. 311

క॥ "తొలఁగెను విభవము; రాజ్యము తొలఁగెను; సిరి తొలఁగె; హితులు ♦ దొలఁగి" రటంచున్
గలఁగకుమీ! దేవునిదయ నెలకొన్నను విశ్వమెల్ల ♦ నీయదె సుమ్మీ. 312

గీ॥ తెగని కష్టంబు లలము నీ ♦ దేశమందు వెలికి యుబికి నీసత్త్వమే ♦ వెలుఁగుఁగొంత!
కనులు గట్టు మబ్బులు గ్రమ్మ ♦ కాళరాత్రిఁ దళుకు తళుకని మెఱయు సౌ ♦ దామనివలె.

గీ॥ క్షత్రధర్మంబు క్రుంగి నా ♦ శనము నొందె; బీరువోయె వర్ణాశ్రమా ♦ చారవిధులు;
భారతత్రాణమున కాది ♦ పద్మనాభుఁ డిపుడు నీరూపమున జన్మ ♦ మెత్తినాఁడు.

గీ॥ భరతఖండంబులోని భూ ♦ పాలగణము లసమబాహాసమగ్రి వీ ♦ ర్యమును, సతులు
మానమును, గోలుపోయి; రీ ♦ మాట మేము దేవ! నీమ్రోల నెటు వివే ♦ దింతు మిపుడు!

గీ॥ తనదు నేల్బడిసంత హైం ♦ దవమహత్త్వమ్మక రంతయుఁ గొను ద్రోహ ♦ యడితికాఁడు!
మమ్ముఁ గొనెఁ; గాని సంగ్రాము ♦ మనుమనిఁ గొను పెద్ద నాణెముల్ వెలితిగా ♦ విన్నవోయె!

⊕ మ॥ నవరాత్ర్యుత్సవవేళ వేడుకలలో ♦ నన్ రాజపుత్రాన్వయుం
డెవఁడైనన్ దనయాత్మగౌరవ భరం ♦ బింతేని రక్షించుకొం

---

⊕ The allusion of the princely poet in the phrase 'bartering their honour on the Noroza' requires some explanation. The Noroza or 'New years Day' when the Sun enters Aries, is one of great festivity among the Muhammadan princes of the East. But of that alluded to by Prithwi-Raj we can form an adequate idea from the historian Abul-Fazl.

It is not New year's Day but a festival especially instituted by Akbar and to which he gave the epithet Khoosroz 'day of pleasure' held on the ninth day (Noroza) following the chief festival of each month. The court assembled and was attended by all ranks. The Queen also had her court, when the wives of the nobles and of the Rajput vassal princes were congregated. But the Khoosroz was chiefly marked by a fair held within the precincts of the court, attended only by females. "The merchants' wives exposed the manufactures of every clime, and the ladies of the court were the purchasers. "His majesty is also there in disguise, by which means he learns the value of merchandise, and hears what is said of the state of the empire and the charactor of the officers of government." The ingenuous Abul-Fazl thus softens down the unhallowed purpose of this day; but posterity cannot admit that the Great Akbar was to obtain these results amidst the Pushto-jargon of the dames of Islam, or the mixed Bhaka of the fair of Rajasthan. These 'ninth day fares' are the markets in which Rajput honor was bartered and to which the brave Prithwi-Raj makes allusion.

చవమానంబును బొందకుండెడిని! క ♦ ట్టా! చిత్తురుఁ ధాత్రి ధ
ర్మవికాసంబును బాపి యంగడుల న ♦ మ్మఁగ దెత్తువే! నేఁటికిఁ. 317

చ॥ లలిత కళా విలాస శబ ♦ లంబగు చిత్రముఁ గాంచి యొక్కఁ డం
దలి యసమాన నైపుణి కె ♦ దఁ గఱఁగుఁ; మఱియొక్కఁ డందు 'రం
గులు నునుఁగుంచె గుడ్డయును ♦ గూలియు నిం'తని నిర్ణయించెడుఁ
వెల; యెవఁ డిం దభిజ్ఞుఁ డన ♦ భిజ్ఞుఁ డెవండో జగం బెఱింగెడుఁ. 318

గీ॥ ఈవు విశ్వప్రపంచమం ♦ దీశ్వరుని యనంత లీలాగతులు గొని ♦ యాఁడె దెపుడు;
విలువ గట్టుచు రాజ్యంబుఁ ♦ గొలుచు నక్బ; రెవరిగొప్పతనం బెంతొ ♦ యెఱుఁగు జగము

---

It is scarcely to be credited that a statesman like Akbar should have hazarded his popularity or his power, by the introduction of a custom alike appertaining to the Celtic races of Europe as to these the Goths of Asia and that he should seek to degrade those whom the chances of war has made his vassals, by conduct so nefarious and repugnant to the keenly cherished feelings of the Rajput, yet there is not a shadow of doubt that many of the noblest of the race were dishoured on the 'Noroza,' and the chivalrous Prithwi-Raj was only preserved from being of the number by the high courage and virtue of his wife, a princess of Mewar and daughter of the founder of the Suktawuts. On one of these celebrations of the Khoosroz the monarch of the Moguls was struck with the beauty of the daughter of Mewar, and he singled her out from amidst the united fair of Hind as the object of his passion. It is not improbable that an ungenercus feeling united with that already impure, to despoil the Sesodias of their honor, through a princess of their house under the protection of the sovereign. On returning from the fair, she found herself entangled amidst the labyrinth of apartments by which egress was purposely ordained, when Akbar stood before her, but instead of acquiescence, she drew a poniord from her corset and held it to his breast, dictating, and making him repeat, the oath of renun. ciation of the infamy to all her race. The anecdote is accompanied in the original with many dramatic circumstances. The guardian Goddess of Mewar the terrific 'Mata' appears on her tiger in the subterranean passage of this palace of Pollusion, to strengthen her mind by a solemn denunciation and her hand with a weapon to protect her honor. Rai-Singh the elder brother of the princely bard, had not been so fortunate, his wife wanted either courage or virtue to withstand the regal temptor and she returned to their dwelling in the desert despoiled of her chastity, but loaded with jewels; or as Prithwi Raj expresses it "She returned to her abode tramping to the tinkling sound of the ornaments of gold and gems on her person, but "where, my brother!' is the moustache on thy lip!'

"Annals of Mewar."

సీ॥ భౌతికధనము స ♦ ర్వముఁ గోలుపోయిన, రవివంశజనన గౌ ♦ రవ ధనంబు,
నభిమానధనము, లో ♦ కాతీత విక్రమ ధనమును స్వాతంత్ర్య ♦ ధర్మధనము,
కడు సమృద్ధంబుగాఁ ♦ గలవాఁడవనుచు నీ దివ్యయశం బెల్ల ♦ దిశల మ్రోసె;
నిట్టి మర్దమశక్తి ♦ యెటనుండి వచ్చె నీకని జగం బెల్లప్పు ♦ డడుగుచుండు;
గీ॥ నసి యొకఁడెఁ దోడు నీడ నీ ♦ కద్వితీయ ధైర్యసారంబె నీపాలి ♦ దైవమనుచు
హర్ష బాష్పంబు లురల మా ♦ యట్టివార లాడుకొను మాట లగునో ని ♦ రర్థకములు!
గీ॥ స్త్రీలఁ బురుషుల రాజ్యంబు ♦ దేశమెల్ల విలుచు నీ యక్బరను గొప్ప ♦ విలువకాఁడు;
బ్రహ్మకల్పంబుగా ధాత్రి ♦ బ్రదుకఁ; డంద అపుడు పునరుద్ధరింప ని ♦ న్నాశ్రయింత్రు.
గీ॥ కులము గుణమును చూడ కీ ♦ క్షోణిజనుల కలుషము లడంచి నిత్యని ♦ ర్మలతఁ బెంచు
జాహ్నవియుఁ బోలె యవనసం ♦ సర్గదోష మడఁచి పునరుద్ధరింప యో ♦ గ్యుఁడవు నీవు!
సీ॥ కానియు మొదలు ల ♦ క్షలుఁ గోట్లు రాసులు రాసులై పెరిగిన ♦ ద్రవ్యములును,
బూరిగుడిసె మొదల్ ♦ గా రమ్య నవరత్న భర్మ నిర్మిత మహా ♦ భవనములును,
బంటు మొదలు సర్వ ♦ పార్థివవర్గముల్ పదము గొల్చెడు సార్వ ♦ భౌమపదవి,
బడుగుగుఱ్ఱము మొదల్ ♦ ప్రబలాజిసాధన సన్నద్ధ చతురంగ ♦ సైన్యములును,
గీ॥ గాలవాహినిలోఁ బడి ♦ కడలిఁ గలియుఁ; బేదవడి బెండుదేలియుఁ ♦ బెంపు సెడని
కర్మవీరుని స్వాతంత్ర్య ♦ ధర్మరతుని యశ మొకఁడె శాశ్వతజ్యోతి ♦ యై వెలుంగు.
ఆ॥ సూదిబెజ్జమందు ♦ శుండాలములదండు చొచ్చి వెలికిఁబాఱ ♦ వచ్చునేమొ!
భాగ్యభోగరతుఁడు ♦ పరమేశ్వరుని కూర్మి నొంద లేఁడు; సౌఖ్య ♦ మంద లేఁడు.
గీ॥ మొగిలు మేసెడుకొండ కా ♦ పురము! శిలలు సింహపీఠముల్! పులులు నె ♦ చ్చెలులపిండు!
లారఁబండిన పండు లా ♦ హార! మిట్టు లేది యెటు లున్నను గొఱంత ♦ యేది నీకు!
సీ॥ "శ్రమించు నీదు ద ♦ క్షిణబాహుదండమే దిక్కింక భారత ♦ దేశమునకు;
నమృత మొలుకు నీక ♦ టాక్షమే యింక నీహైందవులకు జీవ ♦ నౌషధమ్మ;
బెద రెఱుంగని నీదు ♦ హృదయమే భారతస్వాతంత్ర్యలక్ష్మి కా ♦ స్థానవాటి;
తావకనామమే ♦ దాస్యాంధకారమ్ముఁ బోఁదట్టు దివ్యభా ♦ నూదయంబు;
గీ॥ నీస్వరూపంబె పరదేవ ♦ తాస్వరూప" మనుచు జగమెల్ల నినుఁ గొని ♦ యాడి కొలుచు!
నీవె విశ్రాంతిఁ గోరుచుఁ ♦ జే విడిచిన నున్నదే! త్రోవ, భారతా ♦ భ్యుదయమునకు!
సీ॥ తలచూపరాక వా ♦ సలు ముంచుకొనినట్లు యావనప్రళయంబు ♦ లాక్రమింపఁ
స్త్రీల పాతివ్రత్య ♦ దీక్ష పూరుషుల క్షాత్ర మడంగ శశిసూర్య ♦ ధామ మట్టు;

ఏకార్ణవంబైన ♦ యీ విపత్సమయమం దీ విశ్వమున కెల్ల ♦ నీ వొకండవె
ప్రళయంబు సోఁకక ♦ వటపత్రశాయియౌ పురుషోత్తమునిరీతి ♦ స్థిరత నిలిచి!

గీ॥ ఇపుడు పసిచెడ్డ సకలధా ♦ త్రీశహృదయ వాటి స్వాతంత్ర్య బీజముల్ ♦ నాటెద వని
యనఘ! మాకుండె బ్రహ్మాండ ♦ మంతయాస! కట్ట! యొనరింతె నట్టేటి ♦ పుట్టిమునుక!

గీ॥ బరువుపడ కిన్ని యేండ్లు కా ♦ పాడినాఁడ వనఘ! స్వాతంత్ర్య కనక గ ♦ ర్భాలయమునఁ
బ్రజ్వరిల్లు నఖండ దీ ♦ పమ్ము; నిపుడు కొండ యెక్కింతువే! కను ♦ గూర్కి దేవ! 328

గీ॥ పొడమి తోడనె యడఁగు బు ♦ ద్బుదమువోలె నరుని జీవితము క్షణభం ♦ గురము సుమ్ము;
శ్రమ కడలి దేశ మంధకూ ♦ పమునఁ ద్రోయు పాప మొడిగట్టుకొనకు ప్ర ♦ తాపదేవ!

ఉ॥ చాలని కాలమై చరణ ♦ సన్నిధిఁ జేరి వచింపలేని మా
జాలిని దేవుఁడే యెఱుఁగుఁ; ♦ జక్కఁగ విప్పి వచింపలేము; నీ
కాలను ముల్లు గ్రుచ్చినను ♦ గంటను గ్రుచ్చిన యట్లు నొప్పితోఁ
దూలి యొనర్చు విన్నపముఁ ♦ ద్రోయకు! పాయకు వీరమార్గముఁ! 330

సీ॥ కడలెల్ల నిండఁ జు ♦ క్కలు రాలఁగాలేదు; కులశైలశిఖరముల్ ♦ కూలలేదు;
గ్రహకోటి సంచార ♦ గతులు మాఱఁగలేదు; గగనంబు వ్రయ్యలై ♦ పగులలేదు;
భూదేవి పాతాళ ♦ మునకుఁ గ్రుంగఁగను లే; దేడు సముద్రంబు ♦ లింకలేదు;
పవమానశక్తి స్తం ♦ భన మొందఁగాలేదు; వహ్ని తేజము చల్లఁ ♦ బడఁగలేదు;

గీ॥ విరిసి బ్రహ్మాండభాండంబు ♦ వ్రీలలేదు; భువన మేకార్ణవంబయి ♦ మునుఁగలేదు!
ధైర్యహేమాద్రి రాణాప్ర ♦ తాపదేవుఁ డాఱుమాసముల్ విశ్రాంతి ♦ గోరె నేల! 331

గీ॥ నీయశోగానమునఁ జిక్కి ♦ నిఖిలజగము చొక్కి; నానంద మందిరి ♦ సురలుగూడ;
సత్ప్రయత్నంబు! క్షణము వి ♦ శ్రాంతి వలదు! తండ్రి! మ్రోయింపు విడక స్వా ♦ తంత్ర్యభేరి!

గీ॥ ఉదయగిరిపైన రవి కూరు ♦ చుండునట్టు లల్ల హారావళీ పర్వ ♦ తాగ్రసీమఁ
గొలువు దీఱెడు నీమూర్తిఁ ♦ గొలుచు జగము; నీకు స్వాతంత్ర్యరాజ్యాభి ♦ షేకమగుత.

గీ॥ సంగర తరంగ సంక్షుభి ♦ తాంగమగుచు నలముకొనియున్న బహువిప ♦ దబ్ధియందుఁ
జిక్కి చెదరక చిక్కక ♦ సేమమునను నడచెదును గాక యుష్మదా ♦ నందనౌక.

సీ॥ నీకటాక్షవిలాస ♦ నియతి యాక్షితికిఁ గల్యాణ తోరణరాజి ♦ యగును గాక!
ముందు రాఁగల కాల ♦ మందు 'స్వాతంత్ర్యదైవత' మంచు నీపేరు ♦ వఱలుఁగాక!
మూఁడువేళల జగం ♦ బున వీరులందు నీ కగ్రపూజాస్థాన ♦ మలరుఁగాక!
భారతీయులు హృద ♦ బ్జములందు నీమూర్తిఁ జేర్చి యెల్లప్పుడు పూ ♦ జింత్రుగాక!

గీ॥ మాత బాణేశ్వరి చిరసు ♦ మంగళియయి యచలరాజాత్మజాభిధాన ♦ నలరుఁగాక!
యతులితారోగ్య భోగ భా ♦ గ్యములతోడ నర్కకులదీప! నీకు బ్ర♦హ్మాయు వగుత!

గీ॥ భవదుదాత్తవృత్తము త్యాగ♦వైభవంబు మాయదిని గొల్పు భక్తి,యీ♦మాడ్కి యవన
నృపు ఋణముఁగూడ మఱపించి♦నిన్నుఁ గొలువఁ బురికొలిపె; సాహసమని త♦ప్పరయకయ్య!

ఆ॥ నీపదాబ్జయుగము ♦ నిరతంబుఁ గొలుచుచు భక్తిగల విధేయ ♦ వర్తనమున
నలరువార; మిట్టు ♦ 'లబ్దూరురహిమాను-పృథ్వీరాజు'లనఁ జ ♦ రింతు మెపుడు." 337

క॥ అని చదివి సలుంబ్రాపతి మనమునఁ నుదయించు భక్తి ♦ మాహాత్మ్యమునన్,
గనుఁదోయి నొత్తుకొని లేఖను విభు పాదములు సోఁకఁ ♦ గా నిడి మ్రొక్కెన్. 338

క॥ అచ్చటి యందఱ మనములు విచ్చి ముఖాబ్జముల నిండ ♦ వింతగు మోదం
బచ్చుపడి హర్ష బాష్పము లెచ్చెంగఁ బ్రతాపదేవుఁ ♦ డెల్లరఁ గనుచున్. 339

మ॥ "నెల దాటంగను జొచ్చె నక్బరునకున్ ♦ నేలేఖ నంపించి; యీ
నెలగా నక్కట! సూర్యవంశము దెసన్ ♦ నేరంబుఁ గావించి నిం
దలపాలైతి నటంచుఁ బల్మఱును జిం ♦ తన్ గుందితిన్; గాని యా
కలఁతల్ సర్వము దీర్చి హర్ష భరమున్ ♦ గల్గించె నీ లేఖయున్. 340

గీ॥ శత్రుపురమున యావనా ♦ స్థానసీమ నింత నిష్పాక్షికమనస్కు ♦ లింత సుగుణ
భరితు లుండుట యిప్పుడే♦యెఱిఁగి, యింత వఱ కెఱుఁగనైతినే! యంచు♦వగచుచుంటి

మ॥ తన సత్కీర్తికి భంగమౌ గతిని స్వా ♦ తంత్ర్యంబుఁ బోనాడి క్రాం
తినిఁ గాంక్షించెఁ బ్రతాపుఁడంచు వగ సం ♦ ధిల్లంగ నాపృథ్వీరా
జును నబ్దూరహిమానుఁ డీయిరువు రి ♦ చ్చో జ్ఞానదీపంబు పెం
పునఁ నజ్ఞానతమంబుఁ బాపుచు యశం ♦ బున్ బెంచి రెంతేనియున్. 342

మ॥ స్మరణీయంబగు వారి సాయము; కృత ♦ జ్ఞత్వంబుఁ బాటించి త
చ్చరితంబుల్ స్మరియింపకున్న ఋణ మీ ♦ జన్మంబునన్ దీఱ; దా
హారిభట్టారకు పేరువెన్కఁ గడు పు ♦ ణ్యాత్ములౌ వీరి యి
ద్దర నామంబులె యుత్తమోత్తమ పదం ♦ బున్ బొంది వాసిన్ గనున్. 343

క॥ మఱవఁ దగదు; వీరు చిరస్మరణీయు" లటంచుఁ బలుక ♦ సంతోషము పొం
పిరిపోవ సలుంబ్రాధీశ్వరుఁడును మది భక్తిభావ ♦ వైభవ మలరన్, 344

—*) సలుంబ్రాకృష్ణసింహుఁడు డిల్లీలేఖను గొనియాడుట. (*—

క॥ పరు నుద్యోగులు, మనతో దుర మొనరింపంగ వలయు ♦ దొర లయ్యును, న
క్బరు వీడి మిమ్ముఁ గొలిచిరి గురుతుల్యు లటంచు నెంచు ♦ కొందుము మాకుఁ.

క॥ ద్యుతిమంతమయి జగద్వందితమయి యీదివ్యలేఖ ♦ దేవార్పణపా
వితమగు కర్పూరపు హారతివోలెఁ బవిత్రమై వి ♦ రాజిలుచుండెఁ. 346

క॥ హృద్యములై, యనుభవసం పాద్యములై, సరళ సరస ♦ పాక కళా సం
వేద్యములై, లేఖను గల పద్యములు పదార్థగౌర ♦ వంబునఁ దనరుఁ. 347

క॥ మావంటి సేవకులు సంభావించి పఠించి దినము ♦ పారాయణముఁ
గావింపఁ దగినవై కడుఁ బావనమై వెలుఁగు నిచటి ♦ పద్యచయంబుల్. 348

చ॥ పదిలముగాఁగ నీదు పద ♦ పంకజభక్తి మనంబులోపలఁ
మెదలెడి వారిలోన నను ♦ మించిన భక్తుఁడు లేఁడటంచు నా
మొదలిటినుండియుఁ గరువ ♦ ముల్ మది నుండెను; నిప్పు "డెందఱో
గదర మహానుభావు'లను ♦ కైవడి నా కెఱుఁగంగ నయ్యెడిఁ. 349

క॥ విజ్ఞాపన మిద్దానిని నాజ్ఞాపత్రముగ నెన్ను ♦ దాదులు గొని మా
యజ్ఞాన ముడిపెదము బ్రహ్మజ్ఞమణీ! దీని నొసఁగి ♦ మమ్మేలఁగదే!" 350

క॥ అనుచుండ భిల్లపతి యాతనిఁ గాంచుచు "భక్తియోగ ♦ ధర్మరహస్యం
బును మిమ్ముఁబోలె నెఱిఁగిన మనుజుఁడు లేఁ"డనచు రాజ ♦ మణిఁ గన్గొనుచుఁ, 351

సీ॥ బాధ్యతగల గొప్ప ♦ పదవి తౌరుష్క సామ్రాజ్య లక్షిత మహా ♦ మాత్యుముద్రి!
యదియొకఁడేగాక ♦ యక్బరీశ్వరుతోడి వియ్యంబు నెయ్యంబుఁ ♦ బేర్మిపెంపుఁ
దృణముగాఁ జూచుచు ♦ గుణము కోరుచు నిన్నుఁ దనజేసి గర్భశా ♦ త్రువుని గొలిచి
యేవిపత్తులనైనఁ ♦ నెదిరింప సమకట్టె నబ్దూరురహిమానుఁ ♦ డనఘ గుణుఁడు!

గీ॥ కమ్మఁజమునఁగాఁ జమునఁగాఁ ♦ గడ కతండు పరమభక్తి ని న్నేకల ♦ వ్య ప్రకార
శిష్యుఁడై కొల్చి మమ్ము గె ♦ ల్చెననితోఁచె"ననిన నందఱుదెసఁ గలి♦యంగఁజూచి,

ఉ॥ "కమ్మ నదెట్లొ వ్రాసితిని; ♦ గమ్మను బంపిన దాదిగా నన
ర్హమ్మగు భ్రాంతి యేల వల ♦ దం చనిపించి తపించుచుంటి; నీ
కమ్మయు నాకుఁ దోడుపడెఁ! ♦ గష్టమొ సౌఖ్యమొ నెత్తిఁ బడ్డ భా
రమ్ముఁ దొలంగఁ ద్రోయఁగను ♦ రాదు; రణంబె శరణ్య మెప్పుడుఁ. 353

⊕ గీ॥ కమ్మ వినినంత మద్భుజా ♦ స్కంధమందుఁ దోఁచెఁ బదివేల వీరుల ♦ దోర్బలమ్మ;
రణ మొనర్పంగఁ గోర్కు లు♦గ్రముగ రేఁగె! వీరవిహరణ మొసరింప♦ వెడలవలయు

సీ॥ లోకముల్ తలక్రిందు ♦ లుగఁ జేసి భారతస్వాతంత్ర్యమును నిల్పఁ ♦ జాలుదురని
యందఱు కొండంత ♦ యాసతో మనవైపు చూపులు వఱపిన ♦ చొప్పు దోఁచెఁ;
నేహేతువుననైన ♦ నిపుడు స్వధర్మ నిర్వహణంబునందు దు ♦ ర్బలుల మైన
మేవాడ కేగాక ♦ యీ విశ్వమందలి ప్రజ కెల్లఁ దప్పిన ♦ వారమగుదు!

గీ॥ మస్థిరపు జీవితములపై ♦ నాస మాని భారతత్రాణ దీక్షా ని ♦ బద్ధులమయి
దేవదానవకోటి నె ♦ దిర్చియైనఁ గార్యసాఫల్య మొందఁగాఁ ♦ గడఁగ వలయు.

చ॥ పొడమి యధర్మముల్ పొదలి ♦ పొంగుచు దాస్యము వీరధర్మమున్
ముడివడె! మాతృదేశము వి ♦ ముక్తికి నాదు శరీరమందునన్
గడపటి రక్తబిందువును ♦ గాని మిగుల్చుకొనంగఁబోక నే 355
దడిపెద నేని యీధరణి ♦ ధన్యుఁడ నయ్యెద నీభవంబునన్.

మ॥ దివమందైనను రేయియైనఁ ద్రుటి శ్రాం ♦ తిన్ బొందఁ గాంక్షింప; నా
హవరంగంబె నివాసమందిరము చే ♦ యన్ బోయెదన్; ప్రాణవా
యువు లీదేహమునందు నుండువఱ కె ♦ ట్లో పూని స్వాతంత్ర్యలే 356
శవికాసంబును బోవనీనని ప్రతి ♦ జ్ఞన్ జేతు మీముందరన్"

గీ॥ అని విభుండనె! భిల్లేశుఁ ♦ "డల్లె యగుత! మీరు చెప్పినంత యొనర్పు ♦ టే నిజంబు!
పిలిచి పిలిచియైన రణంబు♦ సలుపవలయు! వలచి వలచి యాపదల నో♦ర్వంగవలయు!

గీ॥ అఖిలభిల్లరాజ్యము మాత్రి ♦ కప్పగించి పులులఁబోల్ వేనవేలు లెం♦కలను గొనుచు
ననునిమేషంబు వచ్చి నీ ♦ యండ నుందు; నామహాభుజ మున్న నీ ♦ కేమికొఱఁత!

క॥ గళమునఁ బ్రాణము లుండఁగఁ దలపూ వాడంగనీక ♦ త్వత్పాదాబ్జం 359
బులు తల నిడి ముల్లోకంబులు దాఁకిన సుంత ముల్లు ♦ మోవఁగనీయన్"

క॥ అనియెల్గెత్తి వచించెను! విని యందఱు హర్ష మనుభ ♦ వింప, సలుంబ్రా 360
వనిపతి "దేవా! విక్రమ మన నీసొమ్మనుచు జగము ♦ లభినందించెన్.

---

⊕ This effusion of the Rahtore was equal to ten thousand men; it nerved the drooping mind of Pratap and roused him into action, for it was an incentive to find every eye of his race fixed upon him.

"Annals of Mewar."

క॥ నీవెంట మాతృదేశము సేవించి విపక్షకోటిఁ ♦ జెండాడఁగ మా
జీవితము లుపకరించిన నీ విశ్వమునందుఁ గొదవ ♦ యేదీ మాకున్! 361

క॥ తారాగృహమాది, సలుంబ్రిరాజ్యాంతంబుదాఁకఁ ♦ బ్రజలును శ్రీమ
న్నారాయణమూర్తివిగాఁ జేరి భజించెదరు నీదు ♦ శ్రీపాదములన్! 362

గీ॥ ఆగ్రహానల దీప్తము ♦ ఖోగ్రమైన రణమహాదుర్గ నష్టైక ♦ ర్ణద్వయంబుఁ
బట్టి యూడింపఁగలరు నీ ♦ పాదభక్తు"లనఁ బ్రతాపప్రభూత్తంసుఁ ♦ డాస్యమెత్తి, 363

మ॥ "అమితోగ్రంబుగ యుద్ధముల్ జరుగు; నా ♦ వంతైన విశ్రాంతి నొం
దము: మీకున్న యమూల్యవస్తువుల వెం ♦ టన్ గొంచు నీనాఁడె సూ
ర్యమహల్ దుర్గముఁ జేరఁబోవలె" నటం ♦ చాజ్ఞప్తిఁ బాలించె; శీ
ఘ్రమె సేనాపతు లెల్లఁజేరి దరియం ♦ గా నేఁగి రాదుర్గమున్. 364

ఉ॥ "మీరలు నాకు వంద్యులరు; ♦ మీకృతమున్ మఱవన్; రణంబె నేఁ
గోరుదు శాంతి నించుకయుఁ ♦ గోర" నటంచని పృథ్వీరాజు-న
బ్దూరహిమానుఁగూర్చి తలఁ ♦ పున్ బ్రకటించెఁ బ్రతాపసింహుఁ; డ
వ్వారును నక్బరీశునకు ♦ వార్తలు దెల్పిరి సత్య మేర్పడన్. 365

గద్య:—ఇది శ్రీమత్కామేశ్వరీ కరుణాకటాక్ష వీక్షా సమాసాదిత రసవత్కావ్య
నిర్మాణ చాతురీధురీణ, సుగుణగణపారీణ, "దుర్భాక" వంశ దుగ్ధాంభోరాశి
రాకా కైరవమిత్ర, శాలంకాయన గోత్ర పవిత్ర, సుజనాను
గ్రహపాత్ర, వెంకటరామార్యపుత్ర, కవిసింహావధాని
పంచానన-కావ్యకళానిధీత్యాది బిరుదాకర, సుకవి
రాజశేఖర, "రాజశేఖరకవి" ప్రణీతంబయిన
"రాణాప్రతాపసింహచరిత్రం" బ
ను పద్యకావ్యమునం
దుఁ జతుర్థా
శ్వాస
ము.

శ్రీ

కామేశ్వర్యై నమః.

# రాణాప్రతాపసింహచరిత్ర.

## పంచమాశ్వాసము.



### —*) వసంతము. (*—

సీ॥ నునుపారు మెఱుఁగు దీ ♦ టిన గుజ్జులేమావి చిగురాకు బాకులు ♦ చికిలి చేసి,
ననలాని వగరుటె ♦ ల్గునఁ గికారించు కోయిల హుమాయీల నా ♦ యితము చేసి,
నిలువెల్ల విచ్చి తా ♦ వులు చిమ్ము దాసానిపూలతో నెత్తుటెం ♦ డాల నెత్తి,
యరవిచ్చు జేకుఁదా ♦ మర తుపాకులఁ దేటిగమి యుక్కుగుండ్ల న ♦ గాదు చేసి,
గీ॥ పరువపు వసంతుఁడను దొడ్డ ♦ తురకతేఁడు కలయవనపాళి పసదన ♦ మ్ములఁ గఱచి,
లలితరాజాతపత్రమం ♦ డలము బెరయ దళముకొని చిల్కపిండుతో ♦ దండు వెడలె.

### —*) యవనులు రాజపుత్రుల దుర్గములను గొనుట. (*—

క॥ ఈమాఱు ప్రతాపుఁడు తనదౌ మానము నిలుపుకొనుట ♦ యరుదని యక్బర్
భూమీశు సైన్యపతు లచ్చో మూఁగిరి బలములెల్లఁ ♦ జుట్టును గొలువన్. 2
క॥ బల్లిదుల భటులఁ గొని 'యంతల్లా' దుర్గంబుకడఁ బ్ర ♦ తాపవిభుం డ
బ్దుల్లాఖానుని దాఁకెను ముల్లోకము లతని ధృతికి ♦ ముచ్చట పడఁగన్. 3
సీ॥ తౌరుష్కభటులు మ ♦ త్తమతంగజములట్లు తాఁకిరి రిపుసేన ♦ దద్దఱిలఁగ;
రాజపుత్రులు మృగేం ♦ ద్రశ్రేణిఁబోలెఁ బైదూఁకిరి యవనులు ♦ దొరలిపడఁగఁ;
ప్రళయభానుఁడువోలె ♦ వెలిఁగి ప్రతాపేంద్రుఁ డరిమధ్యమున ప్రాలి ♦ నఱుకసాగె;
వందలువేలుగా ♦ ప్రుందిరి రెండుపక్షములందు; సమర ము ♦ గ్రముగ సాఁగెఁ;
గీ॥ ప్రొద్దుమాపటివేళకు ♦ మొగలుసేనఁ గొని ఫరీదు వచ్చి కలసి ♦ కొనియె; రాజ
పుత్రులకు సంగరము తల ♦ మునుకలయ్యె; యవనసైన్యంబుల యధీన ♦ మయ్యెఁ గోట.
క॥ బారులు బారులు యావన వీరులు శైలంబు లెక్కి ♦ వెడలుచు నవలన్
"దోరణగృహ" దుర్గము "చాందేరీ" దుర్గంబుఁ గొనిరి ♦ ధృతి యేపారన్. 5

క॥ వేఱొక సేనాపతి మార్వారుదెసను సేనఁగొనుచు ♦ వచ్చి మహోగ్రం
బౌ రణ మొనరించుచుఁ బొలిమేరను "ఆహూరు" కోట ♦ మెట్టెను గడిమిన్. 6

సీ॥ నీలకాదంబినీ ♦ నివహంబుచందాన సకలదిక్కుల విప ♦ త్సంచయములు
పేరినకొలఁది భ ♦ విష్యదాకాశంబు విపులాంధకారసం ♦ వృతముగాఁగ
సైన్య మంతంతకు ♦ సమసిపోయెను; దుర్గసంఖ్య క్రమమ్ముగా ♦ సన్నగిల్లె;
నాప్రతాపుని ధైర్య ♦ మతని సాహసము దైనందినవృద్ధి నొం ♦ దంగసాఁగె;
గీ॥ నింతలోనన వర్షర్తు ♦ వెదిగివచ్చెఁ; బర్వతముల రేఁగెడు విష ♦ వాయువులకుఁ
గొలఁకు లందలి విషజలం ♦ బులకు స్రుక్కి, మొగలు సేనలు ఢిల్లికిఁ♦బోయె మఱలి.

సీ॥ విశ్వంబు నెల్లఁ బి ♦ ప్పిగఁ జేయఁ జాలి గుంపులుగాఁగఁబడు పిడు ♦ గులకు నడలి,
జడివట్టి కురిసి మా ♦ సముదాఁక విడువక చెలరేఁగుచుండు వా ♦ నలకుఁ జిక్కి,
కుక్షిలోనికిఁ గ్రుచ్చు ♦ కొని పోయి శ్రమఁ బెంచు నీదరగాలికిఁ ♦ బేదవడియు;
రక్త మంతటిని బే ♦ రఁగఁ జేసి హృదయంబు స్తంభన మొనరించు ♦ చలికి స్రుక్కి;
గీ॥ చిత్తమొండల వేఁడికి ♦ నత్తమిల్లి రాజగురుసార్వభౌముఁడు ♦ రాణివాస
మనుఁగుబిడ్డలు నలజడి ♦ కగ్గమగుచుఁ బాండవులుగూడఁ బడనట్టి ♦ బాధ పడిరి. 8

క॥ కొమ్మలకును బల్లవనివహమ్మువలెన్ జైత్రమాస ♦ మంతట నారం
భమ్మైన యవననృపసైన్యమ్ములు గుంపులయి వెలసె ♦ హారావళిపై. 9

గీ॥ పాదుషాహి యానతిమెయి ♦ భరతఖండ మందు విఖ్యాతిఁ గనిన సై ♦ న్యాధినాథు
లెల్ల వేంచేసి 'యుజ్జార♦గృహము' 'దేవగృహము'ను "విరాటగృహ"దుర్గ♦మిన్నగొనిరి!

## —*) "సూర్యమహల్" దుర్గ యుద్ధము. (*—

మ॥ సమదేభేంద్ర సమాన వీరభటు లు ♦ త్సాహంబుతోఁ గొల్వ; ద
ర్పము శోభిల్ల మహమ్మదీయభటు లం ♦ బర్ నుండి మార్వారుదే
శమునంగుండియు వచ్చి యెల్లదిశలన్ ♦ శైలంబు లందెక్కి సూ
ర్యమహల్ దుర్గము చుట్టుమూఁగిరి సమ ♦ గ్రాటోప మేపారఁగన్. 11

మ॥ వితత కరాళ మృత్యుసమ ♦ భీకర విక్రములైన యాత్మ యో
ధతతులనెల్లఁ బూన్చుచుఁ బ్ర ♦ తాపుఁ డరాతులఁ దాఁకి సంగర
క్షితిని దదీయశీర్షములఁ ♦ జెందర వందర చేయుచుండె; నీ
గతి నొకమాసమున్ గడువఁ ♦ గా యవనుల్ కడుఁ జింత మున్గుచున్, 12

సీ॥ కోటలో నొక్కని ♦ గూఢమార్గ మెఱింగి కుమిగూడి పోయి ద్వా ♦ రమును దెఱచి
యర్ధరాత్రము లోని ♦ కరుగంగఁబూని; గాసడి యెట్లొ యెఱిఁగి దు♦ర్జయుఁడు వచ్చి
యడ్డగించెను; యుద్ధ ♦ మతిభయంకరముగా జెలఁగె; మొగలులు ద్రో♦సికొని లోనఁ
జొరఁ బూని; రది చూచి ♦ చోండావతుల్ దవాగ్నిజ్వాల లటులు క్రి♦క్కిరిసి తాఁకి;
క॥ రర్కుఁడుదయించుసరికిఁ బో ♦ రగ్గ మయ్యె; నంత భిల్సరాపురినుండి ♦ యరుగుదెంచి
సూక్తసింహుండు తురకల ♦ స్రుక్కఁజేసి సరభసముగ దుర్గప్రవే ♦ శం బొనర్చె. 13

ఉ॥ ఘోరముగా రణం బెదిగెఁ; ♦ గొన్నిదినంబులు దాఁటినంత, నా
హారపదార్థముల్ దఱిగె; ♦ నంతట నొక్కఁయెడన్ బ్రతాపధా
త్రీరమణేంద్రుఁ జేరఁజని ♦ "దేవ! నిగూఢ కవాటమందునన్
దూఱుచుఁబోయి 'భీమగడ' ♦ దుర్గముఁ జేరఁగ యోగ్య మియ్యెడన్. 14

క॥ చాలన్ గాలము నిలువఁగఁ జాలదు దుర్గంబు; తిండి ♦ సంబారములున్
జాలవు; మీరిపు డరుగుట యే లగ్గగు నాకుఁజూడ ♦ నిందుండి వడిన్." 15

మ॥ అని పాదంబులచెంత వ్రాలుచు నలుం ♦ బ్రాధీశుఁ డర్థింప, న
జ్జననాథాగ్రణి భీమదుర్గమునకున్ ♦ సైన్యంబులన్ గూడి పో
యెను; శేషించిన సైన్యముల్ భుజబలం ♦ బేపారగాఁ బోరె; నై
న నెలన్ దాఁటకమున్న దుర్గమును జెం ♦ దన్ గల్గి రామొగలుల్. 16

మ॥ బలమెల్లన్ గృశియింపఁ జొచ్చినఁ బ్రతా ♦ పస్వామి జాంబూనదా
చలమున్ బోలి పరాక్రమక్రమత స్వ ♦ చ్ఛందంబుగా నిల్చె; బి
డ్డల భార్యన్ జెఱఁబట్టనాతఁ డగచా ♦ ట్లన్ మున్గునం చెంచి సే
నలతో ముట్టిరి భీమదుర్గము నమా ♦ దస్థైర్యులై శాత్రవుల్. 17

—*) యవనులు భీమదుర్గమును ముట్టడించుట (*—

సీ॥ యవనులదెస ముఖ్య ♦ మై ప్రకాశించె నత్యలఘుబృహన్నాళి ♦ కాస్త్రవహ్ని;
రాజపుత్రులదెస ♦ రాజిల్లఁబొడఁగెఁ బ్రధానమై బాహాప్ర ♦ తాపవహ్ని;
యగ్నిచూర్ణముధాటి ♦ కాకోట నట నట గండశిలలు కొన్ని ♦ పిండి యయ్యె;
క్షణమునకు క్షణంబు ♦ గడియకు గడియ యావనచమూప్రతతిని ♦ బలము తఱిగె;
గీ॥ నిప్పు లుమిసెడు నారక్త ♦ నేత్రములును మాడుచుండెడు భయదాస్య ♦ మండలములు
రక్తసిక్తపరిచ్ఛద ♦ రాజి వెలయ రాజపుత్రుల పోరు దు ♦ ర్వార మయ్యె. 18

క॥ నెల దాఁటుదాఁక యవనులఁ గలనఁ గలఁచి నృపగురుండు ♦ కాపురముఁ దగన్
దలఁగించి బోయపల్లియ నిలిపి పదిలపఱచి మఱల ♦ నెక్కొనె ననికిన్. 19

మ॥ పరమప్రీతిని భిల్లలోకపతి యా ♦ పాలేశ్వరీ పాదపం
కరుహద్వంద్వముఁ గొల్చి తోడుకొని యా ♦ 'కావా' ఖనిన్ జేర్చె; నా
కరుణాసాంద్రమనస్కు యత్తటిని భూ ♦ గర్భమ్మునన్ జేరు నా
ధరణీనందనమాడ్కిఁ బెంపెసఁగె నా ♦ దార్ఢ్యంబు దీపింపఁగన్. 20

గీ॥ రాణివాసంబు భిల్లరా ♦ ష్ట్రంబుఁ జేర నెఱిఁగి మహాబతుఖాన్ సేన ♦ నురవడిమెయి
దఱిమె; దుర్గమవనముల ♦ నరుగలేక గరళమున్ దిన్న వేఁదుఱు ♦ గతిఁ గలంగె. 21

గీ॥ విచ్చె మొగిళులు; గగనంబు ♦ విమలమయ్యెఁ; గాపురముతోడ ననుచర ♦ గణముతోడఁ
గదలి బోయగూడెము వీడి ♦ కైలవార సీమలకుఁ జేరె వీరల ♦ క్ష్మాప్రభుండు. 22

గీ॥ విడిదిమార్పులు, పరగ రా ♦ యిడులకూర్పు, లాత్మబలము తగ్గెడునూహ్య, ♦ లలజడిఁగొనఁ
దొడరి, తలఁకును మగటిమి ♦ త్రోపులాడ వెనుకచూడక నృపుఁడు ము ♦ న్నొనిపెనంగె.

గీ॥ ఒక్కమెయి రేయుఁబవలును ♦ గ్రుక్కగొనక జయము దవ్వైనకొలఁదిను ♦ త్సాహశక్తి
రవులుకొల్పుచు నడిపెనం ♦ గ్రామదీక్ష, విమతులకుఁ జిక్కఁగడమ దు ♦ ర్గములుగూడ.

సీ॥ మిట్ట మధ్యాహ్నంబు! ♦ మిహిరుఁ డుగ్రుండయి చెలరేఁగె; నొకచోటఁ ♦ జెట్టునీడ
బోయ గడ్డిని దెచ్చి ♦ యీయఁ బాళేశ్వరి రుబ్బి కాల్చుచునుండె ♦ రొట్టియలను;
బిడుగుపాటున వచ్చి ♦ పడియె నంబరుదిక్కునుండి ఫరీద్ఖాను ♦ దండుఁ గొనుచు;
మనుజేశ్వరుండు కో ♦ మ్మలు వంచి బుట్టల, బిడ్డల భార్యను ♦ బెట్టి విడిచెఁ;
గీ॥ ననుచరులఁగూడి యవనసై ♦ న్యంబుఁ దాఁకి పదులునూఱులుగాఁ దలల్ ♦ చిదిమివైచె;
నంత భిల్లులు వనసీమ ♦ నాక్రమించి పిల్లలను రాణిఁ జేర్చిరి ♦ భిల్లవాటి. 25

సీ॥ షాబాజుఖాన్ గొప్ప ♦ సైన్యంబు తనవెంటఁ గొలువంగ లోయలో ♦ పలికిఁజొచ్చెఁ;
శైలసాంకేతిక ♦ సాహాయ్య మూఁది ప్రతాపుఁడు భటులఁ గొం ♦ దఱను గూర్చి
యాకస్మికమ్ముగా ♦ నరిసేనపై మారి మసఁగినగతిఁ గ్రమ్మి ♦ మట్టసాఁగె;
నీయవస్థను ఖానుఁ ♦ డెఱిఁగి సైన్యము వెన్కమొగము పరవఁగా ♦ ముదల వెట్టెఁ;
గీ॥ దురకభటు లల్ల నల్లన ♦ మరలిచూచి రాజమణిఁ గానమికి నబ్బు ♦ రమ్ము పడిరి!
యాతఁ డవ్వలిదెస లోయ ♦ నరిబలమ్ము బిట్టు దట్టించెఁ గ్రుక్కఁద్రి ♦ ప్పికొననీక. 26

మ॥ మఱలన్ వైరులు వెన్కకున్ దిరిగి; రీ ♦ మాఱున్ బ్రతాపావనీ
శ్వరుఁ డవ్వారికిఁ గానరాక యెటనో ♦ శైలంబు లందుండి ముం

దఱిఁ బోటోడ్డిన శత్రుసేనలఁ బ్రచం ♦ డస్ఫూర్తిమైఁ దాఁకి కొం
దఱి నాత్మీయకృపాణధారలను బ్రమం ♦ దర్ జేసె నత్యుగ్రుఁడై. 27

క॥ "కనఁబడఁ డెట్టులు వెదకినఁ; గనఁబడినను బట్టువడఁడు; ♦ కట్టా! యిఁక నే
మొనరింతు" ననుచు, ఖానుఁడు తనసేనను గొనుచు గిరులు ♦ దాటుకొని చనెన్. 28

క॥ ఖాసింఖాను మహాసేనా సంవృతుఁడగుచు నవలి ♦ నాఁ డరుదేరన్
గా, సడి గని యాతని నిక్లె సిలుగులఁ బెట్టి యినకు ♦ లేంద్రుఁడు కలఁచెన్. 29

క॥ అటవీమృగములవలెఁ బొంచుటయును బైఁబడుట చీలు ♦ చుట కలఁచుటయున్,
విటతాటనమ్ము చేయుట త్రుటిలోఁ జా టగుట నృపతి ♦ ధూర్జటి నేర్చెన్. 30

క॥ పులి నివసించెను గుహలోపలి కరిగెడు హరిణవితతి ♦ వలె, యావన వీ
రులు రాఁగ దినదినము వందలుగఁ బ్రతాపుఁడు కలంచి ♦ తనువులు సించెన్. 31

గీ॥ అవిరళాజ్యాహుతుల రేఁగు ♦ నగ్నిహోత్రమన, సలుంబ్రాధిపతి శాత్ర ♦ వాటవి నటు
భస్మ మొనరింప, నిటు ప్రతా ♦ పప్రభుండు దనరె సమరాభ్రసీమ మా ♦ ర్తాండుపగిది.

క॥ ఒకపాలు సైన్యములు కొండకనుమను బ్రతాపుఁదాఁకి ♦ నలిసేయుచు వే
ఱొకపాలు భిల్లదేశము నికటమునఁ జరించె రాణి ♦ నిర్ జెఱఁబట్టన్. 33

క॥ "ముల్లోకము లెదిరించిన ముల్లైనను మోవనీక ♦ పూనికమెయి నా
భిల్లులఁ గలఁచెద" నని యబ్దుల్లాఖా నేగె సైన్య ♦ ముఁ దోడ్కొనుచున్. 34

ఆ॥ శైలపంక్తినడుమ ♦ 'జావురా' తగరపు గనులలోన రాణి ♦ గారి నుంచి
వేయుఁగనులతోడ ♦ వేయుఁజేతులతోడఁ బ్రీతిఁ గాచుచుండె ♦ భీమచాందు. 35

క॥ అనుచరుఁ డొకదిన ముదయంబునఁ దగరపుగనులు చేరఁ ♦ బోయి మహారా
జ్ఞిని గాంచి భక్తిఁ దత్పద వనజములకు మ్రొక్కి నిలువఁ ♦ బాళేశ్వరియున్, 36

—*) పాళేశ్వరీదేవి భిల్లునితోఁదన భర్తనుగూర్చి యడుగుట. (*—

మ॥ "దరహాసోజ్జ్వల కాంతి కాంతమయి, యు ♦ ద్యత్పద్మపత్రాభ సుం
దర నేత్రద్వయమై, పరాక్రమకళా ♦ ధౌరేయమై, సత్కృపా
భరితంబై, రమణీయమై, భువన సే ♦ వ్యంబైన, నా జీవితే
శ్వరు నెమ్మోమును గాంచి నేఁటి కొకమా ♦ సం బయ్యె భిల్లాగ్రణీ! 37

క॥ వైరులసైన్యము లెంత యపారముగాఁ జుట్టుకొనెనో! ♦ వా రేయెడ ను
న్నారో! సమయమునకు నాహారము దొరకెడునో! మాకు ♦ నైవగతు రాకో! 38

మ॥ అకటా! వైరులదాడి తగ్గదని వా ♦ రాయాసముం జెందఁబో
రు కదా! యెప్పటియట్ల నవ్వుచునె పో ♦ రుం దీర్తురా! రాజపు
త్రకు లుత్సాహము వీడరే కద! సలుం ♦ బ్రాభర్త సర్వాంగర
క్షకుఁడై భక్తి యెలర్పఁ బ్రాణవిభు వ ♦ జ్జన్ గొల్చి యుండున్ గదా! 39

సీ॥ శ్యామసింహుండు పా ♦ ర్శ్వమున వర్తించునే! సామంతు లందఱు ♦ సరస నుండ్రె!
స్వాతంత్ర్యసమరదీ ♦ క్షామహోపన్యాసములు తొంటిచందాన ♦ నొలుకుచున్నె!
వ్యాకోచ పుష్పంబు ♦ వలె నాథుమోమున నానంద దరహాస ♦ మలరుచున్నె!
నాయాస మెప్పుడే ♦ నంది కుందఁడుగదా! యారోగ్య సౌభాగ్య ♦ మనువగుఁగద!
గీ॥ యూర్జితోత్సాహకళలతో ♦ నొప్పెడుఁగద! తఱచు బిడ్డలదెస మది ♦ మఱలదు గద!
విమతులకునెల్ల గర్భని ♦ ర్భేదకముగఁ దీవ్రకరవాలధార న ♦ ర్తించెడుఁగద! 40

మ॥ "ప్రమదం బొప్ప రణాంగణంబులఁ బ్రతా ♦ పస్వామి స్వాతంత్ర్యయో
గము సాగింపఁ దదాత్మజాతుఁడు భుజా ♦ గర్వంబుఁ బోనాడి దూ
రమునం దాఁగెదు నెట్లు! వైరులతలల్ ♦ రాల్పంగ నన్నాజ్ఞ సే
యు"మటం చెప్పుడుఁ బోరు నియ్యమరసిం ♦ హున్ బట్టనేరన్ గదా! 41

మ॥ చుఱకత్తుల్ గొని చెట్లపై కుటిక "భ్రమ ♦ చ్చుల్ వోలె మామాతృదే
శరమున్ గొల్లలుగొట్టు నీయవనులన్ ♦ శాసింతు మి"ట్లంచుఁ జిం
దరగాఁ జీల్చెద రీయరుంగు నిసువుల్ ♦ నాకన్నసంతాన; మే
కరణిన్ దండ్రికి దవ్వుగా నిలుప శ ♦ క్యం బౌను నాబోటికిన్! 42

ఆ॥ విశ్వ మెల్లఁ బొగడ ♦ బిల్లరాజ్యం బేలు సత్ప్రభుండు భీమ ♦ చాందు దొరయుఁ
దండ్రివోలెఁ గాచుఁ; ♦ దత్కృప మముఁ జీమ సోఁక; దెట్టి కొఱంత ♦ మాకు లేదు.

క॥ కాని పరితాపధరిత్రీజాని పదాబ్జాత దివ్య ♦ సందర్శన సే
వానంద మందఁగోరుచు మానస మొక్కింత వంత ♦ మరఁగి కరఁగెడున్. 44

క॥ ఒకమాఱు దర్శనము చేసికొనన్ వలె నంటినని వ ♦ చింపు" మనఁగఁ గం
చుకి పాటేశ్వరి పాదములకు మ్రొక్కుచు వెడలి వనము ♦ లన్ బడిపోయెన్. 45

గీ॥ అవల నొక్కనాఁడు ప్రతాపుఁ ♦ డరుగుదెంచె; బోయదొర స్వాగతంబిచ్చి ♦ పూజచేసె;
బిల్లలను భార్యఁగూడి పృ ♦ థ్వీవిభుండు కతిపయదినంబు లచ్చోటఁ ♦ గడపె వేడ్క. 46

ఉ॥ అంతట నొక్కనాఁడు శబ ♦ రాలయమున్ విడి యాప్రతాపభూ
కాంతుఁడు వీరయోధులును ♦ గాంతయు బిడ్డలు వెంటరా, నహా

ర్యాంతరసీమలం దరిగి ♦ యచ్చట మొగలుసేనఁ జూచి క
ల్యాంతకుఁడట్లు దాఁకి సమ ♦ రావనిఁ బెక్కురఁ ద్రుంచె నుగ్రుఁడై. 47

క॥ సమరము ముగిసిన సాయంసమయమునకు శైలసీమఁ ♦ జల్లని వటవృ
క్షముక్రింద వసించెఁ బ్రతాపమహీంద్రుం డచట నా వి ♦ భావరిఁ గడపన్. 48

క॥ ఆరాత్రికొంత కడచనఁ దారాపథమందు నిబిడ ♦ ధారాధరముల్
ధారాపాత్రలకరణి నపారమ్ముగ రేఁగి ఘోర ♦ వర్షము గురిసెన్. 49

గీ॥ మాటిమాటికి హెచ్చె దె ♦ బ్బాటువాన; వర్షమునకన్న రేఁగె బ్ర ♦ భంజనంబు;
నిలువ నెలవైన తరు వట్టె♦కలయనూఁగి తల నొఱగునో యనెడి శంక♦దవ్వులఁజేసె. 50

గీ॥ చలికి గాలి కాఁకలికి వ ♦ ర్షమున కడలి బిడ్డ లేడ్వ సాఁగిరి; కట్టు ♦ గుడ్డ లెల్లఁ
దడిసె; నిసుఁగులు తనచుట్టు ♦ వడకుచుండ తెప్ప వాల్పక రాణి యా♦రేయి గడపె. 51

సీ॥ తెలతెలవాఱె; వా ♦ నల పోటు తగ్గె; రాజ్ఞియు గడ్డిరొట్టెలు; ♦ చేయుచుండె;
ఖాసిముఖాను చెం ♦ గటఁ దోఁచె, సపరివారుండయి రాజగు ♦ రుండు తొలఁగి
యొకగుహ చేరి కూ ♦ ర్చుండె; నంతట మహబత్ఖాను గనఁబడెఁ; ♦ బ్రభుఁడు చెంత
శైలశిఖర మెక్కెఁ; ♦ షాబాజుఖాన్ కొంతసేపటి కచ్చోటు ♦ చేర వచ్చె;

గీ॥ నృపవరుఁడు లోయ కరిగె; ఫ ♦ రీదుఖానుఁ డచటి కేతెంచె; భూపతి ♦ యద్రి దాఁటె;
నచటి కరిగె నబ్దుల్లాయు; ♦ నవనిపతియు నేగఁదొరకొనె 'నాబూ' గి♦ రీంద్రమునకు. 52

❁ సీ॥ ఉదయపురమునకు ♦ నుత్తరమ్మున రెండుక్రోసులపైనఁ ద్రి ♦ కూట మనఁగఁ
బర్వతం బలరు; నా ♦ వసుధాధరము చుట్టు నతిసాంద్రమగు నర ♦ ణ్యంబు దనరు;
నీర మెల్లెడ నూట ♦ యూరి బుగ్గలుపుట్టి ధ్వను లెత్తి సెలయేళ్లు ♦ పాఱుచుండుఁ;
ద్రివిధ శీతోష్ణప్ర ♦ దేశంబు లందుండు సకలజాతుల వృక్ష ♦ సమితి యలరు;

---

Within its impervious recess es rose the three-peaked (Tricuta) mountain at whose base was the town of Nagindra, the abode of brahmins, who performed the rites of the great God. The most antique temples are to be seen in these spots, within the dark gorge of the mountain, or on its rugged summit in the depths of the forest and at the sources of the streams, where sites of seclusion, beauty and sublimity alternately exalt the mind's devotion. In these regions the creative power seems to have been the earliest and at one time the sole object of adoration, whose symbols, the serpent-wreathed Phallus [Lingam] and its companion, the bull, were held sacred even by the children of the forest.

" Annals of Mewar."

సీ॥ రఘుపతిసింహు శౌ ♦ ర్యం బెంతనఁగవచ్చు! మహామీరుఁడు నృప ♦ మాత్రుఁడగునె!
లఘురాజు దేశమే ♦ లాగు వృద్ధియొనర్చెఁ! జందుఁబోల్ ధర్మవీ ♦ రుండు గలఁడె!
కుంభేంద్రుఁ గని రణ ♦ క్షోణి నెవ్వఁడు నిల్చుఁ! బృథ్వీశు సాహసం ♦ బెవరు కొల్తుర!
సంగ్రామ శౌర్యదీ ♦ ప్తారతి యెట్టిది! రత్నసింహుని పరా ♦ క్రమ మలంతియొ!
గీ॥ భానుకులమునఁగాక వి ♦ శ్వప్రపంచ మందు నేవంశమున జన్మ ♦ మందినార!
లిట్టి భువనైకవంద్యులా ♦ పృథుబలాఢ్యు లిట్టి ధర్మసంస్థాపకు ♦ లిట్టి ఘనులు!
సీ॥ చూడనొప్పెయుండు ♦ నేడుకోటలతో! మహాబ్ధిఁబోల్ సప్తభే ♦ యములతోడ!
నభ్రంబు సోఁకు జ ♦ య స్తంభతతులతోఁ! గలువపూలట్టి కో ♦ నెలలతోడ!
వెలయు నెన్బదినాల్గు ♦ విఫణిమార్గములతో! సముదార రాజమా ♦ ర్గములతోడ!
సంఖ్యకు మీఱు ప్రా ♦ సాదసంతతులతో! జలపూర్ణబహుసర ♦ స్సమితితోడఁ!
గీ॥ బెక్కులక్షుల జనులతో! ♦ వేలయేండ్లు యవనులకు గుండెగాలమై, ♦ రవికులంబు
గుత్తగొను క్షేత్రరాజమై, ♦ కొమరుమిగులు చిత్తురునుబోలు నగర మీ ♦ క్షితినిగలదె!
గీ॥ మహితమేవాడరాజ్యర ♦ మాసమగ్ర విభవభాగ్యముల్ చూడ్కికి ♦ వ్రేఁగుగొలుప
వాహినులఁగొంచుఁ బెక్కు సం♦వత్సరములు మొగలుపతి "యలాయుద్దీను" ♦ ముట్టడించె.
గీ॥ వ్రేటుదీటి యొకింత దె ♦ ప్పిఱకమున్నె ఘూర్జరమునుండి 'బహదూరు' ♦ క్రూరుఁడగుచుఁ
బచ్చివిసమును గ్రక్కుచు ♦ వచ్చి లగ్గ పట్టెఁ; జిత్తూరుపురలక్ష్మి ♦ కుట్టు వట్టె. 67
సీ॥ వైరివిశ్వంభరా ♦ పతి దుర్నిరీక్షంబు! యవనభూపాల కా ♦ రాలయంబు!
భాగ్యలక్ష్మి వసించు ♦ పద్మాకరవరంబు! సౌభాగ్య వైభవా ♦ స్థానవాటి!
రవివంశనృప మహా ♦ ప్రాసాదరాజంబు! రాజపుత్రుల మంది ♦ రప్రవరము!
భారతఖండాభ్ర ♦ తారావతంసంబు! భువనశౌర్యమునకుఁ ♦ బుట్టినిల్లు!
గీ॥ లలిత మేవాడలక్ష్మి వి ♦ లాసతిలకము సహస్రాబ్దములనుండి ♦ యశముఁ గనిన
పురవరేణ్యంబుఁ జిత్తూరుఁ ♦ బూదిఁగలిపె; దండుగొనివచ్చియక్బరు ♦ దండధరుఁడు. 68
సీ॥ రాజసేవితము సూ ♦ ర్యద్వారరాజంబు వ్రీలి ముక్కలుగాఁగ ♦ నేల రాలెఁ;
దన శిఖరము మాళ్వ ♦ మునఁ దోఁచు కుంభుజయ స్తంభ మూఁటాడి ♦ యవని మ్రొగ్గె;
హారతుల్ వేదమం ♦ త్రారావముల నొప్పు కోవెల లన్నియుఁ ♦ గూలిపోయె;
వీరసంసారు లు ♦ ర్విని బాసి పోవుట భవ్యమందిరములు ♦ పాడు వడియె;
గీ॥ నఱచుఁ జెవి దిమ్మపట్టఁగా ♦ నడవిరెళ్ళ; బలిసి యెల్లెడ ముండ్లచె ♦ ట్లలము కొనియె;
విడక బుసబుసలాడె ద ♦ ర్వీకరములు: వనమృగంబులు మీఱె; గూ ♦ బలును జేరె. 69

చ॥ ఇరువదియైదువత్సరము ♦ లిప్పటి కెప్పుడో దాటిపోయెఁ జి
త్తురురమ మోముకుంకుమము ♦ తోఁగను పున్నెముదీఱెఁ; జేల ని
ద్దుర పవ లన్నమున్ విడిచి ♦ దుర్గమదీక్షను నిన్నియేండ్లు సం
గర మొనరించినన్ జయము ♦ గల్గదుఁ గల్గను గల్గు నాసయున్. 70

గీ॥ పట్టభద్రుండనైన య ♦ ప్పటి విభవము సంపదయు మూఁడునాళ్ళ ము ♦ చ్చటగ జాఱెఁ;
మునుపటి మహోన్నతులు గల్గు ♦ ననుతలఁపులు మెఱపు లెండమావులుగాలి ♦ మేడలయ్యె.

సీ॥ భాగ్యనివాసముల్ ♦ పదివేల పల్లెలు కళలాడి కాఱడ ♦ వులుగ మాఱెఁ:
బరదురాసదము లె ♦ న్బదినాల్గు దుర్గముల్ తౌరుష్కవీరుల ♦ బాఱిఁ జిక్కెఁ:
బచ్చతోరణముల ♦ భాసిల్లు మేవాడ నహుషుఁ డేలిన యింద్ర ♦ నగర మయ్యెఁ:
ముప్పదియాఱు రా ♦ ణ్ముఖ్యవంశంబు లక్బరుఁ జేరి చరణపం ♦ కజముఁ గొలిచెఁ:

గీ॥ దేశమెల్ల బోయెఁ: ♦ గోశంబు వమ్మయ్యె; సైన్యబలము డించె; ♦ శక్తి కుందెఁ:
నకటకట! భార ♦ తావనిపై ధర్మ మెట్లు నిలుచుఁ! గీర్తి ♦ యెట్లు వొలుచు! 72

గీ॥ హంసతూలికామృదుల శ ♦ య్యలను బూలపఱపులను జేటికలు జోల ♦ పాడుచుండఁ
బెరుగు నాదు సంతాన మీ ♦ కఱకురాల వాన కెండకుఁ బలుపాట్లఁ ♦ బడల వలసె. 73

గీ॥ కూడు నీరు లేక నశింతు ♦ క్రూరఫణులు గఱచు; నారణ్యమృగములు ♦ పెరుకు నసక
వృక్షముల వ్రేలు బుట్టలఁ ♦ బెట్టి విడుతు; నరులు వెన్నాడఁగాననా ♦ భ్యంతరమున. 74

గీ॥ రాత్రి కురిసిన ఘోరవ ♦ ర్షమున వటమహీరుహముక్రిందఁ దడిసి మే ♦ మెల్ల నల్లె
నిలిచితిమి; రాణిగా రాఱు ♦ నెలలబిడ్డఁ బొదిగిఁట నెనిల్పుకొనెఁ బ్రొద్దు ♦ పొడుచువఱకు 75

సీ॥ చండార్కుఁ డంతరి ♦ క్షమహాపథంబునఁ జెలరేఁగి నిప్పులు ♦ చెఱగునపుడు,
గడ్డి గాదము సోఁకి ♦ కడలెల్ల దరికొని మెండుగా దావాగ్ని ♦ మండునపుడు,
భూతలం బెల్ల దు ♦ మ్ముగ లేచి సుడివడ భీకరవాతముల్ ♦ వీచునపుడు,
హెచ్చుతగ్గులు లేక ♦ యేకార్ణవంబగు కరణిఁ బెల్లుగ వాన ♦ కురియునప్పు,

గీ॥ డిల వడంక భూకంపము ♦ లెత్తునపుడు, కడకుఁదలఁదాఁప నొక్కయుం ♦ కణము నీడ
చిక్కకయె, మేము పిల్లలు ♦ సుక్కు బాధ లకట! మాగర్భవైరుల ♦ కైన వలదు. 76

సీ॥ కనకసౌధాగ్రభా ♦ గములందు మూర్ధాభిషిక్తులౌ రాజయో ♦ షిద్వరేణ్య
లడుగులకు మడుగు ♦ లిడి కొల్వఁ గోమలతర హంసతూలికా ♦ తల్పమందు
నెండకన్నెఱుఁగక ♦ యుండి యింద్రాణిచాయను దేవభోగంబు ♦ లనుభవింప
వలసిన నారాణి ♦ పాశేశ్వరీదేవి భువనైక సౌజన్య ♦ పుణ్యసాధ్వి

గీ॥ యకట "యన్నమో రామచం ♦ ద్రా"యటంచుఁ బదియు నేడ్వురు బిడ్డలు ♦ పట్టిపెనఁగ
గోడుగోడునఁ గన్నీరు ♦ గ్రుక్కుకొనుచు నలమటలనెల్ల దిగమ్రింగి ♦ యడలవలసె. 77
సీ॥ సారవంతము శైల ♦ వారామహామహీధరపార్శ్వముల, సమ ♦ ధరణిఁ గట్టు
వడి దినమంతకుఁ ♦ బిడికెడు గడ్డియుఁ గ్రుక్కెడు నీరంబుఁ ♦ గ్రోలికొనుచుఁ
బరిశుభ్రతరమైన ♦ స్వచ్ఛందవాయువుఁ బీల్చుచుఁ గడుసాధు ♦ వృత్తి యలర,
నక్బరుతో రణం ♦ బారంభమైన యీ పదియునుదొమ్మిది ♦ వత్సరములు
గీ॥ నందనోద్యానభాగంబు ♦ నన్ మెలంగు కామధేనుసంతానము ♦ కరణి నెపుడు
పిల్లలును మేము బయల జీ ♦ వింపవలసె మానవుల కగ్రాహ్యమగు తిండి ♦ మఱచిపోయి. 78
ఆ॥ కాళ్ళనిండ గుడ్డ ♦ కడుపునిండుగఁ దిండి, కంటినిండ నిద్ర, ♦ గాన కెపుడు
బిచ్చగాండ్రకన్నఁ ♦ బీదలమై యుంటి; మింక నెంతకాల ♦ మిట్లు కడచు! 79
మ॥ తతితో నక్బరుసార్వభౌముఁడు నితాం ♦ తప్రాభవోపేతుఁడై
ధరణీచక్రము నేలు వేళను దరి ♦ ద్రత్వంబు దిక్కెది యు
ర్వరఁ దా నుండఁగఁ జోటుగానక మహా ♦ రాణాప్రతాపావనీ
శ్వరు సంసారము నాశ్రయించినది; యీ ♦ పాపంబు నేమందునో!
శా॥ భీతిన్ గొల్పు కరాళవక్త్రమున వే ♦ వేగన్ జరావ్యాఘ్రము మీ
నా తారుణ్యము మ్రింగఁగాఁ దివిరెఁ జెం ♦ తన్ బొంచి లేడిన్ బలెన్!
జేతస్స్థైర్యముగూడ సన్నగిలె! మా ♦ నన్ సుంత యుత్సాహ! మే
రీతిన్ గార్యముఁ దీర్తు! నేపగిది మా ♦ తృప్రీతి సంధించెదన్! 81
గీ॥ గాలి వాన విధాన న ♦ ల్గడల రేఁగు కష్టముల కెత్తువడి డస్సి ♦ కడిమి తగ్గి
హృదయకోశంబు తన నైజ ♦ వృత్తి విడక యాడునో! యూడునో! తెలి ♦ యంగరాదు. 82
మ॥ చనఁగాఁ జొచ్చెను నిర్వదేఁడులు మహా ♦ స్వాతంత్ర్యయుద్ధంబుఁ జే
యను నే దీక్ష వహించి నేఁటికి; భవి ♦ ష్యత్కాల తారాపథం
బున దూరమ్మున నైనఁ గొంత విజయం ♦ బున్ గాంతిరేఖల్ మిను
క్కని చూపట్టవ! యే భగీరథుఁడు డా ♦ యన్ దెచ్చునో జాహ్నవిన్! 83
సీ॥ సంతత పౌరుష ♦ సంగ్రామవహ్నిచేఁ గాలఁగా మిగిలిన ♦ కట్టెనైతి;
నలిగొట్టి కుక్కయై ♦ నక్క మూల్గెడు నక్కపైఁ దాటిపం దూడి ♦ పడినయట్లు
రక్త మేదో మాంస ♦ రాశి తగ్గి యకాలవృద్ధత్వ మిపుడు పై ♦ కెక్కె నాకు;
నింక నెంతయొ కాల ♦ మీ శరీరం బిట్లె యనువుగా నుండునం ♦ చాస లేదు;

గీ॥ ప్రాణపదమైన మేవాడ ♦ రాజ్య పావనాధిపత్యంబు 'నాబూ'మ ♦ హాచలాధి
పత్యమును నావి గావని ♦ వదలి యవలఁ జనెడు కాలంబు వచ్చె; సం♦శయము లేదు. 84

చ॥ చెలులను బిడ్డలన్ సుతుల ♦ స్నేహితులన్ గులబంధులన్ గృహం
బుల ధనధాన్యవస్తుచయ ♦ మున్ విడి, కేవలభక్తి నాపదం
బులు మఱి దేశమాతృపద ♦ ముల్ భజియించిన మీకు నేటికిన్
గలుగదె సుంతయేనియు మ ♦ నఃపరితృప్తి యొకింత దీప్తియున్. 85

చ॥ శ్రమలకుఁ జిక్కి చిక్కి యని ♦ శంబును గంపలఁబడ్డ యట్టి కా
కములకుఁ బోలె ముందుఁ జనఁ ♦ గాఁ దెర వింతయు లేదు; గెల్చు పు
ణ్య మదియు నంతయే! కులస ♦ నాతనకీర్తిని నిల్ప లేని య
ల్పమతులు మాతృభూమిపయిఁ ♦ బాదము మోపి వసింప నర్హు లే! 86

సీ॥ అకట! మాసూర్యాన్వ ♦ యప్రభూత నృపాలు రప్రతిహతముగా ♦ నధ్వరములు
సలుపుచు బ్రాహ్మణ ♦ సంతర్పణంబుల నొనరింప మిగులఁ బా ♦ వనములైన
దుర్గంబులందెల్లఁ ♦ దురకమూఁకలు చేరి సలుపరాని యకార్య ♦ ముల నొనర్చెఁ;
గటకటా! నాకుఁ బ ♦ ల్కఁగ నోరురాకుండెఁ; బరదేవతాస్వరూ ♦ పము లటంచుఁ
గీ॥ బసుపుఁ గుంకుమ లర్పించి ♦ పాదయుగముఁ గరము భక్తిని సేవించు ♦ గంగ గోవు
లను గృపనువీడి వధియింతు ♦ రనుదినంబు; నిదికనుంగొని జీవించి ♦ యేమి ఫలము! 87

సీ॥ పలుమాఱు విశ్వసా ♦ భాగ్యంబు దేశకల్యాణంబు నెలకొల్ప ♦ నభిలషించి
మనము చేసిన త్యాగ ♦ మును మనకృషి బూదిఁ బోసినయాజ్యంబు ♦ పోల్కి నయ్యె;
మన నేత్రములమ్రోల ♦ మన మాతృదేశంబు పరుల యధీనమై ♦ ప్రజలు దాస్య
జలరాశిలోన ము♦నకలుపెట్టుటలు గాంచి యించుకయును సహి ♦ యింపఁజాలఁ;
గీ॥ గటకటా! పూర్వనృపుల ర ♦ క్తములతోడఁ దడిసి మనరక్తములఁ బునీ ♦ తంబునైనఁ
కీర్తిరాశి మేవాడల ♦ క్ష్మికిని మనకుఁ దీఱినట్టులె యింక నీ ♦ దినము ఋణము. 88

గీ॥ ఉత్తరాయణ పుణ్యము ♦ హూర్త మెంచి యంపసెజ్జఁ బండిన భీష్ము ♦ ననుసరించి
వగచి వరుసై వటించి మే♦వాడమాత కనుఁగొనలఁ బ్రాణముల నిల్పు♦కొనిపరుండె. 89

గీ॥ ఇరువదేండ్లు రణమొనర్చి ♦ యెట్టిఫలము నేని మనమెల్ల సాధింప ♦ లేనిచోట
నకట! భూమికి బరువుచే ♦ సై మనంగ నేల! పరువేల! యభిమాన ♦ మేల! యింక. 90

శా॥ పావిత్ర్యంబున కాటపట్టయిన యా ♦ పంజాబుకో పర్షియా
కో వెళ్ళన్ దలఁతున్; స్వతంత్రముగ నె ♦ క్కొల్పన్ దగున్ రాజ్యమున్;

నా వెంటఁ జనుదేరఁ గోరినను స ♦ న్నాహంబుఁ గావించి వా
రో వీరో మఱి యందఱో కదలి రా ♦ రో! యింక మున్నాళ్ళకున్. 91

గీ॥ యవనసంసర్గమును వీడి ♦ యవలికేగుటే శుభంబని యెంతు; మీ ♦ కెట్లు తోఁచు;
నెమ్మినెయిఁ దెల్పుఁడిపుడు; మీ ♦ నిర్ణయమును దాల్తుశిరమునమందార ♦ దామమట్లు" 92

—*) సలుంబ్రా కృష్ణసింహుఁడు ప్రతాపసింహు ననుసరింతుసని నివేదించుకొనుట (*—

మ॥ అని వాక్రుక్కచ్చియు నిల్చినంతట సలుం ♦ బ్రాధీశుఁడున్ లేచి భ
క్తిని హస్తంబులు మోడ్చి "భారతధరి ♦ త్రీ దాస్యనిర్మూలనం
బున దేశోద్ధరణంబునందు హృదయం ♦ బున్ నిల్పి యెంతెంత సే
యను సాధ్యంబగు నంతచేసితివి నీ ♦ వత్యంత దీక్షారతిన్, 93

సీ॥ వేనవేల్ రిపుల నొ ♦ ప్పించుపట్టునఁ గర్ణ పేయమై వింటి నీ ♦ వీరగర్జఁ;
దలఁద్రుంచు బహులాప ♦ దలు చుట్టినప్పుడు చెవియొగ్గి హుంకార ♦ రవము వింటిఁ;
దిండిలేక తపించు ♦ దినముల, విధిఁ జూచి పెడబొబ్బ పెట్టు చ ♦ ప్పుడుల వింటి;
స్వాతంత్ర్య సమరదీ ♦ క్షుకుఁ బూన్పు నీ యుపన్యాసంబులను జెవు ♦ లార వింటిఁ;

గీ॥ గాని కొండంత నొప్పితో ♦ గాసిపడుచుఁ బిడుగు పడినట్లు హృదయముల్ ♦ వ్రీలఁజేసి
విన్ననై దీనమగువాక్కు ♦ విని యెఱుంగ; ననలమున వ్రేల్చునట్లు వా ♦ మనసుపొగిలె. 94

గీ॥ నీహృదయపద్మపీఠ ని ♦ ర్వ్యాజ మెక్కి యలరి స్వాతంత్ర్యలక్ష్మి స ♦ హస్రభాను
కాంతులను వెల్గెఁ; దన్మహో ♦ ఖండదీప్తి కడలుకొని ఢిల్లి మొగలుల ♦ కనులుగుట్టె. 95

సీ॥ పురము రాజ్యము మాని ♦ మూఁడేండ్లు శ్రీహరిశ్చంద్రుండు పడిన క ♦ ష్టముల నెఱిఁగి
పదునాలు గబ్దముల్ ♦ వనవాసమున రామచంద్రుండు పడిన క ♦ ష్టముల నెఱిఁగి
పదియు మూఁడేండ్లుగాఁ ♦ బాండవుల్ గహనాంతరములలోఁబడిన క ♦ ష్టముల నెఱిఁగి
యిరువదిమూఁడేడు ♦ లీ వీ వనులఁ గుటుంబముతోడఁ బడిన క ♦ ష్టముల నెఱిఁగి

గీ॥ తారతమ్యంబుఁ దూఁచిన ♦ వారి యిదుమ లత్యగాధాపదావర్త ♦ మైన నీదు
చరితమున నొక్కపుట కొక్క ♦ చరణమునకు సాటిగావని గొంతెత్తి ♦ చాటనేర్తు! 96

సీ॥ అట్టె చూచిన దోసె ♦ డంతైన లేదు మేవాడరాజ్యము; సైన్య ♦ బలముగూడఁ
జాలనిదే! యుద్ధ ♦ సన్నాహ మల్పంబె! యటులున్న నేఁబది ♦ యైదు లక్ష
లగు కాల్బలము, పదు ♦ నైను లక్షలగు గుఱ్ఱముదండు విస్తార ♦ రాజ్యలక్ష్మి
యేనుంగులు పిరంగు ♦ లెన్నేనిఁ గలుగు విశ్వంభరాధీశుఁ డ ♦ క్బరునృపాలుఁ

గీ॥ డక్కై యుత్క్రాంత లూఁగి తూఁ ♦ గాడిపడఁగఁ దాఁకఁగలిగితి; వెన్నిసా ♦ ధనములున్న
నిన్నొకని గెల్వఁజాలక ♦ తన్ను కొనెడి ననుచు హాస్యాస్పదంబయ్యె ♦ నతని బ్రదుకు. 97

గీ॥ క్షణము విడక సైన్యము నంపి ♦ రణముసేయ నీపయికి నక్బ రంపించు ♦ నిరతధాటిఁ
బరిషయన్ సేన 'గ్రీసు'పైఁ ♦ బరవలేదు; యవనులు 'జరూసలెమ్ము'పై ♦ నరుగలేదు. 98

శా॥ ఈ విశ్వంభర పుట్టుటల్ మొదలుగా ♦ నిందాఁక నేదేశమున్
దేవంశమ్మునైనఁ గష్టముల నెం ♦ తే నాత్మబంధుల్ వలెన్
భావంబందుఁ దలంచుచున్ వలచుచున్ ♦ స్వాతంత్ర్యమున్ గొల్చిరే!
నీ వొక్కండవు దక్క శాంతినిరతిన్ ♦ నిర్నిద్ర తేజోనిధీ! 99

ఆ॥ ఇట్టి దేశబంధుఁ ♦ డిట్టి శూరోత్తముఁ డిట్టి రాజయోగి ♦ యిట్టి త్యాగి
లేఁడు లేఁడ టంచు ♦ మూఁడులోకంబుల మ్రోఁత లీనెఁ; గురిసెఁ ♦ బూలవాన. 100

సీ॥ అక్బరువిశ్వంభ ♦ రాధీశవమాళ్ళిది ధనసేవ; నీయది ♦ దైవసేవ;
యాతని దెల్లప్పు ♦ డాత్మవైభవము; నీయది నిరంతరము నా ♦ త్మావబోధ;
మతని కుండిన దెల్ల ♦ నైహికబలము; నిన్నాశ్రయించిన దెల్ల ♦ నాత్మబలము;
నతని దండఱ కన్ను ♦ లలరించు భోగంబు; నీది జగముమెచ్చు ♦ నిండుత్యాగ;

ఆ॥ మతఁడు జగము గెలిచె; ♦ నాత్మ గెల్చితివి నీ; వాతఁ డితరజనుల ♦ నాశ్రయించు;
నీవు స్వాశ్రయుఁడవు; ♦ నీకు నాతని కెనలేదు; జగముక్రిందు ♦ మీఁదులయిన. 101

గీ॥ కష్టమే మనపాలిటి ♦ కల్పతరువు; దుఃఖ మెఱుఁగని హృదయముల్ ♦ దుర్బలమ్ము;
లతి పరిమితంబయిన శక్తి ♦ యలరు నరుల కపజయంబులు బలవర్ధ ♦ కౌషధములు. 102

వ॥ ధర సృష్టించిన బ్రహ్మ, ఫాలమున నే ♦ త్రంబుండు శంభుండు, న
ప్పురుషోత్తంసుఁడు శౌరియున్, నరులుగాఁ ♦ బుట్టొంది యేనూఱులో
తరముల్ పోరినఁగాని నీకరణి స్వా ♦ తంత్ర్యంబు నిట్లింత దు
ర్భర నిష్ఠారతిఁ గొల్వ లేరని వచిం ♦ పన్ నేర్తు వేనోళులన్, 103

గీ॥ శక్తి దాఁపక యాత్మవం ♦ చనము లేక నీయడుగునీడఁ దలఁదాల్చి ♦ నిన్నుఁగొలిచి
త్యాగ మించుక యెఱిఁగితి ♦ నను యశంబు సంతరించితి నర్వాత ♦ చాలకున్న. 104

గీ॥ వాసుదేవుని చరణపూ ♦ జాసుమమటు నిరత మౌఁదలఁ దాల్తు నీ ♦ నిర్ణయమ్ము;
నీడ మేవాడ నున్న నే ♦ వాడ నున్న క్షణమునినుఁ బాసి యుండ నీ ♦ జన్మమందు. 105

క॥ మూన్నాళ్ళ గడువు లోనన సన్నాహ మొనర్చి మేము ♦ సంసారములన్
విన్నుఁ గొలువంగ వత్తు"మటన్న "నటులె చేతు" మనుచు ♦ నంద అరుగుచున్, 106

❁ గీ॥ ధన కనక వస్తు వాహన ♦ తతుల నెల్ల బండ్ల నంపి మూన్నాళ్లకు ♦ వచ్చి చేరి,
రా॥ప్రతాపు నానతి నంద ♦ అనుచరులును నశ్వముల నెక్కి కదల నా ♦ యత్తమైరి. 107

గీ॥ వచ్చి యంకారుపైఁ జేయి ♦ వైచి నిలిచి యాప్రతాపప్రభూత్తంసుఁ ♦ డాగిరీంద్ర
సమతలమునుండి చుట్టు దే ♦ శంబునెల్లఁ గలయఁ గన్గొనెఁ గన్గొలం ♦ కులు ద్రవింప.

---

❁ పాఠాంతరము.

గీ॥ వాసుదేవుని చరణపూ ♦ జాసుమమటు నిరత మూఁదలఁ దాల్తు నీ ♦ నిర్ణయంబు
నీడ మేవాడనున్న నే ♦ వాడనున్న నేను నీవాఁడ ననువాఁడ ♦ నెపుడుఁగూడ.

క॥ మూన్నాళ్ల గడువులోపల సన్నాహ మొనర్చి మేము ♦ సంసారములన్
నిన్నుఁ గొలువంగ వత్తు మటన్న "నటులె చేయుఁ"డని ధ ♦ రాధిపుఁ డనఁగన్,

గీ॥ ధన కనక వస్తు వాహన ♦ తతులనెల్ల బండ్లపైఁ దోవపట్టించి ♦ పంపి రాజ
పుత్రవీరులు మఱల నా ♦ బూగిరీంద్రమునకు వచ్చిరి ప్రభుభక్తి ♦ యినుమడింప.

గీ॥ మెఱుఁగు బంగారు పూలువోల్ ♦ కిరణతతుల బాలభానుఁడు ప్రకృతిశో ♦ భలను బెంప
నలసలుంబ్రాధిపతిఁజూచి ♦ యాప్రతాపుఁ "డేకలింగేశునకు మ్రొక్కి ♦ యిపుడె వత్తు

గీ॥ అంతలోన మీరందఱు ♦ ననుచరులను బయనమొనరింప నాయత్త ♦ పఱచుఁడనుచుఁ
బలికి గర్భాలయంబులో ♦ పలికిఁజనియె! వగలఁబొగులుచు నాసలుం ♦ బ్రావిభుండు,

సీ॥ వలదన్నసామ్రాజ్య ♦ పట్టాభిషేకంబు సలిపితి భువనమా ♦ శ్చర్యపడఁగ!
బయటికి వెడలుచో ♦ వనిలోన ముండ్లను రాల్ దీసి త్రోవ శు ♦ భ్రముగఁజేతు!
"నా హేరియా"వేఁట ♦ కరుదెంచునపుడెల్ల నన్నిసామగ్రు లా ♦ యత్తపఱతు!
శాత్రవు లెదురైన ♦ క్షణమున సకలసైన్యము దీర్చి యనికి సి ♦ ద్ధముగనుంతుఁ!

గీ॥ గాని, గుండెలు బరువెక్కఁ ♦ గా స్వదేశ మట్టి విడనాడిపోవుచో ♦ ననుచరులను
సర్వసన్నాహమునఁబూన్చు ♦ జాలిమాలినట్టి కార్యముచేయు శై ♦ లైన నెఱుఁగ.

మ॥ అదిరా! దేవుని కన్నుమిన్న యని భ ♦ క్త్యావేశమున్ బెంచి యి
ర్వదినైదేండ్లుగ దేశమాతకు సప ♦ ర్యల్ చేసి శుష్కించి క
ష్టదశన్ గుందిన విశ్వవీరునకు దే ♦ శత్యాగమున్ జేయు దుః
ఖదశన్ దెచ్చితె! దుష్టదైవమ! మహో ♦ గ్రం బయ్యె నీచెయ్దముల్!

సీ॥ ఎత్తినచేయి యిం ♦ తేని దింపక రణాగ్రముల శాత్రవుల శీ ♦ ర్షములు తఱిగె!
విశ్వవిశాలమై ♦ విలసిల్లు హృదయంబు స్వాతంత్ర్య లక్ష్మి కా ♦ స్థాన మిచ్చెఁ!

—*) ప్రతాపసింహుఁడు మాతృదేశమునకుఁ దుది నమస్కార మర్పించుట (*—

మ॥ "అకటా! చేసిన యన్నియత్నములు వ ♦ మ్మై గెల్పు సుంతైనఁ జే
రక దైవోపహతుండనై యిదె మహా ♦ రాణాప్రతాపుండు తా
వక కల్యాణ పదాంబుజాత యుగ సే ♦ వా భాగ్యముల్ వీడి కూ
లికిఁ గొల్వన్ జను నన్యసీమలకుఁ; ద ♦ ల్లీ! వీని నెట్లోర్తువో! 109

శా॥ వ్యోమం బంటెడు నీదు శైలశిఖరం ♦ బుల్ మంజులమ్మైన యా
రామశ్యామలసీమలుల్ ప్రబల దు ♦ ర్గశ్రేణులుల్ సారవ
ద్భూముల్ నీ సముదార భాగ్యవిభవం ♦ బుల్ వీడిపో నుంటిఁ; ద
ల్లీ! మేవాడ సతీమతల్లి! మదిలోఁ ♦ గ్లేశంబు రా నీకుమీ! 110

గీ॥ ఇరువదేండ్లుగ నుత్తమ ♦ పరికరముల భక్తిఁ గూర్చి నా పావన ♦ స్వాంతమందుఁ
దల్లి! నేఁ గట్టుకొనిన స్వా ♦ తంత్ర్య వజ్రభవనరాజంబు కన్నీటి ♦ వఱఁద మునిఁగె. 111

మ॥ అతిభీమంబుగఁ బెల్లు రేఁగి నిబిడం ♦ బై మూఁగి యీ సర్వభా
రతదేశంబును ముంచివైచిన మహో ♦ గ్రంబైన దాస్యాంధకా
రతతిన్ దేవుని దృష్టిగూడ నణుమా ♦ త్రంబున్ జొరన్ బోని దు
స్థితి సంధించెడు పాపికాల మరుదెం ♦ చెన్; జూచి యెట్లోర్తునో! 112

---

దనదుసర్వస్వ మ ♦ ప్పనచేసి మాతృదేశారాధనమునఁ బు ♦ ణ్యతముఁ డయ్యెఁ!
ద్యాగానురక్తి ధ ♦ ర్మాసక్తి విశ్వోన్నత స్థానమంది త ♦ ద్దయును వెలిఁగెఁ!
గీ॥ జతు రుదధి సంవృతావనీ ♦ సార్వభౌమ పదవి రానున్న మాతృభూ ♦ పాదసేవ
విడని రాజర్షిచంద్రుండు ♦ వెడలవలసెఁ దనదు సీమలోఁ దలదాఁచు ♦ తావు లేక.
సీ॥ త్రిభువనాదర్శ వం ♦ దిత పరమోత్కృష్ట సద్గుణగణరత్న ♦ సలిలరాశి
రాణాప్రతాప వీ ♦ రప్రభు వదనమం దలరారు నవమంద ♦ హాసరేఖ
జీవనౌషధముగఁ ♦ ద్రావి యెట్టెట్టులో దినములు కడఁద్రోసి ♦ కొనుచు నుంటి!
నా యభాగ్యమువిూఁది ♦ నాస్వామి తరితప్పి యక్కటా! దైవోప ♦ హతుఁడనయ్యెఁ!
గీ॥ గట్ట! దరహాసశూన్యమై ♦ కాంతిలేని యీమహారాజు ముఖము నే ♦ నెట్లు చూతు!
నెట్లుభరియింతు! నెటుమందు! ♦ నేమియందు! ముందుమాకుండుడిందెడు ♦ చందమున్నె!"
గీ॥ అనియరిగి కొండయంత దై ♦ న్యమునఁ గుందియనుచరుల నశ్వములనెక్క ♦ నాజ్ఞ చేసె;
నల్ల నల్లన గర్భాల ♦ యంబు విడిచి వాకిటిని దాఁటి రాజలో ♦ కైక గురుఁడు,
గీ॥ వచ్చి యంకారుపైఁ జేయి ♦ వైచి నిలిచి యఖిలభువన ప్రపూజ్యమౌ ♦ నాగిరీంద్ర
సమతలమునుండి చుట్టు దే ♦ శంబునెల్లఁ గలయఁజూచెఁ గ్రీఁగంటి యం ♦ చులు చెమర్ప.

సీ॥ విశ్వపావనమైన ♦ వృత్తి వర్తించు గోబ్రాహ్మణులకుఁ దగ్గు ♦ పాటు గలిగె;
ధాతృనిభుల్ మునుల్ ♦ స్థాపించు వర్ణాశ్రమాచారవిధు లడు ♦ గంటిపోయెఁ;
బెట్టని కోటలై ♦ వెలసి నిర్గొల్చు వీరుల పౌరుషము గంగ ♦ గలిసిపోయె;
మంగళలక్ష్మి స ♦ మానలౌ సాధ్వుల సౌశీల్యగరిమ కా ♦ ర్శ్యంబు నందె;
గీ॥ వేయునేండ్లుగ వ్రేటుపై ♦ వ్రేటుదగిలి చిక్కి ససిదక్కి స్రుక్కి కృ ♦ శించి నాదు
పాలనమున మంచముపట్టి ♦ డీలుపడఁగఁ జాలుపడితివె! తల్లి! మే ♦ వాడలక్ష్మి! 113
సీ॥ మాతృదేశము శుద్ధ ♦ మతిఁ గొల్వఁగాఁజాలు సుతుఁడును లోకవం ♦ దితుఁడటంచు
భౌతికసుఖము స ♦ ర్వము సన్న్యసించి ధర్మైకవర్తనుఁడనై ♦ యిన్నినాళ్లు
రక్త మేదో మాంస ♦ రాజి నూడ్చుచు నిన్ను నుద్ధరించి కృతకృ ♦ త్యుండ నగుదు
నని కృషి చేసితి; ♦ నక్కట! నాపాపి హస్తము లాభాగ్య ♦ మందలేదు!
గీ॥ పూర్వవైభవమున నీవు ♦ పొదలుచుండ నా కలుషనేత్రములఁ జూడ ♦ లేక పోతి!
నాశ లడుగంటెఁ! బ్రాణంబు♦లవిసిపోయెఁ; బ్రతుకెవృధయయ్యెఁ! దల్లి! మే♦వాడలక్ష్మి!
సీ॥ పసితనమ్మున లేడి ♦ వలె లాఘవమ్మున నద్రుల కెగఁబ్రాకి ♦ నట్టిచోట్లు!
పట్టాభిషేకసం ♦ పద్విభూషితుఁడనై యధికృతి నెఱపిన ♦ యట్టిచోట్లు!
కవచ ఖడ్గము లూని ♦ కదనరంగమున ఘోరారులఁ గడతేర్చి ♦ నట్టిచోట్లు!
నొకఁడనై, శత్రుల ♦ నుడికించి జగ మెన్న నపజయంబు వహించి ♦ నట్టిచోట్లు!
గీ॥ కట్ట బట్టయుఁ దినఁ గూడు ♦ గానకున్న నచలభక్తి నిన్ సేవించి ♦ నట్టిచోట్లు!
హృదయఫలకమ్మునందు ము♦ద్రితములయ్యె; మఱువలేనమ్మ! నను నేను♦మఱచుదాఁక!
గీ॥ వీరు లాత్మీయు లాప్తులు ♦ పృథ్వివరులు బంధువులు నీగిరీంద్ర గ ♦ ర్భముల నొఱుఁగ
బిరికిదొంగనుగా నిన్నుఁ♦దొఱఁగి జాఱ, వ్రాసె నాతల ధాత! మే♦వాడ మాత! 116
గీ॥ తలఁ దఱుగనోపు బహువిప ♦ ద్దశలనైనఁ గాంతి యించుక చెడని నా కన్నుదోయి
నశ్రుకణములు వొడమె; నీ♦యడుగుదోయినమ్మ! ముక్తాభిషేకంబు ♦ నాచరింతు. 117
శా॥ నేనే గాక మఱొక్క ధీరుఁ డెవఁడే ♦ నిన్ నిన్ను సేవింప నెం
తేనిన్ బూనిన, వాని పుణ్యమున నే ♦ నిన్ దల్లి! మేవాడ ల
క్ష్మి! నిత్యోత్సవ నిత్య మంగళ జయ ♦ శ్రీ నిత్య సౌభాగ్య రే
ఖా నిత్యప్రభ లెల్ల నీకుఁ గలుగున్ ♦ గాకంచుఁ గాంక్షించెదన్. 118
సీ॥ హారావళీశైల ♦ మనుపమస్వాతంత్ర్య వీరదుందుభుల శ ♦ బ్దించుఁ గాక;
గట్టలు పుట్టలు ♦ గుహలు స్వధర్మతత్పరుల యశంబు మా ♦ ర్పలుకుఁగాక;

మేవాడరాజ్యల ♦ క్ష్మీపరాక్రమ మెల్లవేళల భువిఁ దాఁడ ♦ వించుఁగాక;
త్యాగైకధనుల స ♦ త్యస్వరూపులచే రహించి నీకడుపు ఫ ♦ లించుఁగాక;
గీ॥ భానుకులగౌరవంబు ని ♦ ల్పంగ నోడి త్యాగమునఁ గుంటుపడి నీప ♦ దములఁ గొలుచు
పున్నెములులేకదూరభూ♦ములకు నేగు మమ్ముమాపేళ్ళ లోకంబు♦మఱచుఁగాక." 119
గీ॥ అనుచు భక్తినిజూపి వం ♦ దన మొనర్చి మఱువఁజాలక చేరెడు ♦ మట్టి దీసి
కనుల నద్దిరుమాలునఁ ♦ గట్టి యూర్చి యాప్రతాపుఁ 'డంకారు'పై ♦ నధివసించె. 120

—*) పర్షియా ప్రయాణము (*—

క॥ ఆరీతి నెల్లవారలు చేరెడు చేరెడుగ మట్టి ♦ చేకొని తలలన్
❀ జేరిచి మ్రొక్కుచుఁ బయనం బారంభించిరి ప్రతాపుఁ ♦ డందఱ నడుపన్. 121
గీ॥ ఆత్మదేశంబు విడనాడ ♦ నడరు పౌడమి గుండె బరువెక్క; నెలుఁగు డ ♦ గ్గుత్తిక వడె;
నచలరంగంబు నదలి వా ♦ యువ్యదిశకుఁ దరలి రందఱు మౌనము♦ద్రలు వహించి. 122
గీ॥ ఒకరినొక్కరు పల్కరిం ♦ పరయె త్రోవఁ బ్రకృతిసౌందర్యమింత చూ ♦ డరయె యశ్రు
ధారలన్ దోఁగి సైన్యము ♦ ద్రలనుదూఁగి వార లరిగిరి గిరిపాలి ♦ మేరఁ జేర. 123

—*) భామాసాహిమంత్రి మేవాడకు వచ్చుట (*—

సీ॥ ముడుతలువడ్డ మో ♦ మునఁ బట్టెవర్ధనం బఱుత జందెంబు బ్రా ♦ హ్మణతఁ దెలుప,
నిండార నెరసి పం ♦ డిన శిరోజమ్ములు కమియు మూఁగిన వయో ♦ గరిమఁ దెలుప,
వ్రాలిన బొమల వె ♦ ల్వడు వాఁడి నునుఁజూపు లెవిరి డెందముఁజొచ్చు♦పదనుదెలుప,
నధరంబుపై నంటి ♦ యంటని చిఱునవ్వు తొలకని నిత్యసం ♦ తుష్టిఁ దెలుప,

---

❀ Unable to stem the torrent, he had formed a resolution worthy of his character, he determined to abandon Mewar and the blood stained Chittoor (no longer the stay of his race) and to lead his Sesodias to the Indus, plant "the crimson banner" on the insular capital of the Sodgi, and leave a desert between him and his inexorable foe. With his family and all that was yet noble in Mewar, his chiefs and vassals, a firm and intrepid band, who preferred exile to degradation, he descended the Arawulli and had reached the confines of the desert, when an incident occured which made him change his measures, and still remain a dweller in the land of his fore-fathers. If the historic annals of Mewar record acts of unexampled severity, they are not without instances of unparalleled devotion. "Annals of Mewar."

గీ॥ బుజమునను భైరవాసము ♦ మొగమునందు బ్రహ్మవర్చస ముదితమై ♦ పరిఢవిల్ల
⊛ నుక్కడునుకఁబోలినయశ్వ♦మెక్కియొక్క శాంతమూర్తిబ్రాహ్మణుఁడుసా♦క్షాత్కరించె.
సీ॥ ఆగుంపునకు నెల్ల ♦ నగ్రభాగమున వర్తించు ప్రతాపేందు ♦ దెసను జూచి
యావృద్ధభూసురుం ♦ డశ్వంబు నిలిసి "యోవీరపుంగవ! నేను ♦ దూరదేశ
మందుండి వచ్చితి ♦ నయ్య! యేకొండలయందుఁ బ్రతాపేందుఁ ♦ డధివసించు!
నెఱుఁగుదు రే కద! ♦ యెయ్యది తోవ! నా కెఱిఁగింతురె కృప వ ♦ హించి" యనిన
గీ॥ నాత్మదేశంబు విడువఁ గొం ♦ డంత వగపు దోఁపఁ దలమొత్త కరుగు ప్ర ♦ తాపదేవుఁ
డామహీదేవు దివ్యవా ♦ క్యమ్ములపుడు విని వినక తనతోవను ♦ జనుచునుండె. 125
శా॥ "ఏమయ్యా! దయయుంచి యిట్లు కనుఁగొ ♦ మ్మో! వృద్ధుఁడన్; దూరపుస్
సీమల్ దాఁటుచుఁ బెక్కు కష్టముల గా ♦ సిన్ బొంది నే వచ్చితిన్;
భూమీశుండు ప్రతాపుఁ డీగిరుల నెం ♦ దున్ గాపురం బుండు! నెం
దే మీ రాతనిఁ జూచియున్న నెలవిం ♦ డి"డంచు బ్రార్థించినన్, 126
క॥ కనులెత్తి రాజమణి విప్రుని వదనముఁ గాంచి యశ్వ ♦ మును నిలుపుచు "నో
యనఘా! మీరెవ! రెందులఁ జనుదెంచితి"రన ద్విజన్మ ♦ సత్తముఁ డంతన్, 127
సీ॥ "పరిపియానుండి నే ♦ వత్తు; భామాసాహి నాపే"రనినఁ దత్క్ష ♦ ణమ ప్రతాపుఁ
డాస్యంబు వికసింప ♦ నశ్వంబు డిగి భక్తితాత్పర్య విహితప్ర ♦ దక్షిణంబుఁ
జేయుచు నల్లనఁ ♦ జేతులు జోడించి "నిరతంబు నీపాద ♦ నీరజములు
భజియించు నీదు సే ♦ వకుఁడు రాణాప్రతాపుఁడు మ్రొక్కుచుండె నీ ♦ యడుగువోయి"
గీ॥ నని నిలువ నంద అనుచరు ♦ లబ్బురమున నశ్వములనుండి దిగిరి; ధ ♦ రామరోత్త
ముఁడు తురంగము డిగ్గి య♦ప్పుడమిఱేనిఁ గౌఁగిటను జేర్చి హర్షాబ్ధిఁ♦దోఁగి నిలిచి, 128
శా॥ "నా విశ్వాస్యత దివ్యకల్పతరువున్ ♦ నా వజ్రకోటీరమున్
నా విస్తార మనోంబుజాతతరణిన్ ♦ నా కీర్తినిక్షేపమున్
నా వేల్పున్ మణి నాదు రాజధనమున్ ♦ నా స్వామి దర్శించి నా
సేవన్ గూర్పఁగ వచ్చినాఁడఁ; గృప పీ ♦ క్షింపంగదే! భృత్యునిన్. 129

⊛ The minister of Pratap whose ancestors had for ages held the office placed at his prince's disposal, their accumulated wealth, which with other resources, is stated to have been equivalent to the maintenance of twenty five thousand men for twelve years.

"Annals of Mewar."

క॥ పరిశుభ్రతర సుధాసాగర వీచిక లట్లు నీదు ♦ ఘనకీర్తికళల్
మెఱసె దెసల; నీయంతటి పరమోత్తమధర్మవీర ♦ వరుఁ డుండెడునే! 130

సీ॥ స్తిమితమై తుదల వి ♦ చ్చి యుదార గంభీరకాంతు లీను వెడంద ♦ కనులతోడఁ;
బరువంపు బుగ్గల ♦ పైన రెక్కొను మీసల వెలుంగు మోము వా ♦ లకముతోడ;
వీరమహాలక్ష్మి ♦ విహరించు దగ్గమై విరిసిన బలితంపు ♦ టురముతోడఁ;
దలయెత్తు వాఁడి కుం ♦ తముఁ గేల నూఁది ధీరత యుట్టిపడ నిల్చు ♦ రాణతోడ;
గీ॥ నౌదలఁ దురాయి, వీరతే ♦ జోదురీక్ష వదనమునఁ గుంకుమపుబొట్టు ♦ వజ్రవర్మ
మొదల వెలుగొంద నలరు నీ ♦ పొడవుఁ గంటి; నెంత కళ గల తండ్రివో ♦ యీ! ప్రతాప!

సీ॥ సత్త్వబుద్ధిని రిపు ♦ షడ్వర్గము నెదిర్చి గెల్చినా; వరులను ♦ గూల్చినావు!
తులలేని దేశభ ♦ క్తులయందు మేటివై హెచ్చినావు; యశంబుఁ ♦ దెచ్చినాఁడ!
విరువదేండ్లుగఁ బైన ♦ నొఱగు నాపదలెల్ల నోర్చినావు; జయింప ♦ నేర్చినావు!
కులసనాతనధర్మ ♦ ములను సుస్థిరము గావించినావు; ప్రబోధ ♦ మెంచినాఁడ!
గీ॥ వొక్కపరి నిన్నుఁ గననెంచి ♦ యుంటి; నిదియె తరుణ మనుకొంటి; నీదివ్య ♦ ధవళయశము
నెంచుకొనుచుంటి; నితరుల ♦ కిది యలభ్యమంటి; నూతేండ్లు నీకు దీ ♦ ర్ఘాయు వంటి"

క॥ అని యాశీర్వాద మొనర్చిన విప్రోత్తముని జూచి ♦ నృపగురుఁడును "దే
వునియట్లు చేరవచ్చిన నినుఁ గని ధన్యుండ నైతి ♦ నే నిమ్మెడలన్. 133

మ॥ మును చాణక్యయుగంధరప్రముఖులన్ ♦ బోలెన్ మహానీతివి
ద్యను మేవాడనృపాళికిన్ గఱపి రా ♦ జ్యం బూర్జితంబై వినూ
తన కల్యాణ జయోదయాదికము లం ♦ దన్ జేసి మాభక్తి కె
ప్డును బాత్రమ్మగు నీదు దివ్యచరణం ♦ బుల్ గంటి నీనాఁటికిన్. 134

మ॥ భవదత్యుత్తమనామ మెల్లపుడు మే ♦ వాడ్దేశమందెల్ల గౌ
రవధామంబయి యొప్పుఁ; గట్టకడ కు ♦ గ్రామంబులందున్ బ్రజా
నివహం బద్దమరేయి మాటవరుసన్ ♦ నీపేరు విన్నంత భ
క్తివిరాజిల్ల నమస్కృతుల్ సలిపి నిన్ ♦ గీర్తింతు రోసద్గురూ! 135

గీ॥ పరిషియా కేగుదెంచి నీ ♦ చరణపూజ సలుపవలెనంచు నెన్నిమా ♦ ఱులో తలఁచితి;
నిమిష మూపిరి వోని యు ♦ ద్ధముల మునిఁగి కాలు గదలింపలేక యీ ♦ లీల నుంటి"

గీ॥ అనుచు వచియించినంత హ ♦ ర్షాంబురాశిఁ దేలి భూదేవమణియు "నో ♦ దేవ! నేను
నిట్లె యనుకొని యనుకొని ♦ యెట్లొ నేఁడు కాలు గదలించుకొనుచు రాఁ ♦ గలిగినాఁడ

గీ॥ అనయ మేఁ గొల్చు పూర్వమ ♦ హామహీంద్ర శుభ తపః ఫలమును నిన్నుఁ♦జూచుకతన
జన్మ చరితార్థమయ్యె; నె♦చ్చటికి నేఁటి పయన మోయన్న!"యనఁ బ్రతా♦పప్రభుండు;
గీ॥ "స్వామి! నినుఁబూజచేసి పం ♦ జాబుకవల నే స్వతంత్రరాజ్యము నిల్ప ♦ నిటు వెడలితి;
వెదుకఁబోయినతీవయే ♦ యెదురుపడియె ననఁగ, నిండె నీదివ్యద ♦ ర్శనము గలిగె. 139
గీ॥ మేరువును బెల్లగించి కో ♦ టీర మిడుము నుదయపురలక్ష్మికని లోక ♦ మురలఁదాఁకి
యిరువదేండ్లు పోరితి; నా య♦దృష్ట మెల్లఁజెడియెనీవిధమున; నేమి ♦ చేయువాఁడ."140

—*) భామాసాహి ప్రతాపసింహునకు ధర్మోపదేశంబు చేయుట (*—

సీ॥ అని దైన్య మడరఁ బ♦ల్కినను భామాసాహి విని విన్నవోయి యా ♦ ననము వంచి
"శ్రీహరీ! నాదుర ♦ దృష్ట మేమందు! నీవలన నింతటి వేఁడి ♦ పలుకు వింటి;
నీవార్త విని వ్రీల ♦ దే! హృదయము శిలాఫలకమో! లోహమో! ♦ వజ్రమొక్కొ!
నూఱామడలదూర ♦ మీరీతి వచ్చు నుత్సాహమ్ము సుడిసి వి ♦ ధ్వస్తమయ్యె;
గీ॥ నకట! నామేనఁ గొనియూపి ♦ రాదుచుండఁ బరమపుణ్యస్వరూప మే ♦ వాడలక్ష్మి
వైభవప్రాభవాంకంబు ♦ భానుకులము చెడిన నోర్తునె! విధివ్రాలు♦తుడుతుఁగాక. 141
మ॥ అకటా! యుత్తమభారతీయుఁడవు ఘో ♦ రాపత్సమూహంబు నిం
చుక లెక్కింపని విశ్వవీరుఁడవటం ♦ చున్ నిన్ను లోకప్రజా
నికరం బెప్పుడు సంస్తుతుల్ సలుపఁగా, ♦ నీవే స్వకృత్యంబు నూఁ
దక పోనాడిన ధర్మ మెట్లు కొమరొం ♦ దన్ నేర్చు లోకమ్మునన్! 142
గీ॥ సడి యెఱుంగని కర్మవీ ♦ రుఁడవు నీవు; నీకు జయమైన నదియు లో ♦ కైకజయము;
నపజయంబైన నదియు దే ♦ శాపజయమునై ప్రపంచాపజయమునౌ ♦ ననఁగవలయు.
గీ॥ పెక్కువేల్ మైళ్ళపైనున్న ♦ యిందు నెపుడు నీదుపరిపాలనముఁగూర్చి ♦ నీయఖండ
కదనదీక్షనుగూర్చి త్యా ♦ గంబుఁగూర్చి సాహసముఁగూర్చి కర్ణర ♦ సాయనముగ. 144
సీ॥ మాపూర్వు లెప్పుడు ♦ మీపూర్వనరపాలమౌళుల చెంగట ♦ మంత్రులగుచు
వెలలేనిభక్తితోఁ ♦ గొలిచిరి; నిరుపమత్యాగశీలుఁడు చండ ♦ ధరణిపతి ప్ర
ధానప్రధానిప ♦ దము నొందు పిదప రెండవ మూఁడవ ప్రధాను ♦ లవుచు నాదు
పితరులు నేను సే ♦ వించుచుంటిమి; నల్వదేండ్లయ్యెఁ బరిషియా ♦ కేగి నేను;
గీ॥ పరమ ధార్మికులైన మే ♦ వాడ నృపుల నెమ్మది స్మరింపకయె యీ ది ♦ నమ్ముదాఁక
దేవ! పిడికెడాహారము ♦ దిని యెఱుఁగము; నాశరీరంబె మీది ప్రా ♦ ణంబె మీది. 145

మ॥ వితతప్రేమను నేను గొల్చెదు మహీ ♦ భృద్వంశమం దిట్టి ద
ర్పిత శౌర్యాఢ్యుని నిన్నుఁ బోలిన మహా ♦ వీరుండు జన్మించెనం
చతిహర్షమ్మున మండువేసవి నుద ♦ గ్రాయాసభారంబు నో
ర్చితి; దూర మ్మిటు లేగుదెంచితి; భవ ♦ చ్ఛ్రీపాదముల్ గొల్చితిన్. 146

కం॥ కడు వృద్ధుఁడ; మేవాడ్ భక్తుఁడ; సచివుఁడ; భూమిసురుఁడఁ; ♦ దోఁచిన మాటల్
నుడివెద; విని నీ తోఁచిన వడువున మెలఁగంగవచ్చు ♦ వలదనను నృపా! 147

సీ॥ మేవాడ విడిచి యిం ♦ కేవాడలకునైనఁ బరువెత్తిపోవుట ♦ భావ్య మగునె!
పాదరసమువోలెఁ ♦ బరిపరివిధములఁ బాఱిపోయిన దాన ♦ ఫలము గలదె!
నిలువుము; ధైర్యంబు ♦ నిలుపుము; నీ పరిస్థితులెల్లఁ జక్క యో ♦ జించుకొనుము!
ఆత్ర మేటికి? శాంతి ♦ నందుము; నిన్నుండి నీవెప్డు దూరంబు ♦ పోవలేవు!

గీ॥ చక్రవాళాచలము దాఁటి ♦ చనినఁగాని వనధిసప్తకమున మునిం ♦ గినను గాని
కడ కెచటికేగినను బ్రతా♦పుఁడవుగాక మాఱి మఱియొక్కరుఁడవగు♦మాద్రి గలదె! 148

గీ॥ చనదు కృషి నిరసింపఁగా ♦ సాధకునకు; నదియ యన్నిఁట నరుని యో ♦ గ్యతను బెంచుఁ;
గృషిని రోయు వానికిఁ జోటు♦క్షితిని లేదు; వసుధ కెల్ల శుభం బట్టి♦వాని పోక. 149

గీ॥ అలజడిని మున్గినపుడె సత్యము జయించు; నపజయంబుల నది పెంచు ♦ నాత్మశక్తి;
యనుపమత్యాగమును సత్య ♦ మాప్తమిత్రులంద్రు: స్వాతంత్ర్యతత్త్వజ్ఞు♦లైన బుధులు. 150

గీ॥ అఖిలదిశలందు నాపద ♦ లలముకొనుచు దిక్కుదోఁపని విషమ సం ♦ దిగ్ధదశల
ధైర్యమును జిక్కపట్టక ♦ తలఁగె దేని నీబలము చాల దనియె నే ♦ నిర్ణయింతు. 151

గీ॥ ప్రాణమున కెక్కుడైన మే ♦ వాడ విడి వెడలిపోఁగాదు; పోఁగాదు; ♦ వినుఁడునాదు
ప్రార్థనము; కాదు కూడద ♦ టంచుఁ బోవఁదలఁతు వేనియుఁబోనీక ♦ నిలువరింతు. 152

ఉ॥ పూవులు రాలె; నాకులును ♦ బోయెను; మ్రుండ్లును మ్రోడు నిల్చె; నీ
వీవిధిఁ గేతకిన్ విడువ ♦ కేటికిఁ జుట్టె"! దనన్ "వసంత ల
క్ష్మీవిభవంబు సోఁకినఁ జి ♦ గిర్చి తరుల్ కుసుమించునన్న యా
శావిసరంబుచే నిలుతు" ♦ నంచు వచించుఁ గుమారభృంగమున్." 153

కం॥ అని వచియింపఁ బ్రతాపుని కనులను ముత్తెంపు టశ్రు ♦ కణములు జాల్వా
రిన విప్రసచివుఁ గని "యేమని నీవాత్సల్యగరిమ ♦ నభినందింతున్. 154

చ॥ పరిమితశక్తుఁ డొక్కఁడ వి ♦ పర్యయవేళ స్వధర్మ మార్గమున్
దొఱఁగునయేని వత్సలతఁ ♦ దోఁచి మహాపురుషాకృతిన్ బరా

త్పరుఁడు ప్రబోధ మిచ్చుచు న ♦ పాయముఁ గాచి పథంబుఁ జూఁపునం
చెఱుఁగుదు మిమ్ము నంటి విబు ♦ ధేంద్రుల మూలమునన్ గురూత్తమా! 155

గీ॥ స్వామి! నాపైనఁ బరమవా ♦ త్సల్యపశత నింతదూరము వేంచేసి ♦ యిటు లపార
పురుషకారము నేర్పు న ♦ మూల్యహితము దైవ నిర్మాల్యమటు శిర♦సా వహింతు. 156

గీ॥ అఖిలభువనావనంబు నీ ♦ యమృతగీతి నాహృదయతంత్రిలను మీటి ♦ నను గఱంచె;
హరగురు పదంబులటు నీప ♦దాంబుజమ్ము లనఘ! యనవరతమ్ము సే♦ వ్యములు నాకు.

సీ॥ అభిలషించినరీతి ♦ నాజ్ఞ సేయుచు దేవ! పనిగొను”మని వచిం ♦ పంగ, విప్రి
సత్తముండును “క్షణ ♦ క్షణ మమూల్యం బిప్డు; కాలంబు వృథసేయ ♦ గాదు మనకుఁ;
జర్చింపఁ దగిన వి ♦ షయము కొంచెమె, నిమేషము మాటలాడినఁ ♦ జాలు! ప్రకృత
మనుసరింతము! లేదు ♦ వ్యవధి; జా గేటికి! రమ్మల్ల నింబవృ ♦ క్షమ్ము దరికి;

గీ॥ మఱచి తింకొకమాట నీ ♦ మంత్రిమాళి యనుభవజ్ఞుండు; స్వామిభ ♦ క్తాగ్రిగణ్యుఁ;
డల సలుంబ్రాధిపతిఁ బిల్వు;♦మాయనఘుఁడు లేని మంత్రాంగ మదిపూలు♦ లేనిపూజ.”

మ॥ అని బోధింపఁ బ్రతాపసింహుఁడు సలుం ♦ బ్రాధీశ్వరున్ హెచ్చరిం
చిన నాధన్యుఁడు చేరఁగా నరిగి “మీ ♦ శ్రీపాదరాజీవద
ర్శనమున్ జేసెడి యీవిధేయుఁడె సలుం ♦ బ్రాకృష్ణసింహుం’’ డటం
చని సాష్టాంగనమస్కృతుల్ సలుప, న ♦ య్యాచార్యుడున్ బ్రీతుఁడై; 159

—*) భామాసాహి-ప్రతాపసింహునకు రాజనీతి నుపదేశించుట. (*—

క॥ లెమ్మనెఁ; జని ముప్వురు వృక్షమ్ముదరిన్ జేరి; రధిక ♦ సంతోషము చి
త్తమ్మున వెలయఁగ నృపు నాస్యమ్మును గని “యవధరింపు ♦ మవధానముతో. 160

గీ॥ స్వామ్యమాత్య సుహృత్కోశ♦సైన్య దుర్గరాష్ట్రములు ననుసివి యేడు♦ప్రకృతులండ్రు;
ప్రకృతిబల మున్న నేకాని ♦ పార్థివునకు నించుకేనియు నాస్తిక్య ♦ మెసగఁబోదు. 161

గీ॥ ఇన్నిఁటను నెన్నియున్నవో ♦ యెంచిచూత; ముత్తమకులీనతయు మహో ♦ దాత్త వీర
వర్తనము సత్యసంధత ♦ వఱలు నీకు రాజరాజుగ నుండ న ♦ ర్హతయ కలదు. 162

మ॥ సువిశాలస్థిరబుద్ధియై యనుభవ ♦ జ్ఞుండై కడున్ స్వామిభ
క్తివికాసస్ఫురితుండునౌ నృపతినీ ♦ తిజ్ఞుండు నుత్సాహవై
భవుఁడే మంత్రిగ నుండ నర్హుఁడు; సలుం ♦ బ్రాకృష్ణసింహేంద్రువం
టి విశేషజ్ఞు గడింపఁగా నగునె! మం ♦ త్రిత్వంబు సంధింపఁగన్. 163

మ॥ బలవంతుం డనురాగవంతుఁడును శౌ ♦ ర్యావంతుఁడున్ వాహినీ
బలవంతుండును ద్యాగవంతుఁడగు శు ♦ ద్ధస్వాంతుఁడౌ ధీరునిన్
దలపన్ బోలు సుహృద్వరుండని! కిరా ♦ తస్వామి నీభీమచాం
దలఘుస్వాంతుఁడు, వాని మించిన వయ ♦ స్యశ్రేష్ఠుఁడే లేఁడుపో. 164

గీ॥ ధన-చమూ-దుర్గ-రాష్ట్రసం ♦ తతుల లోనఁ బ్రథమమే యగ్రగణ్యమై ♦ వాసిఁగాంచు;
నది ప్రపంచైక సార స ♦ ర్వాత్మకంబు; దానిఁబట్టి తక్కిన మూఁడు ♦ తనరుచుండు. 165

ఆ॥ ద్రవ్యబలము గలుగఁ ♦ దనరు సైన్యబలంబు, ధన-చమూ బలములు ♦ దనర, దుర్గ-
రాష్ట్రబలము లలరు; ♦ ద్రవ్య మన్నిఁట మేటి; యదియ నీకు లోప ♦ మాదినుండి. 166

గీ॥ ఆశ్ర-యాసన-విగ్రహ- ♦ యాన-భేద-సంధులను నాఱు షడ్గుణ ♦ సమితియందు;
రెపు డెటులు వీని నడపుకీ ♦ లెఱిఁగినట్టి ధాత్రిపతి యన్నిరీతుల ♦ ధన్యతముఁడు. 167

గీ॥ అవసరమ్మైన శక్తిత్ర ♦ యమ్ములోన నతులితోత్సాహశక్తి నీ ♦ కలరుఁ; గాని
మంత్రశక్తిఁ బ్రయోగించు ♦ మాట లేదు; మఱియుఁ బ్రభుశక్తి మొదలంటు ♦ మాసియుండె.

సీ॥ స్థిరతరధైర్యోప ♦ జీవివై, జంకక, వెనుదీక, తగ్గక, ♦ విసుఁగుపడక,
కష్టంబులకును జ ♦ క్కక, ప్రపంచోన్నత ప్రబలవిరోధితోఁ ♦ బ్రతిఘటించి
సంగ్రామ మిన్నేండ్లు ♦ సాగించి యుంటివి; నిన్నెఱుంగని వారు ♦ నీయహితులు
భవ దుదార యశంబు ♦ వర్ణించెదరు; కాని కోశ-సైన్యబలముల్ ♦ కొఱతగాఁగ
గీ॥ నెన్నికల్పంబు లని చేసి ♦ యేమిలాభ! మెటు జయము గల్గు! నీ కక్ష ♦ రెట్లు లోఁగు!
నిర్వదేండ్లుగ నాకాల ♦ మిల్లై వృథగఁ జెల్లెనని మాత్ర మిపుడు చిం ♦ తిల్లఁబోఁకు. 169

ఆ॥ అదియు నాత్మశిక్ష ♦ కై చెల్లె ననుకొను; మింక నిల్లై కాల ♦ మేఁగ నీకు;
దేశ ముద్ధరింపఁ ♦ దివురు; మొండొకమాట వినుతు; వలవ దనక ♦ పని యొనర్పు. 170

మ॥ పరమప్రీతిని దేశమాతృపద సే ♦ వాభాగ్యమున్ గోరి నా
సరసన్ గల్గు ధనంబు నీదు చరణా ♦ బ్జాతంబు లందుంతు, సం
బర మొప్పారఁ బరిగ్రహింపఁదగు; మే ♦ వాడ్ దేశమున్ గొల్చి య
క్బరు సాధించి యపూర్వ వైభవమునన్ ♦ వర్ధిల్లు రాజోత్తమా! 171

క॥ నెనరుంచి నాదు ప్రార్థన విని దేశము నోము"మనుచు ♦ విప్రుం డన, నా
తనిఁ గని జనపతి "నీపంపును సలుపుదుఁగాక; త్రోసి ♦ పుత్తునె యెపుడున్. 172

మ॥ అనఘా! జేనెడు మేర యేనియును రా ♦ జ్యం బొక్క- కాసేనియున్
ధనమున్ దొల్తటినుండి లేకయ దరి ♦ ద్రత్వంబునన్ వెళ్ళఁబో

యనె లోకమ్మునఁ బుట్టు వొందిన యభా ♦ గ్యచ్ఛత్రసంపన్ను, నన్
ధనికుఁ జేసి కృతార్థుఁ జేయఁ గరుణన్ ♦ దైవంబవై తోఁచితే! 173

చ॥ ధనము నొసంగి, వస్తుసము ♦ దాయ మొసంగి, యనర్ఘరత్నసం
దనము లొసంగి, బ్రాహ్మణుల ♦ నా రవివంశజులెల్లఁ దొల్లి య
ర్చన మొనరించుచుండ్రు, రది ♦ సవ్యము; భూసురమౌళివైన నీ
ధన మిపు డేను గైకొనుట ♦ ధర్మమ్ము గాదని తోఁచె నామదిన్." 174

క॥ అని జంకుచు సంకోచించిన భామాసాహి "మిమ్ము ♦ సేవించి గడిం
చిన ధన మీతఱి మీకప్పన మొనరించుటయ పరమ ♦ భాగ్యము నాకున్. 175

క॥ మేవాడదేశ ధనమే మావాడల నుండు; దాని ♦ మాతృపద శ్రీ
సేవావిధి కర్పింపని జీవన మేమిటికి! వట్టి ♦ సిరి యేమిటికిన్! 176

క॥ మనసార నిత్తుఁ జేకొను; వినుము కలిగినపుడు మఱల ♦ వృద్ధియు మూలం
బు నొసంగుము కొనెదను; వలదనకుము; నామాట చూడు; ♦ మగును శుభంబుల్.

మ॥ తడవున్ జేయక బోయపాళెమునకున్ ♦ ద్రవ్యంబు నంపింతు! న
క్కడకున్ మీరును బోయి యాశబరలో ♦ కస్వామి దర్శించి యె
క్కుడుగా సేనలఁ జేర్చుకొం; డిచట నా ♦ కున్ నిల్వఁగాఁ దీర; ది
ప్పుడె నేఁ బోవుదు"నంచు లేచి తురగం ♦ బున్ డాసి పై నెక్కుచున్, 177

—*) భామాసాహి రాజపుత్రులకు దేశభక్తి నెఱింగించి పురికొలుపుట. (*—

సీ॥ "సిరికిఁ దానకమైన ♦ చిత్తూరు పురలక్ష్మి యనదయై పాడఱి ♦ వనట మునుఁగ,
నుర్వియంతయు మెచ్చు ♦ నుదయపురవిభూతి బూదిపాలగు హోమ ♦ ముగఁ జెడంగఁ,
గోటల కన్నిఁట ♦ మేటి 'కుంభల్ మియర్' యవనుల చేఁబడి ♦ నవసిపోవఁ,
బావనోన్నతమేఘ ♦ భవనంబు తురకటెక్కెముల గాడ్పులు సోఁకి ♦ కీడువడఁగ,
గీ॥ నట్టె హారావళీపర్వ ♦ తాంతరముల నిరువదేం డ్లని చేయు పెం ♦ పెల్లఁ బొలియఁ,
గడుపుఁగూటికై వంశవి ♦ క్రమము మఱచి వెడలుచున్నారె! మేవాడ ♦ వీరులార! 178

సీ॥ శార్దూలరాజభు ♦ జాపీఠి స్వారి చేయఁగఁజాలు ఝాలాభ ♦ టాళు లుండ,
బాలురై రిపుసమ ♦ వర్తులై ఖండించు ప్రబలచొండావన్షు ♦ పాలు రుండ,
విమతరాడ్గర్భని ♦ ర్భేదకప్రౌఢి దీపించు రాఠోడ్కుల ♦ వీరు లుండ,
ముజ్జగంబులనైన ♦ ముంజేతఁ బోఁద్రోయఁ గలిగిన చోహాణ ♦ బలములుండ,

గీ॥ మాప్రతాపుఁడు బ్రదికి సే♦మమున నుండఁ గృష్ణసింహు నొడల నూపి♦రెసఁగియుండఁ,
గులసనాతనవీర్యంబుఁ ♦ గుంటఁ బెట్టి పాఱుచున్నారె! మేవాడ ♦ వీరులార! 179

సీ॥ రాజ్యంబు పోయినఁ, ♦ బ్రాభవం బూడిన, సకల భాగ్యంబులు ♦ సన్నమైన
బలమెల్లఁ జెడినఁ, గో ♦ టలు పోయినను, సారె కపజయంబులు క్రమ్మి♦యడలొదవిన,
గడ్డి యాహారమ్ము ♦ గాఁ జెట్లనీడలు నెలవుగా మృగములె ♦ స్నేహితులుగ
నిల్లాలి నెడఁబాసి ♦ పిల్లల విడనాడి కట్టుగుడ్డలు లేక ♦ గాసి పడియు

గీ॥ విడక స్వాతంత్ర్యమును గొల్చు ♦ వీరుల నెడి యశముఁ బోఁద్రోసి యాభిజా♦త్యంబు రోసి
కటకటా! దేశ మరుల క ♦ గ్గంబు చేసి విడుచుచున్నారె! మేవాడ ♦ వీరులార! 180

సీ॥ తెఱవల విమలపా ♦ తివ్రత్యమహిమంబు సన్నిగిల్లినఁ గనుల్ ♦ చల్లవడెనొ!
సకలదిగ్దేశ రా ♦ జన్యప్రతాపాగ్ని చల్లార హృదయముల్ ♦ శాంతిఁగనెనొ!
భరతఖండమున గో ♦ వధలు సాఁగినఁ జూచి యంతరాత్మకు సౌఖ్య ♦ మలవడియెనొ!
దాస్యాంధకారంబు ♦ దశదిశల్ గవియ దేహముల నాప్యాయనం ♦ బలముకొనెనొ!

గీ॥ కనులు తిరిగెనొ! బాహువి♦క్రాంతి చెడెనొ! బుద్ధి తఱిఁగెనొ! చెడువేళ♦ముసురుకొనెనొ!
కాని చో మాతృదేశంబు ♦ మాని పోవు వెఱ్ఱి యెటు గల్గె మేవాడ ♦ వీరులార! 181

సీ॥ యవనగజేంద్రసిం ♦ హఖ్యాతిఁ గాంచిన బప్పరాయనిఁ గన్న ♦ భవ్యమాత!
జీవితం బరికోటిఁ ♦ జెండ నర్పించు హమ్మీరసింహుని గన్న ♦ మేటితల్లి!
భానువంశక్షమా ♦ పతిమాళి యన నొప్పు సమరసింహుని గన్న ♦ చల్లనమ్మ!
యతిదీక్షతో మొగల్ ♦ యాగముఁ దీర్చు సంగ్రామసింహునిఁ గన్న ♦ రాజజనని!

గీ॥ యందఱను మిమ్ముఁ బెంచిన ♦ యసమధాత్రి! తల్లి దండ్రియు గురువునై ♦ తనరుసీమ!
యకటకట! స్వర్గమునకన్న ♦ నధికమైన మాతృదేశంబు విడరాదు ♦ మఱలరయ్య!182

సీ॥ కడుపుకక్కుఱితి కీ ♦ గతిఁ జేయఁగారాదు; తినినఁ దినకయున్నఁ ♦ జనును గాల;
మక్కటా! ప్రాణంబు ♦ లంత తీపైయున్నె! పిఱికి పందలటన్న ♦ పేరు రాదె!
బవరం బనిన నొడల్ ♦ వడఁకెనే మీకు! భార్యాపుత్రులం దంత ♦ యాస తగునె!
చిరకాల మపకీర్తి ♦ చేరదే! హృదయాభిమానధనం బెల్ల ♦ మాసి పోదె!

గీ॥ తగదు పయనింప! వెనుకకుఁ ♦ దరలరయ్య! బలముఁ గొనరయ్య! కోటలు♦గెలువరయ్య!
యరుగవలె నాకు సెలవియ్య ♦ రయ్య;" యనుచు నశ్వమును ద్రిప్పి వెనుకకు ♦ నరుగఁ
దొడఁగె. 183

గీ॥ విరిసి విరితేనె వాఁక జొ ♦ బ్బిలినయట్లు, వీరరసము పొంగి పొరల ♦ వీరులెల్ల
వెడలిపోవుచునున్న యా ♦ విప్రుచరణ సరసిజములకు మ్రొక్కి య♦శ్వముల నెక్కి, 184

—*) రాజపుత్రులు వెనుదిరిగి భీమచాందు నివాసమునకు వచ్చుట. (*—

మ॥ త్వరమై సద్దమరేయికిన్ జని కిరా ♦ తస్వామి గూడెంబులన్
దరియన్ బోయి బహిఃప్రదేశముకడన్ ♦ ధాత్రీనభోభాగముల్
విరియన్ శంఖము లూఁది; రంత శబరో ♦ ర్వీనాథుఁడున్ మిత్రశం
ఖరవంబుల్ గుఱుతించి స్వాగత మిడం ♦ గా వచ్చె సాశ్చర్యతన్. 185

గీ॥ రచ్చపట్టు ప్రోల మహాగ్ని ♦ రగులఁజేసి పిలపిలని మూఁగి భిల్లులు ♦ బలిసి కొలువ
భీమచాం దండఁజేరిన ♦ వీరులకును సాత్త్వికాహారము లొసంగి ♦ సత్కరించె. 186

క॥ తెలతెలవాఱెను; భానుఁడు మొలిచెను బూర్వాద్రి; వీర ♦ పుంగవులు మహీ
తలపతి పదముల కెఱగుచు సెలవు గొనుచు వెడలి రాత్మ ♦ సీమలు చేరన్. 187

శా॥ "భామాసాహి ధరామరేంద్రుని కృపన్ ♦ స్వాతంత్ర్య దుర్వార సం
గ్రామక్రీడలు పెంచి శత్రుతతులన్ ♦ ఖండింపఁ గాంక్షించె; రా
ణో! మీరందఱు దేశభక్తిపరిపూ ♦ ర్ణుల్ బాలురున్ వృద్ధు లు
ద్దామాటోపుఁ బ్రతాపుఁ గూడఁగఁ గిరా ♦ తస్వామి గూడెంబునన్." 188

చ॥ అనుచును రోదసీకుహర ♦ మంతయు వ్రీలెడుభంగి డిండిమ
స్వనముల రాజపుత్రకులు ♦ పల్లెలు పట్టణముల్ పురంబు ల
న్ని నగరముల్ గిరీంద్రము ల ♦ నేక గుహాకుహరమ్ములందునన్
వినఁబడఁ జాటఁజొచ్చి రొక ♦ వేయు విధంబుల దేశ మంతటన్. 189

—*) నలుదెసల నుండి రాజపుత్ర సైన్యములు వచ్చి ప్రతాపసింహుని జేరుట. (*—

సీ॥ అలసలుంబ్రావిభుం ♦ డహిత దుర్వార చోండావద్బలంబుతో ♦ నడచి వచ్చె;
బేడ్లా-కొఠేరియా ♦ పృథ్వినాయకులు చోహాణవర్గముల్ కొల్వ ♦ నరిగి రంత;
§ నాపాపురా-బునే ♦ రాధీశులు శిశోదియాభటుల్ గొలువఁ బ్రి ♦ యాణ మైరి;
హరిదాసుఁడు ముకుందుఁ ♦ డరుదెంచిరి మహోగ్రరాఠోడుసుభటవ ♦ ర్గములు గొలువ;

§ The castle of Bunera is one of the most imposing feudal edifices of Mewar, and its lord one of the greatest of its chieftains. He not only bears the title of Raja but he has all the state insignia attached thereto.

" Personal narrative "

గీ॥ శ్యామసింహుండు చనుదెంచె ♦ సాద్రినుండి; భిల్సురానుండి సూర్తుండు ♦ వెడలె; దేవ
గృహమునుండి దూదాసింహుఁ ♦ డేగుదెంచె; దుర్జయుఁడువచ్చెఁ జోండావ♦తులనుగూడి.

గీ॥ అంత నొకనాఁడు సేవకుం ♦ డరుగుదెంచి భిల్లపరివృతుఁడగు నృప ♦ తల్లజుఁగని
"స్వామి! మంత్రిభామాసాహి♦బండ్లు వచ్చి నిలిచెఁ, జూతురుగా'కంచుఁ♦బలికి కొలిచె.

గీ॥ భిల్లనృపతి ప్రీతాపుఁడు ♦ వెడలి సాద్రివైపునను మూఁడు క్రోసుల ♦ వఱకు నిలుచు
భటులు నాలుగువేలు, ద్ర ♦ వ్యంబు గలుగు బండ్లు వేయును గని హర్ష♦భరితులైరి.

గీ॥ నెలకు నైదును-బదిరూ ప్య ♦ ముల కొలంది పదియు-రెండేండ్లదాఁక ని ♦ర్వదియునైదు
వేల భటులకు భృతినియ్యఁ ♦ జాలునను చు భిల్లమణి రాజమణి లెక్క♦ వేసి రపుడు. 193

—*) ప్రతాపసింహుఁడు యుద్ధసన్నద్ధుఁ డగుట. (*—

క॥ "కనఁబడె దివి నింద్రుశరాసన; మిది రణమునకు మంచి ♦ శకునం"బని భి
ల్లనృపాలుఁడనఁగ జనపతి యని కాయత్తం బొనర్చె ♦ యాత్మచమువులన్. 194

క॥ ఎలనవ్వు వెలయఁగా నర్మిలి బిడ్డల నక్కు చేర్చి ♦ మేను నిమిరి చుం
చులు దువ్వి ముచ్చటల ముద్దులజడి గురియించెఁ గూర్మి ♦ దొంతర గట్టన్. 195

మా॥ పరమప్రేమమునన్ బ్రతాపవిభుఁడున్ ♦ బ్రాణేశ్వరిన్ జేరి "ము
ష్కర తౌరుష్క భటాళులన్ దఱిగి నే ♦ స్వాతంత్ర్య సంగ్రామమున్
జరపన్ గోరి ప్రయాణమైతి నిపుడే; ♦ సంపూర్ణచిత్తంబుతో
⊕ నరవిందేక్షణ! సమ్మతింపుము శుభ ♦ ప్రారంభ యాత్రారతిన్. 196

గీ॥ నీ సుధా స్వాదు లజ్జా వి ♦ లాస రేఖ చిత్తమున హత్తి మెఱయుచు ♦ స్మృతికిఁదెచ్చు;
మనకుఁ గలయిక నెలకొక్క♦మాఱు గలుగుఁ;బరమసంతోషమున నన్నుఁ♦బంపుమిపుడు

గీ॥ నీవు బిడ్డలు గొన్నాళ్ళు ♦ నిలువుఁ డిందు; భిల్లు లేవేళ మిమ్ముఁ గ ♦ న్పెట్టియుంద్రు;
భీమచాందుగా రిపుడు నా ♦ వెంట వత్తు"రనినఁ బ్రాణేశ్వరీదేవి ♦ యాస్య మెత్తె; 198

---

⊕ Although I cordially unite with Segur, who is at issue with his compatriot Montesquieu on this part of discipline, yet from the knowledge I do possess of the freedom, the respect, the happiness, which Rajput women enjoy, I am by no means inclined to deplore their state as one of captivity.

" Religious Establishments."

—*) బాలేశ్వరీదేవి ప్రతాపసింహుని విజయ యాత్రకుఁ బంపుట. (*—

ఆ॥ స్మితకళామరీచి ♦ మీమోమునన్ దోఁచెఁ; నింతికన్న భాగ్య ♦ మేమి నాకు!
శైలతలమునిండ ♦ సైన్యముల్ చెలఁరేఁగ; వెడలి విజయలక్ష్మి ♦ వెంటరండు. 199

గీ॥ సిద్ధసంకల్పభరితమౌ ♦ చిత్తమందు వలదు చోటీయ నాకుఁ బి ♦ ల్లలకు" నంచు
వెడఁదకనుల ముత్తెఁపుజాయ♦విరియఁ దుదలఁగప్పు ఱెప్పల నాసతోఁ♦గాంతుఁగనిమె.

సీ॥ విజయసూచకముగా ♦ భిల్లభటులు చుట్టు మూఁగుచుఁ గైవార ♦ ముల నొసర్ప,
బోయగుబ్బెతలు గుం ♦ పుగఁజేరి చిఱునగ వలరు మోములఁ బాడి ♦ యాడుచుండఁ,
బాలేశ్వరీదేవి ♦ వజ్రమ్ములు ప్రవాళములును మాణిక్యముల్ ♦ ముత్తియములు
హాటక పాత్రంబు ♦ లందుఁ గైకొని నిజేశ్వరునకు మేల్మని ♦ వాళి దీర్చి,

గీ॥ రాగ మలరఁ గప్పురపు హా♦రతు లొసంగి, నిరుపమామోదమున నెత్తి ♦ నీళ్లు దీసి,
"జరుగుఁగావుతఁ గల్యాణ♦జైత్రయాత్ర" యనుచు శ్రీపాదములు నుదు♦రంట మ్రొక్కె,

సీ॥ "జంభదైత్యేంద్రుని ♦ సమయింప నరిగెడు నపుడు బిడౌజున ♦ కైన జయము,
ఖరదూషణాది ర ♦ క్షశ్శ్రేణిపైఁ గేగు నపుడు శ్రీరామున ♦ కైన జయము,
నరకాసురునితో ర ♦ ణంబు సేయఁగఁ జను నపుడు శ్రీకృష్ణున ♦ కైన జయము,
కాలకేయాదులఁ ♦ గసిమసంగఁగఁ బోవు నపుడు కిరీటికి ♦ నైన జయము,

గీ॥ సకలశాత్రవజయము, శా♦శ్వతజయంబు, భువనజయమును, నిరుపమా♦మోదజయము,
వెల యెఱుంగని జయమును,♦సులభజయము, జయముపై నీకు జయములు♦జరుగుఁగాక

గీ॥ అమరసేనాధిపత్య ప ♦ ట్టాభిషేక మగుచుఁ గ్రౌంచాద్రి భేదింప ♦ నరుగు నపు, డు
మా కుమారున కట్టులు ♦ నాకుమార! యమరసింహా! నీకగుత లో♦కైకజయము."203

గీ॥ అనుచుఁ బాలేశ్వరీదేవి ♦ హస్తయుగము నెత్తి యభినందనము సేయ ♦ నృపగురుండు
నగవు మొలకెత్తు చూపుల♦మగువ సెలవు నంది యచ్చోటు విడిచె; సై♦న్యములునడిచె

గీ॥ గూడెముల, నిండ్లకోవుల ♦ గొండపేటులందు, గండోపలములందు, ♦ నధివసించి
శబరసతులెల్లఁ బూలు లా ♦ జలును జల్లి రాప్రతాపునిపైన సై ♦ న్యములపైన. 205

క॥ ఈ రీతిఁ జైత్రయాత్రాప్రారంభము చేసి యర్ధ ♦ రాత్రమునకు ధా
❀ త్రీరమణుం డరిగెను దేవేరీదుర్గము కవాట ♦ వీధిఁ జేరన్. 206

❀ The name of Bhamasah is preserved as the Saviour of Mewar. With this splendid proof of gratitude and the servante of Prithwi Raj as incitements, he again "screwed his courage to the sticking place" collected his band and while

—*) దేవేరి దుర్గ ద్వితీయ యుద్ధము. (*—

మ॥ "బలముల్ లేని కడున్ కృశాంగుఁడు ప్రతా ♦ పస్వామి మాంధాటికిన్
గలఁగన్ బాఱెను; గోటకున్ భయము గ ♦ ల్గన్ బోవ" దం చెంచి యా
మ్మాలపైఁ జేయిడి, యేండ్లు యౌవనబలం ♦ బుల్ హోయి నిద్రించె; వా
కిళులం దొందును మన్న పేరుకొని యె ♦ క్కెన్ మూరెడం తెత్తుగన్. 207

క॥ అలకోటగవను దెఱచిన పొలకువఁ గని సకలరాజ ♦ పుత్రి చమూనా
థులు జొరఁబడ గడఁగిన వారలను "నిలుఁడు పోకుఁ" డనుచు ♦ రాణా యంతన్, 208

సీ॥ "తురకలబలము ని ♦ ద్దరఁబోవుచుండు; నీస్థలమెల్ల మిగుల ని ♦ శ్శబ్ద మయ్యె!
నిదురవోయెడువారిఁ ♦ గదిసి చంపుట క్షాత్రమహితులయందు ధ ♦ ర్మంబు గాదు!
బహుళశతాబ్దంబు ల ♦ ప్రతిహతశక్తితో నీకోట మాపూర్వు ♦ లేలినారు;
దొంగపోటున దూఱి ♦ దుర్గంబుఁ బట్టుట నాకు నచ్చిన వర్త ♦ నమ్ము గాదు;

గీ॥ పౌరుషమునన దీనిఁ జే ♦ పట్టుద''మని యుఱుము తెఱఁగునఁ దనశంఖ ♦ మొత్తె; సమర
సింహుఁడును సింహనాదము ♦ చేసె; భీమచాంమ బూరగ మ్రోయించె ♦ శైల మదర.

ఉ॥ కంపము నొందె ధారుణి జ ♦ గద్గురుఁ డంతట, "దుర్గమున్ బ్రవే
శింపుఁ డనంగ నయ్యమర ♦ సింహుఁడు గుఱ్ఱముఁ దోల్తలోన దూఁ
కింపఁగ సూక్తు నశ్వమును ♦ గ్రొల్లురికెన్; వడిఁ గృష్ణసింగు గ
ర్జింపుచు దూకె; గంతులిడె ♦ సేనలు భూపతి వెంట నంటుచున్. 210

సీ॥ ఆ రాజపుత్రసే ♦ నారణోద్భటవిజృంభణమహారవము షా ♦ బాజుఖానుఁ
డాతని పదివేలు ♦ యవనభటుల్ విని యదరుపాటున గుండె ♦ బెదరి చెదరఁ
దబ్బిబ్బుపడుచుఁ దొం ♦ దర సమరోచిత వివిధసాధనములు ♦ వెదకుచుండఁ
దనసేనకన్న ముం♦దఱఁ బ్రతాపుఁడు సింహ మటు వారియెదురఁ బ్ర ♦ త్యక్షమయ్యెఁ;

గీ॥ నలముకొనియున్న శత్రుసై ♦ న్యముల, విలయదండధరుఁబోలు రాణాప్ర♦తాపుఁ జూచి,
తురకలు పలాయనము చేయు♦ తెరువు లేక పెనఁగిరి రణమ్మొ మరణమో♦యని తెగించి

గీ॥ కాఱుచీఁకట్లు గ్రమ్మిన ♦ కాళరాత్రి! దుర్గమునఁ జోటులంటి! యు ♦ ద్ధురతఁ బోరు
భటులు ముప్పదియైదు వేల్! ♦ భయము గొలుపు నాటి రణఘాటి యాపాటి♦ నాఁగవశమె!

---

his foes imagined that he was endeavouring to effect a retreat through the desert, surprised Shahbaz in his camp at Deweir whose troops were cut in pieces.

"Annals of Mewar."

గీ॥ యవనులని రాజపుత్రకు ♦ లని తెలియక యుభయ సైన్యముల్ తలపడె ♦ నుగ్రరీతి!
నెవరి వారల వారె యా ♦ హవమునందుఁ దఱిగి పోసిరి వేఁడి నె ♦ త్తురులు దొరఁగ.

గీ॥ భిల్లభటు లేరితెచ్చి రా ♦ పిడుల రగులఁబెట్టు కట్టెల దివటీల ♦ వెలుఁగునఁ గను
పట్టెఁ బాలికల నొక చోట ♦ పట్టు పగిది! నచటి బలములు కొఱవి ద ♦ య్యముల పోల్కి.

గీ॥ అంటఁగారాని భయద దా ♦ వాగ్ని కీల యతిబలాటోప దుర్దాంతుఁ ♦ డమరసింహుఁ
డెచట రణ మతిభీమవహా ♦ నచటఁజేర దాఁట్లుకొనిపోయి శత్రు ♦ మధ్యమునఁ దూఁకు.

మ॥ కరముల్ వెల్గెడు భానుబింబము పతా ♦ కం బొక్కచే నొప్ప, దు
ర్భరఖడ్గంబు మఱొక్కహస్తమున నొ ♦ ప్పన్ శ్యామసింహుండు, కే
సరి మాతంగసమాజముల్ దగులు నో ♦ జన్ రూక్షతామ్రాక్షు భీ
కరుఁడై బొబ్బలు వెట్టి వైరులు వడం ♦ కన్ ముట్టె నత్యుగ్రుఁడై. 216

మ॥ ప్రళయాంభోధరముల్ హసించుచు సలుం ♦ బ్రాబర్త చెంతన్ మహా
చలశృంగంబులు వ్రీలి కూలఁ బటుగ ♦ ర్జారావ మొప్పన్ దురు
ష్కుల సైన్యంబులఁ దాఁకి నూర్లు పదు లం ♦ చున్ లెక్కకున్ రాని లీ
లల శీర్షంబులు గుప్పతెప్పలుగ రా ♦ ల్పన్ సాఁగె నత్యుద్ధతిన్. 217

§గీ॥ ఆగ్రహోదగ్ర భయద దీ ♦ ప్తాస్యుఁడగుచుఁ దన ద్విధారాకృపాణ దు ♦ ర్దాంతధార
నృపగురుఁడు చీల్ప రిపులెల్ల ♦ నేలఁ బడిరి మిడుతగమి చిచ్చుఁబడి మ్రగ్గు ♦ వడువు దోఁప.

క॥ హరిదాసుఁ డాగ్రహమ్మున హరి, రక్షశ్శ్రేణి నొంచు ♦ నట్టులు యవనో
త్కరములపైఁ బడి నఱకెను శిరములు; రాఠోడు లెల్ల ♦ జిక్కఁగఁ గొలువన్. 219

క॥ ఝాలా 'భూపతిసింహుఁడు' సాలములన్ బోలెఁ దురక ♦ సైన్యము మేనుల్
జీలిచె; మేకొని సూక్తుఁడు కాలాహివిధాన శత్రు ♦ గర్భముఁ జొచ్చెన్. 220

గీ॥ దేవగృహదుర్గసీమలఁ ♦ దిరుగు వ్యాఘ్ర ముగ్రమూర్తి దూడాసింగు ♦ యుద్ధమందుఁ
దేరిచూడఁగ రానట్లు ♦ దీప్తి మెఱసి దోమలనుబోలెఁ గూల్చె శ ♦ త్రులను దాఁకి.

సీ॥ గుణరాశి రాఠోణ్మ ♦ కుంద దాసుఁడు షాపురా-బునేరా ప్రభుల్ ♦ ప్రకట బలులు,
మఱియు బేడ్లారాజ ♦ మాళి కేశవదాసుఁ డింకఁ గొఠేరియా ♦ నృపవరుండు

---

§ But as if the brand of Bhavani was insufficient, he met with another hermit in the forest of the "Tiger Mount" the Gokurnath, who presented to him the double edged sword, which with the proper incantation, could severe rocks. With this he opened the road to fortune leading to the throne of Chittoor.

"Annals of Mewar"

తక్కిన రాజపు ♦ త్రిచమూపతుల్ వారి వారి శౌర్యంబుల ♦ పగిది రిపులఁ
బట్టి నిర్జింపఁగఁ ♦ బగ్గముపాడొచు నొగిలి పగుల సాగె ♦ మొగలు తెగలు!

గీ॥ సమధి కోద్దండ దోర్దండ ♦ చాపముక్త భీకరాశుగులై భిల్ల ♦ వీరు లెల్ల
నట్టహాసంబు లొనరింప ♦ నాశరములు నాలుకలు గోయుచున్ వ్రాలఁ♦గూలి రరులు.

ఉ॥ వీరులలోన మేటియగు ♦ వీరుఁడు భిల్లనృపాలమౌళియున్
పౌరుషరాశియై యడవి ♦ పక్షుల మెత్తని యీఁకలన్ గరుల్
కూరుచు భీకరాశుగము ♦ లున్ దశకంబు శతంబు గుప్పుచున్
వైరిభటవ్రజంబుల న ♦ పారముగాఁ దునుమాడె నత్తఱిన్. 223

ఉ॥ రూక్షపరాక్రమస్ఫురణ ♦ రోజుచు నా షహబాజుఖానుఁ డా
తక్షకమూర్తియై రిపులఁ ♦ దార్కొని పెక్కురఁ గూల్పఁగా, ఖగా
ధ్యక్షుఁడుపోలెఁ బైఁబడి ప్ర ♦ తాపనృపేంద్రుఁ డనూనసాహసా
పేక్షఁ దదీయ మస్తకము ♦ వ్రీలఁగ నేసెఁ గృపాణధారలన్. 224

గీ॥ తనదు సుభటుల నుసికొల్పి ♦ దస్యుతతులపైన డీకొల్పి యాప్రతా ♦ పప్రభుండు
దుర్గమును శుభ్రముగఁజేసె ♦ దురుకపురువు పేరు లేకుండఁ దుదముట్ట ♦ నేరి వైచి. 225

మ॥ నలినాప్తుండును బూర్వపర్వతముపై ♦ నన్ దర్శనం బిచ్చె; నా
యిలువేల్పున్ గొలిచెన్ బ్రతాపధరణీ ♦ భృన్మౌళియున్; రాజపు
త్రులు సంతోష మెలర్ప నందుకొని రా ♦ దుర్గంబు; నం దన్నిది
క్కుల సూర్యధ్వజకోటి క్రాలెఁ; జెలఁగెన్ ♦ గోలాహలధ్వానముల్. 226

క॥ వైరులు తుదముట్టి చనంగా రాణా సంతసంబు ♦ గడలుకొనఁగ "దే
వేరిజయంబుఁ దన దేవేరికిఁ దెలుపు"మని యొక్క ♦ భిల్లుని బనిచెన్. 227

❁ చ॥ మనుజవరేణ్యుఁ డంతట 'న ♦ మాయిత' పర్వత దుర్గ సీమకున్
జని తన రాజపుత్రభట ♦ సంఘముఁ దోడ్కొని లోన దూఁకి క్రాం

---

❁ The fugitives were pursued to Amait, the garrison of which shared the same fate. Ere they could recover from their consternation Kumbhalmer was assaulted and taken; Abdoola and his garrison were put to the sword and thirty two fortified posts in like manner carried by surprise, the troops being put to death without mercy. To use the words of the annals "Pratap made a desert of Mewar." He made an offering to the sword of whatever dwelt in its plains " an appalling but indispensable sacrifice.

తిని గొను వైరులఁ బిలిచి ♦ త్రెళ్ళఁగ నేసి గ్రహించె దుర్గముఁ;
దనరె రవిధ్వజంబులు శ ♦ తంబు సహస్రము దృశ్యమానమై. 228

—) కుంభల్మియరు దుర్గమును జేకొనవలెనని ప్రతాపసింహుఁ డాలోచించుట. (—

మ॥ తన సామంతుల నందఱఁ బిలిచి చెం ♦ తఁ జేర్చి "యీదుర్గముల్
గొనుటల్ ముఖ్యముగాదు మా కిపుడు; మా ♦ కుంభక్షమాజాని చే
కొని నిర్మింపఁ బవిత్రమై వెలయు నా ♦ కుంభల్మియర్ దుర్గముఁ
గొనుదాఁకఁ గననొల్ల నిద్దురయుఁ! గై ♦ కో నొల్ల నాహారముఁ!". 229

మ॥ అను రాజేంద్రుని మోముఁ గన్గొని సలుం ♦ బ్రాధీశ్వరుం "డీక్షణం
బుననే పోద"మటంచుఁ గొల్తల దళం ♦ బుల్ రేపి సాగించి శై
లనికాయంబులు లోయలుఁ వనులు లీ ♦ లఁ దాఁటి యుత్సాహముం
గొని ముందేగఁగ నా ప్రతాపుఁ డరిగెఁ ♦ గుంభల్మియర్ చేరఁగఁ. 230

గీ॥ శైల సామ్రాజ్యలక్ష్మి మ♦స్తకముమాడ్కిఁ బర్వతముపైన శృంగంబు♦వఱలుచుండు;
మూర్ధమున వెల్గు హాటక♦ముకుటరాజ మట్లు కుంభల్మియర్దుర్గ♦మలరుచుండు. 231

సీ॥ అచలనితంబంబు ♦ నటు నెక్కుచో దూరముననుండి దుర్గగో ♦ పురము దోఁప,
నా ప్రతాపనృపేంద్రుఁ ♦ డత్యంతహర్ష రోమాంచితగాత్రుఁడై ♦ మస్త మెత్తి
కనులపండువుగాఁగఁ ♦ గని "పదునాఱేండ్లపై నయ్యొ నకట! నిఁ ♦ బాసిపోయి;
నీ "మేఘ భవనంబు" ♦ నీ "భవానీదేవి కోవెల" నీను స ♦ రోవరంబు

గీ॥ కనులఁ గట్టినయట్లు నేఁ ♦ గాంచుచుందుఁ; గలిగిన దొసంగులకు మదిఁ ♦ గలఁగుచుందుఁ;
గానికాలము నన్నిట్లు ♦ కట్టివైచెఁ; జూచుచుండుమి! యిపుడు నీ ♦ సూడు దీర్తు." 232

క॥ అని మొగిచి కేలుఁగవ మనమున నుత్సాహంబు ద్విగుణ ♦ ముగ, బలమును ర
మ్మని హెచ్చరించి దుర్గమ్మును డాయఁ దూఁకి శంఖ ♦ మును బూరించెఁ. 233

క॥ కల్లోలాబ్ధితరంగము వెల్లివిరియు గతిని గవియు ♦ విమతబలము న
బ్బుల్లాఖాఁ మారొక్కనెఁ గ్రోధోల్లసితుండగుచు నిజభ ♦ టోత్కర మెనయఁ. 234

గీ॥ కనులు నిప్పులఁ గురియ ఖ♦డ్గంబు మెఱయ నహితె తౌరుష్కసైన్యమ♦ధ్యమునఁ దూఁకు
నా ప్రతాపేశ్వరునిధాటి ♦ కాగి నిలువ, నరుల మాటేల! సురలకై ♦ నం దరంబె!

మ॥ అవధూతాఖిల వైరి విక్రమ సలుం ♦ బ్రాధీశ దోఃఖడ్గ సం
భవ దుర్వార దురీక్ష దావ దహన ♦ జ్వాలా పరివ్యాప్తి ద

స్స్వవితానాటవి నిల్చి భస్మమయి రా ♦ సుల్ రాసు; లవ్వీరుఁడా
హవభూమిన్ విహరించె నాప్రళయ కా ♦ లాభీల రుద్రాకృతిన్. 236

చ॥ ఉదధిని రెండుపార్శ్వముల ♦ నుండి యుదగ్రతరంగముల్ భయా
స్పదముగ రేఁగి తీవ్రరభ ♦ సమ్మునఁ దాఁకిన పేఁక, శౌర్యసం
పద పొలివోవనీక యిరు ♦ వాఁగులయోధు లొకళ్లొకళ్లపైఁ
గదియుచు హుంకరించి పయిఁ ♦ గ్రిమ్మరి వీర రసావతారులై. 237

సీ॥ యవనబృహన్నాళి ♦ కాస్త్ర నిర్గత ధూమ సంఘాతములు మేఘ ♦ సమితిగాఁగ,
రాజపుత్రికుల ని ♦ ర్భరసింహనాదముల్ ఘన ఘనాఘన రణ ♦ ద్గర్జగాఁగ,
భటహస్త తరళ కృ ♦ పాణధారాతళత్తళలు సౌదామనీ ♦ తతులుగాఁగ,
శబరనాయక శరా ♦ సన నిస్సర త్తీవ్ర విశిఖసంతతి కుంభ ♦ వృష్టిగాఁగ,
గీ॥ నుభయపక్షంబు వీరుల ♦ యొడలఁ దొఱఁగి పాఱు రక్తప్రవాహముల్ ♦ పర్వతాగ్ర
గళిత గైరిక శోణ శై ♦ వలినిగాఁగ, సమరరంగంబు నిబిడ వ ♦ ర్షర్తు వయ్యె! 238

మ॥ తన ముత్తాతలనాఁటి దుర్గమును బొం ♦ దన్ దొందరన్ జెంది ద
స్స్యనికాయంబును జీల్చ నయ్యమరసిం ♦ హుం డుగ్రుఁడై పైకొనెన్;
దన ముత్తాతలనుండి వచ్చిన యుదా ♦ త్త క్షాత్ర తేజోవిక
త్థనమా వెచ్చని నెత్తురుల్ మరఁగి యం ♦ తర్నాడులం దోఁడఁగన్. 239

గీ॥ రాజపుత్రుల భయద వీ ♦ రస్వనములు గ్రగ్గి మ్రగ్గ యావనభటా ♦ ర్తస్వనములు
రాజగురుహాళి సింహగ ♦ ర్జాస్వనములు భూనభోంతరాళమున మా ♦ ర్మ్రోగ్నతలీనె! 240

గీ॥ పీన వితత వక్షులును గౌ ♦ పీనధరులు కృష్ణవర్ణు లయఃకల్ప ♦ దృఢశరీరు
లాలయస్థ శిలావిగ్ర ♦ హములమాడ్కి భిల్లులు రణాంగణమున శో ♦ భిల్లి రపుడు. 241

సీ॥ బవరం బుగాదిపం ♦ డువునాఁగ జెలరేఁగి యమరసింహుండు దీ ♦ వ్రముగఁ బెనఁగె;
నతని ప్రతాపాగ్ని ♦ యవనచమూసమూహమ్ములు శలభమ్ము ♦ లట్లు సమసె;
దుర్వారవీర్యుఁ డ ♦ బ్దుల్లాచమూపతి మత్తమాతంగంబు ♦ మాద్రి దాఁకెఁ;
నందఱు వెఱఁగంద ♦ నావీరమణి వాని శిర మూడ్చె ఘోర ని ♦ స్త్రింశధార;
గీ॥ సైన్యపతులును జముపులు ♦ శబరవీరు లందఱును జేరి మొందఱ ♦ మ్రందఁజేసి
రమరసింహుఁ డొక్కఁడె కూల్చె ♦ నందఱ నన, వాని విక్రమధాటి వి ♦ శ్వమున కెఱుక.

క॥ మొడలు తెగి పుడమిఁ బడఁగాఁ బొడ్డుచుచు మొగలుల యుద్ధ ♦ భూమికి బలిగా
నిడి మోదం బడరఁ బ్రతాపుఁడు కుంభల్మియరు దుర్గ ♦ ముం గైకొనియెన్. 243

గీ॥ ద్వారములఁ గ్రాలెఁ బచ్చని♦తోరణములు; నలరె దుర్గమంతటను సూ♦ర్యధ్వజములు;
పరగెఁ గ్రమముగఁ బుణ్యాహ ♦ వాచనములు; మేఘభవనమ్మునన్ గ్రొత్త ♦ మెఱపు
మెఱసె. 244

ఉ॥ పూఁచిన పూలమొక్క లటు ♦ పొంగి బుజంబులు పూఁడుగాఁగ సే
నాచయముల్ తదీశ్వరు ల ♦ నంత ముదంబుధిఁ దేలి; రంత దా
నోఁచిన నోముపంటలగు ♦ నూత్నమనోరథ సంచయంబు లెం
తో చెలరేఁగ రాజమణి ♦ యొప్పుగఁ గాపుర ముండె నయ్యెడన్. 245

మ॥ మును "పింగ్లాండు"ననుండి ఢిల్లినగరం ♦ బున్ జేరఁగావచ్చు వ
స్తునికాయంబుల రేవు వీడు పిదపన్ ♦ సూరత్‌పురీ మార్గమున్
గొని యీశాన్యపు భాగమం దరుగుచున్ ♦ గుంభల్‌మియర్‌కోట ప
జ్జనె శైలంబుల దాఁటఁజేయుటయ యా ♦ చారంబుగా సాఁగెడిన్. 246

గీ॥ నొగలపై నాదమఱచి ని ♦ ద్రఁగను చోదకులను శకటమ్ములను నందుఁ ♦ గల సమస్త
వస్తువుల వృషభములను ♦ బట్టి రాజపుత్రు లిడిరి కోటను మూల ♦ మూల లందు. 247

క॥ దినదినము కొల్లగొని కోటను జేర్చిన విలువగల బి ♦ డారమ్ముల పె
ల్లున భాగ్యసమృద్ధంబై తనరెన్ సామగ్రి బలము ♦ ధరణీశునకున్. 248

సీ॥ అన్నిమూలలనుండి ♦ యరుగుదెంచి ప్రతాపుఁ జేరు వీరుల సంఖ్య ♦ చెప్పరాదు;
దైనందినప్రవృ ♦ ద్ధంబుగ సేనాబలంబును గోశబ ♦ లంబు దనరె;
జైత్రయాత్రారతుల్ ♦ జరపి ప్రతాపుఁడు శత్రుల సర్వనా ♦ శన మొనర్చె;
హారావళీసీమ ♦ నచిరకాలమున ముప్పదిరెండు కోటలు ♦ పట్టువడియె;

గీ॥ నా ప్రతాపేంద్రు దిగ్విజ ♦ యాంకకథలు గుహలు లోయలు దేశంబు ♦ గూడ నిండి
బూరటిలి పొంగి పొరలుచుఁ ♦ బోయి ఢిల్లి చేరి సూటిగ నక్బరు ♦ చెవిని మ్రోసె. 249

గీ॥ ఆంతరంగికులగు సమా ♦ త్యాగ్రిణులను వాహినీపతులను సభా ♦ భవనమందు
నవసర విశేష సభకు రం ♦ డనుచుఁ జేర్చి కడు విషాదంబు దోఁప న ♦ క్బరువిభుండు,

—*) అక్బరు సార్వభౌముని విషాదము. (*—

సీ॥ "అకట! దేవేరిమ ♦ హా దుర్గమున సైన్యపటలితో నోడె షా ♦ బాజు ఖాను;
కుంభల్‌మియర్‌కోట ♦ గుఱుబలోద్ధాముఁ డబ్దుల్లాపతి ససైన్య ♦ ముగను దెగియె;

నవ్వాల సూర్యమ ♦ హల్దుర్గమునఁ గడు దర్పాఢ్యుఁడు మహాబ ♦ త్ఖాను సమసె;
నచలగృహముదుర్గ ♦ మందు వాహినులతోఁ గడతేఱెను ఫరీదు ♦ ఖానుశూరుఁ;
గీ॥ డణఁగి వెన్కకుఁ బోయిన ♦ యాప్రతాప సాగర మహాతరంగంబు ♦ సరభసముగ
నిప్పు డుప్పొంగి యట్టె పై ♦ కెత్తివచ్చె; నింక నెట్లోర్తు! మేవాడ ♦ యెట్లు నిలుచు!''
క॥ అని మోము డిల్లవడిపోయినఁ గని హరివిజయసూరి ♦ “యిన్నేండ్లు రణం
బును దలుముచు నడపఁగనోపని రాణాగారి కింత ♦ బల మెటు లొదవెన్!” 252
సీ॥ అనిన నక్బరువిభుం ♦ డతని వీక్షించి “భామాసాహియను పూర్వ ♦ మంత్రి యొకఁడు
పర్షియాకడనుండి ♦ వచ్చి దూరపుసీమ కరుగుచున్న ప్రతాపు ♦ నడ్డగించి
కేవల ధర్మదీ ♦ ప్తావర్తనము మాన్పి రాజనీతిప్రకా ♦ రమ్ముఁ గఱపి
గణుతికిమీఱు పై ♦ కము వేయుబండ్ల నంపించినాఁడని మొన్న ♦ వేగు లనిరి;
గీ॥ యాత్మదేశంబు విడి సరి ♦ హద్దు దాఁటి చనఁగనున్న ప్రతాపుఁడు ♦ మనసు మార్చు
కొని సమస్తబలంబొన ♦ కూర్చుకొనుచు నీమహాసంగరారంభ ♦ మిట్లు చేసె.” 253
క॥ అన జైనగురువరేణ్యుం డను! “భామాసాహి త్యాగ ♦ మతివంద్యం; బ
య్యనఘుండు పాత్రదానంబునను గృతార్థతను గాంచి ♦ పుణ్యుం డయ్యెన్. 254
మ॥ పెనుకష్టమ్ముల మున్గి కాంతి చెడి పి ♦ ప్పిన్ దేలు నాదేశమా
తను సేవించి సకాలమందు నిరతో ♦ ద్ధారంబు గావించు పా
వనభాగ్యం బది పూర్వజన్మమునఁ గా ♦ ల్వన్ రాని పుణ్యంబు చే
సిన శుద్ధాత్ముల కబ్బుఁ; దక్కొరులకున్ ♦ సిద్ధింప దెప్పట్టునన్. 255
క॥ భామాసాహిబుధేంద్రునిదౌ మహిత యశో విభూతి ♦ యజరామరమై
భూమియు దివమును నిండు; మహామహుఁ డతఁ”డనఁగ, నక్బ ♦ రార్తిన్ బడుచున్,
మ॥ “మన కీరీతి సభాముఖంబునను “భా ♦ మాసాహి పుణ్యాత్ముఁడం
చని, కాడంచని” చర్చ యేటికిఁ! బ్రతా ♦ పాధీశ్వరున్ గెల్చి యా
యన నోర్చన్ దన కేనధీశ్వరుఁడనం ♦ చన్వింతు నం చాస లుం
డెను గొండంతలుగాఁగ; నిప్పు డవి యూ ♦ డెన్ నామనం బేర్చుచున్. 257
సీ॥ పదునైదులక్ష ల ♦ శ్వబలంబు పాదాతిబల మేఁబదైదు ల ♦ క్షలును గలిగి
యుర్వినెల్ల జయింప ♦ నోపువారు పదాఱువందలు వాహినీ ♦ పతులు గలిగి
విశ్వం బదరఁ బది ♦ వేల పిరంగులు దశసహస్రద్విప ♦ తతులు గలిగి
వరుసలు వరుసలై ♦ పరగు భాండాగారభవనముల్ నిండ ద్ర ♦ వ్యంబు గలిగి

గీ॥ రాజరాజుల గెలిచి వి ♦ క్రమము వలచి భరతఖండ మేలెడు సార్వ ♦ భౌముఁడనయి
పేదయగు ప్రతాపున కోడి ♦ బెండువడినఁ 'జీ' యనఁగఁబోదె జగము! నా♦సిగ్గుచెడదె!

సీ॥ రాజ్యంబు లేక దు ♦ ర్గబలంబు లేక సైన్యబలంబు లేక ద్ర ♦ వ్యంబు లేక
సాయమేమియులేని ♦ సమయంబుననె మహారాణాప్రతాప దు ♦ ర్వారమూర్తి
యవనుల గళముకో ♦ ఱ్ఱయి రణంబుల బలిగొఱ్ఱలుగాఁ జేసి ♦ కోయుచుండె;
బలవంతుఁడును ద్రవ్య ♦ వంతుండు దుర్గవంతుఁడు రాజనీతిమం ♦ తుండు నయ్యెఁ;

గీ॥ దొలుత నణఁపరాని మహాగ్ని;♦తోడు దవిలె గాలి; యిఁక లోకమంతయుఁ♦గాల్చుటరుదె
యతని నెటుగెల్తు నను చింత ♦ యంతకంత కెచ్చెఁ; దెర వేది దోఁప; దిం ♦ కేమి సేతు!

మ॥ కల వా యింద్రునికేని లేని పలు భా ♦ గ్యశ్రీరతుల్; పాద మి
య్యిలపై మోవఁగనీక కొల్వఁగల వా ♦ రెన్నని కోట్లుండు; రే
సిలుగుల్ పైఁబడ; వా ప్రతాపుదెస నా ♦ చింతాగ్నియున్ గేతకీ
దళగర్భమ్మునఁ జేరు నాగువలె డెం ♦ దం బాది కారించెడున్. 260

గీ॥ అమరులకు లేని భోగభా ♦ గ్యము లొనరియునా ప్రతాపునిదెస నీర్ష్య ♦ నడఁగుచుంటి;
నేమి లేకున్న దేవుని ♦కృప గడించి యతఁడు లోకాతిశాయి శౌ♦ర్యమున మెఱయు. 261

మ॥ అకటా! యక్బరువాసి లోకములు కొం ♦ డాడంగనే కాని యే
టికి నెక్కున్! నిఱుపేదతేని నొకనిన్ ♦ డీకొంచు గెల్వంగఁజా
లక యల్లాడుచునుండె నంచు జగముల్ ♦ నవ్వంగ జీవింపనే
టికిఁ! బ్రాణంబులపైననే విసువు పు ♦ ట్టెన్! వేదనల్ హెచ్చెడున్!". 262

మ॥ అని నిట్టూర్చుచుఁ బాదుశాహి కడు దై ♦ న్యం బంద నిర్వాతదీ
పనిభంబై కనుపట్టెఁ గొల్వు; సభికుల్ ♦ ప్రాభాత చంద్రోపమా
ననముల్ వంచిరి; మానసింహుఁ డరిమా ♦ న ప్రాణ విధ్వంసన
ధ్వనితాశాంత యశో విశాలుఁ డపు డ ♦ క్బర్ నేత నీక్షించుచున్, 263

—*) మానసింహుఁ డక్బరు సార్వభౌమునకు మనస్తాపోపశమనంబు చేయఁబూనుట (*—

సీ॥ "అరిరాజమర్దనో ♦ ద్ధురశక్తి గాంధారసీమ నీసీమగాఁ ♦ జేసినాఁడ;
నడిగినంతనె పోయి ♦ గడియలో ఢిల్లికిఁ గాశ్మీరమును దెచ్చి ♦ కలిపినాఁడఁ;
మానవుల కసాధ్య ♦ మైన కాబూలు గెల్చి భవత్పదంబులఁ ♦ జేర్చినాఁడఁ;
గడు విశాలములు వం ♦ గవిహారదేశముల్ గెలిచి నీకు యశంబుఁ ♦ గొలిపినాఁడఁ;

గీ॥ దలలు బలియుట గెలువఁగా ♦ నలవిగాని దేశముల నెన్నియేని సం ♦ దిటనుబట్టి
నీకు లోఁబడఁజేయు ని ♦ ర్ణిద్రశౌర్యపరుఁడ నేనుండ! నీ కేల ♦ వనట మునుఁగ. 264

చ॥ వ్యవధి లవంబులేని కల ♦ హంబుల పెల్లునఁ జిక్కి, రాజకీ
య వితత కార్యజాలముల ♦ యందు మునింగి, విదేశమందు నుం
డవలసి కొన్నిమాసము లె ♦ డంబు జనించి ప్రతాపుతోడి యా
హవము నుపేక్షచేసినటు ♦ లౌటయు నిక్కము! యేమి చేయుదున్! 265

మ॥ అవనిన్ జూడ్కులు వాల్చి నీ వడలి దై ♦ న్యం బాదినన్ నాయనం
బవియున్; నాకుఁ బ్రతాపసింహునకు బా ♦ ల్యంబాది వైరానిలం
బు విజృంభించుచు నేఁటి కింకను మనం ♦ బున్ గాల్చుఁ! జల్లారలే
దు; వితాసేయక తాఁకి నొంచి యుడికిం ♦ తున్ మూదలింతున్ బ్రభూ! 266

సీ॥ చీమయుఁ జొరని కా ♦ శ్మీర దేశములోని కొండలన్నియుఁ బిండి ♦ పిండి యయ్యె;
మనకుఁ బరిపియాకు ♦ మధ్య సాంద్రాటవుల్ పగిలి బీటలువాఱి ♦ బాట లొసఁగె;
దక్షిణాపథము విం ♦ ధ్యము పాదఘట్టనగురుత కోర్వక భూమిఁ ♦ గ్రుంగి పోయె;
నీఁగ కనువుగాని ♦ హిమగిరిప్రాంత రాజ్యములెల్లఁ దలక్రిందు ♦ లౌచుఁ దిరిగె;
ఆ॥ నాప్రతాపుఁ డెంత! ♦ యాతని బలమెంత! త్యాగ మెంత! యతని ♦ ధైర్య మెంత!
పోవనిమ్మటంచు ♦ నే వీడితినిగాని కన్ను దెఱువ నెపుడొ ♦ కాలిపోఁడె! 267

సీ॥ ఆఫ్రికాఖండంబు ♦ నంతయుఁ దెచ్చి వంగమహాంబురాశిని ♦ గలిపి వైతుఁ;
బ్రాలేయశైలంబుఁ ♦ బాదుతోఁ బెకలించి యావరణాచలం ♦ బవలఁ ద్రోతుఁ;
నీపదమ్ములచెంత ♦ నీలోత్పలంబుగా నీలాంబురాశి ద ♦ క్కోఁలు సేతు;
నుత్తరకురుభూము ♦ లొకక్షణంబున గెల్చి గురుదక్షిణగ నీకుఁ ♦ గుదురు పఱతు;
గీ॥ నాసియాఖండ మెల్ల నీ ♦ యాజ్ఞనుంతు; నిట్టిచో నొక్కమేవాడ ♦ యెంత నాకుఁ;
తెలియవే మద్భుజాబలో ♦ దీర్ణశక్తి! తలుపుల గ్రిమ్మఁగువాని క ♦ ప్పళము లెంత! 268

క॥ కావరము పెచ్చు పెఱిగిన మేవాడఁ బ్రతాపసింహు ♦ గ్రింగుటకై నా
జీవితము మీఁదుదీయుదు; నే వెలితికి సందు దొఱక ♦ నీయకు మొడఁదన్. 269

క॥ ఈపని నెఱవేర్పనిచో నాపేరునఁ బిల్వఁబోకు" ♦ నా విని యక్బర్
భూపతి యందఱఁ గనుఁగొని "యీపగిది నిఁకెంతకాల ♦ మిటు వేఁగింతున్! 270

సీ॥ మేవాడజయము న ♦ మ్మి యనేక లక్షలు సేనల నాహుతి ♦ చేసినాఁడ;
సమరసన్నాహముల్ ♦ జరుపుచో ధనము కోటులుఁగోట్లు నట్టేటఁ ♦ గలిపినాఁడ;

నోక్కొక్కరు జగంబు ♦ నువ్వెత్తుగొనెడు చమూనాయకులను గో ♦ ల్పోయినాఁడ;
నిరవదేండ్లుగ క్షణం ♦ బేని పీడని మానసికదుఃఖపరత శో ♦ షిల్లినాఁడఁ;
గీ॥ బడఁగరాని కష్టంబులు ♦ పడిన వాఁడ; నడువరాని దుష్పథముల ♦ నడచినాఁడ;
నట్టియాశించియాశించి ♦ యాసలుడిగెఁ; దాల్మియుడివోయె; మిగులసం ♦ తాపమయ్యె.
మ॥ ఎవరిన్ జెప్పినఁగాని నమ్మకము నా ♦ కింతేనియున్ లేదు; నే
నెవరిన్ గోరను సాయమున్ సలుప ర ♦ మ్మా! యంచు; నా కెవ్వరున్
లసమున్ మేలొనరింపలే; రుఱిక కా ♦ లంబెల్ల నందంగరా
ని వృథాశారతిఁ జెల్లెఁ; జింత యొకఁడే ♦ నిల్చెన్ మదీయాంశమై. 272
గీ॥ పీడిచనెదె ప్రతాప! మే ♦ వాడ సీమ! చాలు నిక మీదఁ "దవగతి ♦ స్త్రవ"యటంచు
మమగతిర్మమ"యనిచింత ♦ మానియుంటిఁ; గూళపాలుండునాకొంపఁ ♦ గూల్చెనకట!
గీ॥ ఏమి చేయుదు! నాచింత ♦ యిపు డొకింత యణఁగఁగల త్రోవ లేదు; నా ♦ కతనితోడి
పోరు తలమున్క లయ్యె" నం ♦ చీరసమున నిలువ, నబ్దారురహిమాను ♦ గళము నెత్తి,

—*) అబ్దారహిమాను ప్రతాపసింహుని గుణగణములను గీర్తించుట. (*—

సీ॥ "రాజు లాత్మాంఘ్రిసీ ♦ రజముఁ గొల్వఁగఁబొల్చు రాజయోగానంద ♦ రమ్యమూర్తి,
జన్మదేశమునకై ♦ సర్వస్వ మర్పించు నసమాన దేశ భ ♦ క్తాగ్రగణ్యుఁ;
డంబుజాతాప్త మ ♦ హావంశదుగ్ధాబ్ధి జనియించు సంపూర్ణ ♦ శశధరుండు;
చతురబ్ధివృత మహీ ♦ చక్రి మర్పించిన నంట నొల్లని మహా ♦ త్యాగ ధనుఁడు;
గీ॥ పౌరుషభగీరథుం డట్టి ♦ ప్రభువరుండు మన కులమునఁ గాఁ దిక లోక ♦ మునను గలుగు
నేరకలమ్మున లేఁడు నా ♦ యెఱుఁగుదాఁక; నుత్తమోత్తముఁ డతఁడందుఁ ♦ జిత్తగింపు.
సీ॥ అంసమందున సహ ♦ స్రాంశు లీనెడు రవిధ్వజరాజము గరుడ ♦ ధ్వజముగాఁగ,
నద్వితీయంబు "ఖాం ♦ డా"ద్విధారాకృపాణంబు దుర్దాంతనం ♦ దకముగాఁగ,
మైసండ దొడుగు హే ♦ మతనుత్రరాజంబు రంగారు పీతాంబ ♦ రంబుగాఁగ,
విలువైన మగతాలు ♦ గులుకు కల్కితురాయి రమణీయ బర్హిబ ♦ ర్హమ్ముగాఁగఁ,
గీ॥ బుండరీకములకుఁ దోడఁ ♦ బుట్టువైన వెడఁద కనులు కృపామృత ♦ వృష్టి గురియఁ
గదలివచ్చి హల్దీఘాటు ♦ కడఁ బ్రతాపరాజనారాయణుండు ద ♦ ర్శన మొసంగె. 276
సీ॥ ఐరావతంబుపై ♦ నరుదెంచు నిర్జరసార్వభౌముని మేలు ♦ చక్కఁజేసి,
వృషభవాహన మెక్కి ♦ యేతెంచు కైలాసవాసు విలాసంబు ♦ గాసి చేసి,

హంసరాజము నెక్కి ♦ యరుదెంచు భారతీశ్వరుని రూపవిభూతి ♦ భంగపఱచి,
శిఖిరాజవాహన ♦ శ్రీమీఱ వచ్చెడు స్కందు నందము నెంతు ♦ డిందుపఱచి,
గీ॥ మనుజపతిమౌళి మన్మథ ♦ మన్మథుండు చైతకాశ్వముపైన సా ♦ క్షాత్కరించి
దివ్యదర్శన మిచ్చె; నా ♦ తేజమునకు నంజలి ఘటించి, యాత్మోప ♦ హార మిడుదు.
గీ॥ ఆ త్రిభువన కల్యాణ ప ♦ రాయణుఁ గనినపుడె, యాత్మావలోకనం ♦ బయ్యె నాకు;
నని ముగిసి ఢిల్లిఁ జేరి నే ♦ నరసిచూడ నాత్మ యతనికై నీకు దే ♦ హంబు దక్కె. 278

మ॥ అకటా! నీవలె ధర్మముల్ దెలిసి రా ♦ జ్యం బేలఁగాలేఁడొ! మ
చ్చికమై భూప్రజఁ బుత్రులం బలెఁ గృపా ♦ శ్రీఁ జూడఁగాలేఁడొ! పా
యక వర్ణాశ్రమధర్మపద్ధతి తిరం ♦ బై నిల్పఁగాలేఁడొ! మొం 279
డుకు నాతండు స్వతంత్రుఁడై నిలువఁ గా ♦ దో! యాన తీఁ గోరెదన్.

సీ॥ తలఁగని రణములఁ ♦ దగులుకొన్నను స్వధర్మత్యాగ మాచరిం ♦ పంగఁబోఁడు;
తినఁ దిండిలేక కుం ♦ దెడునప్పుడైనను దైవభక్తి యొకింత ♦ తలఁగనీయఁ;
డనుపమాన ప్రవ ♦ ర్తనమున జగమున కాచార్యపీఠమై ♦ యలరినాఁడు;
స్వాతంత్ర్య సమర దీ ♦ క్షా నిబద్ధాత్ముఁడై సతతోపవాసముల్ ♦ సలిపినాఁడు;
గీ॥ కలియుగంబున నిట్టి యో ♦ గ్యతముఁ గనము! వెఱ్ఱినని నన్ను జగము భా ♦ వించుఁగాక!
యినకులంబు గాలించి చూ ♦ చినఁ బ్రతాపు నంతటి మహాపురుషుఁ డుండఁ ♦ డని వచింతు.
గీ॥ ఆ మహారాజు కీర్తిచం ♦ ద్రాతపమునఁ జల్లఁగా జీవితమ్మెలు ♦ జరపుకొనుచు
మనము సమకాలికులమౌచు ♦ మనఁగలిగితి; మిదియ దేవేంద్రభోగమం ♦ చెన్నవలయు.

మ॥ ప్రకటశ్రీకర మామహాత్ముని క్షమా ♦ భావంబు శ్రీరామర
క్షకదా మీ; కతఁ డాసనొందుచు "వనా ♦ శా"నిమ్నగన్ దాఁటి చెం
తకు విచ్చేసిన యానిమేషమె భవ ♦ త్త్రైరుష్క సామ్రాజ్యల 282
క్ష్మికి నూఱేఁడులు నిండు నిక్కమని ఘో ♦ షింతున్ నిరాఘాటతన్.

సీ॥ ప్రతిలేని వైభవ ♦ ప్రాభవంబులు నీవు నెఱపు నీ హస్తినా ♦ పురమునందు
గాఢాంధకారసం ♦ గతమైన యొక నాఁటిరాత్రి యొంటరిగ నా ♦ రాజమౌళి
యడుగు పెట్టెనయేని ♦ నాసడి తెలియుచు క్షణమున లేచు న ♦ ఖండసేన;
విడక నీ విందుండ ♦ వీలౌనొ! పాఱిపోవలయునో యోజింప ♦ వలసియుండు;
గీ॥ శ్రీరమాభర్త సాక్షాత్క ♦ రించినట్టు లాప్రతాపుఁడు కనుపించు ♦ నపుడు, నీవు
సేవకుఁడ నేనె నీసేవ ♦ చేయఁగలనో! యవలఁ దొలఁగుదునో! తెలి ♦ యంగ రాదు.

మ॥ మఱి యేదే నొకకారణంబుమెయి కం ♦ పం బొంది తూగాడి యీ
ధరణీచక్రము సర్వ మొక్క మొగిఁ బా ♦ తాళమ్మునన్ గ్రుంగి యు
క్కఱినన్ సుంత చలింపఁబోవను; ప్రతా ♦ పాధీశు సత్కీర్తి కె
వ్వ రపాయం బొనరింపఁ బూనినను నో ♦ ర్వన్ బోవఁ బ్రాణాలతో! 284

సీ॥ ఒక నృపాలకుఁ డేలు ♦ నొక్క రాష్ట్రంబులో నొక టంకసాలలో ♦ నుద్భవించి
పరిపరివిధములై ♦ పరగు నాణెములట్లు మతము లన్నియును నీ ♦ క్షితి రహించు;
మనుజుల నుద్ధరిం ♦ పఁగ వీని నేర్పఱచిరి బుధుల్ లోకప్ర ♦ సిద్ధమతులు;
ప్రతిమతంబునను న ♦ ర్హాత యుండనే యున్న; దీశ్వరదృష్టిలో ♦ నన్ని సమము;
గీ॥ లన్యమతమువాఁడు ప్రతాపుఁ♦డనకు; డతని దుత్తమోత్తమమతము; మ♦ర్త్యుండు మాత్ర
దేశమున కప్పువడె నంచు ♦ దెలియని మన యావనమతం బొకండె ని ♦ రర్థకంబు. 285

చ॥ కటకట! యీమహాత్ముఁ డొక ♦ కైవడి లోఁబడఁ; డీవునన్ జగం
బెటులను నిల్వనీవు; శ్రమ ♦ మింతయు నొక్కని గెల్వనేకదా!
గుటికెడు పాలకై పొదుగుఁ ♦ గోయుదురే! యొకపండుకోసమై
విటపముఁ గూల్తురే! ఫలము ♦ వెల్తి శ్రమం బధికంబు గాదొకో! 286

సీ॥ రాజపుత్రకులు దు ♦ ర్వారవిక్రమయుతుల్; తెఱవ లత్యలఘుసా ♦ ధ్వీమతల్లు;
లాకులమ్మున బాలుఁ ♦ డైన వీరులలోన నగ్రగణ్యులనైన ♦ నడఁపఁగలఁడు;
పరిఫుల్లసురుచిర ♦ ప్రమదావనవతంస; మనుపమ నిత్య క ♦ ల్యాణసీమ;
పరమశోభన నిత్య ♦ వైవాహికగృహంబు; క్ష్మాసతీ కంఠ ము ♦ క్తాస్రజంబు;
గీ॥ నైన మేవాడపై కేగు ♦ టనుచితంబు; రాజపుత్రులఁ దొడర ఘో ♦ రతమపాప;
మాప్రతాప పురోగమ ♦ మైన కులము దండనకు నర్హమే! మ్రొక్కఁ ♦ దగునుగాక.
గీ॥ దైవమును దూరముంచి యిం ♦ దాఁక వారి కాచరించిన కొండంత ♦ యఘమ చాలు;
నింక భూదేవి భరియింప ♦ దెప్పు డెవరి కెచట నేగతి పట్టునో! ♦ యెవ్వఁ డెఱుఁగు!

సీ॥ నాగ్లేండ్లవాని నిం ♦ తగఁ జేసితివి; చదువులను నేర్పించితి; ♦ బుద్ధి గఱపి;
తున్నతోద్యోగ సం ♦ పన్నునిఁ జేసితి; కూరిమి పియ్యంబుఁ ♦ గూర్చి యుంటి:
పి దేహమే నీది; ♦ యీ ప్రాణమే నీది; యీ జీవితంబె నీ ♦ దెల్లయపుడు;
నా శరీరమ్మునం ♦ దలి రక్తమునఁ బ్రతిబిందు వెల్లపుడు నీ ♦ పేరె పలుకు;
గీ॥ నీదు సేమంబు నెంచి ని ♦ శ్ఛిద్రయశము నెంచి నీయెడ గౌరవ ♦ మెంచి నీదు
ప్రభుత కేవేళ మేలెంచి ♦ పలుకు నాదు ప్రార్థనముఁ ద్రోసిపుచ్చకు" ♦ మనెడు నంత,

—*) అబ్దుఁరహిమాను మాటల కందఱు హర్షించుట. (*—

సీ॥ "ఈమాట లోకమెం ♦ తేని సోఁదలఁదాల్ప విహితమా"నని హరి ♦ విజయసూరి;
"యద్దిరా! యియ్యవి ♦ యమృతవాక్యంబులు తథ్య"మనియె సూరి ♦ దాససుకవి;
"రాజపుత్రులతోడ ♦ రణ మొనర్చుట కలుషమ్ము పో"మ్మనె ఘెరి ♦ స్త్రామనీషి;
"యాప్రతాపుఁడు దేవు ♦ నవతారమేయని విశ్వసింతు"ననియెఁ ♦ బృథ్వీరాజు;
గీ॥ నంద ఱాడెడు మాటల ♦ నాలకించి, యందు నందును గల యుక్తు ♦ లాదరించి,
యాత్మభావంబుఁ గొంత గో ♦ ప్యముగ నుంచి, చిఱునగవు వెల్వరించె న ♦ క్బరువిభుండు.

—*) మానసింహుఁడు యవనసభను దృణీకరించి మాటాడుట. (*—

క॥ అందఱను గలయఁ గని వగ చెందిన మదితోడ మాన ♦ సింహుండును "మీ
రంద ఱెటులఁ దలఁచిన నాకుం దోఁచినయట్లు నడచు ♦ కొనఁ గలవాఁడన్. 291
గీ॥ ఆ ప్రతాపుఁడు భృతి యిచ్చి ♦ యాదరించు భట్టులవిధానఁ బొగడంగఁ ♦ బాలుపడితి;
రార! యాత్మాభిమాన మిం ♦ తైన లేక యేమి చేయుదు! మీశౌర్య ♦ మిట్టులుండె.
మ॥ ఇదె నే గాదని పట్టు పట్టితినయే, ♦ నిందున్న యీమంత్రులున్
పదునార్వందలు వాహినీశులు ప్రతా ♦ పక్ష్మాధిపున్ జేరి న
న్నెదిరింపన్ జనుదెందు మీర; లిటుపై ♦ నే మాదురో చూతు; రు
న్మదశార్దూలము చెంగటన్ నిలువ నీ ♦ మార్జార గర్జార్భటుల్. 293
మ॥ పరు లాఱేని గుఱించి యేల పలుకన్! ♦ బ్రత్యేక శత్రుత్వముల్
వఱలున్ నాకుఁ బ్రతాపసింహునకు; నం ♦ బర్ సేనతో నేగి యు
ద్ధురశౌర్యంబునఁ దాఁకి యాతని జయిం ♦ తున్; మానసింహేంద్రుఁ డొ
క్కరి సాయంబు నపేక్షసేయమికిఁ దా ♦ ర్కాణంబు చూపించెదన్. 294
గీ॥ సేనలు ధనంబు రాష్ట్రంబు ♦ జీవితంబు నతని గెల్వంగ నర్పింతు" ♦ ననుచు రౌద్ర
ముల్లసిల విజృంభింపఁగా ♦ నెల్లవార లేమనఁగలేక నిల్చి; రా ♦ పృథ్వీరాజు, 295

—*) పృథ్వీరాజు మానసింహు నధిక్షేపించుట. (*—

సీ॥ అతిపావనుఁడు ప్రతా ♦ పాధీశు నెవనిగా విశ్వసించితివో! ద్వా ♦ వింశతియగు
రాజపుత్రక మహా ♦ రాష్ట్రంబులకు రాజులకు నగ్రగురుఁడు; కా ♦ లంబు చక్క
జరిగియుండినను నం ♦ దఱు రాజపుత్రు లాధన్యు నంఘ్రుల మ్రోల ♦ దాసులేకద!
శ్రీసలుంబ్రాకృష్ణ ♦ సింహేంద్రుచే మొట్టఁబడి తల దిమ్మెక్కి ♦ పడియెయుందు;

ఆ॥ పాదుశాహి ప్రాపు ♦ పట్టి మిన్నందుడు, వా దినములు మఱచి ♦ తయ్య! యిప్పు
డీఁక తోఁక దొడిగి ♦ యీఁగ బెబ్బులియైన సాటి మాట నీక ♦ పాటి కెక్కె. 296

సీ॥ సైన్యాధిపతులు ప ♦ జ్జనుజేరి "కైలవారాసీమ ఫలవృక్ష ♦ రాజి నరులు
నఱకిరి, తిండి చే ♦ కుర"దన్న నవ్వుచు "వైరులు చెఱుపంగ ♦ వలనుపడెదు
తిండి చేకొనుట సం ♦ ధిలె లోప, మింక శాత్రవులెల్ల సంవత్స ♦ రముల కొలఁది
పనిచేసి చెడుపనో ♦ పని తిండి జూతుఁ, బచ్చిక రుబ్బి రొట్టెలు ♦ చేసి తింద"
గీ॥ మనుచుఁ బందొమ్మిదేండ్లు తో ♦ యమును గడ్డి తినుచు సతతోపవాస మూ ♦ నిన తపస్వి,
యతనిదెస ప్రేలుచూపు శౌ ♦ ర్యపరుఁ డున్నె! విశ్వమంతయుఁ ద్రుటినిస్తం ♦ భింపఁజేయు.
గీ॥ దేవపూజాగ్హ్రాఁ డతని నిం ♦ దించి నీవు గురువులకుఁ బంగనామముల్ ♦ గూర్చుటయ్యె;
రేఁగి గ్రుడ్డి పిల్లను వెక్క ♦ రించుటయ్యె; వినఁగ లేము, పాపాబ్ధిని ♦ మునుఁగ లేము.
సీ॥ భాగ్యంబులెన్ని సం ♦ పాదించియున్నను, నెన్నెని భోగంబు ♦ లెసఁగియున్న,
రవి ప్రకాశించు నీ ♦ రాజ్యమంతయుఁ గొన్న, జయముపై జయమొంది ♦ చక్కనున్న,
విక్రమ సూచక ♦ బిరుదముల్ వేలున్నఁ, జెల్లుబడియుఁ దద్దఁ ♦ జెలఁగియున్న,
నిది యేమి యని యెరుఁ ♦ డెదురాడకున్నను, ధరయెల్ల మనయాజ్ఞఁ ♦ దాల్చియున్న,
గీ॥ ఫల మొకింతయు లేదు; రాఁ ♦ గల యుగముల దేశవిద్రోహులకు వంశ ♦ నాశకులకు
నాత్మగురుదూషకుల కుదా ♦ హరణముగను నెల్లరును జూపఁగలరు వ్రే ♦ లెత్తి మనల.
గీ॥ బ్రదికినన్నాళు లీప్రగ ♦ ల్భములతోనఁ దెల్లవార్చితి జీవిత ♦ మెల్ల, నఱుక
దురమునకు నంపకాఁడవై ♦ తుల్లిపడెను; పుణ్యపురుషార్థముల చింత ♦ బుద్ధిఁ జొరదె.
మ॥ అకటా! కానలఁ బుట్టి యందె బలితం ♦ బై జాలియే లేని ఘా
తుకసత్వంబులు గూడ నాత్మకుల జం ♦ తుచ్ఛేదముల్ మాని వే
ఱొకటుల్ గుక్షి భరించుచుండు! నిజధ ♦ ర్మోద్వాసముల్ జేసి స్వీ
యకులధ్వంసము చేయుచుంటివి; మను ♦ ష్యత్వంబు చే దయ్యెనే! 301
సీ॥ పాలమున్నీటిలో ♦ పల నెన్నొవస్తు లుద్భవ మొందె; నొక చంద్ర ♦ దర్శనమున
నుప్పొంగుచుండుఁ బ ♦ యోధి; యట్టులె రాజపుత్ర పావనకులాం ♦ భోధియందు
మనమందఱము జనిం ♦ చినను రాణా కీర్తి చంద్రికయే తదు ♦ త్సాహకారి;
మేవాడకే గాద యీ ♦ విశ్వమునకెల్ల నతఁడు వీరుఁడు గురుం ♦ డగుచుఁ బొలిచె;
గీ॥ నట్టి స్వకులదీపకు స్వామి ♦ నాత్మవేత్త నిరత మౌదలఁ దాలిచి ♦ చరణపూజ
సలుపక తృణీకరించు వి ♦ శ్వాసహంత యిలను మననేమి! పరలోక ♦ మేగనేమి! 302

గీ॥ పూలదోరసాని మల్లెపూ ♦ పూచువఱకు నేను సాధారణమ్మైన ♦ నేలనె యనుఁ
గన్నతోట; ప్రతాపునిఁ ♦ గన్న పిదపఁ దనరె భూదేవి నిజము పు ♦ త్రవతి యగుచు.
గీ॥ భరతఖండ మహాలక్ష్మి ♦ "భాగ్య మయ్యె"నని ప్రతాపుని యశముఁ గీ ♦ ర్తనముసేయుఁ;
బామసాచెవి నిలు గట్టి ♦ పచ్చివిసము నెత్తఁ దగునయ్య! విసపాల ♦ విత్త వగుచు! 304
చ॥ యవన మహామహీశ్వరుఁ డు ♦ దారహృదంతరుఁడౌట నెందు నె
ప్డెవ రెటు లాడినన్ విని స ♦ హించు నటంచుఁ బ్రతాపదేవుఁ గూ
ర్చి వృథగ నింద లాడెదవు! ♦ చేసిన పాపమె చాలుఁ జాలు! నా
చెవులకుఁ జేదు గ్రమ్మెడు; ని ♦ సీ"! యని ధిక్కృతిఁ జూచి నిల్వఁగన్, 305
క॥ వడిఁ దోఁకఁ ద్రొక్కు భుజగము వడువున నంబరువిభుండు ♦ పైదూఁకఁదొడం
గెడు నడిఁ గనుఁగొని యక్బరు కడు సమయస్ఫురణ గలిగి ♦ కార్యజ్ఞుండై. 306

—*) అక్బరుసార్వభౌముఁడు శాంత వచనములు పలుకుట. (*—

చ॥ "పలువురు మీరు మీ హృదయ ♦ భావములన్ దెలియంగఁగోరి నే
సలిపితి నాతనిన్ గుఱించి ♦ చర్చ యొకింత; కలంతవట్టు మీ
పలుకుల సారమున్ విశద ♦ భంగి నెఱింగితి! నా మనంబునన్
గల తెఱఁ గంతయున్ దెలియఁ ♦ గా వినిపించెద; నాలకింపుఁడీ! 307
చ॥ సమరము లోకరీతిఁ గొన ♦ సాఁగఁగఁజేసితి; నిట్లు కొంతకా
లము కడచన్న నొప్పఁడె చ ♦ లంబఱి నాదు ప్రభుత్వమంచు; ని
క్కముగఁ బ్రతాపభూపు నెడఁ ♦ గల్గ దొకించుక యీర్ష్య నాకుఁ; గ
య్యములను బ్రిద్దుపుచ్చుట ప్రి ♦ యంబనఁ జెల్లునె! యెట్టి వారికిన్! 308
గీ॥ ఆ మహానాయకవతంస ♦ మాప్రతాపుఁ డెన్నిగతుల యోజించిన ♦ నన్నుఁబోలు
కోటి సార్వభౌములు చేరి ♦ కొలువఁదగిన క్షాత్రనిధియను మాట వ ♦ జ్రలమాట.
సీ॥ ఆరమణీయ దు ♦ ర్వార తేజోమూర్తి సందర్శనమున నా ♦ నంద మొంద
వలయునటంచుఁ గొం ♦ డలుఁ గోట్లుగా నాకుఁ గోర్కులు మదిలోనఁ ♦ గొనలుసాగుఁ!
గాని యిన్నేండ్లుగాఁ ♦ గాలమంతయు నిట్లె కడచె; నా కట్టిభా ♦ గ్యంబు గలుగ;
దతని దర్శింప నా ♦ కర్హత యున్నదే యని పలుమాఱు జం ♦ కడరు చుండు;
గీ॥ గురువు దైవంబుఁ జూడక ♦ క్రూరబుద్ధి నామహారాజునకును జే ♦ నైనదాఁక
నెగ్గు గావించి తగుదునం ♦ చిపుడు పోయి చేరి సాన్నిధ్యమున నిల్వ ♦ సిగ్గు దోఁచు.

గీ॥ ఆమహాభాగు కీర్తిగా ♦ నామృతమునఁ జిక్కవాఁ డెల్ల నను నింద ♦ చేసి తీఱు;
నతి ధవళమైన యాతని ♦ యశము వోలె నాదు దుష్కీర్తి శాశ్వతం ♦ బై దనర్చు.

గీ॥ నాదు జీవిత శేష మం ♦ తయుఁ బ్రతాపు సేవఁ గడిపినఁగాని యిదు ♦ ష్కీర్తి పోవ;
దాధరాధీశుతోఁ డివి ♦ రోధమునకు నీళ్లు విడిచి నే నురక శాం ♦ తించువాఁడ. 312

ఆ॥ బ్రతికి నన్ని నాళ్లు ♦ బ్రదుకము! రాజ్యతృష్ణకును మేరగ లదె! ♦ చాలు నున్న
దానితోడఁ దృప్తి ♦ దనరుట మేలంచుఁ బలికెఁ మానసింహు ♦ వైపుచూచి,

గీ॥ పట్టి పాండవబీడు మే ♦ వాడసీమ, పరక పాలికె గాని లా ♦ భంబు గలుగ;
దా మహారాజు దేశంబు ♦ నాతఁడే గ్రహింపని మ్మింక; నష్టం బ ♦ దేమి మనకు!

క॥ కడచనె నేఁబదియేఁడులు; ముడుతలువడి తెల్లవడియె ♦ మోమును బొమలున్;
గడిమి చెడె; నొడలు సడలెను; గడు వృద్ధుఁడ నైతి; శాంతి ♦ గానఁగ నైతిన్. 314

మ॥ సకలప్రాభవవైభవంబుల మొగల్ ♦ సామ్రాజ్య మేలంగఁద
గ్గ కుమారుండు 'సలీము' దేహము చెడం ♦ గాఁ ద్రాఁగుబోఁతయ్యె; మా
మక చిత్తంబును బాయకుండు నిది మ ♦ ర్మచ్ఛేదియై! దుష్టదం
శక సంగంబున స్రగ్గు మొగ్గ యది పు ♦ ష్పంబై గుబాళించునే!

క॥ పదియేండ్లప్రాయ మాదిగఁ గదనమ్ము కదనం బటన్న ♦ కలఁతలతో న
ల్వదియేండ్లు కడచి చనె; మన బ్రదుకులు పోరులనె తెల్ల ♦ వాఱెన వకటా! 317

గీ॥ ఆప్రతాపుతో నింక క ♦ య్యంబు వలదు వలదు, నలువుర నోళ్లలోఁ ♦ బడఁగఁజాల;
మందఱము జీవితమ్ముల ♦ యందలి తుది రంగముల శాంతితోడఁ దీ ♦ ర్పంగ నిమ్ము."

—*) అక్బరుసార్వభౌముని నిర్ణయమును మానసింహుఁడు సమ్మతింపక పోవుట. (*—

మ॥ అని యొడ్డోలగమందు నక్బరు విభుం ♦ డాడంగ నా వాక్యముల్
విని యంబర్ పతి "నీవచస్సులు మదిన్ ♦ వేధించు; విశ్వంబు భ
స్మనికాయంబుగఁ జేయు నాజ్వలనమున్ ♦ జల్లారె; నే దెట్లు పో
యిన నీ వింతకె యింత మెత్తవడెదం ♦ చే నెంచనైతిన్ బ్రభూ! 319

మ॥ ప్రమదోద్యానముఁబోలు నీయవన సా ♦ మ్రాజ్యంబునన్ గంటకో
గ్రమహీజంబయి నెవ్వగన్ బెనిచె నీ ♦ రాణాప్రతాపుండు; త
త్సమదోద్ధత్య మడంపరానియెడ నీ ♦ దర్పంబు నే నొల్ల! ఖ
డ్గము నే నొల్ల" నటంచు నేల విసరెన్ ♦ గాలాహినా రోఁజుచున్. 320

గీ॥ పరమ గంభీర మాతని ♦ వదనమందు వీరతేజో మహాలక్ష్మి ♦ ద్విగుణిత కళ
వెలిఁగె; సభయెల్ల మౌనముఁ ♦ ద్రదలఁ జెలంగె; నంత నక్బరు నృపమౌళి ♦ యతనిఁ గాంచి,

—*) అక్బరుసార్వభౌముఁడు మానసింహుని శాంతింపఁ జేయుట. (*—

మ॥ "మన యబ్దురహిమాను శీలము జగ ♦ న్మాన్యంబు; స్వచ్ఛందవ
ర్తనుఁ; డేనాఁడు నసత్యదోషమును జెం ♦ దఁ బోని వాఁ; డేను పెం
చిన వృక్షంబు; బితఁ డెల్లవేళలను నా ♦ శ్రేయంబె కాంక్షించు; నీ
తని మాటన్ శిరసావహింపఁదగుఁ గా ♦ దా! నాకునున్ నీకునున్. 322

చ॥ సరసుఁడు; పృథ్విరాజు; కవి ♦ చంద్రుఁడు; మాన్యతముండు; నీకు సు
స్థిరతరబంధువర్గమునఁ ♦ జేరినవాఁడు; ప్రతాపసింహు సో
దరునకుఁ గూర్మియల్లుఁడు; కృ ♦ తం బెఱుఁగన్ గల పుణ్యమూర్తి; స
త్పురుషుఁ డితండు నేర్పు హిత ♦ మున్ దలఁదాల్పకయున్న నేమమే! 223

గీ॥ హరివిజయసూరియును భువ ♦ నైక గురుఁడు, సూరిదాసమహాకవి ♦ సుగుణరాశి,
యాఫెరిస్తాదు లందఱు ♦ నట్టివారె, యెవరి మాటఁ ద్రోయఁగ నేర్తు ♦ మిపుడు మనము.

చ॥ వితరణశాలి, రాజులకు ♦ వేల్పు, కుటీరనివాసి, లోకవం
దిత సుచరిత్రుఁడున్, భువన ♦ ధీరుఁడు, వీరుఁడు, రాజరాజ సం
హతులను మేటియున్, బరమ ♦ హంస, ప్రతాపు నడంపఁ బూనుటల్
చతురతగాఁ దలంపకుము ♦ జాదులు వేతురె! మంగలంబునన్! 325

⊕గీ॥ ఇప్పుడొక్కఁడే నిర్ణయ! ♦ మిఁక ముగింతుసభను; మేవాడఁగల మొగల్ ♦ సైన్యములను
చేర్చుకొని రాజధానికిఁ ♦ జేరుఁడనుచు నాజ్ఞ చేయుదు"నని యక్బ ♦ రంత లేచె. 326

---

⊕ The annals ascribe it to a generous sentiment of Akbar, prompted by the Great Khankhanan (Mirza Abdur Rahiman) whose mind appears to have been captivated by the actions of the Rajput Prince. Pratap was indebted to a combination of causes for the repose he enjoyed during the latter years of his life; and though they may be ascribed principally to the new fields of ambition which occupied the Mogul arms, we are authorised also to admit the full weight of the influence that the conduct of the Hindu Prince exerted upon Akbar, together with the general sympathy, of his fellow Princes, who swelled the train of the Conqueror and who were too powerful to be regarded with indifference.

"Annals of Mewar"

మ॥ నెలయుఁ దాఁటకమున్నె వార్త లలరెన్; ♦ మేవాడదేశంబులో
యల దుర్గంబులఁ గల్గు నమ్మొగలు సై ♦ న్యంబుల్ గుడారమ్ములన్
దలఁగన్ బీకి సమస్తవస్తువుల వెం ♦ టన్ గొంచు గుంపౌచు మో
ములనున్ వాల్చుచుఁ బోయి ఢిల్లినగరం ♦ బున్ జేరె నల్లల్లనన్. 327

—*) రాజపుత్రులు మఱలఁ దమ దుర్గములను బట్టుకొనుట. (*—

సీ॥ హారావళీపర్వ ♦ తాభంగశృంగముల్ తునియలుగాఁగ దం ♦ దుభులు మ్రోఁగె;
నతిమంగళాకారు ♦ లగు రాజపుత్రయోధులు గుంపు గుంపులై ♦ తోఁచి రపుడు;
వారి సంబరమును ♦ వారి యుత్సాహంబు వారి భక్తి వచింప ♦ వశముగాదు;
తోరణగృహమాది ♦ తుది దుర్గమునదాఁక విడువ కన్నిటిఁ బ్రతా ♦ పుఁడు గ్రహించె;
గీ॥ నాఱుమాసంబు లరిగెడు ♦ నంతలోన నొక్క చిత్తూరు దుర్గంబు ♦ దక్కఁ గడమ
యెనుబదియుమూఁడు దుర్గంబు, ♦ లెల్ల దేశ, మాప్రతాపప్రభూత్తంసుఁ ♦ డాక్రమించె.
క॥ తనసామంతుల నొకదినమునఁ గనుఁగొని యాప్రతాప ♦ భూపమణియు "దే
వుని కృప రాజ్యము స్థిరమయ్యెను; యవనులతోడి పోరు ♦ నింక నిలుపుదున్. 329

—*) ప్రతాపసింహుఁడు మాల్పురమును గొల్లగొనుట. (*—

క॥ మనదేశము సరిహద్దునకును నవ్వల నొక్కపురముఁ ♦ గొల్లగొనఁగ నా
మన సయ్యెఁ; గాని, యందలి మనుజుల బాధింపరాదు ♦ మన కెబ్బంగిన్." 330
క॥ అన "నీయాజ్ఞాపించిన పని శిరమునఁ దాల్చి చేయ ♦ వాడుక యగు; నెం
దున కని యడిగి యెఱుంగము; చని నొంతుము జగము మ్రింగు ♦ శత్రుల నైనన్."
సీ॥ అని సలుంబ్రాకృష్ణుఁ ♦ డనినఁ బ్రతాపుఁ డౌఁదల యూఁచి లేచె; నం ♦ దఱును గదలి;
యుత్తరదిగ్విజ ♦ యోత్సాహులగుచుఁ గతిపయప్రయాణముల్ ♦ దీర్చి యొక్క
దినమునం దంబరు ♦ దేశమునన్ జొచ్చి ప్రతిలేని భాగ్యమై ♦ భవ సమగ్ర
భవనంబునై ముఖ్య ♦ వర్తకస్థానమై వఱలుచు నుండు 'మా ♦ ల్పురము' చేరి
గీ॥ ధన కనక సర్వ వస్తు సం ♦ తతులు మూల్గు గొప్ప యంగళ్ళు లన్నిటిఁ ♦ గొల్లగొట్టి
పట్టి సామగ్రి యంతయు ♦ బండ్ల కెత్తి; రాపురము సర్వవస్తు శూ ♦ న్యముగఁ జేసి.

---

❀ Determining to have a slight ovation in return for the triumph Raja Mann had enjoyed who had fulfilled to the letter his threat that "Pratap should live in peril" he invaded Amber and sacked its chief mart of commerce Malpoora. "Annals of Mewar."

గీ॥ భువన మెల్లెడ నిండి మా♦ల్పురము కొల్లగొట్టఁబడెనను వార్త లె♦క్కుడుగఁ బొంగె:
సిగ్గుచెడి మానసింహుండు ♦ శిరమువాల్చె; నాప్రతాపుఁడు మొలక న♦వ్వులరఁదాల్చె.
గీ॥ ధాన్య ధన హేమ వస్తు సం ♦ తతులతోడ నిత్యలక్ష్మీనివాసమం ♦ దిరము నగుచుఁ
దొంటిమాడ్కిఁగుంభల్మియర్ ♦ దుర్గమపుడు మేరుగిరిదుర్గముల కాంతి♦ మ్రింగియుమిసె.
సీ॥ నెలనెల మూఁడువా ♦ నలు గురియఁగసాఁగెఁ; బదనై యవని సార ♦ వంత మయ్యెఁ;
బొలమును దున్ని వి♦త్తులు చల్లెఁ గృషికుండు; పైరు లన్నియుఁ బ్రో♦దివడయసాఁగెఁ;
గెలవారామహా ♦ కాననంబున ఫలతరువులు తామర ♦ తంప రయ్యె;
మొల లెత్తు, బీడునే ♦ లల గడ్డి పెంపొందె; గణనకు మీటి గో ♦ గణము పెరిగె;
గీ॥ గోపురములందుఁ బలుకోట ♦ కొమ్మలందు నగరములయందు గ్రామకం♦ఠములయందు
నచలశృంగంబులందు సూ ♦ ర్యధ్వజములు వందలుగ లేచి పూర్వవై ♦ భవముఁజాటె.
సీ॥ భువనమం దెల్లెడఁ ♦ బూలు పూచినయట్టు లాప్రతాపుని కీర్తి ♦ యతిశయించె;
దేశదేశమునుండి ♦ దినదినం బామహీవిభుని దర్శించి సే ♦ వింప వచ్చు
పుణ్యయాత్రికబృంద ♦ ముల సంఖ్య యింతయు నంతని గణన సే ♦ యంగరాదు:
యవనులుగాక హైం ♦ దవులుగాక సమస్తకులములవారు సే ♦ వల నొనర్చి;
⊕ఆ॥ రొకఁట 'థా' రెడారి♦ యొకఁట విధ్యంబు, వేఱొకఁటఁ దుహినశైల,♦ మొకఁట జలధి,
మధ్యఁ గలుగు నేల ♦ మనుజసమ్మర్దమై క్రాలె నిసుక వేయ ♦ రాల కుండ. 336
క॥ తనదేశమునుండియు సింహానికాయంబట్టి భటస ♦ హస్రంబును బా
వనమూర్తి కృష్ణసింహుఁడు కొని కుంభల్మియరుకోట ♦ కును విచ్చేసెన్. 337

—*) స్వాతంత్ర్య దినోత్సవము. (*—

మ॥ ప్రవిశేషోత్సవ సంపదల్ పొదలఁగా ♦ స్వాతంత్ర్యలక్ష్మీమహో
త్సవముల్ దీర్చెదమంచు శోభనముహూ ♦ ర్తం బెంచి దిగ్దేశవ
ర్తి విశేషజ్ఞుల నాత్మబంధులగు వా ♦ రిన్ బిల్వ నాహ్వానప
త్రవితానంబులు వ్రాసి పంపెను సలుం ♦ బ్రా కృష్ణసిం గయ్యెడన్. 338
గీ॥ ఐదువందలు పుట్లు ధా ♦ న్యముఁ దదితర వస్తువులు చేర్చి; రచటికి ♦ వచ్చు హితులు
రాజులును నిల్వఁగా గుడా♦రమ్ము లెత్తి రొక్కొకం డొక్క పురమునా♦ నొప్పుచుండ.

---

⊕ Where rain seldom or never falls the land is desert. The Thar Desert with a border of scrubland, lies between the Indus and the Luni Rivers.

"Herbert Pickles B. A. BSC."

గీ॥ గడియ గడియకు వేలు ల♦క్షలుగ వచ్చు బ్రాహ్మణుల సందడి హనుమ♦ద్వారమలరె
నూఱుతిరునాళ్ల లెసఁగిన♦దారిఁ; గోట వేలు మోపంగ సందు గ♦న్పింప దయ్యె.

సీ॥ శుభవాసరమ్మున ♦ శుభముహూర్తమ్మున నభ్యంజనస్నాన ♦ మాచరించి
పాలేశ్వరీదేవి—♦ ప్రభుమాళి, యమరసింహుఁడు నూత్నవస్త్రంబు ♦ లొనరఁ దాల్చి
సకల కల్యాణ భూ♦షణములు ధరియించి యవనీసురులు మంత్రు♦లాప్తతతులు
పార్థివు లనుసరిం♦పంగ ముత్తైదువుల్ పాటలు పాడుచుఁ ♦ బజ్జ నడువఁ,

గీ॥ గూడుకొని భవానీదేవి♦కోవెలకును వెళ్లి గౌరిని బూజించి ♦ వివిధరత్న
ఘటిత హాటక మకుటంబుఁ ♦ గాన్క యిచ్చి మ్రొక్కి యందఱు మందిరం♦బునకువచ్చి

సీ॥ వేదిపై దర్భలు ♦ వేసి యాపై రత్నభర్మాసనంబులు ♦ వఱలుచుండ,
రెంటిపైఁ బాలేశ్వ ♦ రీ-ప్రతాపు లెలర్చి; రాహరభట్టార ♦ కాత్మజులును
జంద్రభట్టారకు ♦ సత్పుత్రు లెదురుగా నున్న పీఠములఁ గూ ♦ ర్చుండి; రవల
వెలుఁగు నాసనములఁ ♦ గులపెద్దలును సూక్తుఁ డఖిలసామంతులు ♦ నవనిపతులు

గీ॥ గుంపు గుంపులుగాఁ జేరి ♦ కూరుచుండి; రవ్వల మహోన్నతమగు ది ♦ వ్యాసనమున
నుండె సముదార విక్రమో ♦ ద్దండమూర్తి భిల్లలోకైకనాథుఁ డా ♦ భీమచాందు. 342

గీ॥ అతుల సువిశాల వేదికా ♦ భ్యంతరమునఁ బ్రముఖమగు నొక్క దివ్యాస♦నమున నుండె
శాంతమూర్తి తేజోరాశి ♦ సత్త్వఘనుఁడు మాన్యతముఁడు భామాసాహి♦మంత్రిమాళి

గీ॥ అందు నిందన కాస్థాన ♦ మందు నెందుఁ దానయై కార్యభారంబుఁ ♦దలను దాల్చి
సలిలతోత్సాహమూర్తియై♦మెలఁగె స్వామి భక్తిపూర్ణాత్ముఁడు సలుం♦బ్రా విభుండు.

క॥ కలనాదమ్మున శంఖంబులు మంగళదివ్యతూర్య ♦ ములు దుందుభులున్
జెలరేఁగి మహానందము గొలిపెన్ బహువిప్రవేద ♦ ఘోషము చెలఁగన్. 344

గీ॥ బ్రాహ్మణులుగూడి రాజదం ♦ పతులచేత గణపతికిఁ బూజ చేయించి ♦ కరముభక్తి
నఖిల దేవతావాహనం ♦ బాచరించి స్వస్తిపుణ్యాహవాచనో ♦ త్సవము నెఱపి; 345

సీ॥ పాలేశ్వరిని బ్రతా ♦ పప్రభుమాళిని నవరత్నసింహాస ♦ నమున నిలిపి
వేదమంత్రాశీర్ని ♦ నాదముల్ వెలయంగ "విపులరాజ్యరమాభి ♦ వృద్ధి రస్తు;
శ్రీరస్తు వైభవ ♦ శ్రీర" స్తనుచుఁ జల్లి రమల ప్రసూన లా ♦ జాక్షతములు,
వందులు జయజయ ♦ ధ్వానముల్ చేసి ప్రతాపునికీర్తి నం ♦ దఱును బొగడి;

గీ॥ రచలనందనఁబోలెఁ బు ♦ ణ్యవతులైన బ్రాహ్మణస్త్రీలు పాటలు ♦ పాడుకొనుచు
రాజదంపతులకును హా ♦ రతుల నిడిరి బంగరు హొరంగు దీపాల ♦ పళ్లెరముల.

గీ॥ ఆప్రతాపు సింహాసన ♦ మవల నొక్క హేమమయమనోజ్ఞాసనం ♦ బెక్కఁజేసి
యమరసింహుని యావరా ♦ జ్యంబునకును బట్టభద్రుని జేసి సం ♦ బరముఁ గనిరి.

మ॥ విమలానర్ఘ మనోజ్ఞ భూషణములుల్ ♦ విశ్వైన సౌవర్ణ వ
స్త్రములుల్ హాటక రమ్య పాత్రలు సలుం ♦ బ్రాకృష్ణసింహాది సై
న్యమహానాథులు కానకలిచ్చుచుఁ బ్రతా ♦ పాధీశు దివ్యాంఘ్రియు
గ్మము సేవించిరి భక్తిపూర్వక సమ ♦ స్కారంబు లర్పించుచున్. 348

మ॥ తన దేశంబుననుండి సేవకుల చే ♦ తన్ గంపలన్ ముంచి యొ
య్యనఁ దెప్పించిన ముత్తియంబులు ప్రతా ♦ పాధీశ్వరుల్ దాసునం
దునఁ గూర్చుండఁగఁబెట్టి వాని సరియె ♦ త్తుల్ తూఁచి మేవాడభూ
జనులం దంతటఁ బంచిపెట్టె శబర ♦ క్ష్మానాథుఁ డత్యాదృతిన్. 349

మ॥ "మనస్వాతంత్ర్యము దేశభక్తియు నసా ♦ మాన్యంబునౌ త్యాగదీ
క్షను శోధించియు విశ్వమంతయును మె ♦ చ్చన్ గారణంబైన యా
వనలోకేశ్వరు నక్బరీశ్వరు మహా ♦ భాగ్య ప్రభావ ప్రభల్
దనరన్ బ్రోవు మటంచు నీశ్వరు పద ♦ ద్వంద్వంబు సేవించెదన్. 350

క॥ కలనైన నొరుల దెస పగ మొలువకయుండెడిని హృదయ ♦ మున నాకని క
న్నులు మోడ్చి క్షణము దేవుని దలఁచుచు మదిలోన భక్తి ♦ దళము కొనంగన్. 351

——*) ప్రతాపసింహుఁ డందఱనర్హావిధమున సత్కరించి కృతజ్ఞతను వెల్లడించుట. (*——

మ॥ "గురుఁ డెల్లప్పుడు నగ్రపూజ్యుఁడని వా ♦ క్రుచ్చున్ శ్రుతుల్ పెక్కు; లీ
చరణాబ్జంబులు నా కహర్నిశములుల్ ♦ సంసేవ్యముల్; వీని నే
మఱవన్ జేయకుమంచు నీశ్వరుని సం ♦ ప్రార్థింతు; మేవాడయే
మఱువన్ జాలదు నీమహోపకృతి భా ♦ మాసాహి మంత్రీశ్వరా! 352

మ॥ నను నారాజ్యము నాప్రజావళి నఖం ♦ డత్యాగముల్ బెంచి ప్రో
చిన దైవంబవు నీవు, సంతతము నీ ♦ శ్రీపాదసేవా వినూ
తనభాగ్యంబు స్థిరంబు చేయుము; నినున్ ♦ ధ్యానించి కీర్తించుచున్
మనువాఁడన్ గనువాఁడ ధన్యతను; భా ♦ మాసాహి మంత్రీశ్వరా!" 353

గీ॥ అని ప్రతాపధరాధీశుఁ ♦ డవనిదేవు చరణరాజీవములు మ్రొక్కి ♦ సరస నున్న
తక్కుగురులకు మ్రొక్కి వస్త్రములు కనకభూషణము లిచ్చి యదుగులు♦పూజ చేసె.

చ॥ "ఇరువదియైదువత్సరము ♦ లెన్నియొ బాధల కోర్చి నాపయిన్
దొరఁగు విపత్ప్రవాహముల ♦ నన్ గడఁబెట్టుచు దేశసేవలన్
గఱపుచు నుద్ధరించిన జ ♦ గన్నుతకీర్తివి! నిన్ను మిత్రుఁడున్
గురుఁడును నింక దైవమని ♦ కూడ భజించెద నాదుపాలికిన్. 355

సీ॥ గణుతింపరాని భో ♦ గములు గల్గి స్వతంత్రనృపుఁడవై కష్టంబు ♦ లెఱుఁగకుండ
నడుచు మహానుభా ♦ వుఁడవయ్యు ననుఁగూర్చి వలచి వలచి కష్ట ♦ ములకు నోర్చి
ధనము సైన్య మొసంగు ♦ చును స్వయంబుగ యుద్ధములు చేసి నాయిడు ♦ మలను నీదు
నిడుమలుగా నెంచి ♦ యింతకాలమునుండి వరమైత్రి నాయెడఁ ♦ బరపినావు;
గీ॥ గిరితటములందు భటులను ♦ నెఱపి వేయికనుల నాయాలుబిడ్డలఁ ♦ గాచినావు;
నీఋణముఁ దీర్పఁగాఁజాల; ♦ నీదు కృపకుఁ బారమే లేదుభిల్లస ♦ ర్వజ్ఞమూర్తి!" 356

క॥ అని శబరలోకనాథునకును వందన మాచరించు ♦ కొని కౌఁగిటియం
దున నిలిపి సలుంబ్రా కృష్ణుని జేరఁగఁబోయి పేర్మి ♦ శోభిలుచుండన్, 357

మ॥ "నను పీడన్ జన కెప్పుడున్ మెలఁగుచున్ ♦ నాసీడయున్ బోలెఁ; గం
టిని ఱెప్పన్ వలెఁ గాచి ధర్మవితతిన్ ♦ నేర్పించి సంపూర్ణభ
క్తిని నాతోడిద లోకమంచు ననుర ♦ క్తిన్ గొల్చు నీ యీ ఋణం
బును నేఁ దీర్పఁగఁ జాలఁ బెక్కు భవముల్ ♦ పుత్రుండవై పుట్టినన్. 358

మ॥ కడుదూరంబునఁ దోఁచు నాపదఁ దొలం ♦ గన్ జేయఁగా ముందుకున్
బడి యత్నించుచు, సుంత సౌఖ్యమయినన్ ♦ స్వారాజ్యమే యబ్బి న
ట్లెడఁదన్ బొంగుచు, నాయభీప్సితమె నీ ♦ యిష్టంబటంచుం; దమా
త్యుఁడవం చెప్పుడు చూడ; దేవుఁడవటం ♦ చూహింతు నాపాలికిన్. 359

మ॥ ఇఁక రా నుండెడు కాలమందున జనం ♦ బేదేశమందైన నూ
ఱక ప్రస్తావము పేర్మి నొక్కెడ సలుం ♦ బ్రాకృష్ణసింహుం డనన్
మొకముల్ విప్పఁగ స్వామిభక్తి యొకచోఁ ♦ బుంరూపమున్ జెంది వా
రికి సాక్షాత్కృతియై తనర్చెడిని; తం ♦ డ్రీ! యెంత పుణ్యుండవో!" 360

మ॥ అని పాదంబుల మ్రోల వాలుచు నమా ♦ త్యాధీశ్వరున్ బూజచే
సిన నాతండు సమోదబాష్పనయన ♦ శ్రీ మీఱ సాష్టాంగ వం
దనముల్ చేయుచు భక్తితో నిలిచె; నా ♦ ధాత్రీశ్వరుం డంతఁ జెం
తనె సూక్తాది సహోదరప్రతతి సే ♦ నాభర్తలన్ జూచుచున్; 361

మ॥ “తిన నాహారము చిక్కకుండినను భ ♦ క్తిన్ బెంచుచున్ దండ్రికీ
తి ననున్ గొల్చుచుఁ ద్యాగమున్ నెఱపుచున్ ♦ దేశమ్ము సేవించి శో
భన సత్కీర్తి పరంపరల్ నలుదెసల్ ♦ ప్రాకంగ వర్తించినా”
రనుచున్ వారిని వారి వారిఁ గడు నా ♦ హ్లాదంబునన్ జేరుచున్, 362

క॥ విలువగల వస్తువుల భూషల నొసఁగుచు నర్హరీతి ♦ సమ్మానములన్
సలుపఁగ భామాసాహియు నిలుపుచు సింహాసనమున ♦ నృపలోకగురున్, 363

—*) భామాసాహి ప్రతాపసింహు నాశీర్వదించుట (*—

సీ॥ “బహుళవిద్యుద్దీప ♦ పటలప్రభాభాసియగు రాజమార్గంబు ♦ ననుకరించు
నీజీవితంబును ♦ నిరతంబు హైందవు లనుపమంబగు భక్తి ♦ ననుసరింతు;
రనఘ! నిన్బోలు మ ♦ హానుభావుల లోకపావన జీవిత ♦ పటల మెపుడు
దేశచరిత్రమై ♦ తేజరిల్లుచునుండు; ధారుణీజనుల కా ♦ దర్శ మదియ;
గీ॥ నీచరిత దేశదేశముల్ ♦ నిండియుండు; నీయఖండశోభననామ ♦ ధేయము విను
వార లాపదలకు జంకు ♦ పడక ధైర్యపర్వతములౌచు శాశ్వత ♦ ప్రభ వహింత్రు.

మ॥ నిను దర్శించుచు నీదరిన్ మెలఁగుచున్ ♦ నీతోడ భాషించుచున్
నిను సేవించుచు నిన్ మదిన్ దలఁచుచున్ ♦ నీపూజలన్ జేయుచున్
మనఁగాఁగల్గుట మేటిభాగ్యమనుచున్ ♦ మాబోంట్ల మెల్లప్పుడున్
నిను దేవున్బలెఁ జూచుచున్ గొలుతుమో ♦ నిర్ణిద్రతేజోనిధీ! 365

సీ॥ కోటికష్టములైన ♦ గోట మీటఁగఁజాలు వీక్షలఁ బరమగాం ♦ భీర్య మలర,
నవశరచ్చంద్రసౌం ♦ దర్యమందిరమైన ముఖము శాంతసముద్ర ♦ భూతి నెఱప,
వ్యాకోచమల్లికా ♦ ప్రసవరాజంబట్లు చిరునవ్వు పెదవిపై ♦ సిరుల నింప,
నందమై పుష్టమై ♦ యాజానుదీర్ఘ బాహార్గళయుగళంబు ♦ హాసుఁ బెంప,
గీ॥ వార్ధిసంవృతమేదినీ ♦ వలయ మెల్ల వశము చేయంగఁజాలు ప్రా ♦ భవము దనర,
వెలయు నీవిశ్వమోహన ♦ వీరమూర్తి విడక మామనములఁ దాండ ♦ వించుఁగాత. 366

మ॥ అమితోత్సాహము దేశభక్తిరతి నీ ♦ దై యుండు; నీమేని ర
క్తమునందున్ గల బిందు వొక్కొకఁడు “స్వా ♦ తంత్ర్యంబు స్వాతంత్ర్య”మం
చు మహాదీక్షను బల్కు; నీకు సము లీ ♦ క్షోణీస్థలిన్ లేరు; భ
క్తిమహత్త్వంబునఁ గొల్తు నిన్నుఁ గరుణా ♦ దేవీ కుమారోత్తమా! 367

సీ॥ రవివంశకలశసిం ♦ ధువు రాజరత్నాళిఁ దరతరంబుగ వెలు ♦ వడిచుఁగాత,
మేవాడఖనిఁ బుట్టు ♦ వౌ వజ్రమెల్ల స్వతంత్రతాశాణదీ ♦ ప్తమగుఁగాత;
రాజపుత్రాన్వయా ♦ రణిజ తేజము ధర్మదీక్ష నాహవవేదిఁ ♦ దెరలుఁగాత;
పాశేశ్వరినిబోలు ♦ పతిదేవతలకు హైందవభూమి పుట్టిని ♦ ల్లవునుగాత;
గీ॥ భూజనులు విప్లవమ్ముల ♦ బ్రుంగునప్పు డడరు లడఁచి కొ్రిందలిరుల ♦ నలవరింప
నిన్నుఁబోలు మాధవుఁడు జ ♦ న్మించుఁగాత; దస్యుగజరాజసింహ! ప్ర ♦ తాపసింహ!''
గీ॥ అనుచు నానందబాష్పంబు ♦ లతిశయిల్లఁ జారు నవరత్న సామృత ♦ నారికేళ
ఫలము దోసిటఁ గొనిపోయి ♦ ప్రభున కిచ్చి చేతు లెత్తుచు నిట్టు లా ♦ శీర్వదించె. 369

శ్లో॥ "స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతాం
న్యాయ్యేన మార్గేణ మహీం మహీశాః
గోబ్రాహ్మణేభ్య శ్శుభమస్తు నిత్యం
లోకాస్సమస్తా స్సుఖినో భవంతు
కాలే వర్షతు పర్జన్యః పృథివీ సస్యశాలినీ
దేశోఽయం క్షోభరహితో బ్రాహ్మణా స్సంతు నిర్భయాః
అపుత్రాః పుత్రిణ స్సంతు పుత్రిణ స్సంతు పౌత్రిణః
అధనా స్సధనా స్సంతు జీవంతు శరదాం శతం." 370

## ఉపసంహారము.

శా॥ నే నెల్లప్పుడు భావనాబలమునన్ ♦ నీరూప నామ క్రియా
ధ్యానంబున్ గొని తన్మయత్వమున న ♦ న్యాకాంక్ష లేకుంటి; నీ
వే నేనైతినొ! నేనె నీవయితొ! రూ ♦ పింపంగ నాకేల! ని
త్యానందంబు ఘటించె నీకృతి ప్రతా ♦ పా! విశ్వలోకార్చితా! 371
మ॥ పదియేం డ్లయ్యెను నిన్నుఁగూర్చి పఠియిం ♦ పన్ సాఁగి; యిన్నేండ్లు నా
మదిలోనన్ భవదీయ విక్రమకళా ♦ మాధుర్య సౌభాగ్యముల్
కుదురై నెక్కొని వేరు పాదుకొనియెన్; ♦ గొండతలా కోరికల్
పొదలెన్ నిన్ను నుతింప; నీదు చరితం ♦ బున్ వ్రాసి హర్షించితిన్. 372
మ॥ చదలే రట్టులు ముజ్జగంబుల భవ ♦ త్స్వచ్ఛంద కీర్తిచ్ఛటల్
వెదచిందన్ గనుఁగొంటి; భారతమహో ♦ ర్విన్ పీడి మున్నాటను.

ప్పదియాఱేఁడులు దాఁటె; నీచరితమున్ ♦ వర్ణించు భాగ్యంబు నా
కొదవెన్ నేఁటికి; నన్నుఁ బోలు కృతకృ ♦ త్యుల్ లేరు లోకంబునన్, 373

మ॥ దినరాజున్ బలె నుగ్రకోపనుఁడవై ♦ తిండ్రించి శైలంబుని
డిన తౌరుష్కులఁ దాఁకి నీ నడపు హా ♦ ర్దీఘాటు యుద్ధాంగణం
బున విశ్వోన్నతమైన నీదు విభవం ♦ బున్ గొంత నేఁ బంచుకోఁ
గనకున్నన్ నినుఁగూర్చి యింత యనురా ♦ గం బిట్టు లుప్పొంగునే! 374

చ॥ ఇలఁ గల వీరపుంగవుల ♦ నిట్టి బలోన్నతుఁ డిట్టి ధీరుఁడున్
గలుగఁడటంచుఁ బేర్గనిన ♦ గండఁడ వీ విఁక; నిల్లు వీడి వీ
థులఁ జరియింపలేని కడు ♦ దుర్బలదేహుఁడ; నన్ను నెట్టులన్
వలచితొ! నీ చరిత్రమును ♦ వర్ణన చేసి జగానఁ జాటఁగన్. 375

గీ॥ భువనశౌర్యాంకమైన నీ ♦ మూర్తిఁగాంచి, యనుపమంబైన నీకథ ♦ లాలకించి,
రసమునను దేలి పొగడని♦రసికు లుండ; రెట్టి నాయకోత్తముఁడ వో♦యూ! ప్రతాప!

గీ॥ భవ దుదార శౌర్యమును భా♦వన మొనర్చి రసమునను జొక్కి గ్రంథంబు♦వ్రాయునపుడు
త్వ ద్వశుండనై యానంద ♦ బాష్పవితతు లాణిముత్యాలవలె రాల్తు♦నహరహంబు.

గీ॥ నా మహోదాత్త నాయక ♦ స్వామి వీవు; భవ దనఘ కీర్తిఁ గొనియాడు ♦ కవిని నేను
త్వత్కథామృత రుచిర కా♦వ్యమ్ముతోడ హృదయకుసుమంబు నీకు న♦ర్పించుకొందు.

క॥ ఉత్తమ ధీరోదాత్త నృపోత్తరుఁడవు; నిన్నుఁ బొగడ ♦ యోగ్యంబని రే
కెత్తు తమి హృదయరస మే నెత్తితి దుత్తలకొలంది ♦ నీచరితమునన్. 379

క॥ వర లోకోత్తర సుగుణోత్తర నాయకచక్రవర్తి! ♦ త్వత్కీర్తికళల్
స్థిరమొందెడుఁగాక నుదాహరణములై చంద్ర తార ♦ కార్క స్థాయిన్. 380

మ॥ కరమున్ భక్తిని నా రచించిన మహా ♦ గ్రంథంబు నందెందు నీ
చరితం బాంధ్రులు నిత్యమున్ జదివి నీ ♦ స్వాతంత్ర్యమున్ ద్యాగవి
స్ఫురణంబున్ సముదారవిక్రమకళా ♦ పూర్ణత్వమున్ నేర్వఁగ
ల్గిరయేనిన్ ననుఁబోలు ధన్యు లిలలో ♦ లేరంచు హర్షించెదన్. 381

ఉ॥ పూలును సౌరభంబు మధు ♦వున్ జెడు వృక్షము పోయినంత; శం
పాలత దాని శోభలను ♦ బాయు నిమేషములోన; నీజగ
జ్జాలము లర్చచేయు పటు ♦ శౌర్య పరాక్రమ రాశివైన నిన్
బోలిన ధీరు కీర్తి పొలి ♦ వోవదు లోకము కుంగి పోయినన్. 382

సీ॥ సంవత్సరములు నీ ♦ చరితంబు పఠియించి పరవశత్వమున మై ♦ మఱచుచుంటి;
పదపదంబునను నా ♦ హృదయరసము నించి గ్రంథంబు రసమూర ♦ వ్రాసియుంటి;
వందలకొలఁది ద్ర ♦ వ్యము వెచ్చపెట్టి భక్తిని గావ్యమెల్ల ము ♦ ద్రించియుంటి;
వీరలక్ష్మీప్రభు ♦ త్వాగాధి మెఱయు నీ చిత్రంబు లందందుఁ ♦ జేర్చి యుంటిఁ;
గీ॥ బ్రతిఫలము గోరఁబోక నీ ♦ గ్రంథములను దేశమంతట నింపంగఁ ♦ దివురుచుంటి;
యత్నలోపము లేక నీ ♦ యశముఁ బెంపఁ దగిన శ్రమమెల్లఁ బడితిఁ బ్ర♦తాపదేవ!
సీ॥ ఆప్రతాపమహీంద్రు ♦ నటు రాజులు స్వధర్మనిరతులై దేశ మా ♦ నెదరుగాక;
శ్రీసలుంబ్రాకృష్ణ ♦ సింహుఁ బోల్ స్వామిభక్తిపరులు యశము నొం♦దెదరుగాక;
పాళేశ్వరినిబోలి ♦ భారతాంగనలు సాధ్వులటన్న పేరు చెం ♦ దుదురుగాక;
యమరసింహునిమాడ్కి ♦ నాంధ్రయువకులెల్ల గురువిక్రమమున వె ♦ ల్గుదురుగాక;
గీ॥ కమలవనమట్టి భారత ♦ ఖండమెల్ల వీరరసఖండమై ధాత్రి ♦ వెలయుఁగాక;
'యాంధ్ర'లనుపేరు ఖండఖం♦డాంతరములఁదజ్ఞు లందఱు శిరములఁ♦దాల్త్రుగాక. 384

గద్య:— ఇది శ్రీమత్కామేశ్వరీ కరుణా కటాక్ష వీక్షా సమాసాదిత రసవత్కావ్య
నిర్మాణ చాతురీధురీణ, సుగుణగణపారీణ, దుర్భాకవంశదుగ్ధాంభోరాశి
రాకా కైరవమిత్ర, శాలంకాయన గోత్ర పవిత్ర, సుజనాను
గ్రహపాత్ర, వెంకటరామార్యపుత్ర, కవిసింహాఽవధాని
పంచానన కావ్యకళానిధీత్యాది బిరుద విఖ్యాత, సుకవి
రాజశేఖర, రాజశేఖరకవి ప్రణీతంబయిన
"రాణా ప్రతాపసింహ చరిత్రం" బ
ను పద్యకావ్యమునం
దుఁ బంచమా
శ్వాస
ము




Printed at the Janaki Printing Works, Proddutur. 1935.

శ్రీ

# 'రాణాప్రతాపసింహచరిత్ర'

## రాజశేఖరకవిప్రణీతము.

కవిత్వము - తన్మయత్వము

శ్రీమద్భారతనాటక - దేవీభాగవత - బుద్ధచరిత్ర - శ్రవణానందాది బహునాటక - ప్రబంధకర్తలును, శతశతావధాన కవితా సామ్రాజ్యచక్రవర్తులును, కింకవీంద్రఘటాపంచానన - బాలసరస్వతీ - బాలకళానిధి - విమర్శకాగ్రేసర - కళాప్రపూర్ణ - పండితకవి శిరోభూష-ణేత్యాది బహుళ బిరుదాంచితులును, నగు

## శ్రీ. శ్రీ. చెళ్లపిళ్ల - వెంకటశాస్త్రిగారి

## విపుల సమీక్ష



అయిదారేళ్లనుంచి యేదో కాలక్షేపానికి కొన్ని వ్యాసాలు నేను వ్రాయడం పాఠక లోకం అంతా యెఱిగిందే. ప్రస్తుతగ్రంథాన్ని ఆంగ్లభాషానిష్ణాతులు శ్రీ కట్టమంచి-రామలింగారెడ్డిగారు మిక్కిలి మెచ్చుకొన్నారంటే నాబోట్ల లెక్కేమిటి? యీరాణా చరిత్రను రచించిన కవి ప్రాచీనుడు కాడు. సుమారు యే__ యేళ్లవాడుగా వుండ వచ్చునని వూహిస్తాను. యిప్పటికి యిరవైయేళ్లక్రిందట మాగ్రామం వచ్చి నన్ను కలుసుకొని అప్పుడు రచించిన గ్రంథం "వీరమతి" కి వుపోద్ఘాతం వ్రాయవలసిందంటే వ్రాసియిచ్చాను. యీరాణాచరిత్రరచన దాని పిమ్మటిది. అంతకంటె యిది చాలా ప్రౌఢంగా వుంది. ఈయన కేవలకవిమాత్రుడే కాడు. అవధాని.

ఉ॥ స్థైర్యములేని చిత్తమవ ! ధాన మెఱుంగని సత్కవిత్వముఁ (చూ)

ఆయాసందర్భం యీయనచేసిన అవధానాలు చూచిన విద్వత్కవులు సంతోష పూర్వకంగా యిచ్చిన "అవధాని పంచానన" బిరుదంవల్ల స్పష్టపడుతూ వుంది. యీయన పేరు రాజశేఖరుడు. యీపేరు పరమేశ్వరునిదే కాని, ప్రస్తుతగ్రంథరచనాసందర్భం లోవున్న కొన్నిఘట్టాలను బట్టి చూస్తే ప్రతాపసింహునికి పర్యాయమేమో ?

ప్రతిసహృదయునికీ గోచరిస్తుందని నానిశ్చయం. ఆయీ అంశం తుట్టతుదిని యీకవి వాచ్యంగానే వుటంకించి వున్నాడు. చూపుతూ వున్నాను.

శా॥ నే నెల్లప్పుడు భావనాబలముననే ♦ నీ రూప - నామ - క్రియా
ధ్యానంబున్ గొని తన్మయత్వమున న ♦ న్నాకాంక్ష లేకుంటె! నీ
వే నేనైతివొ! నేనె నీవయితివో! రూ ♦ పింపంగ నాకేల? ని
త్యానందంబు ఘటించె నీకృతి ప్రతా ♦ పా! విశ్వలోకార్చితా!
(5-ఆ-ఉపసంహారము)

ఈతన్మయత్వాన్ని వాకుృచ్చేవి పదిపద్యాలదాకా వున్నాయి. యింకోటి మాత్రం వుదాహరించి విషయాంతరం వుపక్రమిస్తాను.

మ॥ దినరాజున్ బలె నుగ్రకోపనుఁడవై ♦ తీండ్రించి శైలంబు నిం
డిన తౌరుష్కులఁ దాకి నీనడుపు హా ♦ ల్దీఘాటుయుద్ధాంగణం
బున విశ్వోన్నతమైన నీదు విభవం ♦ బున్ గొంత నేఁబంచుకోఁ
గనకున్నన్ నినుగూర్చి యింతయనురా ♦ గం బిట్టు లుప్పొంగునే!

తక్కిన పద్యాల చదువరులే చూచుకుంటారని స్పృశించి విడిచాను. తన్మయత్వంతో మిళితమైన కవిత్వానికిన్నీ తదితరకవిత్వానికిన్నీ బోలెడు తారతమ్యం వుంటుంది. కవులలో తన్మయత్వం కలవారు కొందఱే వుంటారు. అధునికులలో యీరాజశేఖరకవి తన్మయత్వంకల కవి అని రచన వ్యాఖ్యానిస్తూ వుంది. వుదాహరించవలసివస్తే గ్రంథంలో నూటికి 50 పద్యాలేనా వుదాహరించవలసి వస్తుంది. కనుక కొంచెం మాత్రమే వుదాహరిస్తాను.

మ॥ రవి యస్తాద్రిని మొల్చుగా! కఖలపా ♦ రావారముల్ ఇంగుఁగా!
కవసీచక్రము వీలుఁగాక! చెడుగా ♦ కాకాశ! మయ్యుగ్రభై
రవుఁడై లోకముఁ గాల్చుఁగాని లవమున్ ♦ రాణాప్రతాపుండు గౌ
రవమున్ గోల్పడి మర్త్యమాత్రునకు శి ♦ క్షం బాగ్గ డెప్పట్టునన్!

యీమాటలు ప్రతాపునిమంత్రిన్నీ కులవృద్ధున్నూ పరమపూజ్యుడున్నూ అయిన "సలుంబ్రా - కృష్ణసింహుడు" అక్బర్ చక్రవర్తికి సర్వసేనాధిపతిన్నీ బావమఱదిన్నీ అయిన మానసింహరాజన్యునకిచ్చే జవాబు లోనివి. మానసింహునితండ్రి భగవాన్దాసు తాత్కాలికసుఖంకోసం తనకూతుర్ని (ధిగ్ధిగ్గిక్) అక్బరుచక్రవర్తికిచ్చి పెండ్లి చేసి - కులగౌరవాన్ని కాపాడుకొంటూ వనవాసం అనుభవిస్తూవున్న ప్రతాపసింహుణ్ణి కూడా తమతోపాటు చక్రవర్తికి లోబడవలసిందని రాయబారాన్ని తెచ్చిన సందర్భం లోనివి. ప్రతాపుని అభిప్రాయాన్ని వ్యాఖ్యానించే చిన్నపద్యంకూడా వొకటి వుటంకిస్తాను.

తే॥ యవనులపదంబుఁ గొలిచి, వి ॥ య్యంబు వలచి,
కుశమహారాజు కులకీర్తి ॥ గుంటఁ గలిపి,
చెఱుపవచ్చితె మమ్ముఁ! దాఁ ॥ జెడ్డకోతి
వనము నంతయుఁ జెరిచెనన్ ॥ భంగిదోఁప!

యీఘట్టంలోదే యింకో పద్యంకూడా చూపుతాను.

కం॥ ఉరగమును - వృశ్చికమ్మును గరళక్రూరములు! పాము ॥ కన్నను మేలం
దురు తేలు! నిన్నుఁగన నక్బరె మేలనవచ్చు స్వకుల ॥ వర్ధనుఁడౌటన్!

యీరెండు చిన్నపద్యాలిస్తే యేం తేలుతుంది! ఆయాపద్యాలున్న ద్వితీయాశ్వాసం 330 పద్యాలున్నూ వుదాహరిస్తే బాగా తృప్తి కలుగుతుంది. ప్రితాపరుద్రుడికి - ప్రతాపసింహుడు దీటుమాత్రమే కాదు - హెచ్చు. కవి - ఆకవికి - లొచ్చైనను, తన్మయత్వంలో - హెచ్చు. లోగడమాటలు ప్రితాపరాణావారి మంత్రివి. యీ మంత్రిని సర్వవిధాలా భీష్ముడే అనిచెప్పడంలో అతిశయోక్తి కనపడదు. ఆయీగ్రంథంలోవున్న పాత్రలన్నీ యేకళంకములేనివిగా కవి చిత్రించి వున్నాడు. రాణాప్రతాపుణ్ణిన్నీ రాముణ్ణిన్నీ త్రాసులోపెట్టి తూస్తే ప్రతాపుడే అసిధారావ్రతంలో చాలా మొగ్గుతాడు. కుశలవులు రాముణ్ణి యెత్తిపొడిచారు. ప్రతాపుణ్ణే అయితే యెత్తిపొడవలేరనే తోస్తుంది. తగిన పదార్థానికి తగిన పాచకుడు లభిస్తే రుచి కలిగినట్లు యీ రాజశేఖరకవివల్ల ప్రతాపుడి ప్రితాపం శోభించింది. యెక్కడ యెంతవఱకు వ్రాయడం అవసరమో అక్కడ అంతవఱకే వ్రాసి చదువరులకు విసుగులేని పద్ధతిని గ్రింథరచన సాగించడము సుఖసుఖాల పట్టుపడేది కాదు. ఆపద్ధతి యీరాజశేఖరకవికి లభించింది. యీగ్రింథంలో వచనాలు లేవు. అన్నీ ఛందోమయాలే. సుప్రిసిద్ధమైన పద్యాలే. సుమారు యేడెనిమిది రకాలు వాడబడాయి. వుదాహరించవలసివస్తే చాలాస్థలం ఆక్రమిస్తుంది సీసపద్యం.

సీ॥ అప్రితిహతముగా ॥ నక్బరొక్కఁడె యేల
క్షితిని దేవుఁడు సృష్టి ॥ సేయలేదు!
వితతప్రిజాకోటి ॥ యతనిచేఁ దునుమాడఁ
బడుటకై సృష్టింపఁ ॥ బడఁగలేదు!
సకలభూపాలక ॥ న్యక లాఘునుని భోగ
పరత కుద్దేశింపఁ ॥ బడఁగలేదు!
ధరణీశులెల్ల నా ॥ తనిఁజేరి కొలిచి పా
దము లొత్తఁ బుట్టువాం ॥ దంగలేదు!
తే॥ తన యొకని రాజ్యతృష్ణకై ॥ ధరణిఁగలుగు
ప్రిజయు స్వాతంత్ర్యమును బాసి ॥ పారతంత్ర్య

మున మునుఁగుబెల్లఁ బాడిగా । దనుచు నక్బ
రెంత యెఱిఁగిన జగమున । కంత మేలు!

ఆయాపద్యంలో వున్న మాటలు యెంతగంభీరంగా వున్నాయో సహృదయులు పరిశీలించాలి. యివి రాణాప్రతాపుడు అక్బరుచక్రవర్తిని కొల్వడాన్ని నిరాకరిస్తూ మానసింగుతో మాట్లాడే సందర్భంలోవి. రాజశేఖరకవిగారి రచనలో, యెంతసేపు పరిశీలించినా పొల్లుమాటలు కనబడవు. కవిత్వం, మూడువంతులలో వొకవంతు మాత్రమే దరహంమీద, తెలుగుపదాలు కలదిగా వుంటుంది. తక్కిన రెండువంతులూ తత్సమపదాలుగా వుంటాయి. కాని, ప్రసాదగుణభూయిష్టంగావుండే ధార కావడంచేత కదళీపాకంగా అందఱికీ అందుబాటులో వుంటుంది.

మ॥ ఉదయాస్తాచలమధ్యగంబగు జగం । బుబ్బూఁత లూఁగించె బె
ట్టిదుఁడై పుత్రుఁడు! ఘోరసంగరకిరీ । టిప్రాయుఁడై కీర్తిసం
పద నార్జించెను దండ్రి! యెట్లితఁడు మే । వాడ్రాజ్యమందారశా
ఖఁ దినన్ జొచ్చిన పుప్పియట్లువొడమెన్ । గీర్తిన్ గళంకించుచున్!

యీలాటి ధారాళమైనధారతో చదువరులకు చదివినకొద్దీ చదవాలనే కోరిక్కని కలిగించే శైలిలో వున్నప్పటికీ ఆయీ కథ భారత–రామాయణాలమాదిరిగా సర్వేసర్వత్ర తెలిసింది కాకపోబట్టి వాట్లమాదిరిని యీ కవిత్వం వ్యాప్తికి రాకపోయింది గాని, అలాగే కాకపోతే, యీరాణాప్రతాపచరిత్ర రామాయణంలాగ వ్యాపించతగ్గది. ఈ ప్రతాపుడు రాముడికంటె ఏ సుగుణంలోనూ తీసిపోడు. ఈ రాజశేఖరకవి కవిత్వం రామాయణగాథ తెలుగులో రచించిన కవుల కవిత్వానికిన్నీ తీసిపోదు.

మ॥ అమరోద్యానమువోలె నెల్లెడ సమ । గ్రానందముల్ బెంచి లో
కముఁ గల్యాణపుమండపంబటు వెలుం । గన్ జేయు స్వాతంత్ర్యధ
ర్మమహాదేవత మున్గఁ గిల్బిషసము । ద్రింబందునన్! రక్తహ
స్తములన్ లేపిన లేచు! లేవ దణువూ । త్రిన్ రిక్తహస్తంబులన్!

నాలుగోచరణంలోవున్న "రక్తహస్త - రిక్తహస్త" శబ్దకూడిక మిక్కిలీ హృదయంగమం. యుద్ధభాగంలో ఈకవి కవిత్వం తిక్కనసోమయాజిని జ్ఞప్తికి తెస్తూవుంటుంది.

ఉ॥ అత్తఱి విక్రమించి భయ । దాహవశౌర్యుఁడు శ్యామసింహభూ
భృత్తిలకుండు శీర్షకము । భేదిల మోదుచు ఖానుఖడ్గము
ద్వృత్తి ఏయత్తలంబునకు । ద్రెవ్వఁగఁగొట్టి హయంబుఁగూల్ప నో
రెత్తక వాఁడు మానము వ । హించుచుఁ బాఱెను నేల దూఁకుచున్!

యీలాటిపద్యాలు వరుసవెంబడిని వుదాహరించవలసిన వున్నాయి. కవి అధునాతనుడే అయినా కవిత్వం అధునాతనంగా వుండదు.

ఆయీ పుస్తకం వీరరసప్రధానం. రాజపుత్రులకూ మహమ్మదీయులకూ సంబంధించిన యుద్ధపద్ధతిని తెల్పేది. కవి మన ఆంధ్రుడు. రాయలసీమవాడు. ఇంటిపేరు దుర్భాకవారు. దుబ్బాక వెంకటాచలశాస్త్రుల్లుగారిని మేము అడియారు అనే బిసంటు సభకు వెళ్లినప్పుడు యిప్పటికి యేభైయేళ్లక్రిందట సందర్శించివున్నాం. బహుశః ఆ దుబ్బాకవారున్నూ యీ దుర్భాకవారున్నూ వొకరే యేమో! భవతు. మొత్తం కవి మహమ్మదీయులకు అనుకూలించేవాడు మాత్రం కాదు. అయితే మాత్రం, రెండూ రెండుకళ్లుగానే చూచుకొని రచన సాగించాడుగాని, పక్షపాతంగా కలం నడపలేదు. అక్బరు గుణాతిశయాన్ని శత్రువులచేత గూడా చక్కగా అనువదింపజేశాడు. సందేహం లేదు. కాని, యుద్ధవర్ణనలోమాత్రం రాజపుత్రులయందు నలుసంత పక్షపాతంగా కలం (ఆవశంగానే - అనుకుందాం) నడిచిందేమో! అని నాకు అనుమానం.... బాహుబలాఢ్యులున్నూ పౌరుషప్రధానులున్నూ అయిన రాజపుత్రవీరులు లక్షలకొలది మహమ్మదీయులతో వేలకొలదిగా మాత్రమేవున్న తాము సుమారు 25 యేండ్లు నిలిచి పోరాడి నిర్వహించ గలిగారన్నది పరమార్థం. రాజపుత్రులది తమదేశంలో మట్టుకు తమ స్వాతంత్ర్యం నిల్పుకొనే ప్రయత్నమేకాని అక్బరుచక్రవర్తి ప్రభుత్వాన్ని యీ దేశాన్నుంచి ఆసీమాంతం చెపుదామనే ప్రయత్నంకాదు. చక్రవర్తికో? తన గొడుగుతప్ప యింకోగొడు గెక్కడా వుండనేకూడదనే గౌరవాకాంక్ష. అవును. అతడు సార్వభౌముడు కదా? పాపం ఆబిరుదం అర్థవంతం కావాలంటే యింకోశూరుడు తనకు మొక్కని వాడు వుండడం వల్ల కాదు. యీదోషం మహానుభావుడైన అక్బరుది కాదు. అది అతడు ధరించిన సార్వభౌమ బిరుదాని దనుకోవాలి. ఆయీ బిరుదే చాలా ఘోరాలు చేయించింది అక్బరుచేత. గ్రంథకర్త ప్రతాపు ణ్ణెంత చక్కగా కాపాడి దిద్ది తీర్చాడో అక్బరుచక్రవర్తినికూడా అంత శ్రద్ధాభక్తులతో దిద్ది తీర్చి ధీరోదాత్త నాయకాగ్రేసరుణ్ణిగా ప్రకటించాడు. వాల్మీక్యాదులు రావణాదులను యింత చక్కగా చిత్రించనే లేదన్నా తప్పు లేదనుకుంటాను.

ప్రతాపుని గుణగణానికి లొంగిపోయిన అబ్దూరహిమాను మొదలైన పాదుషామంత్రుల న్యాయైకదృష్టిని యీకవి బహుచక్కగా ప్రకటించాడు.

తే॥ మనుజపతిమౌళి మన్మథ । మన్మథుండు
చైతకాశ్వము పైన సా । క్షాత్కరించి
దివ్యదర్శన మిచ్చె! నా । తేజమునకు
నంజలి ఘటించి యాత్మోప । హార మిడుదు.

అబ్దూరహిమాను అనే పెద్దమంత్రి అక్బరుచక్రవర్తితో మహాసభలో మాట్లాడే మాటలను వివరించే పద్యాలు సుమారు 25 టి దాకా వున్నాయి. ఆపద్యాలలో

యిది వొకటి. పద్యంలో వున్న చైతకం రాణాప్రతాపసింహునికి ప్రాణతుల్యమైన వాహనం. అబ్దుర్రహీమాను యెంతటి సహృదయుడూ కాకపోతే తన్ను యుద్ధంలో యెదుర్కోవడానికై సర్వసన్నాహంతో వచ్చిన (శత్రువు) ప్రతాపుణ్ణి అంతపేర్మితో తనప్రభువు సమక్షంలో నిర్దేశించగలడా? యింకో పద్యంకూడా వుదాహరిస్తాను.

మ॥ అకటా! నీవలె ధర్మముల్ దెలిసి రా । జ్యంబేలఁ గాలేఁడో! మ
చ్చికమై భూప్రజఁ బుత్రులంబలెఁ గృపా । శ్రీఁ జూడఁగాలేఁడో! పా
యక వర్ణాశ్రమ ధర్మపద్ధతి తిరం । బై నిల్పఁ గాలేఁడో! యెం
దుకు నాతండు స్వతంత్రుఁడై నిలువఁ గా । దో యానతీఁ గోరెదన్!

యింత నిర్భయంగా నిష్పక్షపాతంగా-చక్రవర్తితో-(చాటునా మాటునా కాదు) మహాసభలో-శత్రుగుణాలను వ్యాఖ్యానించే రాజకీయోద్యోగులు వుంటే వుంటారేమోకాని, విని సహించడమే కాకుండా అభినందించడం కూడా వున్న సార్వభౌముడు వొక్క అక్బరే కాని యింకొకడు లేడనే చెప్పొచ్చు. రాణాప్రతాపసింహచరిత్ర అనే పేరుతో కవి దీన్ని రచించినా అక్బరుచరిత్ర అనే నామాంతరంతో దీన్ని పిలిస్తే పిలవవచ్చుననే నేననుకుంటాను. నిజానికి అక్బరు అట్టి మహానుభావుడో? కాడో? కాని, గ్రంథకర్త రచన అతణ్ణి నిషధయోగ్య-చక్రవర్తి-శిరోభూషణంగా చిత్రించింది! బిల్హణు డేమన్నాడు? రావణాసురుణ్ణి దుర్మార్గుణ్ణి చేసినవాళ్లూ కవులే. రాముణ్ణి మహామహుణ్ణి చేసినవాళ్లూ కవులే అన్నాడు. (విక్రమాంకచరిత్ర చూ) దాదాపు రెండువేల పద్యాలు యీకవి యీచరిత్రలో లిఖించాడు. చేదస్తంగా పెంచిన ఘట్టం వకటి లేదు. ఋతువర్ణనకుగాని సూర్యోదయ-సూర్యాస్తమయాలకుగాని వొక్కొక్క పద్యంకంటె ఖర్చుపెట్టినట్లు లేదు...

శా॥ హారావశ్యచలప్రపంచము నితం । బాపత్యకోపత్యకాం
తారామాశ్మగుహాధునీయుతముగా । నాకంపమొందన్ మహో
దారప్రాభవుఁ డాప్రతాపుని మహో । ద్యద్దక్షిణావర్త శం
ఖారావమ్ములు భూనభోంతరము వ్రి । య్యాల్ గాగ మ్రోసెన్ వడిన్.

ఈమాదిరి పద్యాలు సర్వత్రా వున్నాయి. చదువరులు చూచుకోవలసిందేగాని వుదాహరించవలసివస్తే వ్యాసం తెమలదు. సూత్రప్రాయంగా సుమారు పదేళ్లకు పూర్వం యీపుస్తకాన్ని నేను చదివి యిచ్చిన అభిప్రాయం మూడునాల్గు పంక్తులు మాత్రమే - దానికి యీవిమర్శనం భాష్యం వంటిదేకాని అన్యం కాదు...

ప్రస్తుతగ్రంథకర్త తురుష్క-భాషాపదాలు చాలా వాడవలసి వచ్చింది. ఆయా రాజుల నామధేయాలు దేశాలపేళ్లు పట్టణాలపేళ్లు స్త్రీలపేళ్లు సమస్తమూ ఆభాషలోనే వున్నాయి. వాట్లని మార్చడం యెటా! కొన్ని సంస్కృతభాషా సంపర్కం కలిగివున్నా

(తేజసింగు వగైరా) అవిన్నీ అపభ్రంశంగానే వున్నాయి. అట్టిశబ్దాల విషయంలో గ్రంథకర్త బాధ్యుడుకాడని విజ్ఞు లెరిగినదే. యెన్నో లోకోక్తులు సమయోచితంగా రసోచితంగా యీాయన వాడివున్నాడు. అందులో కొన్ని గోదావరీ మండలంవారికి అపరిచితాలు. అట్టిది ఒకటి చూపుతాను. యీా లోకోక్తికి "పాండవబీడు" మా ప్రాంతంలో "అయ్యవార్లగారి నట్టిల్లు" పర్యాయంగా వుంటుందేమో అనుకుంటాను. ఇది వాడినచోటు.

గీ॥ వట్టి పాండవబీడు మే ల్ వాడసీమ!

సందర్భాన్నిబట్టి చూస్తే శుద్ధదరిద్ర ప్రదేశమనియ్యేవే తేల్తూవుంది. యింకా కొన్ని యీాలాటివే వున్నాయి.

స్థాలీపులాకంగా యీా రాజశేఖరకవి కవిత్వాన్ని గూర్చి కొన్నిమాటలు వ్రాశాను. ఈయన దేశభక్తి పరవశుడే. కాని, కులాచారాలయందు పట్టుదల కలవాడు. యీా విషయం కవిత్వంలో సర్వత్రా గోచరిస్తుంది. సంస్కృతభాషలోకూడా మంచిప్రవేశం కనపడుతుంది. తెల్గు, మెట్రిక్యులేషన్ వఱకూ చదివిన పాఠశాలలోనే అభ్యసించి వుండాలి. కీ॥ శే॥ గిడుగు - రామమూర్తిపంతులుగారు వొకటఃక్షణముకూడా వ్యర్థం చేయకుండా జీవితాన్ని భాషకోసం వ్యయించిన నిష్కల్మషహృదయుడు. ఆయీా రాణాచరిత్రం ఆయన చూచివుంటే చాలా సంతోషించేవారు. యెంతేనా వ్రాశేవారుకూడాను. నాకు తెలిసినంతలో విమర్శించాను. యీానాటి ధన్యకవులలో యీాయన చిటికెనవేలిమీాదికి వచ్చేవాడుగాని అల్లా-టప్పా వాడు కాడు.

శ్లో॥ కవిః కరోతి కావ్యాని । లాలయత్యుత్తమో జనః
తరుః ప్రసూతే పుష్పాణి । మరు ద్వహతి సౌరభం॥

---

ఆంధ్రదినపత్రిక - సారస్వతానుబంధము
23–3–41, 30–3–41, 6–4–41 తేదీలలో
ప్రకటితము.

# 'రాణాప్రతాప సింహచరిత్ర'

= శ్రీ విశ్వనాథ సత్యనారాయణ =

నిరాడంబరముగా గ్రంథము వ్రాసి జాతీయమైన వస్తువును గ్రహించి రసవత్తరముగా వ్రాసిన గ్రంథములు కొన్ని యాదరింపఁబడుట లేదు. అందులో "రాణాప్రతాపసింహచరిత్ర" తలమానికమువంటి గ్రంథము. ఈగ్రంథ రచయిత దుర్భాక - రాజశేఖర శతావధానిగారు. ఇది కొంచెము తక్కువగా రెండువేల గ్రంథము.

మనదేశమున భారత-భాగవతములు విమర్శ్యము లగుచున్నవి. భాషచేతఁ గాదు; భావములచేత......మనస్సుతోడివి - పాశ్చాత్యదేశములని, హృదయముతోడివి - ప్రాచ్యదేశములని, పెద్దలు వ్రాసిరి. ఈహృదయమును వదలిపెట్టినచో మనకేకాదు ప్రపంచమునకే ముక్తి లేదు. ఆహృదయ మీ "రాణాప్రతాపచరిత్ర" యందు మహాభారతమునందెంత యున్నదో యంత యున్నది.

"భారతము" దేశభక్తిని పెంపొందించునని రష్యనుదేశస్థులు తమ భాషలోనికి అనువర్తించుకొనుచున్నారట. భారతమున కాశక్తి యున్నచో "రాణాప్రతాపచరిత్ర"కును ఆశక్తి కలదు.

రాణాప్రతాపుఁడు పేరునకు రాజపుత్రుఁడు. ఆంధ్రుఁడు కాడు. ధర్మరాజాంధ్రుఁడా! కృష్ణుఁడాంధ్రుఁడా! రాముఁడాంధ్రుఁడా! శంకరుఁడాంధ్రుఁడా! వారందఱు భారతీయులు. అందుచేత ఆసేతుశీతనగము వారి కథలు పాడిరి. అట్లే ప్రతాపుఁడును.

భారతము పూర్వకాలము కథనే చెప్పును. అందులో నున్న ధర్మముమాత్ర మే మనజాతిది. ఆవిషయము ద్వాపరయుగము నాఁటిది. మన పరిస్థితులతో సంబంధము లేనిది. ప్రతాపసింహచరిత్ర మన ధర్మమునేగాక మన పరిస్థితులనుగూడ చెప్పును. అక్బరుచక్రవర్తితో పతికియేండ్లు హోరాహోరి పోరాడి-స్వదేశము వదలి-కొండలలో గుట్టలలో నివసించి-తిండిలేక-గడ్డిరొట్టెలు తిని-దైవవశమున మఱల స్వాతంత్ర్యము సంపాదించిన మహాపురుషుఁడు రాణాప్రతాపుఁడు. ఆయనకన్న ధర్మరాజాదు లేమియు నెక్కువవారు కారు. వస్తురమ్యతకుఁగాని, కథాచమత్కారమునకుగాని, ఇందలి భిన్నపాత్రల భిన్నతా విశిష్టతకుఁగాని భారతమున కీగ్రంథము తీసిపోదు.

వస్తు-విట్టివంటిది. కవి-యెట్టివంటివాఁడు? వ్యాసునకు తిక్కన్నకు నెంత వీరరసావేశ మున్నదో యంత వీరరసావేశము గలవాఁడు. నేనొకటికి బ్ర॥ శ్రీ॥ చెళ్లపిళ్ల - వెంకటశాస్త్రిగారిని ఎవరో ప్రశ్నించిరట—"భాగవతము పోతన్నగారు వ్రాయనిచో, మఱి

వ్రాయుటకు సమర్థు లెవ" రని. కాసుల - పురుషోత్తమకవియని వారే సమాధానము చెప్పిరట! నన్నెవరైన భారతములోని యుద్ధపంచకము తిక్కన్నగారు వ్రాయకయుండుచో మఱియెవరు వ్రాయఁగలుగుదురని ప్రశ్నించినచో నేను "రాజశేఖర-శతావధానిగా" రని సమాధానము చెప్పెద. ఈగ్రంథములో చివరి నాల్గాశ్వాసములు యుద్ధమే తిక్కన వేఱే లేదు. యుద్ధవర్ణన మెచ్చుట చూచినను, తిక్కన్నగారి రచనతోఁ దులదూగు చున్నది.

ఈగ్రంథము అస్వతంత్రజాతి కొక స్మృతిగ్రంథము వంటిది. రాణాప్రతాపుని భద్రాకిరణప్రతిజ్ఞ చూడుఁడు......ఈఘట్టము ద్వితీయాశ్వాసములో నున్నది. ఈ ఘట్టము చదివినచో పారతంత్ర్యజాతికి ఇది స్మృతిగ్రంథ మన్నమాట కర్థము తెలియును.

రాణాప్రతాపునకును, మహాత్మునకు గల సామ్యము భారతజాతికి గల యస్వతంత్రత. మహాత్మునిది కత్తిలేని సాత్త్వికపుపోరు _ ప్రతాపునిది కత్తిగల సాత్త్వికపుపోరు. ప్రతాపసింహుఁడు అక్బరును జయింపవలెనని యుద్ధము చేయలేదు. పౌరుషశక్తితో గెలువలేనని యాయనకు దెలియును. కాని వట్టి ధర్మముకోసము యుద్ధము చేసెను. భారత జాతీయధర్మము పరులకు లొంగిపోదు - చచ్చిపోదు - అని రుజువుచేయుటకే యుద్ధము చేసెను.

"కాన, విజయంబు ముఖ్యంబు గాదు మనకు
ధర్మ నిర్వహణంబు కర్తవ్య మిపుడు."

ఇది ప్రతాపుని యూహ. ఈఘట్టము చదువవలయును. నేటి సత్యాగ్రహము నకు ఆనాటి ప్రతాపుని యుద్ధధర్మమునకు భేదమే లేదు.

ప్రతాపీయులు - అన్నము తినలేదు - నీరు త్రావలేదు - నిదుర పోలేదు. ఇది బలవంతముచేత గాదు. వ్రతముచేత.

ఈకథకు మనకథకు వేయి పోలికలు. అన్నిటికన్న గొప్ప పోలిక ఆ అబ్దురహిమాన్ - ఈయన అక్బరు చక్రవర్తి సర్వసేనాని. వీరరసారాధకుఁడు - ప్రతాపునకు ప్రత్యర్థిసింహుఁడు వ్రాసిన యుత్తరము కవిత్వమైన యీముసల్మాను సేనాని వ్రాసిపెట్టినది. ఆయన యొకవీరుఁడో యంతకవి. రథధ్వజము - గరుడధ్వజముగా, కృపాణము - నందకముగా, కవచము - పట్టుబట్టగా, హాల్దీఘాటు యుద్ధమున తనకు "ప్రతాప రాజనారాయణుఁడు దర్శన మొసంగె" నట. అతఁ డక్బరుతో ననుచున్నాఁడు. ఆప్రతాపుడు—

మ॥ "అకటా! నీవలె ధర్మముల్ దెలిసి రాజ్యం బేలఁగాలేఁడో! మ
చ్చికమై భూప్రజఁ బుత్త్రులట్ బలెఁ గృపాశ్రీఁ జూడఁగాలేఁడో! పా
యక వర్ణాశ్రమ ధర్మపద్ధతి తిరంబై నిల్పఁగాలేఁడో! యెం
దుకు నాతండు స్వతంత్రుఁడై నిలువఁగారాదో! యానతీఁగోరెదన్.,"

ఈ మహానుభావుఁడు చెప్పిన యీయర్థములో బూర్వ భారతదేశమందుఁ గల భిన్న రాజ్యముల ధర్మ మిమిడియున్నది. షట్చక్రవర్తులు - షోడశ మహారాజులు చక్రవర్తులుగాని, రాజులుగాని యగుట రాజ్యమును విస్తరింపఁజేసి యేలిన దేశవిస్తీర్ణతబట్టి కాలేదు. వారు పాలించిన ధర్మముయొక్క యాత్కృష్ట్యమును బట్టి యయినారు. నల మహారాజు ఒక్క నిషధదేశమునకే రాజు. కాని షట్చక్రవర్తులలో నొకఁడు... ఈ రహిమానుఁడు మఱియు ననెను. ఆ ప్రతాపునకు తాము సమకాలికు లగుటయే గొప్పతన మట. ఇట్టి రహిమానులు నేఁటి పాశ్చాత్యులలో నెంతమంది లేరు? ఆపాశ్చాత్యులలో నక్బరు చక్రవర్తులే లేరు. అక్బరు చక్రవర్తి ప్రతాపుని గురించి యిట్లనెను :—

"ఆ మహానాయకవతంస । మా ప్రతాపుఁ
డెన్నిగతుల యోజించిన । నన్నుఁబోలు
కోటి సార్వభౌములు చేరి । కొలువఁదగిన
క్షాత్రనిధి యనుమాట వ । జ్రాలమూట".
"నాదు జీవితశేష మం । తయుఁ ప్రతాపు
సేవఁ గడిపినఁగాని దు । ష్కీర్తి పోదు."
"మన బ్రతుకులు పోరులనె తెల్ల । వారిన వకటా!"
ఇది యక్బరుయొక్క సౌశీల్యము. .... ...

ఈకవి యఖండమైన క్రొత్తపలుకుబడులు గలవాఁడు.
"ఇతడు బాడబానలము పారమిగ్రింగు మ । హాబలుండు"
"పిడుగుల్ వేర్లిళ్ల నఱకు భయదశౌర్యులు"
"మొదలగ నెత్తురు పంచుకొం చనుజుఁడై । పుట్టోండె"
"ఒకకాడగ జనియించు రెండుపువ్వుల । ట్లొప్పారి"
"దురదృష్టం బది యెల్ల నాపయిని గం । తుల్ పెట్టె"
"అక్బరు విజయరథము కాడిమోసిరి స్వాతంత్ర్య । ఘనత మఱచి"
"పుడిసెం డూపిరి మేన నుండువఱకుగ । బోరాడి"
"మాటలను గట్టె యాయువు । బుట్టకెత్తి
శాశ్వతబ్రహ్మకల్ప మీ । జగతి నుందుమో!"

ఈ మొదలైన వనేకములు - ఇంక సందర్భానుసారముగ లోకోక్తులు మొదలైనవి కుప్పతెప్పలుగానుండి గ్రంథము ఆంధ్రసరస్వతీదేవికి క్రొత్తభూషణముగా నున్నది.

ఈకవి రాజపుత్రయోధుల శౌర్యాదుల నెంత వర్ణించునో ముసల్మానుల శౌర్యాదుల నంతే వర్ణించును. హుమాయూనుని వర్ణించుటయు, బేబరుపడ్డ కష్టములు వ్రాయుటయు నొక ముసల్మానకవి యెంత యభిమానముతో వ్రాయునో యీయనయు నట్లే

వ్రాసెను. ఈ రచన భారతమును దలపించుచున్నది. ఉదయసింహునకు 25 మంది కొడుకులు - రెండవవాడు సూర్యుఁడు - మూఁడవవాడు సాగరుఁడు - పెద్దవాడు ప్రతాపసింహుఁడు... జగమల్లుడు మఱియొకఁడు. ఇతఁడు శౌర్యహీనుఁడు. అతనికి రాజ్యమీయవలయునని రాజు తన సరదారులతో చెప్పిపోయెను.

మ॥ "కమలాప్తాన్వయమా! భవత్కృత మహా । ఘంబేమొ! రాముండు పూ
ర్వము కొన్నేడులు మానియుండవలసెన్ । బట్టాభిషేకంబు! చం
డమహీనాథుఁడు లేకయే చనియె! నీ । నాఁడీప్రతాపుండు స
ర్వము గోల్పోయెను! దుర్బలుల్ జనకు లా । రా! యెంతకున్ గర్తలో!"

అని బంధుజనులు విషాదమొందిరి. సలుంబ్రాకృష్ణుఁడు అచ్చటి తీర్పరి. రాజుతో 'సరే' యనెను. కాని చివరకు ప్రతాపునే రాణా చేసెను. జగమల్లుఁ డభ్యంతరపెట్టెను. ఈకవి చాలచోట్ల నన్నయగారిని పోలినట్లు వ్రాయును. రాజసూయమున సహదేవుఁడన్న మాటలకు, ఇచ్చటి సలుంబ్రాకృష్ణుని మాటలకు పోలిక చూడుడు.

"రాణాలన్ బొనరింతు బాధ్యత సలుం । బ్రావారిదన్ మాట యీ
క్షోణిన్ గల్గిన వారెఱుంగుదురు! ఇ । చ్చో నేఁబ్రతాపున్ మహా
రాణాగా నొనరింతుఁ! గూడదను ధీ । రగ్రామణుల్ గల్గినన్
బాణిన్ బైకెగనెత్తుఁ! డిప్పుడె యెదు । ర్పన్ వత్తు నత్యుద్ధతిన్."

జగమల్లుని త్రోసిరాజని కృష్ణుఁడు ప్రతాపునే సింహాసన మెక్కించెను.

"పరిఫుల్ల రుచిర సరసిజ పరంపరలు నెరపినటు స । భాభవనం బ
ప్పురజనముల నెమ్మోములఁ బరమామోదమున నపుడు । భాసిలుచుండెన్."

ఇది మఱల నన్నయ్యగారి రచన. ఈ పట్టాభిషేకోత్సవ మంతయు ప్రబంధసరణి నడచెను.

రెండవ కొడుకైన సూర్యుఁడు సలుంబ్రాకృష్ణునివద్ద పెంపఁబడెను. రాణా అతనిని తనవద్దకు పంపు మనెను. శ్రీకృష్ణుఁడు పంపెను. అతని భావము.

"నా స్వామిస్నేహముఁ బ్రోలఁ దుచ్ఛములు స । ప్తద్వీప సామ్రాజ్యముల్."

వసంతకాలము వచ్చెను. ఎల్లరాజులు ప్రతాపునకు కానుకలు పంపిరి. మఱల నన్నయ్యగారివలె వ్రాయుచున్నాఁడు.

మ॥ "తలపైనన్ మగణా తురాయి వెలుగొం । దన్, ధాళధళ్యంబు రం
జిలు ఖడ్గంబులు వ్రేల, దొడ్డనునుతే । జీ లెక్క యోధాళి చెం
తల సేతేరఁ, బ్రతాపుసింహు గొలువన్ । నానామహీమండలేం
ద్రులు వేంచేసి రుగాదికానుకలు దొం । తుల్ దొంతరల్ తెచ్చుచున్."

అప్పుడందఱు వేటకుఁ బోయిరి. ఈవేటకుఁ బోవునపుడు రాజపురోహితుఁడైన హారభట్టుగూడ వెళ్లెను. ఈపురోహితులు గూడ వీరులే. రాజులకు ప్రాణములు ధార వోసినవారు. ఐహికాముష్మికములకు చేయూత యైనవారు...

వేటయైన తరువాత కూర్చుండి మాటలాడుకొనుచుండఁగా నొక వరాహము వారి నడిమికి వచ్చెను. దానిని అన్నదమ్ము లిద్దఱు - సూక్తుఁడును - ప్రతాపుఁడును తమ బాణములతో గొట్టిరి. నేను చంపితి నన నేను చంపితి నని తగవు లాడిరి. సూక్తుఁడు ప్రభువుతో - నన్న గారితో వివాదము పెంచెను. సలుంబ్రాకృష్ణుని గూడ లెక్క సేయలేదు- హారభట్టు సూక్తునకు నీతి నుపదేశించెను. ఆపురోహితునితో సూక్తుఁ డిట్లు పొగరుబోతు తనము ప్రకటించెను.

"తనదా శక్తికి మీఱు కార్యములకుఁ ♦ దార్కొన్నచో ముప్పు వ
చ్చును! మాయిర్వురలోన నొక్కఁడు రణ ♦ క్షోణిఁ మృతిఁ గన్న మీ
రును రావచ్చును! నేడ్వ వచ్చు! మఱి పౌ ♦ రోహిత్యముఁ జేయవ
చ్చును! లబ్ధిఁ గొనవచ్చు! నిప్డు చనవ ♦ చ్చుఁ దాఁటి దూరంబుగన్."

అంత హారభట్టు వారి యుద్ధ మాపలేక వారి నడుమ తాను కత్తిపెట్టుకొని పొడుచుకొని చచ్చెను.

"నాటి కష్టదశ దీ ♦ ర్పఁ బూని యాత్మార్పణం
బు నొనర్చెఁ హారభట్టు త్యాగనిధియై ♦ ముల్లోకముల్ మెచ్చఁగన్."

అంత యుద్ధము సమసిపోయెను. "గురురుధిరంబు దాటగను కూడదు" అని ప్రతాపుఁడు యుద్ధమును మానివేసెను. సూక్తుఁడు దేశమును వదలి పోయెను. ఎచ్చటికి బోయెను?

"తా సరిగెను ఢిల్లితో ప్రివకు! కులాం ♦ తకు లందఱు పోవు తావునకున్."

ఇచ్చటినుండి ప్రతాపుని శౌర్యాగ్ని రాజి, మండి, యక్బరగ్రిషు, పాతికయేండ్లు తగులబెట్టిన ఘట్టము. ఆశౌర్యము, ఆయుద్ధములు, ఆప్రతిజ్ఞలు అవియన్నియు వ్రాసినచో పట్టరానంత గ్రంథ మగును. ఈకవిసార్వభౌముడు ఈఘట్టము చిత్రచిత్రములుగా వ్రాసెను. మొదటనే చెప్పితినిగదా "ఈగ్రంథము యుద్ధపంచకమువలె నున్న" దని. ప్రతాపుఁడు దేశమంతయు బీడుపెట్టించి తన్ను సేవించు నందరిని వెంటఁదీసికొని కుంభల్మీయరు దుర్గము లో గూర్చుండెను. సలుంబ్రాకృష్ణుఁడు - భానుసింహుఁడు - మనసింహుఁడు - శ్యామసింహుఁడు - తేజసింహుఁడు - రామచంద్రదేవుఁడు - భిల్లనాయకుఁడైన భీమచాందుఁడు వీరందఱు తమతమ రాజభక్తులను దెల్పిరి. వారి రాజభక్తి - తెలుపుటలను చదివియే చూడవలయును. ఈ బైరాగియైన ప్రతాపునకు - ఆ మహారాజైన అక్బరునకు విరోధము. భోగసన్న్యాసమున - ప్రతాపుఁడు, రాజ్యతృష్ణచేత - అక్బరు. తనచేతిలో చిక్కిన

మొగలు సైన్యమును ప్రతాపు డెన్ని సారులో వదలిపెట్టెను. ప్రతాపుని యీ కట్టు-దిట్టములు చూచి అక్బరు భయపడెను. ప్రతాపుని గెలువలేనని కాదు; ప్రతాపుని మీదికి పోయినచో తనకండగానున్న రాజపుత్రసేనానులకు కోపమువచ్చునని. అతఁడు దీర్ఘదర్శి- అప్పటి కప్పుడు భేదముపన్నుట కాకపోయినను భేదము పుట్టుటకు ఒక పన్నాగము పన్నెను. - - -

"ననుఁగడుఁ బేర్మిమైఁగనుచు । నాప్రభుభర్త మదిమెచ్చి కన్య ని
చ్చిన మీమువంటివారి వెలి । చేసి ప్రతాపన్నృపుండు పంక్తి భో
జనమున కైన నించుకయు । సైపక తేలికచేసి చూచె! మీ
ఘనతకు హాని వచ్చినను । గల్గవె నాకు విషాదవేదనల్!''

ప్రతాపుఁడీ కులము చెడినవారితో భోజనము చేయఁడు. కులముచెడుట తప్పని ప్రతాపుని యుద్దేశము. ఒక జాతియొక్క జాతీయతలో వర్ణభేద మంతర్ఘాతమని వారి యుద్ధేశము. - - - తరువాత అక్బ రిట్లనుచున్నాఁడు.

"మఱి నాయొద్దను జేరు భూమిపతులన్ । మర్యాదతోఁ జూడనో!
ధరణీభాగము లీయనో! పిలిచి బాం । ధవ్యంబు చేకూర్పనో!
చిరమైత్రిన్ విహరింపనో! నృపులు నన్ । సేవించి చేదేమి మే
సిరి! తానింతటి మార్ఖ్య మేమిటికిఁ దా । ల్చెన్ జెప్పఁగాఁ జాలుదే!

ఇంత రాజనీతి అక్బరు ప్రకటించెను. ఇట్టి రచన సామాన్య కవి చేయునదికాదు. ఇది తిక్కనాదులు చేయఁదగ్గది. మానసింహుఁడు ప్రతాపుని యొద్దకుఁబోయి అక్బరును గురించి యెంతయో పొగడెను. మానసింహుని వంశమునకు ప్రతాపుని వంశీయులు గురువులు. ప్రతాపుఁడు మానసింహుని పొగడిక విని అక్బరు రాజనీతిని మానసింహునికి వివరించి చెప్పెను.

"నిగూఢ మాతని మనోవ్యాపార లీలాగతుల్."

"అల్లుఁడై-బావయై-మామ । యైన తన్ను
వెలితి గనసికె శ్రీమహా । విష్ణువట్లు
భారతీయులు కొలుతురన్ । భావ మెఱిఁగి
అక్బ రిటుచేసె! హేతు వ । న్యంబు గలదె!"

అని చెప్పెను. అంత చల్లఁగాఁ బాలించు నక్బరు రాజ్యములో ఘూర్జరదేశమున [illegible]. అక్బరొకవంక దిగ్విజయమును చేయుచున్నాడు. ధనేశ్వరమ్మున సన్యాసులలో సన్యాసులకుఁ బోట్లాటపెట్టి తానొక పక్షము చేరి వారందఱిని నాశనము చేసి [illegible]. [illegible] ప్రతాపునియొక్క ధర్మమున నేమో: నిజమైన రాజెట్లుండవలయునో, ఆప్రతాపుఁ డెట్లు [illegible] రాజో, ఈఘట్టమంతయు చదివినచోఁ దెలియును. ప్రతాపుఁడు [illegible] భోగవిముఖుఁడైన రాజు. భోగాభిముఖుఁడైన రాజువలన లోకములోఁ గొంత [illegible] లేకుండఁ బోవును.

"ఆకాపట్యము లాదరస్మితము లా । యౌదార్య మావిద్య్యా మా
మోకాల్ మ్రొక్కులు నాచమూవిభవ మా । ముప్ప్రిద్ధు సేవించుటల్
నాకెత్తుక్ దలనొప్పి పట్టణము ల । న్నక్! మీకు నెట్లుండునో!
నాకీ కొండలువోలె సౌఖ్యమిదు శాం । తస్థానముల్ లేవుపో!

ఇది ప్రతాపమూ_క్తి అనిన, మానసింహుఁడు
ఈ యే రిటు పాఱఁజొచ్చె! నెదు । రీద నెవండు సమర్థుఁడో! వృథా
పౌరుష మున్నదంచు బడ । బాజ్వలనంబును బాఱమ్రింగెదే!"

అన, ప్రతాపుఁడు ఒక చిన్నకథ ( Parable ) చెప్పెను. ప్రతాపుఁడు గాంధి వంటివాఁడు- యేసుక్రీస్తు వంటివాఁడు-మహర్షుల వంటివాఁడు-చివర కిట్లనెను. "నారాజ్య మరణ్యము-మేము సన్యాసులము-మీయక్బరునకు మమ్ము గెలువవలెనని పట్టుదలయేమి

"అప్రతిహతముగా । నక్బరొకఁడె యేల క్షితిని దేవుఁడు సృష్టి । చేయలేదు. ప్రజలతనిచేఁ జంపఁబడుటకుఁ బుట్టలేదు- రాజకన్యక లతని భోగపరత నుద్దేశింపఁ బడ లేదు-అతని రాజ్యతృష్ణముంను సర్వజగత్తు "పారతంత్ర్యమున మునుఁగుచెల్ల పాడిగా దనుచు నక్బరెంత యెఱిఁగిన జగమున కంతమేలు"

చివరకు భోజనవేళ మానసింహునకుఁ గోపమువచ్చెను-నిష్ఠురోక్తు లాడెను. మిమ్ము నాశనము చేసెదనని చెప్పి లేచిపోయెను.

ఇట్లు వ్రాసిన నూరకే పెరిగిపోవును. ప్రతాపుఁడు పౌరుషమునకు ధర్మమునకు రెండవ యర్జునుఁడు-కురుబలమును చూచి యర్జునుఁడు పొందిన విషాదయోగమువంటిది ప్రతాపుఁడును పొందెను. మొగలుసైన్యము సగానికి సగము రాజపుత్రులు- అందుకనే యే ప్రతాపునకు

ఇది యవనసేనతోఁ జేయు । కదనమో స్వ
జనముతోఁ జేయు కదనమో । శంక గలిగె"

ఈశంక ఆనాటినుండి యీనాటివరకు అట్లేయున్నది ఈయుద్ధములో ప్రతాపుని సైన్యములు చెదరిపోయినవి. ప్రతాపుని తమ్ముడు సూక్తుఁడు ప్రతాపుఁడు అవతార పురుషుడని గ్రహించెను- మఱల నన్నగారివైపే చేరెను.

చివరకు తనబిడ్డ మోలుగడ్డితో జేసిన రొట్టె తినుచుండగా నడవిపిల్లి వచ్చి యతనిని గీరి రొట్టెనెత్తుకొని పోయెను. ప్రతాపుఁడు చక్రవర్తి నాఱు నెలలు గడు వడిగెను. ఉత్తరమిచ్చి భిల్లుని పంపించెను. ఆయుత్తరమును చూచి యక్బరు పొందిన సంతోషమునకు మితిలేదు. అక్బరు సభలో పృథ్వీసింహుఁడు ఆయుత్తరము ప్రతాపుఁడు వ్రాయ నేలేదనెను. వారును వీరును వివాదపడిరి. ఆయుత్తరము తెచ్చిన భిల్లునితో పృథ్వీసింహుఁడును అతని భార్యయు నిట్లనిరి.

"చెప్పుము చిత్తమిచ్చి యిదె ♦ శ్రీనృపలోక జగద్గురుండు మా
యప్ప ప్రతాపదేవుని ము ♦ ఖాంబురుహంబున జంద్రబింబ మం
దొప్పెడి వెన్నెల ట్లలరు ♦ నుత్తమమౌ దరహాసరేఖ తా
నెప్పటియట్ల పాయక ర ♦ హించుచు నున్నదె భిల్లశేఖరా!

ఈపద్యము భాగవత పద్యమువలె నున్నది. కృష్ణుడు సుఖముగానుండెనా యని ధర్మరాజు అర్జును నడిగిన ఘట్టములోని పద్యమువలె నున్నది.

శ్రీ నృపలోక జగద్గురుండు మాయప్ప ప్రతాపదేవుఁడు"

ఇందు రసధ్వని వేయిమూర్తుల రూపు గట్టుచున్నది. హృదయమునుండి వచ్చిన ప యనఁగా నిది. వట్టి యక్షరములుగా మాటలుగా గనిపించునుగాని ప్రతాపుఁడుగా త్రి గట్టిన పృథ్వీసింహుని స్వాతంత్ర్యాభిలాష యంతయు ధర్మ వీర రసమంతయు గాటలలో నున్నది. ఇట్టి రచన మహాకవులే చేయగలరు.

అబ్దూరహిమాన్ వ్రాసిన యుత్తరము అతడు పృథ్వీసింహునితో జేసిన సంభా—ఆయుత్తరమును చదివి తీరవలయును — అందులో కొన్ని భాగములు

"భరత ఖండంబు నుద్ధరిం ✐ పఁగ జనించు
ధూర్జటివి నీవు! రాజమా ✐ త్రుఁడవుగావు!"

భారత మహాఖండంబు దాస్యాంధకా
రనిమగ్నంబయియుండ! లోకముల దౌ ✐ ర్భాగ్యమ్ముల్గుల దీఱ నేఁ
డని హర్షింపఁ బ్రతాపభానుఁ డుదయం ‡ బైయుండె"

"తనదునేర్చడి సంత హైం ‡ దవ మహత్త్వ
మక్బ రంతియుఁ గొను దొడ్డ ‡ యడితికాఁడు!"

"స్త్రీలఁ బురుషుల రాజ్యంబు ‡ దేశమెల్ల
విలుచు నీయక్బరను గొప్ప ‡ విలువకాఁడు.

ప్రతాపుఁ డిట్టివాఁడు——ఇంక అక్బరు ఇట్టివాఁడు.

"ఈవు విశ్వప్రపంచమం * దీశ్వరుని య
నంత లీలాగతులు గొని * యాడె దెపుడు!"

"విలువఁ గట్టుచు రాజ్యంబుఁ ✐ గొలుచు నక్బ!
రెవరి గొప్పతనం బెంతొ * యెఱుఁగు జగము."

ప్రతాపుఁడు మొఘలు యుద్ధమును ప్రారంభించెను. కొండలలో దాగి పొంచుచు మును చీల్చుచు కలనును మిటుకొటనముచేయుచు తుప్పటిలో చాటగుచు నిట్టియుద్ధ చేసెను. (Guerilla warfare) అయినను గెలువలేక పోయెను. ప్రతాపుని దాడి మున కంతు లేకపోయెను. అక్బరు సర్వసంపదను కైవసముచేసి కొనఁగా,

తఱితో నక్బరు సార్వభౌముఁడు నితాం ♦ త ప్రాభవోపేతుఁడై
ధరణీచక్రము నేలువేళను దరి ♦ ద్రత్వంబు దిక్కేఁడి యు
ర్వరఁ దానుండఁగఁ జోటుగానక మహా ♦ రాణాప్రతాపావనీ
శ్వరు సంసారము నాశ్రయించినది! యీ ♦ పాపంబు నేమందునో"
"అతిభీమంబుగఁ బెల్లురేఁగి నిబిడం ♦ బై మూగి యీసర్వ భా
రత దేశంబును ముంచివైచిన మహా ♦ గ్రింబైన దాస్యాంధకా
రతతిఁ దేవుని దృష్టిగూడ నణుమా ♦ త్రింబుఁ జొరఁ బోని దు
స్థితి సంధించెడు పాపికాల మరుదెం ♦ చేఁ జూచి యెట్లోర్తునో!"

చివరకు ప్రతాపుఁడు దేశమే వదలిపెట్టి పోఁదలఁచెను- భామాసాహి వచ్చెను-ధన మిచ్చెను-ప్రతాపుఁడు మఱల సైన్యములు సమకూర్చెను-మఱల తన రాజ్య మంతయు గెలుచుకొనెను.

అంతయు నైనది...కాని, ఓయి ప్రతాపా! క్షీనృపలోక సద్గురూ! మాయప్పా!

సీ॥ అక్బరు విశ్వంభ ♦ రాధీశ మాళిది ధనసేవ! నీయది ♦ దైవసేవ!
యాతని దెల్లప్పు ♦ డాత్మవైభవము! నీయది నిరంతరము నా ♦ త్మావబోధ!
మతని కుండినదెల్ల ♦ నైహిక బలము! ని న్నాశ్రయించినదెల్ల ♦ నాత్మబలము!
నతని దండఱ కన్ను ♦ లలరించు భోగంబు! నీది జగముమెచ్చు ♦ నిండుత్యాగ!

మతఁడు జగము గెలిచె! ♦ నాత్మ గెల్చితివి నీ!
వాతఁ డితర జనుల ♦ నాశ్రయించు!
నీవు స్వాశ్రయుఁడవు! ♦ నీకు నాతని కెన
లేదు జగము క్రిందు ♦ మీదులైన.

ఇంక నొకమాట. ఈ రసప్రవాహములో ప్రవాహము వెంటనే పోయి విమర్శించితిని. వేరొకగతి లేదు. కాని ప్రవాహము నడుమను, తీరము వెంటను, వంగుళ్ళవంగుళ్ళమును, గల తామరపూలు, కలువపూలు, నీటి బెగ్గురులు మొదలైన శోభలు పాఠకులే చూచుకొనుచు చదువుకొనవలయును. ఇది పరమోత్తమ గ్రంథములలో నొకటి.

---

భారతి.
(నవంబరు 1943)

# అభినందనము.

మ॥ విమలాత్ముల్ వనపర్తి పండితకవుల్ । విజ్ఞుల్ కరం బుత్తమో
త్తమ కావ్యంబగు నీప్రతాప సుచరి । త్రంబున్ బఠింపించి హ
ర్షము పొంగన్ "కవిసార్వభౌమ" పదమున్ । సద్భక్తి నీకిచ్చుచున్
దమకీర్తిన్ వెలుగొందఁజేసిరి దిగం । తప్రాంత విశ్రాంతమై.

మ॥ అలఁతిన్ బోని స్వతంత్రతాగరిమమున్ । త్యాగంబు ధర్మంబు ను
జ్జ్వలమౌ వర్తన మెంతకాలమొ యను । స్థానంబుఁ గావించి త
త్ఫలపాకంబున వ్రాసినాఁడవు ప్రతా । పన్మాపు కావ్యంబు! న
ట్టులె కాకుండినఁ దన్మయత్వ మది యె । ట్లుఁగల్గుఁ గొండంతఁగన్.

సీ॥ ముని పురాణకవిత్వ । మునకు మార్గము చూపెఁ బ్రథముఁడై నన్నయ । భట్టమౌళి!
యిరువదవ శతాబ్ది । మిరవొంద నీవు దేశచరిత్ర శోధించి । సమధిక భువ
నోన్నతశౌర్య ధీ । రోదాత్త నాయకోత్తమ సార్వభౌము ప్ర । తాపసింహ
రాణా చరిత్రమే । ర్పఱచి చారిత్రక ప్రథమకావ్యము వ్రాసి । వాసిఁగంటి!

గీ॥ వీవె చారిత్రక కవుల । కెల్ల మూల
పురుషుఁడవు! మార్గదర్శివి! । బుధవరేణ్యు
లరసి "కవిసార్వభౌమ" స । ద్బిరుద మిడిరి!
నీ సుకృత విశేషంబు వ । ర్ణింపఁ దరమె!

మ॥ తెనుఁగున్ దల్లి శిరఃకిరీట మని కీ । ర్తిన్ గన్న యాభారతం
బున నందందును గొన్నితావుల రసం । బున్ దక్కువైయుండ వ
చ్చును! బందొమ్మిది నూర్లు పద్యములు మ । చ్చున్ జల్లి యేకైక ధా
టిని సాగించితి! ప్రాత-క్రొత్త కవికో । టిన్ సాటి లేకుండఁగన్

సీ॥ పదియునెన్మిదినాళ్ళు । పట్టువీడక కొనసాగె భారత మహా । సంగరంబు!
దానికన్న నొకింత । తడవుగాఁ జెలరేగె రామరావణుల దు । ర్వారరణము!
నాలుగేండ్లార్నెలల్ । నడచె నప్రతిహత మగుచు నైరోప మ । హాహవంబు!
నేడేండ్ల పొడవున । నీజగం బగలించె నమెరికా స్వాతంత్ర్య । సమరధాటి!

గీ॥ యిర్వదైదేండ్లెసఁగెఁ బ్రతా । పేంద్రు రణము!
తిక్క నాదులకును దల । తిక్క యెత్తు
నంత యుద్ధంబు లిటుల వ్రా । యఁగఁ గలిగితో!
వరద కవితాభిరామ! కూ । సార్వభౌమ!

చ॥ తెలుగని దేశభక్తియును ♦ త్యాగము సత్యము ధర్మనిష్ఠయుఁ
గరుడుగఁ గట్టి వ్రాసితి జ ♦ గన్నుత కావ్యము! పక్షపాతపుం
దెరఁ దొలగించి చూచినను ♦ దిక్కనకుఁ "సరిచేయి" రాజశే
ఖర కవిసార్వభౌముఁ డనఁ ♦ గాఁదగు నం చొకయూహ దోఁచెడుఁ.

సీ॥ కవిరాజశేఖరు ♦ కవితానిరూఢి రాయలసీమ కీర్తి ది ♦ గ్వ్యాప్త మయ్యె!
సత్యవ్రాత్తమహా శ ♦ తావధానివలన నాంధ్రదేశము వాసి ♦ నందఁగలిగె!
కలిత-చారిత్రక ♦ కవి పితామహుచేతఁ గవిత నూతనకాంతిఁ ♦ గాంచె నేఁడు
అలసార్వభౌముచే ♦ నస్మదాదులు గురు లతులితానందంబు ♦ నంది రిపుడు!

గీ॥ సూర్యవంశ మహాకవి ♦ సోము వలన
సూర్యదేవతాకంబయి ♦ సొబగు గులుకు
ప్రాగ్వటూర్వరి చిరయశః ♦ పూర్తిఁగాంచి
నగరములలోన నున్నతో ♦ న్నతి వహించె!

మ॥ మనసుఁ లోపలఁదిప్పి తన్మయత ముం ♦ పఁ బోకి స్వాతంత్ర్య ధ
ర్మనిరూఢస్థితి నారితేరిన మహా ♦ బ్రహ్మర్షి మూర్ధన్య! నీ
కును బ్రహ్మాయు వెసంగుఁగాక కృతియుఁ ♦ క్షోణిఁ వెలుంగొందుఁ గా
కనపాయ స్థిరకీర్తి శోభితమునై ♦ యాచంద్ర తారార్కముఁ.

ఇట్లు

శ్రీ. శ్రీ. శ్రీ. కళాప్రపూర్ణ-కావ్యస్మృతితీర్థ-అభినవవ్యా
ఆంధ్రవాల్మీకి. జనమంచి-శేషాద్రిశర్మ,
అభినందన-సభాధ్యక్షుడు.

My dear Rajasekhara!

I must have already told you that I am an admirer of your bo If I have not done so, it is an unconscious and unintended omissi You are one of those few poets who have been able to treat an epis taken from real History and present it to the world as excell literature of which the Telugu language has every reason to be pro Your Rana Pratap Singh Charitra is one of the most memorable modern productions. I congratulate you on your closeness to fa and a style that never flags.

With best regards,
Yours sincerely,
C. R. REDDI.

(28—1—33)